సంపుటము ౧ సంచిక ౩

# ఆంధ్రిక

సచిత్ర మాసపత్రిక

శ్రీ భావ సం॥ నిజ వైశాఖమాసము

మే 1934.



ఆనంద ముద్రణాలయము,

మద్రాసు.

౧౯౩౪



# విషయసూచిక

—:o:—

పుట.

——:o:——

# పటముల పట్టిక

పుట.



మహాకవి కాళిదాసు

ఎల్. కృష్ణదాసుగారు, బి. ఏ. బి. ఎల్; చిత్రకారుడు.

[ఓరియంటల్ రిసర్చిసంచికాధిపతుల అనుమతిని]




# గాలిపటము



శృంగారకవి - సర్వారాయఁడుగారు,

గీతమాలిక

గీ. జీవుఁడను బాలకుఁడు కేళిసేయఁగోరి కాయమను గాలిపటమును గర్మమన్న

సూత్రమున గట్టుగాఁగట్టు ధాత్రియనెడి యాకసంబున కెగురవేయంగ సాఁగె.

క్రిందుమీఁదునుగన కది చిందులాడి చిత్రగతులను జెలరేఁగి చెలువుఁజూపి

ముఱియు మురిపించుఁ బ్రజకు సమ్మదమొనర్చు చెవుల కింపగునట్టులు రవళిసేయు

తగులునది తప్పునది గాన కెగురుఁ దానయొక్కయెడఁ జిక్కుకొను, తానె చక్కఁబడును

గాలి పోయిన యంతనే కూలిపోవు కొలఁది కాలమె గద దీని కులుకు తలఁప !

# శ్రీ వేంకటేశ్వరస్తుతిః

(శ్రీ దో. వేం. గు. గారి, శ్రీ గౌతమక్షేత్ర మహాత్మ్యమునుండి.)

శ్రీవేంకటేశ మజదేవేశసంయమిస మావేశవంద్యవిభవం
దేవాపగాజనన భావంగమాద్భుతశు భావిష్టదివ్య చరణం
భావాతిఘోరభయ దావేలపాపచయ దావాగ్నిరూపకలితం
సేవేఽహ మాశ్రితమ హావైశ సాంతక మహావైదుషీప్రకలితం.

శ్రీభూనీళానాథం, సర్వాతిగసత్కృపాగుణసనాథం
తం శ్రీవేంకటనాథం, వందే నిర్ధూతదుర్వృజినయూథం.

వరదాభయారిదరకర, మరివర్గవిదూర మబ్ధిగంభీరం
శ్రీకౌస్తుభవక్షస్కం, వందే శ్రీవేంకటాచలేశం తమ్.

ఊర్ధ్వాధోలోకవిభాగా, ఽఽ శంకనమబ్జనాభికలితం యః
స్మధ్యం జితహరిమధ్యం, తం శ్రీఫణిశైలమందిరం వందే.

శ్రీ శ్రీవత్స సుధాజల, నిధిమణ్యాభరణ వైజయంతీవనమా
లోదంచదురస్కం తం, ప్రణతోఽహం ఫణి గిరీశ్వరనిశాంతమ్.

కనకోత్తరీయభూషిత! సనకాదికమునిసదానతాంఘ్రియుగ!
మణికుండల కిరణజల్పిత గండస్థల ! తే నమోఽహిగిరినిలయ. ! !

శ్రీదందశూకభూదర, మందిరవందన మనోహరస్తోత్రం
చైతద్భక్త్యా, స్మృతవాఽ శ్రుతవాఽ వా పఠితవాఽ వా లభేదిష్టం.




శ్లో॥ శ్రీమద్దేవేంద్రాదిమ, హామర కోటీరకోటి మణికోటి
భ్రాజత్పాదాంభోజం,వందే శ్రీ వేంకటేశ మఘనాశమ్॥

(దో. వేం.)

# ఛాయాపురుషలక్షణము

మండపాక-రామశాస్త్రిగారు,

క. గిరిజకు శివుండు ఛాయా, పురుషునిలక్షణముఁ దెల్పె ♦ భూతలమున శం
కరగీతలఁ దద్వివరము, నెఱిఁగింపగ దానినేను ♦ నెఱిఁగింతు నిటన్.

క. నరుఁడు నభంబున ఛాయా, పురుషుఁగనన్ సప్తగోత్రకముల యం దేకో
త్తర శతతరముల వారిన్, దరియింపంజేయుఁ-బర్వతప్రియపుత్రీ !!

సీ. ధరపైని బర్వేడు ♦ తననీడఁదప్పక, పరికించి తత్కంఠ ♦ భాగమందు
కుదురుగాఁ దనదృష్టి ♦ చెదరకుండెడుభంగి, నిల్పి బ్రహ్మధ్యాన ♦ నిష్ఠుఁడగుచు
కనురెప్పవేయక ♦ కనికని పిమ్మట, నిర్మలాకాశంబు ♦ నియతిఁజూడ
శరదంబుదచ్ఛాయ ♦ బరగునాత్మచ్ఛాయ, కరచరణాద్యంగ ♦ కములతోడ

గీ. కానబడునందు ; నెవ్వారు గాంతురట్టి, పురుషరూపంబు. వారలు ♦ బొందుపుణ్య
ఫలము వినుపింతు వినుమని ♦ భార్యమైన, యార్యతో శర్వుఁడీగతి ♦ నానతిచ్చె.

సీ. బ్రహ్మవిజ్ఞానంబు ♦ బడసినపుణ్యంబు, శ్రీకృష్ణునర్చించి ♦ చెందుఫలము
గయలోన శ్రాద్ధంబు ♦ గావించుపుణ్యంబు, కాశిలోమరణంబు ♦ గాంచుఫలము
ముండనంబు ప్రయాగ ♦ మునబొందు సుకృతంబు, కేదారజలపాన ♦ వేదపార
ములనుగల్గెడు ఫలకమ్ములు కోటిగుణితముల్, కాయంబు మింటను ♦ గాంచిరేని

గీ. పొందుదురు నరు; లిందుకు ♦ సందియంబు,డెందమునఁ జెందవలువదో ♦ యిందువదన!
కలుఁగు ధర్మార్థకామ మోక్షములు దీని,వలన నన్యులకిదిజెప్ప ♦ వలువ దబల !!

క. జీవితకాలముఁ దెలియం,గావచ్చున్ దీనిచేఁ ద్రికాలజ్ఞుఁ డగున్
గావున ఛాయాపురుషునిఁ,దా వీక్షింపగవలయు ♦ తద్జ్ఞుఁడు నియతిన్.

క. నరుఁ డారునెలలు ఛాయా,పురుషుం బ్రతిదినమునందుఁ ♦ బొడగాంచిన దు
ష్కర కార్యంబెయ్యదియున్, ధరణిం గలుగదని మతిని ♦ దలపుము తరుణీ !!

సీ. శుక్లరూపంబైన ♦ శుభములఁబడయును, పీతత్వమున దేహ ♦ పీడనొందు
రక్తాభ సంపద్విఘ్నము కృష్ణ యుండును, నీలవర్ణత నారుకనెలల కీల్గు
సంకీర్ణవర్ణతఁ ♦ జాలకృశించును, తల గానకుండిన ♦ నెలకుఁజచ్చు
చరణముల్గానక ♦ చచ్చునార్నెల్లకు, గుల్ఫముల్గానక ♦ కూలునేట
జఠరంబుగనకున్నఁ ♦ జచ్చురెండేండ్లకు, వామభాగముపోవ ♦ వనితఁబాయు
దక్షిణబాహువు ♦ దర్శింపకుండినఁ, జుట్టమో భ్రాతయో ♦ గిట్టు సుమ్ము !

గీ. కంఠభాగంబు జంఘలు ♦ గానకున్న, నెన్మిదియొ తొమ్మిదియొ నాళ్ల ♦ కీల్గునిజము
నీడయే గానకుండిన ♦ నాఁడె చేచ్చు, సందియముబొంద కిందు కో ♦ యిందువదన !

శ్లో. అథాతస్సంప్రవక్ష్యామి,ఛాయాపురుషలక్షణం।యస్యవిజ్ఞానమాత్రేణ త్రికాలజ్ఞోభవేన్నర

# శతావధాని శ్రీచెళ్లపిళ్ల - వేంకటశాస్త్రిగారు

అడవి - శంకరరావుగారు, బి.ఏ. ఎల్.టి,

మహాకవియైన శ్రీ చెళ్లపిళ్ల - వేంకటశాస్త్రిగారి జీవితమును బఠించినప్పుడెల్లను మన మిరువదియవ శతాబ్దములో నుంటిమా, లేక యే పదునాలు పదునేడవ శతాబ్దములలోనైన నుంటిమా యను సందేహము పదే పదే మనకు స్ఫురించుచునే యుండును. "శ్రీ కింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి బాలసరస్వతీ శతావధాని శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల" కవితా ధోరణి వివిధరాజాస్థానములలో వీరు ప్రదర్శించిన కవితాశిల్పము, జిగీషవలన తోడికవులతోను, పండితులతోను డీకొని వీరొనర్చిన ప్రతిజ్ఞలు, వానిననుసరించి చెలరేగిన వివాదములు, తరువాత వీరు పొందిన సన్మానములు, సమకాలికులగు కవులు చాల మంది వీరినిగురించి చేసిన ప్రశంసలు-ఇవియన్నియు నాంధ్రులకు వీరిని జిర పరిచితులనుగాఁ జేయుటయేకాక, పూర్వకాలమునాటి రాజాస్థానములలోని పండితకవుల స్పర్ధ ప్రతిస్పర్ధలను, వారొందినగౌరవములను మరల ఈ కాలమున మనకు జ్ఞప్తికిఁదెచ్చినవి. వీరిప్రతిభవలనను, కృషివలనను, ఆంధ్రసరస్వతి కొక నూతనవికాసమువచ్చి, కవితోపాసనయందుగల రుచినెఱిగిన యువకు లనేకులు బయలుదేరినారు. అంతియేకాక పండితకవులైన తిరుపతి వేంకటేశ్వరుల తీరు చాలమందికి నేఁడు వరవడియై యున్నది. అందుచే తిరుపతివేంకటేశ్వరులొనర్చిన వాఙ్మయసేవ ఆంధ్రులకు పూజనీయమైనది. మొన్న 1933 సం॥ సెప్టెంబరు 30-వ తేదిని (శ్రీముఖ ఆశ్వీయుజ శుద్ధద్వాదశి - శనివారము) బందరులో జఱుపఁబడిన శ్రీవేంకటశాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవ సందర్భమున ఆంధ్రరాష్ట్రి మీ కవీశ్వరుని పూజించి ధన్యతఁ గాంచినది.

## బాల్యము

శ్రీవేంకటశాస్త్రిగారు ప్రమోదూత సం॥ శ్రావణ శుద్ధ ద్వాదశి సోమవారము రాత్రి తెల్లవారుజామున (1870 ఆగష్టు 8 వ తారీఖు) తూర్పుగోదావరి మండలమున కడియమువద్ద నున్న దంగేరుగ్రామమున జనన మొందిరి. వేంకటశాస్త్రి తండ్రి కామయ్యశాస్త్రి. తల్లి చంద్రమ్మ. చంద్రమ్మగారికి రామచంద్రమ్మ, రామలక్ష్మమ్మయనియుఁ జెల్లెండ్రు కలరు. వేంకటశాస్త్రిగారారామచంద్రావిధులు. వీరి చినముత్తాతగారగు చెళ్లపిళ్ల - నరసకవి యామినీపూర్ణతిలకావిలాస మను కావ్యమును రచించెను. నరసకవి నూఱుసంవత్సరములక్రిందట పిఠాపురమురాజుగా నుండిన శ్రీ రావు నీలాద్రిరాయనింగారి కాలమునసుండి యున్నట్లు:—

"సీ. త్రిభువన పూతకృత్రిమయ గల్గు గౌతమీ
తీర వితీర్ణధాత్రీ ప్రసిద్ధ
తరమైన కంకణ పురవరసంస్థాన
భూతిఁజెందినవాఁడ భూసురుండు
శ్రీరామనామ మంత్రారాధనపరుండ
సకలవిద్వన్మహాజనహితుండఁ
బూజ్య తరప్రాజ్యరాజ్య సత్పీఠికా
వరపుర సామ్రాజ్య పరివృఢుండ
గీ. విపుల రేచర్ల గోత్ర పవిత్రమూర్తి
రావు వేంకటనీలాద్రిరాయనృపతి
చేత సత్కృతినొంది ప్రసిద్ధినొంది
నట్టి నరసయనామ విఖ్యాతయశుఁడ."

నని వర్ణించుకొని యుండుటవలన తెలియుచున్నది. నరసకవి తనకావ్యమున గొంతవఱకు తనవంశావళిని వర్ణించినాడు. వీరిది ఆపస్తంబసూత్రము, భారద్వాజ గోత్రము. నరసకవి ఆనిసన్నిధికి నేగక కాలము పుచ్చు చుండగా రసజ్ఞుఁడౌటచే అతఁడుగలఁ చోటికే నీలాద్రి రాజు వచ్చెనట!:—

శా. నీలాద్రిక్షితిపాలుఁ "డేమివలయు
	నీ"కన్న "నాకన్న వ
స్త్రాలందెందుఁ గొఱంత లేదు నరనా
	థా! నీవు మేల్ దాతవం
చేలాగీతఁడు గోరునిన్ను? సకలం
	బీ విచ్చినట్లే ధరా
పాలుర్ మీ రెపుడో యొసంగునిలయే
	పాలించెడిన్ మమ్మలన్.

చ. వలవని కోరికల్ తగవు
	బ్రాహ్మణజాతికి, నున్నదానితో
సలుపుట యొప్పుజీవనము;
	సంపద హెచ్చుకొలంది ముందువా
రలు మదమత్తులై చెడి ప
	రంపరగాఁగలవేదశాస్త్రపుం
జెలిమికి బాహ్యులౌదు రటు
	చేసిన బ్రాహ్మణజాతియే చెడున్."

అని నరసకవి ప్రత్యుత్తరమిచ్చెనఁట! కాని నీలాద్రిరాజు:—

ఉ. ... ... ... మీ కతానఁగృతి
	గావలెనీతఁడు కోరుఁడొద్దిరో
పావనుఁ జేయుఁ డీనృపునిఁ
	బాత్రము చేకురు టెంత వారికిఁ?

భోవు ధనంబెటో, యశము
	పుట్టఁగఁ జేసెడి దానమన్నచో
నీవిధమైన సత్కృవుల
	కిచ్చినదే యది నిల్చునెప్పుడున్.

అనిచెప్పి కోరుఁడని పట్టుఁబట్టగా నరసకవి:—

చ. కలదని మున్నె చెప్పితిని
	గాయిల మీరిడినట్టి దింత, య
య్యలకొక కొంత కట్టుబడి
	యేర్పడియున్నది మున్న; దానిలో
పలఁగల మూఁడుభాగముల
	భాగమొకం డదది నాది; దానికిం
గల కరమున్ వెలార్పు మది
	గాఁదగునాకొక కోటితుల్యమై.

క. కృతియన్న, యామినీపూ
ర్ణతిలకలో నీదుపేరు నాటించితినిం
తకు మున్న దేవునికి నం
కితమది చేసితి; ధన మకించిత్కరమా.

అని ఆనిని సమాధానపరచినట్లు గీరతములో వర్ణింపఁ బడియున్నది. ఈ నరసకవి మదనాభిరామనృపకన్యా చరిత్రమును, వేంకటేశ్వరవిలాసమునుగూడ రచించి వానిని శ్రీరామున కంకితము చేసెను. ఈ నరసకవి:—

"కవినై కాఁకరపర్తికేగి యచటన్
	గప్పించి యామీఁద శా
బ్దవిధుల్ నేరిచి యా కృతజ్ఞతకునై
	తద్దేశికున్ గ్రంథమం
దు విశేషించి నుతించి" ... ...

నట్లీ క్రిందిపద్యములవలన స్పష్టపడుచున్నది:—

మ. తనరారన్నుతియింతు దాంతులను మే
	ధావంతులన్ సాహితీ

ధనవిశ్రాంతుల భాష్యకార సమ సి
ద్ధ స్వాంతులన్ మానసా
ర్చన గౌరీమణిశాంతులన్ గుణవిభా
స్వన్ముఖ్యనామాత్మలో
ధన హృద్వేదుల వేంకటార్య జనభృ
త్సామంతులన్ శాంతులన్.

గీ. సరస సుజ్ఞాన వరమంత్ర చక్రవర్తి
సమదపరవాది గజగజాశనకరాగ్ర
జాగ్రదుగ్రప్రతాప సమగ్రమూర్తి
కోనయాఖ్యాంధ్రగురుకీర్తిగూర్తుమదిని.

వేంకటశాస్త్రితండ్రి కామయ్యశాస్త్రిగారంత ధనికులు కారు. వేంకటశాస్త్రి కక్షరాభ్యాస మైదవయేట కడియములోనే జరిగినది. వీరు బాల్యమున కడియమువీధిబడిలోఁ గొంతకాలమును తరువాత ఏనాములో ప్రవేశించి పాఠశాలలో కొంతకాలము విద్య నభ్యసించిరి. నీలపల్లిలో లోకల్‌ఫండు స్కూలులో కూడ కొంతకాలము వీరు చదివిరి. పాఠశాలలో వీరు విద్య నభ్యసించుట దీనితో పూర్తి యైన దని చెప్ప వచ్చును.

## విద్యార్థిదశ

తరువాత కొంతకాలము వీరు విజయనగరములో సంగీతము నభ్యసించిరి. అచ్చటనుండి తిరిగివచ్చినతరువాత వీరు కాపులపాలెములో కానుకుర్తి-భుజంగరావు పంతులుగారివద్ద రఘువంశము, కాటవరములో శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులుగారివద్ద కుమారసంభవము, మేఘసందేశములోఁ గొంతభాగము, కాజులూరులో రేగిళ్ల-కామశాస్త్రి, పప్పు-సోమశాస్త్రిగార్లవద్ద మేఘసందేశములో మిగిలినభాగమును, అటుమీద చామర్లకోటలో ప్రతివాదిభయంకరం-రాఘవాచార్యులుగారివద్ద లఘుకౌముదిలో సంధిపంచకము, పిమ్మట పిల్లంకలో సుదర్శనము-అనంతాచార్యులుగారివద్ద లఘుకౌముదిలో మిగిలిన భాగమును భారవినిపఠించిరి. అనంతాచార్యులుగారివద్ద విద్య నభ్యసించు కాలముననే వేంకటశాస్త్రిగారు భారవిలోఁ గొంతభాగము మధునాపంతుల-సూరయగారివద్ద చెప్పుకొనిరి :—

సీ. "రఘువంశము భుజంగరాడ్గురు సన్నిధి
నింపుమీఱఁగఁ బఠియించినాఁడ
శ్రీపాద కృష్ణమూర్తి కవీంద్రుకడ నైదు
మాసముల్ శుశ్రూష చేసినాఁడ
కాజులూరను నూరఁ గామసోములయొద్ద
నొకమూఁడు మాసమ్ము లున్నవాఁడ
చామర్లకోటలోఁ జదివితి రాఘవా
చార్యసన్నిధిని మాసత్రయమ్ము
పై ననంతార్య సూరయపండితు లిరు
వురునుమూఁడుమాసమ్ములు గురువులైరి
పిదప శ్రీ బ్రహ్మయమనీషి పేరు దెచ్చు
గురుఁడు నాకయ్యె." ... ...

నని గీరతములో వేంకటశాస్త్రిగారు తమగురువులను పేర్కొనినారు. ఈ గురుపరంపరలో శ్రీపాద-కృష్ణమూర్తి శాస్త్రిగారు నేఁడు కవిసార్వభౌమ బిరుదము వహించి తమ చేతిమీదుగా సంస్కృతభారతము నంతయు బూర్తిగ నాంధ్రీకరించియున్నారు. ఈ భారతాంధ్రీకరణసమయమున కృతికర్తయైన శ్రీపాద-కృష్ణమూర్తి శాస్త్రి గారికిని, కృతిభర్తయైన శ్రీ ముక్త్యాల-రాజాగారికిని గొంత వివాద మేర్పడఁగా:—

శా. శ్రీనాథుండట తొల్లి వేమవిభుతో
సింగక్షమాభర్త కెం
తేనిన్ వైరము మీఱియున్నతఱిఁ దా
నేయేగి సింగక్షమా

జానిన్ సత్కవితా వినోదమున మె
చ్చన్ జేసి తద్వైరమున్
మానించెన్ గవిరాజవైరమును నే
మాన్పింతు నారీతిగన్.

అని వేంకటశాస్త్రిగారు మాధ్యస్థ్యము వహించి ముక్త్యాల-రాజాగారి వద్దకేగి:—

"అంతేవాసిని నేను కృష్ణకవి క
త్యంతమ్ము నాయందు నా
యంతర్వాణికిఁ బ్రేమమగ్గలము"...

అనియు:—

"నాతోఁ బుట్టువు భారతంపుఁ గృతికి
న్నాథుండ వీవాటచే
నీతోఁ జుట్టఱికంబు నాకొదవుట
న్నే నిన్ను విన్పింపఁగాఁ
జేతుర్ కృష్ణకవీంద్రుఁడో? వినెడి ము
న్నేనాకు"... ...

అనియు విన్నవించి,

"మృదుహృదయుం డమాయికుఁ డ
మేయుఁడు కృష్ణుఁడు"

అని తమగురువగు కృష్ణమూర్తిశాస్త్రిగారిని స్తుతించినారు. 1932 సం॥ అక్టోబరు 21 వ తేదిని ఆంధ్రమహాజనులపక్షమున కవిగండపెండేరము శ్రీపాద - కృష్ణమూర్తి శాస్త్రిగారికి పౌర మహాజనసభలో సమర్పింపఁబడినప్పుడు:—

చ. "గురువులు పల్వు రుండినను
గొంకక నేఁటికి నిల్చియున్న మ
ద్గురుఁ డొకరుండె శ్రీపదుఁ డ
కుంఠిత తేజుఁడు కృష్ణమూర్తి, యీ
గురునకుఁ జేయునుత్సవము
గోరిక మైఁ గనుఁగొంట కన్నసం
బర మొకఁడుండఁ బో." ... ...

దనుచు నధ్యక్షతవహించి కవి సార్వభౌమునకు గండపెండేరము దొడుగుభాగ్యము వారి శిష్యులగు వేంకటశాస్త్రిగారికే లభించినది! ఇటీవల వేంకటశాస్త్రిగారు చామర్లకోట కేగినప్పుడు పూర్వము దినములు జ్ఞప్తికివచ్చి ఆనాఁటిసభలో:—

చ. నలువది యేండ్లకున్ మునుపు
నాదగు చిన్నతనాన, విద్దెలో
పలఁ గడుఁబెద్దలైన ప్రతి
వాదిభయంకర వంశ్య రాఘవా
ర్యులకడ విద్యఁ గైకొనుచు
నుంటిని నేనిట మూఁడుమాసముల్
పులకితమయ్యె మేను
గతమున్ స్మరియించి నన్నొసభాసదుల్.

అని ప్రతివాది భయంకరం - రాఘవాచార్యుల వారియెడల తమ కృతజ్ఞతను వెల్లడించినారు.

కాని వేంకటశాస్త్రిగారి ప్రధానగురువు శ్రీచర్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు. వీరినే ప్రత్యేకించి తిరుపతి వేంకటేశ్వరకవు లనేక రాజాస్థానములలోను, వివిధ సందర్భములయందును తమ గురువుగా స్తుతించినారు. వీరివద్ద వేంకటశాస్త్రిగారు సిద్ధాంతకౌముది ప్రారంభించి:—

చ. "గురుకులవాసమున్ జలిపి
కూరిమి మాధుకరంబు వారముల్
జలుపుచు నమ్మ గాని యొక
సాధ్విని "అమ్మ" యటంచు "బా"బటం
చారులను గొల్చి." ... ...

భాష్యాంతమును అకుఁ బఠించిరి.

" కడిమెద్దయను నొక చిరుతగ్రామమ్మున
వసియించు పతంజలింబోని వాని ననఘ
చరిత్రు నాపస్తంబ సూత్రు లోహిత సగోత్రుఁ
బాపమాంబాగర్భశుక్తిముక్తామణియౌను వీర
నపుత్రు పుల్లయార్య వెంకయార్య దుర్గ
యార్య భ్రాతృత్రితయాను జన్ము నన్నపూర్ణా
సతీచిత్త జన్ము "

శ్రీచర్ల బ్రహ్మయశాస్త్రిని తిరుపతి వేంకటకవులు వర్ణించిన విధమునుబట్టి ఆయన పాండిత్యము శిష్య వాత్సల్యము గొంత తెలియుచున్నది:—

"గీ. అన్నవస్త్రమ్ములొసఁగి విద్యలను శిష్యు
లకు ననుదినమ్ము చెప్పు విలక్షణ ప్ర
భావు భావుక భావు మాపాలిదేవు
బ్రహ్మగురువర్యుఁ గొల్తు మపారభక్తి."

అని లక్షణాపరిణయములోను:—

శా. కాశీపండితుఁడై కృపాళుఁడయి ప్ర
ఖ్యాతి ప్రభాపూర్ణుఁడై
యాశీర్వాదము మాత్ర శిష్యులను వి
ద్యావంతులన్ జేయువా
డై వైశద్యమ్మునఁ బొల్చు చర్లకులజున్
బ్రహ్మయ్యశాస్త్రిన్ గళా
రాశిన్ శ్రీ కడిమెద్ద వాసు మది నా
రాధింతు నశ్రాంతమున్.

అని పాండవోద్యోగములోను:—

సీ. అ ఇ ఉణ్. మొదలుగాఁగ నాభాష్యపర్యంత
మే మహామహుఁడు మాకిచ్చెవిద్య
కన్న సంతానమ్ముకన్న నెక్కుఁడుగాఁగ
నేదయాళుండు మమ్మాదరించె
పెండ్లి పేరంటముల్ ప్రియ మెలర్పఁగఁ జేసి
యేగుణనిధి మమ్ము బాగుచేసె
తిండికై యిల్లిల్లు తిరుగ నీయక యన్న
మే యన్నదాత మాకింటనిడియె
గీ. సకలదిగ్దేశరాజన్యసభలయందు
డంబుమీఱ శతావధానంబొనర్చి
నిర్వహింపఁగ నెవ్వఁ డాశీర్వదించె,
నట్టిగురునకుఁ గృతియిచ్చు టర్హమ కద.

అని బ్రహ్మయ్యశాస్త్రిగారికిఁ గృతినిచ్చిన దేవీభాగవతములోను వీరు తమ గురువును స్తుతించియున్నారు. తమయింట గురుకులవాసము జేయుచు విద్యఁ గఱచుచుండిన శిష్యులకై శ్రీచర్ల బ్రహ్మయశాస్త్రిగారు:—

" ధవళగిరిన్ మహామహుఁ డ
తండొక సత్రము వెట్టి, శిష్యులన్
గవులను జేయుచున్ సుఖము
గా మఱి వారికి నర్థికోటికిన్
బ్రవిమల మన్నదానము న
పారముగా నొనరిం" ... ...

చుటయే కాక.

ఉ. అమ్మహనీయునింట నెల
యయ్యెడునంతకు నొక్కఁ పుట్టె బి
య్యమ్ము సుమారు వారుఁ దమ
దైన కుటుంబముగాక శిష్యసం
ఘమ్మతిథివ్రజమ్మును సు
ఖమ్ముగ భోజన మాచరింపఁ బు
ణ్యమ్మన బ్రహ్మపండితుని
కన్న మఱొక్కని కెన్న నున్నదే.

ఉ. ఉన్నది రెడ్డిసీమ, తమ
కుండెడి దించుకవృత్తి, దాని కె

న్నెన్నియొ యోగముల్ కుదిరె
నేని ఫలించు, ఫలించు దానిలోఁ
దిన్నదిగాక తా రయితు
దెచ్చి యొసంగు ఫలమ్ము దెంత హె
చ్చున్నను వీరి కొక్కనెల [గున్.
యోపునొ? యోపదొ సందియమ్ము
క. ఆ యనఘాత్ముని భార్యగ [నిజం
దా ?యిల్లాలనఁగ ; నాఖ్యయననేల ?
బే, యన్నపూర్ణయావె వృ [పెద్దల్.
థాయుంతురె యట్టిపేరు తద్జ్ఞులు
ఉ. చెన్నఁటి చూపుచూచి యొక
శిష్యుని నేనియు నేమిరా ! యటం
చున్నిరసించి పల్కఁడది
చోద్యము ; దేశికభార్య లిట్టివా
రున్నది వింటిమే? మఱియు
నొక్కటి, లోకులు తన్నుఁ దిట్టినన్
సన్నుతిఁజేసినన్ సమము-
సాటి మఱెవ్వరు ? బ్రహ్మరాణికిన్.

గీరతమందుఁబై రీతినివర్ణింపఁబడిన శ్రీచర్ల-బ్రహ్మయ్య శాస్త్రిగారు గురువులగుటచే వేంకటశాస్త్రియు తిరుపతిశాస్త్రియు దమ విద్యార్థిదశను సార్థకముగా గడుపఁ గల్గిరి.

ఈ గురువులవద్దఁ గొంతకాలము శుశ్రూషఁజేసిన తరువాత వేంకటశాస్త్రిగారు కాశిలో ద్రావిడ-సుబ్రహ్మణ్యశాస్త్రిగారివద్ద పరిభాషేందుశేఖరములోఁ గొంత వఱకుఁ బఠించి కారణాంతరముల మరల స్వదేశమునకు వచ్చి ధవిళేశ్వరములో శ్రీచర్ల - బ్రహ్మయ్యశాస్త్రిగారి వద్దనే వ్యాకరణముఁ బూర్తిగాఁ బఠించిరి. ఆ దినములలోనే వేంకటశాస్త్రిగారు గోరుగొంతుల-శ్రీరామావధానిగారివద్ద వేదము నాల్గవయష్టము చెప్పికొనిరి. విద్యాభ్యాసము నిమిత్తమై మఱల కాశికి వెడల నిశ్చయించుకొని వేంకటశాస్త్రిగారు దారిబత్తెములకై విరోధి సం॥ పుష్యమాసము (1890 జనవరి)న జల్లిసీమలోని నిడమర్రులో అష్టావధానమొనరించిరి. కాశిలోనుండఁగా వీరిగురువులగు ద్రావిడ - సుబ్రహ్మణ్యశాస్త్రులుగారి కొమార్తె వివాహమునకు ముహూర్తము నిశ్చయింపఁబడెనఁట. అప్పుడు శుభలేఖలలో వేయుటకై సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు శ్లోకమొకటి కోరఁగా వారి శిష్యులును, ఇతరులును శ్లోకములరచించి వారి కొసంగిరి. వానిలో వేంకటశాస్త్రివిరచితమైన శ్లోకమునే వారు స్వీకరించి దానిని వివాహ మహోత్సవాహ్వానలేఖలలో ముద్రించుకొనిరట ! ఆశ్లోక మీక్రింద నొసంగబడినది:—

శ్లో. మున్యబ్ధ్యంకేందువర్షే
గుణగణమహితే రాధమాసేవళక్షే
పక్షేనంగస్య తిథ్యా మసురగురుదినే
మత్సుతాయా వివాహః.
పాత్రర్శ్యాబీబుధేంద్రామహఇహ భవతాం
యాచతే సన్నిధానం
శ్రీసుబ్రహ్మణ్యశాస్త్రీ ద్రవిడకుల భవ
స్స్వాహితాగ్ని ర్వినీతః.

వీరివద్దఁగాక వేంకటశాస్త్రిగారు నోరి-సుబ్రహ్మణ్య శాస్త్రిగారివద్దఁగూడ కొంతకాలము శిష్యుఁడుగనుండి యున్నట్లు:—

తే. అందఱును వచ్చుకతన నానందగరిమ,
గలుగుట యటుండ శ్రీ నోరికులుఁడు నాకు
గురులలో నొక్కరుండు వ్యాకరణ వార్ధి,
గూడవచ్చె సుబ్రహ్మణ్య కోవిదుండు.

అని 1911 సం॥ సెప్టెంబరులో బాపట్ల శతావధాన ప్రారంభమున వేంకటశాస్త్రిగారు చెప్పికొనినారు. కాశినుండి ఆగష్టు 1891 (వికృతి ఆషాఢ)లో వచ్చిన పిమ్మట వీరు కేశనకుర్రు, ముమ్మిడివరము, ఐనాపురము, మొదలగుచోట్ల శ్రావణ భాద్రపదమాసములలో నష్టావధాన మొనర్చిరి. తరువాత తమ ప్రధాన గురువులగు శ్రీచర్ల-బ్రహ్మయ్యశాస్త్రిగారివద్ద మరలఁ బ్రవేశించి మఱికొంతవఱకు చదివికొనిరి:—

మ. కలిమానంబొక నైదువే లరుగ, నే
కత్రస్థ సప్తగ్రహా
మ్ములకున్ శాంతియొనర్చుచున్ శ్రమలవ
మ్మున్ లేకయే బ్రహ్మమున్
గలిసెన్ బ్రహ్మగురూత్తముండు దశమీ
కంజాప్తవారంబు నా
ద్యలసత్పుష్యముఁగార్తికమ్మును వికా
ర్యబ్దమ్మునుం గూడఁగన్.

అని వర్ణింపఁబడి యుండుటచే వీరి గురువులగు బ్రహ్మయ్యశాస్త్రిగారు 1899 నవంబరు 12-వ తేదిని మరణించినట్లు తెలియుచున్నది.

వేంకటశాస్త్రిగారి సహాధ్యాయియై

"కవలవలెం జరించుచుఁ బ్రకాన్తివహించు శతావధాను"

లగు తిరుపతి వేంకటకవులలో నొకరగు దివాకర్ల తిరుపతి శాస్త్రిగారినిగురించికూడఁ గొంత ముచ్చటించుట ఇచ్చట సందర్భముగ నుండును. తిరుపతిశాస్త్రి మాతామహులు వారణాసివారు. తాత సోమయ్య. మేనమామ గంగాధరశాస్త్రి మంచిపౌరాణికులు. తండ్రి వేంకటావధాని. తల్లి శేషమ్మ. తిరుపతిశాస్త్రి ప్రజోత్పత్తిసం॥ ఫాల్గుణ శుద్ధదశమి బుధవారము (1872 యేప్రియల్ 3వ తేది) న శ్రీచర్ల-బ్రహ్మయ్యశాస్త్రిగారి గ్రామమగు కడియెద్దకు సమీపముననున్న యెండగండి గ్రామమున జన్మించెను. తిరుపతిశాస్త్రి తన బాల్యమున తండ్రిగారివద్ద రఘువంశము, కుమారసంభవమును, బూరుల-సుబ్బారాయుడుగారివద్ద మఱికొన్ని కావ్యములను బఠించెను. కాళిదాసత్రయమును ముగించి తరువాత పదునాల్గుసంవత్సరముల ప్రాయమున కోనసీమలో గంగలకుర్రి యగ్రహారమున మాధుకరము నెత్తికొనుచు గరిమెళ్ల-లింగయ్యశాస్త్రిగారివద్ద భారవి, భారతచంపువు, కొన్ని భాణములను బఠించెను. తరువాత తిరుపతిశాస్త్రి విద్యాభ్యాసము నిమిత్తమై విజయనగరమున కేగి ఏకారణముననో కొంతకాలమునకు వెనుకకువచ్చి పిప్పరలో పమ్మి పేరిశాస్త్రులుగారివద్ద మురారిలో నాలుగంకములును, ఆ గ్రామములోనే వేఱొక శాస్త్రులుగారివద్ద సంగ్రహ న్యాయబోధినులవఱకు తర్కప్రకరణములును పఠించిరి. తరువాత 1888 ఫిబ్రవరిలో అప్పటికి కాశినుండి తిరిగివచ్చి విద్యార్థులకు బాఠములు జెప్పుచుండిన శ్రీచర్ల-బ్రహ్మయ్యశాస్త్రివద్ద చదువుకొనుటకై కడియెద్దకు జనుచుండగా బ్రహ్మయ్యశాస్త్రిగారు పెంటపాడు గ్రామములోనుండినందున తిరుపతిశాస్త్రివారినచ్చటనే కలిసికొనెను. సుప్రసిద్ధులైన శ్రీ మాడభూషి వెంకటాచార్యులువారుకూడ నాఁడు పెంటపాడులో నుండుట దటస్థించెను. అప్పటికి తిరుపతిశాస్త్రికి పదునాఱు సంవత్సరములు నిండలేదు. శతావధానియని ప్రసిద్ధిజెందిన శ్రీ మాడభూషి వెంకటాచార్యులుగారా నాడు పెంటపాడులో పండితుల కోరికమీద సభలో పదిమందికి గవనము చెప్పినరీతిని తిరుపతిశాస్త్రి చూచుట దటస్థించెను. అప్పటినుండియు తిరుపతిశాస్త్రియు, వేంకటశాస్త్రియుఁ గలిసి బ్రహ్మయ్యశాస్త్రిగారివద్ద విద్య నభ్యసించిరి. వేంకటశాస్త్రి-గారికంటె నైదు మాసములు మాత్రమే ముందుగా తిరుపతిశాస్త్రి గురుసన్నిధిని జేరెను. వేంకటశాస్త్రిగారివద్దకూడ తిరుపతిశాస్త్రి కొంత చదివికొనినట్లు:—

మ భవునిన్ భావ పదారవిందభవుఁ జె
ల్వపిళ్ల వంశార్ణవో
ద్భవునిన్ శాస్త్రవరం వరాసహభవున్
భాస్వద్గవున్ సాహితీ
ధవునిన్ మేఘగభీరవిస్ఫుటరవున్
ధైర్య ప్రభా మేరువున్
గవితా సద్గురు వెంకయాభిధునివ
క్కాణింతు నెక్కాలమున్.

మ. వితతాత్మీయ శతావధాన కవితా
విద్యాపయోరాశి సం
భృత శిష్యాంబుద వాఙ్మయామృతరస
ప్రీతాఖిలాంధ్ర క్షమా
ధృత రజ్యద్రసికావతంసకృతవం
దిస్తోత్రమా లావిభూ
షితు మా వేంకటశాస్త్రి నేఁ బొగడెదన్
శిష్యస్వరూపమ్మునన్.

అనుతిరుపతిశాస్త్రిగారి పద్యములవలన తెలియు
చున్నది. (సశేషము)

విద్వాన్. కాశీ - వ్యాసాచార్యులుగారు,

## కవితాగౌరవము

ఉ. శాసకులౌ స్వదేశనృపసత్తములెల్లరుఁ దొల్లి, ఆత్మసం
తోసముతోడ రాజ్యరమతో సరిగాఁ బరిగ్రహించి భా
షాసతిఁగూడఁ బెంచిరి; విచారణకర్తలు వారలుండ సం
త్రాసముఁబాసి భారతియు రమ్యతరాద్భుతహావభావ చే
ష్టాసముదీర్ణమై నిజవచస్సుధ లొల్కఁగ దివ్యపాద వి
న్యాసములం జరించెఁ జతురాననహర్మ్యతలంబులందె, నాఁ
డాసతి డాయు పేఘనులకైనను దుర్భరమౌచుఁ దోఁచెఁ; గా
నీ, సరసాగ్రణీ! యిపుడికేమని తెల్పెదఁ? దొంటి కీర్తి వి
న్యాసముఁదోరెఁ, గాలగతి యంతయు మారె; స్వరాజవర్గ మా
వాసవుఁ జేరె; అన్యనరపాలుర పాలన మీరె, దేశభా
షాసతినిద్రఁగోరె; అనుశాసకు లెవ్వరు లేరఁటన్న వి
శ్వాసముతోడ నెవ్వనికి వాఁడె కవీంద్రపదంబుఁగాంచ, సం
త్రాసము లోనఁ బాసి, "భళిరా! అదె భారతి చిక్కెఁ జిక్కె" నం
చేసురభావమూని రభసార్భటి లాగఁగఁ, బావమక్కటా!
ఆసతి మేనఁదాల్చిన మహార్హవిభూషలు జారెఁ, బాదవి
న్యాసముమారె, వాక్యములయందునఁ దొట్రిలుపాటుఁ గూరెఁ గ
ట్టా! సరసంపుపాకములయందు రుచుల్దిగజారెఁ, సంధులూ
వాసిఁ ద్యజించుచుండ సడలఁబారెఁ, బదంపడి యింకమీద నే
వేసము లూని భారతి నవీనవిధంబు చరించునో గదా ? ?

వైదీశ్వరాలయము, వైదీశ్వరన్ కోయిల్.



ఎ. వి. టి. అయ్యరుగారి అనుమతిని.

మహాలింగస్వామి ఆలయము, తిరువడమరుదూరు.

# రాజనీతిశాస్త్రము

## మొదటి భాగము

### ప్రథమప్రకరణము - రాజనీతిశాస్త్రవృక్షము

గీ. మఱ్ఱివిత్తన మెంతణుమాత్రమైన
తజ్జనితవృక్షము మహోన్నతంబుగాదె ?
ఆదినరసంఘభావ మావంతమైన
తజ్జనితరాజనీతిశాస్త్రంబుగాదె ?

రాజనీతిశాస్త్రి మొకవటవృక్షమువంటిది. అణుమాత్రబీజజనితమైనను వటవృక్షమెట్లు మహోన్నతదశఁగాంచి విరివియగు శాఖోపశాఖలచే విశాలస్థల మాక్రమించి సర్వజనులకుఁ బూజ్యమగునాశ్రయమై, సంతత సర్వజనోపకారి యై, యాదరణీయమగుచున్నదో, యదేపగిది నీరాజనీతిశాస్త్రిము కంటికగపడని తలఁపున కందని యేదియో యాది నాగరికజనసంఘసంబంధ సముదయము (Relations in the civilised society) బీజముగాఁగల్గి పెరిగి పెద్దదగును. "ఆ సంఘమునకు, నాసంఘమున కధికారము వహించు ప్రభువునకుఁ గలపరస్పరసంబంధము, నాసంఘమందలి వ్యక్తి పరస్పరసంబంధము, తత్తద్వ్యక్తులకుఁ బ్రత్యేకముగా బ్రభుత్వముతోఁ గల సంబంధము" అనియీసంబంధము ముత్తెఱఁగులుగా నుండును. ఇవి రాజనీతిశాస్త్రివట వృక్షమునకుఁ గూకటిప్రేళ్లవంటివి. వీని నాధారముగా గొని ప్రభుత్వము, శాసనము, హక్కు, బాధ్యత అను నాల్గు పరస్పరము విడిపోని (inseparable) బలమగుశాఖలతోడఁ జనించి యావృక్షము మహోచ్చదశకు వచ్చును. తదనంతరము కాలక్రమమున వృద్ధి నందుచుండు నావృక్షమున జనించునూడలవలె రాజ

అష్టావధాని, అంబటి-సుబ్బరాయగుప్తగారు,
ఎమ్. ఏ., బి. ఇ డి,

నీతిశాస్త్రిమందును, పెక్కురు రాజనీతివేత్తలచే ప్రతిపాదింపఁబడి లోకమున వెలయఁగల వివిధరాజనీతి వాదములు (Political theories)పుట్టి యాశాస్త్రి వృక్షమును మీదుమిగులఁ బలపఱచును. ఇట్టి రాజనీతి శాస్త్రిమును రాజిలఁజేయు ప్రభుత్వాది శాఖా చతుష్టయ లక్షణములఁగూర్చి మాత్ర మీభాగమున వివరింపఁబడును. ఆశాఖానిర్మితిఁగూర్చియు, తజ్జనితమగు చిన్నకొమ్మలు, రెమ్మలు, ఫలములు, దళములఁ గూర్చి రెండవభాగమునఁ దెలియఁజేయఁబడును. తదుపరి మూఁడవభాగమున వివిధరాజనీతివాదములఁగూర్చి వ్రాయఁబడును.

### ద్వితీయప్రకరణము

### ప్రభుత్వశాసనములు

### (Government and Law.)

ప్రభుత్వమనగా నేమి :—ఏనాగరిక జనసంఘమం దైనను తత్సంఘసమష్టిచే, సమష్టి సంఘాభివృద్ధికై యేర్పాటుఁజేయఁబడి, తత్సంఘమునుపైన సర్వాధికారములఁ జలాయించుచు, నాసంఘముఁ బాలించు నొక సంస్థ.

దానిలక్షణములు :—తనచేఁ బరిపాలితమగు సంఘమందలి వ్యక్తులెల్ల సామాన్య విశేషపరిస్థితులయందుఁ (ordinary and extraordinary circumstances) గూడ వర్తింపవలసినపద్ధతులు (Rules) గూర్చి శాసించు నధికారముండుట ప్రభుత్వ ప్రథమ లక్షణము. ఆశాసనముల నేవిధముగానైన, నెవరైన,

నెపుడైన నాసంఘమందలి వారుల్లంఘించినచో, వారిఁ దగురీతిఁ దండించి, వారినాశాసనములకు విధేయులుగాఁ జేయగల సామర్థ్యముఁ గల్గియుండుట రెండవ లక్షణము. ఈ యధికారసామర్థ్యము లితరవ్యక్తి సంస్థల (Individuals and societies) కట్టివాని కనుల్లంఘనీయములై, నిరతిక్రమణములై యుండుట ప్రభుత్వసంస్థమండవలసిన మూఁడవలక్షణము.

ఈవిషయమునఁ బాశ్చాత్య రాజనీతివేత్తలగు 'ఆస్టిను' "The power of the Legislature is always legally unlimited" అనియు "The sovereignty is where the supreme power resides";"అనగా శాసననిర్మాణాధికారము న్యాయముగా నిరంకుశమైనది. నిరాఘాటమగు నధికారముగలదియే ప్రభుత్వము" అనియుఁ దెల్పియున్నారు. ప్రాచ్యరాజనీతి నిపుణులగు చాణక్యాదులుగూడ ఈరీతినే ప్రభుత్వలక్షణముల నిర్వచించినారు.

ఇంతియేగాక సకలధర్మమర్మ సంచయమునకుఁ బెన్నిధానమై, పంచమవేదమని ప్రసిద్ధిఁగన్న మహాభారతమున,—

గీ. చారచక్షుఁడై కనునెల్లజగమునపుడు
సూర్యుఁడంద్రుఁడు నరేంద్రుఁ డకార్యకరుల
దునుము నయ్యెడజముఁడు నాఁజీనునతండు
దేవతాత్మకుఁడగుట సందియము యధిప!

గీ. రాజులరసిన నెమ్మది బ్రదుకుఁగాన
రాజుసర్వోత్తముఁడు ధర్మరాజియందు
రాజధర్మంబ యెక్కుడు రాజనంగ
ధర్మదేవతయన వేఱెధర్మతనయ! 271, 239 ప, ఆ; శాంతి;

అని చెప్పఁబడి ప్రభువునకు దైవమునకువలె తానేలు ప్రజలపై చలాయింప సర్వాధికారము, సర్వోత్కృష్టతయు నొసఁగఁబడియున్నవి. మఱియుఁ గాకతీయాంధ్ర రాజ్యమేలి, విద్యావిభూషణ బిరుదాంకితుఁడైన, రాజనీతిజ్ఞుఁడగు కాకతిరుద్రదేవునిచే విరచితమగు 'నీతిసార' మందు:—

తే. ఆజ్ఞలేనిన్నృపుఁడు నరయఁజిత్తరువులో
నున్నరాజుఁజూడ నొక్కరూప
యానద్రోయసుతుని నైనను దండింప
కున్నరాజ్యమేల యుండుఁజెడక.

అని చెప్పఁబడి రాజాజ్ఞ కనుల్లంఘనీయ లక్షణము నిశ్చితముఁ జేయుచున్నది.

శాసనము:— (Law) ఇట్టిరాజాజ్ఞలేక, ప్రభుత్వపుటాజ్ఞలే (commands of the Government) శాసనములని రాజనీతిశాస్త్రజ్ఞులు వాకొనియున్నారు. ఇయ్యదేయే కార్యములపట్ల నేయే ప్రజ లేయేరీతుల ప్రవర్తింపవలయునో, యావిధానములనెల్ల సూచించునట్టి రాజాజ్ఞాసముదాయము. దీని నుల్లంఘించువారిని దండించుటచేతనే యాశాసనము, లాశాసనములఁజేయు ప్రభుత్వమును సార్థకాహ్వయములగును. ప్రాక్పాశ్చాత్యరాజనీతిజ్ఞు లీశాసనము గూర్చి యిట్లభిప్రాయఁబడుట పైనుదాహృత పద్యాదుల వలన స్పష్టము గాక మానదు.

అట్లయినను, వారెల్లరు ప్రభుత్వశాసనములు కేవలము నిరంకుశములు మాత్రమే యై యుండక, వివిధ ప్రచారరూపమున వెలయు ప్రకృతి ధర్మము లేక శాసనము (Law of Nature) ననుసరించి, హద్దుగలదై (limited) వెలయవలెనని తెలియఁజేసియున్నవారు. బ్లాక్ స్టన్ (Blackstone) అను పాశ్చాత్య రాజనీతిజ్ఞుఁడు "Yet it (Law)

recognises a 'Law of Nature' in virtue of which men have natural rights" "అనఁగా ప్రజల జన్మహక్కుల కాధారభూతమగు ప్రకృతిధర్మమును గమనించి శాసనము చేయఁబడవలయు' అని చెప్పియున్నాఁడు. మహాభారతమున" రాజునకుఁ బ్రజ శరీరము, రాజు ప్రజకు నాత్మగాన "రాజుం బ్రజయున్" యని చెప్పఁబడియున్నది.

ఒక కుటుంబమునఁగల భార్య, బిడ్డలు మున్నగు వారా యింటి కార్యములకెల్ల కర్తయై తత్పోషణభారము వహించు భర్తయాజ్ఞాను వర్తులైనను, తదాజ్ఞ లెల్ల నాకుటుంబమువారి యాశయాభిలాషలకు: గేవలము వ్యతిరిక్తములుగాక యొకహద్దుఁగలవై యుండుఁగాదా? అదేరీతి భూభారమువహించు ప్రభుత్వమునకు ప్రభుత్వమువారియాజ్ఞ (Law) కు నెల్లజనులు లొంగియుండుట ధర్మమైనను, యవి, ప్రజల జన్మహక్కుల ననుసరించి యుండుట మంచిది. అది ప్రకృతిధర్మము (Law of Nature). అందువలననే బ్లాక్‌స్టన్, భారతములేగాక, కాకతిప్రతాపరుద్రకృతనీతిశాస్త్రి మున "భూపతికిఁ గుటుంబమనఁగ భూమియకాదే? "అని చెప్పఁబడియున్నది చాణక్యనర్థశాస్త్రిరాజనీతి లక్ష్యమగు మార్యప్రభుత్వము క్రమము, హద్దుగలదై (constitutional and limited) యుండెనని ప్రమథనాథ బెనర్జీగారు తమ ("Public administration in Ancient India)" అను గ్రంథమున నెలవిచ్చి యున్నవారు. కాన, ప్రభుత్వము, ప్రభుత్వశాసనము కేవలము నిరంకుశములుగాక, ప్రజల హక్కులచేతను (Natural rights of the people), ప్రకృతిధర్మములకును బద్ధములై, హద్దుగల్గి యుండవలయునని తెలియవలయును. అట్లయినను ప్రభుత్వశాసనమెపుడేని తద్విరుద్ధమై, దుష్టమైనను, ప్రత్యేకవ్యక్తులు, సమష్టిసంఘక్షేమము నాలోచించి యాశాసనముఁ దిరస్కరింపక, మొత్తముపైన, ప్రజాసమ్మతిపై నాధారపడినదగుటచే, తద్వ్యక్తులెల్ల రొకటియై యట్టి ప్రభుత్వశాసనమును రద్దు (Repeal) జేయించి, యట్టి ప్రభుత్వశాసనాధికారమునకొక్కమైహద్దు (limit) నేర్పఱచుట మంచిది.

ఇందువలన, నిప్పటి సంపూర్ణాభివృద్ధిఁగాంచిన రాజ్యములందు (modern perfectly developed states) ప్రభుత్వాధికారము తద్దేశమందలి నీతిసాంప్రదాయములచేతను, చిరకాలాచారవ్యవహారాకారముననుండు సాంఘిక సాంప్రదాయములచేతను (Rules of moral and social conduct) నిబద్ధమైనది. ఈసాంఘిక నీతిసాంప్రదాయములు దేశ, కాల, వ్యక్తిభేదములఁబట్టి యొకరీతిగా నుండఁజాలవు. ధర్మరాజ్యోత్తమమని పేరెన్నికగన్న రామరాజ్యమున శూద్రుఁడు తపముజేయుటధర్మముగాఁ బరిగణింపఁబడెను. 15, 16 వ శతాబ్దములం దింగ్లాండుదేశమున రాజమతమునకు దూరులైన వారెల్లరు నీతిమతిదూరులుగాఁ బరిగణింపఁబడి శిక్షార్హులైరి. నేఁటికాలమున, నటుఁగాక, యెటుఁజూచిన సమత్వము, స్వతంత్రము, సోదరభావము (Equality, Liberty and Fraternity) లెల్లరాజ్యముల ముఖ్యరాజనీతి లక్ష్యములుగాఁ బరిగణింపఁ బడుచున్నవి. నేఁటికాలపు లోకోత్తరపురుషుఁడగు మహాత్మాగాంధిగా రింగ్లాండునకు వెళ్లి నపుడొసఁగిన పారమార్థికోపన్యాసమున (Spiritual message) ప్రేమ, సత్యములేఁ (Love and truth) నిత్యసత్యధర్మములుగా (Moral Law) బేర్కొనెను కాన నిట్టి పలుమారు మారుచుండు నీతిమతసాంఘికాది సాంప్రదాయముల నొక్కరీతిగా ననుసరించుటకు ప్రభుత్వమునకు సాధ్యముగానిది. కాన, నాయాకాలములం దాయాసంఘముల, నేయే సాంప్రదాయములు చిరకాలానుభూతములుగా ననుసరింపఁబడుచున్నవో. యాసాంప్రదాయములచే నిబద్ధమై యుండుటమాత్రము ప్రభుత్వమునకు సాధ్యమగును.

ఇంతియేగాక 'ప్రభుత్వము, శాసనమునకుఁ గట్టువడి యుండవలయునా? అని ప్రశ్నించిన నేకరాట్ప్రభుత్వ (Monarchy) మైనను, యామరణాంతాధికారముగల యెట్టిప్రభుత్వమైన; తాఁజేసిన శాసనములకు, తద్విధితమగు దండనలకుఁ జంకవలసిన యగత్యములేదు. కాని "యథారాజా, తథాప్రజా" అను లోకోక్తిఁబట్టి, తాను ధర్మవిరుద్ధముగా నడచిన, నట్టి యధర్మవర్తనలకెల్లఁ దామార్గముఁ జూపినట్లగును కొంకుచేఁ దనశాసనమునకుఁ దాఁ గట్టువడి యుండును. అందువలననే కదా! రాజై, రాజనీతిఁ గూర్చి గ్రంథము రచించిన భద్రభూపాలుఁడు "నరపతులు మేరఁదప్పిన............మరణాంతకమౌను............" అని సుమతిశతకమునఁ బల్కియున్నాడు.



# హృదయ నివేదనము

(ప్రథమపుష్పము) అయితం - కాశీవరప్రసాద రాయ కవిగారు,

శా. శ్రీ విస్ఫారితనేత్ర! కాళికరొ! విస్తీర్ణార్ణవోత్తుంగవీ
చీవారాహతుఁడై నయట్టి నరుఁ డక్షీణంబుగాఁ గాంచు మో
దావేశంబు తృణంబునై నఁగొని సాహాయ్యంబుగా గాఁడె? ప్రే
మావేగాంచిత! నిన్ను నాతఁగొను నాదౌ భాగ్య మింకెంతయో.

క. సుప్తోత్థుండౌను దహన, తప్తుండై సోమరియును తత్త్వజ్ఞుండై
తప్తాత్ముఁడనై యటులే, నాప్తావన నిన్ను నేఁడు నరసితి దేవీ!

మ. కనుపించుక్ భవదాస్యమాత్మ పథముక్ గ మ్మోందుబింబంబెనై
జనవంద్యంబయి, హాసభాసితమునై, సౌఖ్యాలవాలంబునై,
యనయంబున్; జగమాడురీతి ఘననీలాకారమై, క్రూరవీ
క్షణమై, భీతిదమై కనంబడదు-విశ్వవ్రాతసమ్మోహినీ!

సీ. నెత్తమ్మిరేకుల నెఱి నొప్పి మొల్లమా, కనికరంబును జల్లు కనులతోడ;
గెందమ్మిరేకుల దా నందమ్ము పసలొప్పి,సిరిమించు చేతిరా చిలుకతోడఁ
గొమరారు కెంజాయ నమరారునట్టిపా,దయుగంబు గిల్కు టందియలతోడఁ
దొగకన్నె వగకొని దొరవచ్చు మోమున, మవ్వంపు తేఁట లేనవ్వుతోడ

గీ. కరముభాసిలి నాదుహృత్కమలమందు, సంచరింతువువాణివై సంతతంబు,
నన్నుఁబో లెడువాఁడె లేఁడన్న యెడల,నఘుమునన్నంటదనియెంతు నమ్మ నేఁడు.

క. మృదులము లక్ష్మీధామము, విదితకృపారస మరంద విలసితమును నీ
హృదయాబ్జంబందున, షట్పదభంగిక్ విహరణంబు సలుపఁగ నిమ్మా.

క. భువిఁ గాళిదాసముఖ్యు సు, కవులకు నీదైనవిమల కరుణారస మే
నవతును లేని లసద్యశ, మవిరళగతి నిచ్చె దాని నాకాంక్షింతుక్.

సీ. కవిరాజ దృక్మాలికాచకోరములను, కమనీయ వదనేందు కళలతోడ
గంధర్వ నికురుంబఘనచాతకములను, గారుణ్యదృగ్వర్ష ధారతోడ

భ్రాజితసద్భక్త రాజకీరకదంబ, ములనుమానిత మోక్షఫలములొసఁగ
నజ్ఞానఘన శార్వరావాస హృద్గుహా, పాళిని విజ్ఞానహేళిఁద్రోఁడ

గీ. వెలుఁగఁజేసిన నినువంటి విశ్వమాత, నన్ను భాసమానానూన నవ్యకీర్తి
ధాళధళ్య ప్రభాధాత దశదిశాళి, గానొనర్పంగ ధ్యానింతు మానసమున.

ఉ. కాళిక! ధీవరాభినుత కమ్రకృపామకరందబిందు దృ
జ్మాలికవంచు, భక్తజనమాన్య కరాంబుజభాసి భర్మపాం
చాలికవంచు, కష్టభయజాల గభీరనినాద మేఁద వా
గ్జాలనుమాళిఁ బూజలను సల్పెద నిల్పుచు హృద్గృహంబునన్.

క. పరమదయాకరి! విద్యా, తరుణీమణి! సత్కళాప్రదాయిని! దేవీ!
కరుణాతరంగితాలో, కరమాలంకృతుఁగఁ జేయఁగదవే నన్నున్.

తే. ప్రావృడంభోధరోరు గర్జనలలీలఁ, బ్రవిమలవసంత కోకిలారావమటులఁ,
బరఁగు గంభీరమోహన భావవాక్య, కలిత కవితను నేఁడు నీకెలమి నిత్తు.

తే. నీకృపాఝరినిరతంబు నెగడిపాఱి, మహిత దాహంబు దీర్చెడు, మానసాంబు
జాతసంవృత పంకంబు సతతశుద్ధిఁ, జేసెడుఁ గృతజ్ఞుఁడను నీకు స్నిగ్ధమూర్తి.

తే. ఓముచర్ల బుజ్జగించుచు నోర్మిఁదాల్చి, నన్ను నడిపించుచున్నను నిన్ను నేను
జ్ఞానహీనుఁడనగుటచే గాంచలేదు, మలినచిత్తుఁడ నేను క్షమార్హవహించు.

తే. నిర్మలానంత హృద్ధారుణీ ప్రభూత, బహుళసాహిత్య వాహినీ వర్థితాస్మ
దీయ భవ్యసుకవితాతిదివ్యమండ, నావళీమండితగ నిన్ను దేవి సేతు.

సీ. గుణగణ్య! నీకృపా కూపార పారంబు, నరయంగ నెవ్వారి తరముగాదు
రమణి! నీయుదరగ బ్రహ్మాండ చయగుహా, ఘనమోహ తమములో గడవఁగాదు
సౌమ్య! నీ హృదయాబ్ధిచలిత చింతాంబుద, గమనమెఱుంగ నెక్కరణిఁగాదు
శుద్ధ! నీ తారకా సూర్యేందు పావక, భాస్వదాకృతిఁజూడ వలనుగాదు
యఱవు గలవార్ధివీఁచుల నొఱలుప్రజలఁ, బ్రోవవచ్చెదు నౌకనా, దేవి! నీవు
భయమహోన్నత దశయందు వత్తువనుచు, నిలిచియుంటిని నా భాగ్యనిధివి నీవు.

(సశేషము)

# మావాడి ఆలోచనలు

గంటి - సూర్యనారాయణశాస్త్రిగారు,

నాన్నా ! నాన్నా !

ఏమిరా రామం ?

అకాశంమీదచుక్కలెలాగున్నాయో చూడు.

ఎలా గున్నాయిరా ?

మన మేస్టరుగారింట్లో వేల కట్టేరు చూడు, గాజుబంతులు, అలాగున్నాయి.

అయితే యివి వేలకట్టేరంటావా ?

అవును నాన్నా !

ఎవరు వేలకట్టేరు ?

బమ్మదేవుడు.

ఎందు క్కట్టేడు ?

చందమామకు పెళ్లి చేసేడు.

ఎప్పుడు ?

గైరమ్మ పండుగొచ్చిందిచూడు. ఆవేళ పెద్ద చందమామొచ్చాడు. అవేళమనింట్లో, చలివిడి వుండలు పె...ద్దలు చందమామంతేసివి చేసేరూ. అవేళ. తెలిసిందా ?

అయితే చందమామకు పెళ్లిఅయిందని నీకేం తెలుసు ?

నాకా, నాకా ! తెలుసు. నేను రామతీర్థంలో రాముణ్ణి. నాకు తెలుసు.

అయితే ఆపెళ్లి నువ్వుచూసేవా ?

చూచాను నాన్నా! ఎద్దుమీదయీశ్వరుడు, పార్వతీ కూర్చున్నట్టు— చవలపిల్లిమీద చందమామ, పెళ్లాం కూర్చున్నారు. సాయంత్రం నువ్వు ఆఫీసునుంచి వస్తావు చూడు. అలాటప్పుడు అల్ల అయ్యకోనేరు లోంచికాదునాన్నా!-అయ్యకోనేరు గట్టు మీద ఆంజనేయస్వామిగుడి పక్కనుంచి; నాన్నా ! ఆంజనేయులు కోతిలాగున్నాడేమిటి నాన్నా! చెప్పు? కోతికెవళ్లైనాదండం పెడతారా? ఆవేళో బూచివాడుకోతిని తెచ్చిఆడించాడు కదూ!"కోతీ నాముక్కు దూల" అన్నానుకదూ! దానికి దణ్ణం పెట్టలేదేమీ?

అది తరవాత చెబుతానుకాని, ఆంజనేయ స్వామిగుడి పక్కనుంచి ఏమిటి ?

అదా! గుడిపక్కనుంచి చందమామ బయిల్దేరేడు. చవలపిల్లిని తోలుకుంటూ మెల్లగా కిత్తబాబు యిల్లూ, ఆలూరి వారియిల్లూ, చిన్నబజారు, మనమిఠాయి దుకాణం, గంటస్తంభం, మేస్టరుగారి యిల్లూ,మన అచ్చాఫీసూ, నాన్నా! మహాదేవం జీడిపప్పు తెచ్చేడూ ?

తెస్తాడులే. చెప్పు?

అచ్చాఫీసూ, కాఫీహోటలు, ఆస్పత్రి యివన్నీ తిరిగి మన యింటిదగ్గర కొచ్చేడు. వూరేగేడు.

అకాశంమీద మతాబాలూ, చిచ్చుబుడ్లూ

కాల్చేరు నాన్నా! ఆపువ్వులు మన యిల్ల మీాద పడిపోతాయిగదా! కాలిపోవూ ?

అవి మతాబాలు, చిచ్చుబుడ్లు కావురా. అవి చుక్కలు క్రింద పడిపోతుంటాయి. కిందికి రాగానే మాయం అయి పోతాయి.

చుక్కలా! అదేవిటి నాన్నా! చుక్కలంటావు? గాజు బంతులు బద్దలయిపోయి పిండై పోతాయికదూ !

అవును. పిండి ఆరపోస్తే యెంత తెల్లగా వుంటుందో, అలాగుందిచూడుయీా వెన్నెల.

వెన్నెలకాదునాన్నా ! చందమామకు వెళ్లి. చల్లనిచందనంపూస్తున్నాడునాన్నావూరే గింపు కొచ్చినవారందరికి. అవును కాదూ! అవును.

నాన్నా! అవేళో పుస్తకం తెచ్చేవు. దాని పేరేం నాన్నా! వెన్నెలా ?

కాదు.

కాదూ? కాదూ? నువ్వు చదువుకున్నావు ఆభాషేమిటి ?

సంస్కృతము.

ఆభాషలో వెన్నెలకేమంటారు నాన్నా? చంద్రి ... ...

ఆఁ ఆ; అదే. చంద్రిక. చంద్రిక, చంద్రిక ఎంతబాగుందో.

---

## డోలావిహారిణి

శంకరంబాడి- సుందరాచారిగారు,

వదనరంగములోన చెదరిన ముంగురుల్ చెలువార నాట్యంబు సలుపుచుండ
పైట చెరఁగుజారి, పవనవేగముచేత వేడుకగాఁ దేలి యాడుచుండ,
కొప్పులో ముడిచిన గుండుమల్లియపూలు కమ్మని తావులఁ జిమ్ముచుండ,
అలసి, సొలసియున్న అందమా మేనిపైఁ జెమ్మటబిందువుల్ గ్రమ్మియుండ
చూడ్కులరమోడ్పులను గల్గి సోలుచుండ, ఊఁగియాడుట నొకకొంతయొడలుమఱచి,
సుందరారామసీమల నుదతియొకతె డోలికను నూగుచుండెను లీలగాను.

---

## "అవును, నిజమే"

శ్రీ కవిభూషణ - శతావధాని - విద్వాన్,
దోమా - వేంకటస్వామి గుప్తగారు,

"సుందరమ్మా! యిదే మన్యాయమే? రాత్రిపూటఁగాక పగటిపూటగూఁడ భార్య భర్త ఒంటరిగా వేళ్ళాకోళాలేనా?"

అనుకేక యత్తగా రురుమఁగానే పడమటింటిలోనుండి, నవయౌవనవతియు, సుందరాంగియు నగు సుందరి బయట వచ్చెను.

అంత నత్తగారగు పానకాలమ్మ యామెను సమీపించి, "ముందున్నది ముసళ్లపండుగ ఇప్పుడే యింత మురిసిపోనేల?"

అనునంతలో గదిలోనుండి, "అది యేమంత చేయరాని పని చేసిన దని యంత యురుముచున్నా"వని మెల్లగాఁ బల్కఁబడినది. ఆమాటను పానకాలమ్మ వినకపోలేదు. కనుక, ఆమె తక్షణమే, "సరే! నాయనా! పెండ్లామును వెనుకవేసికొని యశ్లే వచ్చుచుందువులే. ముందుముందు నీ వీలాటి రీతులవల్లఁ జెందఁబోవు సౌఖ్యాలు నేనుగూడఁ జూడఁగలనులే" అనియె. అందులకు సుందరీకామేశ్వరులు క్రుక్కుమిక్కురుమనకుండిరి.

కామేశ్వరరావు వయసునఁ జిన్నవాఁడయినను ఆంధ్రభాషయందు పాండితి గలవాఁడు. మంచి కవి. ఆయన యదృష్టము చొప్పున వినయము, సౌందర్యము, సౌకుమార్యము, సౌశీల్యము, విద్య, బుద్ధి, చాకచక్యము గల్గి, సుందరమ్మ యను పేరి భార్య లభించినది. ఆమెయొక్క వ్రతమేమన, నెల్లవితములఁ బ్రయత్నించి పతి కానందంబును హితంబును గల్గించుట. దైవవశమున నామెకు నాంధ్రభాషయం దభిరుచి మెండుగానుండెను. భర్తయొక్క కవిత్వసంపదను గాంచి యానందంబు నొందుచు, తన భర్త యాలక్ష్మీభర్తయేకాని మఱొండుఁకాడని భావింపుచు, అతనికిఁ దా నిల్లాలయినందులకుఁ దన పూర్వపుణ్యమును గొనియాడుకొనుచుండెను. అత్తగా రెన్నిరీతులుగా గొణగుచున్నను గినుకనుగాని, నిరుత్సాహభావముగాని చెందక భర్త కెల్లవితములయిన సపర్యలను గావించుటయే తన పరమావధి యని నిశ్చయించుకొని, యతని పాలిటికీ భూలోకంబునే స్వర్గంబు గావించె. ఈ సంగతివలన సుందరమ్మ యత్తగారి సపర్యయం దేమరియుండె ననరాదు. అణుమాత్రమయినను లోపము రాకుండ అత్తగారిని సేవించుచుండెను. అట్లయినప్పుడు అత్తగారి కామెయందుఁ గోప మెందులకందురా? అందుల కిది కారణము.

సుందరమ్మ తగుపాటి విద్యావతియగుటంజేసి మహాపండిత కవీశ్వరుండయిన భర్తయొక్క విద్యాకవిత్వ వైశద్యములను గుఱుతించి, "యిటువంటి మహనీయుని సన్నిధానము నాకు లభించినది. కవిత్వము యోగవిద్యకాని యన్యముకాదు. అందును ఆంధ్ర

భాష అమృతములో సమానమయినది. నేనేల కవయిత్రినై నాజన్మ సార్థకమొనరించు కొనరా" దని, యతనికిఁ దన యభిప్రాయము నతివిధేయముగా మనవిచేయఁగా, నందులకుఁ గామేశ్వరరావనుందానందంబునొంది, నాఁటి నుండి యామెకు కవిత్వసాహిత్యంబుల సభ్యసింపఁజేయఁ బ్రారంభించెను. కొన్ని నాళ్లలోనే యామె యందద్భుతకౌశలము గడించెను. కనుక నిప్పుడు భర్త వ్రాయు గ్రంథములు, వ్యాసములు మున్నగు వాని విషయంబున, నతనికెంతయో సహకారిణిగా నుండుచు, నింటిపనుల నెఱవేర్చినపిమ్మట, తక్కిన కొంద అమ్మలక్కలవలె ననవసర లోకాభిరామాయణంబులతోఁ బ్రొద్దు పుచ్చక, భర్తసన్నిధిని జేరి యతని కవితా విషయంబులను గమనింపుచుఁ దాను విద్యాభివృద్ధి నందుచుండెను.

ఇట్లుండుటం జేసి, యీవిధానము నెఱుఁగని యామెయత్తగారి కీవిషయము కరకరగానుండుట వింతకాదు గదా ?

ఇంతలో కామేశ్వరరావుబయటకురాఁగా, ఆమె యతనినిగాంచి, "ఏమో నాయనా ! పెద్దముండ నున్నాను. నేనుండువఱకయినను ఈయిల్లు సంసారపుటిల్లుగా నుండనీ"యనియె. అందులకు కామేశ్వరుఁడు కొంచెము చిరాకుతో "అమ్మా ! నేను పూర్తిగా తెలివి తక్కువవాఁడ ననియా నీయభిప్రాయము ?" అనియె. నావుడు తల్లి "ఏదో ? చూచుచున్నాను గదా ! " అనియె.

అప్పుడు కొమరుఁడు నవ్వి" అటయిన, సుందరీ ! నేనుచెప్పిన పనులన్నియు అత్తగారియొద్దనే కూర్చుండి చేయుచుండుము. అత్తమానమును నాకడనే యుండకున్నచో నీకువచ్చు నష్టమేమి ?" అని భార్యతో ననియె.

ఆమె యాపని తనకిష్టమయినను కాకపోయినను జేయవలసియుండె. ఆయింట, అత్త, భర్త, తాను. ఇంటిపని యెంతపాటిది? సుందరమ్మ త్వరలో నింటిపనిపాటు ముగించుకొని, అత్తగారికిని భర్తకును పాదసేవ గావించి, ఇంతకు ముందువలె భర్తకడ నంతగా నుండక అత్తగారి మంచెముకడఁ గూర్చుండి, భర్తగారి యాజ్ఞచొప్పున వ్రాఁతపూఁతలు పాఠమును గావించుకొనుచుండెను.

అట్లామె హృదయక్షేత్రమునందు భర్తచే నాటఁబడిన విద్యావల్లి దినదిన ప్రవర్ధమానమై తుదకు సాధ్వీనీతికథావళియను గద్యపద్యమయ గ్రంథరూపముగాఁ బరిణమించె. ఆగ్రంథము ఆంధ్రమహిళా సారస్వత సమాజమునకుఁ బరిశీలనార్థ మంపఁబడియె.

ఒకనాఁడు తల్లి, కొమరుఁడు, కోడలు, నట్టింటఁ గూర్చుండి, సల్లాపములాడు కొనుచుండిరి. అప్పుడు పోష్టుబంట్రోతు వచ్చి, " కామేశ్వరరావుగారూ ! సుందరమ్మ

గారెవ్వరండీ ?" యనియడిగెను. "ఎందుకు?" కని రావుగారు ప్రశ్నించిరి.

ఆమెగారిపేర నూటపదునాలు రూపాయల ఇన్సూరువచ్చినది.

అప్పుడు "ఈమెయే" అని కామేశ్వరరావు సుందరమ్మను జూపఁగా, పోష్టు బంట్రోతా యిన్సూరుకవరు నామె కొసంగి, దస్కతుగైకొని వెడలెను.

సుందరమ్మయాకవరు భర్తగారిచేతి కీయఁగా, అది యాంధ్రమహిళావిద్యాభివర్ధనీ సమాజమువారు పంపినదై యుండెను. అందు నూటపదునయిదు రూపాయల నోట్లును ఒక్కరూపాయ టపాబిళ్లలును వెరసి నూటపదునాలు రూపాయలును, ఒక యోగ్యతా పత్రమును నుండెను.

శ్రీమతి ... ...సుందరమ్మ గారికి.

సోదరీమణీ ! నమస్కారములు. తాము పరిశీలనార్థమంపిన "సాధ్వీనీతికథావళి" యను పొత్తమత్యుత్తమముగా నున్నది. భాష, కల్పన, నీతివిధానము, ముస్నగునవిచాల మనోహరముగా నున్నవి. ఇటువంటి యుత్తమగ్రంథమును వ్రాయుట నిక్కముగా లోకోపకారం బగును. ఇట్టి యమూల్యమయిన భాషాసేవ నొనర్చిన మీకెంతయో సత్కారము గావింపవలసి యున్నది. కాని ప్రకృతము, ఈ సమాజమునకు నుండు వసతిని బట్టి రు ౧౧౪ర్లను బంపికొనుచున్నాను. వచ్చువత్సరపుఁ బరీక్షలకు మిమ్మునొక యధికారిణిగాఁ గైకొను నభిలాష మాకుఁ గలదు. అంగీకరింపవలయునని ప్రార్థన.

అని కామేశ్వరరావుగారు చేదువుచుండఁగా నతని తల్లియగు పానకాలమ్మకు కోడలినిగూర్చి యమందానందంబొదవి, తానామె నింతకుముందు పెట్టుచుండిన తొందఱలకు పశ్చాత్తాపంబుకల్గి, చటాలున సుందరమ్మ నొడిలోనికిఁ బొదివికొని "మా యమ్మ గదవే ! యింతటి యోగ్యురాలయిన నాతల్లిని నిన్నెంతో మనస్సునొవ్వ నాడితినే. పాపిష్ఠిదానిని. వ్యర్థముగా నేండ్లునిండినవి" అని వలవలనేడ్చి "బంగారు తల్లీ ! నన్ను మన్నింపు" మనియె.

"అందులకుసుందరమ్మసహజభక్తికృతజ్ఞతాపురస్సరంబుగా కన్నుల నీరునించికొని", "అత్తమ్మా! మీ రట్లనవచ్చునా? అంతయు మీ యాశీర్వాదబలమే" అనియె, అప్పుడు పానకాలమ్మ కోడలిన క్కున కదిమి కొని పుత్రికా ప్రేమతో ముద్దాడెను.

ఇక కామేశ్వరరావునానందమునకు మితి యుండునా ? అతఁడు "సుందరీ ! నూటపదునాల్గకు నగలా ? చీరలా ?" అని నవ్వుచుననియె.

అందులకు సుందరమ్మ "నాకునసరావ భరణములు మీరే. అయినను నేదో కొను మనుచున్నారుగనుక నేను గ్రంథములు

గోరెదను. అటుపిమ్మటను గేటులాగును జూచి కొన్ని గ్రంథములపట్టీ తయారుచేయుదము గాక.

ఆ ఖర్చు నీయవలసినవాఁడను నేనుగదా? యని కామేశ్వరరావనియె.

మనలో భేద "మేమున్న" దని సుందరమ్మ యనఁగా, ప్రేమముప్పొంగి కామేశ్వరరావామె చెక్కిలి నొక్కవలసి యుండెను గాని, తల్లియుండుటం జేసి యట్లుచేయ వీల్పడ లేదు.

అప్పుడు పానకాలమ్మ తన మెడలోని బంగారుగొలుసుఁ దీసి కామేశ్వరరావుచేతి కిచ్చి, "నాయనా! యిది నాకేల? అమ్మాయి కేమయినఁ జేయింపుము" అన్నది.

అప్పుడు సుందరమ్మ:—"అత్తమ్మా! నాకాయనగారే భూషణము. ఇంకబంగా రెందుకు? అనియె."

అప్పుడు పానకాలమ్మ "సుందరీ! నిన్నడుగ లేదు. అట్లె మాటాడకు" అని కౌఁగిటఁ జేర్చికొనియె.

"ఔరా! కవితాప్రభావము. ఆంధ్రభాష అమృతభాష తెలిసికొని యానందింపవలెను గాని." అని కత వినిపింపఁగా శ్రోత "అవును నిజమే" ననియె.



మహిళా విశ్వవిద్యాలయము, పూనా.

# దుర్యోధనోపాలంభము

విద్వాన్. వేదము — వేంకటకృష్ణశర్మగారు,

ఉ. పొత్తులసొత్తు దాయలకు భోగవిదూరము గాఁగఁ జేసి, వా
రెత్తఱినేఁ బయింబడుదు రేమొ యటంచుఁ దలంచి, ఘోరస
త్త్వాత్తమహాటవీస్థలుల కక్కట! వారలఁ ద్రోలి, సౌఖ్యసం
పత్తున మత్తునం దిరుగ భావమునం దిసి! సిగ్గుఁ దాల్పవొ ?

ఉ. అచ్చపు వంశమందలఁప, వాదిమపూరుష వర్తనంబులన్
మెచ్చవు, ఖ్యాతినింగనవు, నీతిపథంబును జూడ, వార్యులు
న్నిచ్చలుసేయు బోధములు నీచెవిఁ జేర్పవు, దుష్టబోధముల్
మచ్చికవిందు, నీకిఁకనుమాసు నెరాక విపత్తు లల్పుఁడా !

ఉ. పంచనఁ గొన్న రాజ్యము ధ్రువంబుగ నాయదిగా యటంచు, సి
గ్గించుక లేక తించు సుఖియించుటె కాక, దురాత్మ! కానలన్
సంచరణంబొనర్చు ఘనసత్త్వులఁ, దోడుల, బాండుసూనులన్
గ్రించుఁదనంబుతోడ నుడికింపఁగఁ బూనితి, వెంత దౌష్ట్యమో ! !

ఉ. పాతకమార్గమూని, సమభాగులఁ, బాండుకుమారులం, గటా !
పైతృకరాజ్యలక్ష్మి కకృపామతిదూరులఁ జేయఁజూచె, దీ
చేఁతలు సెల్లునే? వినిన శిష్టులు మెత్తురె? శత్రులేనియున్
రోఁతవహింపరే ?, యశమునుం గొని తెచ్చునె ? యో కృతఘ్నుఁడా ! !

ఉ. ఈసునఁ బాండునందనుల కెగ్గొనరింపఁగఁ బూనుటెల్ల వి
శ్వాసము మీఱఁ గత్తిపయి సాము నొనర్చుటగాదె ?, దీనిచే
వాసియు వన్నెయుం గలిగి, వర్ధిలనెంచితివేమొ ?, రిత్త, లా
యాస లటంచు నెమ్మదిని నారయవేమొ ?, కులప్రదాహకా! !

ఉ. పాండునృపాలసంతతికి వంచనముం బొనరించు దుష్ట వై
తండికమార్గమూని, విబుధప్రవరుల్ వచియించు నీతు, లీ
వొండొకరీతిగా నరసి, ఓగులు సెప్పినరీతి నీతియం

చుండెద, వెంతియోగ్యుఁడవు ?, యొప్పమి ముప్పునకే యగుంజుమీ ! !

ఉ. ఆదిని సంధికై యదుకులాగ్రణియంతటివాఁడు వచ్చినన్
గాదనిత్రోసిపుచ్చితివి కావరమూఁని, త్రిలోకపూజ్యపా
దోదితరూక్షవహ్ని నిను సుక్కడఁగింపక మానునొక్కొ ? నీ
కేదిఁకదిక్కు ? ప్రాణముల నేగతిఁ గాచుకొనంగ నేర్తువో ?

ఉ. అంగనృపాల జల్పములకంతము గల్గదు, సౌబలాక్షతం
త్రాంగము మొక్కవోవదు, ప్రియావరజాతికయుక్తిమార్గముల్
భంగమునొందఁ, వా గురునపత్యముపగ్గెయుఁ దగ్గలేదు నీ
రంగు బయల్పడున్ సమరరంగమునం దటు చక్క నిల్వుమా !

చ. నిలిచినఁజాలు, శంకరుఁడె నీకయి యుద్ధముసొచ్చెనేని, కా
వలమడఁగించి, త్వత్తనుజ పౌత్త్రి సహోదర మంత్రియుక్తమా
బలము రణావనిం జదిపి—— బాహుబలంబెసలార, ధాత్రికిం
బలియిడు నిన్ను నన్నరుఁడభంగురగాండివ సత్త్వమేర్పడన్.

చ. కలిపురుషావతారమవు, గాఢమదోత్కటమానసుఁడవున్,
దులువతనాలగేహమవు, దుర్గుణసంతతి కాటపట్టువున్,
గులగతగౌరవాపహరణుండవుఁ, గుత్సితధీయుతుండవున్,
బలువల మెప్పులంగని నభంబును ముట్టెడు పాతకుండవున్.

చ. పరధనదారలం గొనఁగ భావమునం దలపోయువారికిన్
నరకమునిక్కమంట వినినాఁడవొ ? లేదో దురాత్మ ! పాండుభూ
వరసుతులన్ననో తలఁప భ్రాతలు జ్ఞాతులుగారె నీకు ? నా
పరమగుణాఢ్యులం బఱచివారలసొమ్ముహరింపఁ జూతువే ?

చ. అఱుగునటంచు నెంచితివె ? యక్కట ! వారలసొమ్మునీకుఁ, బెం
పఱ నదె నిన్నుఁజంపు విసమా, వసమా విధిత్రిప్పలేఁగ ?, నీ
కఱకు కసాయిడెందము వికావికలై త్వరలోన నెంతయుం
దఱికొను నగ్నియందెపుడొ దగ్ధముగాక తొలంగదజ్ఞుఁడా ! !

——:o:——

# చంద్రకళ

జమ్ములమడక-మాధవరామశర్మగారు,

పారమేశ్వరసృష్టివిశేషము లనంతములు. ఇచ్ఛాకల్పితమగు నీవిశ్వతత్త్వము దురూహము. కర్మానుబద్ధములగు జగద్విలాసము లూహాతీతములు. గుణమయ ప్రకృతి పరిస్పందములు పరిణామక్రమమున ననంత లీలాహేతువులు. పారమేశ్వరేచ్ఛా విలాసము స్పంద కారణములు. ఇచ్ఛాసృష్టి హేతు వగమ్యము, అతిబౌద్ధము, అతిలోకము, ముముక్షువులగు తత్త్వబుభుక్షువుల కిచ్ఛాసృష్టి పరిశీలన మావశ్యకము కాదు. ఈ యాంతరాళికానంత విశ్వతత్త్వమును గ్రసించుటకు సాధకలోక మన్వేషణము చేయుచున్నది. లక్ష్యశుద్ధిగలవారు గమ్యము చేరఁ గలుగుచున్నారు. సంప్రజ్ఞాత మధిగమించి శ్రద్ధాళువులై తత్త్వసాధనకుఁ బ్రయత్నించుచు బూనిక గలవా రున్మనీభావమున నిచ్ఛా రహస్యమును దెలిసికొనఁగలుగుచున్నారు. అట్టి ముక్తులయఖండానందమును లోకము పొందఁ గోరుచున్నది.

నిఖిల ప్రాణి సమూహమును సుఖా కాంక్ష గలిగియున్నది. దుఃఖమును విడువవలయునని దలఁచుచున్నది. ఇట్టి ప్రవృత్తి నిసర్గసిద్ధము. అందు దుఃఖ నివృత్తికగుప్రవృత్తి బలవత్తరము. లోకమునకు సుఖమును గలుగఁ జేయు సాధనసామగ్రి కావలయును. అట్లే దుఃఖమును ద్రోసివేయఁగల సామగ్రియు నపేక్షితము ... సుఖమైంద్రియికము, బాహిర వస్తు సాపేక్షమును, బహిర్వస్తువనిత్యమని నిశ్చితమె. వాని సుఖ మసత్య మన లేముగాని శాశ్వతము కాదు. కాని, శాశ్వతము సత్యము, అఖండము నగు సుఖమును ప్రాణి యపేక్షించును. అతీంద్రియమగు నిది సుఖము కాదు. అలౌకికమగు నానందము. శాశ్వతమగు సత్యస్వరూపము. అఖండమగు నానంద రసము.

పారమేశ్వర రూపమిదియే. ఇయ్యది పరిపూర్ణజ్యోతి, స్వయంప్రకాశము, సర్వాధారము, సర్వేశ్వరసృష్టి, దయాకలితము, నిఖిల ప్రాణికోటియు స్వరూపానందముఁబొందియాత్మ తేజమున నైక్యమొందుట పరమావధి.

ఐశ్వరరూపము జ్యోతిర్మయము, జ్యోతి ప్రాణప్రదము, తేజోవియుక్తము, నిర్జీవమె. సృష్టిసర్వస్వము తేజఃపూర్ణము, తేజోమయమె, చేతనమున నచేతనమున నీ తేజము పరిపూర్ణత్వ మొందియున్నది. తేజస్సాహిత్యమె ప్రత్యక్షహేతువు. వ్యక్తము నవ్యక్తమునై యీ తేజోరూపము విలసిల్లును. బాహిరజడ పదార్థముననిదియవ్యక్తము. తదితరము నవ్యక్తము, వ్యక్తిలోఁగూడ త్రైవిధ్యము గలదు. సృష్టిరాహిత్యము, కల్పనావైధుర్యముగల చేతనమున నిదివ్యక్తము. ఆత్మధర్మమగుసృష్టికిఁ గల్పనాచాతుర్యము గలిగించు

చేతనధర్మము నవ్యక్తతరము. అతీంద్రియ నిర్భరస్వాత్మానందమున సంలీన మయి విశ్రాంతినొందు చేతోవృత్తిగలిగి యున్న నీభావనిత్యతృప్తు లందు వ్యక్తతమము. నిత్య ముక్తతఁ బ్రకాశించుచు లోకకళ్యాణ మాపా దించు లోకాతిగుల తేజమునకు విశిష్ట ధర్మ ములు లేవు. అరూపములు జ్యోతి రభిన్న ములు. సాధకలోకమున కుపాస్యమూర్తులు. అఖండతత్వసామరస్యముతోఁ గూడికొను నీ మూర్తులు త్రైవిధ్యమునఁ బ్రపంచ క్షేమ మా పాదించునవి. ఈ మూర్తిత్రయ సామ రస్యము శివశక్త్యాత్మకము. అందు సౌర తేజ ము జగచ్చక్షువు నిఖిలజీవాతువు, ఆగ్నేయ జ్యోతి యనితరసాధ్యసర్వ సమ్పత్ప్రదము. చాంద్రమనిర్వచనీయఖ్యాతినిలయము. ఈ త్రితయసంపుటిలో శివతత్వస్ఫూర్తివిలసన ముపాసకుల కింద్రియగోచరము.

అఖండ తేజస్స్వరూపము భయాత్మకము. శివశక్తి సమరసము. బహిర్ముఖమై ప్రవృత్తి హేతు వగునది శక్తితత్వము. అంతర్ము ఖము నివృత్తికారణమగునది శివతత్వము. శివతత్వముజ్ఞేయము. శక్తితత్వముపాస్యము. శివశక్తులతత్వ మనిర్వచనీయము. అచట భేదము లేదు. సృష్టిలోని పదార్థసముదాయ మంతటను శక్తివిలసన మనుస్యూతమని వేఱ చెప్పనక్కఱ లేదు. ధర్మముశక్తి. ధర్మిశివ రూపము. అంతట నిదియే వ్యవస్థ.

శక్తియే యుపాస్యమనుట యడ్డులేని మాట. మహాలక్ష్మి, సంపదుపాస్య. మహా సరస్వతి, విద్యారాధ్య. మహాకాళి, శక్తి సముపాస్య. సకలసిద్ధి శక్తి స్వాయత్తము. సంపద్విద్యాశక్తుల కుపాస్యములు మహా శక్తిభిన్నములు కావు.

ఈ మహాశక్తి చాంద్రీ (జ్యోత్స్నా)రూపి ణి. సహస్రారసుధా సాగరమునఁ బీయూష మాస్వాదించు యోగిధ్యేయమిారూపమె. ఈశక్తియమృతస్యందిని. అక్షరరూపిణి.

లోకముపాసనచేఁ గాని తరింపదు. ప్రస్తుత కాలమున వాగీశ్వరీధ్యానమె తారకము, అక్షరరూపిణియగు నాదిశక్తి వాగీశ్వరీవిలా సమున లోకము ననుగ్రహింపనున్నది. సుధా మయి, చంద్రిక నుపాసించు వారక్షరతత్వ మున నిరూఢప్రజ్ఞకలిగి పరిపూర్ణత్వమునొందఁ గలరు, శ్రీవిద్యారూపిణి చంద్రకళ వృద్ధిహ్రా సములు లేక సాదాఖ్యానిత్యశోభ గలది. చంద్రి కాతత్వము శ్రీవిద్య, సాదాకళ. రహస్యాతిర హస్యమగు నీపరిపూర్ణతత్వముపాసకులకగ మ్యము కాదు. కళారహస్య మతినిగూఢము చంద్రికాసముపాసకుల కది సువ్యక్తమగును. అమృతలాలను లక్షరాసక్తునంద కాంక్షులు. జగన్మాత చంద్రిక నారాధించి నిత్యముక్తుల గుట కిది యమూల్యతరుణము.

---

# అనునయము

సామవేదం - జానకీరామశర్మగారు,

"ఓయి నిషాద! నిన్ గన నయో చలియించెదు మేను ప్రాణముల్
దీయకుమీ" అటంచు నతిదీనత నిట్లు కురంగి భీతిఁ గ
న్దోయి స్రవించు బాష్పములతోఁ గడు ప్రార్థన సల్ప జాతిదో
నీమెద! విల్లునెక్కిడఁగ నేసరిఁజూతువు నిర్దయాత్మతన్.

ఈ సెలయేటిప్రాంత జనియించిన పచ్చికతుత్తుఁదీరగా
మేసి, మృగీసుధామధురమేదుర నవ్యవిలాసదృష్టి జా
లాసవ మాని మైమఱచునప్పటి కీ విలయమ్ము గూర్ప, నా
చేసిన దేమి? సుంత దయఁజేసి శరంబుపసంహరింపుమా!

అనయము సామగానసుధ లాని పునీతమొనర్చుకొన్న మా
తనువులకా భవచ్ఛరవిదారణజన్య కవోష్ణరక్త ధా
రణమొనరించు దుఃస్థితి? పురాకృతదుష్కరకర్మకారణం
బని సయిరింప జీవములయందలివాంఛ అజేయమా గదా!

"అరణమొసంగఁబూనెనట! ఆత్మజ! క్రొత్తగ నత్తయింట కాఁ
పుర మొనరింపబోవు తలపున్ మది నిల్పి తపోధనుండు, నే
విరహమెటోర్తు" నంచు విలపించు కురంగి! సమీపమందు నా
మరణముగాంచి ఎట్టిదశ ప్రమగ్గునో! యెంచి కృపన్ వహింపుమా!

ఈ మునిపల్లె ప్రేమను వహించినదాట తపోధనోత్తముల్
మే మరుదెంచునంతకు దమిం దమ పుత్త్రుల పోలె, అంకమం
దోముచు శాబకప్రతతి నుంఛతృణమ్ములమేపి, మాకునై
ఈ మలుసంజెవేళ తపియింతురు మార్గములంద కాంచుచున్.

అనుదినమచ్చటచ్చటఁ దృణాంకురముల్ శ్రమకోర్చి తెచ్చి, కం
దిన కరపల్లవమ్ముల నతిప్రియమూని తపస్వికన్యకల్
పనివడి మేపుచుండ, అనపాయత నాశ్రమజీవితమ్ములో
మనెడు మముం గృపారహిత! మార్గణజాలము పాలొనర్తువే?

——:o:——

## " కొండవీటివిజయము "
### " పునర్విమర్శనము "

"నహి ప్రియం ప్రవక్తు మిచ్ఛన్తి మృషా హితైషిణః. " (భారవి.)

౧

మేము ప్రకటించిన "కొండవీటివిజయవిమర్శనము" పయి మాసోదరీమణి శ్రీకృష్ణవేణిగారు వ్రాసిన ప్రతివిమర్శనను చూచుభాగ్యము లభించినది. ప్రతివిమర్శనమునుబట్టి ప్రతివిమర్శురాలికి గ్రంథము మంచిచెడ్డలయెడఁగాక, గ్రంథకర్తయెడ నెక్కుడు పక్షపాతముగలదని తోఁచుచున్నది. మాకట్టి పక్షపాతములేదు. నిష్పాక్షికముగ వ్రాసిన మావ్రాత లామెకసందర్భములుగ తోఁచుట యెంతమాత్రము వింతకాదు.

౨

శ్రీ. "శాస్త్రి"లుగారి గ్రంథమున కొండవీటి ముట్టడి, దానికగు నేర్పాటులు వర్ణింపఁబడియుండుట చేతను, దుర్గాధిపతితో కృష్ణదేవరాయలకు నెట్టి యుద్ధము జరుగకపోవుటచేతను" విజ.వి."మనుటకంటె ముట్టడి" అనుటయే యుచిత మగునని మాయభిప్రాయము. మఱి కాదన్నవారి నంగీకరింపఁజేయుట కష్టము.

కథప్రధానత్వముగల యికావ్యమున ముఖ్యమగు కథాభాగముఁ జమత్కారము కానరాదని మేమువ్రాసితిమి. కృష్ణవేణమ్మగారు దానికి మేఘసందేశము సాటి తెచ్చిరి. కాని యందుఁ గథకుఁ బ్రాధాన్యములేదు. భావమే యందు ముఖ్యము. ఇందుఁగథకులేని ప్రాధాన్యము వర్ణనలకున్నచోఁ బ్రయోజనమేమి?

3

వీరరస మీగ్రంథమునఁ బ్రధానముకావున నడుమ రాయలవిషయమున శృంగారమును వర్ణించుట సరి కాదని మేమువ్రాసితిమి. యుద్ధాలోచనచేసి కొలువు

చక్కా - పద్మావతియమ్మగారు,
సంకా - బాపాయమ్మగారు,

నుండి యింటికివచ్చినపిసపనే శృంగారము వర్ణింపఁబడినది కాన తప్పుకాదని ప్రతివిమర్శకురాలి మతము. కానియిందెట్లును శృంగారము వర్ణింప నవసరములేదు. ఇచట నాయికానాయకుల వృత్తాంత మేమియులేదు. వేణీసంహారమున ద్వితీయాంకమున దుర్యోధనుఁడు భానుమతిని చూచునపుడు వర్ణింపఁబడిన విలాసము శృంగారాంగమనియు, ప్రస్తుతము వీరముప్రధానమగుట దుర్యోధనునియెడ నీవిలాస మననుగుణమనియు నందఱు నొప్పుకొనియున్నారు. అచ్చటఁగూడ "విలాసము" రాజాంతఃపురమునకేగు సందర్భముననే వర్ణింపఁబడినది. దానికిని, దీనికిని భేదమేమియునులేదు. సప్రయోజనము కానిరసమును, దానికి విరుద్ధమగు ప్రకృతరసముతో ముడిపెట్టుటవలనఁ బ్రయోజనము శూన్యము.

౪

రసము ప్రధానమగు కావ్యమున శాస్త్రీయవిషయములడ్డంకులనుట తప్పేమో పండితులే నిర్ణయింపవలెను. శాస్త్రీయవిషయములకొఱకు వేఱుగ శాస్త్రగ్రంథములను రచించుటలెస్స. కావ్యములందు శాస్త్రీయవిషయములు తలనొప్పి నెత్తింపఁగలవో లేవో ప్రతివిమర్శకులే యూహింపవచ్చును. కావ్యము సామాన్యులకుఁగూడ నర్థమగునట్లుండవలెను.

౫

"శ్రీ వరునిన్ సదాశివ విరించుల—"

అనుపద్యమునఁ గ్రమభంగదోషము దుర్నివారము, పోచుటముందో, సృష్టిముందో యాలోచించి మఱి సమాధానము వ్రాయఁదలపడుటలెస్స. పోనిండు; ఆక్రమమునే గ్రహింతుమన్ననదియుఁ గుదురదు. 'కాళీ, వరలక్ష్మి శారద' లనుటయు, గ్రమభంగమే. ఇచటఁ గాళి మొదలగువారిని మీఁదివారి భార్యలుగ

వర్ణించలేదట? వీరు వారికి భార్యలుకాక మఱే మగుదురో? పోనిండు; మఱియు "నవార్ణ మంత్ర మున వరుసగ సరస్వతి, లక్ష్మి, కాళి, బీజము లుండుటచేతఁ కాళీవరలక్ష్మి శారదలఁగూర్చి చెప్ప వలసివచ్చినది" అని ప్రతివిమర్శకురాలు వ్రాసి యున్నది. ఆమె యనుకొనిన పరసయైనను ఇచట గలదేమో పాఠకులు పరికింతురుగాక?

౬

"కవులెనమండ్రు జాతికొకకావ్యము--"

అను పద్యమువలన నష్టదిగ్గజములకుఁగాక మఱి యెవ రికి స్ఫూర్తికలుగునో నిర్ణయింపఁ బాఠకులే యర్హులు, పద్యమున దిగ్గజములయొక్క ప్రసక్తియే లేదట? మఱి యా యెనమండ్రు కవులెవరు?—

పండితకవిసార్వభౌముఁడును పండిత పక్ష పాతియును, విద్యావ్యసనియగు శ్రీకృష్ణదేవరాయల యాస్థానములో నెనమండ్రుకవులే కలరనుటలోఁ గల ప్రమాణమేమి! శ్రీ కృష్ణదేవరాయ లెనమండ్రు కవు లనే పోషించెననుట మాకేకాదు, పాఠకులకుఁగూడ సిగ్గుకలుగఁజేయఁగలదు.

౭

"పెట్టనికోటస్సై గిరులు పేర్చెను జుట్టు మహోన్నతంబుగా" (౧౮)

అను పద్యమునఁ గోటయనుపదముకంటె గోడ యను పదముండుటయే యుచితమని మేము వ్రాసి యుంటిమి.

"గిరులు పేర్చెను జుట్టు మహోన్నతం బుగా"

అను పదములవలన నాయర్థమే స్ఫురించుచున్నది. ప్రస్తుతము కావలసినయర్థము గోడయేయని శ్రీ కృష్ణవే ణమ్మగారు నొప్పుకొనుచున్నారు. ఇట్టియెడ మేమిచట "పెట్టనిగోడయై" యనియుండుట లెస్సయని యనరాదో తెలియకున్నది. ఇచట "కట్టనికోట" అని యుండుట లెస్సయని మే మనలేదు. పక్షాంతరముగ నది చెప్పఁ బడినది. ముఖ్యమగునది "పెట్టనిగోడయై" యని యుండవలె ననుటయే.

౮

"ఖాను లుద్దండులై తన్ను కొలుచు చుండ" (ప ౨-౨)

అనుచోటఁగల యతిభంగమచ్చు తప్పుకాని పొర పాటుకాని యగునట?

తన్ను గాచుచుండ"

అనియే దిద్దుకొనవచ్చునట. ఇట్టిదొకగొప్ప" విమ ర్శనావిషయము" కావట? ఈక్రింది పద్యమున గల పొరపాటెట్టిదో యామెయే విచారించుట మంచిది.

"క. విధిదాట నెవరిశక్యము [పులన్
మధువిద్విషు నంతటివాఁడు మారురూ
బ్రధనంబున శాత్రవుల (ప ౧౪౯)
న్వధియించెన్గాని; యెదురుపడ నేతాను.

ఇచట ౨వ పాదమునందును ౪వ పాదమునం దును ఛందోభంగముకలదు.

౯

కొండవీటియుద్ధమునకుఁ బూర్వము కృష్ణరాయలు స్వయముగ యుద్ధభూమినిదూకి యుద్ధము చేయలే దఁట? అంతయుఁ దిమ్మరుసు చేతిమీఁదనే జరిగిన దట! కొండవీటి యుద్ధము, రాయలు స్వయముగ యుద్ధముచేయుట తటస్థించెనట? కాని పట్టాభిషేకా నంతరము రాయలు దక్షిణదిగ్విజయయాత్రకు బయ ల్వెడలి కృతార్థుఁడై పూర్వదిగ్విజయయాత్రకు బయలు

దేరెననియు, ఉదయగిరి, అద్దంకి, వినుగొండ, కొల్లము కొండ మొదలగు దుర్గములను జయించినపిదపనే కొండవీటిని జయించెననియు, కొండవీడు,రాచూరు, దుర్గములను బట్టుకొనుటలోఁ దిమ్మరుసు రాయల కత్యంత సహకారియయ్యెననియుఁ జరిత్రలు చెప్పు చున్నవి.

౧౦

" దురమున గెల్పె యుంతువని తోయనిధు ల్వరులంచు "

అను పద్యమును విమర్శించు సందర్భమున "వరులనుట యనుచితము'' అనుటకు మారుగ "వరుఁడనుట " అని పొరపాటునఁబడినది. ఇట్టిచిన్న పొరపాట్లందఱికిని సహజములు. శ్రీకృష్ణవేణమ్మ గారి వ్రాతలోను, అట్టివి పెక్కులుకలవు. ఇచట "తోయనిధి వరుఁడనుట'' యే యుచితము. స్వయంవర సన్నాహమే జరుగుచున్న దనుకొనిన నాఁడును, "తోయనిధుల్ '' అను పదముననే దక్షిణోత్తర జలరాశులు గతార్థములగుటచే తిఱిగి వానిఁజెప్పుట యనుచితమగును. ఇచట " సేనలనెడి వేలుసము ద్రములు స్వయంవరమునకు వెడలినట్లు '' వర్ణిం చుటయే యుచితము.

౧౧

౧౮౮ మొ॥ ౧౯౨ వఱకుఁగల పద్యములందుఁగల వేందాతోపన్యాస ముచితముగలేదు. మఱియు నది నిర్వహణము దగ్గఱిది. ఒకరసము నారంభించి వేఱొక రసములో గ్రంథమును సమాప్తిచేయుట సరికాదు.

ఈవేదాంతోపన్యాసము కృష్ణదేవరాయలు వీర రుద్రగజపతికిఁ జేసినట్లుగాఁ దలచి శ్రీకృష్ణవేణమ్మ గారు ఏవో యపూర్వార్థకల్పనములను సాగించిరి. ఇది గజపతిమంత్రి గజమంత్రికిఁజేయు హితోపదేశముకాని వేఱుకాదు. దీనిఁబట్టి కృష్ణవేణమ్మగారు గ్రంథమును జూచి ప్రతివిమర్శను సాగించిరో, చూడకుండగ వ్రాసిరో విశదము కాఁగలదు.

౧౨

క. అనుచుండఁగఁ జారులునవి
వినయంబున మ్రొక్కి కొండవీటికిజాడల్
జననాయక ? కంటిమటంచన (ప ౨౮)

ఇందు రాజునొద్దకుఁ జారులువచ్చి నమస్కరించి రనుట యుచితమో ? వెళ్లియనుట యుచితమో ప్రక రణముఁబట్టి పాఠకులే నిర్ణయింపవలెను. ఇచట రాయలు, తిమ్మరుసు మాట్లాడుచుండుట సందర్భము.

౧౩

"ద్రవ్యమనుదానికిఁ బదార్థముగలదు'' అని శ్రీ కృష్ణవేణమ్మగారు వ్రాసిరి. పదార్థమును నర్థమని యామె తలంపుకాబోలు. నిఘంటువులలో నర్థముండ వచ్చును కాని యది శాస్త్రీయార్థ ప్రసిద్ధము, నేయార్థ మను దోషముగలది. ద్రవ్యమన ధనమనియే వేగముగ స్ఫురించు నర్థము, అట్టి యర్థమే కావ్యమునకుఁ గావ లసియున్నది.

౧౪

ఔపవిభక్తికములు బహుళమగుటచే "కొండ వీఁడునన్'' అను ప్రయోగము సాధువని యామెతలంపు. ప్రామాణిక ప్రయోగములు చూచుకొవచ్చునట కంటె నిచ్చుటయేమేలు. ఉన్నయార్ష ప్రయోగములను సాధించుటకుమాత్రము'' బహుళగ్రహణమని తెలి యుటలెస్స.

౧౫

"నేర్తురున్ '' అనునవి కిళమీఁది సముచ్చయ మఁట ! నేర్తురుకూడనని యర్థమఁట ? ప్రామాణిక ప్రయోగములను చూపిన బాగుండును.

౧౬

" దీర్ఘాణాంహ్రస్వఃస్యాత్ "

అనునది నిత్యముకాదనిచెప్పి దానివలన "నవల'' అనురూపము సాధించుట విచిత్రము. ఉన్నప్రయోగ ములను సాధించుటకే మనవారట్లు కల్పించిరికాన నిట్టి వానిని దానిచే సాధింపవలనుగాదు.

---

# నాయనా !

బొడ్డు-బాపిరాజుగారు,

చూపిన నవ్వులే మమతఁజూపిన చూపులె నమ్మి చిన్ననాఁ
డే పరమాత్ముఁ డింతటి యదృష్టము కొంగున మూటఁగట్టె మా
పాపని కేటిలోటులని పాడినపాటలు తెచ్చుకొన్న సం
తాపపు మూట లయ్యె ఎడదల్ పొడిసేయఁగ ఈటెపోటులై.

ఇచ్చిన దేవుఁడే మరవఁడేమనవచ్చును ! మెచ్చి చేతి కం
దిచ్చిన జాతిపువ్వు నలరింపకపూర్వమె మట్టిపై చె; ని
క్కచ్చిగ నెవ్వరివ్వమని కాళ్లనుబట్టిరి ? ప్రాణమంతగా
మచ్చిక పెంచుకొంటిమి భ్రమల్ మనవాడని మోసపుచ్చెనే !

పవడపు మోవిక్రేవలకుఁ జారిన చిక్కని బోసినవ్వు ని
క్కవమని పొంగి పోయితిమి కొండకు; బాబునుమ్రింగివేయ చే
రువఁగల కోడెత్రాచునె ఎఱుంగకపోతిమి, చిక్కఁబట్టినం
దపిలిమనమ్ము వానికయి తల్లడమందు పదే పదే పదే.

పెట్టెలు నిండుగా నతనిప్రీతికిఁ దెచ్చిన ఆటవస్తువుల్
ముట్టెడువారు లేక ఒకమూలకుఁ జేరెను; ఉన్నవేళఁగీ
పెట్టుచు గిర్రునందిరిగి పేరిమిగొన్నవి నేఁడు గుండెలో
కొట్టినమేకులై కనులుకుట్టుచు పాపని జ్ఞప్తిఁ దెచ్చెడిన్.

నాయనా!—ఇంక నాపిలుపేల లెమ్ము, కొట్టుకొనివచ్చినాడ విప్పట్టునకును
ఏదియో అడ్డుతగిలి ఒక్కింత కాలము నిలచి మజిలకొట్టుక పోయినావు.

# పిట్ట కథలు

విద్వాన్. కావ్యతీర్థ-మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి గార్లు,

(కవితాసామ్రాజ్యము)

చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవ:—

అనగా అనగా వోహవూళ్లో వో(బ్రాహ్మ డుండేవాడు. ఆయన చేసుకున్న వారికి చేసుకున్నంతమహాదేవా అంటుండేవాఁడు. ఆయన ఒహనా డోహావూరికెళ్లాడు. ఆవూళ్లో వో చెఱువుంది. ఆయన స్నానంచేద్దామని ఆ చెఱువుకెళ్లాడు చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవా అంటూ; అక్కఁడ వో(బ్రాహ్మణ యిల్లాలుంది. ఆమె వోమాదిరిమనిషి. కొంచెం స్వేచ్ఛావృత్తిలో మెలగిన పతివ్రత. ఆబ్రాహ్మ డల్లా అనటం విన్నది. తన్ను గుఱించే అనుకున్నది. నల్గురిలో నవ్వుబాట్లు చేస్తున్నాఁడే అని లోలోన గొణుక్కుంటూ అప్పుడేం చెయ్యటానికి వీలుగాక వోయుక్తి పన్నింది.భక్తిశ్రద్ధలు గన్పడేట్టు ఆబ్రాహ్మడి దగ్గఱికెళ్లి 'స్వామీ పెద్దలు దయచేశారు. మాయింటికి దయసెయ్యాలి భోజానికీ' అని పిలిచింది. చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవా అంటూ అల్లాగే లే అమ్మా అన్నా డాబ్రాహ్మడు.

చిక్కాఁడురా బ్రాహ్మడూ అనుకుంది. ఇంటికెళ్లి వంటంతా చేశి గారెలుగాలుస్తూంది. ఆబ్రాహ్మడికి బెట్టాలని కొన్నిగారెలు విషం గల్పి కాల్చిపెట్టింది. ఇంతలో ఆబ్రాహ్మ డొచ్చాడు చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవ అంటూ, అంతే లే. యివ్వాళౌతుందిలే, అని ముఱిసి పోతూన్నదా యిల్లాలు లోలోన. గారెలుకూడ చెయ్యటం చూశాడు. ఏమి ఆదరణమూ అని మెచ్చుకున్నాడాయిల్లాలిని, తనకు గలుగు విందును గూర్చి చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవా అనుకుంటు.

వడ్డించింది. నమ్మకం పుట్టటానికని అప్పటికి మంచిగారెలే వేసింది. భోంచేశాఁడు తృప్తిగా తనమామూలపాట పాడుకుంటూను. కొంచెం విశ్రమించాడు. అమ్మా వెళ్లొస్తాన్నాడు. స్వామీ! తాము పెద్దలు. రాత్రి కెక్కఁడవుతుందో ఈగారెలు తీసుకెళ్లండీ అని విషంగల్పినగారెలు మూటఁగట్టి యిచ్చింది. చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవ, యీ అమ్మా! అని పుచ్చుకున్నాఁడు. రాత్రి కోవూరుచేరాడు. పగలు పిండివంటలతో భోజన మవటంచేత ఆకలి గాక పడుకున్నాడు. మఱునాఁడు ప్రయాణమై పోతూదారిలో ఒహయేట్లో స్నానంచేశి ఆహ్నికంతీర్చుకుని చేసుకున్న వారికి చేసుకున్నంత మహాదేవా అనుకుంటూ గారెల మూట విప్పదీయ బోయినాడు తిందామని. ఇంతలోకి దైవికంగా ఆగారెలు కట్టిచ్చినామెగారితమ్ముఁడు అక్కగారూరికి బోతూ పిల్లల్తోగూడా అక్కడికొచ్చాడు. ఆపిల్లల్ని చూశినతర్వాతా ఆబ్రాహ్మడికీ పిల్లలకీయ

కుండా తానుదినటం బాగలేదనుకునీ చేసు కున్నవారికి చేనుకున్నంత మహాదేవా అంటూ ఆమూటమూట పిల్లాళ్ళచేతుల్లోబెట్టి తినమని చెప్పి తనదారిన తానుబోయినాడు తన మామూలుధోరణితో; ఆపిల్లాళ్ళతండ్రి అక్కగారింటికిఁబోతూ వట్టిచేతులతోఁ బోవుటం మర్యాదగాదు. ఇవివ్వంటే కుఱ్ఱాళ్ళచేతుల్లోఁ బెట్టవచ్చు అని ఆమూట భద్రపఱచి తిన్నగా అక్కగారింటికెళ్లాడు. మామవచ్చాడని పిల్లలంతా మూగారు. మూటవిప్పి తలా ఒకగారె యిచ్చాడాదరంతో మామ. తిన్నారు. ఎక్కడివాళ్ళక్కడ గింజుకోని చచ్చిపోయినారు. ఇది యేం గ్రహచారమా అని యేడ్వసాగారు యిద్దఱూను. నితాంతానికి యీగారె లెక్కడివిరా అన్నది అక్క. వృాబ్రాహ్మణుఁడు యేటిదగ్గిఱ—, చేసుకున్నవారికి చేసుకున్నంత మహాదేవ అంటూ పిల్లాళ్ళచేతులోఁ బెట్టాడన్నాడు తమ్ముఁడు. ఆయనన్నంత నిజమే అయిందిరా అని ఆగారెలవృత్తాంతఁ చెప్పింది. కథ కంచికీ మన మింటికీ.

---

# సమస్యలు

1. జరమా నీ చరణంబు మాకిదు నుదంచత్సౌఖ్యముం గాదొకో?
2. ఖరపాదాంబుజసేవకన్నఁ గలదే కాణాచి భక్తాళికిన్??

---

(పయిని సమస్యలపూరణములు మాకు జూన్ నెల 1 వ తేదీ లోపుగా జేరవలయును. సరసతరములయినవి రాఁబోవు సంచికలోఁ బ్రకటింపఁబడునుఁ. సంపాదకుఁడు:)



# "మధుబిందు" కలహం

పరిశుభ్రమైన పట్టుతేనె స్వయంగా తీసి సెట్టిగారికి తెచ్చిస్తూండడం మామూలూ ఓ కొండవాడు. 'ఏకపత్నీవ్రత' మన్నట్టుగా— మంచోచెడ్డో ఎవరినో ఒక్కర్నే నమ్ముకోడం ఆచారం కొండవాళ్లకి నాటికి నేటికీ కూడాను. అంచేత అల్లాగ్గా సమ్మకంగా కోవటికి కొండదొరకూ వ్యాపారంసాగుతూ వచ్చింది చాలా కాలం.

యథాప్రకారం ఒహనాడు ఆనపకాయ బుఱ్ఱనిండాపట్టి అప్పుడే తీసిన స్వచ్ఛమైన తేనె తెచ్చాడు. "అబ్బో" శ్రేన్నాళ్లకి! "అంటూ సెట్టిగారు వైవైనే పెదవులపై పల్లవించేప్రేమతో పలకరిస్తూ వెంతనే ఒక్క చుట్టముక్కతో ఆతిథ్యమొసంగినాడు. ఆచుట్టముక్కతో అమాయికపు దొరకి 'అరచేతిలో కైలాసం' అగపడ్డది.

తీర్థప్రజలాగ మూగిన బేరగాళ్లకి చకాచకా సామగ్రి అందిస్తూనే, కాస్త బెదిరించే పెద్ద నోరుకలవాళ్లకు తృప్తి అయేటట్టుకొట్లో కుఱ్ఱాడిని అదరాయించినట్టు నటిస్తూనే, ఉద్యోగస్థుల్లాటి వాళ్ళొస్తే ఉలవలతొట్టి మీద చిన్న పీటచక్కేసి వారిని కూర్చో బెడుతూనే, "నాపద్దెంతయిందోయి?" అని గద్దించేవాళ్లకి చిట్టా చూసి హాజరు జవాబు చెపుతూనే, పైవూళ్లనించి వచ్చినవాళ్లని ధరవరలు కనుక్కుంటూనే,— ఇత్యాదిగా అవధానంచేస్తూ—కొండదొరతో ఆకబురూ ఈకబురూ పిచ్చాపాటీ గోష్ఠి సలుపజొచ్చినాడు వైశ్యశిఖామణి— మహాస్నేహితుడి మీదే దృష్టి ఉన్నట్టు భ్రమింపజేస్తూను. ఈ నంగ తిలాడుండగా:—

కథలో చిత్రకథ

భ్రష్టుకాలమే సమీపించిందో, యోగమే మూడిందో, ఋణానుబంధమే తెగిపోయిందో హేతువారయలేంగాని—కొండవాడు తెచ్చిన తేనెలో ఒకబొట్టు (చుక్క) ఎట్లానో క్రింద రాలింది. దానిమీద ఒక ఈగవ్రాలి కుక్షి నింపుకొంటూంది. ఆ ఈగని కనిపెట్టి చూశి చూశి వెనకపాటునేవచ్చి ఒకతొండ దాన్ని గుటకాయస్వాహా చేసింది. ఈతొండ కోసం పొంచివున్న సెట్టిగారి పెంపుడుపిల్లి దానిపై కురికి మాట తక్కించుకుంది. ఈవాలకంతా పసికట్టిన కొండవాడి కుక్క పిల్లినిడీకొని హతమార్చింది.

సూక్ష్మగ్రాహి అయిన సాహుకారు రోషపూరితుడై కొండదొరనిచావమోదినాడు,తన ముద్దులమార్జాలాన్ని వెధవకుక్క చంపడం వేమని; అయిన పనికానే అయింది, స్నేహం మాట తరవాత చూసుకుందామని నిష్కపటి అయిన కొండదొర కోమటిని పట్టరాని కోపంతో పీఉరేగ్గొట్టినాడు. దీని కిదికాదురా మందూ అనుకుని అట్టే నిదానంగా యోచించి సహజ శాంతస్వభావుడగు సెట్టిగారు కాగితమ్ముక్క తగిల్పించాడు న్యాయస్థానంలో.

ఈ కేసు ఎలా పర్యవసితమవుతుందీ అని ఆత్రంతో నిరీక్షిస్తున్నారు. అందరున్నూ !!!

వాళ్లతోపాటు మనమున్నూ—

ముద్దా-విశ్వనాథంగారు, (కవితాసమితి.)

# శ్రీ విద్వత్కవిసమ్మాన విమర్శనము

**శిరోభూషణము - వేంకటరంగాచార్యులుగారు,**

(కీర్తిశేషులైన బ్ర. శ్రీ. పురాణము - హయగ్రీవ శాస్త్రులుగారును, బ్ర. శ్రీ. విమర్శ కాగ్రేసర నాగపూఁడి - కుప్పుస్వామయ్య బి. ఏ. గారును.)

౧౯౩౮ సం॥ ఏప్రల్ నెలలో వెలువడిన చంద్రికా పత్రికయందు బ్ర. శ్రీ. తూశా - విశ్వనాథశాస్త్రులవారు మొన్నమొన్న గుంటూరుమండలమున విమర్శకాగ్రేసరు లను బిరుదమువడసిన బ్ర. శ్రీ. నాగపూఁడి-కుప్పుస్వామయ్యగారిని బ్రశంసించుచు వ్రాసినవ్రాఁతలోఁ గొన్ని యంశము లసత్యములై కానవచ్చుటవలన నాపత్రికాపాఠకులకు సత్యము దెలియఁజేయుపొంటె వాని నిట్లువ్రాయసకాఁడు సవరించుచున్నాఁడు. బ్ర.శ్రీ. తూశా - విశ్వనాథశాస్త్రులుగారువ్రాయసగానికి మిత్రులే కాని విరోధికోటిలో నేమాత్రము చేరిన వారు కారు. "వారు పొరఁబడి వ్రాసినవిషయ మసత్య మనునంశ మీపత్రికలోఁ బ్రకటింపక వారికిఁ దెలియఁ జేసిన, వారు దిద్దుకొనుదురుగదా! ఇందుఁబ్రకటింపఁ దొందరపడ నేల!" యనుప్రశ్నమునకు, "వారు వ్రాసినవ్రాఁత యసత్యమను నంశము దెలియక దానిఁ జదివి యది సత్యమని చంద్రికాపాఠకు లుందురు. సత్యము దెలుపక బ్ర. శ్రీ. తూశా- విశ్వనాథశాస్త్రుల వారు మిత్రు లని మిన్నకుండినచో సత్య మీపత్రికా పాఠకులకుఁ దెలియఁబోదు" అనుటయే ప్రత్యుత్తరము సుఁడీ. కావున, శ్రీ శాస్త్రులవారును, వారికి నాచార్య వర్యు లగు బ్ర. శ్రీ. నాగపూఁడి - కుప్పుస్వామయ్య బి. ఎ. గారును వేఁటుతలంపకుందు రని ప్రార్థితులు.

విమర్శకాగ్రేసరు లగు బ్ర. శ్రీ. నాగపూఁడి-కుప్పుస్వామయ్యగా రాధునికులు. వారు సంస్కృతాంధ్రాంగ్లేయములం దసమానపాండిత్యము గలవారు. సరళహృదయములు. ఆంధ్రలోకమునకుఁ జిరపరిచితులు. కావున వారింగూర్చి యధికముగ వ్రాయుట కిది యదనుగాదు.

బ్ర. శ్రీ. తూశా - విశ్వనాథ శాస్త్రులుగారు వ్రాసిన వ్రాఁతలో,

"............తర్వాత, పురాణము హయగ్రీవ శాస్త్రులు, రాయదుర్గము-నరసయ్య శాస్త్రులు మున్నగు వారు వీరి (అనఁగా బ్ర. శ్రీ. నాగపూఁడి - కుప్పుస్వామయ్యగారిని) నాదర్శప్రాయులుగ నుంచుకొని గ్రంథ పీఠికలు వ్రాయఁ దొడఁగిరి..........అనువాక్యమే శ్రీశాస్త్రులవారి వ్రాతను విమర్శింప వలసినదని పురికొల్పె.

పురాణము - హయగ్రీవశాస్త్రులుగారు పుదూరు ద్రావిడశాఖా బ్రాహ్మణులు. నెల్లూరు మండలమునఁ జెన్నపురినుండి కలకత్తాకుఁ బోవునినుపదారిలో నుండునాయుఁడుపేటకుఁ దూరుపుదెసఁ గ్రోసెఁడు దూరమునఁ గల పుదూరగ్రహారము వారి జన్మభూమి. అచట నప్పుడుండిన

"విప్రులు మెచ్చ రఖిల విద్యాప్రౌఢి
ముదిమది దప్పిన మొదటివేల్పు"

అను పెద్దనవాక్యమును నెంతయు వాస్తవము గావించుచుండి రనుట సుంతేనియు నతిశయోక్తి కాదు. అరుణాస్పదమను పురమునందలి విప్రులు పెద్దనవర్ణించినతీరున నుండి రో లే దో ఇప్పటివారికిఁ దెలియదు. కాని పుదూ రగ్రహారమునందు, బ్రాహ్మణు 'లఖిల విద్యాప్రౌఢిమనుముదిమదితప్పిన' బ్రహ్మనుఁ

గూడ లక్ష్యము సేయక, తమ పాండిత్యపటిమను, పూర్వము పునహానగరము రాజధానిగాఁ జేసికొని మహా రాష్ట్రరాజ్యముఁ బాలించుచుండిన శ్రీ. బాజీ రాయఁడు మొదలుగాఁగల మహారాష్ట్ర బ్రాహ్మణ ప్రభువులు మెచ్చుకొనునట్లు లోకమునకుఁ దెలియఁజేయు చుండి రనుట యించుకైనను కల్లగాదు సుఁడీ. అట్టి పండిత ప్రకాండవర్గ పారిజాతవృక్షవనమున నొక తరు వునఁ బూచిన కుసుమవతంస మీపురాణము -హయగ్రీవ శాస్త్రిలు.

ఈ పురాణము- హయగ్రీవశాస్త్రిలుగారు స్వగ్రామ మును వదలి చెన్నపురి కరుదెంచి చిన్నయసూరికి మున్నుందుగ శ్రీదొరతనమువారి కళాశాలలో (Presidency College) నాంధ్రపండితపదవి నలంక రించియుండిరి. వారి కొక్కయాంధ్రమే కాక వేద మును, వేదాంగములును సలక్షణముగఁ జక్కగఁ దెలి సియుండె ననుట కనేక నిదర్శనములు కలవు. చెన్న పురిలో 'వివేకాదర్శాఖ్య' ముద్రాక్షరశాలను స్థాపించి సంస్కృతభాషలో వెలయు శ్రీవాల్మీకిమూలరామాయ ణమును, వ్యాఖ్యానచతుష్టయవిశిష్ట శ్రీమద్రామాయ ణమును, శ్రీమహాభారతమును, లింగాభట్టీయమునుఁ, డీకామరకోశమును మున్నుగాఁ గలసంస్కృతగ్రంథ ములును, తెలుఁగు భాగవతమును, నాంధ్రనిఘంటు త్రయమనఁబడునాంధ్రనామసంగ్రహము, నాంధ్ర నామశేషమును, సాంబనిఘంటువును ఈ మొదలుగాఁ గల యనేకాంధ్రగ్రంథములును నాంధ్రలిపిని ముద్రిం పించి ప్రకటించు చుండిరి. వారికిఁ బూర్వము చెన్న పురిలోగాని, యాంధ్రదేశమున నేచ్చోటనైన గాని యాకాలమున నాంధ్రలిపిలో సంస్కృతాంధ్రగ్రంథ ములు ముద్రిచు ముద్రాశాలలు లేవు. ఆంధ్రలిపిలో సం స్కృతాంధ్రగ్రంథములు ముద్రింపఁ బూనినవారలలోఁ బురాణము-హయగ్రీవశాస్త్రులవారే ప్రథములు.

పురాణము - హయగ్రీవశాస్త్రులుగారు మొట్టమొదట ముద్రించి ప్రకటించిన వ్యాఖ్యానచతుష్టయవిశిష్ట శ్రీమ ద్రామాయణమునకు సంస్కృతభాషలో గొప్పపీఠిక వ్రాసి, దశరథుఁడు భార్యలకుఁ బంచి యిచ్చినపాయస విభాగము చక్కగవిమర్శించి నిర్ణయించి యున్నారు. మెండియు నందే "శ్రీమద్రామాయణము వేదమే యగుటవలన దానను తనశిష్యులును నక్షరములు గూర్చి ముద్రించితిమి. శూద్రులచే నక్షరములు కూర్పించి ముద్రింపలేదు." అని కూడఁ జేర్కొనియుండిరి. వారు ముద్రించి ప్రకటించినగ్రంథములలో నెందైనగాని, యచ్చుతప్పొకటియుఁ గానరాదు. వా రచ్చుకొట్టిన గ్రంథముల నాంధ్రదేశమునఁ గొందఱు మిక్కిలిపదిల ముగ దేవతార్చనామంజూషలయందుఁ దాఁచిపెట్టు కొని తమ తాతముత్తాతలు సంపాదించి పెట్టియుంచిన కాణాచికంటె నెన్నియోమడుంగు లధికభక్తితోఁ గాపాడుకొను చున్నారు. అట్లు దాఁచియుంచుకొనిన గ్రంథములలో ఆస్తికులు ప్రత్యహము పారాయణము చేసికొను చుండు సుందర కాండమునందలి ముఖపత్ర మునం దిట్లుకలదు :—

"శ్రీమదనంతనిగమాంత సిద్ధాంతపరమ తత్వార్థ ప్రకాశకే, దర్శన, స్పర్శన, లేఖన, స్మరణ, పఠన పూజన, కథాశ్రవణాదిభి రఖిల కలికల్మషాంధకారనిర్వా రణ ప్రచండభాస్కరే, వాల్మీకిమహర్షి ప్రణీత శ్రీరా మాయణాంతర్భూత కాండసముదయే, పఠనాదిభి ర్ఝడి త్యఖిలపురుషార్థ ప్రదత్వేన. రామాయణోపబృంహక బ్రహ్మాండపురాణాద్యఖిలపురాణరత్నైః పౌనః పున్యే నోద్ఘుష్యమాణోఽత్యంత సుందరోఽయం సుందరా ఖ్యకాండః, శ్రీమద్వేంకటనారాయణ విద్వచ్ఛూడా మణే స్తనయేన, క॥ పురాణం - హయగ్రీవశాస్త్రిణా, కాళయుక్తిభాద్రపదశుద్ధ పూర్ణిమాయాం, బుధవాసరే వివేకాదర్శాఖ్య స్వకీయ ముద్రాక్షర శాలాయాం, తృతీయవారం ముద్రాక్షరైస్సుష్ఠు ప్రకాశితః."

ఆప్రకారము ముద్రించిన యీ సుందరకాండము తృతీయవారము (Third Edition) ముద్రితమైనది. దీనికిముందు రెండుకూర్పులప్రతు లమ్ముడు వోయినవి. ఇప్పుడీవ్రాయసకానికంటఁ బడిన యీ సుందరకాండ ప్రతి మూఁడవకూర్పుది. ఇం దేపొరగటలోను నొక్కపఙ్క్తి యందును నచ్చుతప్పులేదు. ఆప్రకారము కంటవత్తిఁ బెట్టుకొని రామాయణము వేద మగుటఁజేసి తానే యక్షరములు కూర్చి యచ్చుతప్పులు దిద్ది యొక్క రామాయణమునకే గాక, లింగాభట్టీయమునకుఁగూడ దివ్య మగుపీఠికను వ్రాసియున్నవారు. ఆపీఠిక యిప్పుడు వ్యాప్తిలో నున్న ముద్రితప్రతియందుఁ గానరాదు. అది యిప్పుడుండి యుండునేని సంస్కృతాంధ్రపండితులకు మిక్కిలియుపయోగకారి యై యుండును.

కాళయుక్తి సంవత్సరము సెల్లి యిప్పటికి డెబ్బది యాఱేఁడుల కాలమైనది. దీనికిఁ బూర్వము సుందరకాండము రెండుకూర్పు లయ్యె. అప్పటికి బ్ర. శ్రీ. నాగపూఁడి-కుప్పుస్వామయ్యగారు జన్మించి యుండిరో లేదో యనుసందియము కలదు. వాస్తవ మట్లుండఁగా బ్ర. శ్రీ. తూళా - విశ్వనాథశాస్త్రులుగారు దీర్ఘాలోచన సేయక, సత్య మారయఁబూనక చంద్రికా పత్త్రికలో, బ్ర. శ్రీ. నాగపూఁడి - కుప్పుస్వామయ్య బి. ఏ. గారు, గ్రంథములకుఁ బీఠిక వ్రాయుటకు పురాణము- హయగ్రీవశాస్త్రుల కాదర్శప్రాయులై యుండి రని వ్రాయుట పొరబాటని చెప్ప నింత యీవ్రాయస గాఁడు వ్రాసెనని చంద్రికా పాఠకు లెఱుఁగఁ బ్రార్థితులు.

స్వర్గస్థులైన రాయదుర్గము - నరసయ్యశాస్త్రులు గారు క్రైస్తవకళాశాలయందు, బ్ర. శ్రీ. నాగపూఁడి-కుప్పుస్వామయ్యగా రాంగ్లభాషనుఁ జదువునపు డాంధ్రపండితులై యుండి యుందురనునూహ కలదు. ఏలయన? కీర్తిశేషులైన సమర్థి - రంగయ్య శ్రేష్ఠి బి. ఏ. గారు తత్కళాశాలయందు గణిత శాస్త్రము బోధించు నుపాధ్యాయులైయుండి, ప్రవేశ పరీక్షలోఁ గృతార్థులై, యప్పుడే "జూనియర్ యఫ్. ఏ." తరగతిలోఁ బ్రవేశించిన బ్ర. శ్రీ. నాగపూఁడి- కుప్పుస్వామయ్యగారిం గాంచి దగ్గఱఁ జేరఁ బిలిచి ప్రవేశపరీక్షాప్రశ్నములకు నీవు వ్రాసిన యాంధ్రభాష మిక్కిలి యింపుగ నున్నది. నీ కే మొదటిగుణములు వచ్చినవి? అని తన్నుఁ గొనియాడి రని బ్ర. శ్రీ. నాగపూఁడి - కుప్పుస్వామయ్యగా రొక్క తవడ బ్ర. శ్రీ. ఏ. వి. నరసింహము పంతులు గారితోను, నీవ్రాయసగానితోను జెప్పియుండిరి. దీనిం బట్టి రాయదుర్గము - నరసయ్యశాస్త్రిగారికి గ్రంథపీఠి కలు వ్రాయ బ్ర. శ్రీ. నాగపూఁడి-కుప్పుస్వామయ్య బి. ఏ. గారు మార్గదర్శకులుగ నుండిరో లేదో చంద్రికాపాఠకులే నిర్ణయించుకొనఁ బ్రార్థితులు.

# స్వప్నము

కొప్పకొండ-సుబ్బరాఘవకవిగారు,

కలలోఁ గాంచితి దివ్యరత్నఖచిత గ్రైవేయహారావళీ
లలితానందుఁడనౌచు నశ్వముపయిన్ లావణ్యలీలావిలా
సలతాతన్విని నక్కుఁ జేర్చుకొనియున్ సల్లాపముల్ సల్పుచున్
కలితప్రాభవమైన సౌఖ్యము మహాక్ష్మానాథనాథుండనై.

కన్నులు విచ్చిచూచి యటఁ గన్గొనఁగా నొకసైన వైభవా
త్యున్నతసంపదల్ విలసితోద్ధతవాజి విహారముల్ కలం
గన్నవి నూత్నసుందరియుఁ గన్నులకింపగు మేలిజాళువా
తెన్నుల యందమూది పలుతీఱుల సౌరులు గానరావుగా? !

ఒకచోఁగాంచితి నింద్రసుందరమణిప్రో ద్యత్ప్రభాభాసమున్
సకలాశా విలసన్మనోజ్ఞ విభవాంచ ద్వ్యాపనాభ్యాసమున్
సుకవిగ్రామణి పండితప్రభు చమూసూక్తి క్రియాన్యాసమున్
చకితాభ్రస్థల కేతనాంశుపటలచ్ఛాయాంచితావాసమున్.

ఆ నడురేయి వేఱొకటి నంచితవృత్తినిఁ గంటి వింటి ను
ద్యానవనీతటీ విలసితామరకాంతల మధ్యనృత్యసం
ధానవిధాగరిష్ఠుని సుధామధురోక్తివరిష్ఠునిన్ మహా
దానవజిష్ణువిష్ణుని నెదం గదియించిన మోతుమంచౌగిన్.

# జమ్మయ్య జక్కయ్యగార్లు

దోమా-వెంకస్న గుప్తగారు,

జమ్మయ్యోహావూళ్లో పెద్ద షాహుకారు. అతనికి దిక్కుమాల్న పల్కుబడి. అతఁడు నందంటే నంది. పందంటే పంది. ఏదారంటే యేదారి. కోదారంటే కోదారి. జమ్మయ్య మాట కాదన్నవాళ్లమ్మయ్యా అనాల్సిందే.

అతని కరిచేతులో కైలాసం జూపే గురు వొహాఁడు దొరికాఁడు. అతనిపేరు జక్కయ్య. జక్కయ్యకు తానపరశివావతారమని నమ్మకము. అట్లాగే చాటుతాడు. ఆమాట జమ్మయ్య మనసార నమ్మి అతనికి బంటానబంటుడయినాఁడు. తన చుట్టుపట్ల ఎక్కడి నుంచేయిన సరే నారాయణనామం జక్కయ్య చెవిలో పడఁగూడదు. అట్లా యెవళ్లయిన నారాయణనామమతడు వినేలాగున వుచ్చరించారా యితఁడు వాళ్లవుసురు పుచ్చుకొన్నాడన్నమాటే.

శివవిష్ణువుల యభేద సమత్వములు తెల్పఁదగిన పండితులా ప్రాంతములో లేకపోలేదు. కాని యీషాహుకారు పొట్టమీఁదఁ గొట్టేవాఁడుగనుక ఎవరున్నూ సాహసించి జక్కయ్య పద్ధతి యిట్లా అని చెప్పలేక పోయినారు.

అయినా వక పండితుఁడు తృణీకృత పురందరుఁడు తప్పిదారి ఆ వూరెళ్లాడు. కానితాను పండితుడని చెప్పుకోలేదు. ఏదో పెండ్లింటికి వచ్చినాఁడు. నలుగురితోఁబాటు భోజనమయినతరువాత ఆ లద్దడిలో వుండక వూరి గుంటగట్టున కూచున్నాఁడు.

అక్కడ జక్కయ్యమఠం. జక్కయ్య సొర బుర్రలో మడి నీళ్లు తెచ్చుకొంటూ ఈపండితుని చూచి "ఏవూ" రన్నాడు. ఇతఁడు ముభావముగా వున్నాఁడు. రెండవసారడిగితే ఏదోవూరన్నాఁడు.

జక్క:— చెప్పఁగూడదా ?

పం:—ఫలానావూరని చెప్పాఁడు.

జక్క:— ఆవూళ్లో నిన్ను చూచినట్టు లేదే ?

పం:—అందుకు నన్నేం జేయమంటావు?

జక్క: —మీరుద్యోగంలో వున్నారా ?

పం:—దయచేసి నన్ను తొందరపెట్టక మీరు తొందరచెందక వుండండి.

జక్క:—వూరుపేరు వగయిరా లడిగితే యింత కోపమా ?

పం:—కోపంలేదు బాబూ! నావూరి పేర్లతో మీకేంపని ? మీవూరిపేర్లు నేనడిగానా ? అయినా ఇదుగో చెపుతున్నాను. అని పండితుఁడు తనపేరు తన వుద్యోగం "ఫలానా ఫలానా" అని చెప్పాఁడు.

జక్క:—పండితుఁడని పేరు వినంగానే జక్కయ్యకు నోరు తడబడింది. ఎందుకంటే అతఁడావూళ్లో "... ... సభామధ్యే ... ... పండితాయతే "గా వున్నాఁడు గనుక.

పండితుఁడు చాలా యుక్తిశాలిగనుక వాదానికి ముందు "పండితుఁడని పేరేగాని అయ్యా! నేను నిజానికి మూఢుణ్ణండోయి" అని వినయమనే అభేద్యకవచాన్ని తొడు క్కొన్నాఁడు. ఆయన ధాకలో జక్కయ్య చిక్కుకొని బ్రతుకుజీవుడా అని బయట బడ్డాడు. కాని వాదంలో యితఁడే కారు బీరుమని అరిచినందు కావూరి షాహుకారు మొదలయినవారు జక్కయ్యనే పెద్దపండితుఁ డనుకొన్నారు.

తనపాండిత్యము బండారము తక్కువ గనుక నిజమయిన పండితులు దాన్నప్ప డప్పుడు బయటబెడితే తనకు పరాభవమను కొని తనదగ్గర మాయ - మలయాళభగవతి - ఐంద్రజాలిక - గజకర్ణ - గోకర్ణ విద్యలన్నీ వున్నాయని కొన్ని దృష్టాంతాలు కనుపరి చాడు జక్కయ్య. అబ్బా! అన్నారు వూరి వాళ్లు. ఇహేముంది? భూతవైద్యము-రక్ష - మొదలయినవాటికి జక్కయ్య పేరుపడ్డాఁడు. అనుమాన మాపంతలేకుండా జమ్మయ్య వాళ్లు యింటిల్లిపాదిగా ఇతణ్ని దేవుణ్ణిగా సేవిస్తున్నారు.

ఇంక జక్కయ్య బావుటా యెగశాని కంతూ పొంతూ వుందా? జక్కయ్య గుండం లో దూకమంటే దూకుతాడు జమ్మయ్య: ఇక్కడుం దొకమజా "కుంజరయూథంబు దోమకుత్తుక సొచ్చె." కు అది వుదాహరణ మవుతుంది. అదెట్లా అంటారా? చెబుతాను వినండి మరీ.

ఆవూళ్లో వహపింజరివాఁడు. అమాయి కుల్లో అమాయికుఁడు అంబేదల్లో అంబేద అని వాణ్ణిగూర్చి వదంతి. వాఁడు జమ్మయ్య కెక్లెట్లో వహ వెయ్యి రూపాయలు బాకీఅయి నాఁడు నోట్లు తిరుగ తిరుగా వ్రాసి. చేదువు రాని చేవటే. కాని బలేవుపాయం.

వకనాఁడు మధ్యాహ్నం జమ్మయ్య జక్కయ్యగార్లు జమ్మయ్యయింట్లో కొలువు దీరారు. అప్పుడే పింజరి ఆవూరి కరమయిలు దూరములో వున్న తన చేనుకాణ్ణుంచి - నడుస్తు వుండిన నాగేటికాడివదలి - కొరడా బుజాని కేసుకొని - "వొజక్కయ్యో! వొజక్కయ్యో!" అని పెద్దగొంతుతో చూస్తూ వూళ్లోకి పరుగెత్తుతూ వున్నాఁడు చూచినవాళ్లు "జక్కయ్యలేడు గదరా? యెందుకురా అట్లా పిలుస్తావు? అంటే - "అదుగో బిరబిరా పోతూవున్నాఁడే" అని బయలు చూపించాడు. "వీడికి" తిక్కపట్టిం దని జనులనుకొన్నారు. పింజరివాఁడు జమ్మయ్య యింటికి రోజుచూ చేరుకొని జక్కయ్యకు దండంబెట్టి "స్వామీ! నా చేనుమీదనే వస్తుంటివి. జక్కయ్యా! జక్కయ్యా! అని యెంతపిల్చినా నిలువకుండా వస్తివే నీదగ్గర వ్రేకమనవి చేసోవలెనని యెన్నాళ్లో చూచినా నీవు సామాన్యంగా దొరకవే." అన్నాఁడు.

అప్పుడు జమ్మయ్య "జక్కయ్యగారు రెండు గంటలనుంచీ యిక్కడనే వున్నారే. నీకు చేనులో యిప్పుడెట్లా కనుపడ్డారు?"

పిం:—యిప్పుడు ఆయన చేనుదగ్గిర కను పడితే గదా నేనాయనవెంబడి పరిగెత్తి వచ్చింది?

జక్కయ్య తన మహిమ హెచ్చుచేసు కొనే దానికి యిదే సమయమని "అవురా! నేనక్కడ కనుపడ్డా మాటనిజమే. ఇక్క డున్నామాట నిజమే". అన్నాఁడు.

అనఁగానే జక్కయ్యకింతమహిమ వుందా అని జమ్మయ్య భయభక్తులతో సాష్టాంగ దండంబెట్టాడు. దాంతో జక్కయ్య బూరీ లాగావుబ్బి - పింజరోణ్ణిచూచి - "అబ్బీ! నన్నెందుకు నువ్వుపిల్చింది? అని అడి గాఁడు.

వాఁడు మళ్లీ దండంబెట్టి "మఱేంలేదు. స్వామీ! జమ్మయ్యకు బాకీవున్నాను. బీద ముండాకొడుకుని. నువ్వన్నా ఆసామీలు కారుకు ఆబాకీ కొట్టెయ్యమని చెప్పవలశిం దని నిన్నడగడానికే - " అన్నాఁడు.

జక్కయ్య:—(చేటంత మొగం చేసుకొని- "జమ్మయ్యా! నామాత్యం వీడొకడే కని పెట్టింది. వీనినోటు కొట్టి పారేయి. మహా భక్తుడు గదా వీఁడు.?" అన్నాఁడు.

భక్తికన్నా భయమెక్కువగా ఆవరించిన జమ్మయ్య తక్షణం ఆపని చేసినాఁడు.

ఇఖేముంది? జమ్మయ్య వున్నన్నాళ్లు జక్కయ్య ప్రతాపం దివెటీస్తై వెలిగింది. జమ్మయ్య పెద్దల్లోజమయినాడు. పింజరోఁడు తాను జేసిన వుపాయం ఆంతరంగికులకి చెప్పాడు. అది అంతట అల్లుకొని జక్కయ్య వుత్తుత్త మహాత్మ్యాల జక్కయ్య అయి కూడుగుడ్డకు చిక్కయ్య అయినాడు.



# ప్రాస్తావికములు

మాడభూషి-మఠం-వెంకటాచార్యులుగారు,

శ్రీ వేంకటేశాయనమః—

మ. కలిలో వేంకట నాయకుఁడొకఁడె ముఖ్యంబైన దైవంబు, ని
చ్చలు నాదేవుని భక్తిమై హృదయకంజాతంబు నన్నిల్పి పూ
జలుసేయన్ గలిదోషముల్ దొలఁగుఁ గష్టంబుల్ పటాపంచలౌ
బల సౌఖ్యాయు రభీష్టవస్తు నివహైశ్వర్యంబులున్ జేకురున్.

రామః:—( = అనఁగా రామనామ మెట్లు కలిగెననుటకు)

క. "రా" జీవము హరి మంత్రం. బా జీవము "మః" యనంగ హరుమంత్రమునన్
ఈ జీవయుగళ మెడలిన నైజంబవి "నా—యనాయ" "న—శివాయ" యగున్.

క. "రా" జీవము హరిమంత్రం బాజీవము హరునిమంత్రమందు "మః"? యగున్
ఈజీవ యుగళమిళితము రాజీవదళాక్షుపేరు "రామః"? యనఁగన్.

హరి సిరినిఁజూచి నీవేల బ్రాహ్మణుల యిండ్లనుండ నొల్లవని యడుగ నామె యిట్లు సమాధానము చెప్పెనఁట:—

మ. జనకుంబీల్చెనగస్త్యుఁ, డింకొకఁడు రోషాంధం బతిండన్నె, బ్రా
హ్మణులెల్లం దమనోటఁబెంచెదరు బాల్యమ్మాదినావైరి, నా
తనువుంద్రుంతురు శైవపూజలనిమిత్తంబంచు నానాడునున్
గనుకన్ నే నతిఖిన్ననై వదలెదన్ భూదేవతావాసముల్.

కోపము:—

క. కోపింతు వేనిపగతుర, గోపింప వదేల నీదు కోపముమీఁదన్ ?
గోపంబు మొదలిశత్రువు భూపా! ధర్మార్థకామమోక్షంబులకున్.

తురుష్కగమణి శిరోభూషణము:—

చ. నెలయొ కళంకిదాను, రమణీమణియాస్యమొ నిష్కళంకమం
జుల, మగుటన్ జయించె నకిసోముని; వేయికరంబులిచ్చి తో
డ్పడియు శశాంకుఁడోడెనని భానుఁడునోడె లతాంగిః కొటఁ,దా
నలకలఁగట్టి పూజ్యులని యోదలఁదాల్చెను జంద్రసూర్యులన్.

## పాలు

మన మెన్నియోవిధములగు ఆహారపదార్థ ముల నుపయోగించుచున్నాము. అవి యుప యోగించునది ఆకలి తీరుటకుగానని తలంప వలదు. కొన్ని ప్రయోజనముల నుద్దేశించియే పలువిధములగు ఆహారద్రవ్యములను మన ముపయోగించుచున్నాము. అవి శరీరములో రక్తమాంసములను వృద్ధిఁజెందిపంజేయును. దానివలన పటుత్వము వర్చస్సు మున్నగు నవి కలుగును. ప్రతి ఆహారపదార్థములోను ఏవియో కొన్ని గుణములున్నవి. కాని సంపూర్ణముగ గుణములుండజాలవు. ప్రతి ఆహార వస్తువునందు స్వల్పముగను కొన్ని ముఖ్యముగను కలిగియుండు శరీరపోషక పదార్థము లన్నియు పాలయందు ఎక్కువగ నుండును. పాలను శిశువులు మొదలుకొని వృద్ధు లవఱకును ఉపయోగించవచ్చునని శాస్త్రజ్ఞు లును వైద్యులును, అనుభవజ్ఞులును, చెప్పు చున్నారు. ఆహారములలోకెల్ల పాలు దివ్య మైన యాహారము. అందు సకలమగు ఆహార ద్రవ్యములయొక్క గుణములును అపరిమిత ముగ గలవు.

మనలో అనేకులు ఆవు, గొఱ్ఱె, బఱ్ఱె, మేక, గుఱ్ఱము, గాడిదె, ఒంటె, జింక మొద లయిన అనేక మృగములయొక్క పాలను ఉపయోగించుచున్నారు. ఈ యన్నిటిలో జనులు ఆవుపాలను బఱ్ఱెపాలను ఎక్కువగ నుపయోగించెదరు. ఈ పాలనే కొందఱు ఇతర ఆహారవస్తువులతో మిశ్రముచేసియు, కొందఱు ప్రత్యేకముగను, మఱికొందఱు దీనినె చిక్కగాకాచి పెరుగు మజ్జిగ రూప ములుగనుకూడ నుపయోగించెదరు. అన్ని విధముల నుపయోగించుటకును ఈ పాల యందుగల విశేషగుణములే కారణము. ఈ పాలను పరీక్షించిచూడగా మనశరీరమందలి రక్తము, మాంసము, కండరములు, సిరలు, ధాతువులు, ఎముకలుమున్నగు వానిని వృద్ధి చేసి బుద్ధికిబలమును, దేహానకుకాంతియు, సదా ఆరోగ్యమును కలుగజేయునట్టి ప్రోటీన్ (కండకారము), ఫ్యాట్, చమురు (అనగా నునుపైన వస్తువు, విటమిన్లు, లోహములు, కార్బొహైడ్రేట్సు, జలము అను పదార్థ ములు గలవు.

పాలు మాంసాహారమునకన్న మిగుల ఉత్తమమైనయాహారము అయిదు తులముల మాంసములో గలిగియున్న "ప్రోటీన్"(కండ కారము)నుమారుగ ఒక సేరుపాలలోగలదు. దీని యందలి "ప్రోటీన్" అనుపదార్థము మాంస మందలి "ప్రోటీన్" కన్నను కడుశీఘ్రముగ శరీరమెల్ల వ్యాపించి రక్తమును కండరములను ఎక్కువచేయుచున్నది. మాంసమందు కాని ఇతరమైన మఱికొన్ని యాహారముల యందు గాని విడువతగిన వ్యర్థమగు పదార్థము

కలదు. ఈపాలయందు కొంచెమైనను త్యాజ్యాంశముండదు. యాపత్తును రక్త మాంసాదులను వృద్ధి చేయునదే. పాలయం దలి ఫ్యాట్, చమురు (అనగా నునుపైనపదా ర్థము) అను పదార్థము కడుశీఘ్రముగ జీర్ణిం చుటయేగాక నోటికి మంచిరుచికలిగియు నుండును. మనశరీరమందలి ధాతువులను వృద్ధిచేయుటకు కావలసినన్ని లోహములు పాలయందుగలవు.

ఇందు "కార్బొహైడ్రేట్సు" అను పదా ర్థముశర్కరరూపముగనున్నది. దీనికి"లాక్టోస్" అని వ్యవహారము. ఇది భుజించుటకు మిగుల అనుకూలముగ నుండును. ఏడుతులముల బియ్యములో ఎంతమాత్రము శర్కర కలదో అంతమాత్రపు "లాక్టోస్" రెండుసేర్లపాలలో కలదు. పాలలో ఈ పైనుదహరించిన పదార్థము లన్నిటికన్న ముఖ్యముగ "కాల్షి యం" (సున్నము)అనునది తక్కిన యాహార పదార్థములకంటెను ఎక్కువగ కలదు. ఈ "కాల్షియం" ఎముకలను వృద్ధిచేయు చుండును. ఎముకబలము కలవానినే బల శాలియందురు.

పాలను పలువిధములుగ నుపయోగింప వచ్చును. అపుడపుడే పిండిన పాలను కొంచె ముష్ణముతోఁగూడినదానిని పచ్చిగనే కాచక ఉపయోగించెదరు. ఇది వైద్యశాస్త్ర కల్ప ములలో చెప్పబడినది. ఈకల్పము ఉరఃక్షత వ్యాధి (హార్ట్‌వీక్) గలవారలకు చాలగుణ కారియనియు చెప్పుదురు. పాలను అన్నము మొదలైన ఆహారపదార్థములలోకూడ కలిపి భుజించవచ్చును. ఆంగ్లవైద్యులు ఆయు ర్వేదవైద్యులు సకలవిధమైన వ్యాధులలోను సర్వజ్వరములలోను పాలను ఆహారముగా గొనుట సర్వసమ్మతముగా ఒప్పుకొని యున్నారు. సన్నిపాత జ్వరములయందు మాత్రము పాలయందలి గురుత్వముతగ్గి కడు శీఘ్రముగా జీర్ణించుటకై పాలను కాచి వానియందు నిమ్మపండ్లరసమునుపిండి ఘనపదార్థములను పరిహరించి రోగి కుప యోగించెదరు. సాధారణశాస్త్రజ్ఞులుకూడ "క్షీరేణాయుష్యవర్ధనం" అని పాలను సదా ఉపయోగించువారికి ఆయుష్యము వృద్ధియగు నని చెప్పియున్నారు. పాలు తేనె నెయ్యి ఈ మూటిని చేర్చి యుపయోగించిన మిక్కిలి రుచిగ నుండును.

రసాయన శాస్త్రజ్ఞులుకూడ బాదామి, అక్రోట్, పిస్తా, జాపర్గా దోస, గుమ్మడి, ముంతమామిడి, గసగస, మున్నగు పప్పు దినుసులతో పాలను కూడ కలిపి నూరి కాచి హల్వాలుగా తయారు చేసియు, విదారి, అశ్వ గంధి, భూశర్కర, నేలతాటి, సుగంధిపాల, రత్నపురుష మొదలయిన కందమూలములతో పాలనుచేర్చి లేహ్యములు తయారుచేసియు, కాఫీ, టీ, కొకో, తేయాకు, మున్నగు వస్తు వుల చూర్ణముల కషాయములతో పాలను

కలిపి ద్రవరూపమగు పానీయములుగను, మినప,పెసర మొదలయిన పప్పులతో పాలను చేర్చి పక్వపఱచిన గంజిగను, గోధుమ, సెనగ మొదలయిన పిండివస్తువులతో పాలను, శర్కర, నేయి, ద్రాక్ష, కలకండ, కేసరి, కర్పూరములు చేర్చి తయారుపరచిన లడ్డు, జాంగ్రీ, జిలేబి, మైసూరుపాకు, బిస్కట్, మిఠాయి మున్నగు భక్షణ పదార్థములుగను, పాలను ఇగరకాచి గడ్డకట్టునటుల చేసియు, (దీనినే హిందుస్థాని భాషలో కోవాయని వాడెదరు. అరవమున తెరటిపాల్ అని వ్యవహరింతురు) ఉపయోగించిన శరీరమున కత్యారోగ్యమని నుడువుచున్నారు.

సాధారణముగ సర్వజనులు పాలను కాచియే ఉపయోగించుట వాడుకకలదు. అదియే ఉత్తమమైన పద్ధతి. కొందఱు కొండలలో నివసించు కోయజాతీయులుమాత్రము ఇందలి గుణదోషములు తెలియక పచ్చిపాలనే వాడుచుందురు. అది అంతప్రశస్తముకాదు. పాలను కొంచెము నీరుకలిపి కాచి పుచ్చుకొనిన జీర్ణమున కనుకూలము.

పాలను పచ్చివిగనే యంత్ర సహాయమున తఱచియు వెన్న తీయుచుందురు. పాలను చక్కగ కొంచెము ఎరుపువర్ణము కలుగునటుల కాచిన దానిపైన ఘనమగుపదార్థము అట్టువలెగట్టియుండును. దానినే మీగడయని వ్యవహరింతురు. అట్టి కాచినపాలలోనే కించిదుష్ణముగ నున్నప్పుడు కొంచెము మజ్జిగ (చల్ల) గాని, చింతపండుపులుపుగాని, సంబంధింపఁజేసి పది ఘంటలకాలము అల్లే మూతపెట్టియుంచిన గడ్డకట్టుకొనును. దానినే పెరుగు అని వ్యవహరింతురు. అది కొంచెము పులుపురసము కలిగియుండును. పెరుగుపైనుండు మీగడను యంత్రసహాయమునగాని, కొయ్యకవ్వముతోఁ గాని చిలికిన దానినుండి స్నిగ్ధముగను నునుపుగను తేలికగను నుండు ఘనమగు పదార్థము బయలుదేరును. అదే వెన్న. ఇది పాలయందలి చమురును వేరుపరచుటచే కలిగిన యాకారము. పాలకంటెను పెరుగు శరీరమందలి వెట్టను వెంటనే యార్పి సుఖమును గలిగించును. ఈ పెరుగునే నీరు కలిపి చిలికినదానిని మజ్జిగయని చెప్పుదురు. ప్రాయికముగ మజ్జిగకును పెరుగునకును గుణములు తుల్యముగనే యుండును. పాలయందలి విటమిన్లకంటె పెరుగునందలి విటమిన్లు కడు సుకరముగ జీర్ణించును. ఇంతేకాక ఇతరాహారపదార్థములను గూడ శీఘ్రముగ జీర్ణింపచేయును. పాలను కాచుటవల్లగాని, లేరుగుగ మార్చుటవలనగాని దానియందలి ప్రోటీను మున్నగు ఆహారపదార్థములు తగ్గుటలేదు. వీనిలో కొన్నిటియొక్క గుణములు మిక్కిలి వ్యక్తమగుచున్నవి.

కాచనిపాలయందు తీయు వెన్నకన్న కాచి తోడువేసి పెరుగైనపిమ్మట తఱచి తీసినవెన్న మిక్కిలి రుచిగాను నెయ్యికంటె శీఘ్రముగ జీర్ణించునదిగను నుండును. కను

కనే రజత-తామ్ర-లోహ-స్వర్ణ-నాగ-సీస-మాక్షికాది భస్మములుగాని సింధూరములు గాని యే యనుపానము లేనప్పుడు వెన్నలో కలిపి తినుట మంచిదని యందురు.

పాలకంటెను పెరుగునందు మతియొక విశేషగుణము కలదు. పాలను అట్లేయుపయోగించిన ఆరోగ్యమే కాని క్రిమిహరము కాజాలదు. దానినే పెరుగుగఁజేసి యుపయోగించిన జీర్ణకోశమందలి విషక్రిములను నశింపఁజేశి సర్వావయవములతో బాటు జీర్ణకోశమును వృద్ధిచేయును. పాలను పచ్చిగఁగాని కాచిగాని అట్లేయుంచిన ఒకదినము పూర్తిగనైన నుండదు. చెడిపోయి దుర్గంధముకూడ అంకురించును. పెరుగుగ నుంచిన నాలుగు దినములవఱకైనను యెంతమాత్రము చెడకుండును. పులుపుమాత్ర మతిశయించును. పాలతోను పెరుగుతోను అటుకులు, గోధుమపిండి, బియ్యముపిండి, నరిపేలాలు మొదలయినవానిని నానఁబెట్టుకొని కూడ తినవచ్చును, ఇంకను పెరుగును అన్నములో కలుపుకొనుటకు తగునట్లుగ పచ్చేళ్ళుగకూడ తయారుచేసి భుజించవచ్చును.

పాలను మంచుగడ్డను (అయిస్) రెంటిని కలిపి "అయిస్క్రీం"అనుదానిని తయారుచేసి అమ్ముదురు. పాలుచేర్చి తయారుచేసిన లడ్డు మొదలయినవి సుమారు ఒక మాసము రోజులున్నప్పటికిని రుచిగనే యుండును.

జనులు ఇప్పుడిప్పుడు మాంసాహారముల యందలి దుర్గుణములం దెలిసికొని దానిని పరిత్యజించి పాలనే ఉపయోగించుట కుపక్రమించుచున్నారు.

ఇంకను ఎన్నియో సుగుణములు పాలలో కలవు. అవి ఇతరత్ర గ్రంథములలో చూడవచ్చును. లేక ప్రతిదినము ఇతరాహారముల కన్న పాలను యెక్కువగ నుపయోగించుచున్న ఆ గుణములు అనుభవములో తెలియును.

ఎప్పటికిని శిశువులకు వృద్ధులకు, పాలనే ఉపయోగపరచుట మంచిది. ఇప్పుడు చాల రకముల పాలు విదేశములనుండి మన దేశమునకు దిగుమతి యగుచున్నవి. వానికంటె ఆవులు, బఱ్ఱెలు, మేకలు మొదలగు వాని పాలే మిగుల ఆరోగ్యకరములు. ఒక పాలను త్రాగియే జీవనమును నిలుపుకొనవచ్చును. పాలు జీవనాధారమగుటంబట్టియు, ఆవుపాలు మిగుల ఆరోగ్యకరములగుటం బట్టియు, ఆవులు దేవతలవలె హిందువులచేఁ బూజింపఁబడుచున్నవి.

కావున మనము విదేశీయక్షీరములను విసర్జించి, ఆవులు మొదలగువాని పాల నుపయోగించి, వాని అభివృద్ధికయి పాటుపడుట విధియై యున్నది.

# ఆత్మనివేదనము - శ్రీ రుక్మిణీ సందేశము

వైద్యరాజ - డాక్టరు. దం. సు. అవధానిగారు,

నీదానను నీదానను, నీదాననుజుమ్మ వలతు నీదాస్యమ్మున్
వాదేల మనసు మేనున్, నీదే ప్రాణంబునీదె నిజముగఁ కృష్ణా.

ఏదారి లేనిదానను, మోదదమగు నీదు సేవ మోక్షంబనినీ
పాదము లెద నిల్పితి సా,మీ దాసికిఁ గొలువొసంగి యేలుము కృష్ణా.

నాదేమి లేదును మిన్నక, నీదే భారంబు నేను నీవనుభేదం
బేదీ, నీయంగంబై, నీదరిఁ జేరుటను నేను నీవే కృష్ణా.

లేదింక నిహము పరమును, లేదొరులని స్వీయులనుచు లేదహమేనిన్
నీదర్శనోత్సవంబున, నేదియుఁ గనరాదు సకలమీవే కృష్ణా.

రాదా దయనాపై నీ కీడా మోదంబు నన్నునేలుట నాకున్
నీదా నననుటలో సరి,కాదే సిద్ధియును నిజము కంజదళాక్షా.

ఏదీ నీమృదుభాషణ, మేదీ నీమొలక నవ్వ దేదీ యేదీ
నీదివ్యకరస్పర్శం,బేదీ నీదానికేమి యిచ్చెదో కృష్ణా.

ఏదియు జగమునఁ గానఁగ, రాదుగదా నీకుసాటి రాజీవాక్షా
లేదెద్ది నాకుపాస్యము, నీదాసిని నీకుదాసినిన్ దయఁగనుమా.

నీ ముద్దుమొగముఁజూడఁగ, నీమృదుభాషలను వినఁగ నీమేనంటన్
నీమోవి నానఁగా నీ, యామోదం బేను వలతు నబ్జదళాక్షా.

# శిశుసంరక్షణాలయములు

శ్రీమతి - విమలాగిరిగారు,

దేశోన్నతికి ప్రధానమైనది శిశుసంరక్షణ; దీనివలననే రాబోవుసంతతివారు దేశము యొక్క ఘనతను, జాతీయతను కాపాడగలుగుదురు. ఇప్పటి శిశువులే ముందు దేశోద్ధారకులగుదురుగావున, శిశువులను యెట్లు సంరక్షించవలయునను విషయము ముఖ్యముగా ఆలోచించవలయును.

మనదేశములో శిశుమరణములు చాల ఎక్కువగా ఉన్నవి. అనేకులగు బిడ్డలు, పుట్టుకలోనో, లేదా పుట్టిన కొద్దిరోజులలోనో చనిపోవుచున్నారు. మఱికొందఱు సరియైనపోషణ లేక, బలహీనులుగానే పెరుగుచున్నారు. ఇంక మఱికొందఱు తలిదండ్రులవ్యాధులను వారుకూడ పొంది, రోగపీడుతులగుచున్నారు. ఇట్టి కష్టములు లేక ఆరోగ్యమైన శిశువులను కనుటకును, వారికి సంరక్షణ చేయుటకును ఏర్పాటు చేయబడినవే శిశుసంరక్షణాలయములు.

శిశుసంరక్షణ రెండుభాగములు. మొదటిది:—గర్భిణీస్త్రీల ఆరోగ్యము కాపాడుట; రెండవది:—శిశువులు పుట్టినవెనుక వారి సంరక్షణ.

గర్భిణీస్త్రీలకు రెండవనెలనుండి వాంతులు లేక వేవిళ్లు వచ్చును. ఇవి ఎక్కువవై బాధకరముగా ఉన్నయెడల వెంటనే ఒక వైద్యునివద్ద సలహా పుచ్చుకొని తగిన చికిత్స పొందవలెను; లేనియెడల ఆబాధకు గర్భవతి బలహీనవై, కనుటకు ఎక్కువ కష్టపడును; కొందఱు గర్భవతులు రక్తహీనలై, నీరసముగా నుందురు. అట్టి వారికి కాన్పుసమయమందు ఎక్కువ శ్రమపడవలసియుండుటయేకాక, సరియైన రక్తము లేకుండుటచే, గుండెలు కొట్టుకొనుట నిలిచిపోయి మరణము కూడ ప్రాప్తించును. కావున మొదటనే శిశుసంరక్షణాలయమునకు పోయి, పరీక్షచేయించుకొని, తగినసలహానుపొంది, తదనుసారముగా నడుచుకోవలెను.

కొంతమందిబిడ్డలు పుట్టగానే చనిపోవుదురు; కొందఱికి గ్రుడ్డివారు పుట్టుదురు. ఇంక మరికొందఱికి (Dwarfs) మరుగుజ్జులును దయ్యాపుబిడ్డలు (Monsters) పుట్టుదురు. వీటికి కారణము తలిదండ్రులు ఏదియో సుఖవ్యాధి కలిగియుండుటయే. ఇట్టివి తప్పించుకొనుటకు గర్భముధరించిన యువతి తాను గర్భవతి అని తెలుసుకొన్న వెంటనే వైద్యుని సలహానుపొంది తగినచికిత్సను చేయించుకొనుటయే. ఇట్టివి మాన్పుటకు మంచిమందులు చాలకలవు. వాటిసహాయమున చాల కష్టములను తొలగించుకోవచ్చును; ఆరోగ్యమైనశిశువును కనుటకు అవకాశములు కలుగును. అనారోగ్యముకలబిడ్డలను కనుట మహాపాతకమని తల్లులందరూ ఎంచవలయును.

ఏడవనెల రాగానే గర్భవతి ఒక ఆసుపత్రికి పోయి, గర్భద్వారము యొక్క

కొలతను పరీక్షచేయించుకోవలెను. గర్భ ద్వారము సరిగా (normal) ఉండిన మంచిది; అట్టివారికి కాన్పు ఎక్కువకష్టముగా నుండదు. కొందఱకు గర్భద్వారము చిన్నదిగా నుండును; అట్టివారికి కాన్పుకాలములందు ఎక్కువ కష్టము కలుగుటయేకాక తల్లి బిడ్డలకు ప్రాణాపాయముకూడ కలుగవచ్చును. ఇట్టి అసందర్భములు వైద్య శస్త్ర (Postural & Instrumental treatment)సహాయమువలన సరియైన పరిస్థితులకు తేబడి, గర్భవతుల బాధ లను తక్కువచేయును.

గర్భిణీస్త్రీలు నెలలు నిండిన కొలది కొన్ని కొన్ని రోగములకు లోనగుదురు. కాళ్లువాపు, దేహము నీరుపట్టుట, మూత్రములో ఆల్బుమి న్(Albumen)పోవుట, తలనొప్పి, తలతిరుగుట, ఈడ్పులు (convulsions), కామెరలు (Jaundice), సుఖసంబంధమైన రోగములు, క్షయ, గుండెల జబ్బులు(volvular diseases of the heart), ఇంక మఱికొన్ని రోగములకు వీరు లోన గుదురు. అట్టివారు ముందుగనే శిశుసంరక్షణా లయములకు పోయి, సరియైన చికిత్సనుపొందిన సుఖప్రసవమును పొందగలరు. లేనియెడల ప్రసవసమయమున వీరు చికిత్సనొందుట దుర్ల భము. చాలమంది స్త్రీలు ఇట్టి రోగములను రోగములని భావించక, ఏదయ్యమో, ఏదేవత యో తమ్ము ఆవేశించినదని నమ్మి, మూఢులై ప్రాణములను పోగొట్టుకొనుచున్నారు.

ముఖ్యముగా జనసామాన్యముయొక్క మూఢత్వమును పోగొట్టుటకుకూడ పాటుపడ వలెను. దానికి మంచికథలు, ఛాయాపట ములప్రదర్శనము (Magic Lantern exhibition) సినీమాలు చాలవఱకు తోడ్పడును. అట్టి ఏర్పాట్లు జరిగినప్పుడే ప్రజలు మూఢ్యము మాని సరియైనదారికి వచ్చెదరు. మనసంసార ములో ఆరోగ్యమునకు సంబంధించనిపూ ర్వాచారములను, అలవాటులను, నమ్మికలను పూర్తిగమాన్పి మనస్త్రీలు సరియైన మార్గ ముల నవలంబించుటకు (Health Visitors) ఆరోగ్యవిషయమై బోధించువారిని ఏర్పరచి, ప్రచారముచేయించవలెను.

మనస్త్రీలకు సాధారణముగా సంభవించు రోగములకు బీదతనమును, నివసించువసతులు అతిక్లుప్తముగాను, అనారోగ్యముగా ఉండుట కూడ కారణములు.

కాన్పుసమయమునందు అనేక అసందర్భ ములు వచ్చును. ఇందు ఒకటి సరియయిన తరిబీతుపొందని మంత్రసానుల ( Barber midwife) సహాయము పొందుట. ఈమెకు నొప్పులసమయమున వచ్చు అసందర్భములు (complications) తెలియవు. శుభ్రముకాని చేతులతో గుహ్యాంగములను తాకుటవల్ల అపాయకరమగు విషములు (septic) రక్త ములో కలిసి ప్రాణాపాయము సంభవించును. తగినశిక్షను పొందిన మంత్రసానిని (Trained midwife)ఏర్పాటు చేసుకొనిన కాన్పునం దు వచ్చు ఎక్కువ అసందర్భములు చాల వఱకు తప్పించుకోవచ్చును. కాన్పులవలని మృత్యువులు చాలవఱకు తగ్గిపోవును. హిందూదేశమున కాన్పులసమయమున చావులు, (maternal mortality) శిశువుల చావులు (infantile mortality) పాశ్చాత్య దేశములకన్న చాల ఎక్కువ అని తెలును

కోవలసినది. దీనికి కారణము మన స్త్రీలు అట్టివి మాన్పుకొనుటకు తగిన అనుభవము, జ్ఞానము పొందియుండక పోవుటయే.

శిశువు పుట్టినతరువాత అనుదినము స్నానముచేయించ వలెను. శిక్షపొందని మంత్రసాని ( Barber midwife ) అట్టి స్నానమును చేయించునప్పుడు బిడ్డకు ఒళ్లు నొప్పులు (sprains) పట్టును. కాన అతి జాగ్రతగానుండవలెను.

సాధారణముగాబిడ్డలకువచ్చు వ్యాధులు:- నీళ్లవిరోచినములు, ఈడ్పులు (convulsions) దీనికి కారణము. నరములు నీరసముగా నుండుట ( Nervous debility), మలబద్ధము (constipation), సుఖరోగములు సుఖప్రసవముకాక ఎక్కుడు కష్టపడుటచే బిడ్డలమెదడుకు నొప్పికలిగినప్పుడు కూడ ఇట్టి ఈడ్పులు వచ్చును. ఇట్టి ఈడ్పులకు మనవారు(వాతలు) కాల్చెదరు. ఇది చాల అసహ్యాకరమును బాధకరమును ఐ యుండును, దీనికిమంచిమందులు ప్రతి చదువుకొనినవైద్యుని (qualified Doctor) వద్దను ఉండును. అట్టిసమయములలో వారివద్దకు పోయి సహాయము పొందవలెను.

చంటిబిడ్డలకు వేళకాహారమును ( timely feeds) ఇవ్వవలెను. అట్లుకాక తోచినప్పుడు పాలిచ్చుట, ఎప్పుడు ఏడ్చినఅప్పుడు పాలిచ్చుట, బిడ్డకు పాలు అవసరమో లేదో తెలియకుండ బిడ్డకడుపునునింపుట చాల ప్రమాదము. ఇట్లే బిడ్డకు కావలసినప్పుడు పాలు యియ్యకపోవుటకూడ చెడుగే. ఎప్పుడును ఒకేవేళకు బిడ్డకు తగిన ఆహారమును ఇయ్యవలెను. తల్లికి సుఖవ్యాధులుగాని, క్షయ గరోము గాని, జ్వరముగాని యింకను ఇట్టిరోగములేవేని ఉన్న యెడల బిడ్డలకు చన్నుకుడుపనీయరాదు. బిడ్డలకు సరియయిన ఆహారము లేకపోవుటచే (mal-nutrition in children) ఉదరపొట్ట పెరుగుట, చేతులు కాళ్లు సన్నగిలిపోవుట, (Rickets) రక్తముచెడి, కాలమునకు పండ్లు రాకుండుట, ఇగురునుండి రక్తము వచ్చుట (scurvy) మొదలగునవి సంభవించును. వీనికి కారణము బిడ్డలకు కావలసినంతకొవ్వు (fat) పదార్థము తల్లిపాలలో లేకపోవుటయే. అట్టి బిడ్డలకు చేపనూనె (Cod Liver Oil), మాగిపోని పండ్లరసము (juice of fresh fruits) పెట్టవలెను. చేతులు కాళ్లు సన్నగిల్లి పొట్ట పెద్దదిగా పెరిగిన పిల్లలఅవయవములకు చేపనూనె(Cod Liver Oil) అనుదినము కొద్దిగా రుద్దిన చాలమంచిది.

బీదలకు ఇట్టి చికిత్సలను చేయువసతులె శిశుసంరక్షణాలయములు. చెన్నపురియందు ఉన్న ఇట్టి ఆలయములలో బీదబిడ్డలకు వేడినీరు స్నానమునిమిత్తము ఇత్తురు. మంచి ఆవుపాలు ఉచితముగా నొసగుదురు. బిడ్డ పుట్టిన పదిరోజులవఱకు సరియైన శిక్షపొందిన మంత్రసానులు (qualified Nurses) బిడ్డలకన్నవారి యింటికి పోయి, మాతాశిశువులకు తగిన సహాయములు చేసి, కావలసిన సలహాల నిచ్చుచు వారి ఆరోగ్యమును కాపాడుటకు ప్రయత్నింతురు. అవసరమైనచోట్లకు స్త్రీ వైద్యులు (Lady Doctors) కూడాపోయి ఉచితముగా సహాయము చేయుదురు.

---

# హా! హ్హా!! హ్హా!!!

లలిత:—చూచారా! కోమలికి దాని మొగుడు అడ్డిగతీసిచ్చాడు.

రామరావు:—(లలితను ముద్దాడి) బంగారూ! నగలంతా అందములేనివాళ్ల కేగాని అందముండేవాళ్ల కెందుకు?

---

కాంబోవు మామ:—నీకు వ్రాడలో వుద్యోగము గదా? నీ కభివృద్ధి యెంతవఱకు అగును.

అల్లుడుకాంగోరి వచ్చినవాండు:—ఆక్షేపణేమి? వీలయితే అందఱికంటె హెచ్చు అభివృద్ధి నాకేవుండును. ఎందుకంటారా? నాదే కడాపటివుద్యోగం.

---

ఈ బొమ్మనుగూర్చి 10 ఏండ్లు గడిపాను.

ఈబొమ్మ వ్రాయడానికి 10 ఏండ్లు పట్టిందా?

వ్రాయడానికిపట్టిం దాఱునెలలే. లో తక్కువకాలము అమ్మడానికి ప్రయత్నము జరిగింది.

---

రామయ్య:—ఆడవారికి ద్రవ్యముయొక్క మూల్యము నెఱుంగం జేయుటకు బ్రహ్మతరము కాదు. ఏమిచెప్పి యేమిప్రయోజనము?

స్నేహితుడు:—ఏమిసంగతి?

రా:—ఏమందువా? నేనింటిలోలేనప్పుడు బిడ్డ యొక కాలణామ్రింగినది. వెంటనే నా భార్య డాక్టరునుపిల్పించి యతనిచే ఆ కాలణా తీయించి తీసికొని యతనికి రెండురూపాయ లిచ్చినది.

---

తండ్రి:—అబ్బాయీ! నీవు స్కూలున కెందుకుపోలేదు?

కొడుకు:—నాకు నొప్పికల్గినది కనుక.

తండ్రి:—నొప్పి యెక్కడకల్గినది.

కొడుకు:—స్కూలులో.

---

తండ్రి:—అబ్బాయీ! నీ మార్కుల పట్టీ చూడంగా నీవు లెక్కలలో చాల జబ్బుగానున్నట్లు తెలియుచున్నది. నీకు రూపాయయనంగా నేమో తెలియదని మీ అయ్యవారు చెప్పుచున్నారు. నీవు పెద్దవాండవయినప్పుడు బేర మెట్లుచేయుదువు?

కొడుకు:—పెద్దవాండ నయినప్పుడు నేను చేయువ ర్తకములో నాకు లెక్కలతో సంత పనియుండదు.

తండ్రి:—ఎందుకు?

కొడుకు:—ఏమందువా? నేనొక యణా సామానుల దుకాణము పెట్టెదను. అప్పుడు నాకు రూపాయసంగతితో నేమిపని?

---

యజమాని:—(దొంగనుపట్టుకొని) ఒరే! ఈ యింట్లోకి యెందుకొచ్చేవు?

దొంగ:—ఇది నాయిల్లనుకొన్నాను.

యజమాని:—మరి, నాభార్యనుచూడగానే, పారిపోయినా వెందుచేత ?

దొంగ:—ఆమె నాపెండ్లా మనుకొన్నా.

---

ఒకధనికుడు:—(మోటారుషాపు యజమానునితో) ఏమయ్యా! ఏభాగం విరిగినా సరే, క్రొత్తదియిచ్చునట్లు చెప్పినావు కదూ ?

మో-య:—నిజమే. ఇప్పుడు యేభాగం విరిగినది ?

ఒకధనికుడు:—నా యెడమచేయి.

---

భర్త:—ఒసే! నిన్ను నేనుకట్టుకొన్నప్పుడు నీవొంటిపైన, ఒక్క గుడ్డపేలికైనా లేదు కదూ ?

భార్య:—దానికేమి లెండి! ఇప్పుడు చాలా వున్నవి.

---

రామయ్య:—భీమయ్యా! 'పునర్జన్మ' మీద, నీకు నమ్మకమున్నదా ?

భీమయ్య:—ఆహా! ఒకప్పుడు నేను గాడిదనై యుంటి నని, నాకు తెలియును.

రామయ్య:—ఎప్పుడు ?

భీమయ్య:—నీకు పదిరూపాయలు అప్పు యిచ్చితినే, అప్పుడు.

---

జడ్జి:—వీరిద్దఱు కుర్చీలతో పోట్లాడు చుండిరి కదా ? వీరి తగువుతీర్చుటకు నీవెందుకు ప్రయత్నింపలేదు ?

సాక్షి:—మూడవకుర్చీ లేకపోయినదండీ!

---

భార్య:—మన ప్రక్కయింటి దంపతులు చాలాప్రేమకలవారు. ఆయన ఆమెను యెప్పుడంటే అప్పుడు ముద్దుపెట్టుకొంటాడు. మీరు కూడా ఆలా చేయండి.

భర్త:—ఆమె నాకు బాగుగా తెలియదు.

---

ఒకడు:—"నిన్నటిదినము, నీ భార్యను చూస్తిని"

రెండు:—"నీతో ఏమిచెప్పెను ?"

మొదటి:—"అంతగా ఏమిచెప్పలేదు."

రెండవ:—అయితే నాభార్యగాదు."

---

ఉపన్యాసకుని కుమార్తె:—"ఒకరినొకరు ఎట్లు ప్రేమించవలయునను ప్రసంగము మా తండ్రిగారు నేటిసాయంత్రము సభామంటపములో చేసెదరు కాబట్టి నీవు తప్పకరావలయునన్నది."

కాబోవు పెండ్లికుమారుడు:— "మీ తండ్రిఅక్కడప్రసంగముచేస్తూవుంటే, మనము ఇంట్లోఉండి దాని నభ్యసించకూడదా ?

---

"నాకుమార్తెకు సంగీతము నేర్పుటవల్ల నాకు చాలలాభమయ్యింది.

"అదియెట్లు ?"

"చుట్టుప్రక్కలయిండ్లను సగము ఖరీదుకే కొనడానికి వీలయింది."

---

ఒకడు:—"మోటారుకార్ హారను వింటే నాకు చాలా వికారమవుతుంది."

రెండవవాడు:—'దేనికిగాను ?'

మొదటి:—కొన్ని దినములక్రింద నా డ్రైవరు నా కారును, నాభార్యనుకూడ తీసుకొని పోయినాడు. అప్పటినుండి హారను శబ్దము వినబడ్డప్పుడెల్లను నాభార్యను పిలుచుకొనివస్తాడనుకొంటూ ఉంటాను.

---

స్నేహితుడు:—"అబ్బాయీ ! మీతల్లి చెప్పినట్లు నడుచుకుంటావా ?

బాలుడు:—"అవునండీ !" నేనేకాదు, మానాన్నకూడా వింటాడు.

---

తోటకాపరి:— అబ్బాయీ ! ఆచెట్టుక్రింద యేమిచేస్తున్నావు ?

అబ్బాయి:—అయ్యా ! చెట్టునుండి ఒక పండు క్రిందపడినది. దాన్ని మరల చెట్టుకి అతికిస్తున్నాను.

---

ఇన్‌ష్యూరెన్సు ఏజెంటు:— అయ్యా ! తమకు వివాహం అయిందని విన్నాను. మా పాలసీఒకటి కొంటారా ?

క్రొత్త పెండ్లికొడుకు:—నా కొద్దండి ! ఆవిడ అంత అపాయకరముగా వుంటుం దనుకోను.

---

చిన్నకుమార్తె:—'నాన్నా ! ఒక పిల్లకు ఏనుగుపాలు త్రాగుటవల్ల ఒకవారంరోజులలో ఇరువదిరతులు తూనికఎక్కువైంది తెలుసునా?

తండ్రి:—అది అసాధ్యమైనపని. అది ఎవరిపిల్ల !

చిన్నకుమార్తె:—అదా ! ఏనుగుపిల్ల.

---

సుబ్బయ్య:—ఏమయ్యా ! జ్ఞాపకమున్నదా ? నాకొమార్తెను మీకిచ్చి పెండ్లిచేస్తామనుకొన్నాను ?

సోమయ్య:—అవునవును జ్ఞాపకంవచ్చింది ఐతే నేను పెండ్లిచేసుకున్నానే !

---

ఉపాధ్యాయుడు:—క్లాసులో ఎందఱు బాలురున్నారు ?

బాలుడు:—"పందొమ్మిదిమంది."

ఉపాధ్యాయుడు:—బుద్ధిహీను లెంద ఱున్నారు ?

బాలుడు:—"ఇరువదిమంది."

---

డాక్టరు:—(చెవిటివానితో) ఈ మందు ఖరీదు అయిదురూపాయలు.

చెవిటివాడు:—పదిరూపాయలేనా ?

డాక్టరు:—లేదు ; లేదు ; పన్నెండు రూపాయలు.

---

తండ్రి:—ఈదఫా నీకు మంచి మంచి మార్కులు వచ్చాయా ?

బాలుడు:—వచ్చినయి !

తండ్రి:—ఏవి ! చూపించు ?

బాలుడు:—చొక్కాఅడుగున వీపుమీద ఉన్నయి.

---

ప్రశ్న:—ఈ డబ్బా తెఱపడం ఎట్లాగండీ ?

జవాబు:—లోపల వ్రాసిఉంటుంది.

దొరసాని:—(ఏజెంటుతో) నామాటకు బదులు చెప్పకుండావుండే పనికత్తె వకర్తి నాకు కావాలి.

ఏజంటు:—ఒక టెలిఫోను పిల్ల వుంది. యెవ్వ రెన్నిసార్లు ఏంమాట్లాణ్ణా బదులు చెప్పదు.

———

ఆస్పత్రి దొరసాని:—(రోగితో) డబ్బు తొందరవల్లనా నీవిక్కడికి వచ్చినావు ?

రోగి:—అవును. హోటలువాణ్ణిచూచి తప్పించుకోవడానికి రోడ్డుదాటబోతూవుంటే రోడ్డు ఆవయిపున ఇంకో అప్పులవాఁడు కనుపడ్డాడు. ఏమితోచేక రోడ్డుమధ్యలో నిల్చేటప్పటికి ఒక మోటారు నన్ను క్రిందఁబడేశింది.

———

తల్లి:—రామా ! యెక్కడుంటివి ?

రా:—కృష్ణునిదగ్గఱ.

త:—కృష్ణా ! నీవెక్కడుంటివి ?

కృ:—రామునిదగ్గఱ.

త:—మీరిద్దఱెక్కడున్నారు ?

రా-కృ:—వకరిదగ్గఱ వకరు.

———

చెప్పేదాంట్లో సగం ఆలోచించే దానికంటే ఆలోచించేదాంట్లో సగంచెప్పడం మంచిది.

———

ఆఫీసులో సింహముల్లాగ వుండి యింట్లో పెండ్లాంముందఱ కుక్కినపేన్లలాగా వుండే యజమానులూ వున్నారు.

———

ఒక సింహం భయముతో చేచ్చిపోయిందని వక వార్తాపత్రికలో వ్రాశారు. దానికి గయ్యాళిపెండ్లాం వుందేమో ?

———

రామయ్య తన మనస్సులో వుండేమాట నదురూ బెదురూలేకుండా అనేస్తాఁడు.

అతని పెండ్లాం గయ్యాళి కాదు గనుక.

———

రంగయ్య:—మాపిల్లలు నేనంటే బలే భయపడ్తారు.

మంగయ్య:—నీపెండ్లామంటే నువ్వూ బలే భయపడ్తావుగా !

———

హోటళ్లెందుకున్నాయిరాఅంటే పెండ్లాడ్తే యింట్లో చక్కగా భోంచేయ వచ్చునని బ్రహ్మచారులకి చెప్పడానికనీ అన్నారఁట.

———

డబ్బూ, కాలమున్నూ రెండూ ఒకటే అన్నారు. ఎందుకూ ?

రెండూ త్వరగా ఖర్చు పడేవేకనుక.

———

బాలభటుఁడు:—నాయనా ! నేనీప్రొద్దింటిలోవుంటూ నేవకరికిమహోపకారముచేశాను.

తండ్రి:—ఎట్లాచేశావు ?

బాల:—రామయ్యతాతా వెళ్లుతూవున్నాడు. ఎక్కడికని నేనడిగితే "రయిలుకు పోతూవున్నాను. రేపు కోర్టువాయిదా. రయిలందేటట్టు లే"దన్నాఁడు. "త్వరగా వెళ్ల"మన్నాను. కాని ఆయన మెల్లగా నడుస్తున్నాఁడు. అప్పుడు నేను మన పెద్దకుక్కనాయనమీదికి ఉసికొలిపాను. వకటేపరుగున ఆయన స్టేషనులో పోయిపడి రయి లందుకున్నాఁడు.

———

# సంపాదకీయములు

## తెలుఁగు

తెలుఁగు బాసయందలి యభిమానమును గూర్చి యీలోపల వ్రాఁతలరూపునను మాటల రూపునను నెన్నియో చర్చలు జరగుచున్నవి, కాని యందులోఁ గార్యకారిచర్చ యెంత యున్నదో పరికింప వలసి యున్నది.

" తెలుఁగు బాస- తెలుఁగు నేర్పు " అని యనుచున్నారు. కాని తెలుఁగు పండితుల కెంత గౌరవము గాంచఁబడుచుండుట తెలిసినదేకదా ? నన్నయాదుల నాఁటినుండి వచ్చుచున్న త్రోవ గ్రాంథికమనియును అది వాడుక బాస కాదనియును దానికి జీవము లేదనియును వాడుకబాసయే బలమయిన బాసయనియును చర్చలు.

వాడుక బాస యెప్పటికి ఉండినదే ఉండునదే కాని, దాని నియమము లెప్పటికప్పుడు ఎక్కడికక్కడ మారుచుండును. వ్యక్తిని బట్టి స్థలమునుబట్టి యది విశేషముగా మార్పునొందుచుండును. సర్వదేశ సంగతముగాను చిరస్థాయిగాను ఉండవలసిన గ్రంథములు వ్రాయుట యెట్లు ?

తెలుఁగునకుఁ దెలుఁగుఁదనము ఉండవలయు ననియును సంస్కృతపుఁ జేరిక పనికి రా దనియును ఒక వాదము, కాని యీ సూత్రము నుపాహరించుట యెట్లో ? తత్సమములును దద్భవములును సంస్కృతము తాలూకు సొత్తే కదా ? వానిని దీసివేసి, అవి పనికిరానప్పు డన్యదేశ్యములును పనికి రానట్లే కావున వానినిదీసివేసి, మిగిలిన తెలుంగు దేశ్యములనే తెలుంగన వలయును. అట్టి బాస వ్యవహారమునకుఁ జాలునా ? తద్భవదేశ్యమయమయిన యచ్చ తెలుంగులోనే పట్టుమని పది పొత్తములు వ్రాయఁబడలేదు, అచ్చతెనుఁగు వ్రాఁతలును ఉపన్యాసములును కేవల ముల్లాసార్థముకన్న నెక్కువ యుపయోగ్యమయినట్లు కానుపింపదు. తద్భవదేశ్యమయభాషా స్థితియే యిట్లున్నది. కేవల దేశ్యములయినచో నే పాటికిఁ జాలును ?

అనుక్రమాగతమయిన బాస పద్ధతు లెంతయును పాదుకొని యున్నవి. వాని ప్రకారముగా గ్రంథములను వ్రాయుటే సర్వదేశోపయోగ్యములుగా నుండును. ఉపయోగ్యతా ప్రదేశపరిమితినిబట్టి నియమములు సడలిన వాడుక బాస నుపయోగింప వచ్చునని తోఁచుచున్నది.

'దేశభాషలలోఁ జేదువులు' అను మాటలు మునుపటికన్న హెచ్చినవి. పాశ్చాత్యభాషా వ్యామోహము తగ్గుటకు మాఱుగా నెచ్చుచున్నవి. దేశీయ కవీశ్వరులయందలి గౌరవము హెచ్చలేదు. మీఁదుమిక్కిలి తగ్గుచున్నది. భావకవిత్వ మను పేర వ్రాయువారెచ్చిరి.

వారు చెప్పునదెంత భావకవిత్వమో సహృదయు లెఱుఁగుదురు ? షెల్లీ కీట్సు వర్డ్సువర్తు మొదలగు యాంగ్లకవులు భావకవీశ్వరులచే నుదాహరణీయు లయిరి. ఆ భావకవులలో తెలుఁగులోను ఇంగ్లీషులోను విశ్వప్రయత్నమున 30 మార్కులకు హెచ్చేని వారు నుందురు. నిజముగా వారికి సర్వదేశభావలోభమే యున్నచో వారికి బహుశః పాఠములలో నడ్డుపడియున్న యాంగ్లకవులు గాక పారసీకాదీతర భాషాకవుల జోలికి వారు పో రేల ? ప్రక్కఁ గల యరవములు కన్నడముల తెలుఁగును గమనింపఁ దగినది కాదా ?

ఇంకఁ బాఠశాలాకళాశాలలలో పఠనపాఠనపద్ధతులు. ఇంగిలీషు చెప్పుఉపాధ్యాయులకు నెక్కువ జీతము లిచ్చి వారి యెదుట తక్కువ వేతన మిచ్చు నెడలఁ బండితులను నిరుత్సాహపఱచుట కింతకన్న నేమి వలయును ? అట్లు వారి యుత్సాహము గౌరవము చేంపఁబడినప్పుడు బాస హెచ్చుఁదలకన్న చేచ్చుఁదల నొందదా? కనుక తెలుఁగుపండితులకు గౌరవమును ఆర్థికాను కూల్యమును నెచ్చిననాఁడే తెలుఁగు బాగుపడఁగలదు.

దేశభాషలలోఁ జేదువులు వలసినప్పుడు అందుమూలమున విజ్ఞానాభివృద్ధియగుటకు దేశభాషలోఁ బుట్టకీటు చేక్కగా నుండుటయే మూలము.

ఇంకను ఒక విషయము. చేదువులయొక్కయును పరీక్షలయొక్కయును పద్ధతు లెంతెంతగా పరిశీలనములను మార్పులను జెందుచున్నను నిరుద్యోగసమస్య, చేక్కఁబడలేదు, కాఁబట్టి విద్యార్థులకు నానావిషయవిజ్ఞానాభివృద్ధి గల్గించుటకుగాను విరివిగా నేర్పాటులు జరగవలయును. లేనిచో ఉన్న డబ్బును బాగుపడవలసిన కాలమును చేదువునకై వమ్ము గావించుకొను విద్యార్థులయొక్క (భవిష్యన్నిరుద్యోగులయొక్క) సమస్య నానాఁటికి నెచ్చఁగలదు.

స్థలాభావమునం జేసియును వ్యవధి లేమిం జేసియును నివ్విషయములనుగూర్చి యిప్పటికి నిల్పియవకాశముంబట్టి వ్రాసెద మని మనవి.

---

చెన్నపురమను నుద్యానవనమునుండి
త్రుంపఁబడి కొనిపోఁబడిన పుష్పములు.

(1) కీ॥ శే॥ సర్. శంకరన్ నాయరుగారు,
(జననము 11-7-57. మరణము 24-4-34)

సర్. శంకరన్ నాయరుగారు మలబారులో నొక సగౌరవకుటుంబములో జనించి కళ్లికోటలో పి. ఆర్. కాలేజీలో విద్య నభ్యసించిరి.

వారు హెచ్. హెచ్. షెప్పర్డ్‌గారి దగ్గఱ న్యాయవాదాభ్యాసము గావించి విశేషమయిన వృత్త్యభివృద్ధి గల్గి యుండిరి. కొంత కాలమునకువా రడ్వకేటు జనరల్‌గా నియమింపఁబడిరి. వకీళ్లు అడ్వకేటుజనరలు లగుట

కిదియే మొదటి తడవ. 1908లో వారు హైకోర్టు జడ్జీ లయి 1915 వఱకా యుద్యోగములో నుండిరి. 1919వఱకు వారు రాజప్రతినిధి విబ్యాలోచనసభాసభ్యులుగానుండిరి.

చెన్నపురి శాసనసభాసభ్యులుగా నుండినప్పుడు వీరు మలబారువివాహాపుంజట్టి మేర్పడుటకుం గారకులయిరి. అమోరిటిలో జరిగిన కాంగ్రెసుమహాసభకు సధ్యక్షత వహించిరి. ప్రారంభమునుండియును కాంగ్రెసు సభ్యుదయములో వీరుచేక్కనియభిరుచిని కలిగియుండిరి. పరిపూర్ణాయుర్దాయమును పరిపూర్ణగౌరవమును సహించి కాలధర్మము నొంది నారు. కాంగ్రెసుపర్యాయమునను, హైకోర్టు న్యాయాధిపతులుగాను, శాసనసభాసభ్యులుగాను, సంఘసంస్కర్తలుగాను వీరు చేక్కని పొగడ్తలకుం బాత్రు లయి రనుటలో సందియము లేదు.

---

కీ॥ శే॥ డాక్టరు యస్. రంగాచార్యులు గారు,

(జననము 28-4-82)

చెన్నగరమున సత్యుత్తమశస్త్రవైద్యులలో నొకరయిన యిమ్మహామహులు ఏప్రిల్ 24వ తేది మంగళవారము మధ్యాహ్నము 2 గం-45 నిముషములకు పరమపదించిరి.

1905లో వైద్యశాఖలోం జేరి మదరాసు రాజధానిలో పలు చోటులను పలు తెఱంగులయుద్యోగకార్యములను నిర్వహించినారు. 1919 లో చెన్నపురి జనరల్ హాస్పిటలులో నుద్యోగము నొంది 1926లో ఆ పనినుండి విరమించుకొని స్వతంత్రనిర్వహణ మేర్పాటు గావించుకొనిరి.

వృత్తిలో వీరి కున్న చాకచక్యమునం జేసి వీరికి వైద్యశాఖలో సత్యుత్తమపదవి లభింపవలసి యుండినది. అయినను ఐ.యం.యస్. గాకపోవుటచేత నది వీరికి లభింపలేదు. అట్లేర్పడుట జనసామాన్యముయొక్క యదృష్టవిశేషమే. వీరిశస్త్రవైద్యచాకచక్య విఖ్యాతి సమస్తదేశములను వ్యాపించినది. రాజధానిలోని జనులు వేలకొలందిగా వీరికడకుం జికిత్సార్థ మేతెంచుచుండిరి. బీదవారియందు వీ రత్యంతానుగ్రహము గల్గి వారికిం జికిత్సల కేమియును గొనక యే చేయుచుండిరి. వందలకొలదిగా విపన్నులకు వీరు మేలు గల్గించిరి. వేయేల ? రంగాచార్యులుగారి చేతులలోం బడిన విపన్నుండు తప్పక మేలొందు నను పేరు గడించిరి. వీరు కార్యనిర్వహణము వేగముగాను ప్రశాంతముగాను మనస్సంయమముతోను ధైర్యముతోను జేయుచుండిరి.

శస్త్రచికిత్సలోను ఔషధవైద్యములోను హిందువులు మిక్కిలి యుత్తమస్థానము నాక్రమింపంగల రనుటకు వీరొక సజీవదృష్టాంతమని శ్రీ యస్. సత్యమూర్తిగారు వచించియుండిరి.

---

కీ॥ శే॥ గౌ॥ సి. వి. కుమారస్వామి శాస్త్రిగారు,

విశ్రాంతి వేతనము నొందుచున్న న్యాయమూర్తులయిన గౌ॥ సర్. సి. వి. కుమారస్వామి శాస్త్రిలుగారు ఈ సం॥ ఏప్రిల్ 24 వ తేదిని తండియారుపేటలో తను సొంత యింటిలో కాలధర్మము నొందిరని తెల్పుటకు చింతిల్లుచున్నాము.

వీరు ప్రసిడెంసీ కాలేజీలో పట్టభద్రులయిన తరువాత న్యాయశాస్త్ర (Law) పరీక్షయందు త్తీర్ణులయిరి. 1905 లో వీరు స్మాలుకాజుకోర్టులో న్యాయాధిపతులయిరి. 1906 లో సిటీ సివిల్ కోర్టు న్యాయాధిపతులయిరి. 1914 లో వీరు హైకోర్టు న్యాయమూర్తులయిరి. 1919 లో వీరు తాత్కాలికముగాఁ ప్రధాన న్యాయమూర్తిత్వము గూడ వహించియుండిరి. 1930 లో వీరు న్యాయమూర్త్యుద్యోగమునుండి విశ్రాంతి గైకొనిరి.

వీరు న్యాయవాదులుగాను న్యాయమూర్తులుగాను నేర్పరితనమును ప్రకాశిపఁజేసినారు. మానవతత్వమును వీరు కడుంగడు జాగ్రత్తతోఁ బరిశీలింపఁ గల్గియుండుటవలన వారియొక్క తీర్పులు మిక్కిలి న్యాయముగా నుండుచుండెను. ఇంతటి గొప్ప పదవిలో నుండినప్పటికిని వీరు తమకుండిన జ్ఞానముతోఁ దనివినొందక నిరంతరమును ఇంగ్లీషును సంస్కృతమును ఒక విద్యార్థివలె నభివృద్ధి నొందించుకొనుచుండిరి.

కాస్మొ పాలిటన్ క్లబ్బులో వీరు సభ్యత్వమును వహించినారు. నిరంతరమును వీరు ఆక్లబ్బునకుఁ దప్పక వచ్చెడివారు. వీరితో సంభాషణమెంతయు నానంద దాయకముగా నుండెడిది. వీరి మాటలలో మనోహరమయిన చమత్కార పరిహాసములు తొణుకాడెడివి. వీరితో సంభాషించు నట్టివారు వీరు తెల్పునట్టి యింపయిన విశేషముల వలన సంతసము నందుచుండిరి. వీరియొక్క మూర్తి యెల్లప్పుడును నుల్లాస వంతముగాను గౌరవార్హముగాను ఉండెడిది. కాని వీరు విశ్రాంతి నొందినతరువాత భయంకరమయిన యతిమూత్రవ్యాధి వీరిని పొట్టఁ బెట్టుకొనినది.

---

కీ॥ శే॥ హాజీ సర్. ఇస్మాయిల్ సేటుగారు, జననము 1859.

కర్మాగారాధిపతులు. శ్రీ సేటుగారు తమ చేతిమీఁదుగా ఎన్నో ధర్మములను చేసినదాతలు. వర్తకులు. మిక్కిలి గొప్ప గొప్ప వర్తక సంస్థలెన్నిటితోడనో వీరికి సంబంధము కలదు. 1911 లో వీరికి ఖాన్ "బహదూర్" బిరుద మొసంగఁబడినది. 1923 లో "సర్" బిరుదము వచ్చినది. వీరివి పందెము గుఱ్ఱములెన్నియో కలవు. లోకమంతటను సంచరించినారు. వీరి మృతివలన లోకమున కెంతయును నష్టికల్గినదనుటకు సందేహము లేదు.



ఎ. వి. టి. అయ్యరుగారి అనుమతిని.

వేదారణ్యము కోవెల అన్తర్దృశ్యము.

కీ॥ శే॥ బ్ర॥ శ్రీ॥ శతావధాని-కేతవరపు-
వేంకటశాస్త్రులుగారు,

సుప్రసిద్ధ నవలారచయితలును, పండితులును, వ్యాఖ్యాతలును, శతావధానులును, కవీశ్వరులును, అయిన బ్రహ్మశ్రీ, కేతవరపు వేంకటశాస్త్రులుగారు 4-5-34, శుక్రవారము మధ్యాహ్నము 1½ ఘంటలకు స్వర్గస్థులయిరని తెల్పుటకుఁ జింతించుచున్నాము. వీరివయస్సు 52 సంవత్సరములు. వీరు తమ జీవితమును సంపూర్ణముగా భాషాసేవకు వినియోగించినారు. పరమేశ్వరుఁడు వీరి యాత్మకుఁ బ్రశాంతి నొసంగును గాక.

——

స్కూలు ఫయినల్ తెలుగు పరీక్ష-1934.

ప్రశ్నపత్రము 4-వ ప్రశ్నము.

" చారుదత్తుని మరణదండన ... ..."లో " చారుదత్తుని "కి " బారు ... " అనిపడినది.

5-వ ప్రశ్నము.

" కపిల తనసుతునకు ... ..."లో, 'కపిల-తన" అను మాటల మధ్యను స్థలము వేఱు చేయఁబడ లేదు.

7-వ ప్రశ్నము.

"కాళిందీ వివాహము "లో " కాళింది "కి బదులు " కొళింది " పడినది.

పయిని ప్రశ్నములవలన పరీక్షబాలకులు పలువురు 4-వ ప్రశ్నలో " బారుదత్తుఁ " డెవఁడో తెలియకయును, " కపిలతన "యన నేమియో యనుకొనియును, "కొళింది"యన్న నేమియో యని కొందఱును, అరవము తెలిసిన వారు బహుశః ఆఁడపిల్ల యనుకొని యును నుత్తరములు వ్రాయలేక యుత్తర దక్షిణదిక్కులు చూచినారు.

"ఏ మయ్యా ! గవర్నమెంటు పరీక్షలలో ప్రూఫులు సరిగా దిద్దు నేర్పాటు కొఱఁతగా నున్నదే. బిడ్డలగతి యేమి ? " అని యొక విద్యాశాఖాధికారిని బ్రశ్నింపఁగా "ఆ మాత్రము తప్పులు సవరించుకో లేని బాలురు విద్యార్థినామమునకుఁ దగరు " అని సరసముగా జబాబు చెప్పి వీనులకు విందొనరించిరి. అట్లయినప్పుడు తప్పులు లేని వారని పించుకోఁ దగిన పరీక్షకులిట్టి తప్పులు గావించి పిల్లవాండ్రకు నష్టిగల్గింప వచ్చును గాఁబోలు. బహుశః నాకు దర్శన మిచ్చిన యధికారులు " ఈతప్పుల నుపయోగించుట " " Correct the following " వంటి ప్రశ్నగా తలంచిరి కాఁబోలు. ఈ రకమయిన యధికారులవల్లనే విద్యాశాఖయందుఁ దెలుఁగు బాగు పడ వల యునుగదా ?

# వార్తలు విశేషములు

అహ్వాన సంఘము, నంద్యాల

కర్నూలుజిల్లా నంద్యాలకు సమీపమున నున్న పవిత్రమగు శ్రీమహానంది పుణ్యక్షేత్రమున భావనామ సం॥ నిజవైశాఖ శు॥ ౧౦, ౧౧, ౧౨, లకు సరియగు 1934 సం॥ మే నెల 24, 25, 26, వ తేదీలయందు 17 వ ఆర్యవైశ్య మహాజనసభ. 10 వ మహిళాసభ 6-వ యువజనసభ, 2-వ వ్యాయామసభ, ప్రథమకవి పండితసభ, అఖిలభారత స్వదేశి వస్తుప్రదర్శనమును జరుగును. ఆ సందర్భమున తాము పుత్ర మిత్ర కళత్ర సహితముగా విచ్చేసి మాయాతిథ్యమును స్వీకరించి సభలలో పాల్గొని కులోన్నతి విషయ చర్చలకు తోడ్పడి సభలు జయప్రదముగా జరిపించుటకు తోడ్పడుదురు గాకయని ప్రార్థించుచున్నారము.

ప్రతినిధులు కాఁగోరు వారికి ప్రవేశ రుసుము లేదు.

ఇతర జిల్లా ప్రతినిధులు మే 24 వ తేది ఉదయము 9 గంటలలోపుగా తమ పేర్లను రిజిష్టరుచేసుకొని ప్రతినిధి పత్రము పొందవచ్చును.

బాట వివరము:—

సభలకు రైలుమార్గముగా వచ్చు వారు గాజులపల్లి రైల్వే స్టేషనులో దిగవలెను. అచ్చటికి మహానంది 3 మైళ్లుండును. తగిన సౌకర్యములు రైల్వే స్టేషను వద్ద చేయఁబడుచున్నవి.

రాజా-పెద్ద సుబ్బరాయుడు శెట్టి,
కార్యదర్శి.

---

సోవియటు పోలీసుస్టేషనులలోనెల్ల నొక యంత్రముండును. దానిపేరు "ఆల్కోలో మీటరు." అది డాక్టరు రాషర్టుగారిచే కనిపెట్టఁబడినది. దాని సాయముచేత నొక మనుష్యుఁడు మధుపానము చేసినాఁడా లేదా యను విషయము తెలియును.

ఆ యంత్రమునందొక యద్దపు సులోచనమును నొక వంకరయయిన గొట్టమును నుండును. ఆగొట్టములో రంగులేని యొకానొక ద్రవపదార్థముండును. త్రాగినాఁడని యనుమానింపఁబడినవాఁ డాగొట్టముగుండా 20 సెకండ్లవఱకు గాలి నూఁదవలయును. ఆ ద్రవపదార్థమునకుఁ బలుచేని యెఱ్ఱనివన్నె వచ్చినయెడల ఆ మనుష్యుఁడు మధుపానము గావించినట్లు.

---

ప్రావెంసు దేశములోదోసపండ్ల(కర్బూజా) పంట తగ్గుటకు ముఖ్యకారణము అక్కడ విశేషముగా సంచరించునట్టి మోటారు బండ్ల యొక్క "బాయిబాయి" ధ్వనియని తెలిసికొనఁబడినది.

---

భూకంప విశేషములు

సమస్తిపురములోనొకయిల్లు భూకంపము వల్ల సంపూర్ణముగాఁ బడిపోయినది. ఆయింటి లోనివారొక చిన్నపిల్లతప్ప నందఱును బయటికివెళ్లి యాపిల్ల యిల్లుపడి మరణించినదని తలంచినారు కాని కొంతసేపటికి కాబిడ్డ యొక తడకపయిన నాడుకొనుచుండినది. ఆశ్చర్యకరము గదా?

-----

పూరీజిల్లాలో డంరాగ్ అను గ్రామము నందొక పేద కాఁపువాఁడు గడ్డికోయుచుండెను. అప్పు డకస్మాత్తుగా నేలబీటవాఱి ఆ కాఁపందులోఁ బడిపోయెను. 6 రోజుల తరువాత యాపగులులోనుండి నీ రుబికినది. ఆకాఁపువాఁ డానీటితోఁగూడ బ్రతికియే బయటకు వచ్చినాఁడు.

-----

ముజఫర్‌పూరుజిల్లాలో షోహరుగ్రామములో నొకయిల్లు పడిపోయిన రాశిని త్రవ్వఁగా నేలకంటె తక్కువమట్టమున నొక పంజరమును అందొక బ్రతికినపక్షియును బయల్పడినవి.

-----

13 సంవత్సరములక్రింద నొక బీదవాఁడు బ్రతుకుకొఱకు ముజఫర్ పురమునకుఁ జేరుకొన్నాఁడు. అక్కడ నతనికి వివాహమై బిడ్డలగని సుఖమయిన పరిస్థితి యేర్పడియుండినది. భూకంపమువలన అతనియిల్లు పడిపోయి అతని కుటుంబమును ఆస్తియును సర్వనాశనమయినది. తా నాయూరి కెట్లువచ్చెనో అట్లే వెనుదిరిగిపోవలసి వచ్చినదని యనుచు నతఁ డాయూరినుండి వెళ్లిపోయినాఁడు.

-----

ఆజిల్లాలోనే పూర్ణబియాలో నొక దేవాలయమంతయు నేలమట్టమయినది. దాని యొక్క మహంతెట్లో తప్పించుకొన్నాఁడు. అతఁడు నిల్చినచోట నేలపగులువాఱి వేడినీరుబికినది. అప్పు డతఁడొక గడ్డివామిపయిని కెక్కి "గడ్డియే తనను కాఁపాడిన" దన్నాఁడు.

-----

ఝాన్సి జిల్లామ్యాజస్ట్రేటులయిన పార్టరు దొరగారి గౌరవార్థమొక విందునకుఁగాను ఆప్రదేశస్థులు మిక్కిలి యుత్సాహముతో విశేషముగా ద్రవ్యమును బ్రోగుచేయఁగా ఆదొరగా రామొత్తమును దనను గౌరవించు విందునకు సెలవుచేయుటకన్న బీహారు భూకంపనిధికి పంపినచోఁ బారమార్థికముగా నుండఁగలదని చెప్పఁగా ఆ పురవాస్తవ్యులు ఆ మొత్తమునకుఁదోడుగా మఱికొంత ద్రవ్యమును వసూలుగావించి బీహారుభూకంపనిధికిఁ బంపిరి. పయినెన్నిన యుదారాశయముగల దొరగారి కీప్రవర్తనవలన టీపార్టీవలన దొరకెడిగౌరవమునకన్న నెన్నిమడుంగులోయెక్కువయిన గౌరవము లభించినది. లేనిపోని యాడంబరములకొఱకు సడ్డమయిన పాట్లు

పడక దీనరత్షణమునకు నామోదించు ఈదొర గారివంటి యుద్యోగస్థు లుండుట దేశము యొక్క భాగ్యము కదా ?

———

నమ్మినను నమ్మకున్నను అది మీయిష్టము

పట్టువంటి సన్నబట్టలు నేయఁ బడునంత సన్నగా నుక్కును తీఁగగా లాగవచ్చునఁట.

———

లోకములో భూభాగములో సైబిరియా 9-వ వంతగును.

———

ఒకయిటుక 24 అవున్సులనీటిని బీల్వఁ గలదు.

———

204 అడుగులకన్న లోతుగా సముద్రములో ముంపఁబడిన కార్కుముక్క నీటి పయినికిఁ దేలదు.

———

అద్దముగుండా అవతలి వస్తువులను గాంచేఁ గలము గదా ? కాంచుటకు వీలయిన యుక్కుతేఁకు లిప్పుడు తయారు చేయఁబడు చున్నవి.

———

ఒక సెకండుకు 160 లక్షల టన్నుల ప్రకారముగా నేలపయిన వర్షము గుతియును.

———

లోకములోనుండు నోడలలో సగము మొత్తము బ్రిటీషువారివి.

———

కొన్ని దుర్లభమయిన పోస్టేజీ బిళ్లలు 10 వేల పవునులకుఁగూడఁ గొనఁబడుచున్నవి.

———

లండను న్యాయస్థానముల కట్టడములలో 11 వందల గదులున్నవి.

———

మంచి వేఁటకుక్క గంటకు 35 మయిళ్ల ప్రకారము పరుగెత్తఁగలదు.

———

ఏనుఁగున కెనిమిదే పండ్లు.

———

సొరచేఁప 3 రోజుల కెనిమిదివందల మయిళ్లీదఁగలదు.

———

జంతువులన్నిటిలో ఒంటెయును పందియును మాత్రమే యీఁదఁ జాలనివని చెప్పఁ బడినది. కాని పిల్లిసంగతి యేమో ?

———

ఒకమిల్లిగరిటెడు రేడియంవెల 50 వేల పవునులని తలంపఁబడుచున్నది.

———

# పురాతన బౌద్ధ శిల్పములు

క్రీస్తునకుపూర్వము 8 శతాబ్దములనాఁటి శిల్పములు లాహోరు వస్తుప్రదర్శనశాలలో క్రొత్తగా చేర్పఁబడినవి:—లాహోరువస్తుప్రదర్శనశాల పరిశీలనాధికారులయిన డాక్టరు కే. యన్. సీతారామగారు "నగరోటా"కు కొన్నిమైళ్లదూరములో నున్న పాటియార్ అను గ్రామముకడ కొన్ని యమూల్యము లయిన శిల్పములను కనుగొని లాహోరు వస్తుప్రదర్శనశాలకు చేర్చియున్నారు. ఆస్థలము నందు ఒకటి రెండు చోట్ల త్రవ్వగా నారికవి లభించినవి.

ఈ లభించినట్టి ఆఱు శిల్పములలో నాలుగు ముక్కలున్నవి ఈ ముక్కలను, సరిగా చేర్చినయెడల జతపడునట్టి రెండు శిల్పములగును. ఒక్కముక్కలో మారుని కోమాత్రైలు బుద్ధుని మోహింపఁజేయు ప్రయత్నము గలదు. ఈ శిల్పము దాదాఁపుగా క్రీ. పూ. 8 శతాబ్దములనాఁటిదో యంతకన్నను పూర్వముదో యయి యుండవచ్చును. అందువలన బౌద్ధమతం బీభాగమునందుఁగూడ నప్పుడు వ్యాపించి యుండెనని మిక్కిలి యాశ్చర్యకరముగా నాఁటి శిల్పములయిన యివ్వి ఋజువుచేయుచున్నవి. ఆశిల్పములలో గణపతివిగ్రహముగూడ నుండుటవలన ఆకాలమునందు ఆ ప్రదేశంబునందు హిందూమతమునకును బౌద్ధమతమునకును మైత్రి యుండినట్టి సంతోషవార్తయును నూహింప వీలగుచున్నయది.

ఈ శిల్పము అర్ధచంద్రాకారముగా నున్నది. దానియొక్క యడుగుమట్టము మధ్యమునందు నొకకమలము గలదు. దాని నుండి యార్యావర్తపద్ధతిప్రకార మొకగోపుర మేర్పడియున్నది. ఆ స్తంభ మంటపంబునందు పీఠముపయిన బుద్ధుఁ డాసీనుఁడై యున్నాఁడు. దానికి ఆ కమలరూపమయిన శిఖరము గలదు. అక్కడినుండి రెండు పట్టలుచేతియొక్కవైపునకు అర్ధచంద్రవలయాకారముగా వంగియున్నవి. ఆ రెంటికిని రెండు వీణావాదన గావించు బొమ్మలు అంటఁ జెక్కఁబడియున్నవి. ఆ బొమ్మలకు నడుము నుండి పైని శరీరభాగములకు వస్త్రధారణము లేదు. చెవులకు కుండలములు గలవు. అడుగు చట్టములు ఒక పద్మమును రెండువైపుల నుండి యాక్రమించిన ట్లున్నవి. అక్కడనే గంధర్వప్రతిమలుగూడ కలవు. ఈ యర్ధ వలయములో రెండువైపులను ఆర్యావర్త శిఖరములు గలవు. అందులో నొకదానిపై గణపతివిగ్రహముగలదు. అది మిక్కిలి యఱిగి పోయినది.

రెండవ శిల్పముగూడ తునకలుగానున్నది. ఒక కూర్చుండిన మనుష్య విగ్రహముయొక్క వక్షస్స్థలము మధ్యముగుండా తునుకలయినది.

ఆ విగ్రహము హిందూదేవుఁడైన గణపతి దని తెలియుచున్నది. పై ముక్కలో తొండము తోడి యేనుఁగు ముఖమును పైని చేతులు రెండును కలవు. క్రింది తునుకయే చిక్కఁగా నున్నది. ఎందు కనఁగా గణపతి ఒకచేతియందు జలకలశము ధరించి, రెండవచేతిని తొడపై నుంచుకొని యిందుఁ జూపఁబడినట్లు యోగా సనమున గూర్చుండు పద్ధతి చాల అరుదు. అంతియకాక ఆ పొట్టయును దేహముయొక్క క్రింది భాగములు విఘ్నేశ్వరునివానిని బోలకయొక వస్త్రాదు భాగములవలె కనుపట్టు చున్నవి. క్రింద నాలుగు కాళ్లపయిన నొక జంతువు కూర్చుండియున్నది. అది యొక చిట్టెలుకరూపమును బోలియున్నది.

ఈ శిల్పము ఏకాలమునాఁటిదో సరిగా తెలియదు. కాని బహుశః క్రీ॥ పిమ్మట 7 వదో 8 వదో శతాబ్దములనాఁటిదని తోఁచు చున్నది.

---

## సవరింపు

ఈ చంద్రిక 2-వ సంచిక 135-వ పేజీలోని స్వీకారము రెండవ వరుసలో మ॥ పూతల పట్టు-శ్రీరాములు రెడ్డిగారి పేరు పొరపాటున అన్యథాముద్రింపఁబడినది. అందులకు మా చింతను దెల్పుచున్నాము. శ్రీ రెడ్డిగారు మమ్మును క్షమింతురుగాక.

## సవరణ

ఈ సంచికలో 155 వ పుటలోనుండు "అవును, నిజమే" అను కత శ్రీ దోమా-"వేంకటస్వామి గుప్తగారి"దని ప్రచురింపఁ బడినది. అది పొరఁబాటు. ఆ కత శ్రీ గుప్త గారినుండి మాకు వచ్చుటవల్ల వారిదని తలఁప బడినది. కాని ఆ ఫారము ముద్రితమయిన తరువాత ఈ సంగతి తెలిసినది.

---



# శిష్టాక్షరపదబంధము

## (CROSSWORD PUZZLE).

(చంద్రిక జూను నెల సంచికకు)




### నిలువరస.

1. దొరతనము.
2. లిపి.
3. ప్రస్తావనకుదెచ్చు.
4. బిడ్డలుపాదమందు భూషణము,
6. మహిషము.
8. మరణము.
9. కవిత్వము.
12. కొంచెమెఱుపు.
13. బ్రహ్మ.
15. ఆముది.
16. మాతులుడు.
17. రేఖారూపమైన.

### అడ్డవరస.

1. రాచేకొమారుడు.
3. భయపడినది.
5. వజ్రాయుధము.
7. ఋషి.
9. మద్యము.
10. విష్ణువు.
11. కవి.
12. న్యాయము.
14. చీకటి.
16. ఇంద్రుసారథి.
18. ఒ.సంవత్సరము యొక్క పేరు.
19. పిప్పి.

బహుమాన నియమములు:—పూర్తి ఈ చంద్రికా పత్రిక పుటపయిన వ్రాసి పంపినను నట్టి కాగితము పయిన వ్రాసి పంపినను దానివెంబడి 2 అణాల తపాలు బిళ్లలు రుసుము పంపవలయును. ఒక్కొక్క పూర్తికి రెండణాల ప్రకారము తపాలు బిళ్లలు పంపుచు ఎన్ని పూర్తులయినను పంపవచ్చును.

పూర్తులు జూన్ నెల 5 వ తేదీలోపల కార్యస్థానమునకు చేరవలయును. దీని జవాబు మా కార్యస్థానములో నీల్డు కవరులో భద్రపఱుపఁబడి యున్నది. జవాబులలో మా దగ్గఱనుండు జవాబులో నన్ని రీతులను సరిపడినదియే మొదటి రకము పూర్తి. ఒక తప్పులోఁ బూర్తికాబడునది రెండవరకము పూర్తి. మొదటి రకములో పూర్తిచేసినవారికి 5 మాసములును రెండవరకములోఁ బూర్తిచేసినవారికి మూఁడు మాసములును చంద్రికా పత్రిక యుచితముగాఁ బంపబడును. సంపాదకుని నిర్ణయమున కాక్షేపణము ఉండదు. పూర్తియును అడ్రస్సును స్ఫుటమయిన యక్షరములలో నుండవలయును.

నిఘంటువు:—మహాకాళి. సుబ్బారాయుఁడుగారి "ఆంధ్రశబ్దార్థ చంద్రిక."

---

# స్వీకారము

## మా కార్యస్థానము నలంకరించిన పత్రికలు:—

దేవదత్తము:— ఏలూరు, ప్రారంభవిద్య:— ఏలూరు, విశ్వకళ:—గుంటూరు ఐరావతి:—రంగూన్, ప్రజాసేవ:—నెల్లూరు, ప్రజామిత్ర:—మద్రాసు, సరస్వతి:—విశాఖపట్టణము, గృహలక్ష్మి:—మద్రాసు, భారతి:—(తెలుగు,) మద్రాసు, సహకారపత్రిక:—నెల్లూరు, ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక:—కాకినాడ, త్రిలింగ:—మద్రాసు, ఆంధ్రభూమి:— మద్రాసు, ఆయుర్వేదచంద్రిక:—పేరిదేపి:—నెల్లూరుజిల్లా, లోకబోధమాసపత్రిక:— కపిలేశ్వరపురము:—తూర్పుగోదావరిజిల్లా, కార్మికసంఘము:— అనంతవరము తెనాలితాలూకా, మక్కళపుస్తక (కన్నడము)— బెంగుళూరుసిటీ, ప్రబుద్ధాంధ్ర:—రాజమండ్రి, విశ్వకర్ణాట:—బెంగుళూరు, ఆదిశైవపత్రిక:—చిలుమూరు, భారతి (కన్నడము), మాల్కి (సౌత్ కనరా) ఆనందచంద్రిక (కన్నడము), కేలిమంగలము, సేలం జిల్లా, రెడ్డిరాణి:—రాయవరము:—గోదావరిజిల్లా, కల్యాణి:—విజయనగరము, సుప్రభాతము:—కాశి, ఆరోగ్యప్రకాశిక:— మద్రాసు, సుబోధిని:—నెల్లూరు.

## మా కార్యస్థానము నలంకరించిన పొత్తములు.

(ఏప్రల్ సంచికలోఁ దెలిపినవికాక).

జన్మభూమి:—(చిన్నకథ)యును, సుగుణాకరము:—(కథలు) వీని కర్తలు ముద్దా- విశ్వనాథముగారు, శ్రీ వివేకానందసందేశము :—గ్రంథకర్తలు :—శ్రీకూచి-నరసింహము పంతులుగారు" దూదేకుడు:—శ్రీముకుంద స్తవరాజము:—ఆలపాటి - కామేశ్వర రాయకవిగారి కర్తృకములు. ఉభయభాషావాచస్పత్యము:—గ్రంథకర్తలు:—బ్ర. శ్రీ. కొత్రా - శ్యామలకామశాస్త్రి గారు, (మొదటిభాగము), నెలవంక:—గ్రంథకర్త:—శ్రీ ఆవంత్స- వేంకట రంగారావు బి. యె. యి డి. గారు, బ్రాహ్మణగీత:—శ్రీ పండిత. బులుసు - రామజోగారావుగారి కర్తృకము.

---

సూచన:—పయినెన్నిన పత్రికలను గూర్చియును గ్రంథములను గూర్చియును వీలును బట్టి విమర్శనములు సాధ్యమయినంత త్వరలోఁ గావింపఁబడును.

(సంపాదకుఁడు.)

# విమర్శనములు

**సౌందర్యమంజరి:**—ఇయ్యది యొక మనోహారం బయిన ద్విపద కావ్యరాజము. గ్రంథకర్తగారు జగమెఱింగిన బ్రాహ్మణులయిన శ్రీకాల్లకూరి - గోపాలరాయ కవీశ్వరులు, వీరు "కేవలకవయస్తు" లోఁ జేరని విద్వాంసులు. రసికులు. వీరి గ్రంథములు "అపూర్వసంఘసంస్కరణము" "వసంతసేన" మొదలయినవి కొన్నియే యున్నను చిరంజీవులు కాఁదగిన నిక్కమైన మంచినీలములు. శ్రీనాథమహాకవికావ్యములం బలెనె వీరికావ్యంబులంబట్టియును నూత్నయౌవనమును నిండుజేవ్వనమును ప్రౌఢ నిర్భరవయః పరిపాకమును నిర్ణయింపఁ బొసఁగెడినని తోఁచుచున్నది. ఇది వీరింగూర్చిన పరిచయము.

ఇఁకనీ 'సౌందర్య మంజరిం'గూర్చి:—వీరి సౌందర్యలోభము మొదటినుండి ప్రతిగ్రంథమునందును గనుపట్టుచునే యున్నది. అంతటితోఁ దృప్తినొందక కావ్యతత్త్వసౌందర్యోపాసనంగూర్చి తమకున్న యభినివేశంబు నంతయు నిప్పాత్తంబురూపంబున వెలయించినారని తోఁచెడిని.

"బాల్యంబునుండి నీభక్తుండనంబ!" అను నుడికారంబవ్విషయంబు నొప్పింపఁగలదు. ఆంధ్ర సారస్వత ప్రపంచంబులో శ్రీవారు కడుంగడు బాల్యంబునుండి ప్రవర్తింపుచుఁ గవితామతల్లీసమర్చానిమగ్నులై యున్నారు. తద్విషయ కాత్మగౌరవమున "సకల తంత్రస్వతంత్రకవులం" గొల్చియనిముఱిసినారు. "కవిగోపుఁడు ప్రసాదకామధేనువును శృంగార లసదలంక్రియనుగ్రహించి యఖిలపదార్థంబులను మేఁతమేఁపి ధ్వనిగుణబద్ధగాఁ బాలించి పితికి రస పయోవృష్టి మానసభాండమందు" అని కవన విధానమును నిరూపించినారు కూడను. ఇయ్యది వారి స్వానుభవంబె యనిపించెడిని.

మఱియును "ప్రకృతిశక్తి యనెడి పాలసంద్రంబు! ప్రాచ్యులు పాశ్చాత్యులచ్చ్య తద్రథిమ। భావయంత్రంబులు బాహ్యయంత్రములు। గానొప్పు కవ్వముల్ పూని మథింప॥" అని "Spiritualism, ఆధ్యాత్మికత" "Materialism, భౌతికత" అను దృష్టులను బట్టియును సడలక తమకుఁ బ్రకృతియం దుండు గౌరవమును దెల్పినారు. వేయేల? ఎల్లవితాలను ఎల్ల రసంబులయందును వీరు గావించిన సౌందర్యారాధనం బిప్పాత్తంబునం గాన నయ్యెడిని, ఆంధ్రభాషా యోషారత్నంబున కీ పొత్తంబొక యమూల్య నూతనాలంకారంబు గానోఁపు.

"మణినా వలయం వలయేన మణి" అను రీతిని విద్వత్ప్రభువులును, రసికవతంసులును, మహాదాతలును, కవీశ్వరులును, అహంకారాది శూన్యులును, సమస్తసద్గుణ విరాజితులును అని పేరెన్నికంగన్న శ్రీ జయపురాధీశ్వరులయిన శ్రీ. శ్రీ. శ్రీ రాజా విక్రమదేవ వర్మమహారాజులుంగారీ కృతికి భర్తలగుట శ్రీమద్గోపాలరావుగారియొక్క కార్యం బిహ పరంబులయందును ధన్యతంగాంచినది. పరమాత్ముఁడీ కృతికర్తకు కృతిభర్తల కెల్ల శుభంబు లొసంగ వలయు నని మా మనః పూర్వక ప్రార్థన.

(దొ. వేం. గుప్త.)

---

**వీరాబాయి:**— ఇదిచెన్నపురియందలి హిందూ హైస్కూలునఁబ్రధానాం ధ్రోపాధ్యాయులు లయిన శ్రీమాన్ విద్వాన్ - ఈ భాష్యకాచార్యుల వారిచే రచియింపఁబడినది. ఇందలి కథాసంవిధానము మిక్కిలి

చమత్కారముగా నుండి "విమలాదేవి"ని బోలు చున్నది. ఈపొత్తము భాషకు నుపయోగ పడుననుటకు ఇది విద్యార్థులకు పఠనీయముగా నిర్ణయింపఁ బడుటయే సాక్షి. పది యేడవ ప్రకరణములోఁ భగవద్గీతయందుఁ దెల్పఁబడిన పారమార్థిక విషయములు చొప్పింపఁబడినవి. ఈ గ్రంథకర్తగారింకను బహు గ్రంథములను వ్రాసి కీర్తిఁగడింతురు గాక. వెల ఒక రూపాయ మాత్రమే. గ్రంథకర్త గారికే వ్రాసి తెప్పించు కొన వచ్చును.

---

శరణ్యః——ఇయ్యది యొక నవల. శ్రీమతి సమర్థి స్వర్ణమ్మగారిచే వ్రాయఁబడినది. ఈ గ్రంథకర్త్రిగారి చేత నిదివఱకే కొన్ని గ్రంథములు వ్రాయఁబడినవి. ఇందు ప్రౌఢావివాహావసరము నిరూపింపఁబడి యున్నది. అట్లు జరగనినాఁడు కలుగునట్టి యిక్కట్టులును తెల్లముగాఁ దెల్పఁబడినవి. స్త్రీరత్నముచే వ్రాయఁబడుటంజేసి యాయా స్త్రీ పాత్రధర్మములు చక్కఁగాఁ బోషింపఁబడినవి. లక్ష్మీ సరస్వతులయనుగ్రహంబునంజేసి యలరారు నేతద్గ్రంథకర్త్రి యెంతయు భక్తితో నిప్పొత్తమును కులదేవత యయిన శ్రీ కన్యకాపరమేశ్వరీదేవికి నంకితంబుగా సమర్పించు కొన్నయది. సంవిధానములతోఁబాటుగా ఆనంద ముద్రణాలయముద్రణముగూడ నందముగానున్నది. పరమాత్ముఁడీ గ్రంథకర్త్రిగారికి సమస్తశుభంబుల నొసంగి నిట్టిగ్రంథంబులను విశేషంబుగా రచియించునట్లు అనుగ్రహించునుగాత. ఈ గ్రంథంబులు వలయువారు, ఆర్. వేంకటేశ్వర్ అండు కంపెని మద్రాసు, అను అడ్రసునకు వ్రాయవలయును. వెల. అ. 12.

ఇంకను ఈ గ్రంథకర్త్రిగారు రచియించిన గ్రంథములు:——

ఇందిర, మల్లికావసంతము, శ్యామల,

ఈ గ్రంథములు గూడ పయి అడ్రసునకే వ్రాసినచో లభించును. (దో. వేం. గుప్త.)

---

రాధ:——ఇది శ్రీమతి విద్వత్కవితిలక కాంచనపల్లి కనకమ్మ గారిచే రచియింపఁబడిన నవల. ఈ విదుషీమణి యాంధ్రదేశమునకుఁ జిరపరిచితురాలు. ఈ కవయిత్రీరత్నమునకు శ్రీ॥ కింకవీంద్రఘటాపంచానన శతావధాని-చెళ్లపిళ్ల- వేంకటశాస్త్రిలుగారి యాజమాన్యమున ఈ చెన్నపురము సౌందర్య మహాలునందు "కవితిలక" మను బిరుదొసంగఁబడిన సభలో తత్సందర్భమునఁ శ్రీదోమా వేంకటస్వామి గుప్తగారిచే జెప్పఁబడిన ప్రశంసాపద్యములలో నొకటి:——

ఉ॥ కాంచనపల్లి వంశము-నిఃకం గనకాంబిక పేరు నల్ల బో! ధాంచితురాలి కావ్యము సమంచితమంచును నిర్ణయింపఁ దా! నంచితుఁడిందుశాణఫలకాకృతి వేంకట సత్కవీంద్రుఁ డే! మించె, నిఁ కిందుఁ జేలఁగల మేల్మితనమ్మున సందియం బొకో॥

ఇట్టి వీరు రచియించిన ఈ నవల అరవమునుండి అనువాదమయినప్పటికిని అరవము గాక కలరవమై యందముగా నున్నది. "విశ్వశ్రేయః కావ్యం" అను సూత్రకారుని యభిప్రాయమున కెంతయు లక్ష్యముగా నున్నది. "అలమేలు" "రాధ" అను కన్యల నైర్మల్యము-అమృతవల్లియొక్క విషవల్లితనమును తగినట్లు బహూకరింపఁబడినవి. వేయి మాట లేల? గ్రంథము చదువ మొదలుపెట్టినదాది విసుగుగలిగింపక తుదివఱకుఁ జదువవలయు ననిపించును. చక్కని నీతిబోధయు, భాషాలక్షణపోషణమును, రసగుంభనమును ఇందు బాగుగాఁ దనరుచుండుటఁజేసి బాలబాలికలకు పఠనార్హమని చెప్పక తప్పదు. దైవ మా విద్వాంసురాలికి నాయురారోగ్యా ద్యానుకూల్యము లొసంగి యింకను భాషాసేవ చేయించును గాక. (దో.వేం.గుప్త.)

---

## మా కార్యస్థానము నలంకరించిన పత్రికలు

ప్రజాసేవ.—నెల్లూరునుండి శ్రీ ఘాలి - సుబ్బరామయ్యగారి సంపాదకత్వమున ప్రతి శుక్రవారమును వెల్వడు తెలుఁగు వారపత్రిక. ఇండియాలో సం॥ చేందా రు. 1-8-0 బయట రు. 2-0-0.

ఇందు ముఖ్యముగా నెల్లూరుజిల్లా వార్తలు ప్రకటింపఁబడును. ఒక పుట యింగ్లీషుభాషలో సయితము నుండును. 20-4 34 వ తేది శుక్రవారము ప్రచురింపఁబడిన సంచికలోని యింగ్లీషు వ్యాసము శ్రీ కీ॥ శే॥ కళాప్రపూర్ణ వేదము వేంకటరాయ శాస్త్రిలుగారిని గూర్చినదిగా నున్నది.

సహకారపత్రిక.—నెల్లూరుజిల్లా కో ఆపరేటివ్. బ్యాంకింగు యూనియన్ వారిచేఁ బ్రకటితమగు మాసపత్రిక.

సహకార సంఘముల పద్ధతులను దేశమునందు ముఖ్యముగా ఆంధ్ర ప్రదేశములయందు వ్యాప్తిచేయుటకు నెలకొల్పఁబడిన మాసపత్రిక. తద్విద్యలో నధికులయినవారిచే తయారుచేయఁబడిన లెటర్సు పేటెంటు నెం. 71. 1932 సర్ బజెట్ బీస్లీ. బార్డ్సువెల్ గారి తీర్పులు—అమెరికా సంయుక్త రాష్ట్రములు, సెంట్రల్ బ్యాంకీల ద్రవ్యపద్ధతులు మొదలయిన యమూల్యవ్యాసములుమాకుఁబంపఁబడిన ఏప్రిల్ నెల సంచికలోఁ గలవు. ఆర్థిక ప్రాతికూల్యము గల్గిన యీ రోజులలో ఆర్థిక విధానమున కీపత్రిక మిక్కిలి యానుకూల్యము కల్గింపఁ బ్రయత్నింపఁ గలదని మా యభిప్రాయము.

ఆయుర్వేద చంద్రిక:—నెల్లూరుజిల్లా - పేరిదేపినుండి పి.సి. యే. అండ్. కో, వారి యాయుర్వేద సమాజమునుండి శ్రీ ధూర్జటి- రామకృష్ణయ్యగారి సంపాదకత్వమున వెల్వడు ఆయుర్వేద మాసపత్రిక, ఇందాయుర్వేదమునందు వన్నెవాసి గన్నవారిచేఁ దయారుచేయఁబడిన మంచిమంచి వ్యాసములు ప్రకటింపఁబడును. ఆయుర్వేద వైద్యమనఁగా ఆ శాస్త్రమునందు జ్ఞానానుభవములుగలవారు ప్రయోగించినచో ఈ దేశమునం దదియే యితర వైద్యమునకును దీసిపోదని యనుభవముగలవారి యభిప్రాయము. ఈపత్రికారాజమాయుర్వేదము దేశమునందు వ్యాప్తినొందువిషయములలోఁగలరీతి నిర్వహణము గావించు గాత మని కోరుచున్నాము.

ప్రజామిత్ర:—రయితుల యొక్కయును దేశ సామాన్యముయొక్కయును నభ్యుదయముకొఱకు ప్రతి బుధవారము జి. లక్ష్మీనరసయ్యగారి వలనఁ జెన్నపురి నుండి ప్రచురింపఁబడు వారపత్రిక. ఇందు గ్రామ జీవన విషయములు రయితుల యభ్యుదయముల విషయములు, దేశీయసమస్యలు, సారస్వతవిషయములు మొదలయినవి యుజ్జీవకరములుగాఁ బ్రచురింపఁ బడుచుండును. మాకువచ్చిన ఏప్రిల్ 18 వ తేది సంచికలో మహాత్మాగాంధులకు పోలికలు — రూపసివీణ (కథ), కవితాలహరి (ఖండకావ్యములు), మాము త్తన్న శాస్త్రుర్లు(హాస్యకథ), సర్వం జగన్నాథం మొదలయిన విషయములు కలవు. పరమాత్ముని యనుగ్రహంబునను తగు ప్రయత్నమువలనను ఈపత్రిక యెంతయును బ్రకాస్తి నొందవలయునని మాయభీష్టము.

విశ్వకర్ణాటకపత్రిక:— బెంగుళూరునగరము నుండి ప్రతి ఆదివారమునఁ బ్రకటింపఁబడు కన్నడము వారపత్రిక. (మైసూరు) రాష్ట్రీయవిశేషములు (ముఖ్యముగా)ను, మిగిలినదేశీయ విషయములు (రెండవదిగా) ను ఇందు చర్చా ప్రకటనల నొందును. ఆరోగ్య సారస్వత స్త్రీ శిశువిషయ విషయములకుఁ గూడ ప్రాముఖ్య మొసంగఁబడుచున్నది. పత్రిక

యొక్క యాకృతి అందలి వ్యాసములు మొదలయిన వానిని బట్టిచూడఁగా వేయివిధముల నియ్యది యభివృద్ధి నొందఁగలదని మానమ్మకము.

ఆరోగ్యప్రకాశిక:—ఆరోగ్య విషయములను గూర్చి ముఖ్యముగా పాశ్చాత్య విధానముల ప్రకారముగా చర్చించునట్టి పత్రికారాజమిది. ఇందు ఆయుర్వేదపద్ధతులును ప్రకృతిచికిత్సపద్ధతులును అప్పుడప్పుడు ప్రచురింపఁ బడుచుండును. వ్యాసములు సామాన్యముగా ఆయా విషయములయందు గొప్పపరిశ్రమగలవారిచేతను వ్రాయఁ బడినవిగా నుండును. అంతియకాక మేలయిన పాశ్చాత్య పత్రికలలోని విషయములుకూడఁ బ్రచురింపఁబడుచుండును. దేశమునందలి ప్రతికుటుంబమును ఈ పత్రికను గమనించినచో, ఆరోగ్యమను మహాభాగ్యముయొక్క లాభమును చెందఁగలరు. మాకువచ్చిన ఏప్రిల్ పత్రికలో "మశూచికము—ప్రాణవాయువు (వ్యాధులకు ప్రబలశత్రువు)—సుఖజాడ్యములసమస్య. ఆరోగ్యము గల్గుటకు పాటుపడుము— "మొదలయిన విషయములు కలవు. ఆంధ్రములో ప్రచురింపఁబడు ఈ రకము పత్రికయిదియొకటియే యని తోఁచుచున్నది. డాక్టరు యు. కృష్ణరావుగారు ప్రచురణకర్తలు, ప్రచురణ స్థానము - 323 - తంబుచెట్టివీధి, మద్రాసు.

త్రిలింగ.—చాలకాలమునుండి బ్ర॥శ్రీ॥వావిళ్ల-వేంకటేశ్వరశాస్త్రిలుగారి సంపాదకత్వమున ఆంధ్రదేశ సేవార్థముగా చెన్నపట్టణమునుండి ప్రతి సోమవారమును వెల్వడు తెలుఁగు వారపత్రిక. ఇందు సాంఘిక మత నైతిక సారస్వత పారిశ్రామికాది విషయములు పొందు పఱుపఁబడును, మాకు వచ్చిన యేప్రిల్ 16-వ తేది సంచికలోని వైదికమత చరిత్రము—ఉపకుర్వాణ బ్రహ్మచర్యాశ్రమము—మొదలయిన సనాతనత్వానుకూల వ్యాసములుండుటవలన ఈ పత్రిక సనాతన పద్ధతికనుకూలమయినదని తోఁచును, అంతేకాక భాషావిషయములకును దేశీయసంగతులకును నెంతయును చేయూఁత యొసంగుచున్నది. దేశాభివృద్ధికిఁ బలువిత ములను బాటుపడు ఈ పత్రిక యెంతయు నభివృద్ధి నొందును గాతమని మా యభిలాష.

సరస్వతి:—కథలు,కబుర్లు,చిన్నకథలు వినోదములు, సినీమావార్తలు, పోటీ బహుమానములు గలమ. పెం.టి- సత్యనారాయణగారి యొక్కయును మ. వజ్ఝల - కాళిదాసుగారియొక్కయును సంపాదకత్వమున పుస్తకరూపమున తయారయి మ. మట్టా-గురుమూర్తిగారిచేఁ బ్రచురింపఁబడు వారపత్రిక. చేత నయినంతవఱకు మనోహరముగా నుండవలయునను ప్రయత్నము కనుపట్టుచున్నది. మాకు వచ్చిన 22-4-34 తేది గల 28-వ సంచికలో "మదరాసులో ఒక... స్పెంసరు...ఆందోళనపడుచేన్నారు" వంటి సూటిపోట్లును ఎత్తి పొడచుటలును తగ్గించుట పత్రికకు మంచిదేమో యని మాకుతోఁచుచున్నది. ఇతోధికమయిన యభివృద్ధి పత్రికకుఁ గల్గునుగాక యని మా కోర్కె.

లోకల్ బోర్డు:—తూర్పు గోదావరిజిల్లా కపిలేశ్వర పురమునుండి స్థానికపరిపాలన విషయకరముగాఁ బ్రతిమాసమును బ్రకటింపఁబడు మాసపత్రిక. మనోహరమయిన యాకృతి కలది. ఇందు స్థానిక సహకార సంఘముల పరిపాలనవిషయములు, సహకార సంఘ విషయములు, ఆరోగ్యవిషయములు, చేట్టపు విషయములు, మొదలయిన మిక్కిలి యుపయోగకరములయిన విషయములు గలవు. ఏతద్రూపమయిన జ్ఞానము జనసామాన్యములో వ్యాపించుట లాభకరమనుట కాక్షేపణములేదు. విషయసూచికలోని సంగతులకు వాని వాని పుటసంఖ్యలను సయితము వేసినచో బాగుగా నుండును. చేందా రు 3-0-0 యలుమాత్రమే. ఈ పత్రిక యెంతయు నభ్యుదయ మొంద వలయునని మా యభిలాష. వలయువారు— "ప్రొప్రయిటరు" లోకల్ బోర్డుపత్రిక, కపిలేశ్వరపురము తూర్పుగోదావరిజిల్లా— అని వ్రాయవలయును.

—

# అభినందనములు

శ్రీ యొప్పారఁగ నాంధ్రమండలమునం జెన్నారు లోకాళి మే-
దాయత్తాత్మత నివ్వటిల్లఁ బురుషార్థావాప్తి చేకూఱి స్వ
శ్రేయం బందఁగ గ్రంథరత్నముల ముద్రింపించు నానందము
ద్రాయంత్రాధిపతుల్ ప్రశస్యులు పరార్థవ్యగ్రచిత్తుల్ కదున్.

మునుపు ముద్రించుచుండిన తెన్గుపుస్తకంబులు పల్చలై కడుఁ బెళుచులైన
కాగితంబులమీఁదఁ గర మేవగించెడు నక్కరంబులతోడ లెక్కలేని
తప్పులు కుప్పలై తార్కొన ముతకలై తనరెడు మోటు గోతంపుఁ బట్ట
లట్టలుగాఁ జేర్చి యిట్టులు పుస్తకరూపంబుగాఁ దీర్చి యేపు మాలి
వెలలు తక్కువగాఁ జేసి విక్రయించు, చుండి రప్పటివార లా యోజ మార్చి
రెలమి వేమూరి వేంకట కృష్ణనాఖ్య, శ్రేష్ఠి సూనులు తొలుదొల్తఁ బ్రియముతోడ.

ఇమ్మెయి నాంధ్రపుస్తకము లెంతయు దుర్దశ నుండ వాని నం
దమ్ముగ నచ్చుగూర్పఁగ ముదమ్మున నెమ్మదిఁ బూని మున్నుగా
బమ్మెరపోతరాజకృత భాగవతంబును నచ్చుగూర్చి లో
కమ్మున నిమ్ముల న్వినుతి గాంచిరి నల్వది యేండ్ల క్రిందటన్.

మేలగు కాగితంబులును మేలగు చక్కని యక్కరంబులున్
మేలగు క్రొత్త సోయగము మీఱెడు పాదవిరామపఙ్క్తులున్
మేలగు పాఠసంస్కృతియు మేలగు రంగులబట్ట యట్టలుం
గ్రాలఁగఁ బుస్తకమ్మును గరమ్ము రహింపఁగఁ జేసి రిమ్ములన్.

పిమ్మట జనోపకృతి చి, త్తమ్ములఁ దనరార భారతము మున్నగు గ్రం
థమ్ముల రుచిరమ్ముగ లో, కమ్ములరఁగ ముద్రణంబు గావించి రొగిన్.

వ్యయమును లెక్కసేయక సముంచితరీతిని నాంధ్రపుస్తసం
చయమును నూత్నరమ్యమగు చందమునం గయిసేయ ధీరతం
గయికొని యచ్చుగూర్చి కడఁకం బ్రకటించి యుదారరీతి నెం
తయు వెల హెచ్చుసేయక జనమ్ముల కమ్మెద రిమ్మహిస్థలిన్.

ఇమ్మెయిఁ దెన్గు పొత్తమ్ముల దర్శనీయమ్ముగా నటు ముద్రణమ్ము చేసి
వేమూరు వంశ్యులు వేంకటకృష్ణను శెట్టి యాత్మజులు ప్రసిద్ధిఁ గనిరి
తగఁ దిరువేంగడత్తాఖ్ శెట్టి యను వారు వారిలోఁ బ్రథము లుదారమతులు
వినయ సౌశీల్య వివేక సంపన్నులు భాషాభిమానులు భవ్యగుణులు
ఆంధ్రపుస్తకములను రమ్యముగ నచ్చు, గూర్చి జనులకు వీనిఁ గైకొనఁగ నిండు
ముదమును బతింప నుత్సాహమును మనములఁ, గలుగఁ జేసి సత్కీర్తిని గాంచి రెలమి.

ఇటు లానందము గొలిపెడు, నటు లింపుగ నాంధ్రపుస్తకావళి ముద్రిం
చుట నానంద సమాఖ్యను, స్ఫుటముగ నీ యచ్చుశాల పొలుపారుఁ గదుర్.

భాష సేవఁ జేయ భావాది సరసత, వెలయ వీర లిపుడు వేడ్కతోడఁ
జంద్రికాఖ్య నెసఁగు సరసపత్త్రికఁ బ్రకటింపఁ గడఁగినారు సొంపు మీఱ.

చంద్రధరుండు వెన్నుఁడును శారదయుం గృపఁ బ్రోతు రెప్డు ని
స్తంద్రత నాఁడు నాఁటికిఁ బ్రశస్తయశం బెసలారు నట్టు లీ
చంద్రిక నెల్లవారలకు సర్వవిధంబుల మేలొనర్చుచుం
జంద్రికమాడ్కి నీ తెలుఁగు చంద్రిక మోద మెలర్చుఁ గావుతన్

విమర్శకాగ్రేసర నాగపూఁడి - కుప్పుస్వామయ్య,

---

సీ. కలుషమహాధ్వాంత ♦ గణములనడఁగించి, కవిచకోరములను ♦ గారవించి
కాకవిబలిభుగో ♦ ఘములవెంపు వ్యయించి, సత్కళావంతుల ♦ సంతరించి
సాధుభావజ్ఞుల ♦ సరణినిబోషించి, సంశయాత్ముల కెంతొ ♦ శాంతినించి
సుమనోవ్రజములకు ♦ శోభలఁగల్పించి, సరసుల ద్విజతతి ♦ సత్కరించి
ఆ. వె. దినదినాభివృద్ధి ♦ తనరంగఁ దనదివ్య, యశముదిగ్విదిక్కు ♦ లందుఁబరఁగ
సాధుగతిఁజెలంగఁ ♦ జంద్రిక పరమేశు, కరుణచే ధరిత్రి ♦ గ్రాలుఁగాక !!

చ. అనుపమభావముల్ సుజను ♦ లౌననఁగా వెలయించుచున్ దనం
తన త్రపపైకొనం గుకవి ♦ నాయకబృందము సత్పథంబునం
జనఁ బని పూనఁ జేయుఁగను ♦ జాలి నిరంతర మొక్కరీతి భా
షను వెలయింపఁగాఁదలచు ♦ చంద్రిక యొప్పుత మత్యున్నతిన్ ::

(అభినవాంధ్రవాల్మీకి, కావ్యపుణ్యతీర్థ) జనమంచి శేషాద్రిశర్మ,

---

సీ. క్షయరోగశశి ! నీదు సాంగత్యమింకేల, మావీఁటి చంద్రిక మసలుచుండ
సురలార ! యాంధ్రుల సరిబోలఁగలరె ప్ర, త్యక్షమై చంద్రిక రక్షసేయ
దాపమా ! పాపము దరిదాపునీకేది, చంద్రిక మాచెంత సతతమమర
సంకటమా ! పొమ్ము వేంకటేశ్వరుని స, త్కరుణాకటాక్షవీక్షణముగల్గ
గీ. ననుచు నిరసించి యుప్పొంగు నాంధ్రలోక, వీరపుత్రులయొడిలోనఁ గూరుచుండి
వెలుఁగునో బాలచంద్రిక ! విబుధవరుల, మన్ననలు వొంది వెయ్యేండ్లు మనగదమ్మ.

పుల్లూరు - మునిరత్నం,

---

మ. జనతాస్వాంతతమం బడంచి కళలన్ జ్ఞానొంది విద్యార్థిలో
కనదంబుల్ వికసిల్లఁగా విబుధవర్గంబున్ రసాస్వాదనం
బునఁ జెంపొంద గుణాంబురాసు లెదనుప్పొంగన్ ద్విజానీక్షణన్
గని మీ చంద్రిక తేజరిల్లుత మనంతన్నామమన్వర్థమై.

శృంగారకవి - సర్వారాయఁడు,

---

కందగీతీగర్భిత చంపకమాల

పలు సరసుల్ నినున్ గననెపల్కిరె ముద్దుగఁ గ్రాలెదంచు గే
వలకరుణన్ గొనందగినవన్నియనీయెడఁ దక్కెనంచు,ని
స్తుల సురసాధ్యవై, మహిత సు,స్థిరసూక్తుల మాన్యవౌచుఁ, జిం
తలుడుపుటన్ గదా పరఁగుదానవు చంద్రిక ! ప్రాజ్ఞవౌ చిలన్.

గర్భస్థకందము.

సరసు ల్నినుంగననె ప, ల్కిరె ముద్దుగఁ గ్రాలెదంచుఁ గేవలకరుణన్
సురసాధ్యవై మహిత సు, స్థిరసూక్తులమాన్యవౌచుఁ జింతలుడుపుటన్.

గర్భస్థగీతము.

కననె పల్కిరె ముద్దుగఁ గ్రాలెదంచుఁ దగిన వన్నియ నీయెడఁ దక్కెనంచు
మహిత సుస్థిరసూక్తుల మాన్యవౌచుఁ, బరఁగుదానవు చంద్రిక ! ప్రాజ్ఞవౌచు

(సరస చతుర్విధ కవితా సామ్రాజ్య ధురంధరుఁడు) నాదెళ్ల-పురుషోత్తముఁడు,

---

శా. ఆనందాంకిత ముద్రణాలయము తావై, యాంధ్రరాజేంద్ర సం
స్థానంబెల్ల విహారసీమయయి, ప్రాజ్యంబైన పూజ్యత్వ మెం
దైనం గాంచెడి శోభమీఱెదవు గాదా ? ' చంద్రికా ' ఖ్యాకవై
యానందం బిడి భావముల్దనుప, భావాబ్దప్రజం జేరితే ?

మ. సుకవిశ్రేష్ఠుల వాగ్విలాసములకుం జోడై నృపాగ్రేసర
ప్రకరచ్ఛాయలకాకరంబయి, నభోభాగంబునన్వెల్గు, సాం
ద్రకలాపూర్ణుని తేజముందెలుపు వర్ణ్యంబైన నామంబుతో
నకలంకంబులఁగీర్తి చంద్రికల దిగ్వ్యాప్తంబుఁగావింపుమా.

నాదెళ్ళ-మేధా దక్షిణామూర్తి శాస్త్రి.

శ్రీకి సహజన్ముఁడై, విష్ణు హృదిఁ దదీయ
చంచలతఁ బాపుచుఁ నిల్చు శశి నగవులఁ
ద్రిసమయములందు నించు చంద్రిక గతిగనె
కళలఁ జంద్రికాపత్రిక వెలయుఁ గాక ! .

కవిభూషణ. సెట్టి - లక్ష్మీనరసింహము,

—:o:—

సంపుటము ౧

సంచిక ౪

# చంద్రిక

సచిత్ర మాసపత్రిక

To
Editor
Chandrika
Anand Press Buildings
Loane Square
Madras

శ్రీ భావ సం॥ జ్యేష్ఠమాసము

జూన్ 1934.

ఆనందముద్రణాలయము,

మద్రాసు.

౧౯౩౪



విషయసూచిక

—————:o:—————

———: o :———

# పటముల పట్టిక



---

1. 222-వ పుటకు యెదురుగానుండు పటమునకు చిత్రకారులు పి. వి. రామారావుగారు, పోలవరము.
2. 238-వ పుటకు యెదురుగానుండు పటము నకుల సహదేవరథము. సముద్రతీరమందలి ఆలయము అని పొరపాటునపడినది.
3. 270-వ పుటకు యెదురుగానుండు పటము సముద్రతీరమందలి ఆలయము.




## ప్రణయగీతి

శంకరంబాడి - సుందరాచారిగారు.

పండు వెన్నెలతేని నిండు కౌఁగిలిలోన
        మగగుచు రేరాణి మురియుచుండ,
సరసిలో సీరాడి విరులతో రమియించి
        హాయిగాఁదిరుగ మందానిలుండు,
సంగీత మదిరంపుఁజేవి చూపి తేఁటులు
        కలువ జవ్వానులను వలచుచుండ,
మలయూట జవరాఁడ్ర వలపు పాటలువిని
        పర్వతేంద్రుండు ప్రమాన్పడుచు నిలువ,
ప్రకృతితరుణియు నిశ్శబ్దరసికవరుఁడు
        కలిసి సరససల్లాపముల్ సలుపుచుండ,
సరసకవితాలతాంగిని సరసఁజేర్చి
        పాడుకొనుచుండుఁ గవియును ప్రణయగీతి.

# మచ్చలు

ఉమర్ ఆలీషాగారు,

కలకలని నవ్వుచున్న వెన్నెల వెలుంగు। అమృతనిభమైన యీ ధవళాంశుకాంతి
నేల యీ మబ్బుతునుక మాయింప జూచు। ఏల యీ నిశాకన్య నీలాలకముల
గప్పుచున్నదో యీ పరాగంబు దోఁగి। ఈ హిమాంబుధూమంబు ననేక(?)శత స
హస్ర కరములఁ గబళింప నరుగుచున్న। దీ మహా ప్రేమ ప్రళయమం దేమిగలదో
ఈ మహారాగ రసమునం దేమిగలదో ॥కల॥

* * *

జీవితంబను నీ వహ్నిశిఖలనడుమ। హృదయ నిర్భేదకంబైన యీ విషాద
గహనముల మధ్య చిమ్మ చీకటులయందు। దేనిదో వెల్గు వెల్గదే గానవచ్చె

* * *

నింగి నెలలేదు ప్రణయ లతాంగి నీల। నీరదాభ్యంతర పట కుటీరములను
తెఱచి మెరపుత్రాళ్లను పన్ని యిరుల తెరలు। జార విడువఁగ గాఢాంధకారమైన

విశ్వ నాటకరంగంబు వెడలిపోయె। ఘూకములు కూయుచున్న యీ చీఁకటులను
ఉల్కలును రాలుచున్న యీ యుగ్రములను। ఈ శిలావేదికలను మా హృదయ ఫలక
మందు గల వహ్నిదగ్ధ ప్రేమాతురములు। మచ్చ పడియున్న యట్టి నా మానసంబు
కాలి డాగైన నా యంతరాళ మిట్టు। లెవరు వ్రాసిరో యీ లోఁతు నీ రహస్య

మెవరు దీసిరో యిది వార లెఱ్ఱెలుంగఁ। జాలిరో ప్రేమపాఠాలఁ జదువుకొనుచు
మేఘములఁ బోయి గర్జించి మింటికెగసి। ఉడుల దిరుగుచు నావలె పుడమిజారి
పడెడు కొఱగాని జడుఁడు వ్రాసిపడిన మతిని। వ్రాసియుండును అది మహా జ్వాలలీన
మందుచున్నది ఆ వెల్గు నిండుచున్న। దింక దీనిని జల్లార్ప నెవరి తరము
ఇంక దీనిని వారింప నెవరి తరము। నెలగ తిని దీని గబళింప నలవియగునె.

# దూతాంగదము

## శ్రీ కవిభూషణ, శతావధాని, విద్వాన్ దోమా-వేంకటస్వామిగుప్తగారు.

(ఛాయానాటకము.)

(తెలిఁగింపు.)

---

గీ. కుముదకుందమృణాలగౌరమయి, శౌరి
కరతలాంబరపూర్ణేందుకలనఁ గాంచు
నాదమున సురద్విషదంగనాజఘనగ
కాంచులసడల్చు శంఖంబు గాచు మిమ్ము.

మఱియును,

మ. హరకోదండము ద్రుంపకింద్రజునిమా
యం జేయకంభోధి బం
ధరుచిం జెందక కైకసీతనయవా
దం బూనకే యంగదా
దరముం బొందక కారణంబున భువిం
దాఁ బుట్టువుం గన్న య
ల్లరఘూత్తంసుని వైష్ణవప్రభ జగ
ద్రాజన్ముదం బీవుతన్.

(నాంద్యంతంబున)

సూత్ర:— (పరిక్రమించి యెదురుగాఁ జూచి) ప్రియా ! విలాసవతీ! ఇటు రమ్ము.

నటి:—(ప్రవేశించి) ఆర్యపుత్రా ! యిదే వచ్చితి. ఏమి చేయ వలయునో యానతిండు.

సూత్ర:—విశ్వ విశ్వంభరా భార సముద్ధరణాఽదివరాహుండును నిజభుజా యుగదళిత సమస్త విరోధి బృంద సుందరీ నేత్ర నీలోత్పల విగళిత బహుళ బాష్పపూర ప్లవమాన ప్రతాప రాజహంసుండును నగు మహారాజాధిరాజ శ్రీమత్త్రిభువనపాలదేవుని మహాపరిషదాజ్ఞం జేసి ప్రబంధ విశేషంబును మొదలు పెట్టెదను అహో! సామాజికులారా! వినుండు. ఏ మనిన ఈవసంతోత్సవంబునందు దేవ శ్రీకుమార పాలదేవుని యాత్రలోను బద వాక్య ప్రమాణ పారీణుండును మహాకవియును నయిన సుభటునిచేఁ బ్రణీతంబయిన దూతాంగద మను ఛాయానాటక మిపు డాడ వలసి యున్నది.

నటి:—ఆర్యపుత్రా! యుక్తముగాఁ జెప్పితిరి.

(నేపథ్యంబున)

ఉ. వాలిని సంహరించి యటు
పై నలవానర రాజలక్ష్మిఁ దా
రా లలనాధినాథునకుఁ
గ్రాలఁగఁ దార్చియు డంబు మించు న
ద్వేల పయోధి దాఁటి యల
దేవుఁడు దాశరథి ప్రభుండు తా
నోలిగ నా సువేల కుధ
రోప వనంబులనొప్పె నిప్పుడున్.

సూత్ర:—ఆర్యా ! కుశీలవు లాడ నారంభించిరి. ఏమనఁగా, రామానుచరు లయిన వీర లొకరితో నొక రాడుకొను మాటలు వినవచ్చెడిని. మనమును ననంతర కరణీయమును సిద్ధపఱచి కొందము. రమ్ము,

(అని నిష్క్రమింతురు.)

(ఇది ప్రస్తావన.)

---

(ప్రవేశము:—సువేల పర్వత శిఖరముపై శ్రీరామ లక్ష్మణులు కూర్చుండి యుందురు. సుగ్రీవాదులు పరివారముగ నుందురు.)

శ్రీరాముఁడు:—(లక్ష్మణునితో)వత్సా! లక్ష్మణా!

ఉ. సాగరమా తరించితి ; మ
సాధ్యమురాక్షస రాజధానియా ?
యీ గణనీయ విక్రమక
పీశ్వర సేనకు లోఁగె వేఁగ; మే
నీగతిఁ బౌరుషాన నొన
రించిన దానికి దేవుఁడొక్కఁ? లే
దా గరిమోల్లస ద్రిపు భ
యంకర మీ ధనుష్ప్రాకతం బగుఁగా.

లక్ష్మ:—దైవము పామరుల మనంబుల ననలంబించి యుండును. దాన నే మగును?

గీ. పూన్కి గల పూరుషులనొగిఁ బొందులక్ష్మి
పామరాళి దైవంబు దైవంబఁటంద్రు
దైవమునె నమ్మక తగ యత్నపడ వలయు
యత్నగింప ఫలింపదేని హాని యేమి ?

మఱియును,

ఆ. ఎంతదాఁక నొసట నెనయదు భ్రుకుటి, యెం
దాక నారి వింటిఁ దగుల, దంత
దాఁక నే త్రిలోక తతి మూల విభుజ దై
త్యప భుజాళి దర్ప మడరుచుండు.

అని యంగదునకు దౌత్య విషయం బాజ్ఞాపింపఁ బడును గాక.

శ్రీరా:—(అంగదుని సబహుమానముగాఁ గాంచి)

ఉ. మాటలఁ జెల్ప రాని మహి
మంబను నీ పిత వాలి వాలి యా
పోటరి రావణాసురుని
బోరిన పోరిత మార! పుల్కల
న్నేఁటికి మా మెయిం గొలుపు
నీ వల మేటికిఁ బట్టి వౌటఁ ద
ద్ధాటి చెలంగు వాఁడ వుచి
తానుచితంబుల నీ వెఱుంగవే ??

అంగదుఁడు:—(ఫాలతలంబున నంజలి ఘటించి నమస్కరించి విన్నపము గావించు చున్నాడు.)

శా. ప్రాకార ప్రతిహార యుక్త మిటకే
లంకాపురిం దెత్తునా ?
లేకీ రాఘవ సేన నెల్లఁ ద్రుటి హా
ళిం జేర్తునా యక్కడన్ ?
ధాకం బేర్చియు గోత్ర శైలయుతనుర్
వారాశి బంధింతునా ?
నాకుం జే నయినట్టి దేదొయిపు డా
జ్ఞాపింపవే యో ప్రభూ !!

శ్రీరా:—వత్సా! ఆ దశకంఠుం గాంచి,

మ. " మతి లేకో-యధికార గర్వముననో-
మాంలేని వేళన్ ధరా
సుతనుం గైకొనిపోతి, వామెను విడన్
సొంపొందు; లేకున్న, ను
ద్ధత సౌమిత్రి విముక్త మార్గణగణో
ద్యచ్ఛేద రక్తాత ప
త్రతతచ్ఛాయ గడల్కొనన్ యమునిఁ జే
రం బోదు విఖ్యాళితోన్. "

అనిపల్కుము.

అంగ:—దేవా!

గీ. నేను దూతనై వెడలుదు నేని, దాన
సంధి యగుఁగాక, యుద్ధంబు జరుగుఁగాక
దెబ్బ దినకయో, తినియో, క్షితి తల వీర
మునదశాననను లక్ష్మితాఁ బొరలఁగలదు.*

శ్రీరా:—వాలినందనా ! బాగు బాగు ! (అని యంగదుని వీపునఁ జే యుంచి తీయును)

* 'దశాననాననములు పొరలఁగలవు' అనిపాఠాం.

సుగ్రీవుఁడు:—(లంకాశైలశిఖరముంజూచి) దేవా! చూడుము చూడుము.

క. సావజ్ఞముగాఁగను మన
యీ వానరసేనలన్, మదేభ తనుండై
రావణుఁడు గనుంగొనియెడిఁ
బీవరబాహ్వంతరము గభీరాకృతిమై.

మఱియు; మనమును సువేల వన శైలంబుచే దిలకింపఁబడిన సముద్రతీరంబులను జూతము.

(నిష్క్రమింతురు.)

(పిమ్మట మందోదరి విభీషణుఁడు మొదలయిన వారిలోఁ గూడ రావణాసురుఁడు (ప్రవేశించుచున్నాడు)

రావణుఁడు:—(విభీషణునుద్దేశించి) వత్సా! విభీషణా!

మ. ఇవె నాబాహువు, లింద్రదోర్మద హరా
హీన ప్రభావంబు, లే
భువనాభీలుఁడ, రావణుండ, ఘన ద
ర్పుండన్, మఱిన్ లంక తేఁ
డ విసం గంటిఁ గపుల్ పయోనిధినిగ
ట్టం బొల్చు, టీ లంక వా
రు వెనన్ ముట్టఁగఁ గంటి, నేది వినఁ బో
రో? యేది కాంచే ర్జనుల్?

మఱియును.

శా. జంభారి ద్విపకుంభ పాటన జవాం
చ చ్చంద్రహాసాసి సం
రంభ స్ఫూర్జిత మ ద్బలంబు ముని యా
రం దా వినన్ లేదొ? దో
స్తంభ ప్రాభవ మేఘనాదముఖవీ
రాఢ్య రక్షితన్ లంకనున్
సంభావింపఁడొ? ప్రాప్త కాలుఁ డెదనుం
గాంచుం జలింపుం గదా!!

ఆ. వె. తనర దేవనాథ దర్పేందురాహువుల్
నాదు బాహువుల్ కన ద్రుష మెయి
ద్రోహ మెంచు నేని, నాహాహా! మునికోటి
పడెడు పాట్లు కాంచె వలయు నవుడు.

మందోదరి—(స్వగతమున)

గీ. ఎవనిచే రాక్షసాన్వయం బింపు గనునొ
యట్టి యీతఁ డి ప్డకట! శోకాంకుర ప్ర
దోహదంబైన విసము గొంతుకను నుండి
కుఱియుచున్నాఁడు,కీడేది పరఁగునొక్కొ??

(ప్రకాశముగ)

నాథా! చూడుము చూడుము ఆశ్చర్య మాశ్చర్యము.

క. వీరా! సరోష వానర
వీరు లదే కలకలంబు వెలసియు, నీ యీ
గారాబంపు టగారం [గిన్.
బౌరావము బదు లిడునటు లమరించి రో

రావ:—(నిర్లక్ష్యముగా) ప్రకృతిప్రియవాదినీ! దేవీ! మర్కట కీటంబుల కలకలంబులను గూర్చిన నీ యీ తెలిసీ తెలియని మాటలు చాలును. ఇది గాక యిఁక నేదయినఁ జెప్పఁ గోరుదువా?

మందో:—క. ఇప్పటికిని మించిన దే?
మొప్పింపుము దేవ! సీతనొగి రఘుపతికిన్
తప్పక మందోదరిదై [మెపుడున్.
యొప్పిన మండనము మేల్మి నొనరుత

రావ:—(కోపముతో నవ్వుచు) దేవీ!

శా. సీతం దెచ్చిన పెద్దకార్య మొకఁడున్-
జిత్తంబుమై నెంచి యా
నాతిన్ రాముని కీమి రెండవది-యిం

క. వార్ధి నీభంగినిం
గోతుల్ గట్టెడు రీతి మూఁడవది యై
కొంకుల్ మదిఁ గూర్పఁగా
భీతుండై దశకంధరుం డతివ న
ర్పించుం గదా! లోఁగియుల్ ??

పొమ్ము; ఆవిలాస భవనము నలంకరింపుము.

(మందోదరి కన్నీటితో నిష్క్రమించుచున్నది.)

రావ:—(విభీషణునుద్దేశించి) వత్సా! విభీషణా! నీవు జెప్పవలసిన దేమయిన నున్నదా?

విభీ:—దేవా! లంకేశ్వరా! నీతిమార్గంబును బరికింపుము.

ఆ. వె. నరులుగారు వారు-పరికింప నవ్వాన
రులును గారు వానరులును-నరయ
నిదియు నెల్ల నీకు నెసఁగు దుర్దైవ వి
కార మంచుఁ దోఁచుఁ గరము నాకు.

కనుక ఈరాక్షస కుల కాళరాత్రి యగు జానకిని వదలి పెట్టుము.

రావ:—ఓరీ! పాపుఁడా! ప్రతిపక్ష పక్షపాతీ! కులనాశకా! దురాచారా! ఇదే యీ నా చంద్రహాసంబున నీ శిరంబు న్నేలం గూల్చెద. (అని సంరంభించును.)

విభీ:—(భయముతో నవలి కొదుఁగును).

మాల్యవంతుఁడు: —(అంతరిక్షమునుండి) దేవా! లంకేశ్వరా! బాలకుండయిన యీ విభీషణుండు మాటాడిన దానిలో నేమి యహిత మున్నదో నయ బుద్ధితో నాలోచింపుము.

రావ:—ఓహో! నీవును నిట్టిసంపన్నుఁడవేనా?

మాల్యవం:—(భయముతో నూరకుండును.)

రావ:—(విభీషణు నుద్దేశించి) ఓరీ! బాంధవాభాసుఁడా! నా రాజధానినుండి తొలఁగి పొమ్ము. పోయి, యా వనేచరునే యాశ్రయించి, నీ నీతి నైపుణ్యమును బ్రకాశింపఁ జేయుము. మఱియు నీ కథాశేషము గావింపఁ బని యుండదు.

విభీ:—కాఁదగినది కాక పోవునా? (అనుచు నిష్క్రమించును.)

(అప్పుడు ప్రహస్తుఁడను ప్రతీహారుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

ప్రహస్తుఁడు:—దేవా! ఎవ్వఁడో రాముని దూత నని చెప్పుచు నొకానొక వనచరుండు వాఁకిట నున్నాఁడు.

రావ:—(నిర్లక్ష్యముగా) సరే! ప్రవేశపెట్టుము.

(పిమ్మట ప్రహస్తుఁడునిష్క్రమించును. తిరిగి ప్రహస్తునితో నంగదుఁడు ప్రవేశించును.)

అంగదుఁడు:—(రావణుని గాంచి స్వగతము.)

క. ఎవని శిరో నీరేజా
తవనిపయి శిలీముఖముల దాశరథి యిడుల్
భువనాస్కందా శయుఁడై
భవుఁడాదశకంధరుఁ డన-వాఁడే కాఁడే?

(ప్రకాశముగ.)

శా. ఓరక్షస్తతులార! సూర్య శశి వం
శోదార మాణిక్యను
శ్రీ రాశిం గొనివచ్చి యుం, ద్రిజగతీ
రింఛోళికా దీపన
శ్రీరామాస్త్ర పరంపరానల శిఖా
శ్రేణిం బడం దాఁ బతం
గారూఢిం గను రావణుం డెవఁడొ నే
గన్నాకుఁ దెల్పుం డిటుల్.

(అనేక రాక్షసులు రావణాకారమును ధరింతురు.)

అంగదుఁడు:—

మ. అరరే! రావణ! రావణుల్ పలువు రం
చోలింతు, మా కా ర్తవీ
ర్య రసాధీద్ధృఢ బాహు దండ కృత పిం
డాకారగుం డొక్కఁడా
క్కరుఁ డా దైత్యప దాసికా పటల నృ
త్తోత్సాహ దత్తాన్నుఁ డిం
కొరు నిందుం దెలుపంగ సిగ్గిలుదు-నీ
వొక్కండ వౌ యందు నక్కా??

రావ:—(అనేక రూపంబుల నుపసంహరింపఁజేసి సహేలంబుగా.)

ఓహో! శాఖా మృగమా! నీ వెవ్వఁడవు? ఎవ్వరి దూతవు?

అంగదుఁడు:—

గీ. తండ్రి స్వర్గతి నొంది, య త్తండ్రి దయిన
యా స్త్రీఁబడయనివాఁడుస్వీయమగుపూర్వ
జనులఁ గూరిచి తెలుప గిఁ జన దనియెడి
నీతి పెద్దలు పల్కఁగ నీవు వినవె?

అయినను కానిమ్ము.

క. ధారుణి రాక్షస భారము
వారింపఁగ నవతరించి పరఁగినఘనుఁడా
శ్రీరామునకే దూతను
శూరుఁడు వాలికి సుతుండ,సురవైరి వరా!

మఱియును.

క. నా తండ్రి వాలి హతుఁడే
యాతతవిక్రముని చేతనల రామునకుం
దూతను, మ త్పితృ విక్రమ
రీతియు నీ వెంతయే నెఱింగినదె కదా!

రావ:—శా. రాముండే మొనరించు?

అంగ:— లేదెదియు,

రా:— అ
బ్రాత్రీరముం జేరెనో?
యీామైనున్నాట?

అంగ:— వచ్చె;

రావ:— వారిధికింబం
ధింపయ్యెనా?

అంగ:— అఁటగా;

రావ:—ఏమి? తానెఱుఁగండే? యీాదరిని
లం కేశుండ నేనుంట?

అంగ:— లం
కాముఖ్యాఁ! యెఱుఁగున్ విభీషణుఁడటన్
గ్రాలు న్నరేట్సన్నిధిన్.

రావ:—(సందేహములో) రాముని చర్య యిప్పు డెట్లుండును?

అంగ:—

మ. రవి జాంకంబు తలాడగా హనుమ ప,
ద్రాజీవము లూ్వాన, భ
ర్మవిధ్యైణాజిన మందు సుందర శరీ
రంబుం దగగ్ గ్రాల్చి, దా
నవ వంశాగ్ని ధనుశ్శరంబు లను
జన్మ శ్రీయుతుం జేర్చి మా
ర్దవకారుణ్య కటాక్ష వీక్షణము లం
దం బొంద నీ తమ్ముఁడా
డు వచోరీతుల నాలకించుచును రా
ణ్ముఖ్యుండు రాజిల్లెడిగ్.

(రావణుఁ డావిషయమునఁ దిరస్కారంబు నటి యింపుచుఁ బ్రహస్తుని చెవిలో నేమో చెప్పుచు న్నాఁడు.)

ప్రహ:—దేవర యాజ్ఞాపించినట్లే.

(అని నిష్క్రమించు చును.)

(అప్పుడు ప్రహస్తునితో మాయాజానకి ప్రవేశించును.)

మాయాజానకి:—జయము జయ మార్య పుత్రునకు (రావణుని తొడపయిఁగూర్చుండును.)

రావ:—(స్వగతముగ) మంచిది. మాయామయా! మంచిది. రావణు నెట్లా రాధింప వలయునో నీవు బాగుగాఁ దెలియును.

అంగ:—(సవిషాదముగా స్వగతమున)జానకి యితరునికి భార్యగాఁ బ్రవర్తించుచేన్నదేమి? అయినను కనుగొందును గాక.

రావ:—దేవీ! జానకీ! రామునికడనుండి వచ్చిన యీ వానరునితో మాటాడుము.

మాయాజానకి:—(అంగదుని సబహుమానముగాఁ జూచి) వత్సా! అంగదా! నామాటలుగా రామునితోఁ జెప్పుము.

క. "ఈ నను గూర్చిన వనఁటం
గానంగా నేల? పోవఁగదఁగుమ పురి, కే
నా నళినశరుని సాక్షిగ
నీ నిర్మలు బేర్మినిట్ వరించితిఁ బతిగన్.

మఱియును.

శా. ఏనా! రావణ పావనాంక జలరు
డ్భ్రుందాకరా రామ హం
సీ నీతిం గననయ్యె; దానవభట
శ్రేణీ హతుండయ్యెం, భూ
జానీశా! భరతుండు; కావున నయో
ధ్యాపట్టణం బీవు వే
గానం జేరియుఁ బట్టభద్రత గనం
గాఁ జెల్లు రాజ్యానకున్."

అంగ:—(చెవులు మూసికొని) నీవు సీతవు కావు. ఎవరు కందువా:—

గీ. గంగఁ బోలి పావన యయి క్రాలు సీత
భవ్యశీల మహాభరణ మహా పరమపూత
రాఘవుని పత్నియేమి? యీరాణనేఁడు
మును వినని యట్టి యవినీతిఁ బూనుటేమి?

(అప్పు డొక రాక్షసి పటాక్షేపముగాఁ బ్రవేశించి రావణునితో):—

రాక్షసి—దేవా!

క. శ్రీరామ చంద్రునకు నే
దో రవ కీ డాలకించి యొగిని సఖలదుః
ఖారూఢి కంతుఁ గొల్వఁగఁ
గోరెడి సీతయు లతికను గొనె పాశముగన్.

రావ:—(ఖేదముతో) ఆహా! సమయము గాని సమయమున నిట్లేర్పడినది? రాక్షసులారా! జానకిని రక్షింపుఁడు. (అని మాయాజానకిని విడిచిపెట్టుచున్నాఁడు.)

అంగదుఁడు:—(హర్షంబుతో) వాస్తవ జానకీ తేజంబునందీ మాయా సీతాపయాంధకారంబు పటాపంచలయినది.

రావ:—ఓవానరుఁడా! ఇంకను ఏమి చెప్పెదవు?

అంగ:—

చ. దనుజపతీ! యకృత్యమునఁ
దార్కొ-న దెట్టి దొసంగు నీకు, మీఁ
దును నది రాక్షసావళికిఁ
దోరపుమండనమై చెలంగు; న
న్యుని సతి నీ విటుల్ గొనియు
నుం జేనుదెంచుట యొప్పఁ, గాని తు
త్రినికర మానసంబులు క
రంబు రుషా విషమంబు లారయన్.

రావ:—(క్రోధముతో) ఓరీ! పాపీ! దుర్ముఖుఁడా! తెగ వాగుచు రాముని బొగడు చున్నావు. కాని నిదర్శనము సున్న.

అంగ:—ఇంకను నుదాహరణము కావలయునా? చూడుము.

గీ. తన ప్రతిజ్ఞతోఁ గూడ దుస్తర మహాబ్ధి
వెస నెవఁడు దాఁటె- నతఁడు సువేల శైల
వన వనస్పతులను నీకర నికరమును
బలెనె నలుకుచున్నాఁడు; రావణుఁడ! వింటె!

రావ:—అరరే! నీయోచన యింతేనా?

గీ. పావురాలు తరింపవే వారిరాశిఁ?
గొండలను నాక్రమింపవే కోఁతి మూఁక?
అసి కషణశిల రయొఱవున వెసను శౌర్య
రేఖ తేలి తద్బలము తెలియఁబడు నిట.

మఱియును రావణుఁడనఁగాఁ దెలియ దేమి నీకు?

మ. భుజ దండా వధి కంఠ పీఠ వనిలో
మార్ చంద్రహా సంబుతోఁ
ద్రిజగ ద్భీకృతి నేను దున్నితోన ను
ర్వింద ద్దోర్లు నాశీర్ష పా
ళిఁ జఱున్నప్పును పీఁడి బాప్పములతోఁ
డీకేఁది గాఢద్య మెుం
దఁజేనర్ లేదట నొక్కఁ డేసియుఁ బ్రమా
ణం బల్ల శంభుండగుర్.

అంగదుఁడు:—

మ. అవురా! లోక భయాపహారి రఘురా
మాస్త్ర ప్రతానంబు నీ
దవు కౌక్షేయము చంద్రహాసపుఁ గులం
బందుం జనింజెందు నొ
క్కొ? వెసం దీనను ద్రెళ్లు నీశిరము లా
శ్రీకంఠు పర్వంబు నం
దు వలేర్ మూ ఢ! పుఱెం జనింప విదియుం
తోయింతో లో నెంతువే??

రావ:—(క్రోధముతోఁ జంద్ర హాసమును గైకొని) ఓరీ! నాయెదుటినుండి వెళ్లుము. వెళ్లుము. లేనిచోఁ గథాశేషము చేయ వలసి వచ్చును.

అంగ:—(పోదలంచి)

శా. ఓ దోషాచరనాయకుండ! వినరా!
యుర్వీసుతర్ వేగమే
కారర్ వీడ్చియుఁ బంపు, కాకిటుల వీఁ
కం డంబముల్ గొట్టుచోఁ
గేరం గాంతువు నిన్నుఁ గిన్నర గణో
ద్గీతోల్లస ద్విక్రమ
స్ఫార్ వానర సేన నర్కజ భుజా
స్తంభాగ్ర భీమాకృతిర్.

మఱియును.

మ. తలలం జేసి మదింప, కంబుధి ప్రబం
ధంబుర్ రసోదంచింతుం
బలెనుం గాంచు, మమేశునట్లు మరలర్
మస్తంబు లీ, దప్త మూ
ర్తి లసద్భక్త! హితం బొకండు విను, మ
త్పిత్రు ల్లస ద్విక్రమో
చ్చలిత జ్యోతి! దినేంద్ర వంశ వధువుర్
జయ్యర్ విడం బంపుమా!!

ఇంకనే మన్నను.

చ. అమర సుబాహు ముఖ్య దను
జావళితోఁ దొలి దాటకాంగనర్
సమయఁగ జేసె; నీదు నను
జాతమొగంబును జెక్కె; నింక వి
క్రమయుతులర్ భవద్భటుల
రాల్చియుఁగట్టెఁ ద్రుటిర్ బయోధి, నేఁ
డు మృతిని నీకు నాతఁడొ యి
ద్దర్ సమరంబున; భీతి యేటికిర్??

మఱియును.

శా. ఓరీ! మూఢదనూజ! శంకరుఁడు ని
న్నోహ్మముం గదా యంచు న్యా
యారూఢిన్ విడి, నీవు సీతఁగొని రా
నాత్మం దలంపంగ నే
తా రుష్టుండు హరుండు; కాని యెడ, భ
క్త్యాఢ్యాకిత త్వచ్ఛిరో
వారంబిష్ట కపాల మాలికను దా
ల్పం డేటికా శంభుఁడున్ ??

అంతేకాక యో మిథ్యా గర్వశీలా! నీవు మహా దేవుని సేవించిన ప్రసంగము యొక్క సత్యము కూడ మాకుఁ దెలియక పోలేదు.

మ. పౌరిఁ గాయ వ్రతముం బొనర్చియు శిరః
పుంజంబు నర్పించి శం
కరు మెప్పించితి నంచు నిక్కుచును బ
ల్కం బోయెదో? తొంటి వా
క్తరుణీనాథ శిరో నికృంతన విని
దాభీతిమై నీకుఁ దా
వరముం బేర్మి నొసంగె; మర్మమిది డం
బాలేల? పౌలస్త్యుఁడా!!

వినరా! దశవదన వదన వివర నిర్గత వాగ్విభీషికలం జేసి మేము భయం బొందుదుమా?

(ఇట్లని యంగదుఁడు నిష్క్రమించును)

(నేపథ్యంబునందు)

క. వీరా! త్రిలోక పతి వీ
వై రాజిల్లగనె చంపఁ బరఁగెఁ గపి తతుల్
వేరా! సిద్ధంబై నీ
వీరత యెటుఁ బోయె గొప్ప వీరుఁడవు గదా?

రావ:—(తొందరపాటుతో) అరరే! నా యనుచరులు చంపఁ బడుచు మిక్కిలిగా నార్చుచున్నారు.

(అప్పుడు విక్షతాంగులై రాక్షసభటులు ప్రవేశించుచున్నారు).

రాక్షసులు:—

గీ. నీవు నాయకుండవయి యుండియునుగూడ
వానరులచే నయుక్తవహా పగిది మాకుఁ
జావు గల్గు చో వ్యర్థంబ; యీావు గూడ
బ్రదుకు శాశ్వతం బను బుద్ధి వదలుటొప్పు.

రావ:—(కోపముతోఁ బ్రహస్తుని ద్వరితముగాఁ బిల్చి).

సుగంధి. త్వరం దనూజ సేన యాయి
తంబుగావుతన్ మతె
వ్వ రీ రఘుప్రకాండు సైన్య
వానరుల్ ధుతాఖిలా
మరీ శు భాస్య చంద్రహాస
మామకీన దోస్థల
స్ఫుర త్ప్రకార చంద్రహాస
భూతి పొల్చుచుండఁగన్.

(మరలను వికటముగాఁ బరిక్రమింపుచు)

రామ రావణులనొకండఱుగ నపు డరామమో? యరావణమొ యై క్రాలు జగము.

(అనుచు నిష్క్రమించు చున్నాఁడు.)

(అప్పు డాకాశవీధిసంచారులయిన హేమాంగద చిత్రాంగదు లను నిరువురు గంధర్వులు ప్రవేశించు చున్నారు.)

హేమాం:—చెలికాఁడా! చిత్రాంగదా!

మ. తనరన్ యుద్ధము దివ్యబాణములచే
తన్ భూర్భువస్స్వర్జగ
ద్ఘన కల్లోలము గాఁగఁ గొల్పియును గృ
త్తక్షిప్త ఘోరాస్యపం
క్తి నభో దర్శిత రుద్ర సంఖ్య రవి యై
ధీరాత్ముఁ డౌ రాముచం

ద్రునిచేఁ దా నవకీర్ణమై, నిజశర
స్తోమార్చి రుద్యోగ వీ
తినిబొల్పొందియు బ్రహ్మబాణమునఁ బం
డెఁ వీరశయ్యాతలం
బున రక్షః పతిదా కబంధము బుధా
మోదం బవంధ్యంబుగన్ ॥

చిత్రాం:—సఖుఁడా ! చాల కాలమునుండి యిప్ప టికి నంబరవీథియందు నిర్భయంబుగా సంచరింప నయ్యె.

(నేపథ్యమునందుఁ గలకలము).

చ. పది దెస లానలోన నడు
పంబలెనాఁగ నెవాని యాస్యపం
క్తి దనరె సృష్టినంది, సము
దీర్ణ భుజాబలముం బకంత లె
చ్చుదగఁ గరంబు లిర్వదియుఁ
జొప్పడె నేనికి, నాజి తేంద్రుఁ-డ
ల్ల దశముఖుండు-లంకపతి
రాముని రాజ దమోఘ బాణపా
ళిఁ దొడరె నిర్విబంధ నిజ
లీల కబంధతమై రణావనిన్.

చారణుఁడు:—హేమాంగద చిత్రాంగదులారా ! చిత్రముగానున్నది. చూడుఁడు.

శా. హేలా ఖండిత చండ హేమ హారిణం
బీ బాణ మోలిం దనూ
జాలిం బేర్మి విభీషణుల్ మిగులఁగాఁ
జేల్పన్, యమున్ గెల్వఁగా
హాళిన్ మించిన రావణుండు మరలన్
బ్రాణంబులం గాంచు నన్
డీలా చేత సురల్ విరుల్ గురియ-రెం
తే దుందుభుల్ మ్రోయరున్.

చిత్రాంగదుఁడు:—(చమత్కారముగా హేమాం గదునితో:)—సఖుఁడా ! హేమాంగదుఁడా ! భవా

నీపతి భక్తి భాసురుండును ప్రబల ప్రతాపభరప్రణ మిత సకల సురాసురుండును, వీర వరోత్తంసుండు, నగు ఈనక్తంచర చక్రవర్తి యీ రీతిగానే యద్భుత రసైక పాత్రుఁ డయ్యెడిని. ఇతఁడే కదా తొల్లిని శివుని గొల్చు నవసరంబు నందు,

మ. హరు పంచాస్యములన్ స్వపంచశిరముల్
హాళిం బువు ల్సల్పి కొ
ల్చు రుచిన్, శేషిత పంచ వక్త్రుఁ దను నీ
శుంగా-హరుం దన్నుఁగాఁ-
బొరిలో నెంచి, శివాముఖానఁ గరముం
బూన్పంగఁ బో గొరిచే
నొరిమన్ వారితుఁడైన రావణుఁడహో !
యందెన్ మృతి న్నేటికిన్.

(కర్మప్రాబల్యమును జూచుచు ఖేదములో)

క. ఇవిగో జంతు ప్రాక్క-
ర్మ దశావివమత్వ మెటు చెలంగెడి! శివుసె
త్తిఁ దగిన తల లిట గ్రద్దల
పదముల!దొరలాడు, శివశివా! వింతగదా?

హేమాం:—చెలికాఁడా ! యిదియొక్క గొప్ప వింత గాదు. "ధర్మ మెం దుండునో జయము నం దుం డు" నని శాస్త్రప్రమాణము కలదు. శరీరాదులచేతఁ బుణ్యాపాపంబులఁ గావించిన వారి పరిస్థితి యిందుఁ గనఁబట్టినది. ఈ రావణుండే యుదాహరణ మగును గదా ?

చ. ఒగి నిలయందు ధర్మమున
కూన్పఁగఁ బద్ధ వపుర్ధనాదు లె
చ్చేగు నెనకంబుతోఁ జరిగి
యబ్బెడి,నబ్బవు పూన్ప కుండినన్
మృగధర ధారి నెత్తుల యు
జించి, త్రిలోకియు నాస్యపంక్తి గాం
చెఁగద ! దశాస్యుఁ ; డింతి మతిఁ
జేసియు నాశము నొందె నిమ్మెయిన్.

(నేపథ్యంబునందు)

ఉ. అమ్మలు కేతుయష్టి
 శిఖరాంచితముల్గను, జోదొకండుమూ
ర్ఛ మ్మునుఁగంగ, మాంస రుచి
 వ్రాలెడి గ్రద్దల తోడఁ జాల గా
ఢ మ్మను రేట్కబంధము ప
 డంగను నత్తుపు దండ మీఁగ, న
శ్వమ్ములు హేషలం దివియుఁ-
 బాఱెడు మందురఁ జేరఁ దేరొగిన్.

(మరల నేపథ్యంబునందు)

ఉ. సొంతపు టిండ్లకుం దివిజ
 సుందరు లేఁగుఁడు, లంకనుండి స్వ
ర్దంతిని-మావటీ! సురపు
 రంబునఁ గుంజేకుఁ గట్టు; యామికో
దంతులు దేవతల్ వెడలుఁ;
 డాదట నందన కాననంబునం
దుంతరుగాతఁ గల్పకము-
 లూ స్తుపు కింకరు లిందు వాఁకిటం
గెంతియుఁబడ్డ యా భయద
 నిర్జరవైరి వరేణ్య శీర్షముల్.

మఱియును.

చ. అని రహి గన్న దేవసతు
 లప్పనలీఁ బువు దండ లూని-వం
ది నికరముల్ జయాంకముల
 నెమ్మని బాడఁగ-లక్ష్మణుండు పే
ర్మిని గయిదండ నీ-వనజ
 మిత్ర కులోల్లస దిందిరేశుఁడై
యొనరెడి మేటి స్యందనము
 నోలి దిగెన్ రఘురామ చంద్రుఁడున్.

శ్రీరాముఁడు: — (పుష్పకంబు పయి నెక్కి-యయోధ్యకు వచ్చుచు వచ్చుచు సీతాదేవికి లంకా రణభూమిం జూపుచు.)

ఉ. ఇక్కడ నాగపాశముల
 నేర్పడ బంధమింటా మఱంది ఆ
మ్మొక్కన శక్తినాటఁ బవ
 నోద్భవుఁడాయ్యెన ద్రోణ పర్వతం
బిక్కడఁ జేర్చె-నింద్రజిను
 నిక్కడ లక్ష్మణుఁడంపె స్వర్గగ
ద్భాక్కగ-నిందు నేఁడొ దశ
 వక్త్రు శిరమ్ములడుల్చె-నింతిరో!!

---

ఉత్సాహ. అనుచు నవరసంబు లెసఁగ
 నవని జాతకింపు నీఁ
దనరుచుఁ, బులకలు తనువునఁ
 దార్కొనన్ స్వపట్టణం
బునకును జేసిఁ స్వకుల రాజ్య
 ముఁ దగఁ బౌరులొప్ప నే
లు నృపవరాళి శుభదుఁడు మిముఁ
 బ్రోఁచు రామభద్రుఁడున్.

---

గీ. తొంటి సుకవులు నలుపు కృతులను గొంత
గొనియు గద్యపద్య మయంబుగను సుభ
 [టను
హాకవి యిగ ఛాయా నాటకాకృతి సుర
భాషలో వ్రాయ, వేంకటస్వామి గుప్త
దోమకులుఁడూని తెలిఁగించెసామయి నొగి.

శ్రీ శ్రీ శ్రీ

---

# సర్వమంగళేశ్వరశాస్త్రిగారి కవితావిలాసములు

ఉభయభాషా సాహిత్యవిద్యా ప్రవీణ బులుసు-వేంకట రమణయ్యగారు,

ఆంధ్రదేశమునఁ బ్రసిద్ధిచెందిన పండితప్రకాండులలో శ్రీ నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రిగా రొకరు. వీరి నివాసస్థలము విశాఖపట్టణ మండలమునందలి పార్వతీపురమునకుఁ జేరువనున్న నాగూరగ్రహారము.

శ్రీ శాస్త్రిగారి రచనలు గీర్వాణ భాషయందే గన్పడుచున్నవి. వీరురచించిన గ్రంథములెన్నియో తెలియదు గాని యవి మిక్కిలి తక్కువయని చెప్పవచ్చును. ఇపుడు శబ్దమంజరితోఁ గలిపి ప్రకటింపఁబడు సమాస కుసుమావళి మాత్రము మిక్కిలి ప్రచారమున నున్నది. శ్రీ శాస్త్రిగారి కీర్తి యాచంద్ర తారార్కము వెలయుటకు వీరిగ్రంథకర్తృత్వమే గాక కవితావిలాసములే విశేషించి కారణమగునని నిశ్చయింపవచ్చును.

శ్రీ శాస్త్రిగారి పాండిత్యమును గురించియు, గాలాదులను గురించియు నిదివఱకు వీరి కుటుంబములోనివారగు బ్ర.శ్రీ.నడిమింటి పతంజలిశాస్త్రిగారు సూక్ష్మముగ భారతియందు ముచ్చటించి యున్నారు. ప్రమాణసహితములగు శ్రీ శాస్త్రిగారి కవితావిలాసములను గొన్నింటిని, జనాకర్షకములగు వానిని నాస్మృతిపథమునఁ గలవానిని వివరించుటయే నాప్రస్తుతపు టుద్దేశము. ఆధారములేని కథలను వివరించుటకు మాత్రము సాహసింపఁ దలంపు లేదు.

శ్రీ శాస్త్రిగారు కొంతవఱకు వికటస్వభావులు. కావున వారి వైకట్యమందందు భావములందును, రచనలందునుగూడఁ బ్రతిఫలించుచుండును. వీరు రచించిన సమాస కుసుమావళియందలి తొలిపద్యమున నిట్టి భావము స్పష్టమగుచున్నది.

శ్లో. భూనాయకంవా ధననాయకంవా
భజన్ భువంవా ధన మేతి లోకే
త ద్విఘ్ననాథం న భజామి కింతు
సహస్రశ స్తం ప్రణమామి నిత్యమ్. 1

వీరి కవిత్వ వికటత్వముఁ గూర్చి నున్నుం దుదాహరింతును.

శ్రీ శాస్త్రిగారికి విజయనగర ప్రభువులగు శ్రీ నారాయణ గజపతి మహారాజులుంగారు నాగూరును దానమిచ్చి, ఆయగ్రహారమును శ్రీశాస్త్రిగారి కప్పగింపవలెనని కురుపాం ఫిర్కా సముద్దారుఁడగు కేశవరావను నతనికి హుకుము జారీ చేయించిరి. తన ఫిర్కాలోని బిళ్ళకుట్టు వాస్తవ్యుఁడగు మదీనాప్పాయెబను తురుష్కుని యినాములు దావాలోపోఁగా గవర్నమెంటువారు చేసిన డిక్రీనకళ్ళకై పాటుపడుచున్న యాయుద్యోగి తనకా నకళ్లు సంపాదించి యిచ్చినచో భూముల నొప్పగింతునని శాస్త్రిగారితోఁ జెప్పెనఁట. రాజాధిరాజులనుసైతము లెక్కపెట్టక స్వేచ్ఛగఁ జరించుచు, నిట్టిచిక్కులేమియు నెఱుఁగని శాస్త్రిగారు కుపితులై వెంటనే విజయనగరమున కేగి "పనియేమి?" అని మహారాజులుంగా రడుగుటయే తడవుగ నీ క్రింది శ్లోకముఁ జదివిరి.

శ్లో. పురా బిళ్ళకుత్త్యామదీనాప్పసాయు
బ్ధరాయాం గతాయాం కృతా తత్ర డిక్రీ
తదాకారలేఖా సమానీయ తేచే
ద్దదామీత్యవోచ ద్ధరాం కేశవార్యః.

---

1. లోకమున భూమీశుని సేవించువానికి భూమియు, ధనికుని సేవించువానికి ధనమును లభించుచుండును. అట్లే విఘ్ననాయకుని సేవించువానికి విఘ్నములే కలుగవచ్చును గాన నేను విఘ్నేశుని సేవింపను. నా జోలికి రావలదని మాత్రము వేమఱు నమస్కరింతును.

మహారాజావారు వెంటనే యాసనుద్దారుని రప్పించి శాస్త్రిగారి యినాముల నొప్పగించునట్లు చేసిరఁట. అపుడు శాస్త్రిగారు

శ్లో. హారడంభం హరిడింభం
శంఖరాజ భంభంభమ్
న్యక్కురు తే ధిక్కురు తేఽ
ధఃకురు తే రాజరాజ! కీర్తిస్తే. [1]

అని మహారాజులుంగారిని కొనియాడిరఁట.

ఒకపుడు శాస్త్రిగారు వేదోపనిషై రాజానునకు వెళ్ళిరఁట. అచట వారి కాతిథ్యముగాని వంట చేసికొనవలయు సౌకర్యములుగాని లభింపనందునఁ గినిసి వారు రెండుశ్లోకముల నచ్చటిస్థితిని వర్ణించిరఁట.

శ్లో. రాజాంతరకృతరాజా
మజలధరాజాం సదాపి వారాజామ్,
రాజామ్యనితతరాజాం
వ్యాహారాజాం కుతో గతో రాజామ్. [2]

శ్లో. రంధన మద్య కథం స్యా
దింధనదాతా న దంధణం కురు తే,
బంధన మేవ హి ప్రాప్తం
కం ధనవంతం సమాశ్రయా మ్యద్య. [3]

అచటివా రొకరిద్దరీసంగతి నెఱింగి యచట మకాముచేసిన మేజస్ట్రేటుగారి కీసంగతి చెప్పఁగా నతఁడు శాస్త్రిగారిని బ్రతిమాలి తన బసకుఁ దీసికొనివచ్చి గౌరవించెనఁట.

ఇఁక వీరి శాపసామర్థ్యముఁ దెల్పు విషయములఁ జెప్పెదను. ధూమశకటాది సౌకర్యములేని యక్కాలమున శాస్త్రిగారు కాలినడకను గాశికిఁ బ్రయాణమైరి. అచ్చటచ్చట మార్గమధ్యమున బాటసారుల సౌకర్యమునకై నిర్మింపఁబడు పర్ణకుటీరములలో మజిలీ చేయుట యలవాటు. ఒక మజిలీయందు శాస్త్రిగారొక గది నద్దెకుఁ దీసికొని యుండిరి. అది పర్ణకాలమగుటఁ దక్కిన గదులన్నియుఁ గారుచు వీరి గది మాత్రము బాగుగ నుండెనఁట. బొబ్బిలి మహారాజుగారు తమ బంధువుల యస్థికలను గంగలోఁ గలుప నొక బ్రాహ్మణుని గాశికిఁ బంపుచు నిరువురు తురకలను సాయముగ బంపిరఁట! ఆసమయమునకు వారామజిలీకి వచ్చి తక్కిన గదులు కారుచున్నందున శాస్త్రిగారి గదినే కోరిరఁట. అద్దెయిచ్చిన శాస్త్రిగారాగదిని విడువలేదు. అపుడొక తురక "గదివిడువనిచోఁ జంపెద" నని కత్తినెత్తగా శాస్త్రిగా రుగ్రులై,

శ్లో. బగళాంబ! గళే నిధాయ పాణిం
ద్విషతా మామిషతా న్తమానసే!
ప్రవిదారయ ధారయా నఖానా
ముదరం మా మదరం కురు ద్రుతమ్. [4]

---

1. ఓ మహారాజా! నీకీర్తి తెల్లదనమున శంకరునియార్భాటమును, గాంభీర్యమున సింగపుఁబిల్లను దిక్కలను మార్మ్రోయుటచే శంఖము నతిక్రమించుచున్నది. (ఇందుఁ గవిత్వ వికటత సువ్యక్తము.)

2. ఈ రాజానునకు వెలమవారు ప్రభువులు. ఇచట వరుణునికిని నీటికిఁ గరవు. తూనిక లెచ్చుతగ్గులు. బ్రహ్మదేవుఁ డిచటికి వచ్చిన నుపవసింపవలసినదే గాని యన్నము దొఱకదు. ఇట్టి యూరి కేలవచ్చితిని? ఎట్లు నిలువఁగలను?

3. కట్టెలమ్మువాఁడు మాటిమాటికిని ద్రిప్పునే గాని కట్టెల నీయకున్నాఁడే! వంట యెట్లగును? ఇచట నాకుఁ జెఱయే స్థైనదే? నేనిపుడే ధనవంతు నాశ్రయింపఁగలను?

4. శత్రువుల మాంసమునకుఁ దహతహ పడు తల్లీ! బగళా! నీపాదముచే వీని మెడద్రొక్కి గోళ్ళచే హృదయమును జీల్చిచంపి నన్ను నిర్భయుని జేయుము.

అని శపింపఁగా నెచ్చటినుండియో రెండు సివంగి కుక్కలు వచ్చి వానిపొట్ట చీల్చి చంపినవఁట! పిదప రెండవవాఁడు "కాశినిజేరులోపల నిన్ను జంపెద"నని పల్కఁగా శాస్త్రిగారు

శ్లో. శీతలే! భూతలే యో మా
మద్వేష ద్దుర్జనో జనః
పంచతా మంచతా చ్ఛీఘ్రం
స్ఫోటకా త్కీటకాకులాత్.[1]

అనివానినిగూడ శపింపఁగా వాఁడామరునాఁడే స్ఫోటకముచేతనే మరణించెనఁట!

లక్షాధికారియు వైష్ణవుఁడునగు పెద్దిపాత్రుఁడను శూద్రుఁడు తనగురువుతోఁ గూడఁ బోవుచు శాస్త్రిగారియెడఁగల గౌరవ భయముల చే వారికి నమస్కరింపఁగా "దీర్ఘమాయురస్తు" అనిశాస్త్రిగా రాశీర్వదించిరఁట! గురువు "శైవునకునమస్కరింతువా?" అనిమందలింపఁగా పాత్రుఁడుమెల్లగ "ఒంటికన్నుగలవారినిజూడరాదని చేతులడ్డముచేసి కొంటినిగాని నమస్కరింపలే"దని పల్కెను. అదివిని శాస్త్రిగారు "పెద్దిపాత్రుఁడూ! నీవు నాకు నమస్కరింపను లేదు, నేను నిన్నాశీర్వదింపనులేదు" "దీర్ఘమాయురస్తు" అనఁగా దీర్ఘమగు కఫరోగము కలుగు గాక! అని యర్థముగాని చిరాయువు కలుగుట కాదు. నీవు వారము దినములలోగా కఫరోగమువలన మరణింతువు" అని పలికిరఁట! పాత్రుఁడట్లే మరణించెనఁట!

శాస్త్రిగారి సమర్థ్యముఁ దెల్పు నైతిహ్యమును వ్రాయుదును. వీరు కాశినుండి జగన్నాథమునకు వచ్చి దేవాలయమున నొకచో మట్టియాకునఁ బ్రసాద మంచుకొని తినుచుండిరఁట! అచటి యుత్కళ పండితులాక్షేపింపఁగా "మీరు మత్స్య కూర్మావతారముల నే భక్షింతురే! అది తప్పుకాదా!" అని శాస్త్రిగారు తిరిగి యాక్షేపించిరఁట! అంత వారు ప్రసంగ వశమున శాస్త్రిగారు ప్రసాదమును దూషించునట్లు చేసిరఁట! శాస్త్రిగారు దక్షిణామూర్తి కవచమున శరీరమున గట్టుకొనినను నేత్రబంధనము మఱచినందుఁ గన్నులు పోయినవఁట! అట్లయినను, ఒకరిమాట కాదనుటయే స్వభావముగల శాస్త్రిగారు తన కన్నులు పోలేదని చెప్పుచు, నిదర్శనముగ జగదంబకటాక్షమున నిస్సహాయముగ మార్కండేయ సరస్సును జేరి చూపఱ కాశ్చర్యముఁ గొల్పిరఁట! అచటనే "ఘృణిః సూర్య ఆదిత్య ఓం" అను సూర్యదేవతాక మంత్రాక్షరములఁ దీసికొని యాయక్షరముల మొదటనుంచి యార్యానవ సావిత్రిని రచించి నేత్రభాగ్యముం గనిరఁట!

శ్లో. ఘృణయా భృత సురగణయా
జగతః కృత్స్నం తమో హరతః
మామకతమసో హరణే
తరణే! కస్తే శ్రమో నాస్తే.[2]

శ్లో. ణిరితి ప్రత్యయవిహిత
స్వార్థ స్వాధారభావ మాపన్నః
జగతాం కర్మను యస్త్వం
మిత్ర! త్వాం కర్మసాక్షిణాం వందే.[3]

శ్లో. సూతే తవ కరనికరో
వృష్టిం ధారాభి రోషధీ ర్భూమా

---

1. తల్లీ! శీతలా! నన్ను ద్వేషించిన యీదుర్జనుఁడు పురుగులుకారు స్ఫోటక వ్యాధివలన వేగముగ మరణించుఁ గాక!

2. దేవతలనందఱిని భరింపఁగల కరుణ కల్గి జగముయొక్క తమస్సు నంతటిని హరించు నీకు నాతమము [(ఆంధ్యము) హరించుటలో శ్రమకలుగునా!

3. లోకమునఁ గర్మాచరణమునకు నీవే ప్రేరకుఁడవు. (పగలే కర్మల నాచరింప వలె ననుట) కావున నీవు కర్మసాక్షివై యున్నావు. ఓమిత్రుఁడా! నిన్నునమస్కరింతును.

తాభి స్సకలజనానా
మీప్సితసిద్ధిం సదేవతాపాలిమ్. [1]

శ్లో. రిపుమపి కిరణసమూహో
య స్త్వాదిగుహో దిగ న్తవిశ్రా న్తమ్
సతతం జగదభివంద్యం
భానో! త్వాం లోకబాంధవం వందే. [2]

శ్లో. యద్యపి తవ కరనికరః
కువలయవిమతోఽపి కువలయప్రియకృత్
చిత్రం తవ హి చరిత్రం
మిత్రం వందే, జగత్పవిత్రం త్వామ్. [3]

శ్లో. ఆగమనిగమస్మృతయః
శివకమలాధీశ పావకాకారమ్
తేజ స్తావక మాహు
ర్ద్వాదశమూ ర్తిం సమాశ్రయే తంత్వామ్. [4]

శ్లో. దినకర! తవ కరయోగా
యోగాభ్యాం వ్యసన ముదయనం చాపి
గ్రహతతి రలభత యస్మా
త్తస్మాత్త్వాం చిత్రభాను మీశేఽహమ్ [5]

శ్లో. త్యక్తసమ స్తరుజానాం
మనుజానాం త్వత్ప్రసాదేన
ముక్తిజ్ఞానైశ్వర్య
ప్రాపణహేతు స్త్వమే వాసి [6]

శ్లో. ఓమితి వచనం కథితం
శరణంశై వాది షణ్మతస్థానామ్
సవితః! శ్రుతిగణసారా
త్వత్తోఽభిన్నా నదేవతాప్యన్యా. [7]

శ్లో. ఆర్యానవసావిత్రీం
ప్రాత ర్మాధ్యందినే సాయమ్

---

1. నీకరసమూహమువలన వర్షము, వర్షమువలన భూమియం దోషధులు వానివలన దేవతలతోఁగూడ సకల జనములకు నభీష్ట సిద్ధియుఁ గల్గుచున్నవి.

2. నీవు నీశత్రువగుఁజీకఁటినిగూడ దిగంత విశ్రాంతమగుదానినిగఁ జేయుచున్నావు. (దిక్కుల చివఱ ధ్రువసమీపముననే చీకఁటి గలదనుట) కావుననే నీవుజగద్వంద్యుఁడవై లోకబాంధవుఁడ వగుచున్నావు.

3. నీకరములు కువలయములకు (కలువలకు) విరోధులైనను, కువలయమునకు (భూమికి) సౌఖ్యకరములు. జగత్పవిత్రుండవగు నీచరిత్రము చాల విచిత్రమైనది.

4. వేదములు, శాస్త్రములు, స్మృతులు నీతేజము శివ - కేశవ-వైశ్వానరాత్మకమైనదని చెప్పుచున్నవి. ద్వాదశ స్వరూపములుకల నిన్నే నేనెల్లప్పుడు నాశ్రయింతును.

5. ఓసూర్యుఁడా! నీకరముల యోగమున్న నుదయమును, యోగము లేకున్న వ్యసనమును గ్రహములు పొందుచుండును. కావునఁ జిత్రభానుఁడవగు నిన్ను స్తుతింతును.

6. నీయనుగ్రహమువలన లోకమున జనులురోగములను బోగొట్టుకొందురు. ముక్తిజ్ఞానైశ్వర్యములు నీవలనే గల్గుచుండును.

7. శైవ వైష్ణవ ప్రాజాపత్య శాక్తేయ కాపాల గాణాపత్య మతముల వారి కందరికిని ప్రణవమే (ఓంకారము) శరణ్యమని చెప్పఁబడినది. ఓసూర్యభగవానుఁడా! శ్రుతిసిద్ధమై ప్రధానమగు దేవత నిన్ను మించి నది వేఱులేదు.

పఠతాం సకలజనానా
మీప్సితసిద్ధిం రవిః కురుతే. [1]

శ్రీ శాస్త్రిగారు గొప్ప పండిత కవులైనను మత్సరములేక పైవారి కవితయందలి గుణములను గ్రహించి మెచ్చుకొనెడివారు. ఒకప్పుడు శాస్త్రిగారు దేవిని స్తుతించుచు.

శ్లో. సక్థిద్వితయసమత్వం
రంభాయుగళస్య సంభవత్యేవ,
ఊర్ధ్వ ముదంచితమూలం
తద్యుగళం చే ద్దళైర్విహీనమ్. [2]

అని చెప్పఁగా వారిశిష్యుఁడగు చెఱుకూరి రెడ్డిశాస్త్రి

శ్లో. అంబ! తవోరుద్వితయం
రంభాయుగ మేవ జఘనపులినోత్థమ్
వేణీ యమునావేగా
దధరీకృత మపిచ సంవృతచ్ఛదనమ్. [3]

అని దానినిమించునట్లు చెప్పఁగా శాస్త్రిగారాతనిని మిగుల మెచ్చిరఁట.

శాస్త్రిగారు తమ యగ్రహారమును జాలచక్కఁగ వర్ణించి యున్నారు.

శ్లో. లసద్వధూపీనకుచాగ్రహారః
సమస్తశిల్పేంద్ర సమగ్రహారః
వాతాధ్వశూన్యీకృతసాగ్రహారో
విభాతి నో నాగపురాగ్రహారః. [4]

పనిపాటులేక తమ యింటనున్న నరసరాజుం గూర్చి శాస్త్రిగారు చెప్పిన శ్లోకముఁ గనుఁడు:—

శ్లో. పర్ణక్రియార్థం ఖలు భృంగరాజః
మానక్రియార్థం ఖలు విట్టరాజః
యాగక్రియార్థం ఖలు విత్తరాజః
నకించిదర్థం భువి నర్సరాజః. [5]

---

1. ఈ యార్యానవసావిత్రీ స్తోత్రమును మూఁడు సంధ్యలయందును బఠించువారికి శ్రీ సూర్యభగవానుఁడు ఈప్సిత సిద్ధిని దప్పక చేఁగూర్పఁ గలఁడు.

2. ఓతల్లీ! అనఁటి కంబములు తలక్రిందుగ నుండి (మీఁద మొదలు క్రిందుగ నాకులు కల్గునట్లు) ఆకులు లేకయున్నచో నీయూరువుల సామ్యము వానికిఁ గలుగవచ్చును.

3. తల్లీ! నీయూరు ద్వంద్వము రంభాయుగళమని చెప్పవలెను. అది జఘనమను నిసుకతిన్నెపైఁ బుట్టినది. జడయను యమునానదివేగమున నతిక్రమింపఁబడి ఆకులు కప్పఁబడిపోయినవి.

4. మానాగూరగ్రహారము స్త్రీల యున్నత కుచములపైఁ బ్రకాశించు హారములు కలదియు, ఉపాధి కల బ్రాహ్మణులు కలదియు, ఎదురుగాలిచే నెగురఁగొట్టబడు కంతహారములు కలదియునై యున్నది.

5. భృంగరాజ పత్రము రంగునకును, త్రాసు తూనికకును, ధనము యాగాదిక్రియలకు నుపకరించును. కాని మా నరసరాజు మాత్ర మేపనికి నుపకరింపఁడు.

# ఏ ల ?

వఝ్ఝల - కాళిదాసు గారు, (ఆంధ్రగీర్వాణ సాహిత్య పరిషత్తు.)

నీకనులం దళుక్కున విసీల విలాసము సంచలింప తా
రాకమనీయ మోహన దరస్మితకాంతులు చెక్కులంట నా
లోకనపంక్తులన్ దరళలోలములన్ గురియించితేల శ్యా
మాకృతి! నా విముగ్ధ హృదయమ్మున నేఁ జలియించి పోవఁగన్.

మునుకొను వేకువన్ బొగడపూవుల నేరిచి కూర్చి తెచ్చి నం
దనవనసుందరీమణి విధమ్మునఁ గ్రొత్త మయూరముల్ కనుం
గొనల వెలుంగ నన్నుఁ గనుఁగొంటి వదేటికి బాల మెల్ల మె
ల్లన దరిఁ జేరి నాకరములన్ బడవైచితి వేల దండలన్.

చికిలుట నీదు కన్నుఁగవఁ జిప్పిలఁగా మిడి పొని ప్రేమ కో
రికలఁ గలంపఁగా ననుసరించిన నా దెస మెల్లఁ జూచి ఏ
టికి మరపించిపోతివి తటిల్లతవోలిక, నంతలోనె బా
లిక కపురమ్మునం దివతళించిన మాలిక లిచ్చితేటికిన్.

వలపులునిండు కన్నులఁ ద్రపాచకితమ్ములు ప్రక్కప్రక్క చూ
పులు పులకింపగాఁ బొగడపూవుల దండలు తెచ్చియిచ్చి న
వ్వులఁ గురిపించి నీతళుకుబుగ్గలు నా యర చేతనుంచి ఎం
దుల కరమూసినావు కనుదోయిని శ్యామమనోహరాకృతీ.

మినుకుమటంచు నాకసముమీఁదఁ దళుక్కున వెల్గు చంచలా
కనకలతావిధానమునఁ గన్పడ దేటికి నాత్మలోన, నూ
తనరమణీయతా మధురతల్ పులకించిన మల్లెపూవు పొ
ల్పున మధురస్మృతుల్ మనసులో పిడఁబారగ శ్యామమోహినీ !

("మధువీధి"నుండి)

---

# మానవస్వభావము

శ్రీమదభినవాంధ్రవాల్మీకి కావ్యస్మృతితీర్థ జనమంచి-శేషాద్రిశర్మగారు,

భగవంతుననుగ్రహము కల్గినఁగాని పౌరుషము ఫలింపదనుట సిద్ధాంతమే యనవచ్చును. పరమేశ్వరు నాశయ మెల్లపుడు ధర్మమునందే నిలిచియుండునుగదా? ధర్మము భగవత్స్వరూపమే యనుటయుఁ గ్రొత్తది కాదు.

> "వృషోహి భగవాన్ ధర్మస్తస్యయః కురుతేహ్యలం
> వృషలం తంవిదుర్దేవా స్తస్మాద్ధర్మం న లోపయేత్.
> ధర్మఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః
> తస్మాద్ధర్మో నహంతవ్యో మానోధర్మోహతోవధీత్.
> ఏకఏవ సుహృద్ధర్మో నిధనే ప్యనుయాతి యః
> శరీరేణసమం నాశం సర్వమన్యద్ధి గచ్ఛతి."

అను నీమనుస్మృతివాక్యములు పైన వ్రాసిన భావమునే నొక్కి తెలుపుచున్నవి. ధర్మమును దృణీకరించుట యనఁగాఁ బరమేశ్వరుని దిరస్కరించుటయే యనఁదగు. ధర్మ మొక్కప్పుడు ఫలింపఁదనఁగా భావమేమి? పౌరుషము వాస్తవముగా ధర్మానురూపము కాదనియే, అధర్మము ధర్మమును మించఁజాలుననుట మిక్కిలిపొరపాటు; బాహ్యదృష్టి కొక్కప్పు డధర్మము ఫలించినట్లు ధర్మము ఫలింపనట్లు కనఁబడుంగాని వాస్తవము గాదు; ధర్మమే సర్వదా సర్వథా విజయము గాంచు ననుట సత్యము.

కాలము మాఱుచుండుకొలఁది మానవుల యలవాటులు మాఱుచుండుననియు, నానా ర్పులావశ్యకములే యనియుఁ గొందఱందురు. కాలమునకు మాఱ్పు లేదు. ఏకరీతిగానుండును; కాలవిభాగములు కల్పితములు. అఖండమే యని యగుననుట నిర్వివాదాంశము. కాలమున మార్పులున్నట్లు మనకగపడునవి సృష్టివైచిత్ర్యములే. అవి యే కాలమునందు నొక్కరీతిగా నుండవు. కర్మానుసారము భూతవ్రాతమున కనుకూలముగాఁ బరిణామములు కలుగుచుండును. అట్టిమార్పులులేని సృష్టియే యుండదు. అవి తమంత యగునవి. బలిమి మీఱి మనము మార్చునవి మాత్రము కావు. ఏ కాలమునఁ గాని మార్పరానివి కొన్ని విషయము లుండును. కలికాలమున ధర్మమునకు విజయము లేదని యధర్మము నాశ్రయింపరాదు. ధర్మము స్వకృతపాపకర్మమున విజయము నందఁజాలదని వీడరాదు. ఇట్టివి మార్పఁదగినవి కొన్ని కలవు. వానిని మాత్రము స్పృశింపరాదు. భగవంతునిగా భావించి యారాధించుచుండవలయును. సత్యవ్రతాదుల నిట్లే యని మన మూహింపవలయును. శాస్త్రసిద్ధములు కాని యాచారముల నెప్పటి కేవి యుచితములో వాని నట్లు మార్చుకొనవచ్చును.

వాగ్దేవి నారాధించువారు తత్సేవయందే నిరతులై యుండవలయును, సేవాభేదము లెన్ని యేని గలవనియు నన్నియు సమానములే యనియు భావించి యేపూట కేది తోఁచునో యట్లు చేయరాదు. సేవాభేదము లెన్ని యుండిన నందుత్తమమార్గమునే యనుసరింపవలయుఁగాని యధమమార్గము ననుసరింపరాదు.

వాగర్థములు రెండును సమంజసములుగ నుండందగినవి, శాస్త్రమును మీఱిన యాచారము దురాచారమే కాని సదాచారము కాదు.

"యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాంగతిం.
తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి.''

అను భగవద్వాక్యము మఱువరాదు, దానిని బ్రమాణముగాఁ గైకొని వర్తించు టుత్తమము కాదా!

మనస్సునఁ గల యభిప్రాయ మితరులకుఁ దెలుపుటయే భాషకుఁ బ్రయోజనము. కాన నాపని సాగినఁ జాలును, దీనికేల శాస్త్రముల నువారుందురు. వారి యాశయము సమంజసమే. ఒక్కమాట. భాషద్వివిధముగ నుండును. ఒక్కటి సంజ్ఞారూపము, ఒక్కటి వాగ్రూపము. తఱచుగా సంజ్ఞారూపము సర్వకార్యక్షమము కాదు. వాగ్రూపమేఁ బహూపకారము. సంజ్ఞలుకూడఁ గొన్ని విరుద్ధాభిప్రాయముల నిచ్చును. మాటలునట్లే. లలితమై శాస్త్రవిహితమై ఏవగింపుగలిగించు, సర్థమునుబోధింపని భాషయే యుపయోగింపఁదగినది. తోఁచినట్లు భాషను మార్చుట దానినే వ్యాపింపఁజేయుట యనునవి యుత్తమకార్యములు కావు. వ్రాఁతకుపయోగపడు పత్త్రములచేఁ బుష్పములనిర్మించి వానిచే భగవంతు నారాధింపరాదుకదా! సురభికుసుమముల మల్లికాదులం గైకొనియే యిష్టదేవత నారాధించుటుచితము, అట్లే భాషయు నని భావించిన వేఱు భావములు తోఁపకయుండును. కనకరత్న భూషణములవలెఁ గృత్రిమకనకరత్న భూషణములు మూల్యవంతములు కాఁజాలవు. కృత్రిమ భూషణముల వాగ్దేవత నారాధింపఁ బ్రయత్నము చేయరాదు. అది యుత్తమఫలము నీఁజాలదు. మహాకవులు పోషింప భగవతి తన్మూలమున నానందింప జాని నెల్లరు శిరసావహింప నలరు భాషయే యోగ్యము. దాని నభివృద్ధికిఁ దే నెల్లవారుల్లములఁ దలంప వలయును. దేశాభివృద్ధి కిదియే హేతువగు. కాచపాత్రము లెన్నియున్నను ధనవంతుఁడని పేరుపొంద శక్యము కానియట్లు కృత్రిమభాషా కావ్యము లెన్నియున్న నది పుస్తకభాండాగారమున నొప్పదు. సత్పుస్తక భాండాగారము లున్నఁగాని దేశమున్నతగౌరవమును గాంచదు. వాగ్దేవికుమారులు కుమారీమణులు భక్తిపూర్వకముగ సర్వలోకజనని నుచితరీతి సాధుమార్గమున నారాధించి తత్కటాక్షవీక్షణములకుఁ బాత్రులు కావలయును. అట్టి యారాధనముకూడ నొక విధముగు తపస్సనంబడును. ఎట్లు మాటలాడినను వ్యవహారము సాగునని తోఁచినట్లు నియమములమీఱి భాషించుట వ్రాయుట న్యాయ్యము కాదు. వాగ్దేవి నారాధించి తన్మూలమునఁ గృతార్థులు కావలయునను నూహకలవార లెల్లరు సజ్జనాదృతమార్గమున నాజనని నర్చించి తత్కృపకుఁ బాత్రులు కావలయును. తన్మూలమున దేశాభివృద్ధికిఁ దోడుపడ వలయును.

"స్వస్థానవేషభాషాభిమతాః సంతో రసప్రలుబ్ధధియః
లోకేబహుమన్యంతే వైకృతకావ్యానిచాన్యదపహాయ''

అను సూక్తిని సంస్మరింప వలయునని మహాశయుల నభ్యర్థించుచున్నాఁడను.

---

# ఫల్గున ప్రశంస

బూదూరు-రామానుజులు రెడ్డి గారు,

చ. అతిదృఢవేది బాహుఘనుఁ డార్యుఁడజేయుఁడు దూరపాతనా
చతురుఁడు హస్తలాఘవ విశారదుఁ డాశ్రితరక్షకుండు భూ
పతికులమౌళి దివ్యశరవర్గ నిరర్గళ విక్రముండు నా
యతభుజశాలి పాండునృపుఁడందిన పుణ్యఫలంబు క్రీడి దా౯.

మ. ధర జన్మించినదాది దివ్యశరవిద్యాప్రౌఢి నిందాఁక సం
గరరంగంబులఁ బెద్ద పేరు గల యుగ్రస్థైర్య ధైర్యాత్మకుల్
గురుఁడు౯ భీష్ముఁడు గార్తవీర్యుఁడును శ్రీ కోదండరాముండుగా
కొరులంగానము; మించు వీరల నవార్యుం డింద్ర సూనుం డొగి౯.

మ. దనుజధ్వంసి యవార్యవిక్రముఁడు భక్తత్రాణపారీణుఁ డా
ర్యనుతుం డవ్యయుఁ డీశ్వరుండఖిల విద్యాజాలసంవేది ధై
ర్యనయోద్భాసితుఁడైన చక్రి రథసారథ్యంబు దాఁ జల్పె మే
కొని క్రీడీ! భవదీయపుణ్యమది నేఁ గొండాడ శక్తుండనే??

చ. పొడిపొడిగాఁగ సంగరపు భూమిని రథ్యరథద్విపావళి౯
గడువడినేయ దానికిదగ౯ రథచోదకవృత్తి చక్రహ
స్తుఁడు సలుప౯ సురాసురులు స్తోత్రముఁసేయ నరాతిసైన్యముల్
సుడివడఁజేయు నీరణము-చోద్యము వర్ణనసేయ శక్యమే ??

చ. ధరదిరిగె౯ దిశల్ దశలు దద్దరిలె౯ గ్రహతారకాళి పె
ల్లొరిగె నభోంతరాళము భయోన్నతిబూరటిలె న్మహాంబుధుల్
దిరిగి కలంగె దేవతతి దీప్తులదక్కెను నీవు తేరిపై
బిరుసున నొత్తిన౯ నినదభీషణశంఖము దేవదత్తము౯.

ఉ. అల్ల వనంబులోఁ దపసివై కడునిష్ఠమెలంగ నయ్యెడ౯
బెల్లుగ నీపయి౯ బడిన ప్రేకపుఁ గ్రోడముకై రణంబులో
నుల్లమున౯ జలింపక మహోన్నతి గెల్చితి వంట శాంబరీ
భిల్లుని నొక్కలెక్కయఁటె భీష్ముఁడు గీష్ముఁడు నీకు ఫల్గునా !!

చ. పిడుగులఁబోలె బిట్టవియు వీఁకను గాండివ మెక్కుపెట్టి క
వ్వడివయి వెల్లుగా దిగిచి సాయక సాయకపంక్తి గప్పఁ జి
చ్చడతెడు కన్నుమూసి రణమందు త్రిశూలము డాచి లీల వ
చ్చెదు హరుఁడాయనన్ దురము సేసెడు నిన్నెదురన్ దరంబొకో ??

మ. హరిసారథ్యము దివ్యసాయక మహోద్యత్స్ఫూర్తి దివ్యాశ్వదీ
ప్తరథోగ్రత్వము దేవదత్తము రణవ్యాపార కేళీమనో
హరచాపంబగు గాండివంబు గలవ య్యారే ! నిజంబెంచఁగా
విరియన్ గా కెటువంటి ధీరుఁడయినన్ విల్లెత్తగా నెంచునే ??

శా. చేతన్ జాపముఁబట్టి వైరిగణమున్ జెండాడి శస్త్రాస్త్రసం
ఘాతభ్రాజిత పాండితింబరగు నిక్కాలాన లోకత్రయిన్
ఖ్యాతింజెందిన ధీర వీరజనలోకంబందు నెవ్వారలున్
నీతోడన్ సరిరారు పోర ననిలో నిక్కంబు వీరోత్తమా !!

చ. ద్రుపదునిబట్టి తెచ్చితివి; దోర్బలశక్తిని మత్స్యయంత్రమున్
గోపురున నేసినావు; శిఖికోరఁగ ఖాండవమేర్చినావు; భూ
మిపతుల నోర్చి ధర్మజుని మేటిగఁజేసితి; దైత్యకోటి ను
గ్రపు రణమందు గెల్చితి; పురందరు గద్దియనెక్కినావు; తీ
వ్రపుఁ దపమాచరించి సురవంద్యు భృగుంగనినావు ఫల్గునా !!

ఉ. కౌరవసైన్యసంహతులఁ గాంచి భయంబునఁ దేరుడిగ్గి వే
పాఱెడు నుత్తరుండవలఁ బార్థునిగా నినుఁదానెఱింగి పోం
గారుమనంబుతోడ రణమందునఁ జోదకవృత్తి సల్పె నీ
పేరున నేమియున్నదొకో? భీకుని ధీరుని జేయు ఫల్గునా !!

చ. వ్రతముల నేమిసల్పె కొ పాండునృపోత్తముపత్ని నిన్నుఁ దా
సుతునిగఁ గాంచ, నీకరము సొంపుగబట్టి సుఖింపనెట్టి తీ
వ్రతపమొనర్చెనో గద సుభద్ర! నిలింపులుమెచ్చునట్టి నీ
యతులితరూప మొక్కతృటియైనను జూపఁగరాదొ ఫల్గునా!!

# దాస్యవిముక్తి *

ముద్దా-విశ్వనాథముగారు, (కవితాసమితి.)

ఒక దివ్యాతప శోభావంతమగు దినమున 'స్విట్జర్లండు' లోని 'ఆల్ట్ డార్ఫ్ మార్కెటు సైక్వేరు'ను దాఁటి సుందర విగ్రహుఁ డొకఁడు పోవుచుండెను. అతఁడు మంచి ఆజానుబాహుఁడు; పొడుగునకుఁ దగిన చక్కని స్థౌల్యముగలవాఁడు; అందమగు గడ్డమును ఉదయభాస్కరునిఁబోలు ఎఱ్ఱని ముఖమునుగల దర్శనీయుఁడు. ఉచ్ఛ్రిష్టుఁడై సహజ భీకరస్వరూపముతో సిరులు చిమ్ము చూపులతోఁ, జిఱునవ్వులతో ఆ కొండదొరమిత్రులఁ బలుకరించుచు పెదపెద్ద అంగలు వేయుచు నడచుచుండెను

ఆతనిఁ జూచిన ఎల్లరును "అదిగో! బర్లెన్ ధానుష్కచక్రవర్తి పోవుచున్నాఁ" డందురు.

స్విట్జర్లండులో ఈతఁడు మేటి విలుకాఁడని ప్రసిద్ధి. 'మూరీ' సరస్సులో తుపాను పట్టినపుడు ఈతఁ డొక్కఁడే కడు సాహసముతో పడవ నడుపఁగలిగెను. భార్యాబిడ్డలను పోషించుకొనుచు కొండలలో నొక కుటీరము వేసికొని వసించుచుండెను.

అద్రులపై లేళ్లను వేటాఁడుటయు సరస్సులో చేఁపలు పట్టుటయు అతనికి నిత్యకృత్యములు. ఇల్లు పొంకముగను పరిశుభ్రముగను నుండును. కుటుంబమునకు కూడుగుడ్డల కినుమంతయు లోపములేదు. ఇంతశాంతియుతముగను తృప్తిగను కాలక్షేపము చేయుచున్న కుటుంబము ఆ చుట్టుపట్ల నిదియొక్కటియే యని చెప్పవచ్చును.

మన కథానాయకుఁడగు ఈవిల్యంటెల్ ఆల్ట్ డార్ఫునకు తెచ్చిన జింకచర్మముల కట్టయంతయు అమ్మివైచి, బిడ్డలకు ఉన్నిదుస్తులు కొనుసంకల్పముతో నిపుడు పోవుచున్నాఁడు, చేతిలో పుష్కలముగ సొమ్మంటచే ఉల్లాసచిత్తుఁడై యుండెను. అడ్డంకు లేమియు రానిచో ఇంచుమించుగ నింకొక్క గంటలో పాటలు పాడుకొనుచు సానందముగ తన శైల కుటీరము చేరియుండును.

హఠాత్తుగా వెనుకనుండి వచ్చి ఒక ఆస్ట్రియను సిపాయి ఈతని భుజము గట్టిగ పట్టుకొనెను. మఱొక్క నిమిషములో పలువురు సిపాయిలు వచ్చి అతనిని చుట్టుకొనిరి. ఱెక్కపట్టుకొనిన యోధుఁడు——(చివరను కిరీటముగల ఒక స్తంభముఁజూపి,)——

"ఆకిరీటమునకు వందనము సేయకుండఁ బోవుచో చావు మూఁడునను సంగతి ఎఱుఁగవా?"

* విజ్ఞానతరంగిణి, నుండి.

'సైక్-వ్' రంతయును నిశ్శబ్దమయ్యెను. దుకాణదారులు వ్యాపారము కట్టిపెట్టి ఇచ్చట మూఁగిరి. ఏల ? వర్తకమునకంటెను ఎక్కువయగు—ఒక మానవుని స్వేచ్ఛ, దేశ స్వాతంత్ర్యము--ఇపుడపాయస్థితిలో నున్నది గనుక !

విల్యంటెల్ ముఖము ఎఱ్ఱపాఱినది. తీక్ష్ణమగు తన దృష్టిని స్తంభముపై నున్న కిరీటమునుండి సిపాయి ముఖముపైకి మరల్చి, మెల్లగా ననెను.

"నేనేమియు నక్రమము మొనరింపలేదే ?

సిపాయి:—ప్రభుత్వపు ఘనతను తిరస్కరించితివి.

టెల్:—(తేరిపాఱి చూచుచు)

వట్టి కోటునకుగాని ఇజారునకుఁగాని లేని పూజ ఈ టోపీకేల చేయవలెను ?

ఇంతలో వెనుకనుండి కొందఱు యోధులతో క్రూరుఁడగు అధిపతి—జెస్లర్—వచ్చెను.

ఒకప్పుడు స్వతంత్రరాజ్యముగ నుండి 'ఢ్యూకాఫాస్ట్రియా'చే జయింపఁబడిన స్విస్ దేశపు స్వేచ్ఛ నణఁగఁద్రొక్కిన మహానుభావుఁడీ 'జెస్ల'రే. ఆయన కెదురు చెప్పిన వారినెల్ల చంపించెను. ఆ స్తంభమునకు మ్రొక్కని వారెల్లరును యమపురి కతిథులుగ బంపఁ బడుదురు—అనునది కడకు జారీ చేయించిన కఠిన శాసనము.

విల్యంటెల్ గవర్నరువంకకు తిరిగినాడు. ఈతఁ డెవ్వరికిని భయపడఁడు. అతని సహజ గర్వము నెవఁడును అణఁపఁ జాలఁడు. తన దేశమునకు హానిసతనమువలనఁ గలిగిన సిగ్గుపాటునుగుఱించి పెక్కుసారులు కొండ మీఁద చింతించి మిత్రులతో అస్వాతంత్ర్య శృంఖలా విమోచనోపాయములఁగూర్చి ఇదివఱకే ఆలోచనలు సలిపెను. క్రూర ప్రభుత్వసూచకమగు అసహ్యపు చిహ్నము నెన్నఁడును తాను పూజించుట కిచ్చగింపఁడు.

సిపాయిలు వందనములు సల్పుచుండఁగా టెల్ దగ్గఱకు వచ్చి గవర్నరు:—

"ప్రభువువారి చిహ్నమును గేలిచేసెదవా ?" అనునంతలో గుంపులోనుండి "నాయనా ! నాయనా !!" అను కేకలు వినఁబడెను.

ఇంటియొద్ద చెప్పకుండ సంతకు వచ్చిన విల్యంటెల్ ముద్దుకుమారుఁడు తండ్రి దగ్గఱకు పరువెత్తఁ బోవుచున్నాఁడు. ఇదిచూచి ప్రజ నివ్వెఱపడిరి.

గవర్నరు:—ఆ కుఱ్ఱని పట్టుకొని ఆపి అలక్ష్య భావముతో—

"వీఁడేనా ధైర్యవంతుఁడగు రాజద్రోహిగారి పుత్రరత్నము ?

టెల్:—ఏమియు చేయవలదు; వాఁడు నా జ్యేష్ఠ పుత్రుఁడు !

గవర్నరు:—నేనేమియు చేయను. ఏదయిన హాని కలుగుచో నీవలననే కాని నావలన

కలుగదు. (సిపాయీతో) ఈ పిల్లవానిని ఆ చెట్టునకు కట్టి నెత్తిమీఁద ఒక రేఁగుపండుం చుము.

టెల్:—ఎందుకొఱకు ?

గవర్నరు:—నీవు బర్గెన్ ధనుర్విద్యా పారంగత బిరుదాంకితుఁడవఁట కాబా! నీ ప్రావీణ్య మేదో నా కగపఱుపుము. నిజ ముగా నీవు ప్రాణములు గోల్పోవలసిన దే; కాని ఇపు డుల్లాస హృదయుఁడనై యుంటచే దయచూపి నీకా యపాయము తప్పించు సంకల్పముతో నొక యవకాశ మొసఁగఁ దలచితిని. రమ్ము, నామాట విను. నీ పెద్ద కొడుకుతలపై నున్న రేఁగుపండు రెండు చెక్కలగునట్లు ఇటనుండి నీ వింటి బాణ ముతో కొట్టవలెను. విజయము పొందితివా నిన్ను వదలెదను. కొట్టలేకపోయినను బిడ్డ కేమాత్రమయిన గాయము తగిలినను నిన్ని క్కడనే ఇప్పుడే ఉరిదీయించెదను.

టెల్:— (కోపముచే కంపితుఁడై) కని కరము లేదా ? ముద్దుబిడ్డను చంపుకొని ప్రాణములు కాపాడుకొందుననుకొంటివా ?

గవర్నరు:—గొప్ప ఉపకారము చేయు చున్నాను, ఆలోచించుకో. అదృష్టముచే దెబ్బ నూటిగ కొట్టితివేని ప్రాణము దక్కిం చుకొని ఇల్లు చేరఁగలవు.

టెల్:—(వణకుచు చేయిచాఁపి).

కణతలకు సరిగా ఒక్క అంగుళము పైకి ఊఁచ సంధింపవలసి యున్నది. కుమా రునిమీఁద ప్రేమగల ఎవ్వఁడైన గుండె దిటవు చేసికొని కొట్టఁగలడా ? ఆబిడ్డనివైపు చూడు ప్రభూ! వానివైపు చూడుము! నీకు వాఁడు చుట్టముకాఁడు, కనుక ఎట్టెట్టి చిత్రపదవిన్యాసములతో వాఁడు నా హృద యమందు తాండవమాడుచున్నాఁడో నీ కెట్లు తెలియఁగలదు ? ఆహా! ఆ నిరపరా ధుని- ఆ యమాయికపు చూడ్కులవానిని- ఆ చక్కని ముఖబింబము వానిని- ఆ సుకు మారప్రాణిని నేఁగోల్పోవలసినదేనా ?

జెస్లరు:—(పరిహాసపూర్వకముగ నవ్వుచు) "కొట్టినను సరే, చచ్చినను సరే."

టెల్:—చచ్చెదను !

జెస్లరు:—నీ కనులముందు నీ కుమారుని పీఁక పిసికించిన తరువాత నే ఆ పని.

ఉదారుఁడగు కొండదొర ఉద్రేకపూరి తుఁడై —

"విల్లు తెండు. కాని ఒక్క ప్రార్థన; కుఱ్ఱ వాని మోము నా కగపడకుండునటులు అటు ప్రక్కను త్రిప్పవలెను. నేను చూడఁజా లను." అనెను

తండ్రి బిడ్డల నడుమ నొకదారి యేర్పడి నది. ఇరువైపుల ప్రజ క్రిక్కిరిసి యుండినది. పిల్లవాని ముఖము చెట్టుదెస ద్రిప్పి, వానిని త్రాళ్లతో బిగియఁగట్టి, బరువైన రేఁగు పండు తలపై నుంచిరి.

మార్కెటు సైకట్వరంతయు ఆకురాలిన కూడ వినఁబడునంత నిశ్శబ్దముగ నుండెను. టెల్ బాణద్వయము చేకొని నాఁడు; అందొకటి యంబుల పొదిలో నుంచినాఁడు, రెండవది వింట సంధించినాఁడు, ఒక్క నిమిష మాఁగి, అక్షులుమూసి యాఁదల వంచి ఆపద్బాంధవుఁడును దీనదయాళువును అగు ఆ భగవంతు సంతశ్శుద్ధితో ప్రార్థించుకొని నాడు. పిదప శిరము పైకెత్తి దృష్టి నిలుకడగ నుంచినాఁడు. ముఖమున రౌద్రరస మొలుకుచు గుఱిపెట్టినాఁడు, కొట్టినాఁడు! 'ట్వాంగ్ !!'

దెబ్బతో రేఁగుపండును సమమైన రెండు చెక్కలుచేసి యిరువైపులఁ బడవేసి ఊఁచ చెట్టును దూసికొనిపోయెను.

ఈ యద్భుత దృశ్యమునఁ గలిగిన సంతోషముచే ప్రజలు కావించిన జయజయ ధ్వానములు మింట ప్రతిధ్వనించుచుండెను.

జెస్లర్:—(క్రౌర్యముతో):

ఓరీ ద్రోహీ! మంచిదెబ్బయే!! కాని రెండు ఊఁచ లెందుకు తీసితివో చెప్పు ?

టెల్:—(పొదిలోనున్న ఊఁచపై చేయివైచి) మొదటిదానివలన నా బిడ్డకు హానియే కలిగినచో రెండవ యూఁచ ఈపాటికి నీ గుండెనడుమ దూఱియుండెడిది!

జెస్లర్:—ఓహో! నా ప్రాణమునకే మోసము చేయఁ దలఁచితివేమి! సరే, యిచ్చినమాట తప్పను. నీకు ప్రాణదానము చేసెదను. కాని నీవు జీవితాంతమువఱకు నా కోటలోని చీకటి కొట్లలోనే వసింపవలెను; అటుయినచో నీ బాణమువలన నా కపాయ ముండదు.

అంతట భయంకరులగు సిపాయీలచే తిరిగి టెల్ బంధింపఁబడి లంగరు వేసి యుంచిన గవర్నరుగారి పడవ రేవునకుఁ గొంపోవఁబడెను.

పడవ 'మూరీ' సరస్సు దాఁటుచుండగా గొప్ప తుపాను వీచుటచే నెల్లరును భీతాత్ములై యుండిరి. ఆస్ట్రియనులకు అసువులపై ఆశ లంతరించినవి; పడవ నెటు నడుపుటకును అగమ్యగోచరముగ నుండెను.

ఉపద్రవ కరమగు నిట్టి స్థితిలో—ఆ ప్రాంతమం దుండు వారలలో పడవ నడుపుటయందు టెల్ మహా ప్రవీణుఁడను సంగతి జ్ఞప్తికి వచ్చి గవర్నరుతో వారు ప్రస్తావించిరి.

అతనిని బంధవిముక్తుఁ జేసి చుక్కాను చేతి కిండని జెస్లరాజ్ఞాపించెను. అట్లు చేయఁగా టెల్ పడవను అవ్వలి యొడ్డునకు మరలించెను. ఇపు డతఁడు జెస్లరునుగుఱించి కాని ఆస్ట్రియనులనుగుఱించి కాని ఎంతమాత్రము యోజించుటలేదు. స్వాతంత్ర్యము—తన స్వాతంత్ర్యము—తన దేశ స్వాతంత్ర్యమగు స్విడ్జర్లండు స్వాతంత్ర్యము—వీని గుఱించియే తలపోయుచుండెను.

పడవ నొక గుట్టదరికిఁ జేర్చి నిలిపి తా నీవలికి దుమికి ఆస్ట్రియనులను వారి కర్మము నకు వదలెను.

చులుకైన నడకఁ గలవాఁ డగుటచే గుట్టలు మెట్టలు సుకరముగ దాఁటి కొండలపైనుండి ఒక నాటుదారి పట్టెను. జెస్లరు ప్రాణముఁ దక్కించుకొనఁ గలిగినచో ఈ బాటమీఁదుగనే పోవలసి యున్నది. ఇచ్చట రోడ్డుప్రక్కను తుప్పలలో టెల్ దాఁగుకొని ఊఁచ సంధించి "ఎప్పు డీ క్రూరుని బంధమునుండి నా స్విడ్జర్లండును విముక్తము చేయఁగలుగుదునా?" యనుసంతత దృష్టితో సిద్ధముగ నుండెను.

అనుకొన్నట్టుగానే కొంచెముసేపటికి అడుగుల చప్పుడు వినవచ్చినది.

జెస్లర్ నడచుచు:—

"నేనే ప్రాణములతో ఆల్ట్‌డార్ఫ చేరఁ గలిగితినేని టెల్‌యొక్క కుటుంబమును దుంపనాశము చేసెదనని యిదే ప్రతిన చేయుచున్నాను. తల్లిని పిల్లలను అందఱను ఒక్క పెట్టున పరిమార్చెదను." అని యనెను.

టెల్—(తనలో): తిరిగి వెళ్లినఁగద నీవట్లు చేయుట! అది పట్టిమాట!

అనుచు సైనికపరివార సమేతుడగు జెస్లరుపై బాణను వదలినాఁడు. ఇంకేమున్నది! జెస్లరు తనప్రాణములు వదలి నేలఁగూలెను!

అంతట టెల్ స్విస్‌ప్రజలను రేపఁగా వారు ఆస్ట్రియాపైకి దండెత్తి విజయము నొందిరి. నాఁటినుండియు వారికి దాస్య శృంఖలలు విడువడినవి!

వారు టెల్‌ను ప్రభువుగా నేర్పఱుచు కొనఁగోరిరి కాని యతఁడందుల కంగీకరింప లేదు. వేయిరాజ్యముల పెట్టగు తన 'శైల కుటీరము' లోనే అత్యంత శాంతి సౌఖ్యము లతోఁ దన జీవితము గడపుకొనెను!



# వైరాగ్యదశకము

నిడుదవోలు - వేంకటరావుగారు, బి. ఏ

కం. తనువే నిత్యమ? జగమున, ధనమే శాశ్వతమ? విషయధర్మమె సుఖమా?
మనువే సత్యమ? దీనిం, గని జనములు భ్రాంతిఁ బొందఁ గానేల శివా!

కం. గాలింబెట్టిన దీపము, పోలిక జీవంబు నమ్మఁబోలునె? దీనిన్
దూలు నిది రేపో మాపో, ఏలా దీనికి నభీష్టమిచ్చుటలు శివా!

కం. తోలు కాఱు మెఱుఁగుదీగెలు, జలబుద్బుదములు తరంగ సంచలనంబుల్
నలినీ పత్రగతాంబువు, లిలఁగల జీవములు నమ్మ నెట్లగును శివా!

కం. ఱెక్కలు గట్టినగతిఁ దా, నొక్కెడనుండకయ పాఱుచుండును గాలం
బక్కట దీనిని దెలియక, పొక్కుదు రల జీవనములు పోవునెడ శివా!

కం. జలదములు మింటఁ బారిన, పలుతెఱఁగులఁ దోచునట్లు భవమాయా సం
చలితాత్ముఁడ నగు నాకీ, యిలయంతయుఁ దోచుచుండు నెల్లపుడు శివా!

కం. కలదానిఁ దెలియనేరరు; దెలియని దానిం గ్రహింపఁ దివురుదు; రదియుం
దెలిసిన సందేహింతురు; తెలిసిన వాఁడెవఁడు విమల ధీమహిమ శివా!

కం. ఎఱుఁగరు భువి ధనతత్త్వము, నెఱుఁగరు భువి జీవతత్త్వ మెఱుఁగరు దానం
బెఱయగు నీ ఘనతత్త్వము, నెఱిఁగిన వారలు మహాత్ములే శర్వ శివా!

కం. ధనమే జగతికి మూలం, బని సమకూర్చెదరు లోకమందలి మనుజుల్
ధనతత్త్వము వా రెఱుఁగరు, ధనమేమి యొనర్చు నీదు దయలేక శివా!

కం. మేలుం గీడుం దెలియని, బాలుని పోలికను నుంటి భవదీయ మహా
లీలారూపకదర్శన, కాలంబున సుంత దెలియఁ గానిమ్ము శివా!

కం. “నా”యను వర్ణమ్మెప్పుడు, మాయునో నెమ్మనమునందు మనుజున కపుడే
నీ యఖిలజగము నాయది, యీ యఖిలము నేనె యనుచు నెంచెదను శివా!





ఎ. వి. టి. అయ్యరుగారి అనుమతిని.

సముద్రతీరమందలి ఆలయము

[మహాబలిపురము]

# ముసలాంబ విమర్శ

## (దేవదత్తము)

"ముసలాంబ" తలపేరుతో "గృహలక్ష్మి" మార్చి సంచికాముఖమున గీత మొక్కఁడు కనఁబడినది. ఈగీత కర్తపేరు "విద్వాన్ పి. సుబ్రహ్మణ్యముగారు" అనియుఁ గనఁబడెను. "ముసలమ్మ" అనిన కమ్మని తెలుఁగు పలుకు పనికిరాక లకారమును లాగి బిందుపూర్వక బకారముం దగులవేసి "ముసలాంబ" అని అచ్చమగు తెలుఁగుపేరునకు సంస్కృతపు బచ్చెన పులుముట, బాగుగాఁ గనఁబడుచున్న కండ్లనొకదానిని లాగించి గాజుకన్ను బొదిగించుకొనినట్లున్నది. భరతవర్షమునందలి సమస్త ప్రాంతముల వారును, ఏ భాషావలంబులైనను 'అమ్మ' అని, 'మా'అని వాడుదురు. మానవసామాన్యమునకు శైశవాదిఁ బరిపాటియైన 'అమ్మ'ను వదలి పశుసామాన్యమునకగు 'అంబ' శబ్దము ఏల అతికింపఁబడెనో! తెలుఁగమ్మకత; తెలుఁగునకైత; వ్రాసినది తెగుఁగువ్యక్తి; అచ్చుపోసినది తెలుఁగుపత్రిక; 'అంబా' అనుటలో నేమివిశేషమో!. ఇది పల్లవి. ఇఁక పాటలోఁ జూతము.

విద్వాన్ అనిన ఉభయభాషాప్రవీణుఁడే కదా! "సర్వకలాపరిషత్తు" సన్నదు పొందినవారు గదా! పల్లవిలో లేకున్నను పాటలో నెట్లు రక్తి కట్టించిరో యని విశేషాంశము లేవేని తెలిసికొనవచ్చునని కుతూహలమునఁ జదువ మొదలిడితిని.

నాలవగీటు దగ్గఱకు రాఁగానే "సాధుశీలురును విమల చిత్తులుఁ గల" అన్నచో భ్రష్టయతి యగపడెను. మొత్తము 124 గీతలలో దాదాపు 18 భ్రష్టయతులు గలవు. శబ్దౌచితికి పాటింపులేదు సరికదా. వర్ణక్రమ దోషములును గొట్టినవి. వ్యాకరణము మార్గము పెట్టినది సరేకదా! గురు లఘుప్రజ్ఞయేని లేక పదటఁగలిపిన పదములు పెక్కులు. ఛందోలక్షణము పట్టకున్నను, వ్యాకరణము గిట్టకున్నను, నడకయు,-అనఁ గూడదుకాని అచ్చము అడ్డగాడిదనడకలోఁ బందెము వేసినది. చిత్తగింఁపుడు! ఒక్కొక్కభాగమునొకటి రెండు ఉదాహరణముల నెత్తి చూపుచు, చివరను విలేవారిగ పట్టీనొకదానిని పెద్దలసన్నిధిలో దాఖలు చేసికొందును. మఱియు వ్యావహారికభాషలో వ్రాసినను సరే. వ్యాకరణము నుల్లంఘించినను సరే. ఛందస్సు నవలంబింపకున్నను సరే. ఎంకిపాటల ఏలపాటల వరుసలో వ్రాసినను సరే- కావ్యానికి సహజమైన గతి సారళ్యము చూపినఁ జాలును. విషయానికి ఉత్తేజనము కలిగించు నావేశముండినఁ జాలును. కవిత్వానికి జీవాతువైన రసవీచి ఒక్కటి ఆవర్తించినఁ జాలును. బళిబళీ యని సాధువాదము బలికేవాఁడను నేను కళాప్రవణత్వముగల కావ్యమును గ్రామ్యమున వ్రాయఁబడిన దనినకారణమున నీసడించువాఁడను గాను. భావప్రసన్నతగల రచనను, వ్యావహారిక భాషాసంపర్కమొదవినదన్నంతనే, ఉదాసీనముగఁ జూచువాఁడను గాను. పదపరిధపము నడుమ నేదియో పూడ్చిపెట్టి, ఏదియో యున్నదని తడవుకొని తనియుమన్నంతనే అడ్డముగాఁ దలత్రిప్పుదునే గాని మోమోడి బొమలెగరవేయువాఁడనుగాను. ప్రకృతమును గూర్చి విమర్శింపదొరఁకొన్న నామతము నొకింత పతితృసోదరుల కెఱిఁగింపవలయుట ఇట్లు నాసింగినాదము వెల్లడించుకొంటిని. ఇఁకఁజిత్తగింపుఁడు.

"పరమపతివతల్, సొగసొప్పువారు, గ్రామ" (౧ వ భాగమున ౬ వ పఙ్క్తి). పతివ్రతల్ అన్నచోట 'తి'కి గురుత్వమబ్బినఁగాని శబ్దమొప్పికొనదు. తేల్చిపలికినఁగాని గీతి (గణము) ఒప్పికొనదు. పెద్దలెల్లరు పతివ్రతయందు గురుత్వముపాటించిరి. ఈ

విద్వాన్‌గారొక్కరే లాఘవపఱిచిరి.! పదస్థగురువును లాఘవముగఁ దేలబలుకవచ్చునని ఈయనయెక్కడ నేర్చెనో ! "గ్రామపెద్దరెడ్డి" (౧ వ భాగము ౬-౭ పఙ్క్తులు) అన్నది. తిక్కనతాతగారి 'ప్రాణగొడ్డము'ను, శ్రీనాథుతాతగారి 'దినవెచ్చము'ను దలంచియు, 'కులపెద్ద' 'గ్రామపెద్ద' అను వ్యావహారికము దలచియు, సాధువుననే యంగీకరించి విద్వాన్‌గారి శబ్దప్రయోగస్వాతంత్ర్యమునకు మెచ్చుకొందము. పోనీ! "బహుగుణంబుల నలరారు పసిఁడికడ్డి" (౧ వ భాగమున ౮ వ పఙ్క్తి) అనుట అనర్థము. పసిఁడికడ్డికి వన్నె-వాసులు రెండేగుణములు- బహుగుణములేవి? కంటికిఁదక్క తక్కటియింద్రియములలోనే యొక్కదానికి నది ప్రియపడదే! బహుగుణము లెట్లుసాధ్యము! పైగా,అగ్గి పెట్టినఁగాని కరఁగదు. సుత్తెపెట్టినఁగాని సాగదు."పరమప్రేమంపు బుడ్డి యాబసవరెడ్డి" (౧ వ భాగమున ౯ వ పఙ్క్తి). 'పరమప్రేమంపు' అన్నచో 'మ'కు గురుత్వమువలయునని వ్యాకరణము. గురుత్వమిచ్చిన కుంటువడునా! యని ఛందోలక్షణము. రెండును ఎడపెడమొగములు త్రిప్పినవి. విద్వాన్‌గారు ఈరెంటికిని వివాదము పెట్టినారు. తీర్చేవారెవరు ? చూడుఁడు ! చూడుఁడు ! మున్నెక్కడను దెలుపక తొట్టతొలుత 'ఆబసివిరెడ్డి' అనిరే, ఆప్రసిద్ధి యెట్లువచ్చినది ? ఇట్లే (౨ వ భాగము౫ వ పఙ్క్తి) "చెంత........ యాచెలు వింతలోనె" అని మఱియొకచో. "అత్తమామలభక్తిచే నలరుబోటి" (౧ వ భాగము ౧౮ వ పఙ్క్తి) అర్థమేమి ? అత్తమామలు తనయెడఁ జూపు భక్తిచేననియా ? వారియెడఁ దనచూపు భక్తిచేననియా ? ఏమి వాక్యరచన బాబూ ! పోనీ ఇది చిత్తగింపుఁడు. "భర్తృరానందప్రాసాదవరకవాటి" (౧ వ భాగము ౧౫ వ పంక్తి). 'భ......రానందప్రాసాద' అన్నచో లక్ష్యానికి లక్షణానికీ లడాయి పుట్టినది. 'ఆనందప్రాసాద'లో 'ప్రా'కుఁబూర్వమున్న 'ద' గురువుకావలదా ? ఇక్కడను గురుత్వము ఉల్లంఘింపఁబడినది. లక్ష్య-లక్షణాదులగోల వదలినను, భావమునఁ బెనఁగులాట పుట్టినది. 'భ......వరకవాటి' అన్నారు. అనఁగా భర్తఆనందమునకు దిట్టమయిన తలుపు అనిఅర్థము కాదా ? వేఱు అర్థమేదేని కలదా? ఉండిన వినఁగోరుదుము. భర్తఆనందమునకు ద్వారమనిన ఒకవిధముగా సమంజస మనిపించుకొనునేమో కాని కవాటమనఁగానే భర్తఆనందానికి ఆటంకమగునే కదా ? ఈదిక్కుమాలిన సమాసమేల ? ఈయనర్థవాక్యరచనాసంక్షోభమేల ? ' వేడ్కమునసలమ్మపేరున నెలయునబల " (౧ భా: ౧౭ పఙ్క్తి) అన్నచో ' వేడ్క' 'అబల' రెండును పాదమున భర్తీచేయుటకు కూర్చిన పదములేసుఁడీ ! ఔచితికి దూరమయిన కూర్పులను, అర్థమెఱుఁగని పేర్పులను మొదలుగాఁ గొన్నిటి నిటఁ జూపుదును:—

"భీతినొందియు నేడ్చిరి పెక్కుగతుల" (౨ భా:౮వ పఙ్క్తి). భీతినొందియు నేడ్చిరని చింతపడుటయా! భీతి నొందక ఏడ్వరైరేయని చింతపడుటయా ? 'యు'యెందుకో? మఱి, "పెక్కుగతుల"నట!ఇదియు వింతయేనా ? ఏడ్చిరనినఁ జాలదా ? ఆవెంటనే "జలంబులుపొర్లె, నందరి నరుల ముఖకాంతి వాడసాగె" (౨ భా: ౭-వ ) నాలవబంతిలో "భీతినొందియు నేడ్చి"నపుడు కడమపడియుండిన ముఖకాంతి, ౭-౧వ పఙ్క్తులకు వచ్చునప్పటికి వాడసాగెనా ? భీతినొందినపుడే ముఖకాంతి తొలఁగి యుండవలయును గాదా? అది యట్లుండె - "అందరి నరులముఖకాంతి" అనిరె! అందఱిముఖకాంతి అనినఁ జాలదా? నరులని చెప్పనిచో ఆయందఱు మృగములుగ భావింపఁబడుదురేమో యని విద్వాన్‌గారికి శంకపుట్టెనేమో.

"........గండియొకటి కట్టలోఁ గానయ్యె" (భా ౨: ౧౯-౯ పఙ్క్తి) కట్టలోనా, కట్టయందా ? లోఅనుట అందుఅనుట భిన్నార్థములందు వాడఁదగినే

'లో'కు 'అందు'కుఁ గల అర్థభేదము నెఱిఁగియుండిన నిట్లు 'అందు' అనవలయునెడ 'లో' అని వాడసాహస మొదవి యుండదు.

ఈచిత్రమొకఁడు చిత్తగింపుఁడు! గంగాదేవి ఆజానపదులలో నొకనిపై నావేశించి, "......గంగాభవాని గాజాలగతులఁ బ్రజలు బూజింతురెపుడు న,న్నీ జలంబు తగ్గ ననుఁబూజసేయుఁడు" (౨-౧౬) అని పూర్వవాక్యమున షరతు కోరినది. అంతలో మనసు మాఱినది కాఁబోలు:—మాట ఫిరాయించి'నిండుచూలాలగుమగువ నిడుడినాకు. దండిగ బలియివ్వ సంతసము గాంతు. ఇదియె నాకోర్కె నెరవేర్పుడిపుడు" అనినదఁట! జలముపోటు తగ్గినపిమ్మట బలియీయవలెనో ? ముందిచ్చినఁగాని గంగపోటు తగ్గదా? ఈసమస్యాపరిష్కారమెట్లు? మఱి నిముసమున మాటఫిరాయించిన నాలుకకు ఎట్టిసంస్కారము వలయునో ఈసంస్కారము గంగకా కవికలమునకా! ఇఁక వాక్యరచనలో భావాలను తడవుదము. "గంగాభవానిగ......జనులు బూజింతు'రన్నదే అస్సలు ఆమెయెవరు? గంగాభవాని కాదా? మఱియేభవాని 'నన్ను' 'నను' అని తన్ను నొక్కినొక్కి రెట్టించుకొన్నదే అది స్వస్వరూపానుభూతికి లక్షణముకాఁబోలునే ! "నిండుచూలాలగు మగువ నిడుడి నాకు" అని, యంతలో ఉత్తరవాక్యము "దండిగా బలియివ్వ సంతసముఁ గాంతు" నన్నది గదా ! 'ఇడుఁడి' అనిననే చాలును. మరల దండిగా బలి యీయఁగోరుటేలనో ఇడుఁడికి బలియిచ్చుట అర్థవివరణమా ? అయినపని కానేమైనది. పదాలను నాలుగింటిని గుచ్చిపాదమునఁ జెక్కుటకా! బలియియ్య గోరెను. సరే! పైగా 'దండిగా' అనెనే చూలాలిమగువతోఁగూడ జూడవచ్చినవారి నందఱను బలియియ్యమనియా? ఏమో ! నాకర్థముకాదు. చూచితిరా నన్ను ననునంటి మెలఁకువగల రెట్టింపు "......ననుఁ బూజసేయుఁడు తడవులేక" అనుచు, "......నెరవేర్పుడిపుడ" అని తొందర ఒత్తిడికూడఁ జేసినది ! తడవులేక అనుటలో ఇపుడ అనునర్థము లేదా? ప్రకృతికలితమైన క్రొత్తవింత మఱొకటి చిత్తగింపుఁడు. "నిండుచూలాలగు మగువ నిడుఁడి" అనికోరిక. చూలాలగునది మగువయనియే మనమెఱుఁగుదుము. మగవాఁడు చూలు దాల్చుట యెఱుఁగము. చూలాలగు మగవాడున్నపుడే చూలాలగు మగువ అని వ్రాయవలసి యుండును. "చూలాలగుమగువ"ను బట్టి మగవాఁ డుండునని యూహింప ననువగుచున్నది. ఏమో ! ఈవిద్వాక్ వంటివారు పంచాంగములు పరిశీలించి సెలవిచ్చిన దానినిఁ గాదనఁజాలక "చిత్రమ్ చిత్రమ్ బతబత మహచ్చిత్ర మేతద్విచిత్ర" మ్మని యిది యింతటఁజాలింతును.

"వడిగ వాపోవసాగిరి వారిలోన (౨: ౩౫ ) అనిన చోట తమలోన అనికదా యుండవలయును. సరిసరి. పాదము మొదలి, వడిగ'కు వడికుదురక 'వారిలోన' నుండి జవురుకొనఁ బడెనో చాల వడివడి నట్లే కనఁబడినది. "పెద్దకా......వేడ్కగంగ" (౨: ౩౦ ) అనివాక్యము. ఏడ్వవలయు నిచ్చో వేడ్కకవకాశమెక్కడ ? గంగకు వేడ్కయు, గ్రామీణులకు ఏడ్పు అని భావమా? "జారెడు యశ్రుధారలతోడ, జాల పెడ మొగములతోడ......" (౨:౩౩) రెండు'తోడ'లను దూరముగనుంతము. "చాలపెడమొగములు" పెట్టుటెట్లో ఊరక పెడమొగముచాలదా? సరిసరి! వడికోసము పడినవడికాఁబోలు మఱొకటి "......వెనుకకునేగ సమకట్టి! వడిగవాపోవసాగి" రఁట! అంతకు ముందెడ్చిన యేడ్పంతయు నేమయ్యె ! పాటాఖర్చు క్రింద కొట్టబడెనా ? "నాకళవళంబును వినుచు, నతివయొకతె" వినుచు అనిన, తెంపుగానని యసమాపకమే! 'విని' అనినఁ జాలునే చూడుఁడి చూడుఁడి "కళవళమెంతో" (౨-౧౦ ) అని ఒక్కెడను, నాకళవళంబును అనియొకచోటను వాడఁబడెను.

'కళవళ' కళయా? ద్రుతప్రకృతికమా? "మాసములు చూలు దాల్చెదమ్మ" (౩-౧౦) అనుట, భావిని గూర్చి చెప్పినజోస్యమా? అపుడు ఆమె చూలాలు గాదా? ఇఁక "......దతిశీలవతియు" అని మొదలు పెట్టి "జనుల...యామాననీయ" (౧: ౧౨-౫౬) అని యైదుపద్యములు ముసలమ్మవర్ణన. ఇక్కడ "శీలవతి, ధైర్యగుణమున మేటి, సౌందర్యపేటి అత్తమామలభక్తి భర్తృరానంద......పరకవాటి, అన్నదానవశీకృత వారువధూటి" ఇన్నివిధములుగా ఒప్పినదని చెప్పి, ఆబ లీలక, "చాలసౌందర్యరాశివి బేల వన్నె సుగుణముల కాటపట్టవు......యత్తమామల మొగుని బూజింతువమ్మ" (౩: ౬-౯) అని గ్రామ్యులచేఁ జెప్పించియుఁ దనివియాఱక, "......నాబాల, సుగుణమాల, వినుతశీల, సుందరఫాల, వినయలోల, సకలసద్గుణ నికురంబ, సన్నుతాంబ, రూపజితయంబ, ముసలాంబ......" (౩: ౧౪-౧౬) అని లంకించుకొని తోమినారు.

"ఈవిధంబున ముసలాంబ......" (౪: ౧) అవ్యక్తిని తెలిపియు, "......పాలఁతిభర్త" (౪: ౩ని అనియు, "లలనమది" (౪: ౫) అనియు, "......మగవ" (౪: ౧౧) అనియు, స్థానప్రజ్ఞలేక సర్వనామములు చౌకగా దిగుమతిచేసినారు. "......భర్తనెంతో భక్తిఁబూజించి, యంచితమతి నడుగుల కొరగి, యాతనిపదముల, లలనమదిలోనఁ దలఁచుచు......" ౪: ౪ - ౭) అని భర్తను పూజించి అతని యడుగుల కొరగి ఎఱిగి కాఁబోలు! యాతని పదముల మదిలోనఁ దలచుచు - ఎంతగొడవ! ఒక్కమాటలోఁ జెప్పఁదగినదే ఇంత పెంపేల మగని యడుగుల కొరగుటయు అతని పదముల మదిలోనఁ దలచుటయునా? ఇదంతయుఁ గవితాకళగా గణనయేనా? ఇంకను చూడుఁడు "......నిష్టదైవమును మదిలో నిల్పి......" (౪: ౬) "తనమనంబు నీశునిపై స్థిరతనిల్పి" (౪: ౧౨) అనివ్రాఁత. మగని దలఁపునను, ఇష్టదైవము నిలుపునను బరపెక్కినమనస్సును మూటఁగట్టి మోయమని ఈశునితలమీఁద దృఢముగా నిలిపినదా? ఈశుఁడెవఁడు? ఇష్టదైవమెవఁడు? పేర్కొననైన లేదే!

ఇఁకనొకటి:—"ఒడినిగట్టిన యొడిఁబ్రాలుతోడ" (౪: ౧౧) ఒడిబ్రాలుగట్టి అనిననే చాలును. తలమీద బోయునవి తలబ్రాలు సమంత్రకముగ వేయునవి సేసబ్రాలు. ఒడిని గట్టినవి యొడిబ్రాలు. ఒడిని ఒడిబ్రాలుగట్టక తలబ్రాలు గట్టుదురా!

—•••—

ఇంక పట్టీచిత్తగింపుఁడు:

—•••—

౧ భ్రష్టయతులు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | భాగము | 4 | పఙ్క్తి, | "స్సాధు......చిత్తు" |
| 2 | ,, | 2 | ,, | "లుగురి......మెక్కు" |
| 2 | ,, | 3 | ,, | "చెలువు......బ్రాజె" |
| 2 | ,, | 8 | ,, | "వ్రాడగా ....గండి" |
| 2 | ,, | 29 | ,, | "ప్రజలు......నీజలంబు" |
| 2 | , | 26 | ,, | "నిండు......ఇరుఁడి" |
| 3 | ,, | 9 | ,, | "మ్మామల .....ప్రమ్మ" |
| 3 | ,, | 11 | ,, | "తెంపు......బాప్రు" |
| 3 | ,, | 12 | ,, | "లపుమ......ల్లోకు" |
| 2 | ,, | 17 | ,, | "ర్పూప......యపుడు" |
| 3 | ,, | 22 | ,, | "మానవు......జనెడు" |
| 3 | ,, | 3 | ,, | "క్రా......త్రుకగ" |
| 4 | ,, | 4 | ,, | "ఎంతో......చితమ" |
| 4 | ,, | 6 | ,, | "ల్లోన......క్రొనియ" |
| 4 | ,, | 7 | ,, | "దైవ......ప్పివరు" |
| 4 | ,, | 11 | ,, | "ఒడిని......తోడ" |
| 4 | ,, | 12 | ,, | "తనమ......స్థిరత" |
| 5 | ,, | 11 | ,, | "మ్ములెల్వల......స్తువవి" |

౨ కష్టగతులు

1 : 15 "భర్తృరాజనంద్రపాసాదవరకవాటి"
2 : 2 "లుగురియంగసాగె జలమెక్కుపగుచు"
2 : 7 "లంబుపార్లె నందరి సరుల ముఖకాంతి
2 : 22 "దానసర్వప్రాణులకుఁ తీర్థంబునావ"
2 : 5 "గులకొరగి యాతనిపరము లలనమది"
5 : 18 "యాత్మకీర్తిశాంతి యవ్యాజప్రేమ"
6 : 9 "సస్యసంపూర్ణయగు గతసకలప్రజయు"
4 : 2 "కిలనయత్తపూమలకు మరిలగు బాంధ"
6 : 20 "నేనలుగ నిట్లయ్యెనిపుడు నేనెజనుల'

3 నష్టసంధులు

1 : 15 భర్తృరానంద......"
2 : 33 "జారెడుయాత్రు......"
3 : 5 "చేయు యతివలు"
3 : 17 "రూపజితయంబ"

౪ దుష్టసమాసములు

3 : 16 "సన్నుతాంబ"
4 : 10 "పసుపుకుంకుమఫాలాన"
6 : 9-10 "సస్య......సకలప్రజయు
గాంతురా......సంతతమును"

౫ వ్యాకరణ క్లిష్టములు

2 : 10 "కళవళగ్యెంతో"
2 : 13 "నెవ్వగా...వారైంతో"
2 : 27 "బలియిప్వ"
3 : 1 "ముందుష్టు"
3 : 9 "మొగ్గుని"
4 : 4 "ఎంత్తోభక్తి"
5 : 3 "యాకర్మతెగక"

౬ ఇతరములు

ఇవిగాక 'అపుడుఁఎపుడు'లు 'తోడ'లు, పనికిమాలిన 'వేడ్క'లు, 'భీతు'లు, 'వడిగ'లు, 'సాగె'లు, గంపల తో మోయఁగలయన్ని నింపాదిగఁ బొడగట్టెడిని.

సంపాదకులకు మనవి.

బహుశః "ముసలాంబ" గీతమును పైపేరును, కర్తృనామముఖ్యబిరుదమును మాత్రము చదివి, పూర్వ పరిచితమగు విషయమగుట, బాగుగనేయుఁడునని యూహించి, సంపాదకులు తమపత్రికయందుఁ జోటి చ్చియుందురు. ఇంకముందే వ్యాసములను ఏర్పఱు చుటలో మెలఁకువగ నుందురుగాతమని పైవిషయమును వ్రాసితిని. పత్రికలు లోకమునకు గురువులు. వానివర్తన మునకు లోకమునకు ఉదాహరణభూతముగ నుండ వలయును. మంచివస్తువుల నేరి పఠితలకీయవలయుఁ గాని యేదియో దొరకెఁగదాయని తొందరపడి పైయట్టి గీతమాలలను ఆదరించుటచే పఠితలకు నేర్పునది లేక పోవ, భాషయు భ్రష్టమగుట అటుండ రాష్ట్రేతరు లెవరేని చూచి తెలుఁగుపత్రికల బగిసి, తెలుఁగు వ్రాయసకాండ్రబగిసి యింతమాత్రమేనా అన వెక్కి రింతురే యను వగపు నన్నీవ్రాఁతకుఁ బురికొల్పినది కాని యీసునకుఁగాదని మనవి.



# కవ్వడి

డాక్టరు. చిలుకూరి- నారాయణరావు గారు, ఎమ్. ఏ. పి. హెచ్. డి. ఎల్. టి.

౧. కవ + వడి = కవ్వడి, అని చిన్నయసూరి తన బాలవ్యాకరణములో సంధి ప్రకరణములో ఉదహరించినాఁడు. దానిని చూచే కాబోలు సీతారామాచార్యులుగారు శబ్దరత్నాకరములో "కవ్వడి (కవ + వడి). రెండుచేతుల వడి గలవాఁడు" అని వ్రాసినారు. నాటి నుండి నేటివఱకున్ను పండితులా శబ్దము వ్యుత్పత్తి నట్లే చెప్పుచున్నారు. చిన్నయసూరికి పూర్వము వైయాకరణులుగాని, యితర పండితులుగాని దాని వ్యుత్పత్తి నెట్లు నిరూపించినారో నాకు తెలియదు.

౨. ఈవిషయమై నాకొక సందేహము. 'కవ' అంటే 'రెండు చేతులు' అని అర్థమవుతుందా ? అయితే, 'కవ'కు పర్యాయపదములైన 'జంట', 'జత' 'దోయి', మొదలయిన పదాలతో 'వడి'ని కలిపి 'జంటవడి' జత వడి' 'దోయివడి' అని 'కవ్వడి'కి పర్యాయ పదములుగా చెప్పవచ్చునా? లేదా, 'కవ'తో వాడి కలిపి 'కవ్వాడి' అనవచ్చునా ? ఇట్టి సమాసాలు వ్యవహారములోగాని వాఙ్మయములోగాని లేవు. కాబట్టి 'కవ్వడి' అనేది సమస్త పదము కాదేమో.

3. మఱియొక సందేహము. అర్జునునికి రెండుచేతుల కున్ను సమానమైన వడిఉన్నదని ఎక్కడైనా ఉన్నదా? 'సవ్యసాచి'అనిఅర్జునునికి పేరున్నదిగదా! అంటారేమో కాని 'సవ్యసాచి' అనేపదములో ఎడమచేతికి, ప్రాధాన్యమున్నదిగాని, రెండుచేతులకున్ను లేదు. అర్జునుఁడు ఉత్తరునితో తనకుగల పదిపేళ్ళ అర్థమును వివరిస్తూ.

(విరా. 145.) "భండనమున నిరుగేలను,
గాండీవము దివియ నేర్పు గలిగిన నందు
ద్దండమగు సవ్యకరము ప్ర
చండతఁ బరగుదును సవ్యసాచి యనంగన్"

అని చెప్పుకొన్నాడు. దీనివల్ల అర్జునుఁడు పుర్ర చేతివాఁడని తేలుతున్నది. గాని రెండుచేతులకు సమానమైన బలమున్నదని తేలలేదు. పుర్రచేతివారి దెబ్బ కుడిచేతివారి దెబ్బకంటె ఎక్కువ గట్టిగా తగులుతుంది. సాధారణముగా ఏదో ఒక చేతికి ఎక్కువ బల ముంటుంది. అభ్యాసముచేత రెండోచేతికి కూడా నైపుణ్యమును సంపాదింప వచ్చును. కాని, ఆనేర్పు సహజనైపుణ్యముగల చేతినేర్పుతో తులతూగలేదు. ఆరెండింటికిన్ని సమానత్వ ముండడ మసహజము. భారత కవులు అట్టి సమానత్వము నెక్కడా అర్జునుని చేతుల కారోపించలేదు. ఎట్లయినా 'కవ్వడి'పదము 'సవ్యసాచి' పదమునకు పర్యాయపదము కాదని చెప్పక తప్పదు.

ర. ఆంధ్రమహాభారతములో 'కవ్వడి' పదముగల యీక్రింది ప్రయోగములున్నవి:—

(ఆది. VI. 81.) కడఁగి ద్రుపదానుజుఁడు నె,
వ్వడిఁ గవ్వడినేసె నూరు వాడిశరములన్.

(భీష్మ. III. 211.) అనవుడు నవ్వి కవ్వడికిం
గమలనాభుం డిట్లనియె.

(ద్రోణ. IV. 168.) నీవు......కవ్వడి మొదలగు
నమ్మువ్వురకుం జాలి సింధురాజరక్షణంబు
నిర్వహింపుము.

(ద్రోణ. IV. 323 )ఇవ్విధమున సైంధవుతలఁ
గవ్వడి యట నడపు శక్తిఁ గనుగొని సేనల్
నివ్వెఱఁగందె ......

(ద్రోణ. V. 3.) ఇవ్విధమున సైంధవుఁడా,
కవ్వడిచేఁ బడినపిదపఁ గౌరవు లెల్లై.

(కర్ణ. II. 237.) అంతఁ దెప్పిఱి విలయాంతమే
 కైవడిఁ గవ్వడి యేచి మార్గణచయంబు పెల్ల
డరించిన.

(సౌప్తి. I. 73.) కవ్వడియున్ ముకుందుఁడును
 గావలిగా భయమేదియున్న వీఁ
 డెవ్వరికైన ముట్టుకొని
 యేపునఁ జేర్చి జయింపవచ్చునే.

(ఆశ్వ I. 4,) ఇవ్విధంబునం జను నా కవ్వడితోడ
యాజ్ఞవల్క్యశిష్యుండు విప్రజనసహితంబుగానరిగె.

(ఆశ్వ.IV.6.) కదిసిన వారితో మఱియుఁ
 గవ్వడి యిట్టులన్.

పై ప్రయోగములలో 'కవ్వడి' పదము ప్రాసముకోస
మున్ను యతికోసమున్ను వాడఁబడినది.

(విరా. V. 207.) (దుర్యోధనుఁడు) ఇట్లు గవిసి
 రథంబులం గడచి కవ్వడిం దలపడియె.

(భీష్మ. I. 108. ) గాండివం బింద్రచాపంబు,
 [కరణినొప్ప
 మెరసి దివ్యకిరీటంబు-మెఱుఁగు లడర
 జ్యానినాదంబు గర్జగా-మేని కృష్ణ
 కాంతిఁ బొలిచెఁ గవ్వడియను-కారుమొగులు.

(ద్రోణ. II. 339.) కృష్ణుండు... ..దర్భశయ్యం
 గావించి......ఆయుధంబు లర్చించి చుట్టు
నిడి కవ్వడి నందుండమని నియోగించి.

(ద్రోణ. III. 45.) ఇట్లు గనుపు కొట్టు కవ్వడికి
 నోహటింపక నీ సైనికులు పైపయింగ్రమ్మి.

(ద్రోణ. V. 428.) (వ్యాసుఁడు) కవ్వడి గనిన
 వాఁడు రుద్రుండగుటఁ దేటపఱచి.

(కర్ణ. III. 297.) (కర్ణుఁడు) కవ్వడి యెడలఁ
 గృష్ణు మేన మూఁడుమూఁ డడరించె-మెఱుఁగు
దూపులు.

(ఆశ్వ. IV. 97.) జరాసంధపౌత్రుండు
 బాల్యంబునం దన్ను నెదిరి నెఱుంగమిం గవ్వ
 డిం గయ్యంబునకుఁ బిలిచి.

(మానస. I. 162.) మార్చిల్లి పుడమిఁ బడియెఁ
 గవ్వడి.

పైప్రయోగములలో అర్జునునకుకవవడితనము ప్రధా
నము కాదు. కొన్నిటిలో విరుద్ధముకూడాను.

౫. ఈక్రింది ప్రయోగములో అర్జునుని రెండు
చేతుల వాడిమి వర్ణింపబడినది. (విరా. V. 45.)

" కవదొన లేలపూనునొకో
 కవ్వడినావల దుగ్రసంగరో
త్సవమున సవ్యపాణినప
 సవ్యకరంబున మార్చి మార్చి గాం
డివము ధరింపఁగా శరప
 టిష్ఠతయుం బొరిఁ జేయి మార్చి చూ
పువెరవుతోన వీడ్వడక
 పొందొడఁ గూడెడు నెప్డు నూచిరన్.

కాని, ఈ ఒక్క పద్యమువల్లనే రెండు చేతుల
సమానమైన వాడిచేత అర్జునునికి కవ్వడి అనే పేరు
వచ్చినదని నిర్ణయింప వీలులేదు.

౬. ఈ క్రింది పద్యమును చూడండి. అర్జునుఁడు
తీర్థయాత్రకు పోయినప్పుడు ద్వారకలో యతివేష
ముతో ఉండగా సుభద్ర అతనికి సేవ చేస్తున్నది. ఇత
డర్జునుఁడా అని ఆమెకు అనుమానము కలిగినది.

" అలినీలకుంతలుం డనియును హరి నీల
 సమవర్ణుఁ డనియు నాజానులంబి
తాయత స్థిరబాహుఁ డనియు నారక్తాంత
 నయన దళాకార నయనుఁడనియు
నుత్తుంగఘన విశాలోరస్కుఁ డనియును
 గవ్వడి యనియును గరమువేడ్క
విప్రచ్చు నెప్పుడు వినియెడునది దన

విన్నట్ల యతిఁజూచి వీడు విజయుఁ
డొక్కొ యనుచు సంశయోపేత చిత్తయై,
యుండి యుండనోప కొక్కనాఁడు
భోజనావసానమున నున్న యమ్మౌని
కిందువదన ప్రీతి నిట్టులనియె.''

ఇచ్చట సుభద్రకు కలిగిన అనుమానము తాను విన్న కన్న రూపము లొక్కటిగా ఉండడము వల్ల; అందుచేత అతని 'కవ్వడి' తనము ఆకార విశేషము గాని చేతుల నేర్పుకాదు. నేర్పుకు ఆకారముండదు గనుక 'కవ్వడి'తన మాకార విశేష మయితే అది యెట్టి ఆకారము?

౬. 'కవ్వడి' పదము తెనుగుసమాసము కాదనిన్ని, 'కపర్దిన్' శబ్దభవమనిన్ని నాఅభిప్రాయము. 'కపర్దిన్' శబ్దము ప్రాకృతములో 'కవ్వడి' అవుతుంది. కపర్దము కలవాడు కపర్ది. కపర్దమనగా కిరీటాకారముగా చుట్టుకొన్న జడ. అట్టి ఆకారముకల జడగలవాడు గనుక శివుఁడు కపర్దిఅయినాడు. అట్టి జడలు గలవారి నందరిని కపర్దులు, కవ్వడులు అని పిలువవచ్చును. అట్టి ఆకారము గలది గనుకనే పురుగు విడిచిన గుల్లకు 'గవ్వ' అని పేరు వచ్చినది. 'కాకి' అనేదికూడ 'గవ్వ'తోసంబంధించినదే. 'గవ్వ' కపర్దికాశబ్దభవము. అర్జునుడు తన జడను కపర్దముగా ధరించేవాడు గనుక అతనికి 'కవ్వడి' అనేపేరు వచ్చి ఉంటుంది. లేదా, కపర్దమనగా మకుటము, కిరీటము అనికూడా అర్థమున్నది. ఈఅర్థము నాకు సంస్కృత నిఘంటువులలో కనబడలేదు. ఋగ్వేదములో ప్రయోగ మున్నది.

"అయంసోమః కపర్దినే ఘృతం న పవతే మధు
ఆభక్షత్ కన్యాసు నః''

(ఋగ్వేదము VII. 67.11.)

దీనికి సాయనభాష్యములో "కపర్దినే=కల్యాణ మకుటవతే సోమాయ పూష్ణే వా తదర్థ మయం మాద యితో ఽభిష్టుతోఽస్మదీయ స్సోమః పవతేచ గచ్ఛతి, తం ప్రాప్నోతి'' అని ఉన్నది.

౭. కపర్ది, కవ్వడి, అంటే కిరీటము గలవాడు, కిరీటి, అని అర్థమయితే అర్జునునికి కిరీటి అనేపేరున్నది గనుక చిక్కేలేదు. కాని, సుభద్రను గురించిన పై పద్యములో 'కవ్వడి'కి కిరీటి అని అర్థము చెప్పవీలులేదు ఎందుచేత నంటే (1) అర్జునుడు యతివేషములో ఉన్నాడు. కిరీటము ధరించి ఉండలేదు. (2) ద్వారకలో యతివేషమున ఉన్నకాలానికి ఇంకా అతనికి ఇంద్రుడు కిరీటము నివ్వలేదు. ఇంద్రుడిచ్చిన కిరీటము వల్లనే అర్జునునికి కిరీటి అనే పేరు కలిగినది.

౮. కాబట్టి అర్జునునికి ఇప్పటి నాటకాలలో అర్జున పాత్రధారులు ధరించే గిరజాలు, జునపాలు కాక, "తెగబారెడు'' వెంట్రుకలుండేవనిన్నీ, వాటిని జడ చుట్టి కిరీటాకారముగా అర్జునుడు ధరించేవాడనిన్ని, కవ్వడి శబ్దమట్టి జటాజూటమును ధరించి ఉండడము వల్ల కలిగినదనిన్నీ నిర్ణయించవలసి ఉన్నది.



# వంధ్యావిలాపము

కపిస్థలం - శ్రీరంగాచార్యులుగారు,

(ప్రాయము జారిపోవుచున్న కాంత యేకాంతముగ భర్తతో విలపించుచున్నది.)

"అకటా! ఎంతటివంత నావలన! నాయందంబు గిందంబు మి
మ్మొకసక్కెంబుల పాలుసేయు; నది గాకింకేమి లాభంబు? మీ
యకలంకంబగు వంశమెల్ల చెడెనే! అన్యాయ మన్యాయ; మీ
సకలానర్థము గొడ్డురాల నగు నాసాంగత్యమందే కదా??

ఎంతటి ముద్దుబాలుఁ దొలి నే మనసారఁగఁ జంపినానొకో!
ఎంతటి యాసతోడ మును యెవ్వరి పెండిలి నాఁపియుంటినో!
ఎంతటి పాప మేఁ దొలుత నేరికి క్రొవ్వునఁ జేసినానొ! కా
కింతటి వంతతోడ నిటు లే నొక వంజెగ నేల పుట్టుదుర్??

అడుగులు మందగింప, నయనాంబుజముల్వికసింప సొంపుగా
నడుము విశాలమై తగ, స్తనంబులు నుబ్బఁగ, ఊర్పుగాడ్పులుర్
వడివడికాఁగ, మేన నొకవైభవ మొప్పఁగ తొంటిగర్భమున్
బడసిన కాంతపో అతులభాగ్యములం దులదూగుచుండెడున్.

పట్టపగఁటిదివికి భానుబింబంబెట్లొ, పంజెరమున కెట్లొ బాలశుకము
పడఁతి యెడఁదకామె ప్రాణప్రియుండెట్లొ, చేంటిబిడ్డకూడ నింటికట్లె.

పొలుపారఁ బాన్పుపై బోరగిలిపరుండి, నాలుగుమూలల నంటుచుండ
నిదురలోఁగలలోని నిద్దఁపురూపముల్, నవ్వింప చిరునవ్వు నవ్వుచుండ
ముద్దులు తొలకాడ మోకాలఁ గేలను, తడువుచు నోటికి తార్చుచుండ
ఆనందమునఁ దేలియాడుచుఁ దనుదాన, కూరిమి చప్పటల్ గొట్టుచుండ
నిలిపి, వ్రేలూత చూపఁగా నెంతియేని, ప్రీతిఁ దప్పటడుగులను బెట్టుచుండ
కాంచి, తనబిడ్డ ముద్దాడు కాంతకడుపు, చల్లఁగా, మెల్లఁగాఁ గన్నతల్లికడుపు.

తడుబడుకాళ్లతోడ తనుదానొడిపై నను గూరుచుండి, ఏ
బుడుతఁడో నవ్వియాడెడు నబోధపుమాటలె నాదు వీనులకు
దడిపెడు తేనెసోనల ; సదా యిటులాడుచు, నన్ను బిల్చు నా
కడుపునఁ బుట్టు బాలకుఁడు కర్ణములం దనిపించు టెన్నడో ! !

కుడిచను బాలు నాయనుఁగుఁగూనకు నిచ్చినయంత, ప్రేమతో
నెడమకుఁ ద్రిప్పులోపలనె యేడుచువాని యనుంగు నోటిలో
వడివడి చూచుకంబునిడ, వంతను వీడుచుఁ బాలుద్రావుచో
నెడనెడ నవ్వుచుండుటను నేఁగనులారఁగఁ గాంచుటెన్నఁడో ! !

ఉదయాన తలదువ్వి, సదయుతనాకూన, కే వేగ నన్నంబు నిడఁగ గలనో?
తోడిబాలురఁగూడి యాడుచు నాపాప, వేడుక బడికేగ చూడఁగలనో?
బడిలోననెల్లర వడివడినాబిడ్డ, నొప్పించెనని నేను చెప్పఁగలనో ?
పండుకొనెడువేళ పడకపై నాయన్న, హాయిగనిదురింపఁజేయఁగలనో ?
చేతులారఁగ నాతండ్రి బ్రీతితోడ, పెంచి, పెద్దగఁజేసి నేఁ గాంచఁగలనో?
మనకుమారుఁడు వంశాభిమాని యగుచు, పెరుగుచుండుట నేఁజూచి మురియఁగలనో??

ప్రాణేశా ! ఇటు పిచ్చిమాటలనఁగా రాదంచు వారింతురా ?
ఏనాఁడైనను నీకు నిట్టిశుభ మానే యంచు బోధింతురా?
ఆనాఁడేనును మీరు నాతనయు నేయందంబుగాఁ గాంతుమా ?
ఈనాకంతటి భాగ్యమే కలిగెనా !——ఇంకేటి కాకోరికల్ ? ? ”



# శారద

(సుదర్శనుడు,)

శారదంటే యేమో అనుకొన్నాను. నిజముగా దేవత అంటే నమ్మనలెను. "నీవెండ్లాన్ని నువ్వే పొగుడుకుంటావేమిరా!" అని నా స్నేహితులు చేసే వేళాకోళానికి అంతూ పొంతూ లేదు. అయినా దాని యోగ్యతను గౌరవించకపోతే నాకు వివేక మున్నట్టేనా ? ఇంతకు నాయదృష్టాన్ని గుఱించి నేను గర్వపడాలి. అయినా దాని మంచితన మేమిటో అని నోటితో గాకపోయినా మనస్సులోనైనా అడిగేవాళ్లు చాలమంది ఉంటారు. కొన్ని కారణాలు చెబుతున్నాను.

అది కాపరానికి వచ్చేటప్పటికి దానికి పదహారేండ్లవయస్సు, నాకు ఇరవై రెండేండ్లు. పూచిన తంగేడువలె దాని లావణ్యము మహాకావ్య వర్ణనల్ని జ్ఞాపకం తెచ్చేది. నే నెన్నిసార్లో పరిశీలించాను. నేను చాటుగా వుంటే కొంచెము కళాహీనమైన దాని మొగం నేను కనపడంగానే వికాసవంత మయ్యేది. ఆ గర్భశ్రీమంతుఁడను. తండ్రి లేఁడు. తల్లి యున్నది. కాని ఆమె శారదని మామూల త్తల్లాగా కోడంట్రము పెట్టేది కాదు.

మైలాపూరులో మాదో పెద్దబంగళా. అన్ని యింటిపనులు మాయమ్మ తన చేతి మీదుగా నౌకర్లతో జేరిపించేది. ఇహ నా రూములోని మేనేజిమెంటంతా శారద గారిది.

ఏవిషయమైనా మాట్లాడుదా మనుకుంటే ఏదీ కారణం దొఱకదు. ఏదైనా ప్రశ్న అడిగితే జవాబు చెప్పడానికి ఎక్కడ లేని సిగ్గూ పడుతుందిదానికి. దగ్గఱికి లాక్కొని బుజ్జగించి అడిగినాగాని ముసిముసి నవ్వులు నవ్వుతుందే గాని, దాన్నించి జవాబు తియ్యడంకష్టం.

అయినా, నాకో చేదస్తం పుట్టింది. "భార్యా రూపవతీ శత్రు" వని పెద్దలన్నారే ! ఇది రూపవతుల్లో లెక్కేగదా ? అనే అనుమానం పిశాచంలాగా నన్ను పట్టుకుంది. ఇది గాదు మార్గ మనుకొని దాన్ని రెండు మూఁడు పరీక్షలు చెయ్యా లనుకున్నాను.

మా బేబీఆస్టీనులో ప్రతిసాయంత్రము నేను నా రాణిగారు బీచి వెళ్లడం; పోలీసుబీటుజవానికి "నాయనా! నాబండిచూచుకో" నని చెప్పి సముద్రము నీళ్లకి దగ్గరగా వెళ్లి కూర్చునేవాళ్లం. ఆనాఁడు జేబులో రెండు ఆపిలుపండ్లేసుకుని వెళ్లేను. నేను నా ప్రక్కన అదీ యిసుకపై ఆసీనులమైనాము. నేనేమేమో మాటలు జెబుతూన్నాను. అదేమో మెల్లగా నవ్వుతూన్నది. నేనా యాపిలుకాయల్ని బయటికి తీసి. వాటిని కోయటానికి బీగాలకుచ్చులోని కత్తిని తీసి తెరిచాను. కొంచం పరాకుగా ఉన్న శారద

చప్పున హెచ్చరికపడి ఆ పండ్లను కొయ్యడానికి సంభ్రమముతో నాచేతులోని కత్తి మీద ఒక చేయివైచి యింకో చేత్తో పండ్లు తీసుకున్నది. ఆ కత్తి దాని చేతికిచ్చే టప్పట్లో కావలె నని చమత్కారముగా వ్రేలికి కత్తితో గాయము జేసుకున్నాను. దాన్నించి నాకేమంత నెప్పి కాలేదు. కాని రక్తం కొంచెం జాస్తిగానే ఉబికింది. కళ్ల వెంబడి కన్నీరు విడుస్తూ తనచేతిరుమాలుతో ఆ రక్తము నద్దివేసి బిగువుగా గాయమునకు కట్టు కట్టివేసింది శారద. దీన్నుంచి ఇదింతేడుస్తుందని తెలిసుంటే నేసింత పరీక్ష చేయకుండేవాణ్ణి. అయినా పరీక్షలన్నీ అప్పుడే అయినాయా? పరీక్షించే వాళ్లకి మనస్సులు కొంతవఱకు రాళ్లవలె కఠినంగా వుండాలి.

ఇసుకలోనుంచి బండిదగ్గరకొచ్చాం. ఇద్దఱము బండ్లో యెక్కి కూర్చున్నాం. అప్పుడు కావలెనని పెట్రోలాప్‌చేసి బండి నడపడానికి ప్రయత్నం నటించి "శారదా! బండి చెడిపోయింది. కొంచెందూరం తోస్తే గాని నడవదు. నువ్విందులో కూర్చో. నేను వెనుకనుండీ కొంతత్రోసి,యింజను పనిజేయగానే యెక్కుతాను" అన్నానుఅప్పుడు "మీకుచేయి గాయమైనది. తోస్తే నెప్పెత్తుతుంది. నేను తోస్తాను" అని అదికూడా దిగింది. అమృతంలాంటి దాని మాట లప్పుడు విన్నాను. బజారయిపోయింది గాని ఆ సంతోషానికి దాన్నప్పుడు వేయిసార్లు ముద్దాడి ఉందును. ఎటయితేనేమి, యిద్దఱము గలసి బండి తొయ్యడానికి మొదలెట్టాం. ఎన్నడయిన కష్టపడిందా? పాపం, మహా సుకుమారి. నేనేమో వేషానికి తోస్తూన్నాను. అదేమో బలమంతావేసి నెడుతూంది. ఒళ్లంతా చెమటలు పోసినవి. స్నానం జేసినట్లు కట్టిన సిల్కు చీరె తడిసి వ్రుంటి కతుక్కపోతూంది. ఇక పరీక్షించడం చాల్ననుకొని పెట్రోలు ఓపెన్ జేశాను. ఇంజను కదిలింది. ఇద్దఱమూ యిల్లు చేరుకున్నాము.

ఇంకో పరీక్ష వినండి. జాస్తి కఠినమైంది. తల్లిగారిదగ్గర సెలవుదీసుకుని దాంతోఁగూడా తిరుపతిప్రయాణం కట్టి, బొంబేయెక్స్‌ప్రెస్‌లో బయలుదేరాం. సెకండ్లాసులో ప్రయాణం చేస్తూన్నాం. అప్పుడో వుపాయం చేశాను. ఖర్చులకోసం నా మనీపర్సులో ఉంచిన వందరూపాయల నోటును దోవతికొంగున కట్టి నడుములో దోపినాను. అప్పుడది నిద్రలోఉంది. రేణిగుంట వస్తే యిద్దఱందిగి చిన్నరైల్లో యెక్కినాం. ఆ పెట్టెలో మేము తప్ప మరెవరూ లేరు. అప్పుడు నేను, నామనీపర్సు చూచుకున్నట్లు నటించి అందులో వందరూపాయలనోటు ఎక్కణ్ణో పోయిందని గాభరాపడి, "శారదా! వందరూపాయలనోటు పోయింది. పైకంకోసం అమ్మకు టెలిగ్రాఫ్ యియ్యవలె. అట్లాయిచ్చినాకూడా సేఫ్‌టీ

గాలు నాదగ్గరనే ఉన్నవి. ఎట్లో మరలి పోవలెను. స్టేషనురాగానే స్టేషన్ మాష్టరుకు ఈ కథంతాచెప్పి వాపసువెళ్లే ఏర్పాటు చేసుకొందాం" అన్నాను.

అనేసరికి "ఎట్లో బయలుదేర్న యాత్ర మానుకోడమెందుకు ?" అని తనమెడలోని ఒక చైనాగొలుసు తీసి నాచేతిలో వుంచి "దీన్ని అమ్మి వైకం వాడుకోండి" అన్నది. శారదా ! ఇదేమిటి ! ఈ గొలుసు నావస్తు వైనాకాదే. మీవాళ్లిచ్చింది ! నేను వాడొచ్చా?" అన్నాను. "నే నే మీ దానైనప్పుడు యివన్నీ కావూ ? ?" అన్నది. " "ఆడవాళ్లకు నగలు ఇవ్వడంగాక వాళ్లనుంచీ తీసుకోడమా ?" అని అన్నాను.

"నాకన్నినగలూ మీరే" అని ఒక చిరునవ్వు నవ్వింది.

అప్పుడు నాకు పట్టరానంత సంతోషం కలిగింది. అయినా పరీక్షకస్థానలో ఉన్నాను గనుక, దాన్ని పైకి కనుపర్చక చిరునవ్వు నవ్వుతూ మెల్లగా దాని బుగ్గమీద వక దెబ్బవేసి ఆ గొలుసును లోపలిజేబులో పెట్టడానికి తడువుకోడం నటించి రొండినిదోపివున్న నోటుతాకి సంతోషనటనతో "వందరూపాయలనోటు రొండిలోవుంది. నీ గొలుసుతో పనిలేదు. నోటు పోయిందనుకొన్నాను. వున్నది. అదృష్టం మంచిదే" అన్నాను. "అంతా స్వామివేంకటేశ్వర్లకృప" అని శారద అన్నది. నేను నాచేతుల్తోనే గొలుసును దాని మెళ్లో అలంకరించాను.

యాత్రనుంచి వచ్చేశాం. శారదని వకవీసమంతయినా రిమార్కు చేయటానికి వీలులేదు. అది యెంతఅందమయినదీన్నీ యోగ్యరాలూన్నూఅయినా"హలో! మైడియర్ - మైడియరెస్టు" ల్లాగ మే. క్యాండ్ల బాబతు నాకరూపొందిన లజ్జా దేవతలా వుంటుంది గనుకయం. ఏ. ప్యాసయి నవనాగరక పద్ధతి తెలిసిన నాకావిడ కొంచెము పాతపద్ధతిగా కనుపడసాగింది.

పంకజము అతి సౌందర్యవతి అని చెప్పడానికి వీలులేదు కాని దానిలో వక ఆకర్షకగుణము వున్నది. నాకంటె రెండు క్లాసులు తక్కువ చదువుతూ వుండేది. తెలియని సంగతులు తెలుసుకోడానికి అప్పుడప్పుడు నన్నడిగేది. చాలాసార్లు వర్ణాంతరవివాహాలు మొదలయిన విషయములను గూర్చి నాతో వాదించింది. నాకంతగా జ్ఞాపకములేదు గాని ఒకనాడు నేనును ఆపంకజమున్నూ ఇంకా నాభార్య కాపరానికి రాక ముందు వర్ణాంతర వివాహములు తగుననీ ఆమె, తగదని నేనూ, బీచీలో వాదించాము. ఆ వాదానికి ముందూ వకపందెము. నేను వోడితే వర్ణాంతరవివాహము చేసుకోవలెననీ ఒప్పించింది. అప్పుడామె చాల గడుసుగా చురుగ్గా వాదించి నన్నోడగొట్టేసింది. అప్పుడు వేళా

కోశానికిమల్లే "నీవు వర్ణాంతరవివాహం చేసుకోవాలి" అంది. అప్పుడప్పుడు అదే మాట యెత్తిపొడుస్తుండేది కూడాను.

అమె యింటర్ మీడియేటు చేదివింది కాని అపయిన ఆమె యెక్కడవుండినదీ యేంచేస్తున్నదీ కొన్నాళ్లు తెలియలేదు. ఇప్పుడనుకొనే సమయానికి నాభార్యాయున్ను తల్లిన్ని మా మామగారియింటికి వెళ్లారు. ఇంట్లో నేనొవాణ్ణే. వకనాడు పంకజం వచ్చి "హలో! మిష్టర్" అని షేక్యాండిచ్చింది. ఇద్దఱం డ్రాయింగురూములో కూర్చున్నాము. తనకేమో వివాహప్రయత్నము జరిగినట్లు-తండ్రి చనిపోవడంవల్ల భంగమైనట్లు చెప్పి "నీవాడినమాట తప్పుతావా" అని నన్నడిగింది. విషయము విమర్శించకుండా కొంచం పరధ్యానంతో "ఎందుకు తప్పుతా"నన్నాను. అప్పట్లో చామనచాయ విగ్రహము, సన్నని పలుచని తేలికైన సిల్కుచీర, ఒక్క చైనాగొలుసు, ఊదాజాకేటు, ఒంటిజత గాజులు, ముంగురుల జారుకొప్పు. స్నోపాలిష్ ముఖము, ఈ అన్నిటితో ఆమె తన విశాల నేత్రాల్నుంచి ఒక్కబాణం నామీద విసిరింది. నేను తన్మయుణ్ణయినాను.—

"సరే! రామన్! నీవు వర్ణాంతర వివాహం చేసుకునే విషయం నాకు బాకీ వున్నావు అపని ఇప్పుడు నెఱ... ..." అని చిరునవ్వు సగమునవ్వి, కన్నీరు విడువడమారంభించి, చేతిరుమాలుతో వొత్తుకుంటూ "నీపైనే ఆశపెట్టుకున్నాను" అన్నది.

నాకు గుండె ఝల్లుమన్నది. చిన్నప్పటి స్నేహితురాలు కదా! దీన్నెట్లయినా కాపాడవలె ననుకున్నాను. "సరే! పంకజం! ఎట్టి వివాహమైతేనేమి? నీకు సరియైన వివాహం నే నేర్పాటు చేయిస్తాను. అన్ని భారములు నేను వహిస్తాను." అంటిని. అందులకు పంకజం నాకు పెండ్లయిందని చెప్పినప్పటికీ వొప్పుకొనక నేనే పెండ్లాడవలెనని పట్టుపట్టి నారొమ్మునకుఁ జేరఁబడి ఒకసారి ముద్దుగొనింది. ఆపైన శారదావాళ్లకుఁ దెలియకుండా దాన్ని సింహాచలంలో వివాహమాడడం, నెల్లూరులో కాపురం బెట్టడం మదరాసులో శారదా ఆఫీసుకున్నూ-నెల్లూరులో పంకజం ఆఫీసుకున్నూ-రైల్వే సీజఁటికెట్ల పైన టయిము ఏర్పాటు చేసుకోవచ్చుననుకుని 'సింహాచలంలో పెండ్లి' అని తెలిపి ఖర్చులకుగాను వేయి రూపాయల నోట్లిచ్చాను. పెద్దలు సంపాదించిన డబ్బున్నది గనుక ఇన్నిపోకడలు సాధ్యమవుతున్నవి. మర్నాడు ప్రయాణమని పంకజం వెళ్లింది. రెండురోజులు వొక చోటికి వెళ్లొస్తాననిన్నీ యిల్లు భద్రమనిన్నీ గుమాస్తాకు చెప్పాను.

వాల్తేరులో మెయిల్లో నేనూ పంకజం దిగేము. పెండ్లి యితరకర్చులకున్నూ నగలకున్నూ రెండువేలరూపాయల నోట్లు నా దగ్గర ఉన్నవి. అయినా శారదను పరీక్షించి

నట్లే ఈమెను పరీక్షిస్తామనుకుని "పంకజం! వైకం పేకటు మరిచిపోయినాను. టికెట్లు మాత్రం తీసుకొన్నాను. ఖర్చుకుగాను ఇప్ప టికి పందరూపాయ''లి మ్మన్నాను. పంకజం శాంతము, నగుమొగము; అంతామటు మాయమయిపోయి "మీరు పెండ్లికి డబ్బు తేలేదా ?'' అనింది. "వెయ్యి రూపాయ లిచ్చేనుగదా ?'' అన్నాను. ఆ మొత్తము తాకడానికి వీల్లేదు. యిప్పుడు గూడ నాపేర అయిదువేలరూపాయలు బ్యాంకులో కట్టనిదే నన్ను పెండ్లాడడానికి వీల్లేదు. నీ జెంట్లిమాన్‌తనము ఇంతేనా ? ఏవిషయము మొదలుకాందే పందరూపాయు లడుగుతు న్నావు. మన లైఫ్ బాగా నడిచినట్లే'' అన్నది. ఈ రూక్షభాషణకి నా వ్రెళ్లదిరిపోయింది "ఇదెక్కడి గోముఖవ్యాఘ్రంరా! బాబో!'' అనుకుని తేలుకుట్టిన దొంగలాగా ఊరకుండి ఇంకో జేబులో తడుముకొని వక పదిరూపాయల నోటు బయటికిదీసి "సరే పంకజం ! ఇప్పటికీ పదిరూపాయ లున్నవి మనం ముందు లాడ్జీలో దిగుదాం. ఆ పైన వయరిచ్చి వైకం తెప్పిస్తాను'' అని సమీపంలో ఉండేలాడ్జిలో ఆమెను చేర్చి నాదగ్గఱవైకం ట్రంకులో భద్రపరచి, మరునాటి మధ్యాహ్నము ఆమె నిద్రించుచుండగా నేను నాట్రంకుతీసికొని యెవరికి చెప్పకుండా మదరాసుకు బయలుదేరి రైలులోబడి యాత్ర ఖర్చులకు తల్లిగారిచ్చిన నగను సంతోషముతో నిచ్చినశారదనున్నూ చిన్నప్పటి స్నేహాముండి, పెండ్లిఖర్చులకి వెయ్యిరూపాయిలు తీసుకొని భద్రపరచి ఖరారులేని ఇంకో అయిదువేల రూపాయలు కోరిన పంకజాన్నిన్నీ పోల్చాను. మదరాసు చేరేటప్పటికి శారదావాళ్లు వచ్చివున్నారు. నేను వెళ్లినపాళముగా రూములో పడుకొని పశ్చాత్తాపముతో దుఃఖించాను. ఇంతలో శారదవచ్చి నాఖిన్నత్వము చూచి ఖంగారుపడి "ఏమట్లా ఉన్నారు ? ఎక్కడనుండి రావడము'' అని ప్రశ్నించి ప్రక్కన కూర్చున్నది.

"పనిమీద నెల్లూరు వెళ్లియుంటిని. జ్వరపడి వచ్చాను''అన్నాను. అప్పుడు శారద నారైలు బడలిక తీరునట్లుగా ఒళ్లంతా పట్టింది. ఆ శారద అప్పుడు చేసినసేవ రోజాపూల శయ్యవలె ఉండింది. అట్టి శారదకు కాక నాశరీరాన్ని ఇంకొక నీచురాలికి కూడ స్వాధీనం చేయదలంచుకొన్న నన్నే నేను తిట్టుకుని, ఆప్యాయముతోను పశ్చాతాపముతోను శారదను రొమ్ముమీదికి లాక్కొని ముద్దిడుకున్నాను.

———:o:———

# ఔదార్యము మున్నగునవి

శ్రీసాహిత్యసరస్వతి సీరిపి-ఆంజనేయులుగారు,

4 ఔదార్యము.

గీ. కాఱు చీఁకటులంతటఁ గ్రమ్ముకొనఁగ
మెఱపుదివ్వెలు పయిఁబయి మింటనిగుడ
నుఱుము లవియింప నెడఁదల నుగ్రభంగి
నేమి పుట్టునో యని జగమెల్ల నడల.

గీ. శీతలామృత వర్షమ్మె చిలుకు చుందు
వంతె; చింతింప వెప్పుడు నళనిపటలి;
జీవసంతతి కీవ సంజీవనమవు;
వారిదమ! యేమి నీ మహోదారగుణము?

5 లక్ష్యము.

గీ. అమితమౌ పయనంపు భారమున నలసి
గమ్యమార్గంబు దరియును గానఁ బడమి
నడి సముద్రమ్మునఁ దడఁబడి కలంగి
భ్రమణమునఁ జెందు నావలకాపు నీవ.

గీ. ఓ ప్రదీపాలయమ! కడు నోపుకొలఁది
నావలకు భావుకముఁ గూర్తువీవ; నిన్ను
దృష్టియందిడ కిట నటు తిరుగునట్టి
యోడ,తనదు జీవనమంద యోటుఁ జెందు.

6 యశఃకారణము.

గీ. మేల్పసిఁడిచాయఁ బురుడించు మేల్మిరుచుల
నాత్మసౌరభలక్ష్మి దిగంతములకుఁ
బర్వ, నధ్వగహృద్భృంగపటలి నీడ్చి,
తగఁ బిసాళించు కేతకీ! ధన్యవమ్మ!

గీ. కాని, నిన్నావరించిన కంటకములు
వ్యాళతతియును నీకపయశముఁ గూర్ప
నెసఁగెనంచుఁ గొందఱు వచియింతు రట్టి
గాదు; నీమూల్యమున కవే కారణములు.

7 భిన్నరుచి.

గీ. ఆయనంత చిరత్న దేశాల యమున
నూర్ధ్వతలమున వ్రేలుచు, నొప్పిదంపుఁ
జలువ వెలుఁగులఁ జిలుకుచు జెలువుఁ గొలుపు
స్వామిసేవారతుండ వెవ్వఁడవొ తెలియు?

గీ. కువలయహితుండ పుడమి కోర్కులనిధాన
సౌఖ్యదము తావకద్యుతి సారవార
మందుఁ గ్రీడాభిరతిఁ దేలియాడు జగము;
విరహబాధాన్వితులును దామరలుఁ దక్క.

---

వీనికి మొదటనుండు పద్యములు మార్చినెల సంచికలో ప్రచురింపఁబడినవి.



ఎ. వి. టి. అయ్యరుగారి అనుమతిని.

అర్జునునితపస్సు

[మహాబలిపురము]

# బంగారంగొలుసు

ఏ. వి. కృష్ణమూర్తిగారు, (విశ్వవిహారము)

ఒకప్పు డాసత్రం మహావైభవంతో వెలుగుతూ జనులకు అత్యంతోపయోగకరంగా వుండేది. అది కట్టించిన ధర్మాత్ముఁడు యిక మనకు లేకుండా పోయినాఁడు పరమేశ్వరసాన్నిధ్యానికి. ఆయన తదనంతరం కుమారుడి చేతిలోకి వచ్చింది అంతా. ఇదంతా చూచేసరికి ఆయన కళ్లు కుట్టినవి. పూర్వం నించీ ఆసత్రం రిజిస్టరూ యేమీ చేయబడకుండా, మాట నమ్మకంమీద సాగి పోతూ వుండడంవల్ల కోర్టులో హక్కుభుక్తానికి దావావేసి స్వంతం జేసుకున్నాఁడు. ఇప్పుడది సత్రంకాస్తా అద్దెకొంపకింద మారిపోయింది. రోజులు మారిపోవడంలేదూ ?

దాంతోబాటు మనుష్యుల స్వభావం గూడా మారిపోతోంది! దాని ఆవరణ చాలా విస్తీర్ణ మయినది. చుట్టూ రకరకాల వృక్షాలూ, అరటిచెట్లూ, వివిధమైన పూల మొక్కలూ, యిత్యాది ప్రకృతిసంబంధమైన వస్తువులతో మిలమిలలాడుతూ వుండేది మునుపు. కాని ప్రకృతం వాటిశోభ పూర్వపుయజమాని ఆత్మను అనుసరించిపోయింది. ఆచెట్లమధ్య ఒక పెద్ద భావి వున్నది. పూర్వం ఆనీటితో యంతమంది బాటసారులో బ్రతికేవారు, చెట్లతోఁబాటు. యిప్పుడు జలయంత్రములు వచ్చుటచేత దాని నెవరూ వుపయోగించడం లేదు. అందువలన అది పాడు పడిపోయినది.

ఈసత్రానికి ఆనుకుని దాని స్వంతదారుల మేడ ఒకటి వున్నది. అది చాల విశాలమై విద్యుద్దీపములతో శోభిల్లుతూ వుంటుంది. సత్రముఆవరణలోనుంచి దానిమీాదకు పోవడానికి మెట్లువున్నవి. వారు అప్పుడప్పుడు అద్దెల వసూలుకుగాని, యితర పనులకుగాని యిటునించే దిగి వస్తూవుంటారు. వారి పిల్లలు గూడా కింద అద్దెలకున్నవారి పిల్లలతో ఆడుకునేటందుకు వస్తూవుంటారు.

*  *  *

ఆ సత్రపు ఆవరణలోనే చిన్నతాటియాకుల గుడిసెలో సుబ్బీ - దానిమొగుడూ వుంటున్నారు. చాలకాలం క్రిందటినించీ వాళ్లిద్దరూ అక్కడేవుంటూ సత్రంలో దిగినవారి అంట్లూ అవీ తోముతూ పాచిపని చేసుకుంటూ బ్రతుకుతున్నారు. యిప్పుడు బాటసారులెవరికీ ఆభవనంలో ఆస్కారం లేనందున, అద్దెలకు వున్నవారు యవరిపనులు వారే కరవుకాలములో డబ్బుపెట్టలేక చేసుకోవడమువలన యీదంపతుల జీవితము దుర్భరమై పోయినది. యీసమయంలోనే ఆ వూళ్లో మ్యునిసిపలు కవున్సిలు పోయి స్పెషల్ ఆఫీసరు వచ్చాడు. ఆయన కావ

డంతోనే వీరడి వుద్యోగం వూడింది.రోజేంతా ఎండలో తిరిగి సైడ్ కాల్వలమీద లోషన్ చల్లుతో, యీవిధంగా నెలరోజులు పనిచేస్తే ఎనిమిదిరూపాయీలు యిచ్చేవారు. నోటి ముందరకూడు అదికాస్తా పోయింది. యేమీ తోచక కొన్నాళ్లు పిచ్చెత్తినట్టు తిరిగేవాడు వీరడు (సుబ్బి మొగుడు.)

సుబ్బి కూలీనాలీ చేసి కొన్నిరోజులు గడిపింది. అదిగూడ సాగడంలేదు, యీకరవు రోజుల్లో. తర్వాత పిడకలుచేసి అమ్మడం సాగించింది.యంతకష్టపడ్డా బ్రతుకు దుస్సాధ్యమైంది. చివరకు ఆలోచించి తన తమ్ముడు వూరువెళ్లి యట్లాగైతేనేం తిప్పలుపడి యేవో సొమ్ములు అవీవుంటే అమ్మి, కొన్ని తాకట్టు పెట్టి ఒహ నూటయాభై రుపాయలదాకా తెచ్చింది. వీరడికి చాలా సంతోషమయింది.

'యక్కడిదే యీసొమ్ము ?

'నాను తీసకొచ్చినాను గా మాతమ్ముడి కాడ ! ఇది పట్టి యామన్నా వ్యర్తకం సెయ్యరాదూ ?

'యేం సెయ్యమన్నావే? పానీ సెట్టి దుఖాణం పెడ్తావేం ?

'గుఱ్ఱంబండి కొనరాదంటే మామా ! తోలకపోతే రోజుకోరూపాయి డబ్బులు దొరకతయ్యి.

'యేం మిగలతాదే? అర్ధరూపాయ మేతకే పోతదిగందా ?

'యింకాయేం. రోజు కర్ధరూపాయ సాలు దంటే. సాల్లే '

'నీకేం తెల్దు. మళ్లీ పన్ను కట్టాల మునిసిపిల్లి ఓరికి. యీ మద్దెల పోలీసోరికి డబ్బు యియ్యాల. నాను సూసెనాను పిల్లా. యీ యావారమంతా నేను సూస్తానే వుండా. మస్తానుసాయబయ్య సెప్పాడుగా నాకు ! '

అయినా యెట్టాగో కూసింత నయమే. లాకపోతే సాలా కటీనంగా వుందేసమసారం'

ఈ విధంగా ఆ కష్టజీవులగు దంపతులిద్దరూ తమ గుడిసెలోపల పడుకుని మాట్లాడుకుంటున్నారు. పై కప్పులోవున్న చిల్లిలో నించి వెన్నెల చొచ్చుకొనివచ్చి వారి శరీరం మీదబడి చక్కిలిగింత పెట్టుతూవుంది. చూరులోవున్న యెలికలు చేసే ధ్వని మాత్రం వారి సంభాషణకి మధ్య మధ్య అంతరాయం కలిగిస్తోవుంది. చాపఅంతా చిరిగిపోయి దవడంవలన చీమలు పైకిపాకి కుట్టుతూ అమితంగా బాధిస్తున్నాయి.

'యీపాలి వో నులకమంచం కొనక్కరావే మామా. యీ సీమలభాద యక్కువగా వుండాది.' ... ... అంటుంది సుబ్బి. దాని మొగుడు చూరువైపు చూస్తున్నాడుయేదో ఆలోచించుకుంటూ.

వారిద్దరి సంభాషణను నిశ్చలభావంతో, విచారంతో నిర్విణ్ణమై వారి కష్టపునర్చరణను విలోకిస్తూవున్న ఆ చిన్నబుడ్డీదీపం ఒక్కమారుగా చలించింది.

'ఒరే వీరడూ! వీరడూ!!' అని గంభీరధ్వని వినబడింది వారికి బయటినించి. ఆ ధ్వనిలో క్రోధమూ, యీర్ష్యా, వుగ్రమూ అన్నీ మేళవింపబడి వున్నవి.

సుబ్బి లేచి క్రిందపడివున్న కోక చుట్టుకుంటూ తలుపు తీయబోతూవుంటే యింతలోనే—

'తియ్యవేరా తలుపు ? యవరులోపల? త్వరగా తియ్యవే' అని కోపంగా అరుస్తున్నారు.

సుబ్బి తలుపుతీసింది. యిదివరకెప్పుడూ పూర్వపుయజమానిగాని ప్రస్తుత యజమానిగాని వాళ్లమీదికి ఆవిధంగా కత్తి నూరుతూ ఆడవాళ్లతో సహా లాంతర్లు వేసుకుని రాలేదు. దానికేం అర్థంగాలేదు. యీ జనసమూహాన్ని - అన్నిటికంటె ఆ యజమాని కంటిమెరుపు చూచేసరికి వీరడు దిగ్భ్రమ జెందాడు.

'మా అమ్మాయి గొలుసేమయినా కనబడిందిరా మీకు ? ' అని డబాయించి అడిగాడు యజమాని.

'యేం గొలుసు బాబూ? ' అంది సుబ్బి కంపిస్తూన్న కంఠస్వరముతో గొఱ్ఱెపిల్ల లాగ చూస్తూ—

'యేం గొలుసంటావేం ? అమ్మాయి గొలుసు తెలీదు బంగారపుజిగినీ గొలుసు ! '

'మాకెరగమండి. యాడపోయిందండి'?

'యిక్కడే పోయింది. యింకా యక్కడికి ఆడుకుంటానికికూడ పోలేదు యీ రోజు. సాయంత్రం యిక్కడికి వచ్చేటప్పుడు గొలుసు వుంది. మళ్లయింటికి వచ్చింతర్వాత చూస్తే లేదు.'

'ఐతే యాడపోతది ? నాంతేరి యిట్టా యియ్యాండయ్యా. నాను నెలుకుతా. యేసెట్ల సాటన్నా పడింది గావోసు'అన్నాడు వీరడు.

'వెతకాల్సిందే. యేమిటికి వెతికేది ? అదంతా మేముచూడలేదురా యిందాక ? అంది ఆసమూహంలోని వక వృద్ధవితంతువు.' అందరూ ఆఅభిప్రాయాన్ని ఆమోదించారు'

'యెవరో తీయకపోతే యామవుతుంది' ? అన్నాడు యజమాని.

"యెందుకిదంతా ? నాకు సుబ్బిమీదే వుంది అనుమానం. అదే తీసివుంటుంది. అప్పుడప్పుడు అమ్మాయిని యెత్తుకుంటూ వుంటుంది. క్రిందపడితే యక్కడో ఒకచోట దొరకదూ ? అయినా మెడ నున్నది యట్లా జారిపోతుంది?" అంది ఆయనగారి భార్య.

'అమ్మా అమ్మగోరూ రచ్చించాల' తెల్సిదాన్ని. నాకేం తెల్దు. నాను సత్తె ప్పెమానకంగా సెప్పుతుండా. నేనియ్యాలే

వెచ్చినా మా వెూళ్ల పూర్నించి. నా కేం తెల్దు. ... ...' అని గోలుగోలున యేడ్చింది సుబ్బి'

'నాలుగుతన్నండి ... ... అదే చెప్తుంది' అన్నారు యెవరో ధీరులు. 'పోలీసు రిపోర్టు యివ్వండి దానిపని పట్టింతాం' అని వకరూ 'గుడిసెనంతా సోదాచూడండి కనబడ్తుం దేమో' నని యింకోరు యీవిధంగా నోటికి వచ్చినట్లు కూస్తున్నారు'.

యిద్దర్నీ జుట్టుపట్టుకుని యీడ్చి వక్క తాపు తన్నారు. యజమానీ యింకా కొందరు గుడిసెలోపల ప్రవేశించి వాళ్ల సామాను బైట బడేశారు. యేమీకనుపించలేదు. గుడ్డల మూటలవ్వీ చూశారు. యేమీ దొరకలేదు. చివరకు వాళ్ల కుండలు దుత్తలు కొన్ని నేల నేసి కొట్టారు కోపంమీద. ఒక కుండలో వారు మర్నాటి ప్రొద్దుటికి వుంచుకున్న గంజీ - కూడు - వుంటే దాన్ని కూడ నేలనేసి కొట్టారు. తర్వాత వుట్టిమీద పెట్టివున్న దుత్త ఒకదాంట్లో - వకవంద రూపాయిాలనోటు- వక యాభై రూపాయలు కనబడ్డవి. ఆ సంతో షంమీద గుడిసెనంతా చిందరవందర చేశారు.

అప్పుడే అమ్మ సొమ్ముచేశారట్రా ? అంటూ అతికోపంతో నడుముమీద చెరివక తన్నా తన్నాడు యజమాని. 'ఆడబ్బు మాదిబాబో. గుట్టింబండి కొనడానికి మా వూరెల్లి తెచ్చానండో ... ...'అని సుబ్బి ఒహాటే గోలయేడుస్తాంటే 'ఛా. లంజముండా యింకా దొంగకూతలు కూస్తావు. నోర్మూయ్. మాట్లాడావంటేజైలులో వేయిస్తా' మని డబా యించారు అంతా!

పాపం'వాళ్లిద్దరు యేంచెయ్యగలరు? యింత మంది యెదిరిస్తుంటే వారి మొర యెవరూ ఆలకించేది ? ఆమర్నాడే వాళ్లని వెళ్లగొట్టే శారు అక్కడ్నించి.

పగిలిపోయిన కుండ పెంకులు యింకా అతుక్కుని వున్న గొడ్డుకారంతో, మిగిన బియ్యంమూటలో - చినిగిపోయిన గుడ్డలతో వాళ్లిద్దరూ కళ్ల వెంబడి చాటచాట నీళ్లు కారుస్తూ నడిచారు.

భగవంతుడు యిదంతా చూడ్డంలేదూ ?

వీరడి శీలం చాలామంచిది. త్రాగుడూ మొదలైన దుర్గుణాలేమీ వాడికి అలవడ లేదు. నీచజాతికి జెందిన వాడైనా వాడి గుణాలూ, ఆదర్శాలూ చాలా వున్నత మైనవి. కష్టపడి సంపాదించుకుని తినవలెనని తలచేవాడు యెప్పుడూ. వాడికి గూడ పెళ్లాం మీద అనుమానం గలిగింది. యీ రోజున దీనికి నూటయాభైరూపాయలు యెక్కడివా అని ఆలోచించాడు. జీవితం దుర్భరంగా వుండడంవలన గొలుసు దొంగిలించి తాను కొప్పడ్తాడే 'మోనని ఆవిధంగా చెప్పివుండ వచ్చు'ననుకున్నాడు. భార్యమీద అసహ్యం

వేసింది. యింత అపవాదు వచ్చింతర్వాత తనని యెవరు పనిలో వుంచుకుంటారు ? యిటువంటి భార్యతో వుండగూడ దనుకు న్నాడు. అదీగాక పోషించడానికి మాత్రం శక్తియేదీ ?

పెళ్లాన్ని వెళ్లిపొమ్మన్నాడు. అది యెంత కాళ్లా వేళ్లాబడి బ్రతిమాలినా వినలేదు వీరడు.

పాపం నిరపరాధులగు ఆదంపతులకు ఆ విధంగా వియోగంకూడా గలిగింది.

తర్వాత కొద్దిరోజులకే ఆబంగారంగొలుసు చెట్లమధ్యనే దొరికింది.

. . .

కొన్నాళ్లకి ఆసత్రంయజమానికి అదేదో జబ్బు వచ్చింది. రాత్రిళ్లు తెల్లవార్లూ నిద్ర లేదు. ఒకిస్త్రీవ్యక్తి జుట్టు విరబోసుకుని పెద్ద కుంకంబొట్టు పెట్టుకుని, గుడ్లు యెర్రచేసి గుండెలమీద యెక్కి గంతులువేస్తూ వున్నట్టు కనబడ్తుంది ఆయనకి. ఊపిరి సలిపేందుకు వీల్లేదు. ఆతని ముఖమంతా రక్తహీనమై తెల్లబారిపోయింది. కాళ్లు వుచలైపోయి నవి, ముక్కుపొడుచుకు వచ్చింది కాసేపు కన్నుమూస్తాడో లేదో మళ్ల లేచి కూచుం టాడు.—

'అబ్బ. గుండెలు పగిలిపోతున్నాయి నొప్పి ... బాబో ... అదుగో ... అదుగో ... మళ్లీ ... చంపుతానంటున్నది. ... మళ్ల అమ్మ బాబో ... యెవరా ఆపది ? ... పెద్దకుంకం బొట్టు ... చింపిరిజుట్టు ... ఎర్రటికళ్లు ... తెల్లటి వెంకి వడ్డాణం ... గజ్జలు ఘల్లు ఘల్లుమని మోగిస్తోంది ... ఓహో ... తెలిసింది ... తెలి సింది ... సుబ్బి ... అవును సుబ్బి ! అమ్మా రక్షించు ... ... బుద్ధిహీనుడ్ని ... తొందరబడి తప్పచేశా ... క్షమించు. బాధ ఓర్చుకోలేను ... నీ భర్త నీవు వచ్చివుండండిమళ్లీ ... మీ డబ్బు మీకిచ్చేస్తా ... బంగారంగొలుసుగూడ బహుమతి చేస్తా. అదిగో ... అబ్బ ... బాధ ... ... ...'అని యేడుస్తాడు. కళ్ళనీళ్ళకారు స్తాడు. వెడలనడిచేసమయంలో సుబ్బీ-వీరడూ కార్చినవెన్నో వంతువీటిలో ??? భార్య యీ యనబాధచూడలేక యంత ఘోషిస్తోందో యవడు చెప్పగలడు ?

ఆవూళ్లో చాలమంది డాక్టర్లకు చూపిం చారు. గొప్ప గొప్ప యింగ్లీషు డాక్టర్లే పెదవి విరిచారు. ఆయుర్వేదమందులు యేవీ ఆయనకు శాంతి కలిగించలేదు. చివరకు మద్రాసుతీసుకువెళ్లారు. యేమీలాభం లేక పోయింది. యెంత డబ్బయినా ఖర్చుపెట్ట డానికి సిద్ధపడ్డారు. పేరుగల దేవుడి కల్లా మొక్కుంది ఆయన భార్య ... ...

రోజురోజుకి యింకా యెక్కువై పోతుంది ఆయనవేదన. యవరికైనా కష్టాలు వక్క సారిగానే వస్తాయి గదూ ?

వూరంతా మశూచికం యక్కడ చూచినా. ఆయన భార్య దాని బారికి తప్పుకోలేకపోయింది. తీవ్రమైన జ్వరం. అందులో మశూచికం. ఓకన్నుగూడా పోయింది. ఓ వారం రోజుల్లో ఆజబ్బు యెక్కువై భర్త మీద బెంగతోనే ఆమె చనిపోయింది.

ఆయనకిది శూలం పోటుమాదిరి తగిలింది. కొడుకులా అసలులేరు. కూతుళ్లంతా కాపరాలకు వెళ్లారు. ఆరు సంవత్సరాల చిన్న కూతురు మాత్రం వుంది, వెళ్లాం పోయిన కొత్తలో ఆయనను వూరడించడానికి బంధువులు వాళ్లూన్ను అంత్య క్రియలూ అవ్వీ అయిపోయింతర్వాత యవరి వూరు వారు వెళ్లిపోయినారు.

యిప్పుడు ఆచిన్న పిల్ల ఆయన మాత్రమే ఆయింటికి. ఒక వంటమనిషి మాత్రం వుంది. యిల్లు పాడుపడి పోయినట్లయింది. అయన దిక్కులేని పక్షిమాదిరి అయిపోయినాడు. పూర్వపు వైభవం, శోభ అదీ తలచుకుంటే ఆయన గుండె చెరువై పోయేది. యెప్పుడు ఆయన రెండుకళ్లకూసుబ్బీ-బంగారం గొలుసు కనబడుతూ వుండేవి. యెప్పుడూ దానిమీదే ఆయన ఊహ. వీరడికి అయన హృదయంలో స్థానం.

చచ్చిపోతే బాగుండు ననుకుంటాడు యీ విధంగా అవస్థ పడుతూ వుండడం కంటె. కాళ్లు పీక్కుపోతూ వుంటవి. నడుములు నొప్పులు, గుండెలు పగిలిపోయినట్టుగా నొప్పి యెప్పుడూ మూల్గుతో వుంటాడు. యింకా కొన్నాళ్లకి పక్షవాతం వచ్చి కుడిచెయ్యి కుడి కాలు పడిపోయినవి. ఆయన దుస్థితి యికను వర్ణించగలరా?

మళ్ళీ సుబ్బినీ వీరణ్ణీ తీసుకువచ్చి వుంచుకుంటే తనకి విముక్తి కలుగుతుందేమో ననుకుంటాడు. కాని యెక్కడ దొరుకుతారు?

పెళ్లాన్ని ఆ చిన్నకూతురు దీనముఖాన్ని, ఆవిడ భావిస్థితిని గురించి-తన ప్రస్తుతావస్థను గురించి తలుచుకుని కుళ్ళికుళ్ళి యేడుస్తాడు. యీదేహం చాలిస్తే బాగుం డనుకుంటాడు, కాని యెట్లా ?

యింకా అట్లానే గడుస్తున్నవి ఆయన రోజులు.



# శ్రీ ఆండాళ్ చరిత్ర

పి. టి. వి. అయ్యంగారు గారు,

పన్నిద్దరాళ్వార్లలో పెరియాళ్వారొకరు. వారు శ్రీవిల్లిపుత్తూరులో వేంచేసియున్న శ్రీ వటపత్రశాయి సన్నిధిని బుష్పకైంకర్యముఁ జేయుచుండిరి. ఒకదినమున 'నందనవనము'న స్వామికైంకర్యమునకుఁ బుష్పముల నేరుచుండ, ఒకతులసీవృక్షము (తిరుత్తుళాయివృక్షము) క్రింద స్వర్ణమయుంబై అతి కోమలంబగు నొక బాలను గాంచెను. వారికిని పిల్లలు లేని కారణమున, భగవత్సంకల్పము నెంతయుం గొనియాడుచు, నామెనుఁ దమగృహమునకుఁ గొంపోయి, పుత్రికావాత్సల్యమునఁ బెంచుచుండిరి. భూదేవియంశమున జనించినదగుటచే నామెకు వారు 'గోదాదేవి' యనియు 'ఆండాళ్'అనియు నామకరణంబొనర్చిరి. శుక్లపక్ష చంద్రరేఖవలె నామెయు దినదిన ప్రవర్ధమానయై, తనతోటి కన్యకలతో బాలక్రీడ లొనర్చుచు, తల్లిదండ్రుల నానందాబ్ధి నోలలాడించుచుండెను. వారు పెరుమాళ్లకుఁ గట్టిన పుష్పమాలికల నన్నిటిని యామె పెరియాళ్వారు స్నానసంధ్యలకై తటాకమున కేగు సమయమున ధరించి, మరల వాని నెప్పటియట్లుంచుచుండెను. ఒకదినమున వారీ సంగతిం బరికించి, నాఁడు వానిని బెరుమాళ్లకు సమర్పించుట మానిరి. నాఁటిరాత్రియే పెరుమాళ్లు వారికి స్వప్నమందు ప్రత్యక్షమై, ఆ పుష్పమాలికలను సమర్పించుటకు సంశయింపవలదనియు, తమ ప్రియురాలు ధరించినమాలలే తమ కెంతయు ప్రీతికరములనియు నానతిచ్చిరి. పెరియాళ్వారు నాఁటనుండి యట్లే వటపత్రశాయికిఁ బుష్పమాలికల నర్పించుచుండిరి.

ఇట్లుండ ఆండాళ్ దేవి తనసహజ స్వభావముంబట్టి ఒకవరునిగూడుటకు సంప్రాప్తయౌవనవతియగుటచేతను, ఒకదినమున మిక్కిలి యభినివేశముతో వటపత్రశాయిని సందర్శించెను. అర్చావిగ్రహ మగుటచే పెరుమాళ్లామెనట వరింప నొల్లరైరి. అవతారపురుషుల చేష్టలెంతయు నగమ్యగోచరములు కదా! ఆబాలికయు తనమనోరథ మీడేరమిం జేసి యెంతయు ఖిన్నురాలాయెను. విరహతాపమును సహింపజాలక నాఁడు కృష్ణావతారకాలమున గోపికలెల్లరు కృష్ణుని విశ్లేషించినపుడు విరహతాపమును భరింపనోపక కాళింగమర్దనాది కృష్ణలీలల ననుకరించి తమ మనసులం దృఢపరచుకొనినటుల గోదాదేవియు నట్లనుకరించి మనఃస్థిమితముఁ బొంద నిశ్చయించెను.

ఆమెయు, ఆమెచెలులును, గోపికారూపంబులం జెందిరి. శ్రీవిల్లిపుత్తూరే వ్రేపల్లెగాను, అచటి కన్యకలే గోపికలుగాను, వటపత్రశాయి దేవాలయమే నందగోపుని గృహముగాను, అందు శయనించిన పెరుమాళ్ళే శ్రీకృష్ణుని

గను దలచి, ఆండాళ్లు గోపికాలీలల ననుష్టిం
చుచుండెను. అవాప్తసమస్తకాముఁడగు భగ
వంతుఁడును తన ప్రియురాలి చేష్టల కెంతయు
ప్రసన్నుఁడై జన్మాంత సౌజన్యసౌశీల్యురగు
నాకన్యకలతో శ్రీకృష్ణలీలలం బొడసూపు
చుండెను.

ఇట్లుండ ఎల్లరు (తండ్రులు) శ్రీకృష్ణుఁడు
ధూర్తుఁ డగుచున్నాఁడని తమ పుత్రికల నెల్ల
రను శ్రీకృష్ణసంపర్కమునుండి నెడఁబాపు
టకై భూగృహమందు బంధించిరి. వర్షము లేమి
సంభవించెను. మరల వారందఱు తమబాలిక
లకు శ్రీకృష్ణుని ఘటకునిగఁ జేసి వర్షార్థమై
నోము నోచుట కనుజ్ఞ నొసంగిరి. వటపత్ర
శాయియు నిక నాలస్యముం జేయఁ జనదని
ఆ విల్లిపుత్తూరు గోపికలతోఁ దన్ను తెల్ల
వారుఝామున 'నప్పిన్నపిరాట్టి' గృహముకడ
కరుదెంచి లేప మని యనుజ్ఞ నొసంగెను.
బాలిక లెల్లరు నాఁటి రాత్రి తమతమ శయ్యలం
జేరిరి. కాని శ్రీకృష్ణగుణచేష్టితులై వాని
స్మరణానందసౌఖ్య మనుభవించు వారికి నిద్ర
పట్టునా ? తెల్లవారుఝామున వారందరు
తమతమ సఖులను లేపి వారలతో కలిసి
శ్రీకృష్ణభవనమున కరుదెంచిరి. శ్రీకృష్ణుఁడును
మేల్కాంచెను. ఆకన్యక లపుడు వానితో
తమ వాస్తవప్రార్థనలను విన్నవించి తమ
మనోరథముల నొందిరి.

ఆండాళ్ దేవియు నిట్లు కామభజనాదు
లొనర్చి స్వస్థతనొంది మహాభక్తురాలై
'తిరుప్పావై' యను ప్రబంధము నాన
తిచ్చెను. ఆమె క్రమముగ శ్రీరంగనాథుల
కల్యాణగుణముల నాకర్ణించి తన తండ్రితోఁ
దన్ను శ్రీ వారికి సమర్పింపుమని చెప్పెను.
శ్రీరంగశాయియు నారాత్రియే పెరియాళ్వా
రులకు స్వప్నమందు ప్రసన్నులై ఆండాళ్లును
దమకుసమర్పింపమని యానతిచ్చిరి. వారును
ఆండాళ్లును దివ్యవైభవముతోఁ బెరు
మాళ్ల కర్పించిరి. ఆమె హంసనడకలతో లోని
కరిగి, రంగనాథుని సేవించి, నాగపర్యంక
మధిరోహించిన తోడనే యెల్లరుఁ గాంచు
చుండ స్వామితిరువడిగళు (పాదపద్మముల)లో
నంతర్ధానముఁ జెందెను.



# విద్యాసంస్కారము

విద్యయనుశబ్దమున కెన్నివిధములుగానో యర్థమేర్పడును. ఒకనియొక్క మనోదుష్ట త్వమును పద్ధతులను బాగుచేయుట, దేహము యొక్కయును మనస్సుయొక్కయును పరిస్థి తుల నభివృద్ధి గావించుట, స్వభావమును ప్రవర్తనను బాగుపఱచుట, అనేక విధము లయిన విజ్ఞానములయందు నేర్పునొందుట యోగ్యత, నియమము, అనునవన్నియును విద్యయొక్క ఫలితము లననగును.

సుమారొక శతాబ్దముగా మనకు అన్ని సంగతు లింగ్లీషులో బోధింపఁబడుచున్నవి. ఈవిదేశభాష మూలమున విద్యాభ్యాసము జరుగుచుండుట వలన జనసామాన్యమునకు విద్యావంతులకును గొప్ప తెగల భేదమేర్పడి నది,ఈపద్ధతి మన దేశమునం దార్థిక సాంఘిక పరిస్థితుల కపాయము కల్గినది.

నేఁటిరోజులలో ప్రతిప్రాణియును స్వేచ్ఛను గోరుచున్నది. కారణరహితములయిన వట్టి నమ్మకముల పయిననే యాధారపడిన మన పద్ధతులు నానాటికి సడలిపోవుచున్నవి.కొంత వఱకు నేఁటి భావదాస్యమునకు పాల్పడి నను పూర్వమునందు మనసొత్తుగా నుండి మనయొక్క గొప్పఖ్యాతికిఁ గారణమయిన మానసికశక్తిని జ్ఞానసంపత్తిని సంపాదించు కొనుటకు మనము మరలఁ బ్రయత్నములో నున్నాము.

బొంబాయి విశ్వవిద్యాలయములో సర్. సి. వి. రామన్‌గారు ఆ పట్టభద్రుల సభలో గావించిన యుపన్యాసములో పాఠశాలా విద్యాపద్ధతులను నిరూపించి శాస్త్రీయజ్ఞాన మును, శాస్త్రీయదృష్టి(Scientific learning and scientific outlook) అను వానినిజీవిత పథమునందు నుపయోగించు కొనవలయునని తెల్పియున్నారు.

పయివిషయమే డాక్టర్ సర్.రాధాకృష్ణన్ గారు గూడ మైసూరు విశ్వవిద్యాలయములో తాము 1930 వ సం॥ లో నొసంగిన యుప న్యాసములో నీదిగువ తెల్పిన రీతిని నొక్కివ క్కాణించి యున్నారు.

''ఋషీశ్వరులు గావించిన బోధలకంటె శాస్త్రజ్ఞులు వ్యాపింపఁజేసిన జ్ఞానమువలన జనసామాన్యమున కెచ్చేయిన లాభము కల్గి నది జనులు కళావిషయమున నెంతవన్నె గాంచిరో ఆస్థితినే శాస్త్రోన్నత్యమునందుఁ గూడఁ జెందవచ్చునని శాస్త్రీయాభివృద్ధియు నమ్మకమును చాటుచున్నది.

ఊరక పాఠశాలలోనే చదువుకొనుట యను దానిని బూనినందుల కేర్పడిన ఫలి తము నిరుద్యోగసమస్య. అదియే నేఁటివిద్యా ధికులని పేరొందిన యువకుల యాస్తిగానున్న ది. ఎందఱు మనయువకులయొక్క యో జీవిత మీసమస్యంజేసి నైరాశ్యముతోడను కార్య

భారముతోడను ఋణబాధతోడను బీదతిక ముతోడను నిరుత్సాహత్వముతోడను వ్యథా కరముగాఁ బాడయిపోవుచున్నది కదా?

నేఁటి పట్టభద్రుఁడనువాఁడు కళాశాలలోఁ దా నొక నరుఁడనురీతిని జెంది జీవితావసర మయిన నిజమయిన యోగ్యతను కళాశాల బయటికి వచ్చినతరువాతనే సంపాదించు చున్నాడు. ఆయోగ్యతాసంపాదనము సందర్భములపయిన నాధారపడియున్నది.

దేశకాలపాత్రమునకుఁ తగిన వృత్తి విద్యల బోధనము లేనందువలన నేఁటి పట్టభద్రునియొక్క జీవితము గుఱ్ఱపుపందెము నేలలో నుపయోగింపఁబడిన బరువు పసర మునుంబోలి పరాజయము నొందుచున్న యది. అందువలననే మన పట్టభద్రులు న్యాయవాదము డాక్టరుపరీక్ష చేదువులబడి అను మూఁడే వృత్తులున్నవని తప్పుటభిప్రాయమును జెందుచున్నారు.

ఈవిశ్వవిద్యాలయపద్ధతులను ఆచార్య - ప్రఫుల్లచంద్రరాయ్‌గారు చాల బాగుగా విమర్శించి "స్వేచ్ఛయయిన విద్యాభ్యాస మన్నివితములను మంచిది. కాని యీ పట్టముల పిచ్చియుండఁగూడదు. జీవితమును గూర్చి విశాలదృష్టి యుండవలయును. డాక్టర్ - సర్. సి. వి. రామన్‌గారును - సర్. వ్రజేంద్రనాథసీల్‌గారును, సర్ద్వార వార్షా శ్రీనివాస శాస్త్రిగారును ఎన్నియో సారులు ఇంగ్లండునకు వెళ్లియున్నారు. కాని వారు పట్టములనిమిత్తము వెళ్ళిరా? కాని వారు శాస్త్రము-ప్రశాంతి-దేశీయపరిస్థితులు అను వాని వ్యాపననిమిత్తముగా వెళ్ళినారు గదా? వీరందఱును స్వయముగానే యోగ్యతను సంపాదించుకొన్నారు. కాఁబట్టి హిందూ పట్టములకయినను పరదేశ పట్టములకయినను విశేషమయిన విలువ యుండదని తెలిసి కొనవలయును."

కాని యీ లోపమంతయును విశ్వవిద్యాలయములదే యని చెప్పుటకు వీలులేదు. త్వరగా సవరింపవలసిన లోపము లితరములయినవికూడ నున్నవి. అవి తల్లిదండ్రుల లోను విద్యార్థులలోను ఉపాధ్యాయులలోను నున్నవి.

జీవితపద్ధతి నిర్ణయభారము యొక్క విద్యార్థిదే కాదు. ఆవిషయములో మొదలు బాధ్యతి వహింపవలసినవారు తల్లిదండ్రులు. రెండవబాధ్యత యుపాధ్యాయునిది. ప్రతివాని తెలివితేఁటలకును తల్లిదండ్రులును ఉపాధ్యాయులును కొంత యడ్డుపడుదురు కాని వారి వారి ప్రకృతియే యీయడ్డంకులను చాలవఱకు సవరించుచుండును.

మహనీయుఁడయిన ఫ్రెడరిక్ కళాభిమానియును సంగీతరసికుఁడును అయినందున అతని తల్లిదండ్రులతం డొందులకును బనికిరాని

వాఁడని తలంచుచుండిరి. కాని అతనినుండియే యూరోపుఖండము నంతటికిని రిష్యాకు విశేషమయిన గౌరవమును జెందినది. మైకేల్ యేంజెలో తనచిన్నతనములో కనుపడిన గోడనిండుగాను కనుపడిన బల్లలమీఁదను ప్లానులు వ్రాయు వాఁడు, అందులకతఁడూరక శిక్షననుభవించుచుండెను. అట్టివాఁడు సెంటు పీటర్సు కట్టడము నిర్మాణనుచేతనుసిస్టిన్ దేవాలయ నిర్మాణమువల్లను నిరంతరమయిన కీర్తి సంపాదించినాఁడు. ఔషువారే నాల్డ్స్ అనునతఁడు బొమ్మలు వ్రాయుచున్నందు కతని తల్లిదండ్రు లతని చీవాట్లు పెట్టుచుండిరి. అట్టి యతఁడే రాజకీయ విద్యాపరిషన్నిర్మాతలలో నొకఁడయ్యెను.

రాబర్టుక్లైవు హిందూదేశములో నాంగ్లేయరాజ్యమును స్థాపింపఁగలవాఁ డగునని యెవ్వరు తలంచి యుండిరి? ఈటన్ స్కూలులో మొద్దబ్బాయిగా నుండిన విలింగ్టన్‌వల్ల మహావీరుఁడయిన నెపోలియన్ ఓడిపోవునని యెవరు తలంచియుండిరి?

ఆరీతిగానే స్టగ్గార్టులో సైనిక పాఠశాలకు బేరసారగాఁడుగా నుండిన డేనియల్‌డ్యూఫో పండితుఁడయ్యెను.

కాఁబట్టి ప్రకృతిగానే యొకఁడు తనకు దగు పదవికిఁ జేరుకొనువఱకు నూరకుండఁడు. కాఁబట్టి తల్లిదండ్రులు తగినంత యాలోచన చేసి బిడ్డని కెందులో శిక్ష యొసంగిన మంచిదో వాఁడేవృత్తికి సరిపడునో నిర్ణయించిన మంచిదో యోచించి నిర్ణయించుట మంచిదికదా?

కడపటివిషయము ఉపాధ్యాయుని, గూర్చినది. అతఁడు పిల్లవానియొక్క నిజమయిన ప్రకృతి యెట్టిదో యని నిర్ణయించు కొనవలయును. విద్యార్థి కేకళయందు అభిరుచి యున్నదో ఏ రకమయిన చేదువతనికి సరిపడునో ఉపాధ్యాయుఁడు గమనింపవలయును. చేఁపను నీటిలోవిడిచినచో నీఁదఁగలదు. నీటిబయటవేసిన నీఁదఁగలదా?

కాఁబట్టి యభిరుచికిఁ దగిన విద్యలో విద్యార్థిని బ్రవేశపెట్టవలయును. అతఁడు తన మనఃపద్ధతిని బాగుగా నర్థము చేసికొనుటకుఁ గావలసినన్ని యవకాశముల నొసంగి ఆ మనఃపద్ధతి నెఱుఁగునట్లు చేయవలయును. అతనికిబుద్ధి యభివృద్ధియగునట్లు ప్రయత్నింప వలయును. అట్లు గానియెడల ఒక విద్యార్థికి బోలెడు సరిటిఫికెట్లుండినను వ్యర్థమే.

విద్యానుకూల్యమునకు విద్యా పద్ధతికిని ప్రభుత్వమువారే నియామకులు, వారు దేశమునకు నభ్యుదయ మభివృద్ధి యగునట్లు విద్యావిషయమున మిక్కిలి పొంకము లయిన యేర్పాట్లు శీఘ్రముగా చేయవలయును.

(క. నటేశన్. బి. యె. గారి ఇంగ్లీషు వ్యాసనమున కనువాదము.)

---

# జపానులో పెండ్లిండ్లు

16 మొదలు 18 వర్షముల వయస్సు పర్యంతమును జపానులో వివాహములు జరుగుచుండును. వివాహతంత్ర మంతయు ఆదేశముయొక్క పూర్వాచారము ప్రకారముగా నుండును. కన్యయొక్కతండ్రియే కన్యకొఱకు మొదట వరాన్వేషణము చేయును. పిమ్మట నతఁ డావరునిగుఱించి కన్యకకు సంపూర్ణముగా నన్నివిషయములను వివరించును. అటు పిమ్మట కన్యావరు లిరుగురును సమ్మతించిన యెడల ఆ వివాహము జరుగును. కన్యక తనయొక్క యనిష్టతను ప్రకటించినయెడల ఆ వైముఖ్యమున కెట్టికారణమును లేకున్నను ఆ వివాహము జరుగదు.

అంతేకాక యైరోపాదేశములయందు వివాహమునకు ముందు గుణపరిచయార్థము కలకోర్టుషిప్ పద్ధతి కూడ జపానులోఁ గలదు. వరుఁడు తనప్రేమకుఁ బాత్రమయిన కన్యకనుగూర్చి తనబంధువుల మూలమునఁ దెలిసికొనును. ఇతనియొక్కయు నామెయొక్కయును బందుగులు కన్యావరులయొక్క తల్లిదండ్రుల కావిషయము తెల్పఁగాఁ బెండ్లి నిశ్చయింపఁబడును. ఒకానొక యువకునికిఁ గన్యనిచ్చుటకు ఆమెతండ్రి సమ్మతిపడిన యెడల చుట్టము లందఱును సమావేశమై యా కన్యావరులయొక్క గుణాగుణములను ఆనుకూల్య ప్రాతికూల్యములను విమర్శింతురు. రెండువైపులును సరిపడినచో అప్పటినుండి యా రెండుకుటుంబములకును మర్యాదలు పరస్పరముగా జరుగును. బంధువులు, ఆత్మీయులు, మిత్రులుచేరి పెండ్లి తేదీ నిర్ణయింతురు. ఏ కారణముచేతనయినను ఆవివాహము విచ్ఛేదమగునెడల ఈబంధుమిత్రాదులే యుత్తరవాదులుగా నుందురు.

ప్రాఁతరోజులలోఁ బెండ్లిండ్లు మధ్యాహ్నసమయంబునందు జరుగుచుండినవి. ఇప్పటిరోజులలో సాయంకాలమున జరుగుచున్నవి. పెండ్లికొకరోజుముందుగా గన్యతల్లిచేతఁ గన్యకు 12 సద్విధులు బోధింపఁబడును. ఈయాచారమెన్నియో వందల సంవత్సరములుగా నీదేశమునందు జరుగుచున్నది. అట్లు జపానుదేశపు బెండ్లికాలమునఁ గన్యకు బోధింపఁబడు ద్వాదశ సద్విధులును ఈక్రిందఁ దెల్పఁబడుచున్నవి:—

(1) అమ్మా! ఈపెండ్లికాఁగానే నీవు మాదానవుగా నుండవు. మొదటినుండియు నీవే రీతిగా మాయాజ్ఞకుఁ గట్టువడియుంటివో యట్లే యిప్పటినుండి నీ వత్తమామలకు లోఁబడి యుండవలసినదాన వగుదువు.

(2) నీభర్తకు నీపయిన సంపూర్ణమయిన యధికారముండును. నేఁటినుండి నీభర్తయే

నీకధికారి. ఎల్ల యిహపర వ్యవహారములకును అతఁడే నీకు తోడు. భర్తయొక్క యాజ్ఞ ప్రకారముగాఁ బ్రవర్తించుటయే స్త్రీకత్యుత్తమ ధర్మమని చెప్పఁబడినది.

(3) ఇప్పటినుండియును నీయొక్క ప్రవర్తనకు తల్లికి బదులుగా అత్త మార్గదర్శకురాలగును.

(4) ఎప్పటికయినను భర్తయొక్క నడవడినిగూర్చి సందేహము నొందదగదు. అట్లు భర్తనుగూర్చి యనుమాన మొందునట్టి స్త్రీయందు భర్తయొక్క ప్రేమ పరిహాసభాజనమగును. భర్తవల్ల నేదయినను పొరబాటు జరిగినప్పటికిని నీ వతనియందు కోపము గనుపఱుపరాదు. సహించుకొని యుండి యతఁడు శాంతముగా నున్నప్పుడు మెల్లగా నతని దోసఁగు నతనికిఁ దెల్పవలయును.

(5) మితముగా సంభాషింపుము. తోడి వారితో నెప్పుడును అసంతుష్టితో సంభాషింపవద్దు. అబద్ధ మెప్పుడును పల్కకుము.

(6) ప్రతిదినమును ఉషఃకాలమునందే మేల్కొని రాత్రికాలమున నందఱును నిద్రించినతరువాతఁ బరుండవలయును. పగటివేళ నెప్పుడును నిద్రింపరాదు.

(7) ఏఁబదియేండ్ల యీడు వచ్చువఱకును సాధారణజన సమూహములలోఁగాని ప్రకాశ కార్యములలోఁగాని నీవు పాల్గొనరాదు. అన్నిరకాలవారు చేరు సమూహములలోనికి నీవెప్పుడును బోరాదు.

(8) జ్యోతిష్కులకు నీచేతి నెప్పుడును చూపరాదు,

(9) ఇంటియందు నీవుత్తమమయిన దాసివిగా నుండవలయును; గృహకార్యములయందును, మితవ్యయమునందును నీవు వన్నెగాంచే వలయును.

(10) యౌవనములో నీకుఁ బెండ్లియగును. కాని యితరయువకులతో నీకు విశేషమయిన చేరిక కల్గదు.

(11) ఆడంబరముగా చిత్రవిచిత్రవర్ణముగాను వస్త్రధారణము గావించికొనకుము. ఎల్లప్పుడును నిరాడంబరమయిన మనస్సుతో నిరాడంబరమయిన వేషమును బూనుము.

(12) పుట్టినింటియొక్క వంశద్రవ్యముల గౌరవములతో దేనినిగూర్చి యయినను నీవు గర్వింపరాదు. నీతండ్రి ద్రవ్యవంతుఁడయినప్పటికిని ఆసంబంధమయిన గర్వవాక్యము నీనోట నొక్కటియయినను అత్తగారియింటను భాషింపఁదగదు.

ఈ 12 ఆజ్ఞలును రత్నప్రాయములయినవి. ఆదేశమునందివి యన్నియును వందలకొలది యేండ్లనుండియు మిక్కిలి జాగ్రత్తతోను శ్రద్ధతోను ఆచరణమునం దుంచబడుచున్నవి.

పెండ్లి పెండ్లికొడుకునింటియందే జరుగును. పెండ్లయినమూఁడవనాఁడు దంపతులు కన్యయింటికి వెళ్లుదురు. ఈసంబంధమున నెన్నియో తంత్రాంగములు జరుగును. బందుగు లం

దరికిని పిల్లతండ్రి యొక గొప్ప విందొనరించి గారవించును.

కన్యయింటను గృహప్రవేశము గావించు తఱిని మగపెండ్లిబంధుగులును మిత్రులును వెంబడిరారు. ఉపహారములను బహుమాన వస్తువులను దెత్తురు. విందునందు కన్యకే వైవు వారుపయోగించుఉపహారవస్తువులతోఁబాటు గా వీరియుపహారవస్తువులుగూడవినియోగింపఁ బడును. అప్పుడు పెండ్లికూఁతురుతనభర్త యొసంగిన వస్త్రములనే ధరించును. ఆవస్త్రముల పయిని ఆవంశముయొక్క క్రమాగతమర్యాద చిహ్నము లుండును. దానంజేసి ఆకన్య యిప్పటినుండియును దనతండ్రియింటికిఁ జెందక తనభర్తయింటికిఁ జెందిన దని సూచితమగును.

ఈయుత్సవము మధ్యాహ్నకాలమునఁ బ్రారంభమై బహుశః అర్ధరాత్రివఱకు వివిధ మంగళవాద్యములు బోరుకలంగుచుండఁగా జగురును. భోజనకాలమునఁ గన్యకకును ఆమె తల్లికిని ఆయావ్యక్తులు పరిచితము చేయఁబడుదురు.

పెండ్లయిన రెండుమూఁడు నెలలయనంతర మా నూత్నదంపతు లిష్టబంధువులకు విందొనరింతురు. ఆ విందింటియందో హోటలునందో లేక యొక యుద్యానవనమునందో యేర్పాటు చేయఁబడును.

ఎల్లవిధములను కన్యక తనభర్తతోఁ జేరుటాది యతనికి నెల్లవిషములను అనుకూలముగా నుండనిశ్చయించుకొనును. ఆకన్య యొక్క సదాచారసత్ప్రవర్తనములపయిననే యాకుటుంబముయొక్క భావ్యభ్యుదయము మాధారపడియుండును.

(ఆంగ్ల వ్యాసమునుండి)

—: o :—

# సమస్యలు

(1) నుదిపూఁబోఁడిరో ! ముద్దొసంగఁ గదవే! మోమెత్తి మాటాడవే !!

(2) దేహము నీఁడి పూను మల దేవుని నమ్మియుఁ దీఱుఁగోర్కులున్.

---

వీనిపూర్తులు 1934 వ సం॥ జూన్ మాసాంతములోపల మాకార్యస్థానము నలంకరింపవలయును.

# మన దేశపు చక్కెర పరిశ్రమ

మనకు అవసరములగు వస్తువులలో చక్కెర యొకటి. దీనియుపయోగ మెక్కువ. ఇండియాలో మొత్తముపైని ప్రతి వత్సరము రెండుకోట్ల యరువది లక్షల టన్నుల చక్కెర ఖర్చగుచున్నది.

చక్కెరను తయారుచేయుట కనేకములగు మార్గములు కలవు. అందుఁ జెఱకుగడలవలనఁ దయారగు చక్కెరయే ముఖ్యమైనది. చెఱకువ్యవసాయమునకు హిందూదేశము మిక్కిలి యనువుగ నున్నది. కాని తక్కిన విషయములందువలెనే యీ విషయమునఁగూడ మనము తగిన యుపయోగమును పొందఁజాలకున్నాము.

కాని మనదేశమున స్వదేశీయోద్యమమునకుఁ దగు ప్రోత్సాహము కలిగినకాలఁది విదేశవస్తువుల దిగుమతి తగ్గిపోవుచున్నది. కడచిన 1932-33.సం॥ లో 4 కోట్ల రూపాయిల విలువగల సామానులే దిగుమతియైనవి. విదేశవస్తువులపై వేయఁబడిన సుంకపు పద్ధతి మొలకరెత్తిన స్వదేశీయోద్యమమునకుఁ బ్రోత్సాహము గూర్చుచున్నది.

పైదేశములనుండి దిగుమతియగు చక్కెరను పూర్తిగ బహిష్కరింప వలెనన్న, ఏను లక్షల టన్నుల చెఱకు గడలవలనఁ జక్కెరను తయారుచేయుటకు150కి పైగా ఫ్యాక్టరీలు మనకుఁ గావలసియున్నవి. ప్రస్తుతము మన దేశమున 90 ఫ్యాక్టరీలకు పైగాఁగలవు. ఇంకను 60 ఫ్యాక్టరీలు కావలసియున్నవి.

మన దేశమునఁ జెఱకు వ్యవసాయము కూడ అభివృద్ధి కావలసియున్నది. ఇపుడు ఎకరమున 15 టన్నుల చెఱకు పండుచున్నది. ఆ కృషి చాలదు. ప్రయత్నించిననో సాధారణముగ ఎకరమున 25 టన్నుల చెఱకును పండింపవచ్చును. మంచిచెఱకు విత్తనములకును, క్రొత్త పద్ధతులకుఁ బ్రోత్సాహమొసంగి మన దొరతనము వారు అనుభవముకల తమ వ్యవసాయశాఖోద్యోగుల వలన పై పరిశ్రమ నభివృద్ధిపఱుపవలసి యున్నది. చెఱకువ్యవసాయమునకు సారవంతమగు నేలయు, సమృద్ధిగ నీరును ముఖ్యములు.

చెఱకుపంట హిందూదేశములోనే ప్రారంభమయినదని చాలవఱకు తోచును. చాల పురాతనకాలమునుండియును చెఱకునుండి బెల్లమీదేశములోఁ జేయఁబడుచున్నది. అరబ్బీవ్యాపారస్థుల మూలమున ఆపద్ధతి యూరపునకును, అక్కడినుండి జావాకును, వెస్టిండీసునకును వ్యాపించినది. 1836 మొదలు 1846 వ. సం॥ వఱకు వెస్టిండీసువారు విశేషమైన పెట్టుబడి పెట్టుటచే ఆదేశమునందు చెఱకుపంటయును చక్కెరపరిశ్రమయును అభివృద్ధిఁ జెందినవి. కాని దానినుండి ఇంగ్లండు చక్కెర పరిశ్రమయొక్క స్వేచ్ఛావర్తకపద్ధతి (Free trade policy) హిందూదేశమునందు నశించినది. ఆసమయమునందే జావాలో డచ్చివారు చక్కెరపరిశ్రమను మిక్కిలి యభివృద్ధిఁ జేసినారు. వారికి యూరపునందుఁగూడ బేరమునను పీ లుండుటచేతను యుద్ధమువలన "బీటురూటు" చక్కెరపరిశ్రమ పడిపోవుటవలనను వారియొక్క పైఁజెప్పిన జావాలోని పరిశ్రమాభివృద్ధి కనుకూలత కలిగినది.

1932 సం॥ లో చక్కెరపరిశ్రమ సంరక్షణచేట్టను టారిఫ్ బోర్డులో ప్యాసగుటవలన నిప్పటికి ఏఁబది సంవత్సరములుగా నిలిచిపోయియుండిన చక్కెరపరిశ్రమ మనదేశమున పునరుద్ధరింపఁ బడినది.

ఈ యాక్టునందు ప్రభుత్వమువారు పదునైదు సంవత్సరములవఱకు చక్కెరపరిశ్రమను గాపాడుటకు వాగ్దానము చేసియున్నారు. మిక్కిలి నూతనమయిన నైపుణ్యముతోఁ దయారు కాఁబడిన యంత్రశాలలు

ఈ కార్యమునకై ప్రారంభమయినవి. ప్రారంభము కానున్నవికూడను. కాని ఈయభివృద్ధికి నవీనముగ తీరు మానింపఁబడిన ఎక్సైజుపన్నుపద్ధతి యడ్డుపడుచున్నది.

హిందూదేశమునందు చెఱకుపంటకుఁగాను 30 లక్షల యెకరాల నేల ప్రకృత ముపయోగింపఁబడుచున్నది. దాని వైశాల్య మింకను హెచ్చే వచ్చును. ఈరీతిగ ఇప్పుడు జరుగుచున్న చక్కెర తయారు చేఁతయొక్క అభివృద్ధిని బట్టిచూడగ 1935 వ. సం॥ లో హిందూదేశమునకు పరదేశములనుండి చక్కెర తెప్పింపవలసినపనియే యుండదని తోఁచుచున్నది. ఈ దేశాభ్యుదయ కరమయిన పరిశ్రమకు ఎక్సయిజు పన్నుచట్ట మెంతవఱ కడ్డుకొనునో చెప్పుట కిప్పుడే వీలులేదు. ఆర్థికమంత్రిగా రెన్నికారణములు చెప్పినప్పటికిని చక్కెరపరిశ్రమ తగుపాటి భద్రమయిన స్థితిలో లే దని మాయభిప్రాయము. ఈక్రొత్త ఎక్సయిజు పన్ను అనునది క్రొత్తగ చేక్కెరయంత్రశాల లేర్పడుట కొంతయు నడ్డుపడుచున్నది. చక్కెర యంత్రశాలల యేర్పాటునకుఁ దగిన కూడలిస్థలములింకను ఎన్నియో యున్నవి. పరిశ్రమరక్షణ పద్ధతులింకను సంపూర్ణముగ ప్రతిసంవత్సరము నెక్కువ కాఁగలవు. గతసంవత్సరము చెన్నరాజధానిలో నొక లక్ష యిరువది వేల యెకరాల నేలయును మైసూరు పరగణాలలో నలువది మూఁడువేల యెకరాల నేలయును చెఱకుపంట కుపయోగింపఁబడినది.

మేలురకమయిన నారులు కోయంబుత్తూరులో సిద్ధపఱుపఁబడుచున్నవి. వానినే ప్రకృతము దేశమంతటను వాడుచున్నారు.

ప్రతిసంవత్సరము 50 లక్షల టన్నుల మట్టము చక్కెర తయారగుచున్నది. అంతే కాక యంత్రశాలలలో రెండున్నర లక్షల టన్నులు మేలురకము చక్కెరయును తయారగుచున్నది గమనింపఁబడినట్లు చదు.

ఈ పరిశ్రమ కొలఁది కాలములో నిం యభివృద్ధి నొందినది. కనుక ఈ పరిశ్రమ యడ్డులు లేనిచో మిక్కిలి యభివృద్ధి నొందగలదని మానమ్మనకము. అట్లయినప్పుడు చక్కెరపరిశ్రమను గూర్చి హిందూదేశము గర్వింప వీలుగ నుండును.





ఎ. వి. టి. అయ్యరుగారి అనుమతిని.

నకులసహదేవ రథము

[మహాబలిపురము]

# ఆయుర్వేదప్రహసనము

డాక్టరు. పి. టి. జగన్నాథరావుగారు,

ఎల్. సి. పి. అండు యస్., ఎల్. ఐ. ఎమ్.

[రంగము - నూతన తటాకతీరము.]

ప్రవేశము-వేంకటశాస్త్రి, శంకరసోమయాజి.

వేంకటశాస్త్రి:—(కమలాప్తు నవలోకించి, కనులుమాసి కరయుగముం జేర్చి, గంభీరకంఠస్వరముతో)

శ్లో. నమస్సవిత్రే జగదేకచక్షుషే
జగత్ప్రసూతి స్థితి నాశహేతవే
త్రయీమయాయ త్రిగుణాత్మకాయ
విరించి నారాయణ శంకరాత్మనే.

శంకరసోమయాజి:—అయ్యా! నమస్కారము.

వేంకట:—బ్రాహ్మణోత్తమా! చిరంజీవివి కమ్ము.

శంకర:—మీ యనుష్ఠానమున కింత తడ వేల యయ్యె?

వేంకట:—మహారాజుగారు సపరివారముగ నిచ్చటికి విచ్చేసిరి. వారి దర్శనోత్సవంబున కాల మెట్లో గడచెను.

శంకర:—రాజుగా రిచ్చోటికి కేల వచ్చిరి?

వేంకట:—క్రొత్తగాఁ ద్రవ్వించిన చెఱువును చూచి స్నానము చేయుటకు వచ్చిరి. మీరిచ్చటికి వచ్చుటలేదా? స్నానసంధ్యాదుల నింటనే చేయు చున్న ట్లున్నారే?

శంకర:—నే నింటనే స్నానాది నిత్యకృత్యములం జేసికొనియెదను. ఇట్టి నూతనజలాశయంబులమునుంగుటచే నేదే నొక్క దోషంబు ప్రబలి నిత్యాను ష్ఠానమునకు భంగము గలుగునని నాకు ననుమానము.

వేంకట:—మావంటి ముదుసలిబాపలే స్నానముఁ జేయుచో నీబోటి పడుచువారి కేమి భయ మయ్యా? రాజుగారే వచ్చిరి గదా!

శంకర:—మీరు సెలవిచ్చినదంతయు సరియేగాని మన రాజుగారుకూడ నిచటనే స్నానముఁ జేయ వలెనా? వారి దివ్యహర్మ్యములందలి పన్నీటఁ గాని హంసోదకంబులఁగాని స్నానాదుల నొన ర్చక జనసామాన్యునిం బోలి యిట్లు వర్తింతురా!

వేంకట:—నీకు ప్రాపంచికజ్ఞానము లేశమైనను లేదని నా నమ్మకము. ప్రజాపరిపాలనమందు రాజు లే కార్యమునకైనను సంసిద్ధులై యుండవలయు. మన వంటి పేదబ్రాహ్మణులు సుఖముగ తపస్సు చేసి కొనుటకు తగు వసతులను కల్పించినఁ గదా రాజ్య మున శాంతి.

శంకర:—నన్ను మన్నింపుడు. మనకై కష్టపడు చుండిన యిమ్మహారాజు నన్యథా తలచితిఁ గదా! నే నెంత మందబుద్ధిని?

వేంకట:—ఈ మాటలతో పుణ్యమా పురుషార్థమా? అగ్నికార్యంబునకుఁ దడవయ్యె. మనమింటికిఁబోవుదము రమ్ము.

(గృహాభిముఖులై యిరువురును నిష్క్రమింతురు.)

---

[ద్వితీయరంగము - భోజాంతఃపురము; ప్రవేశము భోజరాజు, బుద్ధిసాగరుడు.]

భోజరాజు:—బుద్ధిసాగరా! చేదోడై నాతో నిన్ని సంవత్సరములు చెలిమిగ వర్తించితివి. ఆపద్బాంధవుఁడవు గదా నీవు!

సీ. రాజ్యభారంబున - రాయబారంబున
మంత్ర మాదేశించు - మంత్రివీవు;
దేశభక్తిని గురు - దేవసద్బ్రాహ్మణ
భక్తినిచ్చలుసల్పు - భవ్యుఁడీవు;
సంగీతసాహిత్య - సకలవిద్యలయందు
మెప్పింపఁగలయట్టి - మేటివీవు;
నిత్యమంగళముల - నేస్తమైస్వామికి

సమకూర్చుచుండెడు - సరసుఁడీవు;
కష్టకాలంబునందేని - గాఢమైత్రి
సల్పుచుం(?)డు పుణ్యుండవు - శాంతమూర్తి!
నీ ఋణంబెట్లు తీర్చెద - నేను బుద్ధి
సాగరా! రమ్ము వే వేగ - శాంతి నిమ్ము.

బుద్ధిసాగరుఁడు:—రాజశేఖరా! ఎంతటి మాట! ఋణమా!! మన కిరువురకును శరీరంబులు రెండైనను ఆత్మ యొక్కటియై యున్నది కదా! నీవే నేను; నేన నీవు; కాన భేద మెక్కడిది?

గీ. రాజయోగానుభూతిని - రాజమైత్రి
రాజకీయబంధమున సం - ప్రాప్తమయ్యె
తనువు తాల్చుట ప్రారబ్ధ - మనుభవింపఁ
గాక యాత్మలు రెండుగాఁ-గలవె యెందు.(మనకు)

భోజ:—మంత్రీ! నీది సార్థకనామ మయ్యెఁగదా! రాజ్యపరిపాలనంబున విశేషము లెవ్వియైనఁగలవా?

బుద్ధి:—ప్రభూ! రాజ్యవిషయమై మీ రాలోచింప వలదు. వైద్యవరులు గల పలుదేశములకు మీవర్తమానంబ నంపితి.

కం. మన యాస్థానభిషగ్వరుఁ
గని చర్చింపంగ నెంచు - ఘనవైద్యుల ర
మ్మని పనిచితి వచ్చెద రిఁకఁ
జను మనముందరను శాస్త్రి చర్చ నృపాలా!
నేవకా! ఇటురమ్ము.

భటుడు:—(ప్రవేశించి) చిత్తము స్వామీ! దేవర వారి యాజ్ఞ.

బుద్ధి:—వైద్యశాల కీక్షణంబ వెడలి మన యాస్థానపు వైద్యు నిటకుఁ దోడ్కొని రమ్ము. దేశాంతరము నుండి వచ్చిన భిషగ్వరులను కూడ రమ్మనుము.

భటుఁడు:—చిత్తము స్వామీ! (నిష్క్రమించును.)

భోజ:—కం. ఏ మందు నాదు కర్మం
బే మందున్ నాదె జాడ్య-మించుక యే న
య్యో మంత్రి! మాన్పఁజాలదు,
రామునికృప యెపుడుమనకు-రాఁగలదొగదా!
(విచారపడుచు నిట్టూర్పు విడుచును.)

(భటుఁడు ప్రవేశించును.)

భటుఁడు:—స్వామీ! వైద్యులవారు వచ్చియున్నారు.

బుద్ధి:—ఓరీ! వారిని లోనికిఁ బంపి నీవువాకిటనుండుము.

భటుఁడు:—చిత్తము, స్వామీ! (నిష్క్రమించును.)

వైద్యుఁడు:—(ప్రవేశించి) నమస్కారము.

బుద్ధి:—వైద్యశిఖామణీ! కాలము వ్యర్థముగాఁ నడచుచున్నది. మీ రాలోచించినదెద్ది? అవశ్య కార్యక్రమంబెట్లుండును?

వైద్య:—సాధ్యమైనంతవఱకు నీ యంశమునుఁగూర్చి ప్రశ్నించితిమి. మా కీ నిదానంబు పూర్ణముగఁ గోచరంబగుటలేదు. స్వామీ! ఒకవేళ కర్మజంబై యుండునా? "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్" అనెడి వచనానుసారముగా సూర్యనమస్కారములం జేయించెదము.

భోజ:—వైద్యశాస్త్రి మింతవఱకు నైనది. ఇఁక మంత్రశాస్త్రిమా?

వైద్య:—గీ. స్నేహపవస్తి క్రియలసం - సిద్ధునిఁ జేసి
శోధనార్హ మదనఫల - క్వాథమునిడి,
అస్థినిస్థితవాతసం - హారకముల
నొసఁగి చేసితినిచికిత్స - విసువుపుట్టె.

నే మఱేమి చేయఁగలను దేవా!

భోజ:—కం. ఆయుర్వేదంబునకై
యాయుర్ధనములసకలంబు - వ్యయమున్ జేయన్
న్యాయము లుపన్యసింతురు
సాయముఁ జేయంగలేరు - సమయంబైనన్.
(సశేషము.)

# సంతాననిరోధము

సంతాన నిరోధ మనునది గర్భధారణము నడ్డగించుటకుఁ బూనఁబడు పద్ధతి. కుటుంబమునకు జీవికను సంపాదించువాని సంపాదన పరిమితిని మించి పోకుండునట్లు కుటుంబ వృద్ధిని నియమించుటయను కార్య మవలంబింపఁ బడవలసి యున్నది. ఏ దేశమునందైనను పరిమితికి మించిపోవునట్టి జనసంఖ్య యొక్క అభివృద్ధిని అడ్డుకోవలసియేయున్నది.

హిందూదేశమునందు సంతానవృద్ధి వేగముగా జరుగుచున్నది. పంటను నీటిపారుదలను చేతిపనులను విరివిగాను, వేగముగాను, అభివృద్ధి చేయుటవలన ఈ జనసంఖ్యాభివృద్ధి యొత్తిడిని కొంతవఱ కడ్డగింపవచ్చును. కఱవుల మూలమునను, అంటురోగములమూలమునను గూడ అప్పుడప్పుడు గొప్ప మొత్తములుగానే జనసంఖ్య తగ్గుచుండును. మిక్కిలి అరుదుగా యుద్ధములుగూడ సంభవించి జనక్షయము గలిగించును. ఈ 20-వ శతాబ్దమునందు భూమండలమునందు దాదాపుగ సర్వభాగములును ఆక్రమింపఁబడియుండుటచే నితర దేశమునకు వలసబోవుట యను మాట నెత్తుకొనుటకు వీలు లేదుగదా? అట్లయినప్పుడు హిందూదేశమునందు అవలంబింపవలసిన నియమమేది? హిందూదేశమునందు చాలమట్టుకు పెండ్లియైనవారు గలరు. కొంతకాలము పెండ్లిండ్లను నిలిపినచో జనసంఖ్యాభివృద్ధి తగ్గును. శరీర శాస్త్ర ప్రకారముగ యౌవనవంతులయిన స్త్రీపురుషులను సాంగత్యము వదలి బ్రహ్మచర్యము నవలంబించుడని కోరఁదగదు. అతి ప్రౌఢావివాహములలోనైనను కానుపుల మధ్యను తగినంత కాలవ్యవధి యుండునట్లు చేయనియెడల సంతానరూపముగ విశేష నష్టము కలుగఁగలదు. కాఁబట్టి సంతాన నిరోధమునకు కొన్ని పద్ధతులు అవలంబింపఁ బడవలెను. మైసూరు ప్రభుత్వమువారు ఈ విషయమునుగురించి దీర్ఘాలోచన చేసియే లోకులయొక్క విమర్శనలకు జంకక సంతాన నిరోధనమునకు తగిన తోడ్పాటును సలహారూపముగాను వైద్యరూపముగాను ఒసగుచున్నారని వినుట యెంతయు మెచ్చదగియున్నది.

పాశ్చాత్యధర్మము ప్రకారమును, సనాతన ధర్మముప్రకారమును సంతాననిరోధము ఒప్పుకొనఁబడ లేదు. శాస్త్రాభివృద్ధి నెప్పుడును సంఘాచారములు అడ్డుకొనుచునే యున్నవి. టీకాలు వేయుటను క్లోరోఫారం పద్ధతిని ఆచారము లడ్డుకొనలేదా? అంతయెందుకు? ఆసుపత్రులలో మందులు తీసుకొనమను పూర్వాచారపరాయణు లిప్పటికిని గలరు.

సంతాననిరోధ మనునది స్త్రీలచేతనే యామోదింపఁ బడవలెను. తాము కేవలము బిడ్డలను కనునట్టి యంత్రములుగా జేయఁ బడకుండుటకుగాను స్త్రీలు ప్రతిఘటింప వలసియున్నది. మీదమీద కానుపులగుటవల్ల స్త్రీలయొక్క యారోగ్యము దేహపటుత్వము స్వాతంత్ర్యము, విశ్రాంతి పాడైపోవుచున్నది. అనేక స్త్రీలు ఊరక బిడ్డలను గని పెంచలేక గర్భస్రావములకుఁ గూడ ప్రయత్నింతురు. గర్భస్రావము చేసికొనుట యనునది చట్టమునకును, ప్రకృతికిని విరుద్ధమైనది. అది, కొన్నికొన్ని సమయములలో గర్భిణికి ప్రాణాపాయముగూడ గలుగును. దేహపటుత్వము తప్పక తగ్గును. మతాచారమను నెపముతో స్త్రీలకు, స్త్రీల యెడల సంతాననిరోధపద్ధతి యుపయోగింపఁ బడుటలేదు. చెప్పగూడదు గాని సంతానము మాటిమాటికి కలుగుచున్న యెడల స్త్రీలకుఁ గలుగునట్టి ఖంగారు చాల విశేషముగ నుండును.

ప్రభుత్వమువారు సంతాన నిరోధపద్ధతులను ప్రజలలో వ్యాపింపఁజేయ నున్నారని వినఁబడుచున్నది. ప్రభుత్వ వైద్యశాలలలోను, పురపాలక వైద్యశాలలలోను సంతాన నిరోధ పద్ధతులు స్త్రీలకు బోధింపఁ బడవలెను. దీనివలన వ్యక్తులకును, కుటుంబములకును, దేశమునకును, తప్పక లాభము కలుగఁగలదు.

## మంచి యారోగ్యము

ఏ వృత్తిలోనుండినను నెట్టి యంతరువులో నుండినను ప్రతివ్యక్తికిని ఆరోగ్యము చాల ముఖ్యమయినది. ఈయారోగ్యలాభము నిక్కముగా కల్గవలయునన్నచో కావలసినన్ని విటమినులు (జీవాణువులు) గల యాహారమును పుచ్చుకొనవలయును. ఆహారమునందు "బి" విటమినులు తక్కువగానున్నచో చర్మవ్యాధులును మలబద్ధకమును అజీర్ణబాధలు మొదలయినవి కల్గును. అనేకులు "బి" విటమినులను చేర్చుకొనుట లేదు.

"డి" విటమినులు తిండియందు తగ్గినచో శరీరము చిక్కిపోవును. ఆ విటమినులు నవనవలాడు పండ్లలోను కూరగాయలలోను నుండును.

"ఎ" విటమినులవలన నెంతయో లాభము కలదు. వానివలన కలరా మొదలయిన వ్యాధుల వ్యాప్తి యడ్డగింపఁబడును. కాఁబట్టి యవి జబ్బులురాకుండ నడ్డగించునవి యని చెప్పవలసియున్నది.

"డి" విటమినులవల్ల నెముకల జబ్బులు హరింపఁబడును. కాడ్లివరు ఆయిలులో "ఎ" "డి" విటమినులు కలవు. నిమ్మపండు రసములో "సి" విటమినులుకలవు.

అనేకులయిన వైద్యులు ఆహారమువలనఁ గల విశేషమయిన ఫలమును గమనింపక సంపూర్ణముగా నౌషధముల పయినే

యాధారపడుచేున్నారు. ఈ దేశమునందు విశేషముగా విటమిన్లుగల యాహారము నేర్పాటుచేయవలసిన ప్రశ్న చాల ముఖ్యమ యినది. జాగ్రత్తగా నిర్ణయింపఁబడిన భోజన పద్ధతివల్లనే వ్యాధులు కుదురును; లేదా వాని దుర్గుణము చాల తగ్గింపఁబడును. ఒకా నొకయాయుర్వేదవైద్యుఁడు (Neuresthe ni'a) జబ్బుగల యొకరోగికి ఆహారమానం దొకమోతాదు నేతిని విధించినాఁడు. అతని కావ్యాధి నిమ్మళించినది. రోగమును కుదుర్చు టకు మందు లోకమెత్తు. అనుపానపథ్యము లోకమెత్తు. మందులవలనఁ గుదురని రోగము ఉచితాహారస్వీకారమువలనఁ గుదురఁగలదు. మఱియు రోగము కుదురుటకును, మంచి యారోగ్యమునకును మనో నైర్మల్యమును, చిత్తస్థైర్యమును ప్రధానకారణములు.

---

# సమస్యాపూర్తులు

"శ్రీ"

(౧) (1) మ. పరమామ్నాయనికాయబోధిత, మఘవ్యాపార నిర్వాపణ
స్ఫురితోదారవిలాస, నింద్రవనరుట్సూత్యాది బృందారకా
కరనిత్యాచరణీయ, మాధ్యశుభదాకారంబు, శ్రీ చంద్రశే
(ఖర పాదాంబుజసేవకన్నఁ గలదే కానాచి భక్తాళికిన్ ? ?)

(2) మ. సరసీజాతభవాండ భాండ పరిరక్షాదక్ష. బాహాగ్రలో
ద్ధురకోదండగుణస్వనారభటి నిర్ఘాతాతిభీదాయకా
సురసంఘాతక దేవతావన శుభశ్లోకాహరీడ్వంశ శే
(ఖరపాదాంబుజ ... ... ... ? ?)

(౨) (1) మ. దరదక్షేక్షణ ! "పోర నష్టియును, బొందన్ లాభ" మన్నట్టి భా
నురసూక్తిన్ విడనాడి, తీరని వెతం జొబ్బిల్లగాఁ జేయు సం
గర మెచ్చున్ - మరి పొందు వల్వదె ? చమూకాండాంబుజారామకుం
(జరమా నీచరణంబు మా కిడు నుదంచత్సౌఖ్యముం గాదొకో ? ?)

(2) మ. సరిదీశానసుతాకళత్ర ! సముదంచత్పాపకాంతారడం
బరనిర్వాపణకీలికీలయు, మహామ్నాయాప్రమేయాతిభా
నురమున్, సంసరణవ్యథాచయ తిరస్కుర్వన్మహావజ్రపం
(జరమా నీ చరణంబు మా కిడు ... ... ... ? ?)

కరి నారాయణాచార్యులుగారు

(౧) మ. ఖరపాదాయుత భాసమానవిషపూత్కారప్రసారాతిభీ
కరపాకారిపవీద్ధదంతగణయుక్కాళీయనాగస్ఫటా
భరపాళీనటనాతికౌశల విభాస్వద్ధీరగోపాలశే
(ఖరపాదాంబుజసేవకన్నఁగలదే కాణాచిభక్తాళికిన్ ? ?)

(౨) మ. పరమౌదార్యదయాది మంగళగుణావాసా ! రమేశా ! నిశా
కరమాళ్యాత్మ శిరోధృతోత్తమనభో గంగోద్భవస్థానమై
సురమాన్యాది సమస్తభక్తజనతా శుంభన్మనఃకీర పం
(జరమా నీ చరణంబు మా కిడు సుదంచత్సౌఖ్యముంగాదొకో? ?)

బండారు తమ్మయ్యగారు

(౧) మ. సిరులవ్వారిగ నిచ్చునీయిహమునన్, శ్రీఘంబ పోఁగార్చిదు
స్తరదారిద్ర్య దవానలప్రభవ సంతాపైకభారంబు, సు
స్థిరనిర్వాణపదంబు నాపరమునన్ జేకూర్చు శీతాంశుశే
(ఖరపాదాంబుజసేవకన్నఁగలదే కాణాచి భక్తాళికిన్ ? ?)

(౨) మ. దురితంబుల్ హరియించి, దుఃఖతిమిరస్తోమంబు మాయించి, ఒల్
సిరులంగూర్చి, రుజాళిమాన్చి, సకలశ్రేయస్కరంబై రహిన్
బరమేశా ! నిరతంబు నీభవమునన్ భక్తాళికిన్ వజ్ర పం
(జరమా నీ చరణంబుమా కిడు సుదంచత్సౌఖ్యమున్ గాదొకో? ?)

విద్వాన్-అయితం. కాళీవరప్రసాద రాయకవిగారు.

(౧) మ. పరమాహ్లాదకరం, బభంగవిభవప్రాజ్యంబు, పూజ్యంబు, భీ
కరదోషాంతకభవ్యతేజము, మహాకల్యాణగణ్యంబు, మో
క్షరమారమ్యము, మానిమానసవిరాజద్దీప, మర్ధేందుశే
(ఖరపాదాంబుజసేవకన్నగలదే కాణాచి భక్తాళికిన్ ? ?)

(౨) మ. సిరికిన్ సత్కళ, కాళియాహికభయశ్రీ, మానివర్యాత్మసుం
దరికిన్ శాపవిముక్తి, గంగకుఁ బవిత్రత్వంబు గల్పించి, సుం

దరమై, కేసరిపు త్రిముఖ్యులకు నిత్యంబున్ మహావజ్ర పం
(జరమా నీ చరణంబుమాకిడు నుదంచత్సౌఖ్యముంగాదొకో? ?)

కొ. వేం. సుబ్బరాఘవయ్యగారు

(౧) మ. పరమంబై, సకలతమోభ్రపటలీపర్యంతమై నిత్యమై,
నిరహంకారమునై, నిరంజనమునై, నిర్దోషమై, నిర్వికల్పరమేద్యంబునునై, మహావిభవసంపన్నంబునౌ చంద్ర శే
(ఖరపాదాంబుజసేవకన్నఁగలదే కాణాచి భక్తాళికిఁ? ?)

(౨) మ. పరమాశాపరిపూర్ణతాతివికలస్వాంతంబుతో నైహిక
స్ఫురణంబెంతయుఁగష్టకారియనియుఁ మోహొంగనాసమ్మదం
బరయఁ వేడఁగ దేవసన్నుత! జగద్వ్యాపీ! సుహృత్కిర పం
(జరమా నీ చరణంబుమా కిడు నుదంచ త్సౌఖ్యముంగాదొకో? ?)

శృంగారకవి-పల్లంరాజుగారు

(౧) మ. వరసౌఖ్యంబుల వీడి నిశ్చలమనోవాక్కాయకర్మంబులన్
బరమున్ దన్ను భజించువారల మహానందాంబుధిన్ దేల్చుచున్
స్థిరసాయుజ్యముఁగూర్చుచున్ గరుణతో దీపించు నా చంద్ర శే
(ఖరపాదాంబుజసేవకన్నఁ గలదే కాణాచి భక్తాళికిఁ ? ?)

(౨) మ. వరదానంబు లొసంగుచున్న బలి నీపాదాంబుజద్వంద్వమున్
శిరమం దూనఁ బదత్రయం బడిగి తచ్ఛీర్షంబునున్ద్రొక్కి సు
స్థిరపాతాళనివేశనంబిడిన లక్ష్మీనాథ! తన్మక్తి పం
(జరమా నీచరణంబు మా కిడు నుదంచత్సౌఖ్యముఁగాదొకో ? ?)

త్యాడీ-వేంకటశాస్త్రిగారు

(౧) మ. ధర నేకీకృతహృద్వచఃకరణవిధ్వంసీకృతస్వీయనిం
ద్యరజస్తామసహైన్యదుర్భరగుణాంతర్బాహ్యదుష్టేంద్రియా
కరముం గాని యనూన నిశ్చలమనస్సౌఖ్యంబియ్యఁగాఁజంద్ర శే
(ఖరపాదాంబుజసేవకన్నఁగలదే కాణాచిభక్తాళికిన్ ??)

(౨) మ. హరి! నీరేజదళాక్షు! మాధవ! గతాహంకారచిత్తాబ్జభా
స్కరమున్ సర్వశుభాస్పదంబునుతలోకవ్రాతమున్ నిత్యభా
స్వరమున్ భక్తజనాశ్రయంబుఁగవిసర్వస్వంబుదీనాత్మ పం
(జరమా నీ చరణంబు మాకిడు సుదంచత్సౌఖ్యముంగాదొకో ??)

కవితాకోవిద-రావిపాటి-లక్ష్మీనారాయణగారు

(౧) మ. హరసాయుజ్యముఁ బొంద శేవ, దురితాత్యాచారసందోహసం
హరణప్రాప్తికిఁద్రోవ, క్రోధమదమత్స్యగ్రాహనక్రాన్వితో
త్కరవిస్తారభవాంబురాశిఁ గడువంగా నావ, యా చంద్రశే
(ఖరపాదాంబుజసేవకన్నఁగలదే కాణాచి భక్తాళికిన్ ??)

(౨) మ. సరసీజేక్షణ! నిన్ను నమ్మితి సుమా! సంసారబంధంబులన్
హరియింపంగదె? కోరనొల్ల మిహసౌఖ్యంబుల్ ; భవాంభోధి దు
ర్భరమో దేవ ! మదీయ చిత్తమను కీరం బున్నసొంపైన పం
(జరమా నీచరణంబుమా కిడునుదంచత్సౌఖ్యముంగాదొకో ??)

అద్దేపల్లి - లక్ష్మణస్వామి గారు

“ శరదిందుప్రతిమాన భానుర సహస్రజ్యోతి శోభాన్వితాం
తరవిస్తారిత కీర్తిసాంద్ర, కరుణాదాక్షిణ్యచిద్రూపుఁ డీ
శ్వరుఁడుర్వీ శంకరుఁడాదిదేవుఁడన విశ్వస్తుత్యుఁడౌ చంద్రశే
(ఖరపాదాంబుజ సేవకన్నఁ గలదే? కాణాచి భక్తాళికిన్ ??)



## వార్తలు—విశేషములు

శ్రీ నైజాం ప్రభువుగారి చిన్నకొమరుల యిన శ్రీ మేజాంజాబహాదరుగారు నగరాభి వృద్ధి నిర్మాణసభకు డైరెక్టరుగా నియమింపఁబడిరి. మహాప్రభువులుగూడ ఈరీతిగా నిగర్వముగా ఉద్యోగకార్యములందుఁ బాల్గొనుట దేశముయొక్క భాగ్యమనవలయును.

---

ముప్పదుగురు జర్మనులు హిమాలయ శిఖరము నెక్కుటకు వచ్చి కాశ్మీరములోని శ్రీనగరమునుండి కాలినడకతో వెళ్లుచున్నారు.

---

పాట్నాసమీపమున విక్రమగ్రామములో ఒకబావిని బాగుచేయుచుండఁగా దాని అడుగునుండి పొగ రాసాఁగినది. అందుకు జనులు భయపడుచున్నారు.

---

దర్భాంగాలోను చుట్టుపట్లను మరల కొంచెము భూకంపము గల్గినట్లు తెలిసినది గాని నష్టమేదియును గల్గినట్లు లేదు.

---

లయార్‌పూరులో ఒకానొక యువకుఁడు తల్లిమరణమువలని దుఃఖభారమున ఆత్మహత్య చేసికొన్నాఁడు.

---

దూరశ్రవణ యంత్రముల మూలమున చేక్కని కథలు చెప్పఁబడుచున్నవి.

---

గ్లాసు అద్దములు పగిలిపోవును గనుక అల్యూమినియం అద్దములు తయారగుచున్నవి. అవి పగులవు.

---

మాస్కోలో పరిశీలనయందలి డాక్టరులు మానవ నిర్మితహృదయమును తయారుచేసి యున్నారు. హృద్రోగము గల వారి హృదయ స్థానములలో దానిని ఉంచి వారి శరీర హృదయములను బయటకుఁ దీసి బాగుచేయవచ్చునఁట.

---

న్యూయార్కులో ఒక స్త్రీయొక్క యుదరములోనుండి 1200 కు తక్కువలేని యినుప సామానులను ఆపరేషన్ మూలమున బయటికిఁ దీసినారు. అందు, 77 బోల్టులు 728 చిన్నమేకులు, 83 గుండుసూదులు, 80 మరచీలలుగూడ నుండినవి. ఇవన్నియును దిన్న కారణ మేమని యడుగఁగా - ఉల్లాసార్థమని యామె బదులు చెప్పినది.

---

యన్. టి. పి. యూనియన్ - నరసాపురము

ఈ సమాజమువలన ప్రతిసంవత్సరమును ఆంధ్ర స్త్రీల పోటీపరీక్షలు జరుపఁబడుచు, కృతార్థులయినవారికి బహుమానము లొసంగబడుచున్నవి. ఈ యుద్యమమువలన ఆంధ్ర స్త్రీలలో తప్పక విద్యావ్యాపన మేర్పడునని చెప్పనగును. వివరములకుఁగాను "అద్దంకి బిందుమాధవరావుగారు, కార్యదర్శి, యన్. టి. పి. యూనియన్, నర్సాపురము వెస్టుగోదావరిజిల్లా" అను చిరునామాకు వ్రాయవలెను.

---

# గతసంచికయందలి శ్లిష్టాక్షర పదబంధము

## ఉత్తరములు

### నిలువరుస

1. రాజ్యాపు.
2. లిభి.
3. త్రవు.
4. మువ్వలు.
6. దున్న.
8. నిహతి.
9. కయిత.
12. నీరాకావి.
13. ధాత.
15. మిటారి.
16. మామ.
17. లిపి.

### అడ్డవరుస

1. రాచమాలి.
3. త్రస్తము.
5. భిదువు.
7. ముని.
9. కలు.
10. హరి.
11. కయి.
12. నీతి.
14. తమి.
16. మాతలి.
18. విక్రమ.
19. పిప్పిరి.

రుసుముతోఁగూడ ఇందులకుఁ బ్రత్యుత్తరములు పంపినవారు.

I 1. ఒంగోలు - చివుకుల విశ్వనాథశాస్త్రిగారు.

2. కారుపల్లి-కోదండరామయ్యగారు నేలముజిల్లా-బాగలూరు.

3. మ॥ యం. ముక్తీశ్వర రావుగారు గుంటూరు జిల్లా - తెనాలితాలూకా - కొల్లిపరపోస్టు మేస్టరుగారు.

మీఁది ముగ్గురును యే పొరపాటును లేక పూర్తి చేసినారు.

II 1. ఉభయభాషా ప్రవీణ చింతలపూడి - శేష గిరి రావుగారు, ఇ. బి. హెచ్. స్కూలు టీచరు గుంటూరుజిల్లా - పొన్నూరు.

2. మేడూరు - వేంకటసుబ్బయ్యగారు బి. యె. బి. యిడి. ఆత్మకూరు - కర్నూలుజిల్లా.

3. శ్రీ పాకల - చంద్రకాంతామణిగారు c/o మ॥ రావుసాహెబ్. పి. వి. నారాయణరావు పాత్రుడుగారు, బరంపురము.

4. శ్రీ వరిగొండ - అప్పలరావుగారు విశాఖపట్టణముజిల్లా - అనకాపల్లి తాలూకా ములగపాకపోస్టు అఫీసు.

పైవారు ఒక పొరపాటుతో పూర్తిచేసిపంపినారు.

ఇందు మొదటిరకములో పూర్తిచేసినవారికి అయిదు మాసములవఱకును రెండవ రకములో పూర్తిచేసిన వారికి మూఁడుమాసములవఱకు చంద్రికా పత్రిక గత సంచికలోని ప్రకటన ప్రకారము ఉచితముగ పంపఁబడును.

---

# సంపాదకీయములు

## శ్రీమహానంది వైశ్యసభలు

కర్నూలు మునిసిపల్ చేర్మనుగారైన అచ్చయ్య శ్రేష్ఠిగారి ఆహ్వాన సంఘాధ్యక్షత్వమునను, శ్రీజమీన్దారు మోతే, నారాయణ రావు బహద్దరువారి యాజమాన్యమునను శ్రీ మహానందిక్షేత్రములో మే నెలలో 17 వ ఆర్యవైశ్యమహాసభ జయప్రదముగా జేరిగిన దని తెలుప సంతసించుచున్నాము. ఆసభతోఁ గూడ వ్యాయామసభయును, ఆర్యవైశ్య కవి పండిత సన్మానసభయును, ఆర్యవైశ్య యువ జనసభయును, ఆర్యవైశ్యమహిళాసభయును, అఖిలభారతవస్తు ప్రదర్శనము జరిగినవి.

మహిళాసభయందు శ్రీ కొల్లా కనకవల్లి తాయారమ్మగారు అధ్యక్షత్వము వహించి మిక్కిలి మనోహరమైన యుపన్యాసమొసంగి విముఖముగా నుండిన సభను సుముఖము గావించుకొన్నారు. మహా సభయందు శ్రీ కొల్లూరి సూర్యనారాయణగుప్తగారు మొదలయిన యార్య వైశ్యయువకులు చూపిన బుద్ధిపాటవము కొనియాడఁదగినది.

కవి పండిత సన్మానసభను కులమహా సభలకు ఆంగికముగా జరిగించు పద్ధతిని ఈ మహాసభయే ప్రారంభించిన దనవచ్చును. దాని ప్రారంభకులగు శ్రీ దోమా - వేంకట స్వామిగుప్తగారి యుపన్యాసము ఉన్న సంగతులను తేటతెల్లముగా తెలుపునదై యుండినది. అధ్యక్షులయిన నాళము. కృష్ణరావుగారి యుపన్యాసము భాషావిశేష భూయిష్ఠమై సభారంజకముగా నుండినది. కొందఱు స్త్రీలు ఉపన్యాసములు కావించిరి. ఒకరిద్దరు కవీశ్వరులు పద్యములఁ జెదివిరి. మహాసభకార్యక్రమముయొక్క యొత్తిడింజేసి విద్వాంసులయిన శ్రీ దాచేపల్లి - రామ బ్రహ్మాచార్యులు మొదలయిన వారి యుపన్యాసములకు అవకాశములేక పోయినది.

మాటకారి తనమునకు మేటులనిపించుకొన్న కవిపండితుల సభకు అవకాశము చాల తక్కువగా నుండుటవలన నాసభ మిక్కిలి యసమగ్రముగా జరిగెను. ఆర్యవైశ్యుల యభ్యుదయమునకు విద్యాభివృద్ధియును ఐకమత్యమును ఆయువుపట్టులు, విద్యాభివృద్ధి భాషాజ్ఞానము లేక జరుగదు. బుద్ధివికాసమునకు మాతృభాష మిక్కిలి యుపకరింపఁగలదు. దాని ప్రాముఖ్యమును విశేషముగాఁ జెప్పవలసిన పనిలేదు. ఒక దృష్టాంతము చెప్పెదము. ఎంత యమ్. ఎ. చదివినవాఁ డయినను సరే ఆంధ్రుఁడు తనలో నాలోచించుకొను నప్పుడు "ఏమి చేయుదును?" అనుకొనును గాని "What can I do" అని అనుకొనఁడుగదా? కాబట్టి రాఁబోవు ఆర్యవైశ్య కవిపండిత సన్మానసభలలో పండితుల యుపన్యాసములకు కవీశ్వరుల కళాప్రదర్శనమునకు తగినంత యవకాశ మురడవలయునని మా కోరిక.

ఆర్యవైశ్య యువజనసభయును మ. రా. రా. శ్రీ. యమ్. వి. పాపన్న గుప్తగారి యాజమాన్యమున బాగుగా జరిగిన దని తెలియుచున్నది. మహాసభ కార్యదర్శి గార యిన శ్రీ నంద్యాల రాజా పెద్ద సుబ్బరా యుఁడు శ్రేష్ఠిగారు ఈ మహాసభలు జరుగు టకుగాను కావించిన ప్రయత్నము, పడిన శ్రమ వర్ణనాతీతములు. అన్ని పనుల కన్ని రూపులయి వారు కనపడుచుండిరఁట.

ఇంకను శ్రీబారిష్టరు - ఆదినారాయణ శ్రేష్ఠిగారు మహాసభా ప్రారంభమును హిందూపురము మునిసిపల్ చేర్మను గారయిన శ్రీదొంతు-భీమయ్యశ్రేష్ఠిగారు వస్తుప్రదర్శన సన్మానములను గావించిరి.

స్వాగతపద్యము లెన్నియో చదువఁ బడి నవి. సంక్షేపమునకుఁగాను శ్రీ దోమా-వేంక టస్వామిగుప్తగారి పద్యములలో నొకదానిని మాత్రము ఈ క్రింద నుదాహరించుచు న్నాను.

శా. 'ధోంధోం థక్కిట'యంచు బల్లపయిఁగ్రు
ద్దుల్ గ్రుద్ది గాంభీర్య మే
యంతుంబొంతును లేని యట్లుగ నుప
న్యాసంబు లీ నేల ? సు
స్వాంతోదంచిత కార్యదీక్షకయి సం
ప్రార్థించి యీ పాటి కే
'నొంతత్స' త్తని విన్నపంబుసకు నం
తోష్యస్తి గ్గావించెదన్.

ఆంధ్రులు—హిందీభాషాభ్యాసము

ప్రస్తుతము మన యాంధ్రులకుఁ బొరు గింటి పుల్లకూర రుచి యైపోయినది. మన వారు మన దేశభాషాభిమానమును విడిచి తెనుఁగుతల్లిని గౌరవించుటమాని హిందీ భాషాభ్యాసమున మునింగి యున్నారు— దానివలన తెలుఁగుభాష యభివృద్ధిని పొందు టకుఁ దీరని కొఱంత కలుగుచున్నది.

హిందీభాష నభ్యసించుట తప్పని మా యాశయముకాదు. హిందీ హిందూస్థాన మంతటికిని రాష్ట్రభాషయగుట కర్హమై యున్నది. కాని యాంధ్రమును విడిచిపెట్టి మాత్రము హిందీ నభ్యసించుట యుచితము కాదు. తెలుఁగుభాష హిందూదేశమునఁ గల భాషలలోఁ దృతీయస్థానము నలంకరించి యున్నది. తెలుఁగు హిందూదేశమందలి ఆంధ్రేతరుల మన్ననలకే కాక ఖండాంతరుల మన్ననలకుఁ గూడ మిక్కిలి పాత్రమైయున్నది. అది మిక్కిలి మధురమగు భాష. విశేషించి యాంధ్రు లందఱికిని కన్నతల్లి.

కావున దేశభాషాభిమానులగు నాంధ్రు లెల్లరును హిందీభాషయెడఁ బూను శ్రద్ధలో సగమైనను, ఆంధ్రభాష పట్లఁజూపిన, భాష కును, వాఙ్మయమునకును, వన్నెయు, వాసియు చేకూఱఁగలవు.

స్త్రీలు—విద్యాభివృద్ధి

దేశాభివృద్ధి కావలయునన్నచో స్త్రీ పురుషభేదములేని విద్యాభివృద్ధి ముఖ్య

ముగఁ గావలసియున్నది. స్త్రీలు విద్యావతులు కానిచో వారు దేశాభివృద్ధికిఁ దగిన రీతిని సాయపడుట దుర్ఘటము. మన దేశమున స్త్రీవిద్య యభివృద్ధి పొందుటకు వలయు సౌకర్యములు చాల తక్కువ. స్త్రీలకుఁ బ్రత్యేకింపఁబడియుండు ఉన్నతపాఠశాల జిల్లాకొక్కటియైన నుండుటయే దుర్ఘటమైనది. దేశము మొత్తమున నొక్కకళాశాలయైనను లేకపోయినది. ఇట్టియెడ వారి విద్యాభివృద్ధి ఎట్లు కలుగఁగలదో యూహింపనగును.

దేశ దౌర్భాగ్యమును రూపుమాపుటలో స్త్రీ పురుషులిరువురును సమానమగు హక్కు కలిగియున్నారు. ముఖ్యములగు కొన్ని విషయములలో - అనఁగా - సంతాన నిరోధము ప్రౌఢావివాహము - మొదలగు వానిలో స్త్రీలు మిగుల పరిశ్రమించి చర్చించి సిద్ధాంతీకరింపవలసిన సంగతు లనేకములు కలవు. ఉచితమగు విద్యలేక వారు వానిని పరిష్కరించుట దుర్ఘటము.

ప్రస్తుతపు విశ్వవిద్యాలయ విద్యాప్రణాళిక దేశాభివృద్ధికి అనుగుణమగు రీతిని లేదనియును, వృత్తివిద్య, పరిశ్రమవిద్య-నేర్చిననే గాని విద్యార్థులు తమజీవితములను సార్థకము చేసికొనఁ జాలరనియును, ఇపుడు అన్నిప్రాంతముల విద్యాధికులును సూచించు చున్నారు. ఆ మార్గము ననుసరించి కొన్ని విశ్వవిద్యాలయములు విద్యాప్రణాళికలోఁ గొంత మార్పును పొందుచున్నవి. అట్లే స్త్రీవిద్యాసంస్థలుకూడ అన్నివిధముల సంసార నిర్వహణమున కుపయోగించు విద్యలనే ప్రధానముగ బాలికలకుఁ గఱపుట కర్తవ్యము. తద్విలక్షణమగు విద్యవలన బాలికలకుఁ గలుగు ప్రయోజనము తక్కువ.

ఇప్పటి ప్రభుత్వ పరిపాలితములగు మహిళావిద్యాసంస్థలయందు స్త్రీల కుపకరించు విద్య తక్కువగను ఉపకరింపని విద్య యెక్కువగను గఱపఁబడుచున్నది. కావున నట్టి విద్యాసంస్థలవలని ప్రయోజనము సంకుచితముగుటచేతనే మన దేశమునఁ గొన్ని స్వతంత్ర విద్యాసంస్థలు లేవవలసి వచ్చినది. అవి సంగీతము - కుట్టుపని - అల్లికపని - నూలు వడుకుట - వంట - సంసార నిర్వహణపద్ధతి - దేశభాషా వాఙ్మయాభ్యాసము మొదలగు ఉపయుక్తములగు విషయములను శిక్షించుటకే యేర్పడియున్నవి. కాని తగినయవలంబనము-ధనము - లేక కొన్ని సంస్థలు సాగుట కష్టముగ నున్నది. ప్రభుత్వము వారట్టి విద్యాసంస్థలకుఁ దగిన యవలంబన మొసఁగియు, తమ పరిపాలనముననున్న విద్యాసంస్థలయందట్టి యుత్తమ విద్యలకు ఉచితమగు స్థానమిచ్చియు, సార్థకమగు స్త్రీవిద్య నభివృద్ధిపఱచుట ముఖ్యకర్తవ్యము.

# హా! హ్హా!! హ్హా!!!

ఇద్దరాండ్లుగలవాడు ఒకనాఁడు అలసివచ్చి నాడు. భార్యను కాళ్లు పిసుకుమని కోరి నాడు ఒకకాలు పట్టుకొని పిసుకసాగినది. 'ఇంకొక భార్యకూడ యుండిన నింకొక కాలును కూడ పిసికించుకొనవచ్చు కదా!' యనుకొని నాడు. త్వరలోనే మఱియొక కన్యను పెండ్లాడి నాడు. ఇద్దరుభార్యలు చేరి రెండుకాళ్లు నొక పేసారి పిసుకుచుండగా చాల సుఖించుచు న్నాడు. సవతులలో పోటీలు పడినకారణము చేత అతని పని యింకను మేలైనది.

పెద్దభార్య పుట్టింటికి పోయినది. చిన్న భార్య తన భాగము ఎడమకాలు మాత్రము పిసికిపోవుచున్నది. రాజు కుడికాలుకూడ పిసుకుమని చాచినాడు.

"దానిభాగముకాలుకు ఉపచారమా ? యిదిగో చేయుదు" నని యొకలోడి యెత్తి ఆతని కుడికాలు విరుగగొట్టి పోయినది. అతఁడామెను తరిమివేసి పెద్దభార్యను పిలిపించు కొని జరిగినది చెప్పినాడు.

"అది నా భాగము కాలు విరుగగొట్టిన నేనూరకయుందునా!" యని మఱియొక పెద్ద లోడి యెత్తి ఆమెయాతని ఎడమకాలు విరుగ గొట్టినది.

---

జట్కావాఁడు:—బాబూ; వూళ్లోకిబండి.!

బాటసారి:—నాకుబాడిగెంత ?

జ:— ఆఱు అణాలండి.

బా:—నా పెట్టెకు ?

జ:—బాడిగె లేదండి.

బా:—అట్లయితే నా పెట్టెమాత్రం బండిలో పెట్టుకొని వూటల్కు తీసుకొనిరా. నేను నడిచే వస్తాను.

---

ఒక మూఁడేండ్ల పిల్ల తల్లిని "నాయనా" యనిపిల్చుటకును తండ్రిని "అమ్మా" యనిపిల్చు టకును అలవాటు పడియుండెను.

ఒకనాఁడొకరు రాయింటికివచ్చి ఆపిల్లని ట్లడిగిరి:—'అమ్మాయి! మీనాయనేం చేస్తు న్నాడు ?'

పి:—నీల్లింతో అంట్లు తోంతున్నాలు'

ఆయన:—మీయమ్మ ?

పి:—దొడ్డో చారం చేయింతుకొంతుంది.

---

ఒక పెద్దమనుష్యుఁడు తన పక్కింటాయన యొక్క యిద్దరుభార్యలు వకరితరువాత వకరు చనిపోతే వాళ్లదహనక్రియలకు వెళ్లాడు. ఆపక్కింటాయన మూఁడో పెండ్లి చేసుకొంచే పాపము ఆమెకూడ మరణిస్తే దహనక్రియకు గానీ పెద్దమనిషిని రమ్మంటే యితడు వెళ్ల

లేదు. అందు కితనిభార్య ఆశ్చర్యపడి కారణం అడిగింది.

అందులకితడు 'ఆలాటి ప్రమేయము వక దానికయినా మనమువాళ్లని మనయింటికి పిల్చేవీలు లేనప్పు డట్టి వేడుకలకు నేను మాత్రము వాళ్లయింటికి పూరకే వెళ్ళుతూ వుండడానికి నేనేమంత సిగ్గు లేనివాణ్ణనుకొన్నావా ? ?' అన్నాడు.

---

చంపక:—మనోరంజనీ ! కృష్ణారావు నందు నీయిష్టం కనుపరిచావా ? పాపము కుమిలి కుమిలి పోతున్నాడు.

మనో:—చంపకా! అట్లు కాదు; అది యొక రహస్యమయిన యుక్తి. అత డీ లోపల బలిశాడు. ఆబలుపుతగ్గేదానికి ఈయుక్తిచేశాను. కొన్నాళ్లు చింతపడి అతడు చిక్కిపోయిన తరువాత మరల ఆప్రేమ కనుపఱుస్తాను.

---

ఒక యుద్యోగస్థుడు:—నాకు జీతం వచ్చిననాడు నాభార్య నాకెంత వుపచారమన్నా చేస్తుంది. మిగతారోజులలో నేను దానికి ఎంతసేవన్నా చేస్తాను.

---

పొరుగాయన:—అయ్యా ! నీ మోటారు బండికి నీ వెందుకొకప్రక్కన ఎఱ్ఱరంగు ఒక ప్రక్కన ఊదారంగు వేయించెదవు ?

మోటారు పందెగాడు:—అట్లు చేయుటలో యుక్తియున్నది. సాక్ష్యమవసరమయినప్పుడు కొందఱొకరీతిగాను మఱికొంద ఱింకొకరీతిగాను చెప్పుదురు.

---

'నీ చొక్కాయిజారులు చాల బాగుగా నున్నవి. నీకుట్టుపనివాఁడెవ్వఁడో చెప్పెదవా?'

'నీవు వానికి నాయడ్రసు చెప్పననియొప్పికొన్నచో నీకు వానియడ్రసు చెప్పెదను.'

---

పరీక్ష

'బడికి ఒకనాడు యిన్‌స్పెక్టర్ వచ్చి పరీక్షచేసినపిమ్మట పిల్లల నీమాదిరి అడిగెను. "ఏపిల్లవాడైన ఎటువంటి ప్రశ్నలైననునన్ను అడగవచ్చును."

అందులకు ఒకశబ్దము వినవచ్చెను. "మీా రైలు ఎన్నిగంటలకు బయలుదేరుతుంది? "

---

" నీకు తెలుసునా యిప్పుడు నాదగ్గిర నుండు ద్రవ్యము ఎంతకష్టపడి సంపాదించినదో ? "

స్నేహితుడు:—ఎందులకు అంతకష్టము? మీాదాయాదులు నీకువదలిపెట్టి పోయినదను కొంటినే ?

" అవును. అయినా లాయర్ల వద్దనుండి సొమ్ము రాబట్టడం అంత కష్టమైనది."

---

భార్య:—ఏమండీ ! మీారు నాకు రవల కమ్మలు కొనేటట్లయితే నాయనగారు సగం వెలమొత్తమిస్తామన్నారు.

భర్త:—మిగిలిన సగానికి యెక్కడ పొయ్యేదా అని ఆలోచన.

---

భోజనం చేయువాడు:— "ఏమయ్యా! ఈ పులుసులో వెంట్రుకలున్నవి?"

హోటల్ కీపర్:—"అయ్యా! అట్లు కానేరదు, మీకు వడ్డించక పూర్వమే ఎత్తివేశాను."

---

## కొలత

మా కొత్తయింటిహాలుకు జముకానము కొనుటకు కొలత యెత్తవలసియుండెను. నేను సరిగ్గ ఆరడుగులున్నాను. కాబట్టి నాభార్య నన్ను హాలుచుట్టు పండ వెడుతు లేవ నెత్తుచుండెను.

---

## న్యాయము

న్యాయాధికారి:—"నీవు దొంగనాణెములు ముద్రించినది నిజమేనా?

ఖయిదీ:—(ఓమూదిరిగా) అయ్యా! నిజము యిది. ఇప్పటికాలములో ఊరిలో నిండా డబ్బులేదు. వ్యాపారాలు తగ్గినవి. వుద్యోగాలు లేదు. కాబట్టి మాబోటి బీదవాండ్లు మోసము చేయక డబ్బుసంపాదించుటకు ఒక పని చేయవలయును కదా!

## స్వర్గం

పిల్లవాడు:—నాన్నా! జనులు చస్తే స్వర్గానికి పోతారా! పోయినపిమ్మట అక్కడ దేవతులు కావడానికి పరీక్షలు ఉన్నవా?

---

పిల్లవాడు "నాన్నా ఎందుకుగాను అమ్మను పెండ్లి చేసుకొన్నావు?"

తండ్రి:—అది నీకున్ను ఆశ్చర్యముగా యున్నదా?

---

## గాడిద

ఒకండుబరువైన సామాన్లునింపియున్నబండికిఒకడుఒకగాడిదను కట్టితోలుకొనిపోవుచుండెను. త్రోవలో ఒక ఎత్తైన కొండ దాటవలసి వచ్చెను. ఇట్లు పోవుచుండగా సగము త్రోవలో గాడిద నిలబడిపోయెను. ఎంత కొట్టినను ఒక అడుగెత్తలేకుండెను. ఆసమయములో బాటసారి వృకరిని పిలిచియిట్లనెను. 'మీరు దయచేసి సహాయము చేసినయెడల ఈబండిని కొండచివరకు తోలుకొని పోవచ్చును. ఈబండి నిండా బరువగుటచేత ఒంటి గాడిదకు యీడ్చుటకు వీలు కాకున్నదిి?'

---

పుల్లయ్య:—ఖాయమయిన పెండ్లి నెందుకు రద్దు చేస్కున్నావు.

"మొన్నను ఇల్లుచూడడానికి వెళ్లినప్పుడు మాయత్త ఆయిల్లు ముగ్గురుకీ చాలదన్నది."

---

స్కూళ్లయినస్పెక్టరు:—(స్కూలు మాస్టరుతో) నేను చెప్పినట్లు నీవుచేయకపోతే నీ గ్రాంటుకు చక్రం వేస్తా చూడు.

స్కూలుమాస్టరు:—దేవరా! మీరు చక్రంవేస్తే నేను శఖంవేస్తాను.

---

సంపుటము ౧ సంచిక ౫

# చంద్రిక

సచిత్ర మాసపత్రిక

శ్రీ భావ సం॥ ఆషాఢమాసము

జూలై 1934.

ఆనందముద్రణాలయము,

మద్రాసు.

౧౯౩౪




—:o:—

———:o:———

# పటముల పట్టిక




## సాక్షాత్కారము

కర్లపాలెం - కృష్ణరావుగారు,

ముద్దుగుమ్మలమోవి మొలకనవ్వులయందు,
        నీ మందహాసమే నిలిచియుండె,
పచ్చికబయళుల పశులకాపరులందు,
        నీ శైశవంబెల్ల నిలిచియుండె,
సెలయేటి తరగల లలితనాదంబులో,
        నీ వేణుగానమే నిలిచియుండె,
వలపుదీఁగెలనెక్కి కులికెడిపూలలో,
        నీ మోహనాకృతే నిలిచియుండె,
పలుకుపలుకున ముద్దులు గులుకుచుండు
తన్వియెడబిడ్డలో నీవె దాగినావు,
చూచినదియెల్ల నీవయై తోఁచుచుంటి,
వహహా ! నాభాగ్యమేమందు నయ్యకృష్ణ !

# జవ్వని

ఓలేటి - సీతారామమూర్తిగారు, బి. ఏ.

౧

జవ్వనీ! నీకు నిటుమనోజ్ఞ ప్రవృత్తి,
జిలుగులను గూర్చ ధాతకే వలనుపడెనె ?
సుకవులునుగూడ భావమాలికలతోడ,
నీ యెడందను సతము గైసేయుచుంద్రు.

౨

పరగ సత్కవి భావప్రపంచమందు,
లేఁబసిడి తీగపోదను నిర్మించు నీకు ;
చిత్రకారుఁడు నిత్య వర్చిస్సు ? లొలుకు,
విశ్వమోహనాకృతిని గల్పించునీకు !

౩

విమలముక్తావళులు నదీ విభుఁడొసంగి,
మురిపెముగని హేమ విభూతినొసఁగి
వలపు క్రొంబువ్వులుద్యాన వాటులొసఁగి,
మఱియుసౌందర్యవతిఁ జేయుతరుణి! నిన్ను.

౪

మానవుని యంతరంగంపు మధురవాంఛ,
లనవరతమును బాడు నీ యౌవనమును,
ఒక సగమ్ము జవ్వనివీవు—ఒక సగమ్ము,
కలత నిద్దుర తీయని కలయె సుమ్మి !

[ "రవీంద్రు" ని నుండి ]

# సాహితీగోష్ఠి

జొన్నలగడ్డ - సత్యనారాయణమూర్తిగారు, ఎం. ఏ. బి. ఎల్.

ఆలస్యమైతేనేమి? ఆంధ్రవాఙ్మయములో నేఁటికి కొంత సంచలనము కలిగినది. తెలుఁగునకు సంజీవి కావలెనని ఎల్లఱూ గుర్తించిరి. ప్రాతపుంతలోన అడుగును మళ్లించుకొనివారు ఎక్కడో కానిలేరు. మాట పోకడకు కొంతమార్పు కావాలని మనపండితులూ గుర్తించారు.--యీలా అనిపైకి చెప్పకపోతే నేంగాక!

స్వేచ్ఛావాతూలము ఎంత హాయినిచ్చును! ఇష్టాగోష్ఠికి తగినసమయము కదా యిది! ఆనందమయమైన ఈ ముహూర్తమున ఇంచుకంత సాహితీగోష్ఠి అసంగత మగునా?

నేటివాతావరణము భావబంధురమైనది. భావవ్యక్తీకరణమునకు ఎన్ని తెరువులు లేవు? కళలీ తెరువులలోనివి కావా? చిత్రలేఖనము, సంగీతము, నృత్యము భావముతో తొలుకాడు కళలుకావా? సాహిత్యము మాత్రము?

పద్యరచనమూ, గద్యరచనమూ సాహితికి భుజకీర్తులు. మన పద్యరచనము క్రొత్తపోకడలు చూపట్టినవి.

ఈ రీతులు అంతరంగమునకు సంబంధించినవి కావు.—వ్యక్తీకరణవిధానమునకు చేరినవి. భావకవులను ఒక తెగకవులు నేఁడు పుట్టిరను ఒక అపోహ కలదు. భావకవిత యనిన, ఈవఱలో లేక ఇఁక పెరుఁగవలసిన కవితయని కాదు. మనుష్య హృదయమును, సృష్టియును దంపతులట్లు కలిసికొనినపుడు కైత తోఁచినది. ఇట్టినేస్తమున ఆనందమును క్రోలినవారు వాఁడును ఉండిరి; నేఁడును ఉన్నారు. రేపును ఉందురు. వసుంధరయందు సమయసమయములందు వీరిసంఖ్యలో హెచ్చుతగ్గు లుండును.—అంతియే! నిదురించుచున్న శక్తి అపూర్వసంఘటనములం దుబికిన భావోద్రేకమునుండి పైకి తేలును. కాని ప్రకృతి కంచని శక్తి తెచ్చిపెట్టుకొన్నరాదు. గొడ్డుగేదె అన్ని కాలములయందును గొడ్డుగేదెయే! చిట్టువంటి చెత్త మీదనే కన్నులుగల కుకవులయెదుట భావమెంత చేసును? భావోద్రేక మెంత జేసును?—యీకవులతెగ జడివానయందలి గేదెవలె చలనము లేక యుండును. భావసంకీర్తన మందఱికిని సాధ్యముకాదు. కవిత్వ మందఱికిని అలపడదు. కవిహృదయము వేఱు. ఈ హృదయము అంగడియందు దొరుకునదికాదు. ఒక రీయఁగల వాయనముగాదు.

కవితగాని భావకవితగాని, అపూర్వమైనది కాదు. "భావకవిత" అగ్గినిప్పువంటిది. కవిత భావము కలది. భావములేనిది కవితకాదు. భావకవిత వొకటీ, అభావకవిత వేఱొకటీ లేదు. కవిత భావముకలదని వెనుకనుండి ఒకవిశేషణము తాళము వేసి చెప్పవలెనా? భావధారలను ధారవోయు నేటియువకులును నాఁటినుండి పెరిఁగివచ్చు భావగంభీరులగు వృద్ధులును ఒకేతొట్టియందూగులాడు కవితాడింభకులు. నేఁటి వాఙ్మయోద్యమము కూడనికట్టుబాట్లను తెగగొట్టుటకై యేర్పడినదిగాని సహజభావమునకు దిద్దుబాట్లు తెచ్చుటకై కాదు. భావకవులనిన చట్టుమను కొండఱు వృద్ధకవులు నేఁడున్నారు. వృద్ధకవులనుచూచి వెక్కిరించు భావకవులును ఉన్నారు. కవులకు విరోధ మేల? ఒకరి నొకరు గుర్తింపక బండపోరునకు డీకొనిన అభిమన్య ఘటోత్కచులు వీరు.

నూతనయుగ భావోద్రేకమువలన ఆంధ్రపద్య రచనమున కొంత చక్కదనము తోఁచుచున్నను, గద్యరచనమున ఇది ఇంకను పొడసూపుట లేదు. కారణము:—గద్యమునెడఁగల అనుచితజుగుప్స. పద్యమువలెనే గద్యమును కళాకాంతకు కనులు కోరగించు

విరిసెజ్జకాఁగలదని మనసోదరులు గ్రహింపలేదు. కళయెన్నఁడును కాంతికలదే! —సౌందర్య రేఖావిల సితమైనదే! —చక్కని వచనరచనము పుష్పాంజలి వంటిది. రచనము రమ్యమై యుండవలెను గాని ముళ్లుపల్లములతో నిండియుండరాదు. పరమపరితోష మున పూవును చేరు తుమ్మెదవలె మనసును చేరు రచనమే రచనమనిపించుకొనును. చెమటలు భౌతికశాస్త్రమునకు కూడివచ్చునేమోగాని కళకుగాదు. ఎండుబెడ్డలును, కటికిరాళ్లును సాహిత్యప్రాంగణమున నుండరాదు. సాహితీసీమంతిని కాంక్షించునది సౌకుమార్యము గాని కాఠిన్యము కాదు. కుస్తీయందారితేరి సర్కసు మొగ్గ లందు కుశలులైన వారిపై కవితాకామిని వలపులను చిల్కరింపదు. మృదులమై చక్కనైన రచనమే సాహిత్యసుందరికి వలెవాటు కాదగును. పాత్రముల వంటి శబ్దములను చూచి సాహితీ వధూటి దూరముగ పారిపోవును. పూలచెండులుపోలు పదములతో చెండ్లా డు కవితాసుందరునకే ఈజవ్వని తన హృదయ సా మ్రాజ్యమున తావొసఁగును. గట్టిమాటలను కరకర నమలు పండితునిచూచి ఈమె "అమ్మో!" అని అడలును. "ఆహా!" అని ఆనందింపదు.

అప్పురుప్పురనిపించు రచనము కండకల పండితునకు చెల్లును గాని సుకుమారుఁడైనకవికి కాదు. కవితాభావ ములు సొగసైనవి. శైలి అంతరంగమునకు నద్దము. అందకత్తె అంతరంగమును మోమును ఒకే రూపుగలవి. హృదయము నాకర్షించు రచనమెన్నఁడును చక్కని చుక్కవలె నుండును.

అలంకారములు రచనకు అందమిచ్చునని సాహిత్య ములన్నియు చెప్పుచున్నవి. తెచ్చిపెట్టుకొనినవి కాక సహజమైన నగలే కవచకుండలములలీల చక్కనైయుం డును. రచన రసమందు దేలియాడుచు తియ్యందన మందు ఊరురసగుల్లలట్లుండు భాషాలంకారములు 'శభాస్!' అనిపించును. భాషాలంకారములును, సంగీత సంగతులును, చిత్రలేఖనరాగములును వేఱు రూపులు కలవి గాని, వేఱుహృదయములు కలవికావు. పువ్వురేఖలును, సుధాంశుకిరణములును, సమీరస్పర్శ లును వేర్వేరైనవా? అలంకార రంజితరచనము చిత్ర రచయిత చేతిపతిమవలె నుండునుగాని ఎల్లసిరాయందు బుడుంగుమనిన గుడ్డపేలికవలె నుండదు.

కథలందును, నవలలందును, వ్యాసములందును నొప్పునది గద్య వాఙ్మయము. ఇతరభాషలందు నాట కములకుకూడ గద్యలో చోటున్నది. మన పండితరచ యితలకీపని కూడని తంతువలె తోచినది. వీరు పద్య ములతో కొన్ని నాటకములో త్రోటకములో వ్రాసిరి. విశేషముగ నివియునను వాదములే. సొంతరచనము కొంత ఉన్నదనిన ఇది పురాణగాథల గుట్టయే! ఒకేకథను తిప్పితిప్పికొట్టిన బాపతులోనివారు మననాటకకర్తలు. నేఁటిసమస్యలను, నేఁటిసంప్రదాయములను, నేఁటి రచనలను, నేఁటిభావోన్నతిని రంగస్థలమున చూపిన నాటకములు తెలుఁగున లేనేలేవు. విజ్ఞాననిధానము లైన వ్యాసములను,—మన శాస్త్రపరిజ్ఞానమును మానవ గుణప్రాశస్త్యమును తేటపఱుచు నవలలును, సాంఘిక జీవనదర్పణములైన కథలును మనభాషలో సకృత్తు. కథావాఙ్మయము మన నేలలో బండిసున్న.

కల్లబొల్లి కబురులును, వెఱ్ఱిమొఱ్ఱి మాటలును, కథలుకావు. ఏదో కొంత వింత వ్రాసినంతనే అది కథయై నిలువదు. పిట్టలను కుక్కలను కలిపికుట్టినంతనే కథ యల్లికనెఱవేఱునా? కథవ్రాయుట చిన్నపనియనియు ఉబుసుపోని బాలకులకై ఏర్పడు సోదె, కథయనియు పలువురు తెలుగులు అపోహపడుచున్నారు. కథాలేఖ నముపై కొద్దిచూపుండుటచే అది మనలో కొఱవడి యున్నది. వంగసాహితికి విశేషమైన వన్నెఁదెచ్చినవి కథలే. రవికవి కథలువ్రాయుటలో సిద్ధహస్తుఁడు. నవలారచనమున రవీంద్రునకు అపజయమే వాటిల్లి నది. కథారచనమున నతఁడు దిగ్విజయ మందినాఁడు.

వ్యాయశాస్త్రపఠనమున నా ఆచార్యుడయిన శ్రీప్రభాతకుమారముఖర్జి కథలు వ్రాయుటయందు గట్టివాడు. ఈతని కథలు పెద్దవై యుండును. పెద్దకథలను తెలుగున నెవ్వరేని వ్రాసిరేని, ఇవి కథలుకావని వాని నవ్వుల విసరివేయు ప్రకటనకర్తలు మన మన్నులో పుట్టిరి. వాఙ్మయపరిశీలనమునకు వలసిన పరిజ్ఞానముఁగల ప్రచురణకర్తలిట్లొనరింతురా?

వ్యాసరచనముకంటె కథారచనము సులభము. వ్యాసము ఎత్తుతలవుల కొండకావలెను. తర్కశాస్త్రమును, తత్త్వశాస్త్రమును ఆదర్శవ్యాసరచయితల నఖదర్పణములం దుండవలెను. వ్యాసకర్తశూన్యమునఁ జూచియు, కనులుమూసికొని గంభీరయోచనయందు మునుగీఁతనీఁదియు, దనపని నిర్వర్తించుకొనును. కవితారచయితవలె కథారచయిత ఎదుటిదృశ్యములను చూచి నృత్తక్రీడలఁ దేలుచు తనపని నెఱవేర్చుకొనును. కథారచనమునకు కావలసినది పాండితికాదు.—మఱి సహజశక్తి. వ్యక్తిపరిశీలనము, కథనాకౌశలము కథావాఙ్మయమునకు కన్నులు. కథకునకు మనశ్శాస్త్రపరిజ్ఞాన మవసరము. వ్యక్తులను వస్తువులను చేఁబట్టక వ్యాసరచయిత తలఁపులనే దోసిలందుఁబూని వానిని వసుమతిపై వెదజల్లును. ఈతలపులు పువ్వులవలె నుండవు. ముట్టుటకు మిగుల గట్టివై శక్తిగలవారిచేతులందు మెత్తనగును! చదువరితనమునకును కొంత శ్రమ యిచ్చినగాని వ్యాసాంశములను గ్రహింపఁజాలడు. వ్యాసవాక్కులు తియ్యనివైనను అవి కలకండముక్కలు. కథావాక్కులో?—పానకపుగుక్కలు!

మనుష్యక్రియలును, ప్రత్యక్షసంఘటనములును కథాదృష్టియం దుండును. కథారచనము విశేషానందమును అశేషాభ్యుదయమును కలిగించును.

కావ్యసౌందర్యమును, సాహితీ సౌష్ఠవమును కథయందు తేటపడునట్లు వ్యాసమునందు తేటపడదు. వ్యాసము శాస్త్రపరిశోధనమువంటిది. మేధాకృషి వ్యాసమందు మెండు. కథాసూత్రముల నల్లునది హృదయము. లోనిచూపునకు రూపుచూపని తలఁపులు కలది వ్యాసము. మనశ్చక్షుః సమక్షమున ప్రతిమలు చెక్కుశిల్పి, కథ! పువ్వులును, నవ్వులును కథకు సహజమైనవి. కన్నీటిదొంతరలును, క్రోధవిస్ఫులింగములును కథకుచెందినవి. అన్నిరసములతోను తొలుకాడు కలశము కథ!! దాపనేల? యతిప్రాసలెఱుఁగని కైత కత!!! ఈకలశము నారాధించువారు గోపికలబోలు భక్తులు!!!! అంతరంగయవనికపై విద్యుత్తచిత్రములను తళుక్కించునది కథకాని వ్యాసముకాదు. ఉత్తమకావ్యలక్షణలక్షితంబై యుండునది కథ. వ్యాసమును గుర్తించుటకు లోఁతుకావలెను. కథను గుర్తించుటకు కన్నున్న చాలును! వ్యాసము గొప్పసింహద్వారము కలది. కటువైనదాని కవాటమును గ్రుద్ది లోపలఁ జొచ్చుటకు పాండిత్యబలమెంతేని కావలెను. కథ నీరమువంటిది.—దోసిలొగ్గినంతనే అది మనదియగును. పెద్దతల గలవారికి వలసినది వ్యాసము.—విశాలహృదయమున్నవారికి వలసినది కథ.—సాధారణులువ్యాసమును చూచి వెఱ్ఱిచూడ్కులు నిగిడింతురు. కథవిని కుఱ్ఱలుకూడ గంతులువేయరా? గొప్పవ్యాసము విని మనము "ఆహా!" యందుము వినిన పరముహూర్తమునఁ బ్రశంసింతుము. కథవిని పట్టరాని ఆనందమున నృత్యము సేయుదుము. వినుట ఒక ముహూర్తమందును నృత్యమొనరించుట వేఱొకముహూర్తమందును గాదు. రెండుముహూర్తములకును నడుమ సందిచ్చు యోచన కథలో నుండదు. కథయేమైనను యొప్పుదుము.

జనసామాన్యమందు విద్యాజిజ్ఞాసఁ బుట్టింపఁ గోరుదుమేని, మనము కథారచనమునకు గడంగవలెను.

సాంఘికసమస్యలు స్త్రీలెఱిఁగినట్లు పురుషు లెఱుఁగరేమో. స్త్రీలు హృదయముగలవారు. నేఁడు వీరుత్సాహముతో ముందంజ వేయుచున్నారు!! కథారచనమునకు సోదరీమణులుకడంగి సంఘసేవ సలుపుదురుగాక!!! గద్యపద్యవాఙ్మయమునకు వన్నెఁదెచ్చు క్రొత్తపోకడ లెఱిఁగి తమ జాతిలోనిదగు సాహితి నాదరించి, నేటి యుద్యమస్యందనమును చరచర నడుపుదురుగాక!!!

# వీణె

ఆదిభట్ల-నారాయణదాసుగారు,

(పూ గు త్తి)

ప్రాఁబల్కులఁజెప్పఁ - బడియెను వీణె,
వాయించునిద్దరు - బాపంద్రుపాడ,
బాఱుఁడొక్కఁడుపాడ - వలయుఁ దాననుచు,
గలిమిచెల్వగువీనె - కావున సద్ది,
పుడమియేలిక చెంత - ప్రయోగింపఁబడును,
మువ్వడులన్వీణె - మొరయించిదర్వ,
వెరవెఱిఁగినగాణ - వెన్దోవకరుగు,
బల్కవలయుఁజదు - వరిమాటకారి,
లయకాఁడు పాతర - లన్దొక్కవలయు,
నాయాటకానికే - యంచఱున్గూడు,
గుడ్డలొసఁగికొల్చి - కొనియాడుచుంద్రు,
బాపనిచేఁదప్పఁ - బై వానివలన,
బాడించఁకొనెడుద్రా - బలుకొఱగారు,
చదువునకున్దగు - జన్నికట్టొకఁడె,
కడమవారికి విద్దె - కావించు ముప్పు,
అడుగుపుట్టువునుండి - యాటపాటలను,
వీణెమీటులుగొన్న - వెంబఱచెడును,
పరకనాల్గుతెగల - వాద్దెములెల్ల,
గంటతాళము దొట్టి - గట్టిరకంబు,
చివరలప్సరిబిగిం - చిన తీఁగెదినుసు,
చిల్లులన్గాలిపో - సెడు పనిముట్లు,
దట్టపుతోల్మూసి - తట్టుజంత్రమ్ము
గట్టివాద్దెముల జే - గంటయేలెన్స,
చిల్లివాయిదములఁ - జిందమే మేలు,
తోల్మూతవాద్దెమం - దున డప్పె నయము,

వీణెకుఁ బనస సం - పెగకట్జి లెస్స,
యతుకులేకున్న న - య్యది ప్రయోయు సరిగ,
కుండకుఁ దగుదండె - కొనకునాఁదోఁక,
వాటమై నెరసరి - వాయి నోప్పార,
హెచ్చుతగ్గురవళి - నిరువదినాల్గు,
కంచుమెట్లుక్కుతీఁ - గలుమూఁడు పిదప
నిత్తడితివ్వవా - యినిడు బిరడల,
దొలకలద్దు కడెమ్మ - టొండ్లనాల్గింట,
గొక్కెము కొండెల - కున్దీసికట్టి,
ముడినై చిజాఱుడు - ఫ్రాసలమర్చి,
కుండమీఁదన్బ్రేఁట - కుదురుగానిల్పి,
యద్దాన నుక్కురే - కమరించి మెట్ల,
పైనుండి మేరువ - పట్టియున్వరుస,
వెడలించి తగుపట్లు - బిగియించవలయు,
నొకదానికంటె నిం - కొక్కటిహెచ్చు,
తగ్గురవళితీఁగ - తరబడినెసఁగు,
బ్రక్కతీఁగెలు మూఁడు - వలముసన్నముల,
సుతికయి బిరడలఁ - జొప్పించిమీఁది,
పీఁటవంకన్నిల్పు - పిడికట్టు రేకు,
దాటించికొండెల - న్దగిలించవలయు,
మేరువకవ్వల - న్బిరడల కిరవు,
కావించుకుత్తుక - న్గరి వెతోఁగ్రింద,
బెజ్జముతోడితి - పిరిగుబ్బకాయ,
అవళిమార్మ్రోఁగింప - అంపిల్లఁదగును,
మయినంబు నీలిసాం - బ్రాణి గుగ్గిలము,

కరగినీటనోబ్బసి - గట్టిగాఁ బిగిచి,
సెగచూపి దండెకుఁ - జెక్కిపై పుగాడి,
పూడిచిమెత్తని - ముద్దపై మెట్లు,
రవళియిర్వదినాల్గు - రకముల హెచ్చు,
తీరుగాఁ బైనాల్గు - తీగెలన్నిల్ప,
గుఱుచ లెడంబగు - గొప్పవాఁ జేపుఁ,
తరబడి దండెము - దల్వొప్ప కనక,
లావుసన్నముల కొ - లతఁ బ్రక్కతివ్వ,
తిగమూఁడు బాగడల - దిండ్లానియొళగు,
ప్రక్కలన్దోసివె - ల్వడెడు బిరడల,
డొలకలన్బిగిసి ను - తులజంటనిచ్చు,
దండియకడ్డపైఁ దాపుతనాబి,
యిరువైపు మెట్లు మ - యినము నుదుళ్ల,
నాల్గుతీగెలనంటి - నాటిఁ దిరముగ,
దండియ వెదు రిరు - తట్టుల న్విపిరి,
కావింత్రు వీణె డా - కడ బుఱుకాండ్రు,
తెలుఁగువీణయ ప్రమాని-చే(?)ఁ జేయఁబడును,
లాగుల వెదురుప్రమా - ల్లగువుల లెస్స,
పదునాల్గు అవళుల - స్వరగు దర్వులను,
లయకాడు మువ్వళు - లన్డనరించు,
నందఱ నెల్లెడ - న్హాయిఁ జొక్కింప,
నెటనైన వీణకా - డే మగవాఁడు,
ఆటపాటలమేటి - యా మాటకారి,
వీణెకాడైనచో - విన్నాణమొప్ప,
ఏబదియేండ్లలో - కేవిద్దెమైనఁ,
బండి మెల్లరు కుడు - వస్వీలుకాదు,
పాటుకొలఁది లోకు - వకు వచ్చు విద్దె,
పచ్చపచ్చిగ నుండుఁ - బడుచువాయిదము,
తడమీటుజోడీమ్నటు - దాటుర్కులాగు,
జంటకత్త్రైరమీటు - జార్చిమ్మ్నపట్టు,
విడుపూడుప్పరవ యన్ని - పేళ్లజాడింపు,
డానలచేతివే - ళ్లనోళ్లపనులు,
ఏడుతీగెలఁగల్పు - నెక్కటి మీటు,
నంబువేళ్లఁ దీఁగలు - నాల్గున ల్మెట్లఁ,
గీలించి రవళి ప - ల్కించెడు మెలపు,
పదివేళ్లగోళ్లతోఁ - బనిచేయఁదగినఁ,
వాద్దెము వీణె త - ప్ప నిఁకేది కాదు,
వాద్దెములన్నిఁట - న్బాదుసావీణె,
నెఱవాదివీణె కా - నికి మించి లేదు,
అరచేతుల వెడల - పాఁదొక వేళ్లు,
గోళ్లబింకము వీణె - కున్బన్కివచ్చు.
నన్ని మెట్లరవళి - కందిన గొంతు,
కలవాఁడొకఁడె వీణె - కాఁడు నిక్కముగ,
మెట్లనన్నిట సుతి - న్మెలఁగింపలేని,
కొయ్యగొంతుక వీణె - కున్బన్కిరాదు,
దిబ్బవాఁడు న్దల - త్రిప్పెడివాఁడు,
అమ్మ్మబ్బల నెఱుంగ - నట్టి యంబేద,
బుట్టిగిడసముడ్పు - మూఁతిసన్నాసి,
నిరుపేదచాకిరి - నీలుఁగుఁబోతు,
కోణంగి వెకలి వె - క్కురుపిల్లకాయ,
సొట్టవాఁ డడిబండ - నుద్దులమారి,
నుడి గోరుదాల్పునం - జుడుతినుకూళ,
డబ్బాసతోడఁ దం - టాల్పడు కొంటె,
ముక్కిడి చెవిటి క - ల్మచ్చు రేచీఁకు,
కొఱవి నలుపు తిరు - గుడుగుడ్లవాడు,
పోకిరి వీణెయు - న్మోగింపఁదగడు,
నలువదియేండ్ల క్రిం - దటనాకుఁగట్న:
మొసఁగె నీవీణె మై - సూరేలు రాజు,
వేలుపుకొల్పున - వీణెయే లెస్స,
నాతప్పుమన్నించు - నాయిలువేల్పు.

# శ్రీమదాంధ్ర మహాభారత సందేహములు

త్యాడీ - వేంకటశాస్త్రిగారు

శ్రీమజ్జగద్విఖ్యాత చరిత్రంబు గల కవిత్రయంబుచే నాంధ్రీకృతంబైన శ్రీ మహాభారతరచనాది సందర్భములఁగూర్చి విద్వద్విమర్శకు లనేకవిధాభిప్రాయంబులఁ బొంది యుండుట తదావశ్యకులగు ప్రాజ్ఞులందఱు నెఱింగియే యుందురు.

అందుఁ గొందఱు "భారతః పఞ్చమో వేదః" అనెడి యుత్తమప్రమాణము నాశ్రయించి యద్దానిఁ గేవల పఞ్చమవేదంబనియే భావించి సర్వగ్రంథోత్తమంబుగఁ జూచుచుండిరి; మఱికొందఱు మతభేదముల ననుసరించి యందనేకవిధ వైషమ్యముల నాపాదించి కొంతవఱకు విశ్వాసనీయంబు గావనుచుండిరి. మఱికొంద ఱుభయసమ్మతముగా సత్యాసత్య నిర్ణిమిత్త చిత్తులై యూరకొనుచుండిరి. "లోకో భిన్నరుచిః" అనున ట్లొక్కొక్కరి కొక్కొక్క విధమగునభిప్రాయంబు దోఁపం దగును.

అట్టిస్థితిలో సాధారణముగా మహాభారతమునం దేవిధమైన సంశయంబును గలుగనేర దనియు నొకప్పుడు సంభవించిన శంక కాగ్రంథరాజమునందే సమాధానంబు నైతము లభించుననియుఁ బెద్దల వాక్యమొకటి యాధారముగా నుండుటంబట్టియు భారతమునం దెవరి కెట్టి యనుమానంబు గలిగినను ముఖ్యముగా నందుల కనుకూల సమాధానం బొసంగఁగలమనెడి కొందఱు ప్రాజ్ఞుల ప్రతిజ్ఞావచన ప్రతీతింబట్టియుఁ బూర్వోక్తానుసార సమాధానం బాగ్రంథంబున లభింపనందునఁ బ్రాజ్ఞు లొసగఁదగిన సమాధాన సదభిప్రాయముం గోరి. యాగ్రంథమునందలి పూర్వోత్తర సందర్భాదులంగూర్చి నాకుఁ దోఁచినంత వఱకు సంశయనివారణార్థ మించుక వ్రాయుచుంటిని.

ఆదిపర్వ సప్తమాశ్వాసములోని ద్రౌపదీస్వయంవర ఘట్టమునం దర్జునుఁడు మత్స్యయంత్రంబును గొట్టిన పిదప నతనిపైని దేవతలు పుష్పవృష్టిం గురియుటయు

"వ. అయ్యవసరంబున ధర్మనందనుండు నకులసహదేవానుగమ్యమానుండై నిజనివాసంబునకుం జనియె. ... ... (187)"

అనియు, మఱియు నాసమయంబున భీమార్జున శల్య కర్ణులకుం గలిగిన యుద్ధమునకుఁ బూర్వము శ్రీకృష్ణుఁడు బలరామునితోఁ జెప్పినట్లు

"సీ. తాలాభమగు విల్లు దాల్చి విరోధుల
నెగచుచు నున్నవాఁ డింద్రతనయుఁ
డాతనికెలన మహా వృక్షహస్తుఁడై
యున్నవీరుండు వృకోదరుండు
యంత్రంబు నరుఁ డేసినప్పుడు వోయిన
యాగౌరవర్ణుఁడే యమతనూజుఁ
డాతనితోడన యరిగిన యిరువురుఁ
గవలవా రర్కప్రకాశ తేజు లనిన"

అనియు నట్టిసమయంబున భీమార్జునులనుమాత్ర మా స్వయంవరస్థానమునందు విడిచి నకులసహదేవసహితంబుగా ధర్మరాజు స్వకీయనివాసంబునకుం జనినట్లు రెండుసారులు చెప్పియుండి మరల నష్టమాశ్వాసమునందు దుర్యోధనునకుఁ జారులు పాండవుల క్షేమమును జెప్పునట్టి సందర్భమునందు:—

చ. "అని మొన నట్లు దాఁకిన మ
హారథులన్ ధృతరాష్ట్రరాజ నం
దనుల బలాఢ్యులన్ దళిత
దర్పులఁ జేసిన వారు ధర్మనం
దన యమ లుగ్రవీరులసి
తద్విధమంతయు నేర్పడంగఁ జె
ప్పిన విని కౌరవ ప్రభుఁడు
వెల్కుఱితద్దయు దుఃఖతాత్ముఁడై"

అని యిప్పుడా ధర్మనకులసహదేవులే ధృతరాష్ట్రపుత్త్రులం జయించినట్లు చెప్పియుండెను.

ఆలోచింపఁగా నిందలి మొదటివచన సీసపద్య భావములనుబట్టి ధర్మనకులసహదేవులు నిజనివాసంబున కరిగినట్లుభావింపవగునో లేక మూఁడవ చంపక భావమునుబట్టి యా ధర్మనకులసహదేవులుసైతము కౌరవాదులతో యుద్ధం బొనర్చినటుల భావింపం వగునో తెలియరాకున్నది.

మఱియు నర్జునుఁడు మత్స్యయంత్రంబును గొట్టిన పిమ్మటఁ బుష్పవృష్ట్యాదులు జరుగఁగా:—

" వ. నిట ధృష్టద్యుమ్నయుతుండయి యజ్ఞసేనుండు మహాసేనతో నర్జునునకు సహాయుండయి నిలిచెనంత. "

అని ధర్మనకులసహదేవులు నిజనివాసంబున కరిగిన యనంతరము ధృష్టద్యుమ్న సేనాసమన్వితంబుగా ద్రుపదమహారాజర్జునునకు సహాయంబుగా నిలిచినట్లు చెప్పియుండెను. కాని యప్పటికింకను ద్రౌపదీ స్వయంవరంబైన నై యుండలేదు. అందువలన నర్జునునకుఁ గౌరవులతో యుద్ధంబు గలుగునట్టి సూచకంబైన నవకాశము కన్పట్టదాయెను. అట్టిసమయమున నర్జునున కాద్రుపదభూపాలక సహాయావశ్యక మెట్టిదో తెలియరాకున్నది.

ఒకవేళ నీకఁ గాఁబోవునది యా ద్రౌపదీ స్వయంవర శుభకార్యమే యగుటంబట్టి యట్టి సత్కార్య దుస్సహత్వాది దుర్గుణప్రసిద్ధహృదయులగు నా కౌరవు లవశ్య మర్జునునితోఁ గదనోన్ముఖులగుదురను భవిష్యత్కార్యాభిప్రాయంబుతోఁ గాని యా మహావీరునకుసహాయార్థ మరిగిన యా ద్రుపదవీరశిఖామణి కౌరవులతనిపైని మార్కొనినంత నే: —

వ. " ... ద్రుపదుండును గడు భీతుండై బ్రాహ్మణుల మరువుసొచ్చె ... ... (197)"

అని చెప్పఁబడెను. వీరవరసహాయుండును వెనుకటికనంత ధనుర్విద్యాపరిపూర్ణులై గుర్వాజ్ఞంబూని తనతో యుద్ధమ్ము జేయ జయేచ్ఛలో నరుదెంచిన యా దుర్యోధనాది దుష్టచతుష్టయసమన్విత కౌరవ ప్రభృతి వీరవరులనెల్లఁ దృణప్రాయంబుగా జయించి జయలక్ష్మీవిరాజమానుండైన యా ద్రుపదభూపాలపుంగవుని కంతలో నంతటి భయావహావస్థలో బ్రాహ్మణమాత్ర సహాయాపేక్ష యేల కలుగవలెనో గ్రహింప ననువుగాకున్నది.

శిష్యుండగు నర్జునుండొక్కఁనిచేతమాత్రము వెనుకటికిఁ దను సైన్యసమేతంబుగ జయింపఁగలిగిన ద్రోణాచార్యమహిమం గ్రహింపఁ గలిగిన వాఁడగుటంబట్టి గాని యా బ్రాహ్మణసహాయమ్ము గోరియుండె ననుకొంద మనిన నప్పటికా మహనీయుండా మహీసురవర సంఘంబునందు సైత ముండక ప్రత్యేకము కృపాచార్యాశ్వత్థామాది మహావీరసహిత కౌరవసమూహంబునం దున్నట్లు చెప్పఁబడెను.

మఱియు:—

వ. " అని తానును భీమసేనుండును గ్రమ్మఱి రిపుబలంబు పై నమితశరంబు లేసె. భీముండు నొక్కవృక్షంబు వెఱికికొని దండహస్తుండైన దండధరుండునుంబోలె నర్జునునకు సహాయుండయి నిలిచె (193) "

అను వచనమునుబట్టి యా శత్త్రువులపై నమితశరంబులం బ్రయోగించిన వార లా భీమార్జును లిరువురునా? లేక యర్జునుండొక్కఁడు మాత్రమా? భీమార్జును లిరువు రైనచో నందలి "ఏసె" అనెడి యేకవచన క్రియాపద బాధయే గాక తత్క్రియాపద సహితమగు నావాక్యాంతమం దుత్తరవాక్యారంభాన్వయాను సారము మఱెట్టి శబ్దంబును జేర్పకయే మరల "భీముండు నొక్క వృక్షంబు వెఱికికొని" అను వేఱొకవాక్యమును జేర్చుట యన్వయభేదంబుతో నర్థ

సంశయంబుఁగూడఁ గలిగింపకుండెనా? ఇఁక "ఏసె" అను నా యేకవచనక్రియనుబట్టి చూచినఁ గవ్యభిప్రాయ మర్జునపరముగా నున్నను "అని తానును భీమసేనుండును గ్రమ్మఱి అటుకిమ్మట" శత్రువుల పయి" "నట్లమిత శరంబులేసె" నను నా రా యుభయులలో నెవరయినదియు నా వాక్యమువలన నెట్లు విస్పష్టము కాఁగలదు.?

మఱియు "భీముండు నొక్క వృక్షంబు వెఱికికొని" అనెడి వాక్యమునందలి సముచ్చయమును బట్టి మొదట బాణమువేసినవాఁ డర్జునుఁ డని యేల తెలియకుండునందు మేని యా "నొ" వర్ణ ముకారాంతపదమునకుఁ బయి శబ్దారంభమునందలి యొకారమునకు వ్యాకరణవశంబున నాదేశముగా వచ్చిన "నొ" కారముగాక కేవలము సముచ్చయ మనియే యెట్లు నిశ్చయింపం దగును?

ఇఁక నా వచనాదింగల "అని" అను పదమువలన నర్జునుండే బాణంబువేసిన ట్లొక యన్వయమార్గమున్న దనుకొందమనిన "తానును భీమసేనుండును" అను వాక్యమునందలి సముచ్చయన్వయమా పద్ధతిని వ్యతిరేకింపఁజేయకుండెనా?

ఇట్టి పరమక్లిష్టాన్వయమిప్పటి కవిప్రయోగము లందే చూపట్టెనేని:—

"అని భీమసేనసహితంబుగాఁ గ్రమ్మఱి యర్జునుండు రిపుబలంబుపయి నమితశరంబులేయు నా సమయంబున భీమసేనుండు నొక్క వృక్షంబు వెఱికికొని"

అని మఱికొందఱు నవీనకవిపుంగవు లుచితాన్వయంబుగా మార్పం జేయకుందురా?

మఱియు నేతత్ప్రయోగ సంశయాది నివారణార్థము మఱికొన్ని గ్రంథరాజంబులఁ బరిశీలించుచుండఁగా:—

"సీ. ఆహవసన్నద్ధులై భీమకర్ణనందన మేఘవర్ణులు ధర్మతనయు
పాదంబులకు మ్రొక్కి పంకజాక్షునకు దండము పెట్టి యంతఃపురమున కరిగి
కుంతికి నెఱఁగి వీడ్కొని వచ్చి విప్వచ్చుఁ గ్రుచ్చి కౌఁగిటఁ జేర్చి కుస్తరించి
యనఘ! నేఁదురగంబుఁగొనివచ్చు నం [దాక
సంగరశుకుఁడవై యధిపుఁగాచి
గీ. యుండు మనిమాద్రిపుత్త్రుల నుపచరించి
ద్రౌపదికిఁ జెప్పి మఱియును దానవారి
యడుగులకు వ్రాలి యుద్దేవు ననుమతమున
నరిగె ననుమోదమున యావనాశ్వపురికి"

అని పూర్వోక్తభారతవచన క్రియాపదాదిప్రయోగ సంశయంబు ద్విగుణీకృతం బగునట్లు జైమినిభారత ప్రథమాశ్వాసంబు నందును:—

"చ. అనిన మునీంద్రుఁడిట్లులను
నట్లు రణావని రక్తబీజుఁడు
న్ఘనచతురంగసైన్యమును
గ్రాగిన శుంభనిశుంభులుగ్రకో
పను లయి డాసి శుంభుఁడతి
భైరవసైన్యసమేతుఁడై రయం
బునఁ గవిసెన్పరాక్రమము
పొంపిరివోవఁగ దేవిపై వడిన్."

అని యా వచనసమన్వయపద్ధతిని బలపఱచుచు మార్కండేయపురాణ షష్ఠాశ్వాసంబునందును జూపట్టినవి.

విస్తరభీతిచే నింతటితో విరమించితిని. కాఁబట్టి ప్రాజ్ఞు లింకఁగల మదీయలోపంబులను క్షమించుచుఁ బయి సంశయంబులం దీర్పఁ బ్రార్థితులు.

# విద్యానగర సంస్థాపన

దివాకర్ల - వేంకటావధానిగారు,

(బుక్కరాయలు తుంగభద్రానది యావలి యొడ్డునకు మృగయార్థమరిగి, క్రీడించుచున్న కుందేటి దంపతులను గాంచెను. వేటకుక్క లాకుందేటిజంట నెదురక భయపడి వెనుకకు పరుగెత్తెను. ఈ చిత్రము చూచి బుక్కరాయలు తనగురువగు విద్యారణ్యస్వామితో చెప్పగా నాతఁడన్న మాటలు).

చ. ఎదిరిని సింగపుంగొదమనేని మరల్పఁగఁ జాలుశక్తికా
స్పదములు నీదుశ్వానములు సత్త్వవిహీనము లన్నతిక్రియా
భ్యుదితవిలాసతోష పరిపూరితచిత్తములన్ శశమ్ములె
న్నెదురమి కొక్క దైవికము హేతువు చొప్పడియుండు భూవరా!

చ. తురకల యొత్తిడిన్ బలిమితోడ నివారణసేయలేక యు
ద్ధురతర దుఃఖభాజనతఁ దూలెడి హైందవులన్ మహాదయా
పరుఁడయి కావ నెంచిన శివంకరమూర్తి విరూపలోచనుం
డరిగిన రాత్రి నాదు కలయందు వచించెను దీని యర్థమున్.

శా. పంపాదేవియుఁ దాను బాలశశదంపత్యార్ద్రితాకారులై
శంపామేఘములట్లు కూడుకొని యుత్సాహించుటల్ గాంచువాఁ
డింపార స్వరరాజ్య మొండచట నిర్మింపించి హింద్వాదిపా
రంపర్యావనయమ్ముసేయు నని నిర్ధారించె భూమీధవా!

మ. అదినేఁడే సమకూడె హిందువుల పుణ్యాలెల్లనుం బండి త
ద్విదితానేకవిపత్పరంపరలకుఁ విఘ్నమ్ము కల్పించి శ
శ్వదమందప్రథమానకీర్తి గడియింపం గల్గె నీకెంత య
భ్యుదయావాప్తికి నోచిపుట్టితివి నీవూ రాజకంఠీరవా!

గీ. వేటతతి నీవు కాంచి నిర్విణ్ణుడయిన, వెల్ల కుందేటిదంపతులెల్ల జగము
లరసి రక్షించుదేవి దేవరయు నిజము, భువనతాపాపనోదన పూతభవన.

మ. తన పాదార్చనమే మహావనముగా ధ్యానించు హిందూప్రజా
వినమచ్ఛీర్ష గణమ్ము క్రూరయవనాభీలాసి కృత్తమ్ములై

యనయమ్మునం దొరఁగించు పూతరుధిర వ్యక్తాతిరక్తత్వమున్
గనుచున్నట్టి విరూపలోచనునికిం గన్నెత్తి కాకుండునే ?

ఉ. ఇంచుకయేని మీఁదెఱుఁగ కింతులు బిడ్డలు నాక తుంగభ
ద్రాంచితవార్ని రస్త వృజినాంగుల హైందవుల న్వధింపఁగాఁ
బంచిన మ్లేచ్ఛరాజుల కపాయము చేరువయాయెఁ గాన య
త్నించి తదాధిరాజ్యమవినీతముఁ బోవఁగఁ ద్రోయు భూవరా !

కం. తూరుపున నుదితమయి రా, జారిష్టము కానిపించి యరిగినభీదా
కారమ్ము ధూమకేతువు, నారసినారము కదా ధరాధిపవంద్యా!

ఉ. దైవము కూడియున్నపుడ దానికిఁదగ్గది పౌరుషమ్ము సం
భావనచేసి కార్యము లుపాయముతో నెరవేర్చుకొంట సి
ద్ధ్యావహమాను గావున సమార్జితయుక్తపరిచ్ఛదుండ వై
యావల ద్రోసి యీతురక లందఱ కాంధ్రులచేవఁ జూపుమా !

ఉ. రమణూణమ్ము శశద్వయమ్ము నెచటన్ రాజేంద్ర వీక్షించితో
యమల మ్మాతల మచ్చటొండు పురముం ద్రొబ్బ్యమ్ము నిర్మించుమం
డమరాధీశసమానులౌ నృపులు రాజ్యంబేలి గావింత్రు స
ర్వమనీషిస్థిరవాస నిశ్చలయశశ్శోభాయమానమ్ముగా. (?)



# శతావధాని శ్రీచెళ్లపిళ్ల - వేంకటశాస్త్రిగారు

అడవి - శంకరరావుగారు, బి. ఏ. ఎల్. టి.

## అవధానములు

విద్యార్థిదశ ముగియకుండఁగనే:—

సీ. బాల్యమ్ములోనన పండితుల్ మెచ్చంగ
నఖిలవిద్యలు కాశి నభ్యసించెఁ
దరువాత దేశాన కరుదెంచి ధవళేశ్వ
రమ్మున నన్నసత్రమ్ము వెట్టె
నిదిగాక విద్యార్థు లెందఱినో పండి
తులఁ జేసి దానసంస్తుతులు గనియె
నది యట్టులుండ ద్రవ్యము లేని తనశిష్యు
లెందఱికేనిఁ బెండ్లిండ్లు చేసె
పొట్ట పోషించికొనియెడి బుధులు పెక్కు
గలరుగాని జగమ్మునఁగలరె? యిట్టి
పండితు లటంచు నుతియింపఁ బ్రబలె [నార !
చర్లవంశ్యుండు బ్రహ్మయశాస్త్రిఘనుఁడు.

అని తమగురువును స్మరించి 1892 (ఖర-ఆశ్వయుజ బహుళాష్టమి శనివారము) నవంబరు 23 తేదిని శ్రీబాదము-వేంకటరత్నముగారి ప్రోత్సాహమున తిరుపతి వేంకటకవులు జయప్రదముగా కాకినాడలో శతావధాన మొనర్చిరి. వీరిరువురుఁ గలిసి శతావధాన మొనర్చుట కిదియే ప్రారంభము:—

చ. నిలిచియె వేయిపద్యముల
నేర్పలరంగను సంస్కృతాంధ్ర భా
షలఁ దగఁజెప్ప నేర్తుమని
చాలఁ బ్రతిజ్ఞ వహించినట్టి మే
మెలమిని నూఱు పద్యముల
నిప్పుడు చెప్పుట కెంతగొప్పయా
నిల వరబాద మన్వయ న
దీశ సుధాకర ! వేంకటాభిధా.

అని సభాధ్యక్షున కుత్సాహముగల్గించి శతావధానమును జయప్రదముగ నాఁడునిర్వహించిన మీదట వీరు వివిధస్థలముల అవధానముల జయప్రదముగా జరుపఁ జొచ్చిరి. 1892 నాటికి దేశమున కఱవు ప్రబలి యుండినప్పుడు:—

తే. బచ్చువంశాబ్ధిసోముండు వరగుణుండు
గర్వదూరుండు రామేశఘనుడు పేర్మి
గచ్చుకుండ్లను గట్టించి కడపె జలము
కాకినాడపురమ్మునఁ గరువుదీర.

శా. ధారాపాతములేక సస్యవితతుల్
తప్తమ్ములయ్యెన్ గదన్
జేరెన్ సర్వజనంబు నీపురమునే
జీవింప వారందఱిన్
శ్రీరామేశఘనుండు ప్రోచి మునుదా
శ్రీవృష్టి నాథుండుమున్
బారిన్ ద్రోలెను"

అని బచ్చురామేశముగారిపరోపకారచింతను తిరుపతి వేంకటకవులు మెచ్చుకొనినారు. 1893 - 94 సంవత్సరములలో (నందన - విజయ) ఏలూరు, బందరు, మదరాసు, నెల్లూరు, వెంకటగిరి, విశాఖపట్టణము, ధవళేశ్వరము, బెజవాడ మున్నగు స్థలములలో తిరు

పతి వేంకటకవులు శతావధానములను అష్టావధానముల నొనర్చిరి. వీరిదేశాటనమున కిది ప్రథమదశ,

1892-93 (మన్మథ-దుర్ముఖి) సంవత్సరములలో బెజవాడ, విజయనగరము, క్రొత్తపల్లి, గద్వాల, (మొదటిసారి), నరసాపురము, మొగలితుర్తి, రెండవ సారి కాకినాడలోను తిరుపతి వేంకటకవులచే శతావధానములు చేయబడినవి. 1893 ఆగష్టు (విజయ-ఆషాఢ) లో ఏలూరులో జరిగిన అవధానములో కలియుగ రీతిని వీ రిట్లు వర్ణించినారు:—

సీ. వేదవేదాంగాది విద్యల విడనాడి
    బ్రాహ్మణులింగ్లీషుభాషులైరి
క్షత్రధర్మంబునఁ జరియించురాజకు
    లంబెల్లఁ జేత హాలమ్మెఁబూనె
వాణిజ్యవృత్తిచే నలరు కోమటులెల్ల
    యజ్ఞయాగాది కృత్యపరులైరి
ద్విజసేవకత్వవృత్తిని జీవనముసేయు
    పాదజుల్ ద్విజసేవ్య పదముగనిరి
తే. హూణులెల్లరు రాజ్యప్రవీణులైరి
గారవములేని వారధికారులైరి
పేరులేనట్టివారు కుబేరులైరి
కలియుగపుఁ జర్యలేమనగలము మనము.

1894 జనవరిలో వీరు చెన్నపురిలో నొనర్చిన యవధానములలో నొకటి:—

"శేషునిఁబోలి లెక్చెరుచెప్పఁగా జాలు నానేబిసంటు" దొరసాని యెదుటను, రెండవది

"ఎవనికుశాగ్ర బుద్ధివిశేషములు చూడ శతఘంట కవికి నాశ్చర్యమొదవు"

నో యట్టిరెంటాల వెంకటసుబ్బరావుగారి మేడ లోను జరుపఁబడినవి. నెల్లూరిలో సివిలుజడ్జియైన సి. రామచంద్రయ్యగారు తిరుపతి వేంకటకవులను విందుఁజేసి "జడ్జీలచే నీయఁబడు పుష్పమాలికల్ కవిశిఖామణులకబ్బు" నట్లు జేసిరి. 1894 మార్చిలో:—

"బాల్యవయస్సులోఁ పలఁ గాకినాడలోఁ
గింకవిగజసింహ కీర్తినొసఁగి
యటుమీఁదికాలమునందమలాపురమునందు
విద్వత్కవీంద్ర సద్బిరుదునొసఁగి
తదనంతరంబు బందరు పట్టణమునందు
బాలకలానిధి ప్రతిభ నొసఁగి
నిన్నగాకను మొన్న నెల్లూరుపురమున
బాలసరస్వతీ భావమొసఁగి
కంటికిని ఱెప్పవలె తమ్ముగాంచినట్టి"

కాళినిస్మరించి వేంకటగిరిలో వీ రవధానమొనర్చి చెలికాని గోపాలరావు గారిచే సత్కరింపబడిరి.

"సంస్కృతాంధ్రమ్ముల శతఘంటకవనమ్ముపచరించినట్టి విద్వత్ప్రభుండు" ను

"ఆనం దంతీశ్వరాఖ్య రాజాఖండలున కెంతయును మైత్రిగనిన మేటి"

యునైన కిళాంబి రామానుజాచార్యులుగారు (ఎమ్. ఎ. బి. ఎల్.) "జౌనగ" వీరి యవధానప్రదర్శను 1895 సెప్టెంబరులో విజయనగరమున జరిగినది. 1896 జూన్ నెలలో (దుర్ముఖ - జ్యేష్ఠ) హూణు లీదేశమునకు వచ్చినరీతిని వీరిట్లు నర్సాపురములో శతావధాన సమయమున వర్ణించినారు:—

సీ. భిక్షుపాదాంబుజ ప్రక్షేపణన్యాయ
    మున మొదలీదేశమునకువచ్చి
క్రమముగఁగొంత దేశము వర్తకమునకై
    మైత్రికల్మిని నాక్రమణ మొనర్చి

యెటుమీఁదమతికొంతయార్జించియద్దాన
స్వల్పమ్ముగాసేన సంగ్రహించి
పిమ్మటఁగొందఱఁ బృథ్వీశులఁ నడంచి
యచ్చటచ్చటఁ గోట లాక్రమించి
తే. గీ. క్రమముగానెల్లభూమి వశముగఁ జేసి
సర్వరాజన్యులును బన్నొసంగసిప్పు
డేలుచున్నారు మనదేశమెల్లయెడల
వారలు కొంతెటి కార్యప్రవీణులొకద !

1897 జనవరి (దుర్ముఖ - మార్గశిరములో)లో పిఠా
పురము వాడ్రేవు వేంకటరత్నముగారి యెదుట జరిపిన
శతావధానములో:—

చ. ఇతరకవుల్ ప్రయాసపడి
యెంచిరచించిన నూటికెన్ని పె
ద్దతనముగాంచి చిత్తమును
దన్పునొ మేమవధాన సంగత
స్థితిగని యాశుగా రచన
చేసిన పద్యములందుఁజూచినన్
శతమున కన్నిపద్యములు
చక్కఁగనుండు నసంశయమ్ముగన్.

అని వీరు చెప్పికొనినారు. 1898 - 1900 సం॥ ల
మధ్య వీరు కిర్లంపూడి, కొత్తపేట, పాలతేరు, గజ
పతినగరము, విశాఖపట్టణము, నరసారావుపేట, కేశ
వకుర్తి మున్నగుచోట్ల అవధానములు చేసిరి. ఈ అవ
ధానములలోనిదియే యగు కోట రామచంద్రపుర
ములో:—

మ. పరమంబైన తిరస్కృతింగని సభన్
భాషింపఁగా రాని దుః
ఖరసావేశతనొప్పు పండితుని వ
క్త్రమ్మున్ విడంబించుచున్
జరమప్రస్థిత పాండురోగినఖర
చ్ఛాయానుకారిస్థితిన్
ధరణిన్ దారక లొప్పె నస్తమితుఁడౌ
తారేశు కాలమ్మునన్.

అని తెల్లవారుసమయమున నక్షత్రములు వర్ణింపఁ
బడినవి. విజయనగరము మహారాజు శ్రీ ఆనందగజ
పతి 1897లో స్వర్గస్థుఁడయ్యెను. 1900 మే (శార్వరి -
వైశాఖము) లో గజపతినగరములో చేసిన యష్టావ
ధానములో తిరుపతి వేంకటకవులు ఆమహారాజుమర
ణము నిట్లు వర్ణించినారు:—

సీ. పర్షాశనార్థంబు వచ్చుపండితకోటి
పోలుపుమీఱఁగ రాకపోక లుడిగె
నెలజీతముల గృహమ్ములనుండిజీవించు
గాయకుల్ పరదేశ గతినిఁజెంది
రతులితైశ్వర్యమ్ము లలరారు నుద్యోగి
తతులకుద్యోగముల్ తప్పిపోయె
నతిదూరమునసనుండి యరుదెంచుపాంథుల
కన్నదానంబు లేదనుటగల్గె
తే. గీ. కవులువచ్చుటమానిరి గాయకులు వి
చారవారిధిమునిఁగి యిచ్చటికిదూర
దేశములనుండిరారని తెలివిగల్గు
వారలానందనృపునెంచి వంతగాంత్రు.

గాయకులకు కల్పతరువును, పండితకవులను పారిజాత
మునైన ఆనందగజపతి మహారాజుమరణము ఆంధ్రదేశ
మునకు చాలకాలమువఱకు దీరని లోటుఁ గల్గించినది.
విశాఖపట్టపణములో తిరుపతి వేంకటకవు లీ సంవత్స
రములో నొనర్చిన యష్టావధానము. "విక్రమ
దేవవర్మ పృథివీపతిరత్నముకో ర్కెమీఁద"
జరుపఁబడినది. ఈవిక్రమదేవవర్మగారే నేడు శ్రీ
జయపుర మహారాజులైనారు. 1901 - 1902 సం॥ లో

తిరుపతి వేంకటకవులు రెడ్డిపోలవరము, అనకాపల్లి, శ్రీకాకుళము ఉర్లాము, మందసా, నూజువీడు,మున్నగు చోటులందు, తమ యవధాన ప్రదర్శనముల జరిపిరి. ఇందు నూజువీడులో 1903 ఫిబ్రవరి (శుభకృత్తు-మాఘము)లో జరుపఁబడిన శతావధానము సంపూర్ణముగా నొక్క వేంకట శాస్త్రిగారిచేతనే జరుపఁబడినది. అనకాపల్లి యవధానములో పోలీసు జవానులు:—

క. యమదూత లెట్టిరో యెఱుఁ
గను నెడిలోపమ్ము దీర్పఁగా పోలీస్వా
రి మహి ప్రభువు లేర్పఱచిరి
కుమతులకే వారు వీరుఁ గూర్తురు బాధల్.

అని వర్ణింపఁబడిరి. ఉర్లామసంస్థానములో జరుపఁబడిన శతావధానములో:—

మ. "అరె సర్కార్ హుకుమండి జల్దీ" యనియ
త్యాలాపముల్ సేయుచున్
ద్వరతో వంటయిలున్ జొరంబడి పొయిం
దార్కొన్న పాత్రమ్ముని
ష్కరుణుండై వెలికీడ్వ గేస్తపు "డహా? 
సాహేబిటుల్ చూడుమా!
కరుణన్ జెందుము రూకకై కొనుము నన్
గాపాడు మీమాట" నున్.

అని జప్తుబంట్రోతు ప్రభావము వర్ణింపఁబడినది. నూజువీడు శతావధానములో బైసికిల్ చక్కగ వర్ణింపఁబడినది:—

శా. నీరుం గోరదు గడ్డి నడ్గదు కళా
న్నే నుల్వలన్వేఁడ దే
వారే నెక్కినఁ గ్రిందఁ ద్రోయ దొకఁడు
న్బజిన్ఖటుం గదుంటచే
కూగం గావల దెందుమై స్కిలునకుం
గోపం బొకింతేని లే
దారా! వాజికసాటియైన యిదివి
శ్వామిత్ర సృష్టంబొకో.

1903 (శోభకృత్తు)లో తోటపల్లూరు, రెండవసారి ఏలూరు 1904 (క్రోధి)లో నూజువీడు 1906 (పరాభవ)లో నూజువీడు శ్రీవానమామల జియ్యంగారిసన్నిధిని 1907 (ప్లవంగ)లో ఖాసింకోట, 1908లో బెజవాడ, చెన్నపట్టణము, రాజమహేంద్రవరకళాశాలయందున్న మరి పెక్కుచోటులను వీ రష్టావధానములను శతావధానముల నొనర్చిరి.

1903నాటికి తోటపల్లూరు సంస్థానాధిపతియైన భాష్యకారభూపతి. "అన్నతోఁ బోరాకె యన్ని కోరుటలును దిరిగితుదకు జయంపురహిగాంచి" యుండెను. నూజువీడులో శ్రీవానమామల జియ్యంగారిసన్నిధిని జరిగిన యవధానమునందు 1906 నాటికి సంభవించిన "ఆరర్బతునాటు ఘోరము" వర్ణింపఁబడినది:—

సీ. ఉద్యోగములు చేసి యూళ్ల నెల్లను దోచి
యార్జించినట్టి ద్రవ్యంబు కొంత
భూములన్నిటి నమ్మి పొలఁతుల నగలమ్మి
సమకూర్చినట్టి విత్తమది కొంత
వ్యవసాయములు చేసి వర్తకమ్మొనర్చి
కైకొన్న యట్టి రొక్కమ్ము కొంత
పిల్లికైనను బిచ్చ పెట్టకార్జించిన
వసుమతీశ్వరుల ద్రవ్యంబు కొంత

తే. గీ. దేశదేశమ్ములకుఁ బోయి తిరిపమెత్తి
యాగ్జనము చేసికొన్న ద్రవ్యమ్ము కొంత

ఆరబతునాటుహరియించె నౌర ! వీరి
క్షౌరమున కీడువచ్చెడి క్షౌరమున్నె:

1908లో బెజవాడలో తిరుపతివేంకటకవు లొనర్చిన శతాష్టావధానములు కీ॥శే॥ వెలమూడి- రామయ్యగారి యాదరణమున జరుపఁబడినవి. 1908 జనవరిలో నే తిరుపతివేంకటకవులు చెన్నపురిలో రాజధానికళాశాలలో సంస్కృతపండితులగు యస్. రంగాచార్యులుగారి యొక్కయు, పనప్పాకము - ఆనందాచార్యులుగారి యొక్కయు మన్ననల నందుకొనిరి. 1908నాటికి ప్రసిద్ధిఁజెందిన బాలగంగాధరతిలకును, విపినచంద్రపాలుని, లజపతిరాయిని రాజమహేంద్రవరములో దొరతనమువారి కళాశాలలో జరిపిన యష్టావధానములో వీరిట్లుస్తుతించినారు:—

శా. శ్రీమంతుండగు పాలునున్ దిలకు వా
 సిన్ బొల్చురాయుండును
ద్దామంబా తమ దేశదుఃస్థితికిఁజిం
 తంబొంది దేశంబుతా
నేమాడ్కిం దెలివొంది కష్టములకో
 క్కిం తేనిసందీక సు
క్షేమంబందునొ యట్టి సద్విధులలోఁ
 జింతింతురశ్రాంతమున్.

వీరిటీవల నొనర్చిన శతావధానములలో మైలవరము (ఏప్రియల్ 1911), గుంటూరు (ఆగస్టు 1911), బ్రాహ్మణకోడూరు (సెప్టెంబరు 1911), పినపాడు (సెప్టెంబరు 1911), నరసారావుపేట (అక్టోబరు 1911), బాపట్ల(అక్టోబరు 1911), వేమవరము(డిశంబరు 1912), లక్ష్మీనరసాపురము (నవంబరు 1914) శతావధానములు ముఖ్యములైనవి 1911 ఆగస్టు 19 - 20 తేదీలను గుంటూరిలో వీరొనర్చిన యవధానమునకు శ్రీకాశీకృష్ణమాచార్యులుగారు సభాధ్యక్షత వహించిరి. ఈ యవధానసభలో నే వీరికిని కొప్పరపు కవులకును వివాదములు ప్రారంభమైనవి. లక్ష్మీనరసాపురము శతావధానము శ్రీరాజా చెల్లాయమ్మారావు జమీందారిణీవారి షష్ఠిపూర్తిమహోత్సవ సందర్భమున జరుపఁబడినది. గుంటూరు శతావధానమునాఁటికి వేంకటశాస్త్రిగారికి నలువది సంవత్సరములు దాటినవి:—

ఉ. చేసితిమో యెవండెఱుఁగు
 జేయనె లేదో శతావధాన మం
బా! సకలేశ్వరీగతము
 నందఱు నమ్మరు నేఁడెటోరసా
భాసముగాకయుండఁగఁగ్రొ
 పన్గను మెప్పటి కప్పుడే యిటుల్
దోసిలి నొగ్గునీకఁ డని
 తోఁచి త్యజించెదవేమొ శాంకరీ.

అని వేంకటశాస్త్రియు:—

చ. తలనరయం దొడంగెఁ గవి
 తావనితామణియున్ బతివ్రతా
తిలకము నీడుజోడయిన
 దేయగుటన్ భయభక్తియుక్తకాఁ
గలదిఁక ధారణా తరుణి
 కారుణికత్వపుఁబ్రేమజూపగాఁ
దలచునొ లేదో! యంచు మదిఁ
 దత్తఱమిత్తఱిఁ గ్రొత్తగొల్పెడిన్.

అని తిరుపతిశాస్త్రియు ఆనాడు తమ యిష్టదేవతా ప్రార్థనము చేసినారు. చాలయల్లరి జరిగినతరువాత ప్రారంభమైన ఈ సభాప్రారంభమున వీరి మనోవృత్తి ఈపై ప్రార్థనాపద్యములలో గోచరమగుచున్నది:—

చ. "వయసు గతించుచున్నదిఁక
 వల్దవధానము" లంచు మేము త

ద్దయు బ్రతిమాలి యేటికవ
ధానములన్ సమకూర్చెదన్న "నా
దయ కొకఁడున్న వార్ధకము
తాత" యటంచు వచించెదే మొ,య
ట్లయిన "తథాస్తు" నీయభిమ
తార్థమె తీర్చెదమమ్మ శాంకరీ!

అని బ్రాహ్మణకోడూరు అవధాన ప్రారంభమున తిరుపతిశాస్త్రియు,

మ. వయసాహెచ్చెడి, బట్టకట్టె తలద్రి
ప్పన్ జొచ్చె నానాఁట నీ
దయయున్ బ్రాజ్ఞుల ప్రేరకత్వమును వి
ద్యాపక్షపాతంబుని
న్నియు నేకీకరణంబుగా, గృహమున
న్నేఁదీరి కూర్చుండలే
క యెదో సేయగవచ్చినాఁడను జుమీ?
కాత్యాయనీ! కావుమీ.

అని వేమవరాగ్రహార శతావధాన ప్రారంభమున వేంకటశాస్త్రిగారును చేసిన దేవీసంప్రార్థనాపద్యముల వలన వీరికి ఉత్తరవయస్సని చెప్పఁదగిన ఈ సంవత్సరములలో అవధానప్రదర్శనము లెంత శ్రమ గల్గించుచుండెనో తెలియుచున్నది. తిరుపతిశాస్త్రి 1920 డిశంబరు 7 వ తేదిని మృతినొందెను. తిరుపతి వేంకటకవులు కలిసి చేసిన ముఖ్యములైన శతావధానములలో లక్ష్మీనరసాపురము శతావధానమే కడపటి శతావధానమని చెప్పవచ్చును. తిరుపతిశాస్త్రి మరణించు నాఁటికి ఆతనికి నలువదితొమ్మిది సంవత్సరములు వయస్సు. "బుద్ధికి రెండుశక్తులు గలవు. అందొకటి గ్రహణశక్తి. రెండవది ధారణాశక్తి. గ్రహణశక్తిలోఁ దిరుపతికి వేంకటేశ్వరుఁడించుక లొచ్చు......ధారణాశక్తిలో వేంకటేశ్వరునికిఁ దిరుపతి యించుకలొచ్చు ........ఈ తారతమ్యము వేంకటశాస్త్రి ప్రత్యేకించి నిర్వహించిన నూజువీటి సంపూర్ణ శతావధాన కాలము (1902 ఫిబ్రవరి) వఱకే కాని యటుపిమ్మటఁ గాదని యెఱుఁగఁదగు......విశేష పరిశ్రమము నిడుటచే వేంకటశాస్త్రి బుద్ధి బలము కొంత తగ్గిపోయినదనియు, తిరుపతిశాస్త్రికో ఆమరణమును నొకటే విధమున నినుమడించు బుద్ధిబలము నిలిచి యుండెననియు, ఈ హేతువుచేతనే యిటీవలి యవధానములన్నియుఁ దిరుపతిశాస్త్రియే నిర్వహించుచు వచ్చెననియు నెఱుఁగఁదగు"నని వేంకటశాస్త్రిగారే "దివాకరాస్తమయము"లో వ్రాసియున్నారు. తాము శతావధానులగుటచే తమ కావ్యములలోను నాటకములలోను ప్రధానపాత్రలను శతావధానులుగాఁ జేయుట తిరుపతి వేంకటకవులకు పరిపాటియైనది. శ్రవణానందములోని నాయకుఁడగు మధుసూదనుఁడు వేశ్యావిరక్తుఁడైనతరువాత ఆతఁడు గవియై శతావధానియై దేశాటన మొనరించి అనేకరాజసభలలో గౌరవింపఁబడినట్లు వర్ణింపఁబడినది. అట్లే పండితరాజములో నాయకుడైన జగన్నాథరాయలు:—

"చదువటులుండ నెల్లర ప్ర
శంసకునెక్కిన మేటిధాటినొ
ప్పిదముగఁ జెప్ప నేరుతుఁగ
విత్వ"

మని ప్రకటించుకొనుటయే గాక న్యస్తాక్షరియందుఁ గూడ దన ప్రజ్ఞఁ బ్రదర్శించినాఁడు. ఏబదియైదేండ్లకు మించిన యుత్తరవయస్సులో వీరు రచించిన ప్రభావతీ ప్రద్యుమ్న నాటకమున రాయంచయైన శుచిముఖి, "ధారుణిఁ బేరునెందె తవధానములన్ సయనేంద్రియ క్రియా కారితమైన చిత్తమునఁ గల్గునె విస్మృతి" యని పేర్వడసినది, తిరుపతి వేంకటకవులవలెనే. "వయసు గతించుచుండెనెలఁ బ్రాయమునం గల మేధ నేఁడు లేద"ని చెప్పుకొనినది. ... ... ... ... ...

(సశేషము)

# పవిత్రప్రేమ

మదునూరి-వేంకటకృష్ణరావుగారు,

నవవసంతము; వెన్నెల నాట్యమాడు చున్నది; కోయిల మధురగీతాలు పాడు చున్నది. పుష్పభరితమైన వృక్షములు చిగిర్చిన లతలు సింగారించుకొని ప్రుంటిమైనున్న కాంతం ప్రేమలనుచూచి నవ్వుచున్నవి.

ప్రేమ సౌందర్యదేవతోపాసిని; ఆదేవతని నవ్యభూషణాంబరాలతో అలంకరిస్తోంది. ఎవరికీ తెలియకుండా స్వేచ్ఛగా తిరగటానికి వీలుంటే, ప్రేమ పిట్టలవలె రెక్కలు విదిలించి ఆకాశంలోఎగిరి ఎక్కడికో పోయేది. కాంతం కవికుమారుడు; నవ్యకళోపాసకుడు. రస నిమగ్నాల్లో రాసక్రీడలు సల్పుచుండేవాడు; తత్ఫలితంగా పాటలు పద్యాలు అవతరించేవి. శీతలకౌముదీరాత్రులందు తన గీతాలు పాడు తుండేవాడు. నవసాహితిసాంప్రదాయాల ననుసరించి సదమల ప్రవతరాగాన్ని మటిపించే అతనికవితాఝురి ప్రణుతిపాత్రమైనది. తనకు కవిత్వధోరణిని అలవడజేసిన కృపామూర్తిప్రకృతికి కాంతం కృతజ్ఞతగా తద్దేవతామూర్తిని భావతరంగాల్లో నిర్మిస్తూండేవాడు.

ప్రకృతి అంతా నిశ్శబ్దము—నిర్మలనీలాకాశము. అంతే! ఆయిద్దరిమేనులు పులకరించాయి. చూపులు రెండు ఒకదాన్నిఒకటి తెలిచితలిచి పరీక్షచేసుకున్నాయి. ఇద్దరి పెదవులపైన చిరునవ్వు తాండవించింది. చెట్లమీదనుండి రెండు మంచుబిందువులు వీళ్లమీదపడ్డాయి.

'... ... ... ... ... ... ... ... ... ...

... .. ... ... .. ... ... ... ... ... ...

సేసలువెట్టినయట్టులైరి ... ... ... ... ... ...

.......................................

ప్రకృతి చల్లగా సాగింది; ఆ ప్రకృతిలో లీనమైపోతున్నారిరువురు. నునుసిగ్గుల కెరటాలు వాళ్లముఖాలను కప్పేసినవి. నిర్మలాకాశాన తారలు మినుకుమినుకుమంటూ పొడువసాగినవి. అన్యోన్యంగా వాళ్లఆత్మల్లో ఆశాజ్యోతి వెలుగసాగింది. ప్రణయతారలు వాళ్ల నిశ్చలహృదయాకాశాల్లో వెలుగుతున్నాయి. ఆఆలన — ఆలాలన—ఆపాలన— ఆసంపద —ఆసౌఖ్యం—ఆ ఆనందమయ సముద్రములో వాళ్ళిద్దరూ— ... యీదులాడసాగినారు.

కాంతం ప్రేమచూపుల్ని, నవ్వుల్ని, ఆనడకని, ఆచేతల్నివిడిచి వెళ్లలేకపోయినాడు.

* * *

ప్రేమచిదిమిన పాల్గారుచెక్కుటద్దములపై లజ్జారుణకాంతులు జిలిబిలి చిందులాడుతున్నాయి; ఆకాంతుల్ని పట్టుకోవాలని కాంతం.

ప్రేమవాహిని వేగముతో ప్రేమహృదయములో ప్రవహిస్తోంది; ప్రవహింప దారిలేదు,—నిరవధికమై, నిమ్నమై, యొడ్లనొరసి, వెల్లివిరిసి ప్రవహింపదుగద!

# అస్పృశ్యత



1. రామశాస్త్రి:—మాలవెధవవి. బ్రాహ్మణ వీధిలోకివచ్చి మమ్మల్ని మైల పరుస్తావా! ఛో ఛో ఈ దెబ్బతిని.

తమ్మిగాడు... బాబోయ్! (పారిపోవును.)



2. తమ్మి—అమ్మా! అ...మ్మా! ఫాదిరి విల్సను—మరేం భయపడకు. నేను నిన్ను రక్షిస్తాను.



3. ఫాదిరి—నిన్ను అంటరానివాణ్ణీ చూడరానివాణ్ణీ చేసిన పాడు మతం విడిచి కిరస్తానీ వాడి వైపో. తామస్!

తమ్మి - చిత్తమండి.



4. రామశాస్త్రి—శ్రీ తామస్ దొరవారు మనఊరికి కలక్టరుగా వచ్చినందుకు ధన్యులం (అంటూ అతని - తమ్మిగాడి - మెడలో పూల హారం వేయును.)

# కబీరు

పురిపండా - అప్పలస్వామిగారు, (కవితాసమితి)

౧

అతని మురళి మాధుర్యము నాకర్ణించితిని. నేనింక సైచికొనలేను.

వసంతము కాకున్నను లతాంతములు వికసించినవి. భ్రమరిక అప్పుడే తన ఆహ్వానమును స్వీకరించినది.

శంపాతకళితమై ఆకసము గర్జిల్లుచున్నది. నాహృదయమున తరంగము లుప్పొంగుచున్నవి.

వర్షము కురియుచున్నది. ప్రియతముని కొఱకు నాహృదయ మాతురపడుచున్నది.

విశ్వసంగీతము తాళబద్ధమగు చోటికి పరువెత్తుచున్నది.

అచ్చటి రహఃపతాకములు అనిలప్రకంపితము లగుచున్నవి.

"నాహృదయము జీవించి యుండియు మరణించుచున్నది." అని కబీ రనుచున్నాడు.

౨

నెచ్చెలీ!

మేల్కొనుము. ఇంకను నిద్రయా?

రజని గడచిపోయినది. నీ పగటినిసైతము వ్యర్థపరుతువా?

మేల్కొనిన వారెల్లరును రత్నముల బడసినారు. జడమతీ! నీ నిద్రాసమయమున అంతయు గోల్పోతివి.

నీప్రియుఁడు ధీశాలి. అబలా! నీవు జడమతివి.

నీవెన్నడును నీపతిశయ్య నమర్పవైతివి. వెఱ్ఱిదానా! నీకాల మంతయు పిచ్చిఆటలతో వ్యర్థ మొనర్చితివి.

నీవిభుని గుర్తింపని కారణమున నీయావన మంతయు వ్యర్థముగ గడచిపోయినది.

లెమ్ము, లెమ్ము, పరికింపుము, నీ శయ్యాతలము శూన్యమై యున్నది. అతడు రాత్రి నిన్ను పరిత్యజించినాడు.

"ఎవతె హృదయ మాతని గానమున వ్యధితమై ఆకులపడునో ఆమెయే మేల్కొనును" అని కబీ రనుచున్నాడు.

3

హృదయమును ప్రేమవర్ణాంకిత మొనర్చుటకు మారు తన వసనములకు రంగు లద్దుచున్నాడు యోగి.

పరబ్రహ్మము నారాధించుట విడిచి ఒక శిలను పూజించుటకు దేవళమునందు కూర్చొను చున్నా డతఁడు. కర్ణములకు పోగుల దొడిగి దట్టమగు గడ్డముతోడను, జడలు గట్టిన శిరోజములతోడను అతడు మేషమువలె గోచరించును!

అరణ్యములకుం జని కోర్కుల నడంచి నపుంసకుడుగ మారిపోవుచున్నాడు,

గీతాధ్యయన మొనర్చి వాక్యూరుడగు చున్నాడు.

"తమ్ముఁడా! నీవు కరచరణములు బంధింపఁబడి మృత్యుద్వారమున కరుగుచున్నావు సుమా!" అని కబీరు చెప్పుచున్నాడు.

౪

పరమాత్మ - ఆపరమేశ్వరుడు నీచెంత నున్నాడు. హృదయమా! లెమ్ము, మేల్కొనుము.

నీప్రాణప్రియుఁడు నీపార్శ్వమున నిలిచి యున్నాడు. పరువెత్తు మాతని పాదముల కడకు.

యుగయుగమ్ములనుండి నిద్రించుచున్నావు. ఈప్రభాతమునకైన మేల్కొనవా ?

౫

హృదయమా!

ప్రేమనగర రహస్యముల గుర్తింపలేక పోయితివి. అజ్ఞానముతో వచ్చి అజ్ఞానముతో మరలి పోవుచున్నావు. నెచ్చెలీ ! ఈజీవితముతో నేమి సాధించితివి ?

రాయిరప్పలతో నీశిరమ్ము భారతమ మొనర్చుకొంటివి. నీకొరకెవరు దానిని తేలికపరచెదరు ?

నీసఖుడావలితీరమున నిలిచి యున్నాడు, కాని వానిని కలియగలనని నీవెన్నడును భావింపలేదు.

నౌక భగ్నమైపోయినది. అయినను నీవు తీరమునందు వసించి అకారణముగ తరంగములచేత కొట్టబడుచున్నావు.

సేవకుడగు కబీరు నిన్ను యోజింప మనుచున్నాడు.

"అంత్యకాలమున నీకెవ్వడు సఖుడు?"

ఏకాకివి నీవు. నీకు తోడెవ్వరులేరు. నీ స్వయంకృతాపరాధమును నీవనుభవింపక తప్పదు.

——:o:——

## స్వయంవరము

(భాస్కరుఁడు)

తాలూకాఆఫీసులో నెలకు నలువది యయిదు రూపాయిలు యుద్యోగము. పెద్దలు సంపాదించిన యిల్లున్నది. భార్య యనుకూలు రాలు. కొడుకు స్కూలులో చదువుచున్నాడు. కూతురు పసిది. ప్రావిడెంటు ఫండులో నేమి యిన్సూరెన్సులో నేమి కొంచెము కొంచెము డబ్బు నిలువ యగుచున్నది.

ఈరీతిగా కాలువ - రామచంద్రశాస్త్రి కోవెలకుంట్లలో పొదుపుగా సంసారము జరుపు చున్నాడు. కోవెలకుంట్ల పట్టణవాస మనుగాదు. పల్లెటూరిలో లెక్కయుగాదు. కాఁబట్టి యక్కడ పల్లెటూరి యారోగ్య మును పట్టణసౌకర్యములును గలవనుట యసత్యము కాదు. రామచంద్రశాస్త్రియును చేద స్తములేని యాచారపరుఁడు. పెండ్లము యొక్క యానుకూల్యము. ఇరువురికి సమాన గానే యున్నతృప్తి. వీనివలన శాస్త్రి యం తగా చింతయు జీకటియు లేక జీవితము గడపుచున్నాడు.

కూఁతునకు పదమూఁడవయేడు వచ్చినది. ఇతఁడేమో ఆమెపెండ్లివిషయము తలపెట్టక దిమ్మరంగా యనియే ఖులాసాగా నున్నాఁడు కాని శ్యామలాంబ యట్లుకాదే! నలుగురమ్మ లక్కలతో దిరుగునది. వారుపీరు సూటి పోటుగా అను మాటల నాలకించి చిన్నదాని పెండ్లివిషయమై మగనిని రొష్టుపెట్టసాగెను.

రామచంద్రశాస్త్రి కేవిషయమయిన నజా గ్రత్త యున్నను. పుత్రికవిషయమున మాత్ర మతఁడు మిక్కిలి జాగ్రత్తకలవాఁడు. ఆమె పయి నతని కుందుప్రేమ కంతును బొంతును నుండదు. అదిగాక పద్మావతియును చక్కని చుక్క. ఆమెపెండ్లివిషయము శ్యామలాంబ జ్ఞప్తిచేయఁగానే శాస్త్రిగారి కదిరిపాటు కల్గినది. ఒక్కసారిగా తనకులాసా యంత యును నెక్కడికిఁ బోయినదో ? ఓనమాలు వచ్చిరాని వరుఁడయినను కనీసము వేయి నూటపదునాఱులు కట్నములేనిది చెట్టు దిగిరాడు. పయిని పెండ్లిఖర్చు లొక రెండు వేలు. ఇల్లును తాను గూడఁబెట్టి యుండిన ద్రవ్య మంతయును గలిపినను రెండువేలు జమకావు. అయినను ధైర్యము చిక్కబట్టి భార్యతో "భయనులేదులే" యనెను. ఆభయ మెట్లు లేకుండునో తనకే తెలియదు. అంతటి చిక్కులో నయినను నతనిమనస్సు నతని మామూలు కులాసా వదలలేదు, ఆయుల్లాసముతోనే డబ్బుసెలవు లేకుండానే పద్మావతికి తగినవరునిగూర్చి వివాహము చేసెద నని తనలోఁ దాను ప్రతిజ్ఞ గావించు కొనెను. కాని "రిక్తునిమనను కోరికల పెద్ద"

ఆకోరికలు నెఱవేఱు పెట్లున్నట్లు శాస్త్రిగారి కోర్కి నెఱవేఱు నుపాయము తోఁచే లేదు.

మామూలు వెతకుటనే ప్రారంభింప వలసి వచ్చినది. వరునికొఱకు రామచంద్ర శాస్త్రి ఎన్నో సంబంధములు చూచినాడు. ఏకారణములచేతనో సరిపడలేదు. కడపట చూచినాడయ్యా నంద్యాలలో నంద్యాల శ్రీకంఠశాస్త్రులుగారను వకీలుగారి యింటి లోను. అతనికొమారుఁడు వాసుదేవశాస్త్రి మొన్ననే బి. యే. ప్యాసయినాడు. ఇరువది యేండ్లు వయస్సు. అన్ని సద్గుణములును గల వాడే కాని చామనచాయ. అయిననేమి? "ఏకోఽపి దోషో గుణసన్నిపాతే" అన్నారు పట్టిరూపమునే కావలయునన్న ఇతరగుణములు సున్నగా నుండును. అనుకొని ఆసంబంధము మంచిదని నిర్ణయించుకొన్నాడు. భార్యకుఁ జెప్పగా ఆమెకూడ ఒప్పుకొన్నది.

రాయబారములు నడచినవి. వరదక్షిణ మొదలయిన విషయములలో నేవో కొన్ని నియమములు కుదిరినవి. శ్రీకంఠశాస్త్రిగారు కొంత పూర్వాచారపరాయణులే యయినప్పటికిని కన్య నొప్పుకొను స్వాతంత్ర్యము కొమారునకే యొసంగిరి. వాసుదేవశాస్త్రి కోవెలకుంట్లకు వచ్చి యేర్పాటుపయిన నొక రోజున పద్మావతిని జూచెను. పద్మావతి సెకండు ఫారము వఱకు ఆయూరి స్కూల్కు లోనే చదివినది. ఆయూరిలో ఈ బిడ్డయంత బాగుగా హార్మోనియముపయిన బిన్నలుగాని పెద్దలుగాని పాడఁగలవారు తక్కువయే. అయినను అది యేమిచిత్రమో కాని వాసుదేవశాస్త్రి చూడవచ్చిననాఁడామె సిగ్గున గాఁబోలును సరిగా చదువలేక పోయినది సరిగా పాడలేకపోయినది.

చట్! తెలివిలేని పిల్ల అని మనస్సులో ననుకొని వాసుదేవశాస్త్రి పయికి వినయము గనుపఱచి సెలవంది వెళ్లి నంద్యాలనుండి తమ కిప్పుడు పెండ్లి వీలులేదని తండ్రిగారిచే వ్రాయించెను. ఆమాట కర్థమేమి? తనపిల్ల అవసరములేదని; పద్మావతి యతనినే పెండ్లాడగోర్కి సూచించినది. అది సమకూర్చు భారము రామచంద్రశాస్త్రిపయిఁ బడినది.

కావలెను.

14 వర్షములవయస్సుగల అందమయిన వైదికబ్రాహ్మణబాలికను వివాహమాడుటకు వైదికబ్రాహ్మణకులస్థుఁడును, విద్వాంసుఁడును అయిన వరుఁడు కావలయును. అన్నివివరములు ఫోటోతో సహా "శ్రీ" C/o ... ... పత్రిక అను అడ్రస్సునకు వ్రాయింపవలయును" అను ప్రకటనను వార్తాపత్రికలో చదివికొని వాసుదేవశాస్త్రి తనఫోటోతోఁ గూడ తనను గూర్చిన వయస్సు విద్య మొదలయినవి వివరము లన్నింటిని వ్రాసి పంపెను.

చెన్నపురిలోని యొక హోటలుభవన మునం దొకనాఁటి మధ్యాహ్నమున నొక గదిలో నొక సుందరియయిన బాలిక యొక కుర్చీపయి నాసీన యయి యున్నది. ఆగది లోని బల్ల మంచేము మొదలయిన సామాను లంత విలువగలవి కాకపోయినను పరిశుభ్ర ముగా అమర్పబడినవి. ఆమె యక్కడ నెవ్వ రికొఱకో నిరీక్షించుచున్నట్లున్నది. అప్పుడు చక్కని దుస్తులు ధరించియున్న యొక బ్రాహ్మణయువకుఁ డక్కడకు వచ్చెను. ఆయమ యతనిగూర్చుండ నియమించినది;

అతఁడు:—"శ్రీ"అను అడ్రసునకు నేను వ్రాసిన జాబుప్రకార మీ తొమ్మిదవ సంఖ్య గల గదికివచ్చినాను ?

ఆసుందరి:—మీ దేయూరు?

అతఁడు:—నంద్యాల.

సుం:—పేరు ?

అతఁడు:—వాసుదేవశాస్త్రి.

అప్పుడామె "అతఁడు తనను బెండ్లాడు నెడలఁ దనకు గటాక్షకింకరుడై యుండవల యునను నర్థము వచ్చునట్టి కొన్నిషరతులు గల కాగిదము నామె యతని చేతికిచ్చెను. అందులో ఆషరతులకు నొప్పికొన్నచో నామెను వివాహంబాడ వీలగునని తెల్పఁబడి యుండెను. దానిని జదువుచు ఆకన్యను జూచినకొలది అది యేమో కాని మామూలుగా అట్టిషరతు లేమాత్రము కోరఁబడినను అగ్రహారోదగ్రుడగు ఆశాస్త్రి చిఱునవ్వుతో ఆనెలఁత మోము గాంచుచు ఒప్పుదల దస్కతు చేసెను.

హఠాత్తుగా ఆకన్యకలేచి యతనిపాదములకు నమస్కరించి బల్లసొరుగులో నుంచిన పూలదండ లతనిమెడలో వేసి చిఱునవ్వును సిగ్గును మోమునం దలరఁగా "మీపద్మావతిని నేను" అన్నది. "ఆ" యని యద్భుత వివశాత్ముడై వాసుదేవశాస్త్రి ప్రక్కకొరగఁగా ఆమె పట్టుకొన్నది. అతఁడామెను చేరఁదీసి "నిజముగా నన్ను కటాక్షకింకరుని జేసినావు" అని ముద్దుగొని.—'కాని-పద్మావతీ! నీకింత సామర్థ్యమున్నదే" అని బిగియార కౌఁగిలించికొని పలుమఱు ముద్దులాడెను.

"ఒరే! రామా! అఱవకు. వారికి నిద్రా భంగము. నీవు అటువెళ్ళు" అని యొక యిల్లాలు పయికత జరిగిన యయిదేండ్లకొక యింటిలోను దన మూడేండ్లకొడుకుతో ననుచున్నది. ఆపరుండిన యతఁడప్పుడు "పద్మావతీ : నీవు నాచేఁ జేయించుకొను ఊడిగము ఇంతేనా ? బిడ్డ నాడించుకొమ్మని యయినను చెప్పవు" "భర్తకు పని పెట్టు దౌర్భాగ్యము నాకు కలుగఁగూడదని మీరాశీర్వదింప వలెను"అని యామె యతని

పాదములకడఁ గూర్చుండి పాదము లొత్తు చుండెను. రాముఁడు "నేను అయ్య కాళ్లు పిసుకుతా" నన్నాడు వాసుదేవశాస్త్రి "నాయనా! కాళ్లు పిసుకవద్దు. నాచేతులు పిసుకు"మని బిడ్డని దగ్గరకు దీసికొనెను. ఇంకొక చేతితో భార్యయొక్క చేతిని బట్టి లాగుచు 'నీస్వయంవరకారణం ఎన్నిసార్లడిగినా చెప్ప లేదేమిటి" అని అడిగెను. "మీారంతగా విన దలచుకొన్నచో నేను చెప్పనా! అదంతయు మా తండ్రిగారి కులాసా. పెండ్లి వీలుపడదని మీారు వ్రాయించిన జాబుపైనను, నేను మీాదాననే కావలయునను కోర్కె నాకుండుటచేతను, మనకు ఒంటరిసహవాసవేళ మగుటకుగాను మా నాయనగారా యేర్పాటు జేసిరి" అన్నది. "ఆలాగా" అని చిరునవ్వునవ్వుచూ ముద్దు లాటకొఱకై యతఁడామెను తనమోము కడకు లాగుకొనబోగా బిడ్డయున్నాడని ఆమె సైగ చేసినది. అందులకు ఒక చిన్నచపేట యామెకు బహుమానము.

——(౦)——

# మామిడిపండు

ఉభయభాషాప్రవీణ బులుసు - నరసింహశాస్త్రిగారు,

చ. పరిమళ మెల్లదిక్కులను బర్వఁగఁజేసెదు దృఙ్మనోజ్ఞ సుం
దరతరమౌ తనూరుచులఁ దాల్చెద వైన విచారకారివై
పరఁగెదవౌ రసాలఫలవర్యమ! గ్రంథిలమయ్యు నీహృదం
తర మతికర్కశత్వము ననారతముం ధరియించుటం గటా!

# శబ్దతత్త్వము

శ్రీమతి విద్వత్కవితిలక కంచనపల్లి - కనకమ్మగారు,

ఆ. సర్వశబ్దములవి సత్యంబు నిత్యంబు, లనెడు భాష్యవాక్కు లాలకించి
కవుల కవులటంచు గాఢానురాగని, రాగములకు గడగ రాదు బుధుడు.

ఆ. స్ఫోటమెప్పుడుండు నోటవాక్యములు రా, నోరు సాధనంబు నుడువుటకును
గానశబ్దమయము గద బ్రహ్మమరయంగ, గవియెపుడు క్రొత్తకల్పనలకు.

ఆ. ఉన్నదాని లీల నూదిపల్కికొనంగ, నున్నవాడు బ్రహ్మ వెుక్కడరయ
చిత్రమూర్తిదాల్చు శేషాద్రివిభుబోలె, జంతుతతిని బోలి జగముబోలి.

ఆ. మాటనుండి మాట మహిబుట్టునందురు, మాటవెంటబుట్టు మాటనువ్వొ
జన్యజనకభావ జాత్యంధతయుబోవ, క్రమమటంచు దెలిసి కడచుబుధుడు.

ఆ. పువ్వుకాయగాదు పువ్వుఫలము కాయు, యాకుమొగ్గయన్ని యాదినుండు
సమయమైన యపుడు చక్క దోచుచునుండు, నొక్కదాని వెంట నొక్కడంటి.

ఆ. బయటవడుటగాని ప్రభవించుటదిగాదు, నిత్యశబ్దమునకు సత్యమెట్లు
పుట్టుగల్గు రాకపోకలు మనకగు, రవికిగలవె పగలు రాత్రులెందు.

ఆ. కంబమందుఁ గాంచెఁ గమలాక్షునందురు, పుట్టఁజేసె నన్న వట్టిమాట
కాంచగల్గు కవికిఁ గలదు శబ్దబ్రహ్మ, మన్నిచోట్ల నట్లు లన్నిగతుల.

ఆ. కనియె నన్న దాని గ్రహియించెనని కాని, కనునె తల్లి శిశువుఁ గన్నయట్లు
అనఁగ దెలిసికొనుట యగుగాక యది యుద్భవించుటగునె తెలియ వించుకైన.

ఉ. యత్నములేకకల్గు సకలార్థము లుత్తమముల్ గ్రహింప నా
రత్నములట్ల సాననటు రమ్యతరంబుగ జేయవచ్చు స

ద్యత్నముతోడ వానిని యథార్థము లౌటగదా వృథాసుమీ
నూత్నముగా సృజించుకొన నొచ్చుట, సర్వము సిద్ధమౌటచేఁ.

ఉ. ఇచ్చును బాలు తల్లి మొదలిచ్చును మేఘుఁడును న్నదుల్ జలం
బిచ్చును సస్యవృద్ధి నిలయిచ్చు ఫలంబుల వృక్షరాజిఁదా
నిచ్చును సచ్చరిత్రుఁడు ననేకముఖంబుల బోధ మార యీ
యిచ్చినవన్నియుఁ దనివినీయ వదేలొకొ నీకుజీవ ఛీ!
మ్రుచ్చిలజొచ్చె దాత్మగని మూలధనంబదియుఁ గ్రమంబుగా
నిచ్చును లెస్స రక్తమును హేయపు రొంపియు లోహజాతమే
యచ్చపురాళ్ళు నొక్కమెయి నాకలిదీర్పగలేని వయ్యయో
నిచ్చలు గాధజొన్పు నవి నీగ్గెడు దాక నివేల భక్తితో
బుచ్చుము కాలమీశ్వరుని బొందెడు వేడుక మంత్రరాజముఁ
జెచ్చెరనుచ్చరింపుచును శేషవిభూషణు నాశ్రయింపుచుఁ.

ఆ. వేదమందుగల వివిధశాస్త్రంబుల, గలదిగాక మనకు గలవె క్రొత్త
కల్పనములు బోధలల్పమతులకిల, నన్ని వేదమంచు నెన్నవలదె.



# కోపర్నికస్ జీవితచరిత్రము

గొబ్బూరు - వెంకటానందరాఘవరావుగారు, బి. ఏ.

యూరపుఖండమునందలి బాల్టిక్ సముద్ర తీరముననున్న పోలండు దేశములో విశ్చుల నదీతీరముననున్న థార్న్ పట్టణములో పదునైదవ శతాబ్దమున ధనికుడగు వర్తకుడొకడు కాపురముండెను. ఆ వర్తకునికి 1473-వ సంవత్సరము ఫిబ్రవరి నెల 19-వ తేదిని కోపర్నికస్ అను కుమారుడు జన్మించెను. పదునెనిమిది సంవత్సరముల ప్రాయమున నా బాలుడు క్రాకోపట్టణమునందున్న సర్వకళాశాలలో విద్యాభ్యాసము చేసి వైద్యశాస్త్రమునందును, కళలయందును, పట్టపరీక్షలో తేరెను. అప్పటి కా విద్యాశాలలో బోధింపఁబడుచున్న సిద్ధాంతశాస్త్రము (Astronomy) కూడ కొంతవఱకు అభ్యసించెను.

## భూమి మధ్యనున్నదను వాదము

సూర్య, చంద్ర, గ్రహ నక్షత్రములు, ఉదయించుచు, అస్తమించుచు మనభూమిచుట్టు తిరుగుచున్నట్లు మన కగపడుచున్నవి. కాబట్టి ఈ విశ్వమునకు మధ్యను మనము నివసించు భూమి ఉన్నదనియును, ఈభూమిచుట్టు గ్రహనక్షత్రములు ప్రదక్షిణము చేయుచున్నవనియును పూర్వులు కొందఱు తలంచుచుండిరి. స్థూలదృష్టికి అట్లు కనబడుచుండుటచేత అదే నిజమైనదని (Ptolemy) టాలెమీ ప్రముఖులగువారు క్రీస్తు పూర్వమునుండి సిద్ధాంతము చేసిరి. నాటినుండి పదునైదవ శతాబ్దాంతము వఱకు పాశ్చాత్యదేశములవారు టాలెమీ తెలిపిన భూమధ్యస్థ సిద్ధాంతమునే అవలంబించుచుండిరి. ఆ సంగతులే క్రాకోవిద్యాలయములో నితడు విద్యార్థిదశలో నేర్చుకొనెను.

అనంతర మితడు ఇటలీదేశములో రోము బొలోనా, పట్టణములలో నున్న విద్యాశాలలలో గణితమునం దత్యుత్తమ పరీక్షలిచ్చెను. పిమ్మట ఉపాధ్యాయుడై కొంతకాలము విద్యార్థులకు గణిత శాస్త్రమును బోధించెను. కాని మతహితైక జీవనము చేయదలచి బాల్టిక్ సముద్రతీరముననున్న 'ఫ్రానీబర్గ్' నందలి 'కెథీడ్రలు' లో 'కేననీ' ఉద్యోగమును స్వీకరించెను.

ఇతడు గొప్పవిద్వాంసుడనియు, వైద్యశాస్త్ర ప్రవీణుడనియు, న్యాయపరిపాలకుడనియు, మంచి సంస్కారియు, యోగ్యుడుననియు, పేరు ప్రతిష్ఠలు కలవాడై బహుగౌరవముగా జీవనము చేయుచుండెను. ఒకప్పుడు దేశములో నాణెములను గూర్చిచర్చలు జరుగునపుడు ప్రభుత్వమువారు ఇతని యభిప్రాయమును కోరి పుచ్చుకొనిరి. అప్పుడొక్కమారు తప్ప ఇతడు మరెప్పుడును రాజకీయములతో సంబంధము కలిగించుకో లేదు.

ఇతడు చాల నెమ్మదియైనవాడు. మంచి తెలిసిన పండితుడు. శ్రద్ధ, ఓపిక, కలిగి విద్యార్థులకు శాంతముగా పాఠములు బోధించుచుండెను. ఇతని ప్రఖ్యాతి విని పెక్కుదేశములనుండి విద్యార్థులు చాలమంది వచ్చి ఇతనికి శిష్యులై విద్యాభ్యాసము చేయుచుండిరి.

1514-వ సంవత్సరములో కొందఱు బుద్ధిమంతులు అప్పటి పాశ్చాత్య పంచాంగములను సవరణచేయ దలచిరి. నిరాడంబరుడైనను ఇతడు గొప్పపండితుడని అందరును ఎరుగుదురు. కాబట్టి పంచాంగ సవరణ విషయముగూర్చి వార లీతని యభిప్రాయమును గోనిరి.

గ్రహవేధ

వివిధగ్రహములయొక్క గతులనుగూర్చి కోపర్నికస్ కొన్ని పరిశోధనలు చేసి, లెక్కలు తయారుచేసి ప్రకటించుచు వచ్చెను. సూక్ష్మముగా పరిశీలనచేయుటయందుకంటె యోచనానిమగ్నుడై గుణించుటయం దీతనికి ప్రజ్ఞ అధికము. టాలెమీ నిర్వచించిన భూమధ్యస్థసిద్ధాంతము తలవెంట్రుకల చిక్కువలె విడదీయుటకు సాధ్యముగాని చిక్కులతో కూడియున్నట్లు ఇతనికి స్పష్టమయ్యెను. సూర్యచంద్రులు చక్కగా ఉదయించి అస్తమించి ఋజుమార్గముల పోవుచున్నట్లు కనబడుదురు గాని తక్కినగ్రహములు భూమిని సరిగా చుట్టిరారు. ఆ గ్రహములకు వక్రగతులు, ఋజుగతులు, గలవు. అనగా కొంతవఱకు ముందునకువచ్చి, ఆగి, వెనుకకుపోయి, మరల ముందుకుపోవుచున్నట్లు కనబడును. ఉదాహరణార్థ మొక్కయంశము గమనింతము. 1933-వ సంవత్సరము అక్టోబరు 31-వ తేదిని గురుగ్రహము హస్తనక్షత్రముయొక్క చతుర్థపాదమున నుండెను. 1934-వ సంవత్సరము ఫిబ్రవరి 15-వ తేదీకి, చిత్రనక్షత్రపు రెండుపాదములు దాటి మూడవపాదమున తులారాశిలో ప్రవేశించి పోవుచున్నవాడు ఆగి వెనుకకు మరలి వక్రగతిని పోవుచున్నాడు. ఇపుడు హస్తచతుర్థ పాదమున వక్రగతిలో నున్నాడు. 1933-వ సంవత్సరము అక్టోబరులో అనగా ఏడుమాసములక్రింద ఉన్న చోటినే ఇపుడున్నాడు. ఈ జూన్ 12-వ తేదీనుండి వక్రగతి మాని ఋజుగతికి పోగలడు. ఇట్లే బుధ - అంగారక - శుక్ర - శని గ్రహములకును వక్రగతులు - ఋజుగతులు గలవు. ఈ గ్రహములు భూమిచుట్టు ప్రదక్షిణముచేయుట నిజమైనయెడల, ఈ వక్రగతులకు హేతువేమి? పెద్ద వలయములేగాక యీ గ్రహములు చిన్నచిన్న వలయములు గూడ నిర్మించుచుండెనని టాలెమీ సర్ది చెప్పుకొనుట తృప్తికరముగా లేకుండెను. ఆ సిద్ధాంతమునకు అసలులోనే ఏదో గొప్ప పొరపాటున్నదనియు, ఆతప్పు గ్రహించి సరిచేయుట ఆవశ్యకమనియును అతడు భావించెను. టాలెమీకంటె ప్రాచీనులైనవారి

గ్రంథములను పరిశోధింపగా, ఆ ప్రాచీన గ్రంథకర్తలు విశ్వమునకు భూమధ్యస్థము నంగీకరింపలేదు. టాలెమీ వాదమునకు వ్యతిరేకముగా వారు సూర్యునిచుట్టు భూమి మొదలగు గ్రహములు తిరుగుచున్నవనియే వ్రాసియుండిరి. టాలెమీ చెప్పనది తప్పు అనియును, ఆరిస్టార్కస్ మొదలగు ప్రాచీన గ్రీకు సిద్ధాంతులు వ్రాసిన దానికిని తన పరిశోధనలకును లెక్కలకును సరిపోయిన దనియును స్థిరపరచుకొనెను.

తాను స్థిరపరుచుకొనుట చాలదు. పదునారు శతాబ్దములనుండి లోకమును పెడదారిని పెట్టుచున్న టాలెమీ వ్రాతలను, బోధలను, పూర్వపక్షముచేసి, అక్రమముగా మూలనణగ ద్రొక్కబడియుండిన వ్రాతసత్యమును పైకిదీసి లోకమున నిలబెట్టుటయందే అటుపై తన జీవితమును ధారవోయ నిశ్చయించెను. ఆ విషయమైన విజ్ఞానమును ఏర్చికూర్చుటకు బహుసంవత్సరముల కాలము ఎంతో శ్రద్ధతోను, ఓపికతోను, పనిచేసి 1530-వ సంవత్సరము నాటికి ఒక గొప్ప గ్రంథమును తయారుచేసెను.

మరి నాలుగుసంవత్సరముల వఱకును ఆ గ్రంథము ముద్రితము కాలేదు. తుదకు 1534-వ సంవత్సరములో ఇతడు పక్షవాత వ్యాధిచేత బాధపడుచుండగా గ్రంథముద్రణము పూర్తియైనది. ఆ పుస్తకమును ఒకమాటు కనులార చూచి చేతితో పట్టుకొని మితిలేని సంతోషమును పొంది, ఇతడా వెంటనే ప్రాణములు విడిచెను.

ఇతని సిద్ధాంతమును పండితులు మొదట ఒకంతట అంగీకరింపలేదు. కాని కాలక్రమమున కెప్లరు మహాశయుడీ సిద్ధాంతమ ననుసరించి గ్రహగతులను గూర్చి సూత్రములను రచియించి; మహత్తరమగు నీ సత్యమును చక్కగా నిరూపించెను. ఆయంశములు కెప్లరు జీవితమునందు తెలిసికొందము.

నేటి సిద్ధాంత శాస్త్రమునకు పునాదియని చెప్పదగిన యీ ప్రాతసత్యంబును - చిరకాలము అణగద్రొక్కబడియున్న గొప్ప సత్యమును కోపర్నికస్ పైకిదీసి ధైర్యముతో ప్రకటించి శాస్త్రజిజ్ఞాసువులకు చిరస్మరణీయుడగుచున్నాడు.

---

# చంద్రిక

పండిత భాగవతుల - నృసింహశర్మగారు,

మ. ప్రమదోద్యాన సమానమైన విపులాంధ్రక్షోణి సత్కావ్య పు
ష్పమునామోదముఁ బొంద, భారతికి హర్షస్ఫూర్తి వర్ధిల్లఁగా
నమృతంబుల్ గురియించుచున్ జగమునం దానందముద్రావిలా
సముఁ జూపించుచు వేంకటేశ దరహాసభ్రాంతి దీపించుచున్.

కం. చనుదెంచె నూత్నచంద్రిక, తన తేజము పట్టపగలు ధరణిన్ గ్రాలన్
జనహృత్కైరవపాళిన్, దనియింపఁగఁ గవిచకోరతతి నలరింపన్.

ఉ. అచ్చపుఁగాంతి నెక్కొనఁగ నందఱినిం దనియింతువీవు, వె
మచ్చఁగలట్టి చందురుని మచ్చరికించిన దానవీవు, నీ
హెచ్చు నుతింప భారతికి నేని దరమానె ? నవీనచంద్రికా !
ఎచ్చటినుండి వచ్చితివొ, యించుక చెప్పుమ? సంతసించెదన్,

గీ. నిరుపమాన సరస్వతీ నిష్కళంక, వదన విధుమండలమునుండి వచ్చినావొ ?
ఆంధ్ర సుకవుల కానంద మతిశయిల్ల, భువిఁ జరింపుము యానంద ముద్రతోడ.

సీ. ఆంధ్రభాషాయోష కానందము రహింప, సరస పదార్థ సంచయముఁజూపి,
విజ్ఞాన పాథోధి విన్నందుకొనునట్లు, సత్కళాభ్యుదయంబు సంఘటించి,
ఏపక్షముననైన నేకరీతిని నైజ, తేజంబునన్ దశదిశలఁ గ్రాలి,
నీరాక కాంక్షించు నిఖిల విద్యార్థుల, యజ్ఞాన తామిస్ర మణఁగఁజేసి,

గీ. మహిని గల పామరులకు సోమరుల కమృత, మిచ్చి యమరులు గాఁజేసి యెల్లయెడల
భద్రముగ నిత్యులానంద ముద్రతోడఁ, జంద్రికా! సంచరింపుము సంతతంబు.

శా. నీ తేజంబును గాంచి శారదయు మన్నింపన్ కవీంద్రాళికిన్
చేతోమోదముఁ గూర్చి సర్వవిబుధ క్షేమంబుఁ గాంక్షించి, సం
ప్రీతిన్ పండితు లాదరింపఁ గవితా విద్యా వినోదంబునన్
ఖ్యాతింగాంచు మహర్నిశంబును సమస్తాంధ్రావనిన్ చంద్రికా !

కం. క్రొన్నెలతో నెలకొను నా, వెన్నెల నలయించు విరహవేళల; వినుఁడీ,
వెన్నెల చెన్నెలరారఁగఁ, గన్నెల నలంకరించు సుకవికావ్యము కరణిన్.

# రోము నగరము

శ్రీమతి పులవర్తి-కమలావతిదేవిగారు,

ఇటలీదేశమున ఆల్బా అను పట్టణరాజ మొందు గలదు. దానిని న్యూమిటరు అను రాజేంద్రుఁడు ధర్మసమ్మతముగ బరిపాలించు చుండెను. అతనికి దుష్టుఁడగు అమూల్యుడను సోదరు డొకడుండెను. న్యూమిటరు పరిపాల నమున నున్న ప్రజలనెల్ల నమూల్యుడనేకవిధ ముల హింసించుచున్నను రాజసహోదరుడని ప్రజలు అతనిపై రాజుకడ ఫిర్యాదొనరింప భయపడుచుండిరి. రానురాను అమూల్యుని దుండగములు హెచ్చదొడగినవి.

ఒకనాడు న్యూమిటరునరేంద్రచంద్రుడు నిండుకొలువు దీర్చియుండ కరేలియా యను ముసలిది డెస్డిమోనా యను తనకోడలిని వెంట నిడుకొని రాజదర్బారున కరుదెంచి "భూపతీ! వింటివా నీసోదరుని దుండగములు. అతడు కొంఱబు తులువలతో నిన్నరాత్రి మాయింటి కరుగుదెంచి బలవంతముగ నన్నొ కట్టి యొక గదియందుపడవైచి ముద్దరాలగు నాకోడలు డెస్టిమోనా మానమును జెఱచినైచి నాడు. ఈ యన్యాయమునకు ప్రతిక్రియ జేయవైతివేని నీ ముంగటనే నాప్రాణముల బాయుదును.'' అని నుడివిన న్యూమిటరు భూకాంతుడు దండధరుచందమున మండిపడి బొమలు ముడివడ మేఘగంభీర భాషణముల నా ముదుసలి కిట్లులనియె. "ఏమేమి! నా పరిపాలనమున నా సోదరుడే యొక్క మాన వతి పాతివ్రత్యమును హరించినాడా? ఇక నాకాత డెక్కడి సోదరుడు. అతడు పాతా ళంబున డాగనీ పట్టి తెప్పించి కృతాంతనిశాం తంబున కతిథిగ జేయింతును. నేటికి నీవు నీ గృహమున కరుగుము'' అని వారిని బంపి వైచెను. చాటుననుండి యిప్పల్కులాలించిన అమూల్యుడు దండతాడిత భుజంగంబు భంగి మండిపడుచు "ఔరా! అమూల్య గడ తేర్తువా? నీకు పోగాలము సమీపించినది.'' అని యుపసేనాధిపతిని లోపుచేసికొని కొంత మంది సైనికులతోను తన తుంటరి మిత్రుల తోను అర్ధరాత్రమున రాచనగరు నప్రతి హతముగ బ్రవేశించి న్యూమిటరును బంధించి "చూచితివా నా పరాక్రమము" అని మీసలు దువ్వి యతనిని బందిఖానాయం దుంచి "ఇతడు తప్పించుకొని పారిపోయెనా మీ ప్రాణములు దక్కవు'' అని కావలివారలకు గట్టడిచేసి న్యూమిటరు ఇరువురు పుత్రులను న్యూమిటరుకూతురు రీహాసిల్వాను వధించి, రీహాసిల్వా కవల పిల్లలను సైనికుల కప్పజెప్పి టైబరునదియందు పడవైచి రమ్మని యాజ్ఞా పించెను. అయ్యది వర్షాకాల మగుకతమున టైబరునది వరదలతో మహాభీకరముగ బ్రవ హించుచుండెను. ఆసైనికు లానినువుల నందు బారవేయ చేతులురాక యొక యూయెల యందు వారి నునిచి టైబరు నదియందు విడ

చిరి. ఆయుయ్యేలయు ప్రవాహవేగంబున చాలదూరము కొట్టుకొనిపోయి యొక్కెడ నొడ్డుపట్టెను. ఇంతలో ఆకలిచే నకనకలాడు నొక నక్క యట కరుగుదెంచి యాపిల్లల కబళింప దలపడుచుండ ఫాస్ట్యులను అను నొక గొల్లవాడు కాంచి నక్కను తరిమివైచి చాల కాలమునుండి సంతానవిహీనుడైనందున ఆ బాలకుల నిరువుర గైకొనిపోయి తనభార్య చేత నిడిన నామెయు తనకు కోరని కోరికగ లభించిన పుత్రద్వయమునకు రోమ్యులను, రేమసు అని నామమిడి అతిగారాబమున పెనుచుచుండెను. ఆ బాలు రిరువురును శుక్ల పక్షశశాంకరు చందమున దినదినప్రవర్ధమాను లగుచు తేజోబలసమన్వితులై యలరారుచుండిరి. ఒక నాడు వారున్న పల్లియను కొందఱు దొంగలువచ్చి లూటీచేసి సొత్తును గొంపోవ రోమ్యులను రేమసు లాపల్లె వాసుల నందఱిని చేరదీసి వారికి నాయకులై జని యుద్ధమున ఆదొంగల మట్టుపెట్టి మరల ఎవరి సొత్తును వారి కప్పగించిరి. వీరికీర్తియు భుజబల పరాక్రమచర్యలు ఆనోట ఆనోట అమూల్యుని చెవి సోకినవి. వారిని చంప నాతడిరువురు జెట్టీలను బంప రోమ్యులసు రేమసులు వారినే తెగటార్చి చిన్నసైన్యముతో జని అమూల్యుని అపారసేనావాహిని నెదిరించి యోడించి యుద్ధమున నాతనిదాకి అమూల్యుని వధించి తాత న్యూమిటరును చెరనుండి విముక్తిని గావించి పట్టాభిషిక్తునిగ నొనరించిరి. అట్లు ఆల్బానగరమున తాతను రాజుగచేయుటతో వారు సంతుష్టినందక తమ పేరిట నొక మహా నగరమును నిర్మింప వలయునని టైబరు నదీ తీరమున తమ యుయ్యేల మెట్టనెక్కినచోట ఒక మహానగరమును నిర్మింప బూనిరి. ఆ మహానగరమును నిర్మించు విక్రిటానిసు అను శిల్పిశాస్త్రవేత్తకు యాంగిలికా యను కూతురుగలదు. సుందోపసుందులవలె యాంగిలికాను ఇద్దరన్నదమ్ములును వలచి మహాయుద్ధ మొనరించిరి. అందు రేమసు గతించెను రోమ్యులసు నూతన నగరమునకు తననామ మగు "రోము" అను పదముంచి నగర ప్రకాశ మొనర్చి యాంగిలికాను బరిణయమై సింహాసన మధివసించెను. ఇప్పుడు డిక్టేటరులలో నగ్రగణ్యుడైన ముసోలినీ పరిపాలించు చున్నదీ రోమునగరరాజమే. క్రిస్టియనుల మతగురువగు పోపు నివసించున దీ రోమునగర రాజమే. ఇది బహు సుందరతర మైనది.

—————: o :—————

# వ్యసనములు

శృంగారకవి - సర్వారాయుఁడుగారు,

చంపకమాలిక:—

వ్యసనము లేదటన్న పరిపాటియె కాని పదొక్కటంచనం
బొసఁగదె నల్లమందు పొడుము న్నమిలిచుట్టయు కాఫికూడినన్
వ్యసనములన్న యేడిటిమహత్త్వము తెల్లమె యెల్లవారికిం
దుసుసునుగల్గు నాల్గును గడుం బలమైనవి మున్ను వాని క
న్ననుమి, యదెట్టులబ్బెస మొనర్తురొ తొల్తను రోగమంచుఁ గొం
త సొగసుకై యొకింత యయి తద్దిన మట్లది తప్పకుండు, న
ప్పస తెలుపంగరా దనుభవంబున నేకని పెట్టఁగావలెన్
మసలఁగనీయ వ్రుక్క గడె మానినఁ, బూన క్షణంబె సౌఖ్యమా
విసమునకన్న మిన్నయనిపించు నదెంతయు నల్లమం దహా!
మసగొని ముందుమత్తవల మైపులకింపులు బాష్పపూరము
ల్మసమునలాడుట ల్తనువు ముద్దగుట ల్గలిగించు వేళకు
న్మెసవిన కొంతసేపటికి మేనికి సత్తువవచ్చు నంతట
న్మసలుట, పట్టుతప్పినను మళ్లియథాస్థితిఁ గాళ్లులాగులే
వసమతి యుంటె యెట్టిపనిపాటులు తోఁపకయుంటె చుట్టయు
ప్పసమును గాల్చుబుద్ధి నిడు, బట్టలుగాల్చును, గంపు నింపును
మ్మొసపరి నిండునందనక యూచ నొనర్చును; నస్యమన్ననో
కసటును గార్చు చిట్టలకుఁ గజ్జులు గూర్చును, మాటిమాటికి
న్నస నకుఁ బీల్చకుండిన మనంబునకుం గుదురుండ నీదు, రొం
ప సతము సేయుఁ, బీల్చినఁ గపాలము క్రుళ్లనొనర్చు! కాఫియో
వసుమతి నెల్లవారి కలవాటయి యున్నది యెన్నడేని ము
న్నెసఁగెనె యెట్టి యాధ్యులకు నేని, విదేశ సహానుభూతియే
యొసఁగిన భూతి యియ్యదియ, యొక్కక్షణంబిక నాలసించినం

గసరు చిరాకు త్రిప్పు తలకాయకు నొప్పి మనంబుమాంద్యముఁ
వెన సమకూర్చు సత్తు వుడివించును, ద్రావిన యంతపట్టై సౌ
ఖ్యసరణి, సుంత సేసెడలఁగా మతియెప్పటియట్లై కొన్నినా
ళ్లు సనఁగ గుండె జబ్బొదవు, లొంగు శరీరము, వెచ్చమెచ్చు, నీ
దౌనఁగులు గల్గువాని గొనఁద్రొక్కిటలాడుదు రేమి చోద్యమో
యిసి ! కొనువారిలం బ్రదికిరే, కొనకుండినవారు చచ్చిరే
పన చెడఁగొట్టు నిట్టియలవాటులు మాని సుఖంత్రుగావుర్తఁ.



## ఆహ్వానము

స్థానాపతి - సత్యనారాయణగారు, (కవితాసమితి)

విరహిహృదయ మరంద మీ [illegible]వసంత
వేళ వనమాలి తరుణీశ తావిగూడి
నృత్య హేలాభిరతి విహరించుచుండె,
హాయిగాఁ బ్రత్యహ రహమ్మునచటరాధ!
పరిమళోదారమృదుమనోహర సమీర,
దరతరంగాభిచలిత లతావితాన
లలిత యమునా నదీ తీర కలితవనుల,
చెలియు వనమాలి సతము వసించుచుండె

* * *

అమర దుర్లభ మధుమూర్తివైన నిన్ను
వల్లవీకాంత విరహ తాపమ్ము వలన
నెదుట భావించి, విలపించు, బెదరిచూచు
బయటఁ గౌగిటజేర్చు, విహ్వాలతనూర్చు
నోయి! వనమాలి వేగ విచ్చేయుమోయి!

# ప్రేమపాశము

డాక్టరు - ప్రసాదరావుగారు,

(ప్రథమభాగము)

౧

రామానాయుడు చాలకాలము తహసీల్దారీ చేసి ఇప్పుడు పింఛను పుచ్చుకొంటూ భార్యాకోమాశైలతో కరీంనగరంలో హాయిగా కాలక్షేపం చేస్తున్నాడు. తహసీల్దారుగా ఉన్నప్పుడు ప్రజలకు అంతో ఇంతో ఉపకారం చేస్తూ మంచివాడనేఖ్యాతి సంపాదించాడు. దగ్గర ఏభై అరవై వేల రూపాయిల రొఖము సాలుకు రెండువేలకు పయిగావచ్చే మాన్యాలు కూడా ఉన్నాయి. అతనికి ఏలోటూలేదు; కాని ఒక్కకుమారుడైనా లేడే అన్న విచారంమాత్రం వుంది. కొడుకులయెక్కువేమిటి; ఉన్న ఆడపిల్లమాత్రం చాలదా? అని నాయుడుభార్య తరుచు అంటూ ఏవిచారము లేకుండా ఎల్లప్పుడు సంతోషంగా వుండేది. ఇంత పాడీ పంట ఐశ్వర్యము ఉన్నాయి. తాము తినడానికి ఒకరికి పెట్టడానికిన్ని, తృప్తి, సహనము ఉన్నాయి యీదంపతులకు. వీరికి ఇతరులకు పెట్టడమంటే మిక్కిలి సంతోషము. ఏరోజు చూచినా ఇల్లంతా చుట్టాలతోటి. స్నేహితులతోటి, అతిథిఅభ్యాగతులతోటి నిండి ఉంటుంది. నాయుడుభార్యకు విసుగుదల లేకుండా తమయింటికి వచ్చినవారందరనీ తగినట్లు సత్కరించి పంపడం అలవాటు. ఇంట కావలసినంతమంది దాసదాసీలు ఉన్నారు గదా అని ఏపని ముట్టుకోకుండా మూల కూర్చునే స్వభావం కాదు ఈమెది. ఈదంపతులకు లేకలేక కల్గినసంతానం రత్నం అనే పిల్ల; రత్నానికి పదునాలుగేండ్లు; పేరుకి తగిన రూపం; రూపానికి తగిన సుగుణసంపత్తీ ఆమెయందు మూర్తీభవించి ఉన్నాయి. ఆమె సుగుణాలపుట్ట అని ఆప్రాంతాలవాడుక. తల్లికీ తండ్రికీ రత్నం అంటే మహాప్రేమ. ఆమె కొంచం తుమ్మిందంటే ఆరోజున పొయ్యి రాజవెయ్యరు. వాళ్లప్రాణాలన్నీ యీపిల్లమీదే ఉంచి జీవిస్తున్నారు. ఎన్నడూ రత్నం తల్లిదండ్రులమాట జవదాటదు. రత్నానికి వ్యతిరేకంగా జననీజనకులునడపరు. రత్నానికి సంగీతంఅంటే మిక్కిలి ఆసక్తి. చక్కగాపాడగలదు. సంగీతానికి వన్నెతెచ్చే సాహిత్యం వుంది. కొద్దికొద్దిగా కవిత్వం కూడా వ్రాయగలదు.

౨

మననాయుడుగారి ఇంటికి ఎదురుగాఉండే చిన్నయింట్లో ఒకతల్లీకొడుకూకాపుర ముంటున్నారు. తల్లిపేరు సత్యభామ, కొడుకుపేరు

పరాంకుశం. పరాంకుశం మన నాయుడుకి కొంచెము దూరస్థమైన బంధువు. ఇతడు హైదరాబాదు ఉస్మానియాకళాశాలలో ఇంటరుమీడియేట్ చదువుతూన్నాడు. పది హేడు ఏళ్లుంటాయి. నూనూగుమీసాల నూత్నయౌవనం పచ్చని దబ్బపండువంటి అతని శరీరకాంతికి మెరుగు పెడుతోంది. వినయం, విధేయత, పెద్దలయందు భక్తిగౌర వములు ఇతనికి సహజలక్షణాలు. అల్లరిచిల్లరి వ్యవహారాలంటే ఇతనికి బొత్తిగా కిట్టదు. తన తోడి విద్యార్థులందరు ఇతన్ని ఎక్కువగా ప్రేమిస్తారు. ఉపాధ్యాయులుకూడా తగినట్టు ఇతన్ని గౌరవించడమే కాకుండాసర్వవిధాలా విద్యావిషయంలో ఎక్కువగా ప్రోత్సాహి స్తూయుంటారు. పరాంకుశానికి ఏలోటూలేదు గాని ధనసంపత్తిమాత్రం యేమీలేదనే చెప్పవచ్చు.

రామానాయుడు మొదటినుంచీ యీ కుర్రవాడికికొద్దోగొప్పో బంధుత్వ ముండడం చేత విద్యావిషయంలో కొంత ధనసహాయం చేస్తూ ఏలోపంకలుగకుండా కంటికి రెప్ప మాదిరిగా కనిపెడుతూన్నాడు. రామా నాయుడుయొక్క ఆదరాభిమానాలచేత పరాంకుశం ఇంతవఱకూ కళాశాలలోనికి రావటం తటస్థించింది. ఇటీవల ఒక్క స్కాల రుషిప్పుకూడా లభించడంచేత ఆర్థికంగా అంత అలజడిలేకుండా కులాసాగా చదువుకొంటు న్నాడు. కలిగినమట్టుకు ఏ కలో అంబలో తాగుతూ తల్లి ఇల్లుకనిపెట్టుకొని ఉంటోంది. పరాంకుశం కాలేజీ హాస్టలులో ఉంటు న్నాడు. మార్చినెల ఆఖరైంది. విద్యార్థు లంతా విడుదలైన ఖైదీలరీతిగా స్కూలు కేసి తిరిగి చూడకుండా యెవళ్లయిళ్లకు వాళ్లు వెళ్లడం ఆరంభించారు. పరాంకుశం కూడా పంచప్రాణాలూ తన మీదే పెట్టుకొని ఉన్న తల్లిదగ్గరకు కాలేజీ మూసిన తక్షణం బయ లుదేరి వచ్చాడు. ఆరునెలలకు ఇంటికివచ్చిన కుమారుని ఆనంద బాష్పాలతో కౌగలించు కొని తృప్తిపడింది తల్లి.

3

రత్నంచక్కగా ముస్తాబై కచేరీసావట్లో తండ్రిదగ్గర కూర్చొని త్యాగరాజుగారికృతులు హార్మోనియంమీద వాయిస్తూ కోకిలస్వన ముతో పాడుతోంది. తండ్రి కృతినుండి పొంగి పొరలిపోవుచున్న భక్తిరసవాహినిలో మునిగి తేలుతూ ఉన్నాడు. అత్యుత్సాహంతో ఎదటి వారికి పారవశ్యము కల్గేటట్టు పాడుతోంది రత్నం. ఇంతలో పరాంకుశం మెల్లిగా అడు గులిడుతూ కచేరీ సావడిలోకివచ్చి నాయుడు గారికి నమస్కరించాడు. నమస్కార మందు కొని ప్రక్కనున్న సోఫామీద కూర్చోమని సంజ్ఞ చేశాడు నాయుడు. రత్నం వెంటనే పాట ఆపివేసి లోపలకు వెళ్లాలని ప్రయత్నించే స్తూంటే వద్దని కృతి పూర్తి చెయ్యమన్నాడు నాయుడు. ఒక పావుగంటసేపు రత్నం రాళ్లు కరిగేటట్టు పాడింది; పరాంకుశం రత్నంపాటకు

ముగ్ధుడై పోయి బాహ్యప్రపంచాన్నే మరిచాడు. తానెక్కడ ఉన్నదీ, ఎదుట ఎవరున్నది తెలియడమే లేదు. తండ్రిఆజ్ఞాను సారం రత్నం పాట ముగించి లోపలికి వెళ్లిపోయింది కాని పరాంకుశానికి ఇంకా పాటవినపడుతోనే ఉందికాబోలు, తన్మయుడై ఉన్నాడు! నాయుడు పరాంకుశంవైపు చూచాడు. పరాంకుశం అన్యాయత్తచిత్తుడై ఉన్నట్టు గ్రహించి చిరునవ్వునవ్వుతూ

నాయుడు: — పరాంకుశం! ఎప్పుడు వచ్చావు?

పరధ్యాన్నంగా ఉండడంచేత నాయుడు ప్రశ్న పరాంకుశానికి వినిపించింది కాదు. నాయుడు మళ్లీపిలిచాడు. పరాంకుశం కంగారు పడుతూ లేచి, నిలబడి, నాయుడు కేసిచూసి, తెల్లపోయాడు.

నాయుడు: — ఏమిటల్లా ఉన్నావు? ఎప్పుడు వచ్చావు హైద్రాబాదునుంచి? —

పరాంకుశం: — (కొంచెము స్థిమితపడి) ఒక్కగంటక్రితం.

నాయుడు: — ఈసంవత్సరం మీ పరీక్షలెట్లావున్నాయి?

పరాంకుశం: — సాధారణంగా ఉన్నాయి. మీదయవల్ల ఈయేడు ప్యాసుకావడానికిఏమీ అభ్యంతరం ఉంటుందనుకోను.

నాయుడు: — అయితే ఇక కావలసినదేముంది! నువ్వురాత్రి యొకమాటుకనుపించు. తీరికగా మాట్లాడాలి.

౪

నాయుడు: — ఏమో! యీ సంవత్సరం చెయ్యాలని లేదు. అదీకాక, తగినసంబంధం ఎక్కడా కనపడదు. ఇంతకూ, ఇంకా చిన్నపిల్లగదా రత్నం; రెండేళ్లపాటు బాగా చదువు చెప్పించి ఇంత విద్యాబుద్ధులు కలవాణ్ని చూసి ఇవ్వాలని ఉంది.

నాయుడుభార్య: — ఆడపిల్లకి ఇంకా చదువెందుకు! కొద్దో గొప్పో చదువుకొంది గదా? ఇంతటితో తృప్తిపడవలసిందే! చదువూగిదువూఎట్లావున్నా మంచి మొఖాసాదారు కివ్వాలి మనరత్నాన్ని. దిట్టంగా డబ్బుంటే సుఖంగాని, ఎంతచదువుంటే ఏమి లాభం చెప్పండి?

నాయుడు: — ఈతర్జనభర్జన అంతా ఇప్పుడెందుకు? సంబంధం నిశ్చయముచేసేటప్పుడు చూడవచ్చును. ఈసంవత్సరం చేయ తలచుకోలేదు. ముందెప్పుడో చెయ్యబొయ్యే పెళ్లి సంగతు లిప్పుడు ఎందుకు? విరమించు, మరోమాట! ఈవేళ వాళ్ల పరాంకుశం వచ్చాడు చూశావా? ఈ వేసంగిసెలవులు, రెణ్నెల్లు ఇక్కడే వుంటాడు; మన అమ్మాయికి అతనిచేత కాస్త ఇంగ్లీషుకూడా చెప్పించాలి, మనసొమ్ము తింటూన్నవాడు— కావలసినవాడూ, —కావడంచేత శ్రద్ధగా కూడా చెప్తాడు.

నాయుడుభార్య:—ఈడువచ్చిన పిల్లకుఇక చదువేమిటి? అదీగాక అతడుకుఱ్ఱాడు ; మీ మాటలు నాకు నచ్చలేదు. చాలినంతచదువు రానే వచ్చింది; ఇంకా చదువేమిటి? ఈడు వచ్చిన మగపిల్లను ఆడపిల్లను ఒకచోటికి చేర్చడం మంచిపని కాదు. పెళ్లికాబోయే పిల్లని పరాయి కుఱ్ఱాడిదగ్గర కూచోపెట్టిచదివించడం నాకు ఎంతమాత్రము ఇష్టంగా లేదు. ఎవళ్లైనా వింటే నవ్వుతారుకూడాను ! మీ కెల్లా తోచిందోగాని—

నాయుడు:—నువ్వెన్ని చెప్పినా - పిల్లని చదివించక తప్పదు. రేపు మంచిది. ఉదయాన్నే అతడు వస్తాడు. అమ్మాయితో సిగ్గుపడకుండా జాగ్రత్తగా చదువుకోమని చెప్పు—

నాయుడుభార్య:--మీకీచదువుపిచ్చేమిటో తెలియడంలేదు.ఆడపిల్లలకు అతిచదువు అనర్థదాయకం సుమండీ ! ముందేం కొంపమున్గు తుందో యీ మాయచదువంటూ మొదలు పెట్టుతున్నారు.

నాయుడు:—మన దేశంలో స్త్రీలకు తగిన చదువు లేకపోవడంమూలాన్నే అనేకానర్థకాలు—

నాయుడుభార్య:—సరే! నాకెందుకు.మీ యిష్టప్రకారమే కానియ్యండి. ఈబుద్ధి మీ కెందుకుపుట్టిందో?ముందేం కాదలుచుకుందో—

నాయుడు:—కాదలచుకొన్నది ఎల్లాగా కాకమానదు, మన కెందుకని ఊరుకో!

౫

పరాంకుశం:— "రాణీసంయుక్త" చదివావా?

రత్నం:— చదివినాను ... ... ... రాణీ సంయుక్త పట్టుదలమాత్రం మిక్కిలి కొనియాడతగినది. తనవాళ్లందరకు విరోధిలయినప్పటికీ - ఎవరికీ ఇష్టం లేకపోయినప్పటికీ నిరంకుశంగా పృధ్వీరాజునే వరించడం ఆమె యొక్క సునోద్రఢిమను సూచిస్తోంది. ఇదీగాక తాను మనసారావరించినవాడిని పెళ్లాడలేకపోవడంకంటె, చావడమే మేలు. ఇష్టంకానివాడితో కాపురంచెయ్యడం ఎల్లాగ? అన్యోన్యత లేనప్పుడు సంసారంలో సారస్యం ఏముంటుంది? ఆనందము - సౌఖ్యము - ఎల్లా ఉంటాయి?

పరాంకుశం:—మన దేశంలో కన్యకలకు వివాహవిషయంలోమట్టుకు ఏమీ స్వాతంత్ర్యం లేదు.తల్లితండ్రులు కన్యకలకు సుఖపడాలనే సాధ్యమైనంతవఱకు తగిన వరులనే ఎంత కష్టనిష్ఠురాలకైనా లోబడి పెళ్లిళ్లు చేస్తారు, కాని కన్యకల మనఃప్రవృత్తి తెలుసుకోవడం చాలాకష్టం. తెలుసుకొని పెళ్లిళ్లు చెయ్యడం మరీకష్టం! పోనీ అని కన్యకు స్వతంత్రం ఇస్తే అనేకానర్థకాలుతటస్థిస్తాయి. కన్యయొక్క అభిప్రాయ మొకప్పుడు వెఱ్ఱితలలువేసి మొదటికే ముప్పు తీసుకురాగలదు.

రత్నం:—లాభనష్టాలు ప్రతివిషయం లోనూ ఉంటాయి - కాని కన్యయొక్క అభిప్రాయానికి వ్యతిరేకంగా పెళ్లిచెయ్యడం మట్టుకు వాళ్లను గంగలోదింపడం అన్నమాటే! దున్నపోతును, ఎద్దును ఒక బండికి కట్టినట్టు అనుకూలత చూడకుండా ధనవంతుడనో - విద్యావంతుడనో - దగ్గరసంబంధమనో - మేనరికమనో - పెళ్లిచెయ్యడం మాత్రం ప్రమాదకరం. దంపతులలో అనుకూలత ఉండాలి కాని అది లేనప్పుడు ఎంతటి భాగ్యభోగ్యాలున్నా ప్రయోజనంలేదు.

పరాంకుశం:—కన్యకు వివాహవిషయంలోస్వతంత్రం ఇస్తే వర్ణాంతరవివాహాలు శాఖాంతరవివాహాలు, చిత్రవివాహాలు విచిత్రవివాహాలువృద్ధికాక తప్పదు. కన్య రూపముగ్ధ కావడంచేత యుక్తాయుక్తవిచక్షణ లేకుండా కుటుంబానికి నగుబాట్లు తేవచ్చును. క్రమంగా స్వతంత్రతవల్ల అనేకములైన చిత్రవిచిత్ర ప్రవర్తనలు వరులయందూ వధువులయందూ కల్గుతూ ఉంటాయి. వధువుయొక్క స్వాతంత్ర్యము ముదరడంచేత, అమెరికావారి వివాహాలు, మార్కెట్టుధరల్లాగ నిలకడ లేకుండా పోయాయి!!

రత్నం:—హృదయదౌర్బల్యము కలవాళ్ల సంగతి ఎప్పుడూ తీసికట్టుగానే ఉటుంది! వాళ్లప్రవర్తన హానికరమే! నిశ్చలమైన ప్రేమపాశబంధం ఎప్పుడూ సడలదు. అట్టి బంధాన్ని ఎవరూ తెంపలేరు! కాని తల్లి తండ్రడు లాబంధాన్ని తెంప ప్రయత్నింపక తగిన దోహదంచేసి వధూవరులను ఆనందమను భవింపనియ్యాలి—

పరాంకుశం:—ఇంక ఈప్రస్తావనకట్టిపెట్టి నేటిపాఠాన్ని మొదలుపెట్టు.

రత్నం:—ఈవేళ సావిత్రీచరిత్ర చదవాలి- కాని ఇవాళ నాకు సెలవు కావాలి. మా మామయ్య, తాతగారు, అమ్మమ్మా వచ్చారు.

పరాంకుశం:—సరే! ఏమిటివిశేషం—

రత్నం:— రేపటికి తెలుస్తుంది!

౬ .....

రత్నం:—ఇవాళకూడా నాకు సెలవు కావాలి!

పరాంకుశం:—ఎందుకు?

రత్నం:—మా అమ్మ, తాతయ్య, మామయ్యావగైరాలు గూడు పుఠాణీగా, ఏమిటో గుసగుసలాడుతున్నారు! అసలు సంగతేమిటో తెలియలేదు; పోంచుండి వినాలి.

పరాంకుశం:—నిన్నటినుంచి కొంచెమైనా పసికట్టలేకపోయావా?

రత్నం:—ఏవో పెళ్లిసంగతులని మాత్రం ఊహింపకల్గేను!

పరాంకుశం:—అటయితేనీ పెళ్లిని గురించే కావచ్చును.

రత్నం:—(సిగ్గుతో) ఏమో? యీవేళ గుట్టు తీస్తాను రేపటికన్నీ తెలుస్తాయి!

పరాంకుశం:—నీచదువు ఆఖరుకి, మీ అమ్మ అన్నట్లు మీ నాన్నగారికి తలవంపులు తెచ్చేటట్లుంది!

రత్నం:—మీరెప్పుడూ ఇల్లాగే మాట్లాడుతారు! మావాళ్లకుమాత్రం, మంచీ, చెడ్డా తెలియ దనుకున్నారా? నాయిష్టానికి వ్యతిరేకం జరగదని నావుద్దేశ్యం!

పరాంకుశం:—ఏమిటో వెర్రిపిల్లవు! నీ మాట నెగ్గనిస్తారా? నువ్వెన్ని చెప్పినా, నాకు నమ్మకంలేదు. ప్రేమతత్వం అందరిబుద్ధికీ దబ్బున ఎక్కదు.

రత్నం:—మనప్రేమబంధాన్ని తెంపడం దైవానికైనా చేతకాదు, ఇక మనుష్యుల లెక్క ఏమిటి?

పరాంకుశం:—నాయందు ఏమి విశేషం వుందని నీకింత మోహం? విద్య ఉందనా? ధనం వుందనా? ఇంకేం వుందని?

రత్నం:—ఏం వుండాలి? నాకు నచ్చేగుణసంపత్తీ, రూపసంపత్తీ, ఉన్నాయి. వధువుకు ఇంతకంటే కావలసిన వేమి ఉంటాయి?

పరాంకుశం:— నీ ధైర్యము, ఉత్సాహము, ప్రేమా చూస్తేసంతోషంగానే ఉంది; కాని,మీ వాళ్లకు తెలిసింఎంటే నీకూ నాకూ కూడా కొంప మున్గుతుంది; నీకు-అంతగా...

రత్నం:—స్వతంత్రుడైన మొగవాడికి కూడా భయమైతే ఎలాగ? ఏమైనా సరే నా మనోనిశ్చయం చెబుతున్నాను, ఎట్టి కష్టాలు వచ్చినా నేననుకున్నంతా జరిగి తీర వలసిందే?

పరాంకుశం:—నీ మనోనిశ్చయం ప్రశంసనీయం!ఇకఇక్కడ అట్టే మాట్లాడడం మంచి పని కాదు. గోడలకు చెవులుంటాయి! ఎటు వచ్చినా కాస్త ఈవిషయం కొన్నాళ్లవరకూ వెల్లడి కాకుండా ఉంచడం మంచిది. నీవు జాగ్రత్తగా పరిశీలించు వాళ్లప్రసంగమంతాను. నేనోమాట చెప్తాను నీవు ఏమీ అనుకోవుగదా?

రత్నం:—ఇంకా నాహృదయం మీకు తెలియలేదా?

పరాంకుశం:—(నవ్వుతూ) తెలిసిందిలే! అయినా నీ వేమంటావో తీరా విన్నతర్వాత!

రత్నం:—చెప్పడానికే మీరల్లా సందేహిస్తున్నారు. ఏమిటది?

పరాంకుశం:—మరేమీ లేదు, రేపు ఉదయాన్ని ఏదో వంక పెట్టుకొని మాయింటికోమాటురా? నీతో ఇంకాకొన్ని సంగతులు మాట్లాడాలి -

రత్నం:—తప్పకుండా వస్తాను, ఇందాకా మీరురావడంఆలస్యం అవడంచేతవద్దా మనుకొన్నాను గాని తీరావస్తే మీ రేమనుకుంటారోనని రాలేదు -

పరాంకుశం:—ఇక నేవెడతాను, అసలు సంగతేమో పసికట్టు.

౭

పరాంకుశం:—ఏమిటి విశేషాలు?

రత్నం:—మీరన్నంతా జరిగింది! దైవం నాకు అనుకూలంగా లేదు! ఇకముందు సంగతులుఎట్లా ఉంటాయో ఊహించడానికి కూడా శక్యం గాకుండా ఉన్నాయి! మన ఉద్దేశాలు నెరవేరడానికి తగిన మంచియెత్తైనా మనం ఇద్దరం చక్కగా ఆలోచించాలి!

పరాంకుశం: — అసలు సంగతేమిటో చెప్ప వేమిటి? ఏంజెయ్యడానికిన్నీ -

రత్నం:—(విచారం సూచిస్తూఉన్న చూపులతో) ఇక మన ఆటలు సాగేటట్టు లేదు. అదేదో పూళ్లో బాగా డబ్బూ మొఖాసా ఉన్న పెళ్లికొడుకెవడో ఉన్నాట్ట! వాడికి నన్నివ్వాలని మాఅమ్మ, తాతయ్య,వగైరాలు గట్టిగా పట్టు పడుతున్నారు - మా నాన్నగారు ఇదమిద్ధమని తన అభిప్రాయాన్ని తేల్చలేదు. నిన్నరాత్రంతా మావాళ్లు మా నాన్నగారితో యీ పెళ్లికొడుకునుగురించి నచ్చచెప్పడంతో సరిపోయింది. విద్యానిధీనుడికి పిల్లనివ్వనని మా నాన్నగారు, ఆ మొఖాసాదారుడికి ఇస్తేనే కానివల్లకాదని మా అమ్మ, తెగదెబ్బలాడుకొన్నారు. మా నాన్నగారికిఆసంబంధము సుతరామూ ఇష్టము లేదు — కాని మా అమ్మమాటకు అడ్డు చెప్పలేకుండా ఉన్నారు. మా న్నాగారు. మా నాన్నగారికి బహుశః నన్ను మీకు ఇచ్చి కట్టిపెట్టాలని మనస్సులోఉన్నట్టు కొన్నికారణాలచేత నాకు తోస్తోంది! ఇంతకూ మన అదృష్టం ఎల్లావుందో!

పరాంకుశం:—అదృష్టం జోలి మనకెందుకు? ప్రస్తుతం మన కనుకూలత కల్గేటట్టు లేదు. మీ తాతయ్యావగైరాలవల్ల.

రత్నం:—అంతాబయలుదేరి తెల్లవారు జామున వెళ్లారు నాకు పీడ వదిలినట్లుంది!

పరాంకుశం:—మొదట వచ్చిన చెవుల కంటె వెనకవచ్చిన కొమ్ములు వాడి అన్నట్టు నేటికి నామూలాన్ని వారు పీడాకరంగా ఉన్నారు!

రత్నం:—ఇది నాకొక్కర్తెకే రాలేదు. అమ్మలక్కలంటూ ఆవిషయంలో నాతోడివారే!!

పరాంకుశం:—పర్యవసానం తేల్చేవు కావు,

రత్నం:—ఎన్నివిధాల మా తాతయ్యా మాఅమ్మా చెప్పినా మా నాన్నగారు ఆ సంబంధాని వొప్పుకోలేదు! మాఅమ్మ వాళ్లతోకూడా వెళ్లింది, పరస్పరంగా పెండ్లికుమారుణ్ని చూతామని--

పరాంకుశం: —ఆమాట ఇంతవరకూ చెప్పేవేకావేమి? మీ అమ్మగట్టిగా పట్టు పట్టినదన్నమాటే! ఇక ఆసంబంధము నీకు తప్పదన్నమాటే!

రత్నం:—ఈజన్మకు కాదుగదా? ఇంకో జన్మకైనా ఆపెళ్లి జరగదు. ఇంకోసంగతి! మాఅమ్మ రాగానే నాచదువుకి స్వస్తి చెప్తారు. అంతట మనకు ఎడబాటు వస్తుంది. ఏంజెయ్యడానికి తోచడంలేదు! దైవం ఏంజే స్తాడో. (కన్నీరు పెట్టుకొనును.

పరాంకుశం:—(రత్నంకంటినీటిని జేబురు మాలుతో తుడుస్తూ ఇటువంటి ప్రేమబంధాన్ని దీసి దైవంమనకు తీరనిదుఃఖం కలిగిస్తాడా? నాకు సెలవులు కావచ్చాయి - ఇక ఎన్నాళ్లో ఇక్కడ వుండడానికి వీల్లేదు, కొద్దిరోజుల్లో వెళ్లి కాలేజీలో ప్రవేశించాలి. ఎల్లాగూ కొన్నాళ్ల పాటుమనకు ఎడబాటు - త - ప్ప - దు.

రత్నం:—(విచారముతో) మిమ్మల్ని విడిచి ఒక్కక్షణమైన ఉండలేను. నన్ను మీతోకూడా తీసుకుపొండి.

పరాంకుశం:— నీకొంపా - నాకొంపా - ఒక్కసారిగా అంటుకుంటాయి.

రత్నం:—ఆర్పడానికి దైవం లేడా?

పరాంకుశం:—మీ అమ్మ రానీ, అన్నీ తేల్తాయి! నిన్నుమాత్రం అడగరూ? ఈ సంబంధం ఇష్టమా? అయిష్టమా? అని.

రత్న:—ఏమో? ఎద్దు నడిగి గంత వేస్తారా? మానాన్నగారికి ఎంతమాత్రం యీ సంబంధము ఇష్టములేదు. ఇది మన అదృష్టం అనక తప్పదు. ఎన్నడూ నామా టకుగాని - మా నాన్నగారి మాటకుగాని ఎదురుచెప్పని మాఅమ్మ, యీ విషయంలో మూర్ఖపుపట్టు పడుతోంది. "వినాశకాలే విపరీతబుద్ధిః" అన్నట్టు.

పరాంకుశం:—దైవికంగా ఏర్పడ్డ మన ప్రేమపాశబంధము క్రమేణా దృఢపడునో సడలునో ఎవరికెరుక?

రత్నం:—ఏమిటీ? ప్రేమపాశబద్ధుల మైన మనల్ని విడదీయడం బ్రహ్మకైనా తరముగాదు! ఈమాట మళ్లీమళ్లీ చెప్పడం ఎందుకూ? ఈసంవత్సరం ఎల్లాగా పెళ్లి జరగదు! మాఅమ్మతో మెల్లిగా మన ప్రేమోందంతం చెప్పి నిష్కలంకమైన యీ దాంపత్యాదర్శము నిర్మూలింప వద్దని వేడు కొని ఆమె అభిప్రాయాన్ని మారుస్తాను. ముందుముందు మనకు మంచిరోజులు రాగ లవు. అప్పుడు అందరూ ఒప్పుకుంటారు. మనకూ అనుకూలత జరుగుతుంది!!

పరాంకుశం:—నీనిష్కలంక ప్రేమ నిన్నె న్ని కష్టాలపాల్జేస్తుందో? ఎంతటి... ...

రత్నం:—నావల్ల మీకు ... ... ... ... అయ్యయ్యో!! ఎన్నికష్టాలు రానున్నవో కదా?

పరాంకుశం:—విచారించకు. ఎన్ని కష్టములు పడినా తుదకు అనుకూలఫలం కలిగితే చాలు!

రత్నం:—మీరు మరియొకవిధంగా అను కోవద్దు! ఎన్నిఇక్కట్లు వచ్చినా మీరే నా మనోనాయకులు. సావిత్రిప్రేమవంటి ప్రేమ



ఏ. వి. టి. అయ్యరుగారిఅనుమతిని.

తిరుమలనాయకునినగరు అన్తర్దృశ్యము మధుర

నాది, దైవంకూడా నాఅభిప్రాయాన్ని మార్చలేదు.

పరాంకుశం:—కాని మీవాళ్లబలం దైవ బలాన్ని దిగదోస్తోంది.

రత్నం:—ఇక వెడతాను. మళ్లాకలుసు కుంటూనే ఉంటాము వీలయినప్పుడల్లా.

పరాంకుశం:—ఏమో? నీదయ! నన్నేం చేస్తావో!! (అని గద్గద కంఠంతో మాట్లాడ లేకపోయాడు).

రత్నం:—ఈజన్మకు మనకు అంతరాయం వచ్చినా ముందుజన్మలోనైనా మన కోర్కెలు నెరవేరగలవు.

పరాంకుశం:—సరి! సరి!! అప్పుడే మారిం దీ ధోరణి ?

రత్నం:—అబ్బా! నాఅభిప్రాయం మీకు సరిగా అర్థముకాలేదు.

పరాంకుశం:—కాకేమి ?

రత్నం:—మీ రన్యథా ఎంచకండి — నేను ప్రాణాలతో ఇంకొకరి సొత్తుకాజాలను.

(పరాంకుశం ఆనందముతో రత్నాన్ని కవుగిలించుకొన్నాడు. ఇద్దరూ పారవశ్యాన్ని పొంది బాహ్యప్రపంచాన్ని మరిచారు)

౮

నాయుడు:— చెప్పు మరి.

నాయుడుభార్య:—అన్నివిధాలా యీ సంబంధము నాకు నచ్చింది. ఏలోటుపాటా లూ లేవు. ఎటొచ్చీ అతను అంత ఎక్కువ అందమైనవాడు కాడు ! సామాన్యంగా ఉంటాడు. బాగా ఆలోచిస్తే అందచందాలు కూడూగుడ్డా పెడతాయా ? కావలసినంత ఆస్తి వుంది. చూసినకొద్దీ ఏదోలోటుఉంటూ నేఉంటుంది! అన్నీ మంచిరాసులు కలవాళ్లు ఎక్కడైనా ఉంటారా ? అని నాసందేహం, ఈవిషయంలో మాత్రం మీ రేమీ అభ్యం తరం చెప్పక నాముద్దు చెల్లించాలి.

నాయుడు:—నీముద్దు నీచిన్ననాడే చెల్లిం చాను. ఇక తీరవలసింది పిల్లముద్దు--కాబట్టి అమ్మాయినిఅడిగేవా నీఅభిప్రాయమేమిటని.

నా-భా:—కుర్రపిల్ల! దాని కేం తెలుస్తుంది మంచీ చెడ్డా మన మాలోచించాలి గాని.

నాయుడు:—ఈడు వచ్చిన పిల్ల దానికి మాత్రం తెలియదా ? మెల్లిగా అడుగు ఏమంటుందో ?

నా-భా:—అదిమాత్రం ఏమంటుంది! నిత్యేపంవంటి సబంధం కూటికి లోటా?గుడ్డకు లోటా? మీరుచెప్పండి ఏంలోటు?

నాయుడు.—ప్రధానమైనవి రెండూ లోటు విద్యా-రూపమూను.

నా-భా:—మీరు బాగా చూడలేదు గనుక అల్లా అంటున్నారు! చెంపకు చారెడేసి కళ్లూ అతనూ, చక్కగా కృష్ణమూర్తిలా వుంటాడు. కాస్త చదువు తక్కువ అన్నమాట గాని మరేవిషయంలోనూ లోటులేదు !

నాయుడు.—నేనోమాట చెప్తాను విను-- ముందు పిల్లఅభిప్రాయం కనుక్కో—తరువాత మనం ఆలోచిద్దాం?

నా-భా:-మాటమాటకీ పిల్లని కనుక్కో-- పిల్లనికనుక్కో? అని అంటారు. దాన్నడిగా మనం సంబధం నిశ్చయం చెయ్యడం? అదీ కాక ముక్కుపచ్చలారనిపిల్ల దానికేం తెలుసు మంచీచెడ్డాను. పిల్ల వప్పుకుంటే మీఅభ్యంతర మేమీ లేనట్టేనా?

నాయుడు.—పిల్లఅభిప్రాయం తేలేదాకా నాఅభిప్రాయ మియ్యతలుచుకోలేదు.

నా-భా.—మీరూ - అదీ - కూడపలుక్కొని ఏదోపన్నాగం పన్నినట్లున్నారు-- ఇప్పటికి తెలిసింది మీవుద్దేశం.

నాయుడు:—అబ్బా! నీధోరణి నీదేకాని నామాట వినదలచుకోలేదా? ముందు అమ్మాయితో మాట్లాడు, మనం ఆలోచిద్దాం.

నా-భా.—పెళ్లికొడుకు మీకునచ్చాడా? లేదా? ముందీమాట చెప్పండి తరువాత పిల్ల నడుగుతాను.

నాయుడు.---ముందు పిల్ల నడుగుమంటే ఆమాట చెవిని పెట్టవేమి?

నా-భా.—మీకేదో మరో వుద్దేశం వుంది ... ... అది అంతా నాకెందుకు! పిల్ల నామాటకు వ్యతిరేకం చెప్పదులెండి!!

———:o:———



# ఈ దేశములోని శిశుమరణములు.

డాక్టరు. జి. శ్రీరాములుగారు, ఎల్, సి, పి. అండు ఎస్.

(కారణములు—నివారణము)

(సూచన:—ఈసంచికయందుఁ రాబోవువాటియందును స్త్రీల గర్భమునుగుఱించియు శిశుజననము పోషణ మొదలగు స్త్రీలకు ముఖ్యముగా తెలియదగిన విషయములనుగూర్చియు తెలుపబూనినాను.)

దంపతులకు తెలియతగిన విషయములు పెక్కుగలవు. కాని స్త్రీ నేర్చుకొనదగినవి ప్రథమమున తమశరీరమును కాపాడుకొనుటయు జన్మించబోవు శిశువునకు తగిన పరిస్థితులను సమకూర్చుటయును. ఎల్లరకును ఆరోగ్యముగా నుండవలెనను కోరిక యొక్కటి యున్నదేగాని దానికిగాను నడచుకొనవలసిన రీతులు పద్ధతులు తెలిసికొన ప్రయత్నించువారు కొద్దియే. పూవును బట్టియె పిందె యనునట్లు తల్లిని, తల్లి ఆరోగ్యమును బట్టియె బిడ్డయును యుండును. ప్రాచీనపద్ధతుల నను సరించుట చేతను (Superstition)వల్లను పాశ్చాత్య వైద్యచికిత్సలయందు నమ్మకము లేకపోవుటచేతను మనకు ఎంతయు కీడు వాటిల్లుచున్నది. భారతదేశమున జన్మించు 1000. బిడ్డలకు మొదటిసంవత్సరము దాటకమునుపే 189 బిడ్డలు చనిపోవుచున్నారు. ఇంగ్లాడులో 75ను ఆస్ట్రేలియాలో 57ను, గా నున్నవి. 1000 మంది గలచోట సంవత్సరమునకు జన్మించు శిశువులు 43. మొత్తం జనులచావుసంఖ్య 38. సాధారణజనసమూహమున యివి 45ను 15ను గా నుండవలయునని (Economists) చెప్పుచున్నారు.

విదేశములలో నెల్లడలను జనసంఖ్య తక్కువగునట్లును మరణసంఖ్య మరితగ్గునట్లును చేయప్రయత్నించుచున్నారు. అందుచేత పుట్టినసంఖ్యలో ఎక్కువ జనులు వృద్ధత్వముచెందుచున్నారు. మనదేశమున వేరువిధముగా నుండబట్టి మన హిందువుల ఆయుఃపరిమాణము 30 సంవత్సరములనియె తెలియుచున్నది. 30 వ వయస్సునకు మీద జీవించియుండువారి సంఖ్య యీక్రింది Statement ను బట్టియే తెలియును. అదేవయస్సునకు ఇంగ్లాండుదేశమున యుండు జనసంఖ్య గమనింపదగినది.

(వేయిజనులకు)

| వయస్సు | ఇంగ్లాండు | ఇండియా |
|---|---|---|
| 10 ఏండ్లకు క్రింద | 209 | 274 |
| 10—20 | 190 | 198 |
| 20—30 | 173 | 170 |
| 30—40 | 152 | 143 |
| 40—50 | 115 | 94 |
| 50—60 | 80 | 61 |
| 60—70 | 51 | 36 |
| 70 మీద. | 30. | 17. |

వేయిజనులలో 70 వ. యేటకు జీవించియుండువారు 17 గురే.

మనదేశమున జన్మసంఖ్య ఎక్కువ. పోషణచాలకనో మరి వ్యాధులచేతనో ఎక్కువగా మరణములును తటస్థించుటవల్ల జనసంఖ్య ఎక్కువకాకున్నది. ఎక్కువ సంఖ్య ప్రయోజకత్వమునకురాక మునుపే మరణించుటచే పెంపుడుఖర్చులు వృథాగా పోవుచున్నవి.

మరణసంఖ్య ఎక్కువగ నుండుటకు అనేక కారణములున్నవి. వాటిలో ముఖ్యకారణము ప్రజల ఆర్థికస్థితియే. కడుపునిండుగా తినుటకు అన్నములేని తల్లి ఎట్టిశిశువులను కనగలదో యూహింపనగును. మఱియు అట్టి పరిస్థితుల జన్మించిన శిశువు ఎంతటి ఆరోగ్యమును

కలిగియుండుననుటను యోజింపుడు. అట్టిశిశువు రోగములకు నూతకోలై శీఘ్రకాలముననే తల్లిదండ్రులకు వృథాఖర్చులు కలుగజేసి చనిపోవును.

మనదేశమున పుట్టుబిడ్డలలో ఐదింట నొకభాగము మొదటిసంవత్సరము గడవకమునుపే గతించుచున్నవని చెప్పినాము. అట్టివిషాదమునకు కారణము లేమని యోచింతము. దీనికి తగుచికిత్స ఎట్టిదని మనకుబోధపడ గలదు.

(1) వివాహమునకు ముందు వధూవరుల ఆరోగ్యమును ముఖ్యముగా గమనింపవలెను. అనారోగ్యదాంపత్యమునుండి ఆరోగ్యపు శిశువులను ఎదురుచూచుట పుచ్చుటెంకనుండి మంచిమొలక నెదురుచూచునట్లే. మనదేశమున వేయి అబద్ధములాడియైనను ఒకపెండ్లి ముగించమనెడు ప్రశస్తియున్నది. దానిననుసరించి వివాహమే ముఖ్యముగను దంపతుల ఆరోగ్యమును లెక్కగొనక వారిలోటులను రోగములను మూసియుంచి వివాహమును జరిపించెదరు. ఇట్టివిషయములందు మనసంఘమున మార్పులు కలుగవలసి యున్నవి. వివాహానంతరము వధువో వరుడో మరణించుట చేత వివాహవ్యయము వృథాయగుటయేకాక మిగుల సంతాపమునకును కారణ మగును. మఱియు పురుషుడు చనిపోవ గర్భిణిభార్యస్థితి దానికి జన్మించు శిశువుయొక్క ఆరోగ్యతయు ఎట్టిదై యుండును? అట్టిదుస్థితులను ఆపుకొనుశక్తి మనయందుండియు మనమేల యశక్తుల వలె చూచుచే నిలుచున్నాము. జ్యోతిష్కులవాక్కే బ్రహ్మవాక్కుగను నక్షత్రముల పొందికనే ముఖ్యముగ చూచుటకన్న దంపతులఆరోగ్యమును, వైద్యుల సలహాను గమనించుట ఉచితము. ఏక్షయము చేతనో వివాహానంతరము శీఘ్రకాలమున గతించెడువారి వివాహములను వైద్యులసలహాచే నాపనగును. వివాహోద్యమమునకు పూర్వమే దంపతులను వైద్యులకు చూపివారికట్టి విషమవ్యాధులును లేవని తెలిసినవెనుక వివాహప్రయత్నములు చేయుటే మంచిదని తెలియు చున్నది.

(2) బాల్యవివాహమునుగూర్చి మనము యిటీవల విశేషముగా చదువుచున్నాము. శిశుమరణసంఖ్యలో సగముభాగమైనను ఈ ఒక్కకారణముననే యై యున్నది. బాల్యవివాహము కూడదని వాదించువారే తమకుటుంబములందు అట్టిపరిస్థితులు ఏర్పడినప్పుడు శారదాఆక్టులను లక్ష్యపెట్టక మూలద్రోసి వివాహములను జరుపుటను చూచుచున్నాము. ఇందుకుకారణము దేహపు Physiology తెలియక పోవడమే 14గు ఏండ్లైనను దాటని బాలికయొక్క అవయవములు చాల చిన్నవై చక్కగా ఎదుగనివై పూర్తిగా వాటివాటి పనులనుచేయ నశక్తులై యుండును. అందునను గర్భాశయములు మరిరెండేండ్లవఱకు సరిగాగర్భమును దాల్చునంతటి స్థితియందుండవు. తనశరీరమే పెరుగవలసియుండ అట్టిబాలిక మరియొకశరీరమునెట్లు (శిశువును) తనలో పోషింపగలదు. అట్టిబాలింతరాలు తనబిడ్డకు యిచ్చుటకుక్షీరము స్తనములలేదన్న ఏమియు ఆశ్చర్యముగాదు. త్రాగుటకు తల్లిపాలు లేక మఱియేపాలనైనను పోషింపబడుటచే ఆశిశువు అల్పాయువై పోవును.

కావున బాగుగా పెఱిగిన వారే వివాహార్హులనియు అట్టిస్థితి 16 యేండ్లు కానిదే రాదనియు శాస్త్రజ్ఞుల శాసనము.

బాలికకాక శిశువా? యని విదేశీయులు మనలను చూచినప్పుట తటస్థించెను. పిన్నవయస్సుననే గర్భిణులగుటచే అనేకవ్యాధులకు లోనై వాటినుండి తట్టుకోలేక ఆరోగములకు లోబడి మో ప్రసవసమయమున శిశువుశరీరము చిన్నద్రోవన సులభముగా రాలేకపోవుటచేతనో లేక ప్రసవానంతర రోగముల చేతనో చనిపోవుట తటస్థించును. వీటినుండి బ్రతికినను ఆరోగ్యము చాల చెడియుండును. జన్మించినశిశువును పోషిం

పశక్తిలేక ఆవుపాలనో మరి యేవిదేశపు పాలనో పోషింపబడునట్టి దాని ఆరోగ్యము నేమనదగును అట్టి శిసువు రోగములకు నాతకోలై శీఘ్రకాలముననే మరణించును. (ఇందుచే తల్లిపాలనేగాక తదితరములచే పోషింపబడు శిశువులగతి యిట్టిదనిచెప్పలేదు. గాని సాధారణధోరణినే దెల్పుచున్నాము) కొండప్రసవవేదన పడుచో చూచువారందరు చిన్నకొండ జన్మింపనున్నదను కొనుచుండ చిట్టెలుక పుట్టినట్లు తల్లిపడ్డ కష్టములకు ఫలమనుభవింపక తన్నే, గుల్లచేయు వ్యాధుల ననుభవించును.

(3) వధూవరులవయస్సును మనము ముఖ్యముగా గమనింపవలయును. మనదేశమున విదేశములందు వలె వృద్ధకన్య బాల్యభర్త వివాహములు జరుగుటలేదు. గాని వృద్ధభర్తబాల్యకన్యా వివాహములు ఎక్కువగా జరుగుచున్నవి. అట్టివి వధూవరులకు శ్రేయస్కరము గాదని ఎల్లరకు తెలిసియే అట్టివివాహములు కొనసాగుచున్నవి. ఇంతకుముందు చెప్పినట్లు సాధారణ హిందువుయొక్క ఆయుఃపరిమాణము చాలతక్కువయై యుండబట్టి 40 యేండ్లవయస్సునవ బలముతగ్గి వీర్యము క్షీణదశయందుండును. అట్టిస్థితిని జన్మించిన శిశువులు బలహీనమై అల్పాయువగును. కొన్ని **Mentally defective** గను యుండి తల్లిదండ్రులకు కష్టమును వ్యయమును కలిగించును. 8 లేక 10 యేండ్లుతారతమ్యము యుండదగినది. మనదేశమున స్త్రీవయస్సు భర్తకన్న తక్కువగయున్ననే వివాహము జరుగుచున్నది గనుక ఆవిషయమునుగురించి యోచింపనక్కఱలేదు.

(4) గర్భరోజులయందును, ప్రసవ సమయములందును తగిన వైద్యుడును చికిత్సాసాధనములును లేకపోవుటచేత నివారింపదగిన శిశుమరణము కలుగుచున్నది. ప్రభుత్వము వారి వైద్యశాలలును వైద్యులును జనసంఖ్యనుబట్టి చాలస్వల్పము. పల్లెలప్రాంతములందు మరియు లేనేలేదు. తగినచికిత్స పూరివద్ద లేకపోవుటచే మరణములు ఎక్కువగనున్నవి. దగ్గతి వైద్యశాలకు తీసుకొని వెళ్లునంతలో ఎంతటి విపత్తైనను జఱుగవచ్చును. ప్రభుత్వము వారిదే తప్పని చెప్పుటకును వీలులేదు. చికిత్సా సాధనములుండినచోట్ల ఎందఱు అట్టివాటిని వినియోగించుకొనుచున్నారని చూతము. పాశ్చాత్యఔషధములందు అవనమ్మిక చేతను, స్త్రీ వైద్యులచేతనే చికిత్స పొందవలెను. ఎన్నిక కలుగుటచేతను ఇట్టి సాధనములను ఉపయోగపరచుకొనుట లేదు. కడపటిసఱకు చేతిమందులచేతను, దయ్యములు, పిశాచములు పాఱద్రోలుటయందును ముడుపులు కట్టించుటయందును కాలమును వృథాపుచ్చి వెనుకకుట్టూపిరితో వైద్యులకుచూపిన నెంతటిఫలము గలుగవచ్చును? ప్రాచీనపద్ధతుల ననుసరించుటచేతను, సుఖాధారనీతుల గమనించకపోవడముచేతను గలుగు లాభము గర్భిణుల అనారోగ్యతయందును ప్రసవకాలపు జీవితానిశ్చయమువల్లను తెలియనగును.

(5) ప్రస్తుతపు స్త్రీల విద్యాభ్యాసము వారికి కొంచెమైనను తగినది కాకపోవుటచేత వారి ఆరోగ్యము తగ్గిపోవుచున్నది. బాలురు చదివెడుచదువునే వారును నేర్చుటచే వారి కోమల శరీరము ఆ హెచ్చుపరిశ్రమకు తగనందువల్ల క్షీణించిన ఆరోగ్యముకలవారై గర్భిణిత్వమునకు తగినవారు కాకున్నారు. ఇందుచే, వారు పురుషులతో సహా అన్నివిద్యల నేర్చుకొనకూడదనుటగాదు—కాని వారికి ప్రత్యేకపురీతి విద్య ఆవశ్యకమనుటయందు తప్పేమియులేదు. విదేశభాషలయందు విద్యలనేర్చుటచేతను పరీక్షలనెడు దయ్యములయందలి భయముచేతను, తగిన విహారమును, వ్యాయామమును, విశ్రాంతియు లేకపోవుటచేత కలుగు చెడుగులు పెక్కు. విద్యాలయములందు వారు పెంచుకొనెడుశరీరమే వారికి యికమీది కాలమున తోడ్పడును.

అనారోగ్యత, గర్భనిగ్రహము, నివారణ - యివి యికముందు చర్చింపబడును.

(6) అనారోగ్యమైనచోట్ల నివసించుటచేతను, మంచిగాలిలేని, చీకటియిండ్లయం దుండుటచేతను అనుచితములైన వస్తువులను తినుటవల్లను కలుగుబాధలే శిశుమరణరూపమున మనము చూచుచున్నాము. ఎల్లప్పుడు దుర్గంధవాయువును పీల్చుశిశువులు బాగుగా నెదుగక సన్నమై క్షీణించును. అట్టిచోట్లనుండు తల్లులును రోగములకాకరములై బలహీనపు శిశువుల కనుచున్నారు. ఆ శిశువైనను మంచిచోట పెంచబడ్డటులైన బాగుగా నుండును. అదియు ఆ చోటనే పెరుగుటవల్ల మరియు క్షీణదశయందుండి త్వరలో గతించును. తల్లులకన్న బిడ్డల ఆరోగ్యమే యిట్టి పరిస్థితులయందు ఎక్కువగ క్షీణించును. మంచిగాలిలేని యిండ్లయందు వసించుటచే క్షయను మున్నగు వ్యాధులకు లోనగుదురు. నగరవాసస్థులు చీకటి, గాలిలేని అద్దెయిండ్లయందు వసించుచు శిశువులకనుచు పెంచుచునేయున్నారు. వారిలో బాల్య శిశుమరణము ఎక్కువగ కనుబడుచున్నది. శుభ్రమైనగాలి లేనందునను, ఆరోగ్యమునకు అత్యావశ్యకమైన సూర్యరశ్మి బాగుగ తగలకపోవుటచేతను నగరములలో నెంత శిశువులు చనిపోవుచున్నవో అదేసంఖ్య పల్లెటూళ్లలో తగిన చికిత్సలేనందున చనిపోవుచున్నవి. మంచిగాలియు సూర్యరశ్మియు కలిగియూ వారిదుస్థితి యిటులున్నది.

(7) భారతదేశము యిటీవల పేదరికమునకు పేరు పొందుచున్నది. తినుటకు అన్నములేని ఆలుమొగుడు ఎట్టి ఆరోగ్యపుబిడ్డలను కనుకొనగలరు. అట్టి దుస్థితిని జన్మించినబిడ్డలు పోషణవిషయ మెటులుండునో యోచింపుడు. దినమునకు ఒకపూటయే అరకడుపు అన్నముత్రినెడు యిల్లాలికి ఆరోగ్యమేకడుహీనము. అందులో నొక శిశువుకలిగినదాని గతిఏమి? త్రాగుటకు తల్లిపాలైనను లేక గంజినీటనో లేక అన్నమునో జీవింపవలసినందున అనేక శల్యరోగములకును అజీర్ణాదులకు లోనై (Rickets and diarrhoeas) గతించును.

పేదవానికే పదిబిడ్డలగనుట శాస్త్రోక్త మగుచున్నది. తల్లిదండ్రులు తినుటకు అన్నములేనిస్థితిభాగ్యమును పదుగురుబిడ్డలు భాగించుకొనుచున్నారు. అట్టి శిశువులు పెద్దపొట్టలతోను, సన్నగిలిన పుల్లలవంటి కాళ్లు చేతులతోను, దేహపు ఎముకలసంఖ్యను బాగుగా నెన్నుకొనురీతిని నడువలేకను తిరుగాడలేకను ప్రాణమున్నదనుటకు కండ్లకదలికయే ప్రమాణమను నట్లు గ్రుడ్లను త్రిప్పుచుందురు. నిరుపేదస్థితి యిట్లున్న మధ్యతరగతి వానిస్థితియో—వ్యయము హెచ్చయి సంపాదన తగ్గుటవల్ల శిశువుల కాపాడుకొను శక్తి తక్కువగుచున్నది. ధనికులయందున్ననో పూర్వాచారములను వదలక ముసలమ్మ మందులయందే నమ్మికగలవారై యున్నారు. వారిశిశువులలో మరణసంఖ్య తక్కువగా కనబడుట కొక్కటే కారణము. ధనికులకు ఎక్కువ పుత్రప్రాప్తి లేదు. వారిలో గర్భిణిత్వమే తక్కువ. అందుచే జన్మించుశిశువులు నట్టు. అందుకు తగినట్టేయున్నది మరణసంఖ్యయును. వారి ధనమేమియు వారి శిశువుల రక్షించునట్లు కనబడుట లేదు.

(8) పురాతనవైద్యము, దేవతలు, దయ్యములు, మంత్రములు మున్నగువానిచే నెంతయో శిశుమరణము సంభవించుచున్నది. జ్వరపీడితులగు శిశువులకు అమితోష్ణమని శిరఃస్నానముచేయించుట విరోచనములగు చుండుశిశువులకు మత్తుమందు లిచ్చుట (అభిని, నల్లమందు) చే అనేకశిశువులు ప్రాణములను బాయుచుందును. ముసలవ్వలమందులు, ప్రక్కింటివారి మందులు ముత్తాతలనాటివి, అన్నినొప్పు లొకటేయని అన్నిటి కొకేమందని స్వచికిత్సలు చేయించుకొనుటచే

ఎక్కువ హానికలుగుచున్నది. ఇందుచే పెద్దల నవమర్యాద చేయదలచినట్లుగాదు. కాలము ఎన్నో మార్పుల బొందుచున్నది. దినదినము క్రొత్తవిషయముల నేర్చుకొనుచున్నాము. రోగములు వేనవేలనియు వాటికొక్కొకటికి వేరుచికిత్స గలదనియు తెలియుచున్నది. అట్టి స్థితిగతులలో మనము క్రొత్త ఔషధములను స్వీకరింపక మునుపటిమందులనే ఉపయోగించుటచే మనకు లాభమేమియులేక నష్టమే ప్రాప్తించును.

భారమంతయు దైవముమీదను, దేవతలనియు దయ్యములనియు భక్తిచేతనో మరి భయముచేతనో మ్రొక్కుబడులు చెల్లించుచు జాతరలు చేయించుచున్నాము. బిడ్డచచ్చు స్థితియందుండినను మందులచేత గాదని మంత్రముచేతనైనను బ్రతికింపబూనుట యుచితమైనది గాదు.

(9) మన శిశువుల ఆరోగ్యతకు తగిన పరిస్థితులను మనము సమకూర్పవలయును. వారివారి శక్తికి తగినట్లు సంతానము పొందవలయునేగాని యంత్రశాలలవలె తయారుచేసి కొనుటకు జనులులేనందున చౌకబడియు అప్పటికి కొనువారుండనందున చెడిపోవు వస్తువులవలె కాపాడుశక్తి తక్కువగను సంతానము ఎక్కువగను ఆరోగ్యము హీనముగను మరణము మిక్కుటముగను పొందించుట హేళనీయము. కాన శక్తికి మించినవ్యాపారము చెడుపని. వివాహము ముగిసిన సంవత్సరముననే శిశువుల కనుటకు ప్రారంభించిన యిల్లాలు తక్కువపక్షము 12 బిడ్డలనైనను కనగలదు. అన్నిబిడ్డలకు చోటెచ్చుట - ఆహారమెట్లు—వీటిని యాలోచించి యొకస్త్రీయొక్క గర్భిణిత్వకాలములో 2 లేక ముగ్గురు శిశువులకన్న ఎక్కువగ జన్మింపనీయని పనిముట్లనో పద్ధతులనో అనుసరించి 3 సంవత్సరముల కొకశిశువును కన్నట్లయిన శిశువులు ఆరోగ్యముగ నుండును. తల్లికి విశ్రాంతియు నుండును. ఈ కారణములును. తెలిసినందున వాటికి సదుపాయలేవి యని యోచించి నడచుకొనుటచే మనము ఆరోగ్యవంతులగు లగుదుము.

(సశేషము)



# దుఃఖోపశాంతి

ఖాసీం - ఆలీసాగారు,

చావది సంభవంబగుట సాజమునై గనుపట్టుచుండినన్
చావనినన్ భయంపడి విచారముఁ జెందుచునుండు నెప్పుడీ
జీవి ; సమస్తజీవులకు జేకురుఁ జావది యెల్లవేళలన్
చావనిజీవిజాడ గనఁ జాలము చూడుము మానవోత్తమా !

గాలి యడంగ నేలఁబడు గాలిపటంబువలెన్ మనుష్యుఁడున్
గాలికిఁ బుట్టుఁ గాలమను గాలి యడంగిన నేలగూలెడున్
జాలివహించి గీడ్పడినఁ జావది తప్పదుగాన నెప్పుడున్
కాలముదీఱు మానవునికై దిగులొందకు మానవోత్తమా !

కాలముచేతనే గలుఁగుఁ గష్టసుఖంబులు మంచిచెడ్డలున్
కాలముచేతనే గలుఁగుగా మరి చింతలు సంతసంబు లీ
కాలముదాట వీల్పడదు గావునఁ గాలవశాన నేలకున్
గూలిన జీవికై మది దిగుల్ పడబోకుము మానవోత్తమా !

చచ్చెను జచ్చెనంచు మదిఁ జచ్చినవానికి నేడ్చుచుండినన్
చచ్చిన జీవి రాగలఁడె చత్తుమె చచ్చినవాని తోడ నీ
విచ్చట నుట్టిగట్టుకొనియే యెపుడూఁగఁగ లేవు గావునన్
చచ్చిన వానికెన్నడు విచారము మానుము మానవోత్తమా !



ఏ. వి. టి. అయ్యరుగారి అనుమతిని.

తిరుమలనాయకునినగరు స్వర్గవిలాసము, మధుర.

# మేలు పలుకులు

## అగ్నిప్రమాదములు

మనదేశమున ప్రతిసంవత్సరమును అగ్ని హోత్రమున కాహుతి యగుచున్న గ్రామములయొక్కయు, పంటలయొక్కయు, జనుల యొక్కయు పశువుల యొక్కయు సంఖ్య ఎక్కువగుచున్నదేగాని తక్కువ కాలేదు. ఇట్టి ప్రమాదములను తగ్గించుటకు నిజాం ప్రభుత్వమువారు తమరాష్ట్రమునఁ జేసిన యేర్పాటులనుగుఱించి తే 14 - 6 - 34 దీ "గోల్కొండపత్రిక" యిట్లు తెలుపుచున్నది.

"మన ప్రభుత్వమువారు మూడులక్షల రూపాయలను వ్యయముచేసి ప్రస్తుతము మన రాష్ట్రమందు, నాలుగు ప్రధానపట్టణములలో నాలుగు ఫైరు బ్రిగేడు స్టేషనులను (అగ్నిని చల్లార్చు యంత్రస్థానములను) యేర్పఱచెద రని వినుచున్నాము. మొదట వరంగల్లు గుల్బర్గా, ఔరంగాబాదు, మెదకుజిల్లాల ముఖ్యపట్టణములలో నేర్పరచెదరు. తర్వాత క్రమక్రమముగా - అనగా—ద్రవ్యములభించుకొలది అని ప్రభుత్వమువారియభిప్రాయమనియేమనమనుకొనెదము. ప్రతిజిల్లాయొక్క ముఖ్య పట్టణములోను. ఒక్కొక్క ఫైరు బ్రిగేడుస్టేషను నేర్పరుపదలచియున్నారు. మరియొకసారి యీవిధముగా ప్రభుత్వమువారు ప్రజాభిప్రాయము వెల్లడిచేయబడుటకు ముందే దానిని ఆశంకించి తదనుసారము చర్యగైకొన్నందుకు సంతోషింప వచ్చును......"

స్వదేశసంస్థానముల పరిపాలన ఇపుడు బాగుగ లేదనియు, అది చక్కబడవలసియున్నదనియు జనసామాన్యాభిప్రాయము. అట్టి యెడ నిజామురాష్ట్ర ప్రభుత్వమువారి యీ పద్ధతి తక్కిన స్వదేశసంస్థానములకే గాక భారతప్రభుత్వమువారికిని మార్గదర్శక మగుచున్నదని చెప్పక తప్పదు. ప్రతివత్సరము వేలకొలది గ్రామములు పూర్తిగ పరశురామప్రీతిని పొందుచున్నను ప్రభుత్వమువారు శ్రద్ధ తీసికొనకపోవుట శోచనీయము. తెలుగు జిల్లాలలో జిల్లాకొక్కటియైనను అగ్ని నార్పు యంత్రము లేదు. పెద్దపెద్ద పట్టణముల యందలి పురపాలకసంఘమువా రయినను తగిన శ్రద్ధపూనుటలేదు. జిల్లా కొక్కటియైన నిట్టి యంత్రములున్నఁగాని పల్లెటూళ్లకును ప్రజలకును అగ్నివలనఁ గలుగు బాధలు చల్లారఁజాలవు. అదిగాక ప్రతి పెద్ద పట్టణము నందును ఒక్కొక్క యంత్ర ముండవలెను. ప్రభుత్వము వారును, జిల్లాబోర్డుల వారును, పురపాలకసంఘములవారును, నిజాంప్రభుత్వమువారి మార్గము ననుసరింపవలసియున్నది.

---

## ఆంధ్రనాటకరంగము

తక్కిన విషయములతోబాటు ఆంధ్రదేశమున నాటకకళకూడ ఇప్పుడిప్పుడే మొలకలెత్తినది. నాటకకళారహస్యము నెరిఁగిన పెద్దలు కొందరు నాటకకళ నుద్ధరింపఁ గంకణము కట్టి శక్తివంచనలేని యత్నము నొనర్చుచున్నారు. కాని ఆంధ్రులకు సహజములగు ఐకమత్యశూన్యత-విద్వేషము-వాదవివాదములు కారణముగ పేరెన్నికఁ గన్న నటకశ్రేష్ఠులీవిషయమున ఉపేక్షాభావము

నవలంబింప సమకట్టుచున్నారు. పై విషయ మును గురించి "నాటకకళ-ఆంధ్రావేశము" అను శీర్షికతో జూలయినెల "భారతి" "మనవిమాటల" లో నిట్లున్నది.

"ఆంధ్రు లన్నిటను తెలియనివారు కారు; తెలిసినవారును కారు. తెలియనిదానిని తెలిసి కొనజూరు కాని తెలిసినయల్పమునకే విఱ్ఱ వీగుదురు; తెలిసియో తెలియకయో కార్య ముల నాచరింతురు; వాని మంచి సెబ్బరల నింతయు నాలోచింపరు; ఊహలేని ఉత్సా హము వారిది; ఊరటలేని ఉద్రేకమును. ఇది కారణముగా నాంధ్రనాటకరంగమునకు నే డొక పెద్దయనర్థము వొసగినది.

నాట్యకళాప్రపూర్ణ తాడిపత్రి రాఘవా చార్యులుగారికి నాట్యకళా ప్రపంచమునగల స్థాన మున్నతము; నాట్యకళా రహస్యజ్ఞాన మును, తత్కళానుభవమును విశిష్టము. తదు పాసన స్వార్థరహితము; తద్వికసనశీలము. తద్‌జ్ఞు లెవ్వరు నీవిషయమును కాదనరు.

నాట్యకళాభిమానుల వేడికోలున ఆచా ర్యులుగారు తృతీయాంధ్రనాటక పరిషన్మహా సభకు వెత్తనము వహించినారు. కడచిన రెండుమహాసభలకంటె నీమహాసభ యుత్కృ ష్టముగజరిగినదనుప్రతీతి వారి కార్యనిర్వహణ కౌశలమునకు గొప్పనిదర్శనము.

ప్రజామిత్ర (౨౦-౬-౧౯౩౮) యందు శ్రీరాఘవాచార్యులుగారి కొక 'బహిరంగ లేఖ' ప్రకటితమయినది. నాట్యకళాభిమాను లు, శ్రీ కే. వి. సుబ్బారావుగారు దానిని వ్రాసినవారు. వ్యక్తిపరముగఆచార్యులుగారి కళోపాసనావిధానమును,మహాసభాధిపత్యము పరముగ వారి కార్యనిర్వహణ విధానమును అందు విమర్శింపబడినవి. విమర్శనము విపరీత మార్గమున తీవ్రముగ నడచినది. దానిని గనిన ఆచార్యులుగారు వెంటనే మహాసభాధి పత్యముతోపాటు, తమనాట్యకళోపాసనమున కును స్వస్తిచెప్పి కూరుచున్నారు.

ఇట నిరువురికార్యములు ననాలోచిత ములు: సుబ్బారావుగారిది ఊహలేని ఉత్సా హము, ఆచార్యులుగారిది ఊరటలేని ఉద్రే కము ననవలసియున్నది. కాని కళాభిమానుల హృదయముకంటె కళోపాసకుల హృదయ మతికోమలము. సుబ్బారావుగా రీరహస్య మును గుర్తించియుండిన వారి విమర్శనము సౌమ్యమార్గమును బట్టియుండెడిది.

విమర్శనమున రాఘవాచార్యులుగారి కళోపాసనమున గల యనేకలోపము లుద్ఘా టింపబడినవి. అవి నిజముగ ప్రమాదములో ప్రమాణములో తేల్పగలసమర్థు లాంధ్రలోక మున నాచార్యులుగా రొక్కరే కనుపడు చున్నారు. నాటకకళవిషయమున విమర్శకు గురియైనవిషయము లనేకము లింకనుప్రపం చముననే వివాదగ్రస్తములుగ నున్నవి.

ఆంధ్రలోకమున నాట్యకళకు సంబంధిం చిన వాఙ్మయముకాని; ప్రదర్శనయోగ్యము లగు నాటకములు కాని, అభినయకుశలులగు నటకులు ఆచార్యులుగారువినా-గాని,సంస్కా రులు, సహృదయులు నగు ప్రేక్షకులుగాని, ఇప్పటి కింకను గానరా రనుట సాహసము కాదు. దీనినిబట్టి ఆంధ్రుల నాట్యకళారహ స్యాభిజ్ఞత వెల్లడియగుచున్నది. వారు తమకు తెలియ ననుకొనునదంతయు నన్యానుకరణ

ముకాని, స్వోపజ్ఞ జన్యము కాదు. వారి తీవ్ర విమర్శనములుమాత్రము కళాశోషణమునకు వలె కళాపోషణమున కుపకరించునవి కావు.

నాటకములు బహునటాభినేయములు; ఏకనటాభినేయములు కావు. నటులెల్లరు సమర్థులుకానిచో ప్రదర్శనమువలన రససిద్ధి కలుగదు. అసమర్థులగు నటకుల నడుమ సమర్థుడగు నేనటకుని కళాకౌశలమును వన్నె కెక్కదు; కాని, వ్యక్తిగతమగు దాని యుని కికి, ఉత్కృష్టతకు నాశము లేదు. అది సహృదయైకవేద్యము.

ఆంధ్రుల కైకమత్య మేవిషయమునకు కుదురు టరుదు; ఆత్మపరిశీలన మంత కంటెను. ఎవరికివారు పెద్దలనుకొనుట వారి కొక ప్రత్యేకలక్షణము. ఆలక్షణము నటకులలో మరియును పెద్ద. సంస్కారులయెడ నంతగగాకున్నను, అసంస్కారులయెడ నది యెంతయు దుస్సహము. తమకుదాము పెద్దల మనునటకు లాచార్యులమాటను పాటింపరు. ఇక తదాచార్యత్వము నాచార్యులుగారు సాగించు టెట్లు? వారిని చక్కదిద్దు టెట్లు?

ఆచార్యులవలె పేరున కెక్కవలెనని నటకు లనేకులు వారి ననుకరింతురు. కాని వారివలె కళారహస్యముల నధిగమింప నిచ్చగింపరు. అంధానుకరణ మనుకర్తృనుకార్యుల కుభయులకు నప్రతిష్ఠకు కారణము. ఆచార్యులుగారియెడ జనసామాన్యమున గొంత భాగమునకు నిరసనభావ ముప్పతిల్లుట కీ అంధానుకర్తలే కారకులు.

ఆచార్యులుగారి యాధిపత్యమున నాంధ్ర నాటకకళాపరిషత్తు కార్యక్రమమును నిర్ణయించినది; తన్నిర్వహణమునకయి పెద్ద సంఘము నొకదానిని నియమించినది. ఆంధ్ర దేశమున నాటకకర్తలు, నటకులు నాటక కళాభిమానులు ననబడువారిలో ననేకు లాసంఘమున సభ్యులు. వారిలో నిద్దరు కార్యదర్శులు. కార్యాలయము చెన్నపుర మున. నిర్ణయించిన కార్యక్రమమును కొన సాగించు భారమును వహింపవలసినవారు కార్యదర్శులును, సభ్యులును. అధ్యక్షులు తత్కార్యముల కంగీకారమును, వలసినచో సలహాలను ఈయవలసినవారు. అంత సంఘమును, కార్యదర్శులును, మహాసభ జరిగిన నాటినుండియు తమ పూచీని గుర్తింపక నిదురించునటు లున్నచో నధ్యక్షులు చేయున దేమి? తత్త్వమిదియైయుండ 'బహిరంగలేఖ' యొకటి ప్రథమకబళమున మక్షికాపాతము వలె నిపుడు సంప్రాప్తించినది. నాటకకళాసంస్కారమున కిడిన తొలియడుగుననే పాదము బెణకినది. దీనికి చికిత్స: ఆచార్యులుగారు ప్రశాంతమనస్కులయి తమ రాజీనామా నుపసంహరించుకొనుట; సంఘమును కర్తవ్య నిర్వహణమునకు పురిపెట్టుట; ఆంధ్రనాటక కళాభివృద్ధికి దాము వెనుకకట్టినకంకణము చివికియుండినచో క్రొత్తదానిని ధరించుటయు. ఆచార్యులుగారినాట్యకళాభిజ్ఞతకునాట్యకళోపాసనాసక్తికి నిది సమర్హమగు కార్యము."

నాటకకళోద్ధరణము నొనర్పవలెనన్న శ్రీరాఘవాచార్యులుగారు ప్రతికూల వాతావరణమునకు వెనుదీయక ధైర్యము పూని తమ

యాధ్యక్ష్యమును ఉపసంహరించుకొనక తమ యుదారాశయములను వెలిబుచ్చ వలసి యున్నది. అట్లయిననే ఆంధ్రనాటక రంగము పురోభివృద్ధికి రాఁగలదు. లేకున్నచో ఆంధ్ర నాటకకళాపరిషత్తు తగినంత ప్రయోజనకారి కాఁజాలదు.

——:o:——

# సమస్యాపూర్తులు

కరి నారాయణాచార్యులుగారు

మ. ముదితా! నీనగుమోము నీవిలసనంబుల్ నీదు వాల్గన్నులున్
మృదుభాషల్ మఱువంగఁజాల నెపుడున్ మీనాంకుఁడీవేళ నా
నామది బాధింపఁదొడంగెఁ జూడు మతితిగ్మత్వంబుతో నొప్పెఁ గా
ముది పూఁబోడిరొ! ముద్దొసంగఁగదవే మోమెత్తిమాటాడవే!

ఉ. శ్రీహరిసేవ జేసితి వచించితి నీ శుభవార్త రుక్మిణీ!
మోహముతో నతండు విని పొందుగ వత్తు నటంచుఁ బల్కె న
వ్యాహతలీలఁ గృష్ణుఁడు రయంబున వచ్చును ధైర్యమింక సం
దేహమువీడి పూనుమల దేవునినమ్మియుఁ దీఱుఁగోర్కెలున్.

శృంగారకవి సర్వారాయుఁడుగారు

మ. గ్రాహము బారిగూరి కరిరాజవశంపడి గమ్మినెమ్మది
న్సాహసమూని శ్రీహరిజనార్దన కావలెయన్న వెంటనే
కూహకమింతలేని తమి గొల్చెను నిన్నతఁడీడకున్నె సం
దేహమువీడి పూనుమలదేవుని నమ్మియుఁ దీఱుఁగోర్కెలున్.

ఉ. ఇదియే మే నను మూడలించెదవు నిన్నేమైన నేనంతగా
కొదయేమైనను జేసినానె చెపుమీ కోపంబు నీకేల ని

న్నేటఁ బ్రేమింతును నన్యకన్య నెఱుఁగఁ హీనంబు లిచాంచియో
ముదిపూఁబోఁడిరో ముద్దొసంగగదవే మోమెత్తిమాటాడవే.

నూతికట్టు కోటయ్యగారు

మ. మదనుండేయు సుమాస్త్ర ఘాతములఁ గంపం బెత్తె దేహంబు, ష
ట్పదఝంకారము విన్న గుండెలవిసెన్, శైవీచు మందా నిలం
బదిరా! తాపముగొల్పె, నగ్నివలెఁ దా బాధాకరంబయ్యెఁ గా
ముదిపూఁబోఁడిరో ముద్దొసంగగదవే! మోమెత్తిమాటాడవే!

ఉ. ఏహరియో హరుండొ మదభీప్సితముల్ ధనధాన్య వస్తు స
ద్వాహన సంపత్తులిచ్చు నీకఁ బాటుపడం బనిలేదటంచు నీ
వూహలఁ బొద్దుపుచ్చ ఫలముండునె? వేగము కార్యదక్షు సం
దేహమువీడి పూనుముల దేవుని నమ్మియుఁదీఱు గోర్కులున్.

బండారు తమ్మయ్యగారు

మ. హృదయంబున్ హరియించి, నాడటులు నీ దృగ్బాణముల్ నాపయిన్
గుదిగానేసిన దాదిగా మరుఁడతి క్రూరాత్ముఁడై నాటు నీ
ప్రదరాళిన్ మనఁజాల వహ్నికరణిన్ బాధింపఁగా సాగెఁ గా
ముది పూబోఁడిరో! ముద్దొసంగఁ గదవే మోమెత్తి మాటాడవే.

ఉ. దేహ మశాశ్వతంబు; బహుతీవ్రము లింద్రియశత్రుశౌర్యముల్
ఊహలకందరానివి శుభోద్యమ కాంక్షను డాయు విఘ్న సం
దోహమునైననేమి? మదిఁ తొట్రిల కెప్పుడు ధర్మదీక్ష సం
దేహమువీడి పూనుమల దేవుని నమ్మియుఁ దీరుగోర్కులున్.

త్యాడీ వేంకటశాస్త్రిగారు

మ. మదనుండిప్పు డధిజ్యధన్వి యయి శుంభద్బాణ సంధానుఁడౌ
యదనుం గాంచి పికారవంబులును వాతాంకూరముల్ మత్త ష
ట్పదనాదంబులు మేరమీఱె బహుతాప ప్రోద్బలం బిద్ది కా
ముదిపూబోఁడిరో! ముద్దొసంగఁగదవే! మోమెత్తి మాటాడవే!!

ఉ. ఐహిక మెల్లమార్గముల నస్థిరమున్ బుధగర్హితంబు దు
ర్మోహ వశీకృతాఖిల నిరోధిత సత్పథమున్ నిరర్థకో
త్సాహ నివాసమున్ గలుషసాంద్రముఁ గా దనునట్టి యాత్మ సం
దేహమువీడి పూనుమల దేవుని నమ్మియుఁ దీఱుఁ గోర్కులున్.

విద్వాన్ విశ్వనాథ నరసింహముగారు బి. ఎ. ఇడి.

మ. దేహులకెల్ల కష్టములు దీరసుఖంబులు గల్గునంచు, ను
త్సాహము మీర బల్కెడి మతంబు ఘనంబుగ నెంచబోక, దా
సోహమటంచు నీశ్వరుని స్తోత్ర మొనర్పుము, మానసంబ ! సం
దేహమువీడి పూనుమలదేవుని నమ్మియుఁ దీఱుగోర్కులున్.

మేడూరు వెంకటసుబ్బయ్యగారు, బి. ఏ. బి. ఎల్.

మ. ముదితా సిగ్గిలనేల ? తొంటి మురిపెంపుం బల్కు లేవయ్యె ? న
ల్లదిగో వీచెడుఁ గమ్మతెమ్మెరలు, నాహామందె మేలంబుగా
పదమా యిత్తఱి నాదుప్రాణపదమా వాహ్యాళి యీనిండు శా
మది ! పూబోడిరో ముద్దొసంగఁగదవే మోమెత్తి మాటాడవే.

ఉ. ఊహలు గొప్పలుండి పనియేమి ? యొనర్పగ నోపినంత యు
త్సాహము ప్రోత్సహింప జనతండమునుండియు నేమిచేయు వ
త్సా ! హరియే సమస్తఫలదాతయు నేతయు పూతభక్తి సం
దేహము వీడి పూనుమలదేవుని నమ్మియు దీఱు గోర్కులున్.

పిసుపాటి నారాయణశాస్త్రిగారు

మ. మది నీరూపము నిల్పి, నీవిమలనామమ్మున్ మహామంత్ర మ
ట్లుదయం బాది జపించుచుండ, నిపుడెట్లో నీదుసందర్శనం
బొదవెన్ కోరిక పండె సౌఖ్యకరమై యొప్పారెడిన్ నిండు శా
మది పూబోడిరో ముద్దొసంగఁగదవే మోమెత్తి మాటాడవే !

ఉ. దేహము నశ్వరమ్ము, సుదతీ సుతులెవ్వరు పారలౌకికా
రోహముపట్లఁ దోడ్పడరు రొక్కము దుఃఖకరమ్ము గావునన్
ద్రోహమువంకఁ బోక దయతోడఁ బ్రజాహిత కార్యదీక్ష సం
దేహము వీడి పూను మలదేవుని నమ్మియుఁ దీఱుగోర్కులున్.

# ఆయుర్వేద ప్రహసనము

డాక్టరు పి. బి. జగన్నాథరావుగారు,
ఎల్. సి. పి. అండు యస్., ఎల్. ఐ. ఎమ్.

(గతసంచిక శేషము)

క. వైద్యవరు లెందరేని
యుద్యోగంబునను భంగ-మొందిరి కట్టా!
సద్యశ్శల్యహరంబులు
వైద్యవిధానంబులెల్ల-వ్యర్థము లయ్యెన్.

క. అడుగనివారిది దోసం
బడిగినవారెల్లఁ బొంది రర్థము, వైద్యం
బుడుగక శరీరపీడల
నడిపెన మనువార లెల్ల-రది యిట్లయ్యెన్.
(తనలో)

క. పాలించితి సద్వైద్యులఁ
జాలగ నవ్వారిశాస్త్రి-చర్చల వింటిన్,
కాలాధీనుఁడనైతిఁ ద్రి
శూలిం భజియింతు నిపుడు సురుచిరభక్తిన్.

(మంత్రితో

గీ. చరక సుశ్రుత వాగ్భట - సంహితలను
తలను నిడుకొనుకాలంబు-తొలఁగెనింక
పారఁద్రోయింపు వానిని-బాడుబావి
విధిఁ దప్పింప వీశాస్త్రి-విషులు మంత్రి!

బుద్ధి:—(తనలో) ఆహా! ఏమి యీకాలవైపరీత్యంబు!
(రాజుతో)

క. రాజశేఖర! కవితావి-రాజితాత్మ!
రాజయోగానుభూతిని-బ్రహ్మమగుదు
వీవు సందియంబేది? ప్ర - కృతివిచేష్టి
తంబులను గాంచి బుధుఁడు స - త్యంబు నెంచు:
(వైద్యునితో)
భిషగ్వరా! వింటిరా రాజాజ్ఞ.

గీ. భక్తిశక్తియుక్తి-వైద్యమందునలేదు
రోగమెట్లు కుదురు? - రోగియైన
తృప్తిజెందు టెట్లు? - తెలిసినంతవఱకు
శ్రద్ధతోఁ జికిత్స - సలుపకున్న.

గీ. ధరణిపతిశాసనము రాజ - ధాని మీరు
విడిచిపోవలసినయట్లు-తడవుచేయ
నేల? చరకాదిగ్రంథంబు - లెల్లపాడు
బావిలోఁ బాఱవేయఁగా - వలయు ననియె.
(ఆత్మగతము)

క. ప్రాచీనగ్రంథంబుల
నేచందంబిపుడు నాశ - మేఁజేయుదునో?
చూచితిఁ జూచితి నిన్నా
శ్చేచో ఘనశస్త్రివైద్య - లే లేరుగదా!

క. ఈయాపదఁ గడపంగ ను
పాయంబికనాకు బోధ - పడ దోరామా!
ఆయుర్వేదము వేదము
చేయం జెఱుపంగ నెవఁడు? - చెల్లును నీకే.
(నిట్టూర్పుతో నిష్క్రమించును.)

---

తృతీయరంగము:— ప్రాసాదద్వారము;
ప్రవేశము; భటులు, అశ్వినులు.
భటులు—ఎవరుమీరు? కార్యమేమి!
అశ్వినులు:—ఓద్వారపాలకా! మేము రాజ దర్శనా
ర్థమై వచ్చిన కాశీదేశపు వైద్యులము.
భటులు:—వైద్యులా!! అట్లయిన శీఘ్రమే మీస్వస్థా
నంబులం జేరుట మంచిది. ఈ భోజరాజ్యంబున
వైద్యులమాటయే తలపెట్టకూడదని ఉత్తరువు.
బుద్ధి:—(లోపలినుండివచ్చి) ద్వారపాలకా! వీరెవరు?

భటులు:—స్వామీ! వీరిరువురును కాశీదేశపు వైద్యులట! రాజుగారినిఁ జూడవలయు ననుచున్నారు. స్వామివారిఆజ్ఞ.

బుద్ధి:—(వైద్యులతో) అయ్యలారా! దూరాగమన ప్రయాసంబున డస్సి యున్నారనుచున్నారే! ఎట్టి కార్యంబునకై వచ్చితిరోగదా!!

అశ్వి:—గీ. వారణాసిపురంబు ని - వాసమయ్య!
వైద్యశాస్త్రపారముఁగన్న - వారమయ్య!
భోజరాజున కారోగ్య-ముం బొసంగ!
వచ్చితిమి మమ్ము లోనికి - వదలుమయ్య!

బుద్ధి:—అయ్యో భిషఙ్మణులారా! మిమ్ముఁ బొమ్మన నోరాడకున్నది. ప్రస్తుతము రాజుగారికి బాధ బలవత్తరముగ నున్నది. వైద్యమన్న విసుపును పూర్తిగఁబుట్టె. వారి నెట్లు సమీపించి మెప్పింపగలను? (తనలో) వీరాకస్మికముగా వచ్చుటఁ జూడ నొకవేళ దైవవశంబున వీరిచే రోగము శమించునేమో? ఏపుట్టలో నేపామున్నది యెవరెరుంగుదురు? అయినను దీనిని కడపటి ప్రయత్నముగ చేసెదఁగాక! (ప్రకాశము) అయుర్వేదమూర్తులారా! అయినను రాజుగారికి మనసున కెక్కునట్లు నచ్చఁ జెప్పెదను కాని యిప్పటి కెందరో వైద్యులు వచ్చినను నిష్ఫలమయ్యె. మీయందలి విశేషంబును, మీరవలంబించు చికిత్సాక్రమంబును తెలిపిన నేనొక సమాధానమును చెప్పఁగలవాఁడ నగుదును.

అశ్వి:—మంత్రివర్యా! మీతో విశేషముగాఁ జెప్పవలసిన దెద్దియును లేదు. అయినను వినఁగోరుట నిదిగో కొంత మా ధోరణిం జూపెదము.

క. ఆయుర్వేదోద్ధరణం
బే యుగు మాయుద్యమంబు - హితమని ప్రజకున్
జేయంబూనితి మయ్యది
న్యాయమ్మగరా బొసంగు- నా జెమ్ములకా?

గీ. వేదవిహితవిధానంబు - లాదరించు
పుణ్యులే తెలియఁగలరు - భువిని తద్ర
హస్య మనగనాయుర్వేద - మందు మర్మ
జాలమెవ్వఁడు విచ్చు సు - జ్ఞానిదక్క?

గీ. సకలవిద్యలు భక్తిని - సద్గురూత్త
ములను సేవించి పడసిన - బుధులకెందు
వాటినాశంబుఁజూడఁగా - వలనుపడునె?
మాకు నవకాశ మిచ్చిన - లోకమునకు
శస్త్రవిద్యావిశేషప్ర - శస్తితెలియు.

బుద్ధి:—వైద్యులారా! నాతోవచ్చి సింహద్వారము కడ నిలువుఁడు. రాజుగారితో మాటలాడి వారి యనుమతిని మిమ్ము పిలిపించెద.

(అందఱు నిష్క్రమింతురు)

---

చతుర్థరంగము :—రాజసన్నిధానము
[ప్రవేశమురాజు - మంత్రి]

బుద్ధి:—రాజా! ఒక్క వరము.

భోజ:—విశేషమేమి?

బుద్ధి:—ఎద్దైన నాప్రార్థన నంగీకరింపుఁడు.

భోజ:—మంచిది. తరువాత?

బుద్ధి:—గీ. భోజరాజేంద్ర! కను మన-పుణ్యమువుర!
వారణాసిపురమునుండి - వైద్యవిదులు
వచ్చియున్నారు దర్శన - మిచ్చిచూడ
గోర్కియుదయించె నాకు మీ - కొలకు
[నిజము.

గీ. ముంగురులు మూయుచుండెడి - మోముకాంతి
వైద్యశాస్త్రజనితమైన - వారిశాంతి
గురుకులంబుల స్నేర్చిన - పరమదాంతి
కాంచికాంచకమున్నె న - మ్మించె మనము.

భోజ:—మంత్రీ! నీపలుకులందు నాకు నమ్మకము. నీవు నమ్మినవారిని నేను నమ్మకుందునా? ఎంత కట్టడి శాసనంబును విధించినను ఈశ్వరేచ్ఛ తప్పదు
(సశేషము.)

# వార్తలు — విశేషములు

అపరాధముచేసిన చిన్నపిల్లలను విచారించి వారిని సరిఅయిన మార్గమునకు తెచ్చుట కును శిక్షాకాలము పూర్తి అయి విడువబడిన తర్వాత వారిని కనిపెట్టి సరియైన వృత్తుల నవలంబించుటకు ఏర్పాట్లు చేయుటకు సింహళము ప్రభుత్వమువారు ఆలోచించుచున్నారు.

---

| | |
|---|---|
| చెన్నపట్టణముయొక్క జనాభా | 6,47,230 |
| ఇందు హిందువులు | 5,20,176 |
| మహమ్మదీయులు | 70,031 |
| క్రైస్తవులు | 54,122 |
| ఇతరులు | 2,001 |

---

సరిహద్దుపన్ను (Customs duty) చెల్లించకుండా పొగాకును హాలండు దేశమునుండి పొగయోడద్వారా ఇంగ్లాండుకు చేర్చిన అపరాధమునకు ఒకనికి 75 వేలపౌనులు జరిమానా విధించబడ్డది. ఇతనికే యుద్ధసమయములో ఇట్టి అపరాధమునకే 15 వేలపౌనులు జరిమానా విధింపబడినది.

---

ఇంగ్లండులో ఒక హోటలులో నౌఖరుగనుండి ఆల్‌బర్టు అనునతడు తనకు హోటలుకు వచ్చినవారు ఇచ్చిన బహుమానముల వలన 20 వేల పౌనులను గణించెనట.

---

ప్రపంచములో ఉన్న వారందరిలోను ఎక్కువ పెద్దవాడని ప్రఖ్యాతిపొందిన జారో అను ఆయన ఈమధ్యనే చనిపోయెను. చచ్చిపోవునప్పుడు 160 ఏండ్లు. ఈయన పండ్రెండుసార్లు వివాహమాడెనట.

---

ఐబెన్‌సాద్

ఇతఁడు అరేబియారాజు. ఇతని వ్యక్తి బలమయినది. ఈతని పూర్వులరేబియా నంతయును పాలించిరి. ఇతఁడు తనరాజ్యము నభివృద్ధి చేయుచున్నాడు. ఈతని యొడ్డు పొడవు 6 అ, 7 అం. ఇతనికి వందమంది భార్యలుగలరు.

---

హైదరాబాదు శిల్పశాస్త్ర పరిశోధనశాఖ (Archaeological work)

హైదరాబాదు ప్రభుత్వమువారి ఫసలీ 1341. నివేదికను బట్టి బీదర్‌లోని తాజ్‌మహలును పూడ్పుతీసినట్లును అందు ఒక మనోహరమయిన శాల (Hall)యును రెండు గదులును కనుగొనఁబడినట్లును తెలియుచున్నది. ఆలిఅదిల్‌షాహి రాజ్యమునకు సంబధించిన యొకశాసనముకూడ లభించినది.

---

ఒక క్రొత్త జర్మన్ గాలియోడ తయారగుచున్నది. దానిపొడవు 813 అడుగులు,

వెడల్పు మిక్కిలి విశేషముగా నున్నచోట 133 అడుగులు. అది 190 టన్నుల బరువును మోయఁగలదు. దానిని నడుపుటకు 1000 గుఱ్ఱాల శక్తిగల యింజనులు నాలుగుగలవు. 25 గదులుగలవు. చేన్నీళ్లును వేడినీళ్లును లభించును. ఈగాలియోడతో జర్మనీకిని దక్షిణపు అమెరికాకును క్రమమయిన రాఁడుగ ప్రయాణము జరుగునట్లు ఉపపాదింపఁబడి యున్నది. అట్టి ప్రయాణము రానుపోను ఖర్చులు సుమారు రు. 2,500 రూపాయలు కావచ్చునని యంచనా తెలియుచున్నది.

---

32 సం॥ వయస్సుగల యొక పారసీకయువకుఁడు లోకములోనికంతయును నెక్కువగా రక్తదానముచేసినట్లు తెలియుచున్నది. కడచిన 2 సంవత్సరములలో మిక్కిలి యపాయ దశలోనుండిన 181 వ్యాధిగ్రస్తుల కితఁడు రక్తదానము చేసినాఁడు. ఆరీతిగా నితని శరీరమునుండి తీయఁబడిన రక్తము 80 పైంటులగును. "నా శరీరములో రక్తము చేక్కగా" నుత్పత్తి యగునని యితఁడు చెప్పుచుండును. "నష్టమయిన రక్తమంతయు నొక నెలలో నా శరీరమందు నూరఁగలదు. ఒక్కొక్కరోజున నేను నారక్తమును ముగ్గురు వ్యాధిగ్రస్తుల కొసంగినాను. అంతేకాక ఈ రక్తదానమువలన నేను ద్రవ్యలాభమునాసించుట లేదు. కానజనుల నాపదనుండి కాపాడితి" నను సంతోషమునూత్రము నాకుకావలెను "అని యతఁడు చెప్పెను."

---

## కన్నీళ్ల విలువ.

కన్నీళ్లకు విలువయున్నదని శాస్త్రప్రకారముగా నెఱుఁగఁబడినది. సెయింటు మేరీసు హాస్పిటలునందలి సర్ ఆల్మతురయిటుగారి రసాయనపరీక్షణశాలలో మనుష్యుల కన్నీళ్లయందు నొకవిశేషమయిన వస్తువున్నట్లు కనుగొనఁబడినది. దానికతఁడు "లాసోజిమ్" అని పేరుపెట్టినాఁడు. ఒకచుక్క దాని నుపయోగించినచో కోట్లకొలఁది సూక్ష్మజీవులు మరణము నొందఁగలవు. ఒక పీల్పు గొట్టములో సతఁడెన్నికోట్లో సూక్ష్మఁజీవులనుబట్టి బిగించియందు ఒక చిన్నకన్నీటిచుక్కను వదలెను, దానివలన ఆసూక్ష్మజీవు లన్నియును తక్షణము వినాశమొంది కరఁగినవి. ఇట్టి "లాసోజిమ్" శరీరమునందలి ప్రతిమాంసమేదోభాగమునందుండునని యును అవి యెల్ల వేళ యందును అనేకవిధములయిన సూక్ష్మజీవులను సంహారము చేయుచునే యుండునని యును అతఁడు తెల్పియున్నాఁడు.

---

# ఆరోగ్యవిషయములు

### తెల్లచక్కెరయొక్క చెడుగు.

చక్కెరను శుభ్రపఱచి తెల్లగఁజేయుటకు కొన్ని ద్రావకము లుపయోగింపఁబడు చున్నవి. అవి చక్కెరయందలి జీవాణువులనే గాక శరీరమున కుపయోగించు పలువిధము లగు ఉప్పుపదార్థములను, సున్నము మొద లగువానిని నశింపఁజేయుచున్నవి. అందు వలన చక్కెరవలనఁ గలుగవలసిన లాభ ములు మనకుఁగలుగకున్నవి. చక్కెర యందలి సున్నపుభాగము మాయమైనచో ఎముకలు మెత్తబడిపోవును; దంతపటుత్వము తగ్గును. వ్యాధులు పెరుగును.

ప్రపంచమందంతటను దంతవ్యాధులచే బాధపడు వారలలో నూటికి ఎనుబదిమంది పీడపొందుట కీ తెల్లచక్కెరయే కారణము. కావున ఇట్టి చక్కెరను విడిచి శుభ్రపరచిన బెల్లము నే ఉపయోగించుట మంచిది.

---

### నిజమైన సెలవుదినము.

పట్టణనివాసము దేహమునకును మనస్సు నకును చాల చికాకు కలుగఁజేయును. సెలవు దినమును సుఖముగ వెళ్లబుచ్చవలె నన్న నగరవాసి స్థలమును తప్పక మార్చవలెను.

ఎల్లప్పుడును గ్రామమున నివసించువారికి కొలదివారములు నగరనివాసము బలవర్ధక మగు నౌషధము. పెద్ద పట్టణమున నివసించు వారికి సముద్రప్రదేశము ఆరోగ్యకరము, విశ్రాంతికరము నగును.

నగరనివాసికి తన సెలవు రోజును గడపు టకు పల్లెటూరిప్రదేశమే తగిన స్థలము. చల్లని గాలికంటె నాహ్లాదకరమునగునది వేరొకటి లేదు. క్రొత్తప్రదేశముల సుందర దృశ్యము లును, విశ్రాంతియు, హాయియు నగరవాసికి సెలవురోజులలో నేలభించును. ఉన్నత ప్రదేశ మును చేరినను, లేక ఏదైన కొండపై నెక్కి నను మనస్సున కానందము కలుగును. అది దేహమునకుకూడ ఆరోగ్యకరము, చల్లని పిల్ల వాయువులతోఁ బాటు పక్షుల కలరవములు, పుష్పసౌందర్య-పరిమళములు, పచ్చికబయళ్లు, ఆకర్షణీయములగు మడుఁగులు కష్టపడి యున్న మనఃకాయములకు ఊరటను, ఆనం దమును కల్గించును.

పల్లెటూరి ప్రాంతమునకుఁ బోఁదలఁచి నపుడు విశేషముగ సామాను తీసికొని పోరాదు. వేఱు ఆలోచనలను పెట్టుకొనక మెల్లగ ప్రయాణము సాగింపవలెను. ఆహార విషయమునఁగూడ కొంతమార్పు కలుగ వలెను. తేలికయైనఆహారమును తీసికొనవలెను. అందు కూరగాయలు—పండ్లు ఎక్కువ ఉప యోగించుట లెస్స. ఇట్టి యాహారమును భుజించుటవలన మనస్సునకును ఉత్సాహము అధికమగును.

సెలవుదినమును గడుపుటకు వినోదము ముఖ్యసాధనము. మన భారతీయులు సామాన్యముగ సంగీతమును వినియే వినోదింతురు. పాశ్చాత్యులు రంగువేయుట, పురుగులను పూలను, మొక్కలను, సేకరించుట, చేపలను పట్టుట, వేటాడుట, ఛాయాచిత్రములఁదీయుట, శిల్పశాస్త్రము నభ్యసించుట, శిధిలములను పరిశోధించుట మొదలగు పనుల నొనర్చి వినోదింతురు.

నీటిలో ఈదులాడుట కూడ మనస్సున కుత్సాహమును కల్గించి దేహదార్ఢ్యమును వృద్ధిపరచును. ప్రతిపల్లెయందును నదిగాని, చెఱువుగాని, గుంటగాని యుండును. అవి యీదుటకు మిగుల నుపకరించును.

కావున సెలవుదినమును పల్లెటూరిప్రాంతమున గడపి మనస్సున కుత్సాహమును, శరీరమునకు బలమును గూర్చుకొనుట యుచితము. ఇట్లుపయోగించినదే నిజమైన సెలవు రోజు.

## ఉపవాసము

మనలోఁ జాలమంది ఐహిక సుఖమునకుఁగాని యాముష్మికములకుఁగాని అధమము ఒక్క దినమయినను ఉపవాసముందురు. ఉపవాస దినమునఁ గావలసినపుడు కొలఁది నీటినిమాత్రము కొందఱు త్రాగుదురు. శుష్కోపవాసము నొనరింప లేనివారు ఫలములను, మఱికొన్ని లఘుపదార్థములను భుజించుట కలదు. ఉపవాసముండుట చాల ఉచితమైనది. ఆ దినమున ఇతర పదార్థములను గాక కేవలము ఫలములనుగాని ఫలరసమునుగాని స్వీకరించుట మంచిది. ఫలముల రసము, ప్రేగులను, రక్తనాళములను, రక్తమును పరిశుభ్రపఱచును. మఱియొక విశేషము. మనము స్వీకరించు పదార్థములు తొలుత జీర్ణమునకువచ్చినపిదప నందలి సారము రక్తముగ మాఱును. ఫలరసములన్నవో - అట్లుకాక తొలుతనే రక్తముగ మాఱును. కావున గురువై నిస్సారమగు నాహారముకంటె లఘువై సారవంతమగు ఫలాహారమే మిక్కిలి మంచిది. ఉపవాస దినములలో ఫలములనే భుజింపవలెను. తక్కిన పదార్థములు దేహమునకు అనారోగ్యమును కలిగించును.

## పాముకాటునకు చికిత్స.

కిరాచియందలి "సెంట్రల్ రిసర్చి ఇన్‌స్టిట్యూటు" వారు ఈనడుమనే పాముకాటునకొక క్రొత్త చికిత్సను కనిపెట్టియున్నారు. గుఱ్ఱపు వ్రణముల రసినుండి "ఆంటివెనైన్" (Anti venene) అను సారమును తీసి దానితో వారు మందు తయారు చేయుచున్నారు. దానివలన చాల ఉపయోగము కనుపించుచున్నది.

# సంపాదకీయములు

### ఉరిశిక్ష

ప్రభుత్వమువారి శాసనములు హత్య చేసినవారికి ఉరిశిక్షను విధించుచున్నవి, ఈ శిక్ష ఆమోదింపఁదగినదే యని చాలమంది న్యాయమూర్తులును, న్యాయాధికారులును, దండనాధికారులును, ప్రజలును తలంచుచున్నారు.

హత్యయనునది సామాన్యముగ కొన్ని నెలలు, కొన్నిసంవత్సరములు ఆలోచించి చేయునది కాదు. తాత్కాలికమగు క్రోధావేశమే దానికి ముఖ్యమగు కారణము. అట్టి పనికి హంతను ప్రాణములు పోవునంతవఱకు వ్రేలఁదీయుట అర్థముకాదనితోఁచుచున్నది.

కొన్నియుగములక్రిందట—జనులు పశుప్రాయులుగను, కిరాతప్రాయులుగను ఉన్నపుడు నిరంకుశప్రభుత్వపు పరిపాలనమున ఇట్టి మరణదండనము లుండెడివి. ఇంతియేకాదు. వ్రేలు తెగఁగొట్టినవాని వ్రేలు నఱకుటయు, కాలు నఱికినవాని కాలు దీయుటయు నప్పటి విచిత్రములగు శిక్షలు. అట్టి విచిత్రపు శిక్షల నిప్పటి ప్రభుత్వపు న్యాయమూర్తులనుమతించుటలేదే? ఇప్పటి మరణదండన పద్ధతి వెనుకటి యుగములను దలపించుచున్నదనవచ్చును.

అపరాధికి హత్యచేయుట సహజమైన గుణమగునేని హత్యచేయుట అంతగా అతని తప్పిదము కాదు. తాత్కాలికమగు క్రోధావేశమువలన హత్యజరిగినపుడు అపరాధి జీవితము నంత మొనర్చుట యుక్తము కాదు. ఇంచుమించుగ ఇపుడు జరుగుచున్న హత్యలన్నియుఁ క్రోధావేశమువలనఁ గలుగునవియే కాని విశేషప్రయత్నపూర్వకముగ జరుగునవి కావు.

శిక్షలు అపరాధులను మంచిమార్గమునకు దీసుకొని వచ్చుటకేర్పడినవి కాని అపరాధులను నశింపఁజేయుటకుఁగాదు. ఇపుడు బ్రిటిష్ ప్రభుత్వమువారి నూతన పరిపాలనా పద్ధతులందు అపరాధులు తమ తప్పులను చక్కఁజేసికొనుటకుకొంత అవకాశమిచ్చుచున్నారు. హత్యయొనర్చిన అపరాధికి మరణదండనమును విధించినచో వానికి అవకాశ మీయక ప్రభుత్వము ఉపేక్షను వహించినట్లగును. నాగరకత లేని కాలమున దేశమున జరుగుచుండిన దురంతములనుబట్టి ఉరిశిక్ష అప్పు డవశ్యకమై యుండెడిది. ఇప్పుడు మాత్రమియ్యది క్రూరకార్యముగనే తోఁచుచున్నది.

హత్యచేసినవానికి మరణదండనను విధించినయెడల భీతులై యితరులట్టి క్రూరకార్యముల జోలికిపోక యుందురని కొందఱితలంపై యుండవచ్చును. కానిఇపుడునుశిక్షలుజరుగుచున్నవి.హత్యాపరాధములును పెరుగుచున్నవి.

అపరాధికి ఉరిశిక్షవిధించునపుడు న్యాయాధికారియు, కారాగారాధికారియు, కూడ తాము చేయుపని కఠినమైనదని విచారము కలిగియుండుట మనమెఱుఁగనిది కాదు.

కావున కొంత కాలము వఱకయినను ఈ ఉరిశిక్షను మాన్పిపరిస్థితు లెట్లుండునో ప్రభుత్వమువారు గమనించుట లెస్స.

యూరపుఖండమున కొన్ని దేశములలో ఉరిశిక్ష రద్దుచేయఁబడినది. దానింబట్టి కల్గిన యచటి పరిస్థితులను తెలుపవలెనని ప్రభుత్వమువారు ప్రార్థింపఁబడుచున్నారు.

---

## రైతాంగవిద్యాలయము-నిడుబ్రోలు.

దేశదౌర్భాగ్యమును తొలగించి ప్రజల జీవితములను సుఖమయముల నొనర్చుటకుఁ గల ముఖ్యసాధనములు రెండు. ౧ కృషి ౨. పరిశ్రమలు వీనియందు పరిశ్రమలకంటె వ్యవసాయమే ముఖ్యమైనది. మన దేశము పై దేశములకుకూడ భిక్షపెట్టుటకు ఇదియే ముఖ్యమగు సాధనము.

కర్షకునికి విద్య అక్కరలేదని కొందఱి తలంపు. అట్టి తలంపులుండుటఁబట్టియే భూమి ఫలవంతమైనను మనదేశమున వ్యవసాయాభివృద్ధి కావలసినంత జరుగకున్నది. ఉచితమగు విద్య నేర్చినఁగాని వ్యవసాయదారులకుఁ కల్గుచున్న కష్టములు నశింపవు. వారికృషికి దగినఫలము లభింపదు.

రైతులలో విద్యావంతులు తక్కువగుటచే అమాయకులగువారు సంస్థానాధీశులకును-- ప్రభుత్వములకును లొంగి--వారువిధించు-- లెక్కలేని పన్నులను చెల్లించుచు క్రుంగి పోవలసి వచ్చుచున్నది.

రైతులకు విద్యాబుద్ధులను గరపి వారి కష్టములను తొలగించుటకు నిడుబ్రోలు గ్రామమున" రైతాంగవిద్యాలయము" నెలకొల్పఁబడినది. ఇట్టి విద్యాలయముల కిదియే ప్రారంభము. ఇది దేశాభివృద్ధి సూచకము. ఆంధ్రులును, అందు ముఖ్యముగ కర్షకసోదరులును దీనిని పోషించుట ముఖ్యకర్తవ్యము.

---

## అస్సామువఱదలు

మనభారతీయుల దురదృష్టమేమోగాని రానురాను దేశమున విషమపరిస్థితు లెక్కువగుచున్నవి. సాంఘిక రాజకీయ సంరంభముల యొత్తిడి యటులుండనే యున్నది. మొన్నటి బీహారు భూకంపముల సంక్షోభము ప్రపంచము నంతటిని తల్లడిల్లఁజేసినది. ఇంకను అచ్చటచ్చట భూకంపములు కలుగుచునేయున్నవి. ఈస్థితిలో "గోరుచుట్టుపై రోఁకటిపో" టన్నట్లు అస్సామును వఱదలు ముంచివేసి లెక్కలేని గ్రామములనునాశనము చేసినవి. లెక్కలేని జనము పశువులు ఆ జల ప్రళయమున లీనమైపోయినవి. పంటభూములన్నియు ఫలసాయముతోఁ గూడ నంతరించినవి. ఇట్టివిపత్సమయమున భారతీయులందరును తమసాయము నపేక్షించు అస్సాము ప్రజలకు సాయమొనర్చుట విధి. పరోపకారపరాయణతఁబూని ఆంధ్రులును తగిన సహాయమొనర్చి అస్సాము ప్రజలయెడల దయకుగల సానుభూతిని వెల్లడింతురుగాక !

---

## తెలుఁగు

" తెలుఁగు" అనఁగా భాషవిషయమును గూర్చియా యితరపరిస్థితులనుగూర్చియా అన్నచో " సందర్భమునుబట్టి " అనిజవాబు,

"ఆంధ్రులము - ఆంధ్రత్వము" అని మాటిమాటికి మన తెలుఁగువారు చేరినప్పుడు అనుకొనుట వినఁబడుచుండును.

కాని ఆరీతిగా ఊరక అనుకొన్నంత మాత్రముతో ఆ యాంధ్రత్వమునుగూర్చి తృప్తిపడుటయెంత సమంజసముగా నుండును? కాఁబట్టి యిందలియోఁగాములను గొంతవఱకాలోచింతముగాక !

'తెలుఁగుతనము' అన్న పలుకునకు ఆ దేశవేషభాషలయందు స్వభక్తి యుండవలసినట్లు అర్థమిచ్చునుగదా? "స్వస్థానవేషభాషాభిమతాస్సంతః" అని నన్నయభట్టు పల్కినచొప్పున స్వదేశవేషభాషలు మన్నింపఁదగినవి.

ఇప్పుడు తెలుఁగునందుఁ బలుకుఁబడి సంపాదించినట్లు చెప్పఁబడువారు (మహమ్మదీయ క్రైస్తవ మతములవారినిగూర్చి యిక్కడనంతగాఁ బ్రస్తావించుటలేదు. ఎందుకందురా? వారిసంఖ్యతక్కువకనుక) క్రమాగతముగా వచ్చుచున్న తమ వేషముల నెంతవఱకు ప్రేమించినారు? ప్రేమించుచున్నారు? సామాన్యముగా వీరి కట్టుబొట్టు జుట్లు బెంగాలీనో పాశ్చాత్యపద్ధతినో యనుసరించియుండును.

ఇట్టివేషముగలవ్యక్తి? నేను ఆంధ్రుడను అనును. ఇట్టిరీతిగా తయారయిన వ్యక్తులు కొందఱు చేరినచోటికి కర్మముచాలక ఆ పూర్వాచారము (నిజమయిన దేశాచారము) ప్రకారముగా కట్టు బొట్టు జుట్టులుగలవాఁడే తెంచినచో అతనిని "గబ్బిలాయి" అనియును "చాదస్తము" అనియును పరిహాసములు చేయుట. ఇంతయెందుకు? బి.యె. చేదివిన యొక వరునికి తలపయిఁ గ్రాపులేనందునఁ బెండ్లిలో కన్యచేతఁ దిరస్కారము కలిగినట్లు ఇటీవల "భారతి" లో నొకకథలో చేదివినాను. ఆకథవ్రాసిన గ్రంథకర్త్రికా భావముపయి మక్కువయున్నదో లేదో తెలియదు. కాని దేశములోని పరిస్థితి దెల్పినది. "మేక్సుముల్లరు" మొదలయిన పరదేశ మహనీయులుకూడ ఆనందించి ప్రశంసింపుచున్న వేదములచేనిర్దేశింపఁబడిన "శిఖాయజ్ఞోపవీతములు" వీరికెందుకుఁగానివయ్యెను. జుట్టుపయిఁ జెప్పినట్లుపోఁగా యజ్ఞోపవీతముమాత్ర ముందునా? ఎందుకో యుంచుకొన్నవాఁడట ఫలానాపని కని తెలుఁగు ప్రతాపరుద్రీయములోని జబాబు చెప్పను.

చాలమాటలు అవసరములేదు. ఎదుటివారు తమపుంతకురాక తమపని తాము చూచుకొనుచున్నప్పుడు తమ వేషపద్ధతులను విడిచి వారిని మంచి యనుటకుఁ దగినంత తేలిక మనస్సు మనవారికి నున్నదని మనలోని మాటగా మనవి.

శ్రీకృష్ణా గోదావరీమండలముల బ్రాహ్మణ్యము పాండిత్యమున కెంతప్రసిద్ధి? అట్టి వారిబిడ్డలలో "మా కొఱకు మా తాతయొక్కఁడు ప్రతినెలకు ఒకసారి సంధ్య వార్చును" అను జవాబు చెప్పుట?

ఇంకను వేదాధ్యయన ఘోషను సంస్కృతాంధ్రపాండిత్యమును ఈ నవనాగరకులయిన వారిచే పరిహసింపఁబడుచుండును. వారికి దెలిసిన దానిలో వారికిఁ దెలిసినపద్ధతిలో వీరు వారినాక్షేపించినప్పుడు వీరిశక్తియుక్తులు తేఁటపడఁగలవు వీరు నిర్యక్ష్యపెట్టినట్లు వారు

మాత్రము వీరిని ఎత్తివేయలేరా? కాని సత్యకాలపద్ధతివారు వీరిలోనే తనుబ్రతుకున్నదనుకొనిరేమో?

ఇఁక వీరి వాఙ్మయమునకు ఆదర్శములు తాము—కాదు—తమవారు మిక్కిలి వ్యయప్రయాసలుపడఁగా—నేర్చుకొన్న బి. యే. వఱకో తమకడ్డమువచ్చి - ప్రాక్సీ అటండెన్సుల హాజర్లుపోఁగా - హాజరుగంటలలో తమచెవులలోఁబడిన పాఠవిషయముల కర్తలయిన షేక్స్పియరు - షెల్లీ-కీట్సు—వర్డ్సవర్తు - మొదలయిన పాశ్చాత్యకవీశ్వరులను ఇటీవల వార్తా పత్రికలలోవే రెన్నికఁగన్న రవీంద్రులవారును.

మనలోని నన్నయ, తిక్కన, పోతన్న, శ్రీనాథుఁడు, వీరబ్రహ్మము అట్లు పేరెన్నిక నెందుకుఁగనరాదు? మనము ప్రకటింపనియప్పుడు వారిపేరు లెట్లు ఎన్నికనందును? వారువారిచే నయినట్లు వంచనలేక వాఙ్మయముప్రసాదించివారు. ఇప్పుడు వారిగ్రంథములఁ గూర్చిన ప్రశంస లెడముచేతితోను పరదేశీయుల ప్రశంసలు దక్షిణహస్తముతోను వ్రాయఁబడుచున్నవి. క్రమముగ నన్నయాది మహాకవినిర్దిష్ట వాఙ్మయాభ్యుదయము తగ్గి కేవలము సంస్కృతాంగ్లాది వాఙ్మయప్రాధాన్యమే యేర్పడునా యేమని తోఁచుచున్నది. గ్రాంథికము వ్రాసినను గ్రామ్యము వ్రాసినను ఆయా భాషాపద్ధతులు ఆయా దేశకాలపాత్ర సందర్భముల ననుసరించ యుపయోగింపపలయును.

ఇంతవఱకు పాశ్చాత్య వ్యామోహ మొకక్కటియే ఆంధ్ర వాఙ్మయమును కలఁతనొందించుచుండినది. ఇటీవలను హిందీ అని జాతీయమను పేరితో వినఁబడు నప్పటికి-మనవారు దద్దరిల్లి తెలుఁగునువదలి "హిందీ హిందీ" అని దానిపయి మక్కువ నారంభించిరి. మనుచరిత్ర చేదువుమన్న నోఁపికలేదన్న తెలుఁగన్న హిందీ పట్టభద్రుఁడయినాఁడు. హిందీతప్ప ఇంకొక భాషమాటాడరాదు. హిందీ ప్రచార సభలు భారత దేశమందంతటను వెలసినవి. ఆంధ్రదేశమునందవి మిక్కిలిగా వెలసినవి. అంతగాని అంతకు మిన్నగాఁగాని ఆంధ్ర భాషాభ్యుదయము నిమిత్తము ప్రయత్నము జరిగినచో ఆంధ్ర భాషాక్షేమమునుగూర్చి భీతి పడవలసిన యవసర ముండి యుండదు. పరికించియో పరికింపకయో యెన్నియో పత్రికలుసయితము హిందీ భాషను బొగడుచు దానిప్రాధాన్యము నుద్ఘాటించుచున్నవి! ఆంధ్రభూమి-ప్రబుద్ధాంధ్ర-మొదలయిన యొకటి రెండు తప్ప.

క్రమాగతపద్ధతిని గురుకులవాస మొనర్చి చేదివిన పండితులును, శ్రోత్రియులును చాల వఱకు పరిహాస పాత్రులగుచున్నారు. వారిలో బూటకములు మెండందురా? తగుపరీక్షావసరము లున్నచో నట్టి వారు తగుదురుగదా? ఆంగ్లవిద్యావంతులలో మాత్రము టాటోటుకాండ్రు లేరా? ఎందును సీదాయును నక్లీయును నుండును. పడిసెమునకు భీతిపడి ముక్కు గోసికొను వారెవ్వరు? కనుక జగన్మాన్యములయిన యాంధ్రవేష భాషలయందు ఆంధ్రులకు పేర్మిపెంపొంద వలయునని మా నుభిలాష.

---

# హ ! హ్హ !! హ్హా !!!

జెడ్జీగారు:—ఏమిరా ! దొంగా! ఆ దుకాణానికి మూడుసార్లు వెళ్లి కడాపటికి ఒకటే చెంబు దొంగలించినా వేమిరా ?

దొంగ:—రాణీగారి ఆజ్ఞ అండి.

జడ్జీ:—రాణి యెవ్వరురా ?

దొంగ:—మరెవరున్నారు. పెండ్లామే. ముందు చెంబు కావలె నంది. నేను వీళ్లింగట్లో దొంగిలించి ఒక చెంబు తీసుకెళ్లాను. దాన్ని బాగా లేదని మూడుసార్లు తిప్పింది. అంతే నండీ.

---

ఉపాధ్యాయుడు:—విన్నారా ! తోక లేని కోతి క్రమక్రమంగా మారి మనిషి అయాడని డార్విన్‌గారి సిద్ధాంతం.

శిష్యుడు:—తమర్ని చూచేదాకా మాకా నమ్మకం లేకపోయిందండీ.

---

" వైట్‌పేపరంటే ఏమిటి ? "

" అదా ! అది ఉత్త తెల్లకాగితాల పుస్తకం. అది ఏదన్నా కొత్తపత్రికలో ప్రకటనలకోసం కాన్వాసు చేయడానికి ఇతరులికి బహుమతి చేయబడవలసి వుంటుంది. "

---

భార్య:—(కోపంతో) ఏమి ఇంత ఆలస్యంగా వచ్చేరీవేళ ?

భర్త:—నువ్వు పడుకున్నాక యింటికి వద్దామని యింత ఆలస్యం చేశాను.

---

అధికారి:—మళ్లీ యిలాంటితప్పు చేశావంటే గుండేసి కొట్టేస్తాను చూడు

నౌఖరు:—చిత్తం. తమకి రివాల్వరు ఉపయోగించుకోడానికి లైసెన్సు ఉన్నదా అండి !

---

తల్లి:—చిట్టీ ! బడికి వెళ్లావమ్మా ?

బిడ్డ:—ఊం.

తల్లి;—ఏం పాఠం చెప్పారమ్మా!
బిడ్డ:—మల్లీ లేపు లమ్మని తెప్పారు.

---

ఎల్లయ్య:-మా అబ్బాయికి మీ అమ్మాయి నివ్వకూడదూ? పెద్ద వుద్యోగం చేస్తున్నాడుకదా!

పుల్లయ్య:—ఏం ఉద్యోగం?

ఎల్లయ్య:—అతనికిందనే అయిదుగురు పెద్ద ఉద్యోగస్థులు పనిచేస్తున్నారట.

పుల్లయ్య:—అవును, మిద్దెకింద ఉద్యోగస్థులు పని చేస్తూ ఉన్నారు. మిద్దెమీద నాకర్లు పని చేస్తూవుంటారు.

---

మూఁడువేల వరహాలు ఎనిమిదివేల వరహాలగుట.

కవి సార్వభౌముఁడయిన శ్రీనాథ మహా కవి కొండవీటి మండలాధీశ్వరుండయిన యనవేమభూపాలుని సన్నిధికి మొట్టమొదట వెళ్లినప్పుడు

శ్లో. అనవేమనృపాలేశ స్వస్త్యస్తు తవబాహవే।
ఆహవే రిపుదోర్దండ చంద్రమండలరాహవే.

అనే శ్లోకమును చదివెను. ఆ శ్లోకమును విద్వత్ప్రభువయిన యా భూపాలకుఁ డాల కించి మూఁడువేల వరహాల బహుమాన మిప్పించెనఁట! అందులకు కవీశ్వరుఁడు "నేను నాలుగువే లిచ్చితిని మీరు మూఁడు వేలే యిచ్చుచున్నారే," యనియె.

అందులకు నృపుఁడు "నీవిచ్చిన నాలుగు వేలేవీ?" యని ప్రశ్నించె.

కవీశ్వరుఁడు. "నా శ్లోకములోఁ జూచికొనుఁడు. నాలుగు "వే" లున్నవో లేవో?" యనియె. ఆయుక్తికి రాజు సంతసించి, మఱియొక వేయివరహాలను దెప్పించి "యిదుగో! నాలుగువేల వరహాల సత్కారము గైకొనుఁ" డనియె.

అందులకు శ్రీనాథకవి "నే నిచ్చినదే నాకిచ్చుటలో నేమి విశేషమున్న?" దనియె.

ఆ యుక్తికిని సంతసించి రాజింకొక వేయివరహాలను దెప్పించి యొసంగఁబోఁగా కవీశ్వరుఁడు "నే నాఱువేలనియోగినినాకయిదువే లిచ్చుట సారస్యముగా నుండునేమో చూడుఁడు" అనియె. అందులకును భూపతి సంతసించి, యాఱువేలవరహాల నిప్పింపఁబోఁగా, కవివరలను "నా మొత్తము నాకే" యనియె.

అనవేమక్షితిపతి ఆ యుక్తికిని సంతోషించి యేఁడువేల నొసంగఁ బూనఁగా కవీశ్వరుఁ డది "సోదనాకర్థశబ్ద" మనియెను. రాజు ఎనిమిదివేల వరహాల నిప్పించెను. కవీంద్రుఁడు తృప్తినొందెను.

---

# నమ్మిననూ నమ్మకున్ననూ సరే

మల్‌డిమోర్ అను ఒక ఫ్రెంచియువతి మొదటికాన్పున ఒకబిడ్డను, రెండవకాన్పున ఇద్దరుబిడ్డలను, మూడవకాన్పున ముగ్గురుబిడ్డలను, నాల్గవకాన్పున నల్గురుబిడ్డలను, ఐదవకాన్పున ఐదుగురు బిడ్డలను, ఆరవకాన్పున ఆర్గురుబిడ్డలను కనెను; కడసారి కాన్పువలన ఆమె మృతినొందినది.

---

అమెరికా దేశమునందు మోటారుకారు ప్లేట్లు అన్నియు ఖైదీలవలన జైలులో తయారు కాబడును.

---

బొంబాయి హైకోర్టులో ఒక సంస్థానమును గురించిన దావాలో గుడిలోని విగ్రహములుకూడ ప్రతివాదులుగా చేర్పబడినవి.

---

ఈ మధ్య ఇటలీ దేశములోన సముద్రమునకు 40 మైళ్లదూరమున ఉన్న ఒక పట్టణమునందు ఎఱ్ఱని నీరువంటి వాన కురిసినది. ఆ వానతో చిన్నచేపలు కూడా చాలా పడినవి. ఇట్టి విపరీతములు వివిధదేశములలో ఇంతకుముందు అధమము 294 సార్లు అయినను సంభవించినట్లు తెలియుచున్నది. 1921 సంవత్సరములో లండను నగరమున చిన్న కప్పలు వానగా కురిసినవి. స్వీడన్ దేశములో 1924 సంవత్సరమున ఎఱ్ఱటిపురుగులు, ఒకటి మొదలు నాల్గు అంగుళముల పొడవుగలవి వడగండ్లవానతో కలసి పడినవి.

---

ఫిలడెల్‌పియాలో సారా అపరిమితముగా త్రాగినందుకు ఇద్దరు యువకులను కోర్టుకు తీసుకొనిపోయిరి. వారికి ఒక ఎక్కువ మోతాదు ఆముదము త్రాగుటగాని, పది రోజులు ఖైదుగాని శిక్ష విధింపబడినది. వారు ఆముదము త్రాగుటకే ఒప్పుకొనిరి.

---

తుంగభద్ర, కావేరీనదులను దాటుటకు వెదురుచీలికలతో చేసిన బుట్టలను వాడుదురు. అట్టి బుట్టల నడిమికొలత సుమారు పండ్రెండడుగు లుండును, బుట్టలు ఒక్కొక్కటి అవలీలగా ఒకేమారు 8 మంది మనుష్యులను; 20 బస్తాల బరువును మోయును.

---

పజోనీ అను ఒక ఇటలీ దేశీయుడు బ్రతికి ఉన్న విషసర్పములను తినును.

---

చీనాదేశములో పురిటిగదియందు పురుటాలిభర్తయొక్క ఇజారును వ్రేలగట్టుదురు. దయ్యములు, భూతములు, చంటిబిడ్డను అంటక ఆ ఇజారులో దూరునని వారి నమ్మకము.

---

స్కాట్లండులో ఒక మంగలి తాను క్షౌరముచేసిన వెంట్రుకలతో అందమైన బొమ్మలను, తీరిక అయినప్పుడెల్ల చేయుచుండును. అట్టి బొమ్మలు చాలామంది కొనుచుందురు.

---

ఒక నిచ్చెనమెట్టుమీద చెక్కబడిన విల్లు ఒకటి ఈ మధ్య లాన్ ఏంగెల్సుకోర్టులో ధృవపర్చపడిడినది.

---

ఒక సిపాయి 17 ఏండ్లక్రితము జరిగిన మహాసంగ్రామములో మృతి నొందినాడని తెలిసినది. అతనిపేరు యుద్ధములో చనిపోయినవారి స్మారకచిహ్నముమీదకూడ చెక్కబడినది. కాని ఈ మధ్య ఆ చచ్చిపోయినాడనుకొన్న సిపాయి తిరిగి తన సహోదరి యింటికి చేరినాడట.

---

కిఛినర్ ప్రభువు మేనల్లుడు 24000 రకముల అగ్గిపెట్టెలమీద ఉండు బొమ్మలను జాగ్రత్తపెట్టెనట. వీటిని సంపాదించుటకు విశేషధనము వ్యయము చేయుటయేగాక, ప్రపంచమంతా చుట్టివచ్చెనట.

---

ఇస్తోనియాలో క్రొత్తపెండ్లికూతురు మగనితో కాపురముచేయుటకు మొదట భర్తగృహము ప్రవేశించినవెంటనే అగ్నిలో కొన్ని నాణెములను వేయవలెనట.

---

ఇటలీలో ఒక యువతి నిద్రించునప్పుడు మిణుగురుపురుగువలె మెరయునట. డాక్టర్లు శాస్త్రవేత్తలు ఈవింతకు కారణము కనుగొన ప్రయత్నించుచున్నను సఫలమనోరథులగుట లేదు.

---

దక్షిణ ఆఫ్రికాలో పిల్లులను చంపుటకు ఒకరకము ఎలుక లున్నవట.

---

అన్ని దేశములు సంతాననిరోధము నిమిత్తము ప్రయత్నములు చేయుచుండగా జర్మనీయందు సంతానాభివృద్ధికిగాను గొప్ప ప్రయత్నములు జరుగుచున్నవి. జర్మనీకి ముఖ్యపట్టణమైన బెర్లిన్‌నగరము మధ్యను సంతాన సమృద్ధి—(Forentain of Fecandity) అనుపేర ఒకగొప్ప శిల్పము నెలకొల్ప బడుచున్నది.

---

ఇంగ్లాండులో 240 సవరనుల బాకీ తీర్చవలెనని ఒకనిమీద వారంటు అమలు జరుపబడినది. కాని ఆయన న్యాయాధికారివద్ద నెలకు 4 షిల్లింగులచొప్పున తీర్చుటకు అనుమతి పొందెను. ఆ బాకీ తీరుటకు 116 ఏండ్లు పట్టును.

---

ఒక గుజ్జమున కేడుగురు మనుష్యుల శక్తియుండునట.

---

# విమర్శనములు

## గ్రంథములు

### కార్మికసంఘ ప్రచురణము నెం. 5.

ప్రతి మాకార్యస్థానము నలంకరించినది. తెనాలి తాలూకా అనంతవరములోని కార్మికసంఘము వారిచే ప్రచురింపఁబడినది. ఒక మనోహరమయిన కథయొక్క దృష్టాంతము మూలమున బీదసాదలు కూలినాలి చేయుటలో ఈ దేశమునందు నుండు శ్రమలు యోచింపఁబడినవి. ఈ యుద్యమము మిక్కిలి యుత్తమమయినది. ప్రచురణ కర్త లింకను ఇట్టి పుస్తకములను ప్రచురించి జనోపకారము గావింతురుగాత.

**కుముదవల్లి.**—ఆంధ్ర దృశ్యకావ్యము. 3 అంకములు. గ్రంథకర్త మ॥ నీరిపి - ఆంజనేయులుగారు. అనంతపురము గవర్నమెంటు పురుషుల సెకండరీ ట్రెయినింగుస్కూలు ఆంధ్రపండితులు. వెల తెలియదు. లభించుచోటు తెల్పఁబడలేదు. బహుశః గ్రంథకర్త గారినుండియే కానోఁపును. జగద్విఖ్యాతులును ఆంధ్రభాషాభిజ్ఞులును అయిన మ॥ గాడిచెర్ల - హరిసర్వోత్తమరావుగారు యం. ఏ. ఈ గ్రంథమునకు మున్నుడి వ్రాసిరి. ఈ పొత్తము రెడ్లవంశము నలంకరించిన శ్రీ పాముదుర్తి- బయ్యపురెడ్డిగారి తొలికూఁతురయిన శ్రీమతి విశాలాక్షమ్మ గారికిఁ బెండ్లి కానుకగా నొసంగఁబడినది. గ్రంథకర్తగారు వ్రాసిన పీఠికలోని సంగతినిఁబట్టి యీ రూపకం బెంతయు జనాదరణంబునొందినట్లు తెలిసెడిని. మ॥ నీరిపి - ఆంజనేయులుగారు ఆంధ్రదేశమునందు తెలియఁబడిన వారే. వారియొక్క గ్రంథప్రాశస్త్యమునుగూర్చి ప్రత్యేకముగాఁ జెప్పఁబనియుండదు. రూపకమును గొలఁదికాలపరిమితిలోనే ముగియునట్లు రచించుటయును అందును రసగుంభనము చక్కఁగాఁ గావించుటయును వీరి "కుముదవల్లి" రచనంబునందుఁ జేసిన విశేషంబులు. రసపోషణమే గాక నీతిబోధయును గ్రంథమునందుఁ జక్కఁగా నిర్వహింపఁబడి యున్నవి. శైలియును వీరి మున్నిటి గ్రంథములందుబలెనే మనోహరంబుగా నున్నయది. మున్నుడియందు హరిసర్వోత్తమరావుగారు పేర్కొనిన వారుపేర్కొన్న పాత్రోచితభాష చాల ముఖ్యముగా గమనింపఁదగు నని మా యాశయము. రసగుంభనములో ఈ కవీశ్వరుఁడు వెనుకఁ బడలే దనుటకు నొకటి రెండు పద్యములు:—

శా॥ విన్నాఁడర్ గద నీదు నార్యగరిమన్ । వీనుల్ వినోదింపఁగాఁ । గన్నాఁడర్ గద బాహువీర్యపటిమన్ గన్నుల్ ధృతిం బొందఁగా । నున్నాఁడన్ గద నాదుశౌర్యరుచి నీకొక్కమ్మాడిం జూపఁగాఁ । గొన్నాఁడర్ గద చంద్రహాస మిదె కైకోనెంచి శీర్షం బహో!!, (తృతీయాంకము—91 వ పుట.)

క॥ ఎనసెడు శుభనినదంబులు । జనములకిటకిటరవంబు శకటధ్వనులున్ । బెనుపగు నాబెపు టులివులు । ననిశము వేగునని యిచేట హర్షం బొసఁగున్ ॥ (ప్రథమాంకము—పు. 15,) పయి పద్యములోని స్వభావోక్తి కడుంగడు హృదయంగమంబు గదా?

ఇట్టివే కాక యింకను మనోహరంబులయిన పద్యంబులును రసంపుఁబట్టులును నిప్పొత్తంబునం దెన్నియో కలవు. గ్రంథకర్తగా రిట్టి పొత్తముల నింకను ననేకంబుగా రచియించి భాషామతల్లిని సేవింతురుగాత మని కోరుచున్నారము.

దో. వే. గుప్త.

**"దూ దేకుడు"** :— విజయనగరము - సుబ్రహ్మణ్యంపేట వాస్తవ్యులయిన శ్రీ ఆలపాటి-కామేశ్వరరావుగారిచే రచియింపఁబడిన విమర్శనప్రహసనప్రాయ (satire) గ్రంథము వెల 1 రు. గ్రంథము

గ్రంథకర్తగారి పినతండ్రిగారయిన శ్రీ॥ శే॥ శ్రీవిద్యాక్ ఆలపాటి-వేంకటేశ్వర శాస్త్రిలుగారికి అంకితమీయఁబడినది. గ్రంథమునందలి విషయము- మొదటి 8 విషయములు భావకవిత్వమునుగూర్చి పత్రికాధిపత్యమును కవిగారి యభిప్రాయములను సూచించునవిగానున్నవి. 9 వ విషయము శ్రీముని మాణిక్యం - నరసింహారావుగారి పాత్తమునుగుఱించి "కులమింటికోతి' యను విమర్శనము. ఆఖరువ్యాసము భారతీపత్రికా సంపాదకుని గూర్చినది. 84 వ పుటలోని

ఉ. ప్రేమకళావిలాసకరశీకృతతావకతారకాద్వయీ
శ్యామలతాంతవామమగు స్ఫాటికనిర్మలతక్ హాసిం [చుసు
శ్రీమధురమ్ముగా వెలువరించుచొ కారపువానిగారవీ
వ్యోమమన పమోదసరసోహాల వెల్గెశతద్రహదాగతిక్ ॥

అను పద్యమువల్లను ఇంకను గ్రంథమునందుఁ గల కొన్ని పద్యముల వల్లను గ్రంథకర్తగారి పద్యశైలి యును వ్యక్తమగుచున్నయది.

**జన్మభూమి:**—శ్రీ ముద్దా-విశ్వనాథముగారిచే రచియింపఁబడిన మనోహరమైన చిన్నపొత్తము. ఇందలి కథావిషయము స్వదేశాభిమానము పితృభక్తి అను దివ్యాదర్శములను దెల్పునది. దీనికి మాతృక "Juvenile Budjet" అను ఇంగ్లీషు కథ అని గ్రంథకర్తగారే తెల్పినారు. కాని ఆకథ యాకథ తీఱుగానే యాంధ్రీకరింపక దాని ఛాయగాను ఈ దేశమునకుఁగాను పేర్లు మొదలయిన కొన్ని మార్పులు గల్గునట్లుగాను వ్రాయఁబడినది. వీరు సందర్భానుసారముగా భారతభాగవతాది గ్రంథములలోని పద్యములను గైకొని కొన్ని మార్పులఁ జేసి యుపయోగించుకొన్నట్లు చెప్పినారు. కాని యా మార్పులనుకూడ సూచించియున్నచో నింకను బాగుగా నుండెడిదేమో? అంతియకాక శ్రీ మంగిపూడి-వేంకటశర్మగారు మొదలయిన యుత్తమగ్రంథకర్తలయొక్క పద్యములు నిందు సందర్భానుసారముగాఁ జొప్పింపఁబడినవి. వెల. 4 అణాలు. విశాఖపట్టణముజిల్లా - యలమంచిలి దగ్గఱ - మేలుపాక - వ్యాసకుటీరమునకు వ్రాసిన నీ గ్రంథము లభించును.

**ముకుంద స్తవరాజము:**— విజయనగరము ఆలపాటి-కామేశ్వరరాయకవిగారిచే వ్రాయఁబడినది. 112 కందపద్యములుగల స్తోత్రగ్రంథము ఇన్ని పద్యములున్నప్పుడు వీరు శతకమని పేరుపెట్టమికిఁ గారణము బహుశః సంఖ్యయం దప్రాధాన్యమయి యుండనోఁపు. పద్యము లన్నియును ముకుందా!" అను మకుటము గలవై యున్నవి. గ్రంథకర్తగారి రచనము సంస్కృతాచ్ఛికపదసారళ్యము గలదనియే చెప్పనొప్పును. అయినను సంస్కృతమర్యాదలయం దాదరము మెం డనిపించెడిని. 18 వ పుటలో "నీపేరక్ శతకమనుచు" అను 104 వ పద్యములోని యభిప్రాయము వంటి వానిని ప్రకటించుట గ్రంథకర్తగారు తగ్గించిన బాగుగానుండునేమో? ఒకనికిఁ గావించు విజ్ఞాపనములు వందపద్యములయినప్పుడు (ఆవిజ్ఞాపనములు శ్రీకృష్ణునకిఁ గావించుకొనఁ బడినవను కొనుఁడు) అతనిపేరి శతకము (శ్రీకృష్ణశతకము) అనఁగూడదా? అన్నిపనులకుఁ బరమాత్ముఁ డధికారి యనుమాట నెత్తుకొన్నను సరిపోవును.—శైలికిఁగాను ఒకటి రెండు పద్యములు:—

క. చందన సంవాసితబహు
సుందరదేహా! యనూనశుభకరవిలస
న్మందస్మిత శోభావిజి
తేందు సుధాచంద్రకుంద బృంద! ముకుందా !! 58

క. నినుకాంచునట్టి భక్తుని
మనముప్పొంగును విలసదమందానందం
బున ;నమృతాంశుసమాలో
కనమున సంద్రంబుపొంగు కరణి, ముకుందా !!

దో. వేం. గుప్త.

## పత్రికలు

ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక:—కాకినాడనుండి శ్రీ క్రొత్తపల్లి-సూర్యరావుగారిచేఁ బ్రకటింపఁబడి రెండునెలల కొకసారి వెల్వడునట్టి గ్రాంథికాంధ్రభాషాపత్రిక. చేందా సం॥ 1 టికి రు 3-0-0. ఇది గ్రాంథికాంధ్రమును బోషించుటకు "అహమస్మి" అని నడుముగట్టుకొని పనిచేయు ప్రతికారాజము. భాషానైపుణ్యమునఁ బేరెన్నిక గన్నవారిచే వ్రాయఁబడిన ఆంధ్రి - తద్విశిష్టత, అల్లసాని పెద్దనార్యుని మనుచరిత్రము, ఆంధ్రకవుల భావచిత్రములు" మొదలయిన యమూల్యవ్యాసములుఁ మాకుఁ బంపఁబడిన శ్రీముఖ మాఘఫాల్గున సంచికయందుఁ గలవు. క్రమాగతమయిన యాంధ్రభాషాభ్యుదయ పద్ధతిని మనంబున నుంచుకొని దానికై ప్రాకులాడు పత్రికారత్నము లెన్ని యున్నవన్నవానిని దేశమున వ్రేళ్లతో లెక్కింపవచ్చును. ఈ పత్రికారాజమును దప్పక దేశీయు లందఱును ఆదరించుట నిక్కముగా ఆంధ్రభాషాసేవగావించుటయే యగును.

మక్కళపుస్తక.— బెంగుళూరు నుండి ప్రచురింపఁబడు కన్నడము మాసపత్రిక. ఇందు బాలబాలికలకును వారిపోషణ విద్యారోగ్యాభివృద్ధులకుఁ గావలసిన విషయము లన్నియును మిక్కిలి యనుకూల రీతిగాఁ బ్రచురింపఁబడును. పాటలు పద్యములు కథలు వ్యాసములును చిత్రములును గల్గి సంచిక యెంతయు ముద్దులు గులుకుచున్నది. బిడ్డల మేలుకొఱకు ఇంత మనోహరముగాఁ బ్రచురింపఁబడు ఆంధ్రపత్రిక ఆంధ్రదేశమునందు లే దనవచ్చును. సంపాదకులు. మ. సి. అశ్వత్థ నారాయణరావుగారు. ఈ పత్రికారత్నమెల్లమేళుల నొంది దేశమునకు మే లొనరించును గాక!

## సూచన.

ఏ విమర్శన మయినను సరియే. గుణదోషములను చూపించునదిగాను మేలిరీతికిఁ ద్రోవఁ దెల్పునదిగాను నుండవలయును. అట్లు గావించునప్పుడు విమర్శకుఁడు తనయొక్క యభిప్రాయమున మొగమాటము లేక ఘంటాప్రోక్తిగాఁ జెప్పనగును. ఇట్టి నిష్పాక్షిక విమర్శనములు నిక్కముగా ఈ దేశమునకు ఆంగ్లవాఙ్మయసంపర్కమువల్లనే కల్గినవని చెప్పవచ్చును. ఇతఃపూర్వము గుణగ్రహణము దోషనిరసనము మన వాఙ్మయములో లేవని కాదు. కాని, విమర్శన మను మాట దోషప్రకటనమునే సూచించెడిది. గుణములను దెల్పునవి వ్యాఖ్యలనాఁ బడినవి. విమర్శకుఁడు గ్రంథకర్తకు విరోధిగాను వ్యాఖ్యాకారుఁడు హితుఁడుగాను ఉండురని ప్రతీతి. అట్లుగాక గుణదోషములు రెంటిని బయటకుఁ బెట్టినపుడే విమర్శకునియొక్క నిష్పాక్షికత్వము స్థిరపడును.

నేఁటి కాలమునఁగూడ నిష్పాక్షికత్వపు వన్నెచిన్నెలను బూని పాక్షికత్వము నిరసనము అసూయ యను లోపములు కనుపడుచున్నయవి. మేముగూడ పయిఁ దెల్పిన లోపములుకల విమర్శన వ్యాసములు ప్రకటింపవలసి వచ్చుచేండును. మా వేడికోలు నంగీకరించి యిఁకను ఈ కార్యస్థానమునకుఁ గేవలము నిష్పాక్షిక విమర్శనలనే పంపవలయు నని తద్వ్యాసకర్తలను బ్రార్థించుచున్నాము.

—:0:—

# స్వీకారము

## మా కార్యస్థానము నలంకరించినగ్రంథములు

నాకాభంగము:—గ్రంథకర్త, వఝ్ఝల - వేంకటేశ్వరకవిగారు, బి. ఏ. జయపూర్ విశాఖపట్నంజిల్లా.

నెలవంక:— ఖండకావ్యము. —గ్రంథకర్త ఆవంత్స వేంకటరంగారావుగారు, బి. ఏ. బి. ఇడి. విజయనగరము.

బ్రాహ్మణగీత:—(భావకవిత్వము,) పండిత బులుసు రామజోగారావుగారిచేఁ బ్రణీతము వెల. 0—8—0,

సరోజిని:—ఆంగ్లమున కనువాద పద్యకావ్యము. గ్రంథకర్త, అనంతపంతుల వేంకటేశ్వర్లుగారు. బి. ఏ. బి. ఎల్ పార్వతీపురము,

శుక్లపక్షము:—ఖండకావ్యమంజరి—వెల 1-0-0. గ్రంథకర్త అనంతపంతుల రామలింగస్వామి గారు. గ్రంథము ప్రతులు పార్వతీపురము - డాక్టరు. అనంతపంతుల సూర్యనారాయణగారికి వ్రాసి తెప్పించుకొనవలెను.

భోజకుమారము - నాటకము, గ్రంథకర్త తాడూరి లక్ష్మీ నరసింహరావుగారు, రాజమహేంద్రవరము, వెల అణాలు 12.

నిర్వచన భారతగర్భ రామాయణము: — పద్యకావ్యము. గ్రంథకర్త రావిపాటి లక్ష్మీనారాయణగారు. డెమ్మి 66 పుటలు. రఫ్ కాగితము వెల రు 0-8-0 గ్రంథములు వలయువారు గుంటూరు జిల్లా గురుజాలలోనున్న గ్రంథకర్తగారికి వ్రాయవలెను.

హారశతకము. — గ్రంథకర్త కవిరాట్టు హనుమత్కవి. క్రౌను 25 పుటలు. రఫ్ కాగితము. వెల 4 అణాలు. వలయువారు "అవ్వారి సుబ్రహ్మణ్యశర్మగారికి శ్రీశారదా గ్రంథాలయము, వంగిపురము, ప్రత్తిపాడు పోష్టు, బాపట్లతాలూకా, గుంటూరుజిల్లా" అని వ్రాయవలెను.

౧. నవ్వగలవా? ౨. పెళ్లాన్ని యెలాపిలవడం?

పై రెండింటికిని కర్త కాంచనపల్లి వెంకటరంగారావుగారు మొదటిదాని వెల 0-0-9 రెండవదాని వెల 0-1-0 వలయువారు, గ్రంథకర్తగారికి, బరంపురమునకు వ్రాయవలెను.

## మా కార్యస్థానము నలంకరించినపత్రికలు (మునుపు తెలిపినవికాక)

సత్యవాణి:—అనకాపల్లి, ప్రతి ఆదివారము ప్రచురింబబడును. సంవత్సరము చందా 2—0—0.

వైద్యప్రదీపిక:— మాసపత్రిక:— బ్రాడీపేట, గుంటూరు, ప్రతిఇంగ్లీషునెల 15 వతేదీని ప్రచురింపఁబడును. చందా॥ సం॥ ౧ టికి రు. 2—0—0,

రవి:—కాకినాడ,—వారపత్రిక.— ప్రతిగురువారము ప్రచురింపఁబడును. (క్రైస్తవపత్రిక)

ప్రాథమికపాఠశాల:—విద్యావిషయక మాసపత్రిక సం॥ చందా 1-8-0 ఘంటసాల, కృష్ణాజిల్లా.

భక్తిప్రబోధిని—భక్తిజ్ఞాన విరాగముల నుపదేశించు మాసపత్రిక సం॥ చందా రు. 1-0-0 విడిసంచిక అ. 2. లు. ఇది గుంటూరు సందలి శ్రీరామకృష్ణ పూజామందిరము తరఫున ప్రకటింపఁబడుచున్నది.

సంపుటము ౧

సంచిక ౭

# చాంద్రిక

## సచిత్ర మాసపత్రిక

భావ సం॥ భాద్రపదమాసము

సెప్టెంబరు 1934.

ఆనంద ముద్రణాలయము,

మద్రాసు.

౧౯౩౪




—:o:—

—:o:—

# చి త్ర ము లు



---

482 పేజీ తరవాతనున్న చిత్రము పేరు "జుబీడా కన్య - సినీమానటి" అని చదువుకొనునది.

సం. చంద్రిక.



పల్లెపడుచు

[చిత్రకారుఁడు, ఎస్. [illegible]]




| సంపుటము | చెన్నపట్టణము, సెప్టెంబరు, ౧౯౩౪ | సంచిక |
| --- | --- | --- |
| ౧ | శ్రీ భావ సంవత్సర భాద్రపదమాసము | ౭ |

# హరివినోదము

కవికొండల - వేంకటరావుగారు,

మాయకు మాయవై కడు నమాయక వృత్తి వహించు వాఁడెవం !
డాయువు కాయువై లయ భయాకృతి నెవ్వఁడు నాట్యమాడు ; క
న్మాయక మూసినట్లిరుల ముంచు జగాళి నెవఁడు ; నిత్య మా
జ్ఞేయు, నమేయు, వాజ్మయు, విచింతననేతు ముముక్షు సంగతిన్.

బమ్మ తపస్సు నారదుఁడు భక్తి రసంబొలుకంగఁ బాడు గీ
తమ్ము, మహాత్మ ! యర్జునుఁడు, దామును నీదు ప్రబోధచేత యు
ద్ధమ్మునఁ జూపినట్టి పస, దగ్గఱ దవ్వన కుండ నగ్గజేం
ద్రమ్మటవిన్ బయల్ తలచి, రక్షయటన్న మొఱల్ ప్రసాధనాల్.

మోహవిముక్తులౌ మునుల మోహము వెంచి పదాఱువేల స్త్రీ
దేహములన్ సృజించి యల దివ్యశరీరము లాడు శోభచే
నూహకు మించఁ దాను నయ నోత్సుకుఁడై తమిఁ బిల్లగ్రోవితో
శ్రీహరి గేయమూదె నట, చిత్తములందుఁ బురాకృతం బఱిన్.

గాథల్ లేవనఁ బోకుమెందు హరి సద్గాథాళి కోటాన కో
ట్లాథల్ వ్యాధులు ఖేదభేదములు మాయంబౌ నటుల్ చేయఁ బో!
'రాధావల్లభ!' యన్న నీహృదయ సామ్రాజ్యమ్ము నేలుం గృపన్
బాధల్ నేరవు; భాగ్య యోగ్యతలు సంబాళించు నీకోసమై.

ప్రేరేపింపకు రానివారలను సుస్వేచ్ఛన్ వచ్చువారిన్ సఖా!
వారింపం బని పెట్టుకోకు, నిజమే వాక్యార్థ మందున్నదో
యేరిన్ వారినె చూచుకోమనుము నీ వెందున్ జగంబందు నీ
పేరూర్ కోరను జెప్పఁబోకు పరమున్ విశ్వేశుఁ గీర్తించుకో.

విదురుఁడు విందు సేసెనఁట వేదవిదుండు పరాశరుండు దాఁ
బాదుపుగఁ బెంచి భాగవతమున్ ముగియించిన వాడటంట, నా
రదుఁడును దుంబురుండును నిరంతరమున్ హరిఁగూర్చి భక్తిఁ బా
డెదరఁట మించి మైమఱచి, యెం దవివేకులె వారు సెప్పఁడా!

ఘనతరమా పురాణముల, గాథల, నాటల, నాటకంబులన్
వినఁబడునట్టి దొక్కటియ, విశ్వ మనోహరుఁడైన దేవు స
ద్గుణమ, కనంగవచ్చునది, దోఁచున దొక్కటె యమ్మహాత్మక
ల్పనమ, తదర్థమే యెచటి భాషలు వేయివిధాల వ్రాసినన్.

జేనెడుపొట్ట, నోరుమఱి చిన్నది, వీనికిఁ గాను తిండినిన్
మానుగఁ గూర్చికొంచు, నొక మాఱు నినున్ దలపోసికొనిచో
మానిసి మానిసే నిలువు ప్రమానగు గాని మహామహుండ! సు
జ్ఞానము వొందకున్ననొక సన్నికలో యొకరోలొ గాని తా.

రుచులారున్ను గుణత్రితయమున్ (?) రూపింప నీకెన్నియో
పచియింపం గలవారు భేదములతో భావించుకొంచున్ ప్రజల్;
రుచులారింటికి మూలకారణుఁడొకండో వెఱ్ఱులారా! యనన్
రుచిలేనట్టిఁ దనంగనేరువరు కల్లోలాత్మకుల్ గావునన్.

దాచేవాఁ డెవఁడయ్య నీవిభవమర్థంబట్లు కోశంబులన్ ?
దూచేవాఁ డెవడయ్య నీ బరువు సత్తుంబోలెఁ దక్కెళ్లలో ?
చూచేవాఁ డెవడయ్య నీ విలువ మంజూషంబుతా రాపిడిన్ ?
వేచేవాఁ డెవఁడయ్య నీకొఱకు విశ్వేదేవ చాకుండఁగా ?

# నేఁటి సాహిత్యము

ఆంధ్రభాషను 'తల దిమ్మెత్తించిన ప్రాత పద్ధతు' లనుండి బయటబడవైచి నవజీవనము నాపాదింపఁజేయుట కుత్సాహ సంశోభితులగు నాంధ్రకుమారులు పాతికవత్సరములనుండి నిరంతరము పాటుపడుచున్నారు. 'వ్యాకరణపుచట్రము' నుండి తొలగించి భాషాయోషామణిని విశాలలోకరంగమునకు దోడితేర నాంధ్రయువకులు పెక్కురు అప్పారాయ - రామమూర్తిపంతుల యండ నిలిచి యోధానుయోధులై - యా చట్రమును నలినలిచేసి జయజయారావముల నొనర్చుచున్నారు. ఇప్పుడు భాషాసతీమణికి సంపూర్ణ స్వాతంత్ర్య మబ్బినది. శబ్దరూపమగు శరీరమును ఎవరియిష్టము వచ్చినట్లు వారు తమతమ యభిరుచుల కనుకూలముగ నిర్మించుకొనవచ్చును. సరి. ఇంతటితోఁ బని తీఱినది.

దేశమున గవికుమారులు వేనవేలు ప్రేమగీతములను నిస్తంత్రికముగ నాలపించుచున్నారు. మండలులు - పరిషత్తులు - సంఘములు వెల్లి విరిసినవి. కవితా కలాదిశబ్దపూర్వక కుటీరములనుండి మధుర గీతామృతములు జాలువాఱుచున్నవి. పత్రికలును కొలదియో గొప్పయో యుప్పతిల్లి యాంధ్రసీను నటియింప దొరకొన్నవి. అయినను వడ్లమూడి - వేంకటరత్నముగారు, చేసినదేమి ? 'భాషకు ప్రాతతీరులు పనికిరావు. క్రొత్తసొగసులు - పోకడలు గావలయును. అయినచో నెంతవఱకబ్బిన దీ క్రొత్తహొయలు ? అనుట విచార్యము.

పూర్వపు కవిసత్తములు వాఙ్మయారామమున నొక పద్యగద్యసరణిని సంచరింపగా నేటి కవికుమారులు గీతములు, కథలు, పాటలు, పదములు, మున్నగు ననేక పథముల విహరించుచున్నారు. పూర్వు లాశ్వాసముల కొలది యనేకవేల గ్రంథములను నిర్మింపగా నపూర్వులు హ్రస్వరూపముల నలవరించి యలరించుచున్నారు. సనాతనులు విస్పష్టముగ వావిడిచి విలపింపగా నధునాతనులు అవి ముక్తకంఠమున చాటుమాటుగ బందేవనము సేయుచున్నారు. వారు గబ్బిగుబ్బెతలనుబట్టి ఎదుటనిలిపి యంగప్రత్యంగములను సాంగోపాంగముగ వర్ణించి వర్ణించి పాఠకులకానందము గొల్పగా వీరు తమ వలచిన కాంతామణి యెడబాటున కోరువలేక కుమిలి కుమిలి రసికుల హృదయమునకు జాలి గొలుపుచున్నారు. ఇది ఆంధ్రసాహిత్యమున కిప్పుడు గలిగిన క్రొత్తదనము.

'కవిశుకములు కవిపికములు కవిశారికలు రసోన్మాదమున నెలుగెత్తి పాడుకొందురు

గాని యవి లోకముకొఱకు గాదు, అందురు. నిజముగ నటులే యయి యిట్లు పత్రికలు నింపక, గ్రంథకుసుమములను విరియింపక లోకమున కుద్దేశింపక తమ రసోన్మత్తగానములను మారుత తరంగముల నధిరోహింప జేసి విశాలాకాశరంగమున విహరింప బంపి నచో లోకమునకు జిక్కులేశమేనియు లేదు. అట్లుగాక యిన్నివిధముల - ఇన్ని స్వరముల- ఇట్లు ఎడతెఱపిలేక కుమలి కుమిలి యేడ్చుచున్నచో ఎంత నోరువిడిచి బయట బడకున్నను పాపము! లోకము చీకాకునొందు - పాషాణహృదయమైనను బ్రద్దలయి సమాశ్వాసరూపమున స్రవియింపకపోదు. 'సరసకవితాలతాంగిని సరసజేర్చి పాడుకొనుచుండుగవియును బ్రణయగీతి' అనారత మాలపించుచున్న యీ ప్రణయగీతులతో పాపమాలతాంగియు ననురునరై యడలిపోక మానదు.

కవితజాతియొక్క హృదయతత్త్వమును విస్పష్టరీతుల బ్రకటించుచుండును. పూర్వాంధ్రవాఙ్మయమున (ముఖ్యముగ 17 18 19 శతాబ్దులలో) శృంగార రసవాహిని తెప్పలు దేలుచు బాఱుచుండుటకు గారణ మానాటి రాజన్యు లన్యకార్యములను విస్మరించి యంతఃపురరంగముల విలాసినీలలామల సరాగములతో మునిగి తేలుచు లోక మెఱుగక కాలము పుచ్చుటయే యని చారిత్రక విజ్ఞాను లందురు. ఆంధ్రరాజన్య శిఖామణులు ఈయపయశకి కలంక దోషదూషణకు బాల్పడుట యొకప్పుడు మగధ సామ్రాజ్యమునునయిత మేకచ్ఛత్రముగ నేలుబడి చేసితిమని విఱ్ఱవీగు నాంధ్రులకు తలవంపులు గాకపోదు. కాని యా సాహిత్యమువలన నానాటి జనసామాన్య హృదయవాంఛలను-ప్రవృత్తులను - మన మెఱుగరాదు. ఆ వాఙ్మయమునకు మహీపాలకులే మూలస్తంభములుగ నుంట యిందులకు గారణము.

కాని నేడట్లుగాదు. పాలకులకు భాషతోడి సంబంధము బాదరాయణము. కాన వాఙ్మయమంతయు దేశసామాన్య హృదయమును బ్రకటించుచుండును. చూడుడు.

'ఆ చెట్టుక్రిందుండు ఓ చిన్నదానా! పై చెట్టుక్రిందుండు ఓ పడుచుదానా!' అని పిలిచి 'మల్లెమొగ్గ కావాలంటే మంచినీళ్లకు రావా లోసీ! వచ్చి పావంచాలకాడ ముచ్చటాడీ పోవాలోసీ' అని సంబోధించు కవికుమారుల గీతములు నిత్యము మనకు చెవులలో గింగురుమనుచుండును.

'పదియేలసారులే బమ్మదేవుణ్ణి యేదుకొంటున్నాను జోడు కలుపంగ దిగులోదిలివుండవే సూరీ నీకింక దిక్కునే నాతానె సూరీ!' ఈ 'సూరి' యెంకికి తోడికోడలు. ఆమెను బోలియే యీమెయు కావలెనని యనుభవించు దిగులును మన మానసములను చిలికించి రాల్చుచుండును. దీనరక్షణకై యాంధ్రకవివృషభములు కనబఱచు నుద్వేగమును లోకమునకు జాటుచుండును.

'వలదేలా నన్నీ త్రిప్పుల బెట్టెదవు తరుణీ విముగ్ధేక్షణ శృంఖలలన్ బూవుల హారమ్ములటంచు మెడదవిలించి పారిపుచ్చెదవా!' అని కవులు పూవులు హారమ్ములను భ్రాంతితో శృంఖలలను మెడ దవిలించుకొని పారిపుచ్చకుమని ప్రార్థించుచు దయనీయులగుచున్నారు.

'ముగ్ధహృదయను నన్ను సమ్మోహవార్ధి భంగముల ద్రోసిపోవగ బ్రదుక గలనె ... ... ప్రాణమ్ము విడుతుగాక ' అని వీడుకొనునట్లు ముగ్ధహృదయలను గూడ వార్ధిభంగముల ద్రోసి బ్రదుకు మీద నైరాశ్యము గలిగించి ప్రాణమ్ములు విడుచు నవసరములను గలిగించుచున్నారు.

'నీకండ్లసౌఖ్యంబు నెగడొందుగాత! మేను నాకౌగిళ్లలో నుండుగాత! నీమోవి నాముద్దు కామించుగాత!' అని యాశీఃపరంపరలతో కవికుమారుఁడు తన యుదారహృదయమును వెల్లడించుచున్నాడు.

'ఇదె వచ్చుచున్నాఁడు ప్రియురాలా! ఇక నిలువలేను నాప్రియురాలా! ప్రేయసీ! ప్రేయసీ! ప్రియుడనే! ప్రేయసీ! వేయికన్నులు దాల్చి వెదుకుచున్నానే! ' అని తన్నంగీకరింపక తిరిగియైన చూడక పోవుచున్న యువతీ మణింగని భీతహరిణము వెంటాడు గండు బులివోలె—'నన్ను పెండ్లాడవే చెంచీత' అని దరువు వేయుచు వెంటబడు నరసింహుని వలె—వెన్నాడుట యాంధ్రకవి సామాన్య లక్షణముగా గాననగుచున్నది. ఈమార్గము ననుసరించియే. 'నిన్ననుసరించుచు నుండెనోఁ-వెనుదిరిగి చూడకపోకుమా - అతనిం గడు వంతబెట్టగ లేదెదీ మరిలాభమూ-నది తలచి చూడంగన్ - ఏమిటిది మతిపోయెనా—నీకేమిటికి సిగ్గూ-మరియెందుకీ బెదురూ ... ' అని యొక యాంధ్ర మానినీమణి తన చెలిమికత్తెకు హితము నుపదేశించుచు నాంధ్రత్వమును బచరించుచున్నది. (ఇవి రసవంతములా కావా యను చర్చగాదిప్పుడు)

ఇట్లొకటిగాదు; వేనవేలు గీతములు, కథలు, నాటకములు, ప్రహసనములు ఆంధ్రుల కామ ప్రవృత్తిని భోగలాలసతను వెల్లడించుచున్నవి.

నేటివాఙ్మయమును జదివినచో ఆంధ్రులెల్లప్పుడు కూటికి గుడ్డకు కరవయ్యు, పరులకు బానిసలయ్యు, భావతరంగములలో నూయేల లూగుచుందురు. వారికి ధైర్యసాహసములు కరవులు. కార్యపటుత్వము కల లోని వార్త. రేయింబవళ్లు తమవలచిన యొక కామినీ ముఖమండలముం గాంచుచు గాంచుచునుండి - యంతటితో దనివి దీఱక 'కళల నీనుచు ముద్దులొలుకుచుండెడి యంగకముల గన్నారంగ గాంచనిమ్ము ' అని వేడుకొనుచుందురు. ఆడుదాని పొడగాంచినంతనే ' రేయెల్ల నిద్దుర లేదుగావలెను రక్తిమను గ్రమ్మె నీదు నేత్రాంతములను ' అని యడుగుచు నామె పెడమొగమై పోవుచున్న యొక

'నింత మైకమ్మదేల ? యని నిందించుచు 'నుంత విని సంతసింతు వచింతువొక్కొ-'! యని ప్రార్థించుచు చేతులు జోడించుకొని వెన్నాడుచు 'నాదుగుండె పొగలై నది వాడియు వత్తలై నదిగా' అని తనధైర్యము నెడ నించుక జాలిగొలుప పలుపాటలు పాడు చుందురు. ' అని యితరులకు దోచుట సంశ యమా ?

పోనిండు. 'ఇతరు లేమనుకొన్న మనకేమి కొఱత? ఆంధ్రజాతి పరులయాటు పోటుల కడలెత్తి పలాయనమంత్రము పఠించునది కాదని సంతసింతుము. కాని యాంధ్రకుమారు డొకడు నేటి సాహిత్యముం జదివినచో నతని కానువంశికముగ నున్నబలము- ధైర్యము- కర్తవ్యనిర్వహణశక్తి - అవమానాసహనము నున్నగు గుణములకు ప్రచండ సూర్యాతప మున వాడి - తలకూడి యెండిపోవు కోమ లాంకురముల గతిపట్టక తప్పదు.

దీనిని . జదివిననాటనుండియు నతనికి హఠాయలు మీఱు డిలుగు వలువలు దాలిచి నవనాగరకతా ప్రమాణములగు విలాసవస్తు నుపయోగించుచు ఎవతెనేని యొక చక్కని చుక్కను విలాస సంశోభితను, సధవనేని, విధవనేని యొక ధనవతిని దగుల్కొని తన తాతతండ్రులు సముపార్జించిన ధనమునుగొని యేని "త్యాగ" మొనర్చియేని యేదే నొక పట్టనమున నీచంచల ప్రపంచమును మఱచి యాప్రేమమూర్తి యడుగుదామరల పొంత తన్మయతతోడ నమరలోక సుఖముల ననుభవించుట కంటె ధన్యత మఱిలేదు 'అను తలంపు వొడమక యుండునందురా ?

ఇటులంటిమని శృంగారమునకు 144 సెక్షనునో ఆర్డినెన్సునో ప్రయోగింప వలయు ననిగాని, యావజ్జీవ ద్వీపాంతరవాసమో - మరణదండనమో విధింపవలయు ననిగాని మాయాశయముగా భావింపరాదు. కాని అదియే పరమార్థముగాదు. ఈపిటికీమందుకో యువకుల కోమలహృదయ క్షేత్రమునందు నవనవలాడు ధీరతాది గుణాంకురములకు స్వస్తి చెప్పరాదు. పసితనమునుండియు "కాంతాధరమేయమృతము. కామినీసౌఖ్యమే సౌఖ్యము. అదియే మన తరణోపాయము. అదియే మన గంతవ్యము; దానికంటె మఱి గతిలేదు," అని బోధించుచున్నచో జాతి సగ ముచచ్చి యున్నజాతి యనతికాలమున రూపు మాయుననుట యబ్బురమా ?

శృంగారమునకు ప్రేమయను నామాంత ర మొసంగి చక్కెరపొదవిన విషగుళికలను యువకుల కొసంగి తన్మూలమున దేశమునకు, జాతికివిషప్రయోగముసేయుట సమంజసమా?

---

# శబరీనిరీక్షణము*

కవిశాబ్దిక జయంతి - పట్టాభిరామశాస్త్రిగారు,

మ. నునుపుం జెక్కులి నూగుమీసమును వెన్నుం దన్ను తూణీరముల్
వినువీథిం గనునట్టి కోరసిక మార్విం దించి హస్తాగ్రమం
దున లీలం గొనినట్టి చాపమును సద్యోజాత కారుణ్య శో
భనమౌ వక్త్రము రాచేకట్టమరు నాస్వామిన్ హరిం గాంతునే.

చ. దరిదరిఁ దానవాధముల దారులఁ గొంచి, కృపాణియౌచు సో
దరుని పురఃపదంబున వ్యథాజనకంబగు కంటకాదికం
బరయుచుఁ ద్రోయు లక్ష్మణుని హస్తముఁ బట్టి పురాణగోష్ఠి కా
దరమున వచ్చు శ్రీపతినిఁ దాశరథిన్ వనిఁ గాంచేనేర్తునే.

చ. పసిఁడి మెఱుంగులం జిలుకు పచ్చడమట్టులు వల్కలంబు సం
తసమునఁ గట్టి కౌస్తుభవిధంబునఁ గాననగుచ్ఛముల్ ధరిం
చి సకల హేతులన్ విడిచి చేత శరాసన ధారియౌ విభా
వసు కులభూషణుం గనెడు భాగ్యము నే నెటులందనేర్తునో.

శా. బారుల్ తీరిచి పున్నుపుట్టువులు సంపన్నప్రసూనాచ్ఛ భా
కారచ్ఛత్రముఁ బట్టఁ గుంజలతికా కాండంబు గుచ్ఛాళి సాం
పారన్ వీవఁగ ఝంచరీక రవముద్యద్వంది కంఠారవం
బై రాజిల్లగ వచ్చు రామునిఁ ద్రిలోకారాధ్యునిం గాంతునే.

ఉ. ముంగలఁ గాసికోక తుది ముత్యపుకుచ్చులు వ్రేలఁగాఁ గటీ
భంగికరత్న ముష్టిక కృపాణము వ్రాలఁగ గాకపక్షముల్
ముంగురు లేకమై యొక యపూర్వ రుచిం బ్రకటింపఁ గాలమే
ఘాంగము వానిఁ జ్యాకిణిత హస్తము వానిఁ గనంగనేర్తునే.

---

* నాచే రచింపంబడి ప్రకృత మముద్రితముగానున్న (శబరి)అను నాటకములోనివి—జ. ప. శాస్త్రి.

# తెనుఁగు లక్షణము: కారకపరిచ్ఛేదము

పూతలపట్టు - శ్రీరాములు రెడ్డిగారు,

తెనుఁగు వ్యాకరణమునఁ గారకపరిచ్ఛేదము సామాన్యముగా బాలురకు విసుగును బుట్టించునది. మెదడునందును నిలువనిది. తమవ్యవహారమున నిర్దుష్టముగ విభక్తి ప్రత్యయములఁ జేర్చి మాటాడఁగలిగిన వారు సైతము కారకపరిచ్ఛేదముం జదువునపుడు తాఱుమాఱు పడుచున్నారు. ఏసందర్భమున నేవిభక్తియో సాహసించి చెప్పలేక శాస్త్రిముఁ జూచిచెప్పవలసి యుండు ననుచున్నారు. అనేకుల కిది కంఠస్థము గాక యుపదేశకాలమునఁ జిక్కులు గలిగించుచున్నది.

ఇంతకుం గారణము విచారింపఁగా నొక్కొక్క విభక్తి ప్రత్యయము లొక్కొక్క విధమగు సందర్భమున నుపయోగింపఁ దగినట్లుగాఁ గూర్పఁబడి యుండ లేదు. ఇంచుమించుగా నన్నివిభక్తులును నొకటి కొకటి పొసఁగుచుండుటం జేసి యిది విద్యార్థుల చిత్తము కలఁత వాటించు చున్నది, "కాశికి రామేశ్వరము దక్షిణము; కాశికంటె రామేశ్వరము దక్షిణము" కాశికి అనిన షష్ఠియగుచున్నది. కాశికంటె అనఁగా పంచమి యగుచున్నది. "రామునివలన రావణుఁడు చచ్చెను. రామునిచే రావణుఁడు చచ్చెను" వలన పంచమి; చే తృతీయ. "తీర్థమాడెను. తీర్థమునాడెను. తీర్థమందాడెను." ఇందు మొదటిది ప్రథమ; రెండవది ద్వితీయ; మూఁడవది సప్తమి. ఇట్లొకటి కొకటి మఱి యొకటి వేఱొకటి వచ్చుచుండుటచేత ఏప్రత్యయము లేకారకములో స్థిరత్వము లేక పోవుటచేత బాలురకు దురవగాహ మగుచున్నది. బాలురకే యననేల? ఇతరులకు సైతము నెమ్మదినీయఁజాలకున్నవి. శబ్దశాస్త్రి కర్తలు తెనుఁగు తల్లి తీరుతీయములఁ గమనించుట యందంతగా నవధాన ముంపక సంస్కృతవ్యాకృతిని ముందుంచుకొని యాచూపును వేఱునంకకుఁ ద్రిప్పక యాంధ్రభాషాయోషయెడకు సంస్కృత వ్యాకరణ సూత్ర దామముం దగిల్చి యామె వెనుక కీడిగిలఁబడుచున్నను, బలవంతముగా నీడ్చుటచే నిట్టి చిక్కులు వాటిల్లెఁ గాఁబోలు?

ఇట్టి చిక్కు తొలఁగు మార్గము లేదా యని చాల కాలమునుండి నామదికి విచారము గలుగుచుండెడిది. విచారింపఁగా విచారింపఁగా నాయల్ప బుద్ధికిఁ దోఁచిన యంశముల నిందుఁ బొందుపఱచుచున్నాఁడను. ఇయ్యది సిద్ధాంతముగాదు. చర్చనీయము. ఈ మార్గము సమంజసమని పెక్కండ్రకుఁ దోఁచినచోఁ బిదపఁ దనంతనే యది నెక్కొనఁగలదు. కాదేని పెద్దలచే సమంజస రీతిని సంస్కారము నొందినదైన శోభిల్లఁగలదు గదా!

| విభక్తులు. | ప్రత్యయములు. |
| --- | --- |
| ప్రథమావిభక్తి | ఉ, డు, ము, వు, లు, [మొదలగునవి |
| ద్వితీయావిభక్తి | ని. ను, ల, కూర్చి, గుఱిచి. [గుఱించి, కొఱకు. |
| తృతీయావిభక్తి | అన్, చేత, చే, చేసి, తోడ, [తో, మై, మెయి, మయి, కి, కు. |
| చతుర్థీవిభక్తి | కి, కు, కై, కయి, కొఱకు, [కోసము, కోసరము, పొంటె, వలన, |
| పంచమీవిభక్తి | చేత, చే, చేసి, వలన, కంటె. [కన్న కి, కు, పట్టి, ఉండి, తొట్టి, కొలె, కోలె, ఎడ. |
| షష్ఠీవిభక్తి | ని, కి, కు, ఒక్క, లో, లోపల. [అందు, |
| సప్తమీవిభక్తి | అన్, అందు, న, లో, లోపల, [ఉండి. |
| సంబోధనప్రథమా విభక్తి | అ, ఆ, ఇ, ఈ, ఉ, ఆర, [ఆరా |

ఈ ప్రత్యయములలో ౧ పదములు ౨ అపదములు 3 మిశ్రములు అని ముత్తెఱఁగులు.

౧. పదములు.(అర్థములు గలవి) కూర్చి, గుఱిచి, గుఱించి, చేత, చే, చేసి, తోడ, తో, మై; మెయి మయి, పొంటె, వలన, పట్టి, ఉండి, తొట్టి, కొలె, కోలె, ఎడ, ఒక్క, లో, లోపల, అందు.

౨. అపదములు. (అర్థములేనివి. కేవల ప్రత్యయములు.) ఉ. డు, ము,వు, లు, ని, ను, ల, అన్, కి, కు, న.

3. మిశ్రములు (అపదములతోఁ బదములుచేరఁగా నేర్పడినవి) కై, కయి, కంటె, కన్న.

ప్రథమావిభక్తి - కర్తృకారకము.

కర్తయగు పదము ఈ విభక్తిప్రత్యయములఁ బొందును.

ఉ. వాకు, వాక్కు, మనసు, మనస్సు. మొ.

ఉప్రత్యయ గ్రహణముచేత 'ము వు' ప్రత్యయములయావశ్యకము చాలవఱకు తగ్గిపోవుచున్నది.

వనమ్—ఉ=వనము. వధూ—ఉ = వధువు. దీర్ఘము కుఱుచయై యణాదేశసంధివశమున వకారము వచ్చినది. డు ము వు లను గూర్చి చర్చింపవలసిన దిప్పుడు గాదు.

మొదలగుననుట డు ము వు రాని ప్రథమాంత పదము లెక్కువ వంతు తెనుఁగునఁ గలవు గావున వానిని గూర్చి వివరింపవలము ననుట సూచితము. నేమ ద్వితీయయనియు, కంటె (ఆభరణము) పంచమి యనియు, అన్న పంచమియే యనియు, నందు సప్తమి యనియు, భ్రమింపని బాలురు లేరు. డు ము వు ప్రత్యయములు రాకున్నను నామపదముల తొలి రూపములు కర్తగా నేర్పడినవి. ప్రథమాంతములే యని చెప్పవలయు టవసరమై యున్నది.

ద్వితీయావిభక్తి - కర్మకారకము.

క్రియతో నన్వయించు కర్మను సూచించు ప్రత్యయములను గలది.

ని॰ రాముని ధ్యానించుచున్నాను.

ను. గురువును, సీతను, వనమును.

ల. రాములన్, వనములన్. (బహుత్వమందులు+అన్ = లన్) కూర్చి. రామునిగూర్చి ధ్యానించుచున్నాను. కూర్చు+ఇ కూర్చి. క్త్వార్థకక్రియ. కూర్చి = తలంపునఁ జేర్చి.

గుఱిచి, గుఱించి రామునిగుఱించి ధ్యానము.

మోక్షముంగుఱించి యత్నము.

గుఱి+ఇంచు = గుఱించు, లేక, గుఱి+ఉంచు= గుఱించు. పూర్వ రూపసంధి. దీనికి క్త్వార్థరూపము గుఱించి. రూపాంతరము గుఱించి. అర్థము స్పష్టము.

కొఱకు. వర్షముకొఱకు యత్నము (వర్షముంగూర్చి యత్నము) కొఱ+కు=కొఱకు ప్రయోజనమునకు- వాని కొఱకు = వాని ప్రయోజనమునకు, వాని లాభమునకు.

తృతీయావిభక్తి - కరణకారకము.

క్రియలో నన్వయించు సాధనములఁ దెలుపు ప్రత్యయములు గలది తృతీయ.

అన్. కంటన్, పంటన్, కత్తింగొమ్మను నఱికెను. ఇందు ప్రత్యయమందలి అకారమునకు లోపము,

చేత, చే. పంటిచేత, పంటిచే.

చేసి. నీవుండుటంజేసి (=నీవుండుటచే) సుఖింప. [గల్గితిఁ

తోడ, తో.. నీతోడ నీతో

మై, మెయి, మయి. శ్రద్ధమై. శ్రద్ధమెయి, శ్రద్ధ
[మయి.

కి, కు. రామునికి, రామునకు. [అతఁడు రామునికి సమానుఁడు.] అతఁడు రామునితో సమానుడు.]

చేయి+అన్ = చేతన్. ఇదిచేయిశబ్దమునకు తృతీయాప్రత్యయమగు 'అన్' చేరఁగా నేర్పడిన రూపము దీని సంగ్రహరూపముచేన్. (చే+అన్) రామునిచేత రావణుఁడు గూలెను. రామునిచేత అనఁగా రాముని చేయి సాధనముగా నని యర్థము.

చేయు+ఇ= చేసి. క్త్వార్థకక్రియ.

నీవుండుటఁ జేసి సుఖింపఁగల్గితిని· నీ వుండుటను హేతువుగాఁ జేసికొని—లేక—సాధనముగాఁ జేసికొని సుఖింపఁ గల్గితిని అని భావము.

తోడు + అన్ = తోడన్. దీని సంగ్రహ రూపములోనీతోడ వచ్చెదను=నీవు తోడుకాఁగా—లేక —నీ సాహాయ్యమున వచ్చెదను, కత్తితోఁ జెట్టును నఱికితిని.

మై+అన్ = మై. మెయి=అన్ = మెయిన్. మయి+అన్ = మయిన్ మై, మెయి, మయి=శరీరము, అంగము. శ్రద్ధమై వింటిని=ఒక అంగముతో శ్రద్ధగాని వింటిని. శ్రద్ధకు శరీరము సాధకము కాఁగా వింటిని.

## చతుర్థీవిభక్తి - సంప్రదానకారకము.

క్రియతో నన్వయించు కారణమును దెలుపునది.

కి. ఏమిటికి వచ్చితివి?

కు. ఎందులకు వచ్చితివి?

కై. ఎందులకై వచ్చితివి?

కొఱకు. ఎందుకొఱకు వచ్చితివి? జగముల రక్షించుకొఱకు రాముఁ డవతరించెను.

పొంటె·జగముల రక్షించుపొంటె రాముఁ డవతరించెను.

కోసము, కోసరము. జగముల రక్షించుకోసము రాముఁ డవతరించెను.

వలన. అతనివలన నన్నుఁగరుణించె (అతని కొఱకు నన్నుఁ గరుణించె)

కి+అయి=కయి. రూపాంతరము కై అగు ధాతు క్త్వార్థకరూపము అయి.

పొసంగుటకు+ఎ పొంటె. సంధినివర్ణలోపము. రక్షణముకంటె=రక్షణము పొసంగుటకె. లేక

పో+అంట+ఎ=పొంటె రక్షణము పొంటె=రక్షించుటకు పామ్మని ప్రార్థించుటే కారణముఁ గొని.

ఇట్లిది కళ గావలసియున్నది. ద్రుతాంతముగా వాడుకలో నున్నది.

## పంచమీవిభక్తి. అపాదానకారకము.

క్రియలతో నన్వయించు గుణములకు హేతువులఁ దెలుపునది.

చేత, చే, దొంగలచే భయముగలిగె. ఇటఁ గలిగినది భయము. క్రియాగుణము. అది ఎవరిచేఁ గలిగె? దొంగలచే కావున 'దొంగలు' శబ్దమునకుఁ బంచమి వచ్చెను.

వలన. దొంగలవలన భయముగలిగె.

కంటె. రంగనికంటె రాముడుపెద్ద

కన్న. రంగనికన్న రాముఁడు పెద్ద.

కి, కు. రంగనికి రాముఁడు పెద్ద. కృష్ణుఁడు నీకుఁ జిన్నవాఁడు.

పట్టి. విద్యనుబట్టి గౌరవము కలుగును.

ఉండి. వానినుండి కడతేఱితి. = వానివలనఁ గడతేఱితి.) ఆ యూరనుండి వచ్చితి.

కోలె, కొలె. నాఁటఁ గోలె, నాఁటఁ గొలె.
[నాఁటనుండి

తొట్టి. సురపతిఁ దొట్టి సురలెల్ల వచ్చిరి.

చేసి. నీవుండుటఁజేసి సుఖపడితిని. (వలన)

ఎడ. దొంగలయెడ భయము.

వలను+అర్=వలనర్. (వలను=ప్రక్క) రాముని వలన సుఖపడితిని = రాముఁడు హేతువుకాఁగా సుఖపడితిని. పొందనైన సుఖమును రాముఁడు హేతువు కాఁగాఁ బొందితిని. (వలన+పక్షమున.) రాముఁడు నా పక్షమున నుండఁగా సుఖమును పొందితిని.

కు+అంటె+ఏర్=కంటె. రంగనికంటె రాముండు పెద్ద. రంగనికంటె=రంగనికి అంటెవేని, రంగనికి పోల్చి చూచితివేని.

పట్టు+ఇ=పట్టి. (గ్రహించి,) క్త్వార్థక్రియ. విద్యనుబట్టి = విద్యనుకారణముగా గ్రహించి, విద్య వలన.

ఉండు+ఇ=ఉండి. క్త్వార్థక్రియ.

వానినుండి=వాఁడుండుటవలన. ఆ యూరనుండి= ఆ యూరును మొదలు చేసికొని, ఆ యూరునఉండి.

కొలె, కోలె. కోలె=వెన్నుకోసినకాఁడ, కొన కోలె+అర్=కోలెర్. నాఁటఁగోలె = నాఁడుకొన కాఁగా, నాఁడు మొదలుకొని, మఱునాఁటినుండి. కోలె రూపాంతరము కొలె.

తొట్టు+ఇ=తొట్టి. క్త్వార్థక్రియ. తొట్టు=మొదలిడు. సురపతిఁదొట్టి = సురపతిని మున్నిడుకొని, మొదలుచేసికొని.

ఎడ+అర్=ఎడర్. ఎడ=స్థానము, వ్యవహారము. ఇది నామపదము.

దొంగలయెడ = దొంగలున్నచోట, దొంగల విషయమున.

కి+అన్నర్=కన్నర్. వానికన్నర్ =వానికిఅనినర్, వానికి అంటేని [చూ. కంటె]

## షష్ఠీవిభక్తి.

క్రియతో నన్వయించు పదములకు సంబంధంబును నిర్ధారణను గలిగించునది.

ని. రామునిగుఱ్ఱము, వానిపని.

కి. వానికిఁదమ్ముఁడు

కు. నాకు మిత్రుఁడు.

ఒక్క. నాయొక్క పుస్తకము.

లోపల, లో. వీరులలో రాముఁడు మేటి.

అందు. స్త్రీలయందు సీత మిన్న.

ఒక్క. ఇది యకారాదికాదు. సంధివశమునవచ్చిన యడాగమమే. (రాముని+ఒక్క+గుఱ్ఱము=రాముని యొక్క గుఱ్ఱము. రాముఁడను నొక వ్యక్తికి సంబంధించిన గుఱ్ఱము) తెనుఁగున యకారాదియైన పదము కాని అపదముకాని లేదు. సముచ్చయమైన యువర్ణకమును ఉవర్ణకమే. మఱి+ఉ=మఱియు. లోను+అర్=లోనర్ అయినది. ఇంటిలోన్ = ఇంటిలోపలిభాగమున.

స్త్రీలలో= స్త్రీలను లోఁగొని చూడఁగా అనఁగా స్త్రీల గుణములఁ బరిశీలించి చూడఁగా అని భావము.

లో+పలు+అర్=లోపలర్. శూరులలోపల=అనేక శూరులలో. ఇంటిలోపల = ఇంటి లోభాగమున. అందు. అది+లోనర్=అందులోనర్. ఇది అందుర్ అయి తుదకు అందుర్ అను రూపము నిలిచెను.

స్త్రీలయందు= స్త్రీలలో అందు=దానిలో. కుండయందు=కుండయనుదానిలోపల.

## సప్తమీవిభక్తి- అధికరణకారకము.

క్రియతోనన్వయించు పదమున కాధారమును దెలుపునది.

అర్. కుండర్, కంటర్, ఇంటర్, వనములర్, మదిందలంచెదర్.

ప్రత్యయమందలి అకారమునకు లోపము. చూ. తృతీయా విభక్తి. అ౯.)

అందు. కుండయందు, పుడియందు.

న. వనమున కొలఁకున.

లో, లోపల, వనములోపల

సంబోధన ప్రథమ.

క్రియ (కార్యము) కొఱకు సంబోధించు (పిలుచు) దానిని దెలుపునది.

అ, ఆ, రామ, రాముఁడ, రామా, రాముఁడా

ఇ, ఈ, హరి, హరీ,

ఊ. గురూ, శంభూ

అర, ఆరా, [బహు] రాములార, రాములారా

ప్రథమా విభక్తి ప్రత్యయములఁగూర్చి యాపవిభక్తి ప్రకరణమునే ముఖ్యముగాఁ జెప్పఁదగును. ఏలనఁగా నచ్చ తెనుఁగు పదములనేకములు ప్రథమయందును ప్రథమేతర విభక్తులందును వచనములందును పొందు మార్పులట విపరింపఁబడుచున్నవి. సంస్కృత పదము లకు తెనుఁగున ప్రథమయందు ఉ, డు, ము, వు, ప్రత్యయములు వచ్చునుటకంటెఁ దెనుఁగుల ప్రథమను గూర్చి యచటఁ జెప్పఁబడు పేదియు లేదుగదా!

ప్రథమేతర విభక్తులయందు ప్రత్యయరూపము లొందియున్న పదముల యర్థము గ్రహించినచో బాలురు వానిని దమంతఁ గూర్పఁగలరు. తక్కినప్రత్యయములు అనఁగా కేవలప్రత్యయములు కొలఁదియే. అవి ని, ను, అ౯, ఇ, కి, కు, న అను ఏడు ప్రత్యయములే. వీనిలో ఇప్రత్యయము క్త్వార్థకము గావున నిది యేదేని ధాతువుతోడనే వచ్చును గాని, స్వతంత్రించి రాదు. తక్కిన వాని వివరమిది.

ని, ను, ద్వితీయ. కర్మయందువచ్చును.

అ౯ తృతీయ, పంచమి, సప్తమి } క్రియా హేతువులయందు వచ్చును.

కి, కు, తృతీయ చతుర్థి, పంచమి, షష్ఠి } సంబంధమున వచ్చును.

న. సప్తమి ఆధారమందువచ్చును.

[ఇదియు అ౯ ప్రత్యయ రూపాంతరమే]

ఈవిధమునఁ దెనుఁగున నైదు విభక్తులే యేర్పడును.

---

## పండితా

శ్రీ చిలుకలపల్లి - సాక్షీ గోపాలస్వామిగారు, [విజ్ఞానమండలి.]

ధన మొక్కింతయు నింటలేదనుచు నత్యంతంబుఖిన్నత్వముం
గనిచింతించెదవేల? తత్త్వమరయంగా విద్యయన్ రత్నపుం
గని నీయింటనె కద్దు, నీవిమల విజ్ఞానంబుతోఁ బోల్పనీ
కెనయౌ మానవుఁడొక్కరుండుఁ గలఁడే? యొందేనియున్ పండితా!

---

# శతావధాని శ్రీచెళ్లపిళ్ల - వేంకటశాస్త్రిగారు

అడవి - శంకరరావుగారు, బి. ఏ. ఎల్. టి.

## కావ్య రచన

శ్రీతిరుపతి వేంకటేశ్వరకవులు పద్య కావ్యములను నాటకములను బెక్కింటిని, వచనకావ్యములను మాత్రము కొన్నింటిని రచించి యున్నారు. వీరి గ్రంథరచన చాలవర కాంధ్రమునను స్వల్పముగ సంస్కృతమునను జేయఁబడినది. కాళిదాస విరచితమైన "శృంగారతిలకము"ను శ్రీతిరుపతి వేంకటకవులు "రసికానందము" అను పేరున 1892 లో నాంధ్రీకరించిరి. దీనినే తరువాత 1910 లో శ్రీతాడూరి లక్ష్మీనరసింహారావుగారుకూడ "శృంగారతిలక"మని యాంధ్రీకరించిరి.

1892 లోనే "శుకరంభాసంవాదము" వీరిచే సంస్కృతమున రచింపఁబడి వీరిచేతనే యాంధ్రీకరింపఁ బడినది. ఇది శ్రీశుకునకును, రంభకును (వైరాగ్యమునకు, శృంగారమునకు) జరిగినట్లు వర్ణింపఁబడిన సంవాదము.

శుకరంభాసంవాదములో 'కాలే కోకిలకాకలీకలకలే' అను శ్లోకమువరకు వేంకటశాస్త్రిగారి యాంధ్రీకరణము. తక్కినభాగము శ్రీతిరుపతిశాస్త్రిగారి యాంధ్రీకరణము.

1894 మార్చి (విజయమాఘము)లో వేంకటగిరిలో శ్రీ చెలికాని గోపాలరావుగారి యెదుట:—

> "కాళీసహస్రాది కావ్యమ్ములు రచించి
> కాళీకృపం జెందఁ జాలినాము
> ధాతురత్నాకరగ్రోద్దామచంపు రచించి
> పాణినీయస్తుతుల్ వడసినాము"

అని కాళీసహస్రము, ధాతురత్నాకరము గూడ దాము రచించినట్లు వీరు చెప్పికొనినారు. కాళీ సహస్రము వీరిచే దమ విద్యార్థిదశలోనే ప్రారంభింపఁబడి తరువాత బూర్తిచేయఁ బడినది. ఇది వారి శిష్యులగు శ్రీవేలూరి - శివరామశాస్త్రి ద్రవ్యసహాయమున 1909 లో బందరులో ముద్రింపఁబడినది.

శ్రవణానందము వీరిచే 1894 లో రచింపఁ బడినది. ఈ యాంధ్ర ప్రబంధమును

> "అంచితులైన వారలిది
> యారసియారసమున్ గ్రహించి లా
> లించినఁజాలు, గొందఱవి
> లే వివి లేవని గేలిసేయువా
> రంచురచింపమా నుదుమె"

అని వీరు రచించి, పిఠాపురము వాస్తవ్యులగు శ్రీ వాడ్రేవు- వేంకటరత్నముగారి కంకిత మొనర్చినారు. శ్రవణానందమునఁ బ్రథమాశ్వాసమునఁ జాల పద్యములు తిరుపతిశాస్త్రి కవిత్వము. తక్కిన యాశ్వాసములలో నూటికిఁ దొంబది తొమ్మిది వేంకటశాస్త్రిగారి కవిత్వము.

1895 నుండి దేవీ భాగవతమును సంస్కృతము నుండి తెనిగింప నారంభించి నేటికి యెనిమిది స్కంధములఁ బూర్తిఁజేసియున్నారు. ఈ దేవీభాగవతమును వీరుతమ మత గురువులైన శ్రీ చర్ల- బ్రహ్మయ్యశాస్త్రి వరేణ్యున కంకితమొనర్చి కొంతవరకు తమ గురు ఋణముఁదీర్చి కొనినారు.

దేవీభాగవతములో నాలుగు స్కంధములవరకు తిరుపతిశాస్త్రిగారి రచన కలదు. పంచమస్కంధము మొదలు తుట్టతుదివరకును మిగిలిన స్కంధములు వేంకటశాస్త్రిగారిరచన. నవమ దశమ స్కంధములు

మాత్రము వీరి యుభయులచే గాక యితరులచే రచింపఁబడినవి.

ఏలా మహాత్మ్యము 1900లో తిరుపతి వేంకటకవులు రచించి తోట-సర్వారాయుఁడుగారి కంకిత మొనర్చిరి. "ఇందలి కథలు కర్ణాకర్ణిగా వచ్చిన యవి గాని పురాణస్థములు గావు. ఈ ఏలానది గోదావరిజిల్లా పెద్దాపురము తాలూకాలోని చాల గ్రామములను సకల సస్య సంపూర్ణముల నొనర్చు నొక పెద్ద కొండ కాలువ. దీనిం బురాతనులగు భీమఖండకారు లొక పుణ్యప్రదయగు నదిగాఁ గొనియాడుటఁబట్టియు' నేతద్విషయమ్ములగు గాథలు, తీర్థములు మున్నగు విశేషములు పరంపరా కర్ణితము లగుటఁబట్టియు మే మీ గ్రంథమును రచియించినార" మని శతావధానులు గ్రంథపీఠికయందు వ్రాసికొని యున్నారు. ఏలా మాహాత్మ్యమున నే కొన్నిపద్యములో దప్ప సర్వమును దిరుపతిశాస్త్రి రచనయే.

1902 లో వీరిచే రచింపఁ బడిన బుద్ధచరిత్ర కీర్తిశేషులైన శ్రీ కొచ్చర్లకోట - వేంకటకృష్ణారావుగారి కంకిత మీయఁబడినది. "బుద్ధజన్మ, బుద్ధచరిత్ర, లైట్ ఆఫ్ ఏష్యా. ఈ మూఁడును దగ్గఱ నుంచికొని అందు లైట్ ఆఫ్ ఏషియాలోని మొదటి భాగమునందు నాలుగునూఱులును వేంకట శాస్త్రిగారివి యనియు,తక్కిన అరునూఱులును నన్ఁగా సంస్కృతమునుండి యాంధ్రీకరించిన నాలుగు నూఱులును మొదటి రెండు నూఱులును గలిసి తిరుపతి శాస్త్రివి యనియు నిర్ణయించుకొనుట యుక్తము" అని వేంకటశాస్త్రిగారు "దివాకరాస్తమయము"లో వ్రాసియున్నారు: ఈ కావ్యమునందు బుద్ధుని జీవితము సంగ్రహముగా వర్ణింపఁబడినది.

బుద్ధచరిత్రను రచించినతరువాత

"కొంచెము గొప్ప సంతసము
గొల్పినఁ జూడుఁడు చించివేయుఁడే
మంచియు లేనిచో"

నని యీ తిరుపతి వేంకటకవులు 1903 లో "పాణిగృహీత" రచించిరి. ఇదియొక కల్పితప్రబంధము. కవి తాలోలుఁడగు నొక యౌవనుఁడు వారవనిత నొకదానిని వలచి కొంతకాలమునకు దానియందు విరక్తుఁడై దన గృహమునకేగ, ఆ వారవనిత వానియందను రక్తిచే విషముద్రాగి మృతినొందిన కథ యిందు వివరింపఁ బడినది.

ఈకల్పిత ప్రబంధము పుచ్చా-సీతారామయ్య గారి కంకిత మీయఁబడినది. "ఇది యధిక ప్రయత్నముచేఁ గడు బలవంతపెట్టి యతఁడే రచియింపఁ జేసినాఁడు. తుదకు జరుగకపోయినను మా కాయన చేయఁదలచు కొన్న బహుమానము వేయిన్నూట పదార్లు. ప్రకృతము కృతినేత మృతినొందినను దీనిని రచించి వినిపించినపిదప నాలుగు సంవత్సరములవఱకును చక్కగా జీవించియుండి మొదటఁ బ్రతిశ్రుత మొనర్చిన ధనము నీఁజాలక యేదోమిష పెట్టి నానాఁటికి మాకు విసువు పుట్టించి "ఇఁక నితఁడు సమ్మానించినను స్వీకరింప గూడ"దను నభిప్రాయమునుఁ బూర్తిగా గలిగించి యట్టి యుత్తరముఁ గూడ మావలన నందుకొనెను ............"ఇట్టివాని కంకితముగాఁ గృతిఁ జెప్పుట మాలోపమే యని మేము వ్రాయకున్నను లోకము నిశ్చయించుకొనక యెట్లుమానును?" అని కృతికర్తలు "పాణిగృహీత" పీఠికలో వ్రాసియున్నారు.

మహాకవి రాజశేఖరుని బాలరామాయణము నాటకమును సంస్కృతమునుండి యాంధ్రీకరించి తిరుపతి వేంకటకవులు 1902 లో ప్రథమభాగమును కాకినాడ నుండి ప్రకటించిరి.

బాలరామాయణము ద్వితీయభాగము కాకినాడ నుండి 1903 లో వెలువడినది. బాలరామాయణము

రెండుభాగములు కేవలము దిరుపతిశాస్త్రిగారి రచన. పోలవరము జమీందారులును కీర్తిశేషులునైన శ్రీ వేంకటకృష్ణారావుగారికే బాల రామాయణము కూడ నంకిత మొనర్పఁబడినది.

1903 లోనే 'పల్లెటూరుపట్టుదల' లను ప్రహసన మొకటి వీరిచే రచింపఁబడినది. ఇది మొదట మంజువాణి పత్రికలోఁ బ్రచురింపఁబడి తరువాత గ్రంథ రూపముఁ దాల్చినది. ఇది చక్కని ప్రహసనము. స్వల్పవిషయములలో గూడ బల్లెటూళ్లలో పట్టుదల లెట్లు విజృంభించుచుండునో యిందు వివరింపఁబడినది. 1904 లో పాండవవిజయము, పాండవాశ్వమేధము, 1911 లో పాండవవిజయమును పాండవోద్యోగము, పాండవవిజయ మని పెంచి రెండు నాటకములు, 1907 లో పాండవ ప్రవాసము, 1908 లో పాండవ జననమును ఇటీవల పాండవ రాజసూయము తిరుపతి వేంకటకవులీ "భారత నాటకమ్ముల నెబాసని లోకులు మెచ్చ' రచియించినారు. వీనిలో పాండవ జనన, పాండవాశ్వమేధ, పాండవ ప్రవాస, పాండవ రాజసూయములు కేవలము వేంకట శాస్త్రిగారిచేత రచింపఁ బడినవి. పాండవ విజయమును మొదట తిరుపతిశాస్త్రిగారు రచించి కాకినాడనుండి సరస్వతీ పత్రికలోఁ బ్రచురించెను. దీనినే 1911 లో పాండవోద్యోగము, పాండవ విజయములుగా వేంకట శాస్త్రిగారు రెండు నాటకములుగాఁ బెంచి రచించి ప్రచురించిరి.

1905 లో వీరు శ్రీనివాస విలాసమును, కాళికాది స్తోత్రమాలను రచించిరి. శ్రీనివాసవిలాసము గద్వాల భూపాలుఁడైన శ్రీ ముక్కర సీతారామస్వామిగారి కంకితము చేయఁబడినది. "ఈ గ్రంథమందలి కథ శ్రీ రాజాగారి యిలువేల్పును, కురుమతి యను గిరి కధిపతియు నగు శ్రీనివాసుని కల్యాణోత్సవముం గుఱించి ప్రవర్తించినది. వర్ణన కడువిస్తారముగా నుండును; ఔచితి యీ కవికంతగాఁ దెలియదు. ఇందుఁ బద్యభాగముకన్న గద్యభాగము హెచ్చు. అయినను మేము గద్యలను సాధ్యమయినంతవరకుఁ బద్యములుగా మార్చితిమి; ఈ కవి రామేశ్వర విజయము మొదలగు మఱికొన్ని ప్రబంధములు సంస్కృతమున రచించెను. వనపర్తి మొదలగు సంస్థానములో నీ మన కెక్కుడు సన్మానము తటస్థించినది. పదపడి తురీయాశ్రమ స్వీకర్తయై మైసూరులోని జగద్గురుపీఠమున కధికారియై యిప్పటికిని నప్పదవి యందే యుండి వృద్ధత్వము సార్థకము జేయుమన్న యిమ్మహామహుని సాటి యొండొరులు కాఁజాలరు. కృతిపతి నివాసము నైజాములోని యమరచింతాత్మకూరు సంస్థానము. ఇయ్యది శ్రీ కృష్ణాతీరమున మూడుమైళ్లదూరమున నున్నది." అని మూలగ్రంథమును గురించి శ్రీనివాసవిలాసము (ఆంధ్రీకరణము) యొక్క పీఠికలో కృతికర్తలైన వీరు వ్రాసికొని యున్నారు. శ్రీనివాస విలాసముయొక్క ప్రథమముద్రణము 1905 లో ఏలూరులోని మంజువాణి ముద్రాలయమునుండి వెలువడినది.

1907 లో తిరుపతివేంకటకవులచే కామేశ్వరీశతకము, శనిగ్రహము, లక్షణాపరిణయము రచింపఁబడి ప్రకటితములైనవి. కామేశ్వరీశతకమున నవీన విద్యా పద్ధతినిగురించియు, నేటి నాగరకతను గురించియు వేంకటశాస్త్రిగారి యభిప్రాయములు వెల్లడియైనవి. చాల నిరుత్సాహుఁడై యుండినప్పుడు కవి ఈశతకమును రచించినట్లగుపడుచున్నది.

1911 లో రచింపఁబడిన గీరతములో

" మూలముముట్టఁగాఁ గవసముఁ గని యారసి నారలేమి ? "

యని వేంకటరామకృష్ణకవులను తిరుపతి వేంకటకవులు పరిహాసించి:—

"గద్వాలయు నాత్మకూరు వనపర్తియుఁ
గావు పిఠాపురమ్ము"

అని గద్వాల, ఆత్మకూరు, వనపర్తి సంస్థానములలో తమ విజయముల స్ఫురణకుఁ దెచ్చినారు. శని గ్రహ మీ మూఁడు సంస్థానములలో నొకదానియందు జరిగిన వివాదమునకు సంబంధించిన ఖండకావ్యము.

1907 లోనే వీరిచే రచింపఁబడిన లక్షణాపరిణయము శ్రీతాటికొండ రామారెడ్డిగారి కంకితము చేయఁబడినది. ఇది శ్రీకృష్ణుఁడు లక్షణను వివాహ మాడుటను వర్ణించు ప్రబంధము. పీఠికలో కొలఁది పద్యములు తప్ప లక్షణాపరిణయము తక్కిన సర్వమును వేంకటశాస్త్రి కవిత్వము.

1908 లో శతావధాన సారము, సుకన్య (నాటకము) తిరుపతి వేంకటకవులచే ప్రకటింపఁ బడినవి. శతావధాన సారమున తిరుపతిశాస్త్రి వేంకటశాస్త్రిగార్ల కవిత్వ మించుమించు సమముగనే యున్నది. శ్రీకాకుళ ప్రయాణములోని యవధానములు, నూజువీటి సంపూర్ణ శతావధానము మాత్రము కేవలము వేంకటశాస్త్రిగారి కవిత్వము. సుకన్య యొక చిన్న నాటకము; ఇందలి కథ దేవీభాగవతముననుండి కైకొనఁబడినది. శర్యాతి మహారాజు కూతురు సుకన్య చ్యవనమహామునిని బెండ్లాడి తన పాతివ్రత్య మహిమచే నశ్వినీదేవతల సిగ్గుపరచి వారిసాయమున ముదుసలియైన తన పెనిమిటిని నవయౌవనునిగాఁ జేయుటయు, తరువాత శర్యాతియొనర్చిన యజ్ఞమున చ్యవనుఁ డింద్రు నోడించి అశ్వినీదేవతలకు సోమపాన మిప్పించుటయు నిందలి యితివృత్తము.

వివిధస్థానములలోను, మరి యితర స్థలముల నొనర్చిన శతావధానములు, అష్టావధానములు "శతావధాన సార" మని గ్రంథరూపమునఁ బ్రచురింపఁబడినది.

1909 లో వీరొనర్చిన నాటకములు పండితరాజము, అనర్ఘ నారదము, దంభవామనము, ముద్రారాక్షసము ప్రకటింపఁబడినవి. ఇందు ముద్రారాక్షసము కేవలము తిరుపతిశాస్త్రిగారిరచన. ముద్రారాక్షసము సుసర్ల అనంతరావుగారి చేత గూడ నాంధ్రీకరింపఁబడినది.పండితరాజము తిరుపతి వేంకటకవులచే రచింపఁబడిన నాటకములలో మొదటి నాటకమైనను ఆలస్యముగ ప్రచురింపఁబడినది. "ఇందు జగదేక కవితా ధురంధరుఁడగు జగన్నాథపండితరాయలు ఢిల్లీచక్రవర్తి యగు షహాబుద్దీను కొమార్తెను వివాహమాడి పదపడి తత్కాలపు విద్వాంసులచేఁ గాశికాపట్టణమున బహిష్కరింపఁబడి గంగకతనఁ బవిత్రుఁడయ్యెనని లోకులు చెప్పికొనెడి కథ తగు మార్పులతో వర్ణింపఁబడినది. ఈ విద్వత్కవి తెలుఁగు దేశపువాఁడు. వేగినాఁటి శాఖవాఁడు." అని నాటకము యొక్క ఉపోద్ఘాతములో వ్రాయఁబడి యున్నది.

అనర్ఘ నారదము దేవీభాగవతమునందలి కథనము ననుసరించి తగుపాటి మార్పులతో రచింపఁబడిన చిన్న నాటకము.

గీ. "నారదుఁడు విష్ణుమాయచే నారియగును
పిదపఁ దాళధ్వజుఁడను పేరినృపుని
వలచి పెండ్లాడి సంసారవార్థి మునిఁగి
తుదకుఁ దనరూపుఁ దాఁ గాంచు"

టమే యిందలి యితివృత్తము.

దంభవామనము కూడ అనర్ఘ నారదము వలెనే చిన్న నాటకము. "ఇందలికథ శ్రీమద్భాగవతము నందును దేవీ భాగవతమునందును గలదు. జయంతీశుక్ర వివాహమును, బృహస్పతి శుక్రుఁడుగా మారుటయు లోనుగాగల కొన్ని సంగతులు దేవీభాగవతములోనివి. అక్కడక్కడ నిందు మా దేవీభాగవతమునుండి యనేక ఘట్టములలోని పద్యములు చాలవఱకుఁ గైకొనఁబడినవి' అని తిరుపతి వేంకటకవులు పీఠికలో వ్రాసికొనినారు.

మహాకవి విశాఖదత్త విరచితమైన ముద్రారాక్షస మును సంస్కృతమునుండి 1909 లో నాంధ్రీకరించి కాకినాడనుండి ప్రచురించిరి.

నానారాజసందర్శనము ప్రథమముద్రణము 1910 లో వెలువడినది.

గీరతము ప్రథమభాగము (అధిక ప్రసంగదమనము) 1912 లోను, ద్వితీయభాగము (గురుదక్షిణ) 1913) లోను,తృతీయభాగము (విగ్రహారాధనము) 1915 లోను బ్రచురించిరి. పీఠికాపుర ఆస్థానకవులగు శ్రీ వేంకట రామకృష్ణ కవులకును, వీరికిని జరిగిన కవితాసమర మీ గీరతమున వి స్తరింపఁబడినది.

గీరతమందు శ్రీతిరుపతిశాస్త్రిగారి సంతకమున్న ప ద్యములును, తిరుపతిశాస్త్రిగారిచేత నే రచింపఁ బడి శిష్ట- హనుమచ్ఛాస్త్రిగారి పేరున బ్రచురింపఁబడిన "తిరుపతి వేంకటేశ్వరతత్త్వము''ను, గాక మిగిలిన రచన యంతయు వేంకటశాస్త్రిగారి కవిత్వము.శ్రీవేలూరి- శివ రామశాస్త్రిగారిచే రచింపఁ బడినట్లు ప్రకటింపఁ బడిన బిడాలోపాఖ్యానములోని ప్రధాన కథాభాగమెల్ల శ్రీతిరుపతిశాస్త్రిగారి రచన. బిడాలోపాఖ్యానములోని కొన్నిపద్యములు మాత్రము వేంకటశాస్త్రిగారివి. శ్రీ తిరుపతిశాస్త్రిగారిపేరనున్న అవధాన పద్యములు తప్ప గుంటూరిసీమ సర్వమును వేంకటశాస్త్రిగారి కవిత్వమే. గుంటూరిసీమ (పూర్వరంగము) 1913 లోను, గుంటూరిసీమ (ఉత్తరరంగము) 1914 లోను బందరు నుండి ప్రచురింపఁబడినవి. ఇవి రెండును కొప్పరపు సోదర కవులకును, తిరుపతి వేంకటకవులకును 1911 లో గుంటూరులో బయలుదేరిన వివాదమును సవి స్త రముగాఁ దెలియఁజేయు కావ్యములు

కవిసింహ గర్జితములు (1912) పళ్యాంపుళ్యాం (1912), శృంఖలా తృణీకరణము (1913), తవిటిరొట్టె (1913), పాశుపతము, సంగదోషము, పురశ్చరణము (1915) గ్రామసింహము- ఈ చిన్నపాత్తములు వేంకట రామకృష్ణులతోను, కొప్పరపు సోదరులతోను ఈతిరు పతివేంకటకవులకు జరిగిన వివాదములకు సంబంధించినవి. వీరిచే రచింపఁబడిన "భారతవిశేషములు" 1916 శ్రీ ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రిులుగారు వ్రాసిన "భారత ఫక్కిపై'' విమర్శనము. "భారతఫక్కియందలి దోష ములయసారతనుగూర్చి ఇందువిస్తరింపఁబడియున్నది.'' అని తిరుపతి వేంకటకవులు "భారతవిశేషముల'' పీఠి కలో వ్రాసియున్నారు. 'రసాభాసము'' పల్లెటూరు పట్టుదలలవలెనే చిన్నప్రహసనము. నాటకమొకటి ప్రదర్శింపనెంచి రసాభాసమైన నటసంఘముయొక్క కథనమిందు వీరిచే జిత్రింపఁబడినది. "ఎడ్వర్డు పట్టాభిషే కము "నాటకము తిరుపతి వేంకటకవులు 1923 లో రచించిరి.

ఎడ్వర్డు పట్టాభిషేకనాటకము కేవలము తిరుపతి శాస్త్రి రచన. " ఆరోగ్య కామేశ్వరి '' వేంకటశాస్త్రి గారిచే రచింపఁబడి 1929 లో బ్రకటితమైనది. తమ కొమారుని యారోగ్యమునకై "రోగప్రకోపసమయము లయం దప్పుడప్పుడు వివశముగా దొరలిన కవిత్వమే కాని యియ్యది యిట్లురచింపవలెనను నుద్దేశముతో దీక్ష పట్టి రచించినది కా''దని దీని పీఠికలోఁ గవీశ్వరులే వ్రాసియున్నారు.

"కలగూరగంప'' 1929 లో బ్రచురింపఁబడినది. "కలగూరగంప'' అను నీపాత్తమున బ్రచురించిన విష యములెల్లఁ బరస్పరమును నానంతర్యాది సంబంధములు లేక "ఎవరికివారే యమునాతీరే'' అను చొప్పున మాశతావధానసారము, నానారాజసందర్శనము లో నగు పాత్తములలోని యంశములవంటివై యున్నవి.'' అని వేంకటశాస్త్రిగారు గ్రంథపీఠికలో వ్రాసి యున్నారు. వివిధసందర్భముల రచింపఁబడిన పద్య ములును కొన్ని వచనవ్యాసములును నిందు గలవు.

తిరుపతి శాస్త్రిగారిచే ప్రారంభింపఁబడి వేంకట శాస్త్రిగారిచేఁ బూర్తిచేయఁబడిన ప్రభావతీ ప్రద్యుమ్నము నాటకము 1931 లో ప్రచురింపఁబడినది.

తిరుపతిశాస్త్రిగారిచే రచింపఁబడిన నాటకము వ్యసనవిజయము త్వరలో బ్రచురింపఁబడనున్నది.

1928 లో శ్రీ బొబ్బిలి మహారాజావారి పట్టాభిషేక సందర్భమున వేంకటశాస్త్రిగారిచే రచియింపఁబడిన బొబ్బిలి పట్టాభిషేకము 1932 లో బ్రకటింపఁబడినది.

శ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రిగారు 1920 లో మరణించినతరువాతవారిజీవితమును 'దివాకరాస్తమయ' మను పేరున వేంకటశాస్త్రిగారు 1921 లో బ్రచురించిరి. శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవులు వచనకావ్యములగూడ గొన్నిటిని విరచించియున్నారు. బాణభట్టు విరచితం బగు హర్షచరిత్రము, బిల్హణకవి విరచితమగు విక్రమాంకదేవ చరితము (1906), వీరనంది కృతంబగు చంద్రప్రభ చరిత్రము (1906) వీరిచే నాంధ్రీకరింపబడిన వచనకావ్యములు. ఇవి కాకినాడనుండి సరస్వతీపత్రికలోఁ బ్రచురింపఁబడి తరువాత గ్రంథరూపమును దాల్చినవి. తిరుపతిశాస్త్రిగారిచే రచింపఁబడిన వ్యసన విజయము త్వరలో ప్రచురింపబడును. మల్లేశ్వర స్వామికి విజ్ఞప్తి, గీరతము (చతుర్థభాగము) వేంకట శాస్త్రిగారిచే నిటీవల రచింపబడి ప్రకటనమునకు సిద్ధముగ నున్నట్లు తెలియుచున్నది. ఆంధ్రమున బద్య రూపకమైన స్వీయచరిత్రలులేవు. వేంకటశాస్త్రిగారి స్వీయచరిత్రమందువలన నొక యపూర్వమైనకావ్యమే యగును. ఈకావ్యమునుండి కొన్నిభాగములను వేంకట శాస్త్రిగారు తమ "దివాకరాస్తమయము"లో నుదహరించియున్నారు. "మల్లేశ్వర విజ్ఞప్తి" యను కావ్యముయొక్క స్వభావ మీక్రిందిపద్యములవలనఁ గొంత దెలియఁగలదు.

మ. కొమరుల్ రోగవిముక్తుఁ జేయుమని మ్రొ
క్కుల్ మ్రొక్కితిఁ నీదు పెం
డ్లము కామేశ్వరి, కాజగజ్జననియున్
నాకోర్కె పూరించె; గ్రా
మమహారోగము నాపుమంచిపుడు నిన్
బ్రార్థించితి "నీదుచి [త్త]ము
త్తమునా భాగ్యము " పిమ్మటన్; దగదు
దృష్టిందు మల్లేశ్వరా.

మ. కలరాగాని మశూచిగాని మరి రో
గాలేవియేఁగాని యీ
ఖలచిత్తుల్ బలె గ్రామమున్ జెఱుప, వీ
కర్మ శ్వపాకాయుతిన్
బలమేఁ దింపఁగదయ్య లోకులకు నా
పత్కారులీతుంటరుల్
నిలువెల్లన్ విషపుంజముల్ నిలుపు మీ
నీచూపు మల్లేశ్వరా.

పయి నుదాహరింపఁబడిన విషయములఁబట్టి శ్రీ వేంకటశాస్త్రిగారి రచన, తిరుపతిశాస్త్రిగారి రచన నిట్లు విడదీయవచ్చును. శ్రవణానందము మొదటి యాశ్వాసము గాక మిగిలిన యాశ్వాసము లన్నియు కేవలము వేంకటశాస్త్రిగారి రచన. దేవీభాగవతము మొదటి నాలుగాశ్వాసములుగాక తరువాత నాలుగాశ్వాసములు కేవలము వేంకటశాస్త్రిగారే రచించిరి. పీఠికలో కొన్ని పద్యములుతప్ప లక్షణాపరిణయమంతయు పాణిగృహీత, పాండజననము, పాండవప్రవాసము, పాండవరాజసూయము, పాండవాశ్వమేధము, గీరతము (మూఁడుభాగములును), గుంటూరుసీమ (రెండురంగములు) బొబ్బిలి పట్టాభిషేకము—వీనిని కేవలము వేంకట శాస్త్రిగారే రచించిరి. శ్రవణానందములోని ప్రథమాశ్వాసమున చాల పద్యములును, దేవీభాగవతములో

మొదటి నాలుగాశ్వాసములవఱ కచ్చుటచ్చుటను దిరుపతిశాస్త్రిగారి రచన గలదు. కొన్ని పద్యములు దప్ప ఏలామాహాత్మ్యమంతయు, బాలరామాయణము,(రెండు భాగములు,) పాండవవిజయము, (పూర్వపుప్రతి), లక్షణాపరిణయము పీఠికలో గొన్ని పద్యములు, ముద్రారాక్షసము, ఎడ్వర్డుపట్టాభిషేకము, గీరతము, గుంటూరుసీమలలో తమ సంతకమున్న పద్యములు— ఇవి తిరుపతిశాస్త్రిగారి రచన. రసికానందము, శుకరంభాసంవాదము, బుద్ధచరిత్ర పాండవవిజయము [క్రొత్తప్రతి], పాండవోద్యోగము, శతావధానసారము, ప్రభావతీప్రద్యుమ్నము—వీనియందు వీరి యుభయుల కవిత్వము బాగుగా కలిసి యున్నది.

వీరి రచనలలో దేవీభాగవత మగ్రస్థాన మలంకరించుచున్నది. పద్యకావ్యములలో గవిత్వమునే గాక కావ్యమును గూడ బరిశీలించినయెడల బుద్ధచరిత్ర శ్రేష్ఠతమమైనదని చెప్పవచ్చును. శ్రవణానందము, పాణిగృహీతలలో కవిత్వము చక్కగనే యుండును. కాని కావ్యమునందలి వస్తువా కవిత్వమునకుఁ దగినది కాదు. శనిగ్రహము, గీరతము, గుంటూరుసీమ—ఇవి కేవలము కలహకావ్యములు. వీరినాటకములలో పాండవవిజయము పాండవోద్యోగము, పాండవాశ్వమేధము చాల ప్రచారములోనికి వచ్చినవి. పండితరాజును, ప్రభావతీప్రద్యుమ్నము గూడనట్లే ప్రచారములోనికి రాఁదగిన నాటకములు. నానారాజసందర్శనము, గీరతము, గుంటూరుసీమ—ఇవి ఆంధ్రసరస్వతిని నూతన పథముల విహరింపఁజేసిన రచనలు. నేటివారిలోఁ గొంతమంది కవితాసంస్కారమును గురించియు, వారి కావ్యరచనను గురించియు, జర్చించుచు:—

శా. చారుశ్రీకములౌ నలంకృతులకున్
సన్న్యాసముల్ గల్గె, శ్రృం
గారంబెల్లను గారమయ్యె గుణముల్
ఖండంబులై పోయె, సం
స్కారమ్మెల్ల నశించె భావలకు దా
గత్యంబు ప్రాప్తించె, సం
స్కారమ్ముల్ పొనరించు వారికి తనర్
సర్వంబు మాసెన్ జుఁడీ.

అని వేంకటశాస్త్రిగారు తమ యభిప్రాయమును వెల్లడించినారు. తమకావ్య సంతానముయొక్క మేలిగుణము నెరిఁగి యుండుటచేతనే తమ సహాధ్యాయియైన తిరుపతిశాస్త్రిగారిని మందలించు చున్నట్లు నటించుచు:—

ఉ. లోకమెఱుంగుజు! కవిత
లోఁగలపాకము శత్రువైన ను
శ్రీకల కబ్బమౌంగని "యి
సీ!" యనఁజాలఁడు మిత్రుఁడైన స
శ్రీక కవిత్వమైన "బళి
రే!" యని మెచ్చుకోనండు, నీకు నే
లాకలహంబు, లోకమె ర
సారస చర్చ యొనర్చుచుండగన్.

అని వేంకటశాస్త్రిగారు తమ కావ్యములను సహృదయులగు రసజ్ఞుల విమర్శనమునకు నిస్సంకోచముగా వదలివైచినారు. అవధానప్రదర్శనులవలెనే వీరి కావ్యములును, నాటకములును గూడ నేటివారికి ఆంధ్రకవిత్వమందుగల గౌరవముఁ బెంపొందించుటయే గాక, కవి కవితావిలాసమునకును జగన్నుతికి గల సంబంధమును ఇటీవల జరిగిన శ్రీవేంకటశాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవ సంపర్భమున మరియొక సారి వెల్లడించినవి.

———(o)———

# శ్రీ గంగాధ్యానము *

శ్రీ కవిభూషణ శతావధాని దోమా- వేంకటస్వామి గుప్తగారు,

శా. శ్రీకృష్ణాంగక జాతయై-మఱియుఁదచ్ఛ్రీకృష్ణ దేవాభయై
శ్రీకళ్యాణ గరిష్ఠయై-వికచరాజీవాక్షు దేవేరియై
వీఁకన్ శారదచంద్రబింబశత విస్ఫీతప్రభాయుక్తయా
ప్రాకట్యోల్లస దుత్తమాశయను దేవప్రాఁదినిం గొల్చెదన్.

శా. చందచ్చందన బిందుసిందురకణాంచన్నైజ భవ్యాంగకన్
మందస్మేర-మిళిందబృందకచరంగన్మాలతీమాలికా
నంద శ్రీకరసౌరభన్ - సుభగ - నానాకస్తురీ రేఖికా
భంగోల్లాసి కపోలయుగ్మకను సేవింతున్ మరుద్వాహినిన్.

మ. తగ ముత్తెంబులపంక్తిఁ బల్వరుసయందంబుల్ జయింపన్-సుమే
షుగణంబుం బవరమ్ము సల్పఁగల వాల్జూపుం జెగానిగ్గు మిం
చేఁగ నాలోచనపంకజాతములతో నల్వారు కాఠిన్య వృ
త్తగఁరూద్యత్కుచభారనమ్రమను నమర్త్యప్రాఁదినిం గొల్చెదన్.

శా. రంభాస్తంభ సమోరుకాండ-ధరణీ శ్రోణ్యాతి సౌందర్య-సు
ర్వంబోధి ప్రియకాంత-నంతరహితో దారాతి కారుణ్య సం
రంభానందిత భక్తబృంద-వరదన్ - రాజద్వరేణ్యన్ - వరన్
డంభం బాప్పని భక్తి నెంతు నల గంగన్ మంగళాభంగనున్.

మ. స్మరణానందములన్ మహేంద్రమకుటీ మందారమాలానురం
ద రసానేక కణారుణంబులు - మునీంద్రాదిత్యసిద్ధాది త
త్పరతాదత్త నమస్క్రియాంచితములం - దాసావళీశీర్ష బం
భర సంకీర్ణము - లంబరాపగ పదాబ్జాతంబులం గొల్చెదన్.

మ. స్థలకంజాతనిభం - బలక్తక పరిష్కారాంచితంబున్ - ముము
క్షులసన్మోక్షకరంబు - కామితతి కత్షోభ్యస్వరావాసదం
బలఘుశ్రీకరము - న్నతాభయద - ముద్యద్రత్న యుక్తంబు-మం
గళరూపం బమరాపగా చరణ కంజాత ద్వయిం గొల్చెదన్.

---

ఇది- శ్రీ గోమా. వేంకటస్వామిగుప్తగారిచే ఆంధ్రీకరింపఁబడుచున్న శ్రీ బ్రహ్మవైనర్త పురాణము-ప్రకృతిఖండములోనిది. సంస్కృతగ్రంథములో దీనిమూలము సదరు శ్రీ బ్రహ్మవైవర్త పురా: ప్ర: ఖం: 9 వ అధ్యాయములో కలదు.

# రామశాస్త్రి

శ్రీ మాధవరామశర్మగారు,

గారిది ధర్మవరం. నాలుగువేదాలూ అధ్యయనం చేశాడు. కాని కావ్యకళ అపరిచితం. శాస్త్రివాసన శూన్యం. తను అధ్యయనంచేసిన వేదానికి శ్రుతపాండిత్యంతో కొన్ని చిల్లరశ్లోకాలను కూర్చి కలాపూర్ణుణ్ణి అనుకుంటూ కాలం గడుపుతూ ఉండేవాడు. ఆయన శరీరమంతా పట్టించిన విభూతిపట్టెలు గొడరుద్రాక్షలు చూచి అంతా భ్రమించేవాళ్లు. విశేషంగా ఆడవాళ్లకు ఈయన మహాపురుషుడనీ వైదికాగ్రేసరుడనీ అభిప్రాయం ఉండేది. అందరి ఇళ్లల్లో ఈయనే బ్రాహ్మణార్థం చెయ్యాలి. ఈయనకు అనిష్టుడాపనికి అధికారం పొందలేదు. ఎవరైనా బ్రాహ్మణార్థానికి పిలిస్తే వాళ్లింటికి వెళ్లి వాళ్ల గృహకృత్యం అంతా తానే స్వయంగా చూడాలి. ఇంకెందుకు? రామశాస్త్రిగారు లేకుండా ఆ గ్రామంలో ఏ వైదిక కర్మ జరగదు. బ్రాహ్మణార్థాలుచేసి, జ్యోతిషఫలాలు చెప్పి, పెళ్లిళ్లుకూర్చి, వడ్డీ వ్యాపారంచేసి, దానపట్టి, అనేకవిధాల గమనికతో సుఖంగా జీవిస్తూన్నాడు. ఆ గ్రామంలో ఒక ధనవంతుని కొడుకు పిల్లిపిల్లను చంపాడు. ఒకనాడు నారద శాస్త్రిగారు (ఈయనకలహప్రియత్వాన్ని బట్టి నారదశాస్త్రి అంటారు) ఆవూళ్లో మహా గందరగోళంచేసి, బంగారంపిల్లిని దానంచేస్తేనేగాని ఈ దోషం పోదని తీర్మానించాడు. ఊరిలో వెలివెడతారని శాస్త్రులుగారిమాటమీద చచ్చిపోయినదానంత బంగారంపిల్లిని చేయించి రామశాస్త్రిగారికి దానం ఇచ్చి ఆ ధనవంతుడు దోషపరిహారం చేయించాడు. ఈ ప్రతిగ్రహమే రామశాస్త్రిగారి విశేషధన ప్రాప్తికి కారణం.

ఈ వ్యవహారంతో శాస్త్రిగారికి సూక్ష్మదర్శి అనే పేరు వచ్చింది. పాత్రల్లు సంపాదించటంకంటె అయిదుసంవత్సరాలకు ఒకమారు ఇట్లాంటిది ఉంటే బాగుండుననుకొని అప్పటినుంచీ ధర్మసూత్రాలు వెదికి ప్రాయశ్చిత్తాలు చేయిస్తూ బాగా సంపాదించి వడ్డీ వ్యాపారం పెట్టాడు.

ఇది ఇట్లాఉండగా మనశాస్త్రిగారి ఏకపుత్రుడైన కృష్ణుడూ ఇంకా నలుగురుపిల్లలూ కలిసి నల్లకుక్కపాలు పిదికి, కాచి, కాఫీచేసి, తాగారు. నారాయణరావు ఈ విషయం ఎట్లాగో తెలుసుకున్నాడు. రామశాస్త్రి అంటే ఈయనకు మంట. ఈ సందు దొరకగానే ఐదారుగురు పెద్దమనుష్యులతో రామశాస్త్రిగారి దగ్గరకు వెళ్లాడు. అప్పుడే ఆయనపక్కఊళ్లో ప్రాయశ్చిత్తం చేయించి సామానంతా మోసుకొని ఇంటికి వచ్చాడు. శాస్త్రిగారి పాండిత్యం మూలాన ఆ వూళ్లో ప్రాయశ్చిత్తం లేనిరోజులేదు.

నారా:—"శాస్త్రుల్లుగారూ! మహాఅన్యాయంజరిగింది. రామయ్యగారి కొడుకూ ఇంకా నలుగురు కలిసి కుక్కపాలు తాగారు; ఏమిచేయాలో చెప్పండి. మీ మాట మాకు వేదం" అని సవినయంగా నారాయణరావు విన్నవించాడు. ఆ మాట వినగానే శాస్త్రిగారికి ఎంత ఆనందం కలిగిందో డెబ్బైభమూడుకోజులు వ్రాసినా కాదు, "రామయ్యకు పదిలక్షలున్నాయి. మహాలుబ్ధుడు. ఒకసమయంవచ్చింది. బాగా గుంజాలి" అని మనస్సులో అనుకుంటూ "ఆ ధనంతో పొలంకొనేదా? వడ్డీకివేయనా? ఎక్కడ పొలంకొందాము. ఎంతవడ్డీకిద్దాం? అప్పు ఇస్తే ఎగకొడతారేమో" అని ఆలోచించటం ప్రారంభించాడు.

రామ:—వెంటనే "ఆఁ ఏంచెప్పేది? చెప్పటానికి కూడా నాలుకరావటం లేదు. ఇట్లాంటి పిల్లలుకూడా ఉన్నారూ? ఏమిటూ వాళ్లువాళ్లకు తగిన పనులుచే

యక ఈవిధంగా ప్రారంభించారే? ఈ దోషం ఆ పిల్ల వాడికే కాదు. తల్లిదండ్రులకు కూడా సంక్రమించు తుంది. పాపం రామయ్య యోగ్యుడు. ధర్మాత్ముడు. ఆయన జ్ఞానం వేరు. ఓహో! ఎంత తపస్వి. ప్రాతః స్నానం ఎప్పుడైనా మానాడా? దేవపూజ చేయని రోజుందీ? ఆయనకు ఇట్లాంటికొడుకు పుట్టాడు. ఆఁ నే నెరుగుదు వాణ్ణి. వాడిట్లాంటి పనులు చేయడే. కాని సంసర్గదోషం, ఏం చేస్తాము'' అని గంభీరంగా ఉపన్యసించి తన పరితాపం చూపిస్తూ మహా అనర్థం అని తెలియజేసాడు.

నారా:—అయ్యో! అట్లా అనవద్దు. గొప్పవాళ్ల ఇల్లు అది. పిల్లవాణ్ణి విడిచిపెట్టటం బాగుండదుకదా! ఏదో కొంత ప్రాయశ్చిత్తం ఆవశ్యకం.

రామ:—నేనేం జేసేది. మహర్షులకింటులో ఏం లేదు. వాళ్లకు గృహస్థుల కష్టాలు ఏం తెలుస్తాయి వాళ్లు చెప్పినట్లు చేయుటమా - కుదరదు. నన్నడుగుతున్నారు కాబట్టి చెప్పుతున్నా. మునులు చెప్పినట్లు చెయ్యాలిసిందే.

నారా:—ఎందుకండీ ఇదంతా; ఈ ప్రవాద ఊళ్లోకి ఇంకా ప్రాకిపోకుండా ఏదో ప్రాయశ్చిత్తం చెయ్యాలి. స్పష్టంగా చెప్పండి.

రామ:—ఏమండీ మీరుకూడా ఇట్లా అంటారు. ఇదేం విలాసా? శాస్త్రింగదా!

నారా:—శాస్త్రింలో ఏం చెయ్యాలన్నారు. చెప్పండీ. అట్లాగే చేస్తాము,

రామ:—అదే ఆలోచిస్తున్నా. ఎట్లా చెప్పేది? రామయ్య మహా దొడ్డవాడు. మనస్సు వేధిస్తోంది. ఏమి చెయ్యను కానండి. ఎవరికైనా ఇంకా పెద్దల్ని అడుగుదురూ?

తన్ను విడిచివెళ్లరని తెలుసు.

నారా:—స్వామీ! మీరుంటూండగా ఎవరా శాస్త్రార్థంచెప్పేది? సాక్షాత్తు శంకరమూర్తులు. మీరే ప్రమాణం.

రామ:—నిర్బంధిస్తున్నారే. సరే. అయితే చెప్పుతా. మీరు కోపించవద్దు. నేను శాస్త్రింలో ఉన్నట్టు చెప్పుతాను. నేను తెలుసుకున్నంత వరకు. మనపూర్వులు వెళ్లిన త్రోవను మనం వెళ్లాలిగదా! ఏమంటారు? నే చెప్పేది యుక్తమా? అయుక్తమా? బాగుండకపోతే చెప్పండి. నాకేం ఇంతట్లో వైరస్యం కలుగదు.

నారా:—మీరు పలికింది ఎప్పుడైనా అసాధువవుతుందా? పాపం రామయ్య పరితపిస్తున్నాడు. నేను వెళ్లితే గాని భోజనం చెయ్యడు. ఏదో దారి లొందరగా చెప్పండి.

రామ:—దరిద్రుణ్ణి; కాకపోతే ఎట్లా చెప్పేది మార్గం. జిహ్వాఛేదించాలని శాస్త్రాల్లో విధించారు.

నారా:—అబ్బా! కష్టము- మహా అనర్థం. వంశచ్ఛేదమే అవుతుందే మరి.

రామ:—అందుకనే నే నేంచెప్పటాని కిష్టపడ లేదు. ఏదోమీరు నిర్బంధిస్తే శాస్త్రింమీద భారం వేసి చెప్పాను. నేనేం చెయ్యను చెప్పండీ మరి.

నారా:—ప్రత్యామ్నాయం ఏమీ అనుశాసించ లేదూ?

రామ:—ఉన్నది, తెలుసు. దుష్కరమది. ఎట్లా గంటి?

నారా:—ఆ సంశయం మీకువద్దు. పులిపాలు తీసుకవస్తాను. ధనం విషయంలో ఆలోచన అక్కర లేదు. బోలెడుంది. అట్లాంటిదుంటే చెప్పండి.

రామ:—చెప్పుతా, సత్యమేచెప్పుతా, చెప్పింది యుక్తంగా గ్రహిస్తే బాగుంటుంది. శాస్త్రుల్లుగారికి ధనంగావాలి. ఆయనకేం అనుకుంటే అప్రతిష్ఠ. చూడండి, కాలం మారింది. పూర్వం మా కాలంలో వర్షించమంటే వర్షించాలి. ఇది అట్టాంటి కాలమా? అంతా ఆలోచించిపలకాలి. ఏం? నే చెప్పిందిబాగా ఉందా లేదా?

నారా:—మిమ్మల్ని అట్లా అనుకునేవాడు ఈ ఊళ్లో లేడు. ఆ పిల్లవాణ్ణి మీరేం కుక్కపాలు తాగమన్నారా? అడిగితే విధి చెప్పుతారు- చేస్తే చేస్తారు లేకపోతే లేదు. మీకేం, నాకేం. మంచో చెడ్డో లోకం పలుకుతుంది. గ్రామాన్ని ఎవడు కప్పుతాడు, చెప్పండి. నేనున్నానుగా సర్వం సన్నద్ధం చేస్తాను. ఏమైనా సరే.

రామ:—యోగ్యులండీ మీరు. మీ తాతగారిని ఎరుగుదురు కాదూ? ఏం మహానుభావులండీ? నేను లేక ఏకర్మా చేసేవారు కాదు. ఉపాకర్మలో మూడు ముట్టచెప్పారు. మీకిక ధైర్యంగా చెప్పుతా.

నారా:—ఎందుకండీ. స్వేచ్ఛగా చెప్పండీ. నేనున్నాను.

రామ:— ప్రాయశ్చిత్తవిధానంకూడా పాపమే. మంచిజ్ఞానం ఉంటేనేగాని ప్రాయశ్చిత్తం చెప్పకూడదు. ఏం చెయ్యను. మీరిట్లా అడుగుతుంటే చెప్పక పోవటం మంచిది కాదు.— బంగారంతో పురుషవిగ్రహం చేయించాలి. దానినాలుక మంత్రపూర్వకంగా కోసి విగ్రహంనో బ్రాహ్మడికి దానం చెయ్యాలి. పదిమందికిపైగా శ్రోత్రియులకు సంతర్పణ చెయ్యాలి. ఇవి స్వయంగా జరపాలి. ఆలోచించండి.

బాగా ధనంఉన్నా శాస్త్రిగారికి సంతర్పణ అంటే సంతోషం. జ్వరంవస్తే చారు. చుట్టంవస్తే పప్పు సంప్రదాయం వాళ్లది. మామూలుగా లోహమందూరాలుసున్నిలో గడుపుతుంది ఆయనభార్య. వాళ్ల పుట్టింటివాళ్లిచ్చిన బఱ్ఱెను పోషించటం, మజ్జిగా, పెరుగూ పాలూ నెయ్యీ అమ్మటం వాళ్లనీ పిల్లనీ తిట్టడాలతో ఆమెకు వంటకు తీరికలేదు. ఖర్చని భయంకూడా. పెరుగూ అవ్వి అమ్మి దండకడియం చేయించుకోవాలని ఎన్నాళ్లనుంచో ప్రయత్నం.

నారా:—వెండితో చేయ......

రామ:— ఎబ్బే, పనికిరాదు పనికిరాదు. ద్రవ్యలోపం ఎప్పుడూ మంచిదికాదు. అసలు ఈ పాపానికి ప్రాయశ్చిత్తమే లేదు. ఆ రామయ్యగారు మంచివారు మీరూ అడిగారు. అందుకనే ప్రాయశ్చిత్తం చెప్పాను. ఏదో పిల్లవాళ్లుగదా అని కొంచం ఎచ్చుతగ్గులుపహించి నిర్ణయించాను. పాపమేం తక్కువదా? దాని ప్రతిగ్రహంమట్టుకు తక్కువనా? నిన్ననే గాయత్రి జపం పూర్తి అయింది. చూడండి. రోజుకో లక్ష చొప్పున మండలంరోజులు చేశాను. రజతంలో పదరదండీ.

నారా:—సరే - దర్శనం చేస్తాను. వస్తానండీ.

రామ:—(వెంటనే కొంతదూరం వెళ్లి) మీరు కనకా........చేయించేట్టయితే - అప్పుడూ — మీకు గూడా మనవి చేయాలా? తమకు తెలుసు కాదూ?

నారా:—తెలుసు తెలుసు. మీరే సత్యం ఇంకో కరికా?

రామ:—(చిరునవ్వుతో) ఇదంతా మీ అన్నమే. మరచిపోయినాను. యజ్ఞోపవీతం కావాలన్నారు కాదూ? మీరు స్నానంచెయ్యండి నేను పట్టుకువస్తాను.

నారా:—ఇవ్వాళ వద్దు లెండి. ప్రొద్దున్నే కాఫీ తాగాను. రేపూ.

నారాయణరావు వెళ్లగానే ఈ విషయం భార్యకు విన్నవించాలని శాస్త్రిగారు మహాతొందర పడ్డారు- ఈ వృత్తాంతం నివేదించితే వేళకుపక్వాన్నం వడ్డించుతుం దనీ, దేవుడి నివేదనకు ప్రతిదినం ఇచ్చే పత్తిగింజంత వెన్నను పోకచెక్కంతైనా చేస్తుందనీ ఆశ. ఆ తొందరతో తలుపు ధడాలుననెట్టే టప్పటికీ అది ధడాలున గోడకి కొట్టుకుంది. ప్రాయశ్చిత్తమూ, బంగారం వెండీమాటలు వినపడుతూ ఉంటే ఏ మాటా అని తెలుసుకోవటానికివచ్చితలుపు చాటునుంచి బయట అరుగు మీద వీళ్ల మాటలువింటూ సంతోషంతో

కదలకుండా ఉండేటప్పటికి తలుపు దెబ్బ శాస్త్రి గారి భార్యకు మంచి నొప్పినిచ్చింది.

వెంటనే చురచురా కోపంతో "ఎందుకో లోపలకు వచ్చింది? ఏంచెయ్యా లెక్కడ? నావళ్లంతా విరిగిపోయింది. ఎందు కీతొందర? నీ తొందరమండ? చూడు! నా కీప్రాయశ్చిత్తం జరిగింది." అంటూ గుక్క తిప్పుకోకుండా అరవటం ప్రారంభించింది. రామశాస్త్రి బిత్తరపోయి భయంతో 'నువ్విక్కడ ఉన్నట్లు నాకు ఎట్లా తెలుసు? మామూలుగా తలుపు తెరిచాను. తగిలిందో లేదో ఎందుకీ హడావిడి;' అని ఓదార్చుతూ పలికాడు. ఆమె కోపం మండిపోయింది. "తలుపు నెమ్మదిగా తీస్తేనే అట్టా అయితే, తొందరగా తోస్తే ఇంకెట్లా అవుతుందో? నీచేతులు మండా" అంటూ ఏడుపు ప్రారంభించింది.

రామ:—కోప్పడకు బయట చూడు ఎవరున్నారో సంతోషవార్త ఒకటి చెపుతాను.

భా:—ఏమిటావార్త? "నోములు నోచి నోచి మా అమ్మ కని పారేస్తే నిన్ను పెళ్లి చేసుకుని కట్టు బట్టలో తిరుగుతున్నాను. ఇంతకన్న ఏమిటి?"... అంటూ తలుపు గడియ వేసింది. ఆయన ఓదారుస్తూ దగ్గిరకు వచ్చి నిలుచుని—

రామ:—ఇవ్వాళ్ల మన పంట పండింది. రామయ్య గారింట్లో ప్రాయశ్చిత్తం జరుగుతుంది. మూడువందలకు పైగా ముట్టవచ్చు. రెండు మూడురోజులు పైగా మృష్టాన్నం.

అని పలికేటప్పటికి ఆమెకు వళ్లు మండింది.

"నేనేంరోజూ మన్ను పెట్టుతున్నావా? మృష్టాన్నం మృష్టాన్నం అని పొరుగింటి త్రుంచాన్నం కోరు కోపటం ఎందుకు? ఈనాలిక తిరక్కపోతే సంసారంలో సుఖం ఉండదు. నిన్ను విడిచి ఎక్కడికైనా వెళ్లి ఉండాలని ఎన్నాళ్లో నుంచో అనుకుంటాను. ఆ కాలం ఇంకా తటస్థించలేదు. పిల్లవాడు బంధంగా ఉన్నాడు." అని కఠినంగా ప్రారంభించింది.

ఇల్లాంటి కలహం రోజూ వారింట్లో మామూలే. బ్రాహ్మణార్థంనాడు ముద్దముద్దకూ నెయ్యి రుచి చూసే నాలిక మర్నాడే వక్క బొట్టైనా నెయ్యి లేకుండా ఉండటం ఎట్లా అంగీకరిస్తుంది.? నెయ్యిబాగా ఉండికూడా అమ్మకానికి దాచిపెడితే కోపంరాదూ? రోజూ రామశాస్త్రి ఎదటే వెన్నపూస కరిగిస్తూ "బాగా కాచిననెయ్యి, నూకలనెయ్యి, ఒక్కణా అధికం ఇవ్వాలి" అంటూ పిడతలో పోసి వాసినకట్టి దాచి పెడుతుంది చూస్తూ ఉంటే ఈయనకు దుఃఖం కలుగుతుంది. ఒకనాడు నెయ్యి కరగ పెడుతూ ఉండగా పొరపాటున సోల కిందపడి అంతా పోయింది ఈయన చూస్తూ ఊరికే ఉండలా. అంతే కావాలి పొట్ట మాడ్చుకొని అన్యాయంగా ఆర్జించితే ఉంటుందీ? తినటానికైనా ఉంచితే బాగుండును. అని పకపకా నవ్వాడు. అంతటితో ఆయనభార్యకు కోపంవచ్చి ఒక నెల రోజులు తిట్టింది. ఆయన తాతలు దిగి వచ్చారు బతిమాలుకొనేటప్పటికి, ఎందుకూ,కోపం వచ్చినప్పుడు దగ్గిరున్న......తీసుకొని చెయ్యి నొప్పి పుట్టేదాకా కొట్టింది. అందుకని ఆయన పది రోజులింటికే రాలేదని విన్నాం "మాట్లాడితే మండిపడుతుంది. ఏం చెయ్యను" అని అనుకొని "రెండు మూడు రోజులు భోజనం దొరికితే మన యింట్లో వస్తువులు మిగులుతై కదా! అందువల్ల మనకు లాభమే అని నేనంటే ఏదో అపార్థం చేసుకొని కోప్పడతావు" అంటూ బతిమాలుకున్నాడు.

భా:—ఇల్లా అనుకుంటే బాగానే ఉండేది. భోజనానికి తృప్తిఉందీ? ఎంతతిన్నా ఆ వెధవ కడుపు కావాలనే అంటుంది. సరేకాని ప్రాయశ్చిత్తం ఏమిటి?

రామ:—(ఇప్పు డవకాశం ఇవ్వకూడ దనుకొని) ఏదో అట్లా బయటికి వెళ్లి విషయం తేల్చుకోవాలి.

భా:—అయితే ఇక్కడెందుకు ? వెళ్లి కనుక్కోరాదూ ఇంతట్లో వంట చేస్తాను.

అని సుముఖంగా పలికింది. బాగా రెండు జాములయింది. ఇక గతిలేక ఆకలి బాధిస్తూన్నా, ఆపెళ్లాం శూలంపోటు మాటలనుండి తప్పించుకోవటమే మహా భాగ్య మనుకొని నడివీధిలోకి వెళ్లాడు అక్కడ నారాయణరావు మళ్లా కలిశాడు.

రామ:—ఏమండో ఏ మన్నారు వాళ్లు?

నారా:—అన్నారు అక్కడ......

రామ:—ఎబ్బే లక్కువ చేయటాడికి వీల్లేదు. ఇది అసాధ్యం.

నారా:—అదికాదు ఆపిల్లలు......

రామ:— చేశే ఉంటారు. ఇప్పుడు కప్పి పుచ్చటం శక్యమే ?

నారా:—అట్లా అనకండి శాస్త్రిగారూ! ఏదో విధంగా పరిహారం ఒకటి చెప్పాలి. ఒకవిశేషముంది. ఏకాంతంగా మనవి చేస్తా.

రామశాస్త్రిని అవమానించటానికి ఐదారుగురు వచ్చారు.

రామ:—ఏకాంతందేనికి? నేను పరిహారం చెప్పను. అసలు ఇదే మధ్యమపక్షం.

నారా:—ఒకవేళ మీకుమారుడే చేశా డనుకోండి అప్పుడు మీరేంచేస్తారు ?

రామ:—నాలుక ఛేదిస్తాను. ఏమండో మీరే అట్లా అంటున్నారు ?

నారా:—మీ అబ్బాయి కూడా తాగాట్ట. అంతా అంటున్నారు.

రామ:—మాకృష్ణ డాపని చేస్తే అవశ్యంగా జిహ్వాచ్ఛేదనం చేస్తాను.

నారా:—సందేహమేం? మీ అబ్బాయి కూడా తాగాడు. ఇదుగో నేనే చెప్పుతున్నా.

రామ:—ఎగతాళి అక్కరలేదండీ! ఈ పెద్దమనుష్యులు విశ్వసించవద్దూ! చాలు ఊరుకోండి.

నారా:—ఏం ఎందుకూరుకోవాలి? మీవిషయం ఎవ్వరికీ తెలియదని అనుకుంటున్నారు కాబోలు.

రామ:—మీమాటలు నాకర్థం కావటంలేదు.

నారా:—ఎట్లా అర్థమవుతై. అర్థంకావు. ఇతరులకైతే "ఇట్లా చెయ్యాలి. అట్లా చెయ్యాలి. గంగాస్నానం, సేతుస్నానం, సువర్ణదానం" అని విధిస్తారు. మతీ ఇంత ఆశ పనికిరాదండీ,

రామ:—అతిప్రసంగం వద్దు. మాకృష్ణుడు తాగాడా? తాగినట్టు మీకు తెలుసా ?

నారా:—తాగాడు; తాగాడు; ముమ్మాటికి తాగాడు. తెలుసు నాకు తెలుసు ముమ్మాటికి తెలుసు. పచ్చిక పట్టుకొని ప్రమాణం చేయమన్నా చేస్తాను.

ఈమాట వినగానే రామశాస్త్రి తలకాయ తిరిగిపోయింది. మెల్లిగా లేచి వెళ్లితలుపు నెట్టాడు. అక్కడ భార్య ఉందేమో అని భయం లోపలికి వెళ్లి "కృష్ణుణ్ణి చూశావా?'' అని భార్యని అడిగాడు

భా:—మెల్లిగా మాట్లాడండి. కంఠబలం చూపించటం ఎందుకు? నేనంతా విన్నాను. పిల్లవాడికేం తెలుసు? తాగాడేమో. విచారం ఎందుకు ?

రామ:—అహాఁ ! వాడిని ఎదుట అడగాలి.

భా:—ఇంకా అడగటం ఎందుకు? నేను కనుక్కుంటే తాగాను అని చెప్పాడు.

భార్య ఇట్లా పలకగానే రామశాస్త్రి వెనక్కితిరిగి వెళ్లి మాఅబ్బాయి ఇంట్లో లేడు. రాగానే కనుక్కుంటాను. ఇంకా ఆలోచించే దేమిటి? మీరు చెప్పుతున్నారుగా, మీరేం అబద్ధం చెప్పుతారా! ప్రాయశ్చిత్తంచేయించితీరాలంసిందే-నాకిట్లా లోచింది. అయినా శ్రీరంగపురంలో ఉంటున్నాడే, ఉభయ వేదాంత ప్రవర్తక ప్రతివాది భయంకరం రంగాచార్యులు గారు, ఆయన్ని ప్రాయశ్చిత్తోపదేశ విషయంలో అడగటం

సమంజసంగా ఉంటుంది. మీకు తెలిసే ఉంటుంది చాలా ప్రసిద్ధుడు. ఇక ధర్మశాస్త్రాల్లో అంతవాడు లేడు. నిష్పక్షపాతంగా ఇట్లాంటి విషయాలు నిర్ణయిస్తాడు. నేను వెళ్లి ఆయన అభిప్రాయం కనుక్కుంటాను. ఒకవేళ ఆయన—కుక్క రంగు—ఎవడు తాగింది—ఎట్లా కాచింది—అడుగుతాడు. ఈ విషయాలకు సమాధానం చెప్పవలసి ఉంటుంది. మీకిదేమన్నా తెలిస్తే చెప్పండి.

నారా:—కుక్క నల్లటిది. గడిచిన ఆదివారం నాడు ఉదయం సమిధలతో కాగబెట్టి కాఫీ చేసి ముగ్గురు నలుగురు పిల్లలు కలిసి.........

రామ:—సరే తెలిసింది. నేనిప్పుడే వెళ్ళి యీ విషయం తేల్చుకుని సూర్యాస్తమయం కాకముందే తిరిగివస్తాను. రాత్రికి చీకటిగదా! సరే మీరు వెళ్లండి; పెద్దలనేకులు చెప్పితే ఆచరించక తప్పదూ.

ఈమాట విని అట్లాగే నని అందరూ వెళ్లారు- రామశాస్త్రి నోటు వాయిదా వెళ్ళిపోతుంటే మళ్లీ తిప్పి వ్రాయించుకోవటానికి శ్రీరంగపురం వెళ్లి సాయంకాలానికి చేరగానే "రంగాచార్యులుగారు ఏమన్నారు.'' అనినారాయణరావుసంభ్రమంతోఅడిగాడు,

రామ:—ఏమీచెప్పలేదు. ధర్మశాస్త్రి ప్రమాణ శ్లోకం వ్రాసి యిచ్చాడు.

అని ఒక కాగితము వాళ్లముందు పడవేశాడు. అందులో ఇట్లా ఉంది.

వాసరో యది సూర్యస్య
శ్యామలా యది వా శునీ
క్వాథ్యతే యది తత్ క్షీరం
క్వాథనం సమిధా యది
సహాయా యది వా బాలాః
తేచ త్రి చతురా యది
యదికృష్ణః పిబత్యేతత్
నదోషః — కౌశికో బ్రవీత్

ఇదంతా చదవంగానే వాళ్లందరూ రామశాస్త్రి ధార్ష్ట్యానికి, నాస్తిక్యానికి, ధైర్యానికి భయపడి మౌనం వహించారు.

రామ:—ఏమండో. ఇంకో విషయం. ధర్మగ్రంథాల్లో ఎక్కడా కాఫీ త్రాగకూడదు, అనిలేదు అందువల్ల పైన చెప్పిన లక్షణాలతో కూడుకొన్న పాలు కాఫీలోకి ఉపయోగించితే దోషం ఉందని ఏ శాస్త్రిమూ చెప్పదు. అన్నాడు. ఇక నారాయణరావు ఆటలు ఏమీ మినకలేదు. రామశాస్త్రికి మట్టుకు ప్రాయశ్చిత్త విధానంలో వస్తుందనుకున్నదానికి ఇది ఒకటి అడ్డువచ్చింది - అందువల్ల ఆయనమనస్సు సరిగా లేక కొన్నాళ్లు వికలంగా ఉన్నాడు. తరువాతి ఆయన వృత్తాంతం బాగా కనిపెట్టితేనే గాని నిరూపించలేను.

---:o:---

# ప్రహ్లాదుని భక్తి

కీ॥ శే॥ బులుసు - సీతారామ శాస్త్రిగారు,

సీ. వనజనాభునిపాద వనజాతములఁగొల్వ హస్తమా! నీకు ప్రశస్తిగల్గు,
కంజాక్షువర్ణనా కర్ణనోదీర్ణత శ్రోత్రమా! నీకు విశ్రుతి ఘటిల్లు,
కనకచేలునిరూపు గరవుదీఱగఁజూడఁ కన్నులారా! మీకు పున్నెమబ్బు,
విష్ణునందువిలీన వృత్తిగై కొనమనంబా! నీకుఁభావనత్వము సెలంగు.
గీ. అటుల గాకెందునే నింద్రియంబులార! భృంగపోతంబు సంపఁగి విరికిఁజిక్కు-
నటుల గస్పట్టునట్టి పదార్థతతికిఁ, జిక్కమీబ్రతుకేమని చెప్పవచ్చు?

# సేతుయాత్ర

వరిగొండ – సత్యనారాయణమూర్తిగారు

ఉల్లము రంజిల్లునట్లు, చల్లనిగాలి యల్లనల్లన వీచుచుండ ముద్దుబిడ్డను మెత్తని పాన్పునఁ జేర్చుకొని జనకుఁ డాతనికి నక్షత్రములతో నిండియుండు నిర్మలాకాశమున నుత్తర దక్షిణములుగా వ్యాపించియుండు పాలసముద్రమును జూపుచు "నాయనా! అదియే 'కాశి రామేశ్వరపు బాట" అని చెప్పుచుండుటలు, మనకుఁ దెలిసిన విషయమే, క్రొత్తగుడ్డలకు రంగు బాగుగాఁ బట్టినట్లు చిన్నతనమునఁదోఁచు భావములు యావజ్జీవము నిలిచియుండి, మానవుని భావిజీవితవిధానమునకుఁ గారణభూతములై యుండును. ఉగ్గుపాలతో నుద్భవిల్లిన బాలునికోరిక వయసుతో నభివృద్ధి కాగా, నాతఁడు కాలక్రమమునఁ గాశీరామేశ్వరములకుఁ బోయి, ఆసేతుహిమాచలము నంగల పుణ్యతీర్థములయందుఁ గ్రుంకులిడి, ప్రసిద్ధములగు దేవాలయముల సందర్శించి, ఇహపరముల ధన్యుఁడగుచుండును. హిందువులకుఁ దీర్ఘయాత్ర విహితకృత్యము. జననియు జన్మభూమియు స్వర్గముతో సమానమని హైందవులు భావించుచుందురు. కానఁ బుణ్యభూమియగు భరతఖండమున కొక్క ప్రదక్షిణమున్నైనఁ జేయుట కిచ్చగింపని మానవుఁడు, భారతీయులలో నుచ్చునకైనఁ గానరాఁడనుట సాహసము కానేరదు.

## యాత్రాక్రమము

కాశీ రామేశ్వరయాత్రను గొనసాగించుటకు ముందుగా రామేశ్వరమునకుఁ బోయి, అచటనుండి కాశికిఁ జని, అచటి గంగాజలములఁ దీసికొని మరలి రామేశ్వరమునకుఁ బోయి, అచట రామలింగస్వామి కాజలములతో నభిషేక మొనరింపవలయును. అప్పటితో యాత్రాక్రమము పూర్తి యైనట్లగును.

## నవపాషాణము

రామేశ్వరమునకుఁ బోవుటకుముందుగా దేవీపట్టణమునకుఁ బోవలయును. దీనికే నవపాషాణ మనిపేరు. రామనాథపురమున కీగ్రామము తొమ్మిదిమైళ్ల దూరమున సముద్రతీరమున నున్నది. ఇచట రామచంద్రుఁడు ప్రతిష్ఠించిన నవగ్రహములు (తొమ్మిది రాతిస్తంభములు) సముద్రజలములయం దున్నవి. ఇవి యుండు ప్రదేశమున మొలబంటినుండి మోకాలిబంటివఱకుఁ గాలస్థితి ననుసరించి నీరు నిలిచియుండును. ఇది బంగాళాఖాతము ఇచట సాగరము నిశ్చలమై యుండును.

యాత్రికు లిచట నవగ్రహములకుఁ బూజ, ప్రదక్షిణము, దానము మున్నగునవి కావించి, తమజీవితములకు ముఖ్యకారణమగు నవగ్రహములను ప్రసన్న మొనరించుకొని రామేశ్వరమునకుఁ బోవలయును.

## రామేశ్వరద్వీపము

రామేశ్వర మొకచిన్నద్వీపము. దీని విస్తీర్ణము నలువది చదరపు మైళ్లు. ఈదీవి ముక్కోణాకారమున నున్నది. భరతఖండమునకును, రామేశ్వరద్వీపమునకు నడుమనుండు జలసంధి రమారమి రెండుమైళ్ల నిడుపున్నది. జలసంధికి తూర్పున ద్వీపముపై పాంబన్ స్టేషన్: పశ్చిమమున భరతఖండముపై మండపముస్టేషన్; వీనిని రయిల్వే వంతెన కలుపుచున్నది. పాంబనునుండి రామేశ్వరమునకు 7 మైళ్లు. రామేశ్వరమునుండి ధనుష్కోటికి సముద్రముమీదుగా 12 మైళ్లు. పాంబనునుండి రైలుమార్గమున 17 మైళ్లు.

## ధనుష్కోటి

రామేశ్వరమునకుఁబోయి దైవసందర్శనమునకు తీర్థస్నానమునకు ముందుగా సేతుస్నాన మొనరింప వలయును. సేతువు ధనుష్కోటికి రమారమి మూఁడుమైళ్లలోనున్నది.

## సేతువు

బంగాళాఖాతమును (రత్నాకరము) హిందూమహాసముద్రమును (మహోదధి) కలియు స్థలమునకే 'సేతువు' అని పేరు. కాళ్లు కూరుకొనిపోవు యిసుకయందు రెండు సముద్రముల మధ్య స్నానఘట్టమునకు నడువవలయును. కుడితట్టు మహోదధి ప్రపంచము నంతటిని గబళించుటకో యనుఁగొండలవంటి యలలతో దొర్లుచు ఘోర రాక్షసునివలె ఘోషించుచుండును. అచటికిఁ గొన్నియడుగుల కెదుటనే రత్నాకరము సజ్జనుఁడగు సంపన్నునివలె నిశ్చలమై నిలిచియుండును.

## పూజ- స్నానము

పూర్ణిమామావాస్యలయందు మాత్రము సముద్రస్నానము విహితమనియు, ఇతర దివసములయందు దోషమనియుఁ జెప్పఁబడియున్నది. కాని సేతువుకడ సముద్రస్నానము అన్నికాలములయందును చేయనగును. ఇచట సికతాతలమున మంత్రయుక్తముగా శ్రీరామధనుర్బాణములను జిత్రించి పుష్పాక్షతలతో బూజింపవలయును. అనంతరము దోసిలినిండుగా నిసుక దీసికొని సముద్రజలముల సమర్పించి స్నాన మొనరింపవలయును. మొత్తమున ముప్పదియారు స్నానములొనరించి, ఆవెనుక రామేశ్వరమునకు దిరిగి రావలయును.



ఎ. వి. టి. అయ్యరుగారి అనుమతిని.

రామేశ్వర దేవాలయపు విమానము




## రామేశ్వరము

రామేశ్వరమున నిరువదినాలుగు తీర్థములున్నవి. చాలతీర్థములు దేవాలయ ప్రాకారమునందుఁ గలవు. కోటితీర్థము, సర్వతీర్థము కడపటివి. లింగాభిషేకముకొఱకు శ్రీరాముఁడు గంగాజలముల దెచ్చి కోటితీర్థమున నిలిపెనని ప్రసిద్ధి. చతుర్దశభువనములంగల తీర్థములన్నియు సర్వతీర్థమునఁ గలిసి యున్నవని చెప్పెదరు. రావణుని వధించినపిమ్మట రాముఁడు బ్రహ్మహత్యాపాతకమును బాపుకొనుటకై శివలింగమును బ్రతిష్ఠింపనెంచి, లింగమును గొనిరా హనుమంతుని బంపెను; కాని నిర్దిష్టకాలమున కాతఁడు రామిం జేసి, సీతాదేవి సైకతలింగమును నిర్మించి, దానికి రామలింగమని నామమిడెను. అనంతరము హనుమంతుఁడు శివలింగమును గొనివచ్చి జరిగినదానికి కుపితుఁడై, రామలింగమును పెకలింపఁ బ్రయత్నించి విఫలుఁడయ్యెను. భక్తుని యారాటమును గాంచి రాముఁ డాతఁడు దెచ్చిన లింగమునుగూడ నచటనే నిలిపెను. ఇది స్థలపురాణము.

## దేవాలయము

రామనాథాలయము చాలప్రాచీనమైనది. ఇచట శిల్పము మిగుల రమణీయముగ నుండును. దేవాలయ వైభవమంతయు ముఖ్యముగాఁ బ్రాకారములఁబట్టి యున్నదని చూపఱకు విదితము కాఁగలదు. దీనిని స్వయముగ వర్ణింపఁబూనుట అసాధ్యము.

## గంధమాదనము

రామనాథాలయమునకు దూర్పున రెండు మైళ్లలో గంధమాదనపర్వత మున్నది. దీనిపై నుండి సమీరకుమారుఁడు సీతను వెదకు నిమి

త్తము లంకను లంఘించెనందురు. అప్పటి గంధమాదనము ఇసుకదిబ్బకన్న వేరులేదు. ఈయిసుకతిప్ప షుమారు నూరడుగుల యెత్తుండును. "మొగము బిగించి, పాదములు మొత్తముగా నటనూది త్రొక్కి ... ... వలయంబుగ వాలముఁ ద్రిప్పి వ్రేగుగన్, నగము నగమ్ము గ్రుంగ కపినాథుఁడు నింగికి దాఁటె తీవ్రవన్" అని కుమ్మరి మొల్ల వ్రాసినట్లు కొండ క్రుంగినందున నెత్తు తగ్గినదని యిచటివారు చెప్పుదురు. కాని, రామాయణముప్రకారము హనుమంతుఁడు మహేంద్ర పర్వతమునుండి లంకను లంఘించెను. గాని, గంధమాదన ప్రశంస యెచటను గానరాదు. ఇది విమర్శనీయము. ఈయిసుకతిప్పకుఁ బైన నొకయాలయమున్నది. దేవాలయముపైకి మెట్లున్నవి. ఈకోవెలయందుండు రామపాదములను యాత్రికులు కన్నులకద్దుకొని శిరమునఁ జేర్చుకొని వానికి నీరాజన నైవేద్యము లిత్తురు. దేవాలయము పైభాగమునుండి సాగరవలయితమగు రామేశ్వరద్వీపమంతయు నగపడును. అప్పుడు నీకెంతు సంతోష మనమానము. పవిత్రమగు క్షేత్రమును సందర్శించి నీవు సంతృప్తాత్ముఁడ వైతివిగదా! ఇఁక రామేశ్వరమునుండి తిరిగివచ్చునప్పుడు దర్భశయనమునకు బోవలయును.

## దర్భశయనము

దీనికి 'తిరుపులాని' అనికూడ పేరు. దేవాలయము గ్రామమం దున్నది. గ్రామమునకు సముద్రమునకును షుమారు మూఁడు మైళ్లుండును. గ్రామము రామనాథపురమునకారు మైళ్లుండును. సేతువును నిర్మింపఁ దలచి శ్రీరాముఁడు శుచియై దర్భశయనమునుండి ప్రార్థించెను. కాని సాగరుఁడా యవతారమూర్తి ప్రార్థనలఁ జెడచెవినిఁ బెట్టి యట్లే ఘూర్ణిల్లుచుండెను. అంత నాతని నిర్లక్ష్యభావమునకు రాముఁడు క్రుద్ధుఁడై విల్లునెక్కువెట్ట నుండగా సాగరుఁడు స్వాపరాధమును గుర్తించి రామునిఁ బ్రసన్నుఁ జేసికొని సేతునిర్మాణమునకుఁ దెర వొసంగెను. ఇది స్థలపురాణము.

యాత్రికుఁడు మంత్రయుక్తముగా సముద్రస్నాన మొనరించి శ్రీరామధనువు నిసుకపై జిత్రించి పూజచేయవలయును. ఆలయమున శ్రీరాముఁడు దర్భలపై శేషతల్పమున బరుండి యున్నాఁడు. దేవాలయప్రాకారమునందే ఆదిజగన్నాథస్వామి పద్మాసనసమేతుఁడై వెలసియున్నాఁడు. ఫుల్లమహర్షి తపమునకు మెచ్చి ఆమహాస్వామి యిచట వెలసెనందురు. ఈక్షేత్రసందర్శనముతో రామేశ్వర యాత్ర సాంత మైనట్లగును.

## మధుర

రామేశ్వరమునుండి తిరిగివచ్చునపుడు మొట్టమొదట మధురకుఁ బోనగును. మధుర రామేశ్వరమునకు నూరుమైళ్లలో నున్నది. ఆనగరమును సమీపించు కొలఁది చుట్టుపట్టులఁగల ఆనెమలై పశుమలై పర్వతము

లతో నుద్దీకివచ్చుచుండు నున్నతములగు గో పురములు కాన నగుచుండును.

మధుర సార్థకనామధేయము కలది. మీనాక్షీసుందరేశ్వరాలయము, తిరుమలనాయక నగరు ఆపురమునకుఁ బెట్టని భూషణములై యున్నవి. వానియందలి శిల్పచాతుర్యమును జూడ, ఆకాలపుశిల్పులకు శిలలు మైనపుముద్దలైనవేమోయను సందియము కలుగక మానదు. దేవాలయమునందేమి, నగరునందేమి, చిత్రములు, చెక్కడపుఁబనులు జీవకళలలో నొప్పారుచూ, మిగుల ప్రాచీనములయ్యు నిన్ననో నేఁడో నిర్మింపఁ బడినట్లున్నవి. మీనాక్షీసుందరేశ్వరుల కెదుట 'స్వర్ణపుష్కరిణి' మనోజ్ఞమైయున్నది. దైవసందర్శనమునకుఁ బోవుటకుమున్ను యాత్రికు లీ పవిత్రజలముల ముఖమును పాదములను ప్రక్షాళనము లొనరించుకొని పోవలయును. మీనాక్షీదేవికి ముందు 'అష్టశక్తి మండపము' శిల్పచాతురీవిలసితమై కన్నులపండువై యుండును. సుందరేశ్వరున కెదురుగా 'వసంత మంటపము'న్నది. దీనికి మధ్యనుండు రాతి స్తంభములపై పూర్వము మధురను బాలించుచుండిన నాయకరాజులు పదుగురు సతీసహితముగఁ జిత్రింపఁబడి యున్నారు. గోడలపై శివలీలలు చిత్రింపఁబడియున్నవి.

## తిరుచినాపల్లి

మధురకు నుత్తరముగా షుమారు నూరు మైళ్లలోఁ దిరుచినాపల్లి కలదు. ప్రళయకాలమునఁ గైలాసశిఖర మొకటి యెగిరి యిచ్చటఁ బడిన దఁట. కానఁ దిరుచినాపల్లికి 'దక్షిణకైలాస'మను పేరు కూడఁ గలదు. పూర్వము త్రిశిరుఁడను రాక్షసుఁ డిచటనుండినందుచే, దీనికి 'త్రిశిరపల్లి' అను పేరు వచ్చినది. కాలక్రమమున 'తిరుచినాపల్లి'గా మారినది.

పదునాఱవశతాబ్దమున రాజ్యమేలుచుండిన విశ్వనాథనాయకుఁడనురాజు పురమధ్యమునఁ గావేరీతీరమునఁ గల ఎత్తుకొండపై నొకకోటను గట్టించి, కొండక్రింద దక్షిణముగా నొకకోనేరును ద్రవ్వించెను. ఆకోనేరు నానుకొని యుండు విశాలభవనమునందు రాబర్టుక్లయివు నివసించుచుండినట్లు, ఆధారము లటఁ గాననగుచున్నవి.

కొండపైని కోటయందుండు కోవెలలలో మాతృభూతేశ్వరుఁడు, ఉచ్చిపిళ్లారి (విఘ్నేశ్వరుఁడు) వెలసియున్నారు. ఈపర్వతశిఖరము షుమారు రైదువందల యడుగుల యెత్తుండును. దీనిపైనుండి తిరుచినాపల్లి, శ్రీరంగము, జంబుకేశ్వరము, బాగుగాఁ గనఁబడును.

తిరుచినాపల్లికి నుత్తరమునఁ బ్రవహించు కావేరిని దాటినంతనే శ్రీరంగము జంబుకేశ్వరము లున్నవి.

## శ్రీరంగము

కావేరి శ్రీరంగమునకుఁ బడమర రెండు పాయలై, దక్షిణోత్తరములుఁగా దానిఁజుట్టు

కొని ప్రవహించుచున్నది. సప్తప్రాకారములతో నొప్పారుచు నారికేళ వనములచేఁ నిత్యకల్యాణముఁ బచ్చతోరణమునై సర్వకాలముల భక్తప్రచయముచే నిండియుండు శ్రీరంగము 'భూలోక వైకుంఠము' అను సార్థ కాఖ్యను గలిగియున్నది. సప్తప్రాకారములను సప్తగోపురములను దాటి, శ్రీరంగనాథాలయమునకుఁ బోయినచో శ్రీరంగనాథుఁడు గర్భగుడియందు శేషతల్పమునం జేరి యోగనిద్రయం దుండుటను గన్నులారఁ గాంచి, సేవించి ధన్యుఁడ వౌదువు.

రెండవప్రాకారమున రావణానుజుఁడు రామభక్తుఁడు విభీషణుఁడు నిలిచియున్నాఁడు. నిలిచియుండుటకుఁ దగిన కారణమున్నది. అయోధ్యయందుండిన శ్రీరంగనాథ విగ్రహమును రామచంద్రుఁడు విభీషణున కొసంగి లంకలోఁ బ్రతిష్ఠించువఱకు మార్గమధ్యమునఁ గ్రిందఁ బెట్టవలదని చెప్పెను. విభీషణుఁ డట్లు పోవుచుండ మార్గమున జలబాధకుఁ బోవలసివచ్చెను. అప్పు డచట బ్రాహ్మణ బాలుఁ డొకఁడగపడ, వానిచేతికి విగ్రహము నొసంగి, క్రింద నుంపవలదని కట్టడచేసి విభీషణుఁ డావలఁ బోయెను. కాని యెంతసేపటికిని రాక విభీషణుఁడు జాగుచేయుటచే, బాలునకు విసుగెత్తి విగ్రహమును గ్రిందనుంచెను. ఆవల విభీషణుఁడు వచ్చి విగ్రహము నెత్తుకొనఁ బోగా నయ్యది క్రిందనాటుకొని రాదయ్యెను. తోడనే యాతఁడు క్రోధోన్మత్తుఁడై బాలునిఁ బట్టుకొని శిక్షింపనెంచి వానిఁ దఱిమెను. బాలుఁడు చిక్కక పరుగిడసాగెను. కాన విభీషణుఁడు కసితీరునట్లు ఒకరాయి నాతనిపైకి విసరెను. అది బాలునినొసటఁ దగిలెను. అట్లు పరుగెత్తిన బాలుఁడు తిరుచినాపల్లికొండ పైకెక్కి గణపతి రూపొంది నిలిచెను. నేటికిఁగూడఁ గొండపైని వినాయక విగ్రహము నొసట రాయిదెబ్బకు గుర్తుగా మచ్చను గాంచనగును. దైవసంకల్పము తప్పితిరుగ రానిది కదా!

పదునాల్గవ శతాబ్దప్రాంతమున మహమ్మదీయులు తిరుచినాపల్లిని ముట్టడించినపుడు శ్రీరంగదేవాలయాధికారులు రంగనాథవిగ్రహమును గాపాడ నెంచి దానిని తిరునారాయణపురమునకుఁ దీసికొనిపోయి, ఆవెనుక కొంత కాలమునకుఁ దిరుపతి చేర్చిరి. అనంతరము రెండవ హరిహరరాయలు తొండమండలము నాక్రమించిన పిదప, రెండవకంపదేవుని మంత్రి గోపన్న యను బ్రాహ్మణోత్తముఁడు రంగనాథవిగ్రహమును గైకొనివచ్చి క్రీస్తుశకము 1371-72 లో శ్రీరంగమునఁ బ్రతిష్ఠించి, మరలఁ బ్రాణప్రతిష్ఠాది మహోత్సవము లొనరించెను. తదాదిగా శ్రీరంగము మహాక్షేత్రముగా గణింపఁ బడసాగెను.

### జంబుకేశ్వరము

ఆర్షమతము ననుసరించి శివలింగము లైదుగా నిర్ణయింపఁ బడినవి. అవియుండు ప్రదేశములన్నియు మహాక్షేత్రములుగాఁ బూజిం

షఁ బడుచున్నవి. శ్రీశైలమునందు పృథ్వీ లింగము, జంబుకేశ్వరమునందు ఆపోలింగము, అరుణాచలమునందు తేజోలింగము, కాళహస్తియందు వాయులింగము, చిదంబరము నందు ఆకాశలింగమును గలవు.

జంబుకేశ్వరము శ్రీరంగమునకుఁ దూర్పుగా నొకమైలులో నున్నది. ఆదేవాలయమున్నతగోపురములతో నైదుప్రాకారములఁ గలిగి యున్నది. జంబుకేశ్వరాలయము శ్రీరంగనాథాలయమున కేవిధమునఁగాని తీసిపోవుటలేదు. విశాలమగు నా దేవాలయాంతర్భాగమునఁ బ్రణవనాదము ప్రతిధ్వనించుచు భక్తుల నవ్యక్తానంద రసనిమగ్నులనుగాఁ జేయుచుండును. ఆలయమునందలి లింగమూర్తి సర్వకాలములయందును నీటిచేఁ జుట్టఁబడి సార్థకమగు పేరుతో నున్నది. గర్భగుడికి మీద నొకజంబూవృక్ష మున్నది. ఆవృక్షమునుబట్టియే జంబుకేశ్వరుఁ డని అచటి లింగమూర్తికిఁ బేరు కలిగెను.

ఐదవ ప్రాకారమును నిర్మించునపుడు జంబుకేశ్వరుఁడు మానవరూపమున నరుదెంచి పనివారలకు తిరునీరు (విభూతి) పొట్లముల నిచ్చుచుండెనఁట. వారద్దానిని విప్పి చూడగా వారిదినబత్తెము ద్రవ్యరూపమున నుండుచుండినదఁట; కాన నయ్యది 'తిరునీరు ప్రాకారమని' పిలువఁబడుచున్నది.

జంబుకేశ్వరాలయమునకు నుత్తరముగా అఖిలాండేశ్వరి యాలయమున్నది. హెచ్చు తక్కునగా నియ్యది స్వామియాలయముతో దులదూగు చున్నది. ఇచట నర్చకులు స్త్రీ వేషములతో మహేశ్వరి నర్చింతురు.

జంబుకేశ్వరాలయము నెప్పు డెవరు నిర్మించిరో చెప్పుటకుఁ దగిన యాధారములు చరిత్రాత్మకము లెయ్యవిగాని గానరావు. దేవాలయములు గాని, తీర్థములు గాని సనాతనములని హైందవు లంగీకరింపక తప్పదు. పుణ్యక్షేత్రము లెంతప్రాచీనములైన నంతమహిమోపేతములని హిందువులు నమ్ముచుందురు. దేవాలయము, నది, ఋషి జీవితము-వీనిమూలము లవిచారణీయములు (సామాన్యము లనియెఱింగిన భక్తి తగ్గునను భయమున) నిర్ణయించుకొని వాని మాహాత్మ్యముల నట్లే కాపాడుచున్నారు.

## తంజావూరు

తిరుచునాపల్లికి ముప్పది మైళ్లలో తంజావూ రున్నది పూర్వము తంజాౙ్ అనురాక్షసుఁ డొకఁడు లోకకంటకుఁడై యుండెను. వాఁడు విష్ణుమూర్తిచే సంహరింపఁ బడెను. దానంజేసి యాస్థలమునకు తంజావూ రను పేరు వచ్చెను. తంజావూరు చాలకాలము చోళరాజ్యమునకు రాజధానియైయుండెను.

రాజరాజను చోళరాజు బృహదీశ్వరాలయమును గట్టించెను. దేవాలయనిర్మాణము కొఱకు శిల్పులు కంచినుండి రావింపఁబడిరి. విమాననిర్మాణమునకుఁబూను ముందటిరేయి ఆశిల్పులకుఁ గలలో రానుండు రాజవంశ

ములు గన్పట్టినవంట. కాలక్రమమున వారి కల యెంతయు నిజమయ్యెను. అందుకు నిద ర్శనముగా విమానముపై చోళుండు, నాయ కుండు, మహారాష్ట్రుండు, ఆ వెనుక నాంగ్లే యుండు వీరి విగ్రహములు నిర్మింపఁబడి యున్నవి.

బృహదీశ్వరలింగము చాలపెద్దది. గర్భ గుడినంతయు లింగ మాక్రమించి యున్నది. అది బాణాసుర ప్రతిష్ఠ యందురు. స్వామి కభిముఖముగా నుండు నంది మహోన్నతమై ఏకశిలా వినిర్మితమై నయనానందకరముగ నుండి విస్మయము నొందించుచుండును.

పట్టణమధ్యమున తంజావూరు రాజు మహ లున్నది. ఉన్నతకుడ్య పరివేష్టితమై, విశాలమై యుండు నా రాజభవనము లిప్పుడు నామ మాత్రావశిష్టములై యున్నవి. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార మున్నది.

కుంభకోణము

ఈపట్టణము తంజావూరునకు దూర్పుగా నిరువదియైదు మైళ్లలో నున్నది. ప్రళయా నంతరము శివునాజ్ఞచే నమృతకుంభ మొకటి పయనమయ్యెను. అది ప్రస్తుతము కుంభ కోణముండు ప్రదేశమునకు వచ్చుసరికి శివుఁడు కిరాతరూపమున నాకుంభమును బాణముతో గొట్టెను. అంత కుంభము పగిలి, అందలి యమృతము చిందఁబవంద ఱన్నై యంతటఁ బడినది. అట్లు సుధ చిందిన ప్రదేశమున ననేక దేవాలయము లుద్భ విల్లెను. ఇప్పటికిని కుంభకోణమున ననేక దేవాలయములు—కుంభేశ్వరుఁడు, నాగేశ్వ రుఁడు, అభిముఖేశ్వరుఁడు, సోమేశ్వరుఁడు, రామేశ్వరుఁడు, గౌతమేశ్వరుఁడు సారఁగ పాణి, చక్రపాణి, మున్నగువారు—కలవు. దానంజేసి యీపట్టణమునకుఁ గుంభకోణ మనుపేరు వచ్చినది. ఈసంఘటనమును బుర స్కరించుకొనియే కాంబోలు 'క్రిందుమీదు లొనరించి నాడ'ను నర్థము వచ్చుటకుఁ గాను 'కుంభకోణము చేసినాఁడ'ని వ్యవహరింపఁ బడుచున్నది.

కుంభకోణమునకు నుత్తరమునఁ గావేరి ప్రవహించు చున్నది. ఈపట్టణము కొంత కాలము చోళరాజులకు ముఖ్యపట్టణమై యుండెను.

పండ్రెండేండ్ల కొక్కమారు కుంభకోణ మున మహామాఘోత్సవముజరుగుచుండును. బృహస్పతి సింహరాశిని బ్రవేశించిన పుణ్య కాలమున జరుగు నీయుత్సవమునకు దేశదేశ ములనుండి యాత్రికు లిచటికరుదెంచి, మహా మాఘకాసారమునఁ గ్రుంకులిడి పునీతు లగు చుందురు. ఈకాసారము పట్టణము మధ్య నున్నది. రమారమి యిరువది చదరపు టెకర ముల విస్తీర్ణముతోనుండు నీకాసారమునకు నలువైపులఁ బదునారు మంటపము లున్నవి. వీనిని తంజాపురరాజగు అచ్యుతనాయుని ప్రధానమంత్రి గోవిందదీక్షితులు నిర్మించె ననుటకుఁ జాలిన యాధారములున్నవి.

మహామాఘోత్సవమున నవనదులువచ్చి కలియునని పురాణప్రసిద్ధము.

## చిదంబరము

చిదంబరక్షేత్రము చాలపురాతనమైనది. ఈనగరము కుంభకోణమునకు నలువదిమూఁడు మైళ్లలో నున్నది. ఇచటనాకాశలింగము కలదు. నటరాజస్వామికి వెనుక నొకతెర కట్టఁబడి యున్నది. దానివెనుక గోడపై నొక చక్రము కలదు. అచటరిక్తప్రదేశము తప్ప మఱేమియును గానరాదు. అందుండియే నటరాజమూర్తి యావిర్భవించెనందురు.

పతంజలి, వ్యాఘ్రపాదులను మహామును లిద్దరు శివునిగూర్చి తపమొనరించిరి, వారితపమునకు మెచ్చి నటరాజమూర్తియై వారికి దర్శనమొసంగెను. ఈసభకు 'చిత్సభ' యని పేరు. ఈసభాద్వారమున కభిముఖముగాఁ బాదచిహ్నము లైదు కానగును. ఈశ్వరుఁడు నృత్యమొనరించు తరి యీపాదచిహ్నము లేర్పడెను. ఆపాదచిహ్నము లిప్పుడు వెండి రేకులతో గప్పబడి యున్నవి. అవి పంచాక్షరీమంత్రమును నిరూపించు చున్నవని స్థలపురాణము వాకొనుచున్నది.

విశాలమగు నటరాజాలయము చిదంబర పట్టణమునకు మధ్యప్రదేశము నందున్నది. ఇందు నాలుగు 'సభ' లున్నవి. మూఁడవసభయందు వేయికాళ్ల మంటపము కలదు. ఇట్టి మంటపములు తిరువణ్ణామలై, మధుర, శ్రీరంగములయందు సైతమున్నవి. ప్రాచీనమగు నీదేవాలయమునందలి ప్రతిభాగమును ప్రాచీనశిల్పి కళావైభవమును వేనోళ్ల జాటుచు' నుపన్యాసముకంటె మౌనమే భావగాంభీర్యమ'ను(Silence is more eloquent than speech) నాంగ్ల నానుడినిసార్థకపఱచుచున్నది.

## తిరువణ్ణామలై

దీనికి 'అరుణాచల'మని కూడఁ బేరుకలదు. చిదంబరమునకీమహాక్షేత్రము తొంబదిమైళ్లలో నున్నది. పార్వతిశివుని వామభాగమును బడయుటకై యిచట దపమొనరించి సఫలమనోరథ యయ్యెనఁట, 'మాతృక్షీర'మను కాసారము దేవాలయమునందున్నది.

బ్రహ్మవిష్ణువులకు 'ఎవరెక్కువ? ' యను వివాదము రాగా వారినడుమ శివుఁడు జ్యోతిగానుద్భవించెను. దీనిఁ బురస్కరించుకొనియే కృత్తికా దీపము (అరుణాచలదీపము) ప్రసిద్ధికెక్కినది. పంచలింగములలో నిచటిది తేజోలింగము.

అరుణాచలనగరము ముచ్చట వచ్చుచుండును. అచటి యాలయ మతివిశాలమైనది. అంబరచుంబితములును, వివిధవిగ్రహవిరాజితములు నగు గోపురరాజములతో నిచటిదేవాయము ప్రాచీన శిల్పికళావైభవమును బ్రత్యక్షమొనరించుచుండును. విజయనగరరాజ్యా

ధీశుఁడు శ్రీకృష్ణదేవరాయులు ప్రధానగోపురమును గట్టించి కాసారమును త్రవ్వించెను. 1516 లో తంజాపురప్రభు సేవప్పనాయకుఁడు కృష్ణదేవరాయలచే నసంపూర్ణముగా నిలుపఁబడిన పైగోపురమును పూర్తిచేసెను. 1336-37లో రాజనారాయణ శంభువరుఁ డనురాజు మఱియొక గాలిగోపురమును నిర్మించెను. ఇట్లు ప్రభువరేణ్యులచేతను నిర్మింపఁబడిన యాలయమునందలి వివిధభాగములు నేఁటికిఁ గూడ గ్రాంగొత్తి కళల నీనుచు నిలిచి యున్నవి. 'నాటకోటిసెట్ల' పాలనమున నీదేవాలయము తేజోబంధురమై యలరారుచున్నది.

---

## చాటూక్తులు

అడిదం - రామారావుగారు,

(సంస్కృతమునుండి యనువాదము.)

చ. ధనమను పుత్రునొందఁగ నుదంచిత విద్యయు సత్కవిత్వము
న్ననవరత ప్రవాసమును నాపయిసేవయు యాచనంబునా
వనితలఁ బెండ్లియాడితిని వారలు నేవురుఁ గూడవంధ్యలై
తనరిరి. భాగ్యమెట్లొదవు దైవముదాఁ బ్రతికూలమైనచోన్.

గీ. మత్కుణంబుల బాధకు మదిఁగలంగి మారుఁడు శయించు సలతుహినాద్రియందు
కలిమిజవరాలు నిద్రించుఁ గమలమందు హరిశయించును దుగ్ధసాగరమునందు.

గీ. అతిపరిచియంబవజ్ఞత నందఁజేయు తఱచుపోవుటయును ననాదరముఁ గూర్చు
మలయగిరిభిల్లకామినీ మణియొనర్చు జందనద్రుమ కాష్ఠము నింధనముగ.

గీ. పరిమళంబును వెన్నాడి భ్రమరమేగు సీతిగరిమంబు వెన్నంటి నిలుచులక్ష్మి
పల్లమునుబట్టి యుదకంబు పాఱుచుండు నజునివ్రాఁతనె బుద్ధియు ననుసరించు.

గీ. పామరులు నిన్ను బురదంచుఁ బరిహసించి విడుచుదురు గాక కస్తూరి ! వికలతమెయి
ఖేదమొందంగఁ బోకుము మోదమలర నిన్ను గ్రహియింప భూపాలురున్నవారు.

---

# పరివర్తనము

చేబోలు-చంద్రశేఖరశర్మగారు,

పువ్వులువికసించాయి. ప్రతిచెట్టు మొదటను బోదుల నిండా నీరుపారుతోంది. తనదేదో పడిపోతూన్నట్లు సూర్యుడు కొండక్రిందకు పోవుచున్నాడు. ఒక్క బికేల్ మనిషి పూదోటలో విహారం సలువుతోంది. తనలో తాను నవ్వుకొంటూంది. ఆముఖవైఖరిజూస్తే ఒక విచారంలా కనబడుతోంది. చేతిలో ఒక కాగితంకనబడుతోంది. ఆకాగితం చదువుతూంటుంది దుఃఖము ముఖము వెంట క్రక్కుతూంటుంది. ఏదో ధ్యాస్తూంటుంది. యిలాంటి గడబిడ కాలంలో రంగం వచ్చి "అమ్మా! గులాబీ. నీకేమో ఉత్తరాలు వచ్చాయి" అని చేతికి అందిచ్చింది. అప్పడు హడావిడిగాచేతులో ఉన్న ఉత్తరాలు జూస్తూఉంటే కాకతాళీయన్యాయంగా ఒక కవరు కనబడింది. ఆపైన వ్రాసిన దస్తూరీ జూస్తే తన సంకల్పమే. ఆ ముద్దులవ్రాతే కనబడింది. అంతలో తన శరీరం తనకు తెలియకుండా ఆకవరు చింపింది చదవడం మొదలుపెట్టింది. తన్మయత్వంచేతను కళ్లు ఏమి చూస్తున్నాయో తెలియడం లేదు. తాను ఎక్కడనున్నదో తెలియడంలేదు. అల్లాగైనప్పంటికి తనమనోరథమునకు బ్రేకు వేసి. ఉత్తరం చదివి "అరే." అని ధ్యాస్తూ "యింత లేటుగానా వ్రాయడం? మొన్ననే కాకినాడ వస్తే తత్క్షణం ట్రయినుమీద మనిషిని పంపినా కలుసుకొందునే. ఉత్తరమూవ్రాయడం? వెధవ ఆరు అణాల డబ్బులోనా ఆలోచించడం? కనబడతాడో కనబడడో? యిక్కడ యీదారిలో బిక్కవ్రోలుస్టేషనులోదిగుతాడో దిగడో? దిగితేనేమి? స్టేషనుమాస్టరుతో నేగద పనిఉంటు! ఆతనితోటి మాట్లాడి మళ్లీ రైలులో వెళ్లిపోతాడేమో? యిక్కడికి రమ్మని మనం చెబితేమాత్రం వస్తాడూ? అసలే తిక్కమనిషి గదా? దీనికి ఏమిచేస్తే బాగుంటుం"దని కొంచెం సేపుఆలోచించింది. టైముచూచింది. "యింకాఅరగంటఉంది. రైలురావడానికి" అనుకొని కారుడ్రైవరును 'వెంకట్రాం అని కేక' వేసింది. యింతలో వెంకట్రాంవచ్చి Why అన్నాడు. "వై లేదువ్రోయి లేదు" వెంకట్రాం! నీవు అరవవాడవుగదా? నీచాతుర్యం కనబడేకాలం వచ్చింది. యీ నాలుగున్నర గంటలో మన ఊళ్ళో స్టేషన్‌మాష్టరుగారితో మాటలాడడానికి ఒక డాక్టర్ గారు వస్తారు. ఆయన చామనచాయగా ఉంటాడు. పొట్టిగా ఉంటాడు. విశాలఫాలం. మీసాలు పూర్తిగా దీసివేస్తాడు. ఎడమబుగ్గమీద వెళ్లికొడుక్కు పెట్టినట్లు కొద్దిగా పుట్టుమచ్చ ఉంటుంది. కాటిగ కళ్లు ఉంటాయి. ఆయన మళ్లీరాత్రి

బండిలో బయలుదేరి రాజమండ్రీ వెడతారట. ఆయన్ని ఏదోటోపీవేసి మన యింటికి దీసుకు రావాలి. నువ్వు ఆయన్ని దీసుకొనివచ్చావా నీకు యీనెలనుంచి నెలకు Three Rupees Promotion చేస్తాను." అని చెప్పింది గులాబి.

"అల్లాగే ట్రై చేసి తప్పకుండా దీసుకొని వస్తా. నాకుగాని రాలేదాఅంటే యింకెవ్వరు దా దీసికొస్తారు? అన్నాడు వెంకట్రాం వచ్చీ రాని తెనుగుతో.

గులా:—ఏమి చెబుతావు? వెంకట్రాం? ఏమి ప్లాటు ?

వెంక:—మీకుదానేఎందుకు? ఎత్తుకొచ్చే పూచీ నాద్దానే ?

గులా:—తప్పకుండా.

వెంక:—తిరుగిల్లే.

"సరే కారు తీసుకొని వెళ్లి ఎల్లా ఆయన్ని తీసుకువస్తావో అని చెప్పి వెంకట్రాంని కారిచ్చిపంపి తాను యింటికి వెళ్లింది గులాబి.

* * *

బిక్కవోలు అంత పట్టణంగాదు. ఆ స్టేషనులో దిగేవారు సూటు బూటువేసు కొని దిగరు. అందులో మోటారుతో బొత్తిగా ఉండరు. గనక యీ వెంకట్రాం తదేకదృష్టిగా రైలు వచ్చేసరికి దిగేవాళ్లను జూస్తు న్నాడు. యింతలో ఒక యింటరుక్లాసు పెట్టె దగ్గరకు స్టేషను మాస్టరు వెళ్లి గుడ్ మార్నింగ్ డాక్టర్ ! అన్నాడు.

పోర్టరు వచ్చి సూటుకేసు బ్యాగ్ పుచ్చు కొన్నాడు. ఆయన పాంట్లు ముడతపడిందేమో అని చూచుకొని స్పెక్ట్స్ సవరించుకొంటూ కోటు తగిలించుకొంటూ What about your son అంటూ దిగి స్టేషను లోకి పోతూంటే S. M. గారు బండి కదలడానికి క్రియలు అన్నీ జేసి బండిని పంపి "మీ దయ వల్ల మా అబ్బాయికి నింపాదిగా ఉన్న దండి! మీ రొక్కమాటు పరీక్ష చేసి మంచి టానిక్ ఏదైనా ప్రిస్క్రైబ్ చెయ్యా లండీ అని స్టేషను రూంలో కొడుకుని జూపెట్టి మాటలాడి చెన్నపట్నం After fifteenth of July లెటర్ వ్రాయండి పంపు తాను" అని చెబుతూంటే వెంకట్రాంవచ్చి 'సార్, సార్, ఎవరైనా రాజమండ్రీ పోయే వారుంటే తహసీల్ దార్ గారి కారుదావచ్చిం దండి! సిగరెట్టుపేకెట్ ఏనావస్తే చాలండి అందిమీద వేసుకొని ఎత్తుకుపోతాను' అన్నాడు వెంకట్రాం.

యీమాట డాక్టర్ గారి చెవులో బడింది. 'బాగుందిరా మళ్లీట్రయిను రాత్రి 9 గంటల దాకా లేదు. అనుకుంటూంటే కారు ఉంది'అని. 'హలో మిష్టర్! మీకుర్రవాడికిఏమీ జబ్బు లేదు. హార్టు బాగుంది. పల్సు బాగుంది. జనరల్ ఖండీషన్ అంతా బాగుంది గనక యింక టానిక్ చెన్నపట్నం లెటరు వ్రా

యుండి పంపుతాను.'అంటూ' నేనీకారులో వెళ్లి పోతాను రాజమండ్రీ! అన్నాడు "డాక్టర్ గారు, అల్లాకాదండీ. మీరూ నేనూ క్లాస్‌మేట్సుంగదా! వచ్చినవాడవు ఎల్లాగా వచ్చావు. ఈరాత్రికి ఉంటే రేపు ఉదయం 8 గంటలకు రాజమండ్రీ ప్యాసింజరు ఉంది. అందులో వెడితే నీకు స్టీమరు అందుతుంది. బొబ్బర్లంక దగ్గర కార్లు ఉంటాయి. 12 గంటలకల్లా అమలాపురం జేరుతారు. ఉదయం కాఫీ అదియిక్కడనే పుచ్చుకొని ట్రయిను ఎక్కవచ్చును." అన్నాడు. స్టేషన్ మాష్టరు,

"నాకు రాజమండ్రిలో కొంచెం పని ఉంది. అది చూచుకొని యీరాత్రి నుండి ఉదయాన్నే స్టీమరుకు వెళ్లాలి" అన్నాడు డాక్టరు.

మేము నాద్రబ్రామిన్సనా ఏమిటి? మీకు మీల్సుకు మా అసిస్టంటు స్టేషన్ మాష్టర్ గారు బ్రాహ్మలే. అక్కడ మీకు చక్కగా ఉంటుంది. యింపూట కాగుదూ వెడుదువుగాని. యింతట్లోకి ఏమిటి? తెల్లారిలే స్తేచీపురుగట్టకి వెంట చేటకీకూడా పనే. ఉందూ యీ వేళకి పదిపడెండేండ్లు అయింది. నాటికి నేను. ఒక్కరాత్రిల్లో ఏంపోతూంది లెస్తూ ఉండిపో అన్నాడు" స్టేషన్ మాష్టర్ గారు.

ఎంత వెర్రివాడో యీయనయింట్లో తిండేనేం. మెడ్రాసులో హైరోడ్డుకు ఎదురుగుండా లాంచీహోము అక్కడ టేబుల్ మీదేగదా డాక్టర్ గారు తీసుకోవడం. ఆ టేబులు మీదనే ఎదురుగుండా యింకొక నాయుడుగారు కూర్చుంటారు. ప్రక్కనే విస్తరి తగిలీ తగలడంగా. దానీది యీయన తాగివిడిచిన కప్పులు పట్టుకు వెడుతుంది. రోడ్డుమీద పోయే మోటార్లు పాకీవాళ్లు చచ్చుటాళ్లు కనబడుతూనే ఉంటారు గదా! యీయన కాలి జోడు తియ్యడు. కళ్లనున్న స్పెక్ట్సు తీయడు. నెత్తిమీద హేటు విస్తరికి తగులుతూ టేబిల్ మీద పెట్టుకుంటాడు. చెయ్యిమాత్రం సబ్బు పెట్టి బాగా క్లీన్ చేస్తాడు. గాని అన్ని వెంటలు తిరిగివచ్చిన కాలి బూట్సుమాత్రం తీయడు. టేబులుమాత్రం క్లీను ఉందో లేదో చూస్తాడుగాని దానీది అంట్లు తోమిన మసిమసి చేయిముంచిన నీళ్లయినా సరే. యిలాంటి బ్రాహ్మణీకం దంధ్యం ఉంటే మోటని పెట్టెలోనైనా పెడతాడు లేకపోతే మొలకైనా చుట్టుతాడు. చదువు సంధ్యలు ఎలా ఉన్నా యివి వేషభాషలు. యిల్లాగంటి బ్రాహ్మడికోసం తనయింట్లో తినమనకుండా పాపం ఆనాయుడుగారు యింకోచోట చెబుతానన్నాడు భోజనం. అయినాసరే. యీతడు ఒక డాక్టరేకాడు. కవీశ్వరుడు. ఒకమీద యూనివర్ సిటీలో చదువుకొన్న ఆయుర్వేదంలో ఎగ్జామినరు. సంస్కృతంలో మంచి సాహిత్యం. జ్యోతిషంలో సిద్ధాంతభాగ జాతకభాగాలుకూడా తెలుసును మంచి వంశంలోవాడు. వైదీకిఅయినా తాతతండ్రులనాటి నుండీ చెయ్యి చాచనివాళ్లు. అయినా మనం చెప్పుకోవడంలో గుడ్డిలో మెల్లన్నట్లు యిప్ప

టి సివిల్ జేపనులంటే-విధా కర్మనూ అంటూ ఎందుకు చేస్తున్నారా అని విచారిస్తాడు. చేసినప్పటికి యితడు మంచివాడు. ఎందు కంటే తర్వాతైనా పశ్చాత్తాపపడతాడు కనక ఒక్కటి చదువుకొన్న వాడికే తీరుబడి లేక పోతే యిన్నింటిలో ఉన్నవాడికి యితనికి తీరు బడి ఏదీ? యిదికాకుండా లౌక్యుడు. వ్యవహా రాలు ఎలక్షనులు యిలాంటివి చాలా ఉన్నా యి కనక పాపం ఏపనుందోగాని డాక్టర్ గారు అర్జంటుగా వెడదామని స్నేహితుడు నాయు డుగారు బ్రతిమాలుతూన్నా,

"అదేమిటో అల్లాఅంటావు" మళ్ళీవచ్చి నప్పుడు నువ్వు వెళ్ళమనీదాకా వెళ్లను. నీకొ డుక్కు మండుచ్చాంగదా? సీరియస్ కేసు. మళ్ళీ తప్పకుండా చూడాలని దిగా. యీ కారు లేక పోతే రాజమండ్రీబస్సులోనైనా నావెళ్లేవాడనే" అంటూ డాక్టర్ గారు 'డ్రైవర్! రాజమండ్రిలో నేనెక్కడికి తీసుకొని వెళ్లమంటే అక్కడికి దిగబెడతావా' అన్నాడు.

అవునండి మీకుదానుఖం. యిందమీద రండి అన్నాడు వెంకట్రాం. అయితే నన్ను వదులు మిస్టర్ నాయుడు! నేనీపట్టు వచ్చినప్పుడు తప్పకుండా ఉంటాను" అని సూట్ కేసూబేగ్ పోర్టరుచేత కారులో పెట్టిం చుకొని డాక్టర్ గారు కారు ఎక్కారు. యీ లోపులో అసిస్టంటు స్టేషన్ మాస్టర్ గారు కూడా వచ్చారు అందర్కీ గుడ్ బై యిచ్చు కుంటూ కారులో కెక్కారు డాక్టరుగారు. కారు కదిలింది.

"డాక్టర్ గారు. నాఅత్తవారు యీఊరు దానే. నాభార్యకు కొంచెం రోగమండి మీరు మెడిసన్ వ్రాసిస్తే ఆసుపత్రిలోనో ఎక్కడో కొనుక్కోవడమో చేస్తాన్ సార్. నాకాదుకు మీరేం యివ్వక్కరలేదండి. మిమ్మలని అర గంటలో తీసుకొని వెడతాన్ సార్. మీకు బా పుణ్యం సార్" అంటూ కారు గులాబీ యింటికి పట్టాడు కారు డ్రైవరు వెంకట్రాం. డాక్టర్ గార్ని టోపీ కొట్టేశాడు—

హడావిడిగా వచ్చింది గులాబి. శరీరం తెలియటంలేదు. వస్తాడో రాడో అన్న అను మానం మాత్రం మనస్సులో బాధిస్తూనే ఉంది. అద్దంటగ్గరకు వెళ్లింది. అక్కడనుంచి భావతరంగాలు బయలు దేరాయి. అసలు ఆడ వాళ్లకే భావోద్రేకాలు ఎక్కువగదా! అందులో భోగంది. అందులో చదువుకుంది. అందులో డబ్బుఉంది. నడుస్తూన్నది నిండు యవ్వనం. యింకేం కావాలి భావతరంగాలకి నిప్పు అక్కరలేకుండా అంటుకొంటున్నాయి. "యిదివరకు గురుకులాశ్రమంలో ఉండగా చూచాము. మనస్సు లగ్నమయింది. తర్వాత అంతా అయింతర్వాత ఆయుర్వేదం అన్నట్లు అటువంటి స్థితిలో కాకినాడలో చూచాం. యిప్పుడు చెన్నపట్నం వాసి అయినాడు ఏది అంటే ప్రేమిస్తాడో ఎల్లా ఉండాలో" అంటూ యోచించి అయినా "చెన్నపట్నంవేషమే

అనుకుంటూ వదులో"దులు జడ ఆచివరన రంగు గుడ్డపేలికలు వక్షుస్థలం మూడువంతులు కనబడే జాకట్టు అదేంచిత్రమైన చేతులోగాని యీజాకట్లకు చేతులు గుత్తులవరకూ పెరిగి మళ్ళీ ఏమి ఫేషన్ మారిపోయిందోగాని భుజాలదాక పోయాయి గాన అల్లాంటి చేతులున్నటువంటి జాకెట్టు మెడలో చైను చేతికిగాజులు ఎడమచేతికి రిష్టువాచి. ఎదు రొమ్ముమీద వక్షుస్థలం కనబడేలాగున చీరఅంతా కుచ్చిళ్ళుగా చేసిపెట్టిన గూడ కట్టు కట్టింది. ఫేస్ పౌడరు వేశి కాటుక బొట్టు లేని ముఖం ఉంటే బంగారు ఛాయగల్గిన ఆముఖంలో నల్లనికళ్లు ఎర్రని అధరోష్ఠం కలిగి అద్దంలో జూస్తూంటే అద్దం బొట్టు కాటుకా లే దేమిరా అని ఏడుస్తూంటే అదేలోకంగాజూస్తూ యీవేషం అతనికి యిష్టం అవునా కాదా అని కొంతసేపు ఆలోచించి సరే యిల్లాగే ఉందామనుకొని ఒక కుషణిలో గెడ్డంక్రింద చెయ్యి బెట్టుకొని ఒక చేతిలోనున్న జేబురుమాలుతో విసరు కుంటూ రెండుకాళ్లూ ఊగిస్తూంటే బఱ్ఱు మని కారుహారను వినబడింది. యింతలో తాను డాక్టర్ వస్తున్నాడో లేదో అని మేడ మీదనుండి చూడడానికి వెళ్లింది గులాబి.

* * *

కారు వచ్చింది.

డాక్టర్:—డ్రైవర్ ఎవరిదీయిల్లు

వెంకట్రాం:—"మా అత్తగారిది దా సార్ లోపలికి వాంగా సార్ అంటూ మేడ మెట్లదగ్గరకు పోయి మా అత్తగారు మాఆ విణ్ణి చూపిస్తుందండి" అని మేడ ఎక్కించాడు.

డాక్టర్ గారు రాజమండ్రి వెడదామన్న పనితొందరలో త్వరగా చూచి పోదామని జేబులోనున్న సెతస్కోపుదీసి చేతో పట్టు కుంటూ మేడమెట్లు ఎక్క మొదలుపెట్టేరు. చిత్రపటములు,కుషనులు,అందమైన చిన్న చిన్న బొమ్మలుకల బీరువా, వర్ణనాతీతంబగు ప్రబం ధములుగల బీరువా నిలువుటద్దము, మం చము, డ్రాయరు మొదలైన నవనాగరికమగు యింకా మెన్నియూ వస్తుసముదాయములచే అలంకరింపబడిన ఒక గదిసమీపమున కేగెను.

గుత్తమైన-రవిక నెరిసీనెరవని తల-ముడ తలుబడ్డ శరీరం-మెడలో కంటీ కాసులుపేరు కలిగి సుమారు 40 సంవత్సరాలు దాటిన వ్యక్తి కనబడి నమస్కారమండి అని డాక్టర్ గారి నూటునకు తనచేయి తగిలీతగులుటగా తాకి కళ్లనద్దుకొని ఆగదిలోనికి తీసుకొని పోయి ఒక కుషణిలో డాక్టర్ గారిని కూర్చో బెట్టింది. దానిమీదనే ఒక రజితపాత్రయందు కాఫి లేతమలపాకులకు సున్నము వ్రాసి జుట్టిన చిలుకలు నమర్పబడినవి.

ఏమిటిరా విచిత్రం అంటూ అదేలోకంగా ఆలోచించుచున్నారు డాక్టరుగారు.

వృద్ధు:—తమవంటివారు మా యింటికి రావడం అరుదు. ఎన్నడూ రారుకదా! మీకు

యీ వూళ్లో స్టేషన్ మాస్టరు స్నేహితుడవడం చేత మాయందు మీకు సంపూర్ణదయ కలగడంచేత వచ్చారుగాని లేంచే వస్తారా ?

డాక్టర్:—యిప్పుడు చూడవలసిన పేషంటు ఏదీ ?

వృద్ధు:—వస్తోందండి తమరు ఎంతో దయసత్యశౌచములుకలవారు-విద్వాంసులు-రసికులు—వైద్యులు అని తమమాట ఎప్పుడు తలచుకుంటూంటాము.

డాక్టర్: —నేను అర్జంటుగా వెళ్లాలి. రోగిని రమ్మను.

ఆమె లోనికి వెళ్లింది.

కొంచేపటికి గుండెలు దడదడలాడుచూ ముఖమునందు చిరునవ్వు చిందులాడుతూ కాళ్లుతడబడ లాడుతూ ఒకరూపలావణ్యావిలాసిని గదిలోనికి వచ్చింది.

డాక్టర్‌గారి దృష్టి అట్లనే కట్టబడింది. మనం ఎక్కడకి వచ్చినదీ తెలియలేదు. శరీరం కంపం ప్రారంభించింది. మనస్సు ఖంగారుపడి ఆవచ్చిన వ్యక్తినిబట్టి కృత్రిమ పన్నాగం అని గ్రహణకు వచ్చింది.

నమస్కారమండి అని కుర్చీలో కూర్చున్న డాక్టరుగారి పాదములకు నమస్కరింపబోయే వంకతో వక్షస్థలం మోకాళ్ల మీద ఆనేలాగున నమస్కరింప బోయే వ్యక్తితో

డాక్టర్:—గులాబీ ! మీయిల్లు యిదేనా గులాబీ.—చిత్తం.

డాక్టర్:—యిప్పుడు కవిత్వము వ్రాయుచున్నావా ?

గులా:— లేదండి తమ అనుగ్రహం లేనిదేనా ?

డాక్టర్:—ఏమిటి విశేషాలు ?

గులా:—మీరు రావడమే విశేషం.

డాక్టర్:—అల్లాగైతే వెళ్లడం కూడా విశేషమే కనుక వెడుతున్నా. (అని లేవబోయాడు)

గులా:—చాలుచాలులెండి మీకోసం యింతా ప్రయత్నంచేస్తే ప్రయత్నంచేసినంత కాలమైనా కూర్చోకూడదు (అనిబ్రతిమాలి) అంత ఆగ్రహమయితే ఎల్లాగండి ? మీకోసం ఏన్ని ఉత్తరాలు వ్రాసేను. మీకోసం చింతించే వ్యక్తియొక్క క్షోభమీకు తగలదా.

డాక్టర్:—నాదేదేనా ప్రేరణ ఉంటేను నాకు తగలడం.

గులా:—మీమూర్తిప్రేరణే

డాక్టర్:—నాదిగాదుగా.

గులా:—మూర్తినే కోరుతూంట మిమ్మగాదు.

డాక్టర్:—నాకు రాజమండ్రిలో పని ఉంది. నేను వెళ్లాలి క్షేమం ఉత్తరంవ్రాస్తూ ఉండు. చెన్నపట్నం 15 తేదీ నాటికి వెడతా.

(అని లేవబోతున్నాడు.)

గులా:—రెండు చేతులు గట్టిగా పట్టుకొని కూర్చోండి అని క్రీగంటి చూపులు

చూస్తు వెన్నెలవంటి నవ్వులు నవ్వుతూ గాజులు కదులుతూంటే చటాలున లేచి హాజావిడితో కీల్జడ యితని భుజముమీద పడవేసి "యింతేనానాజన్మ ?"

డాక్టర్:—నిష్కల్మష బ్రహ్మచర్యము నకు మించిన దుందా ? (అని అడుగు వేయ బోవుచూ విదలించుకొని) అందరాని పండ్లకు చెయ్యిచాచడం ఎందుకు ?

కండ్లు చిట్లించుచు కనుబొమలవెంట ఉష్ణ బాష్పములు గులాబి బుగ్గలపై చిందువ్రెంద నారంభింప ? "ఎంత కఠినజన్మ మీరే యిట్టిస్థితిలోఉన్న బాధ తెలియును గదా ? చిన్నప్పటినుండీ యిలా యున్న నిష్కళంక ప్రేమకు నిష్కల్మష బ్రహ్మచర్యంబు థార పోయదగదా !"

అని కౌగలింపబోవ డాక్టరుగారు పరాన్ముఖుడై మహాణశక ప్రవరునివలె వెడలు చుండెను.

గులా:—మోటారు లేదు. రైలులేదు. ఎట్లువెడలుదురు ? వినిపించుకోక నే. కూడదా.

డాక్టర్:—నీవునాదగ్గర చదువుకున్నావు. కనుక గురుడనుగానా ? మొదట ముద్దులా కనబడి ఎంత దానవయ్యావు ?

గులా:—మీకటాక్షమే.

అంటూ మెల్లమెల్లగా భుజంమీద పండు తమలపాకువంటి చెయ్యి గాజులు గలగల లాడుతూంటే వేసి యింకొక చేయి డాక్టరు గారి గుండెలమీద పెట్టి యీహృదయాన్ని ఆకర్షించ లేకపోయానుగదా ! అన్నసమయం లో డాక్టరుగారు బూటుకాలు వెనక్కు వేశి

"వద్దని ముద్దుముద్దుగా జెప్పితే నీవులెక్క జేయడంలేదు. నీతో నేను మాటలాడడమే తప్పు." అని మొఖంచిట్లించి సిగ్గుపడుతూ 'ప్రేమంటే యింతేగాదు యింకా ఎన్నివిధాలగా ఉన్నాయి.' అని డాక్ట రక్కడ్నుండి చివాల్నలేచి గుమ్మంలోకి వెళ్తున్నాడు. గులాబి మొగ మెర్రవారి గీచిన కందగడ్డయిపోయింది. కన్నీళ్లుప్రవాహం గట్టాయి. ఆదృశ్యం డాక్టరు చూచాడు. నిర్ఘాంతపోయినాఁడు. మహాపర్వతమయినా వజ్రాయుధానికి లోఁకువే కదా ? కొండంత గుమ్మడికాయయినా యీలకత్తికి లోగాల్సిందే కదా ?

"ఏమిట్రా నావిషయంలో గులాబికింత ప్రేమంటుందని కల్లో అనుకోలేదు. నే నవతలికివెళ్లంగానే తప్పకుండా యిదినూయి సయిడుచేసుకోనేటట్టుంది ! అని డాక్టరు కంగారుపడుతూండఁగా గులాబి ఆ యేడ్పుతోనే కుములు కుంటుచాపమీద వాలింది. సొరుగుతూవుంది. నోటెంటా యేమీఅనడం లేదు. డాక్టరు భరింపలేకపోయా డీదృశ్యం, చటాల్ని దగ్గరికివచ్చి చాపమీద ఆవిడదగ్గర జేరఁబడి "ఏంగులాబీ! లేనిపోని కలతెందుకు పెట్టుకొంటా" వని మెల్లగా ఒకచేయి మెడ మీఁదవేసి వకచేతితో ఆవిడమొగాన్ని తన

యేపుకి తీసుకొంటున్నాఁడు. ఆమెనిస్పృహ తోనూ "నాతో మాట్లాడకండి - నాతో ఎవ్వరికీ పన్లేదు. నాకూ ఎవరితో పన్లేదు" అనింది.

పిరంగిగుండు బారుకెదుట నిల్పినాజేంకని డాక్టరికి మనస్సులో ఈ విడని ఈ స్థితిలో చూడఁగానే గుండెఢాం అనింది. నిర్మలప్రేమ తప్ప యితఁడు వేశ్యలకు ఆరోపించే మాయ మర్మాలేవీ అప్పుడావిడలో లవలేశమూ ఆయ నకు కనపళ్లేదు. అంటాంగానీ ఆ జాతివాళ్లు కూడా మనుష్యులేకదా - వాళ్లనుండి మానవ స్వభావము వువ్వెత్తుగా పోయి సంపూర్ణ దుర్మార్గమువాళ్లని చేర్తుందా ? మామూలు వాళ్లప్రవర్తనల్లో కళాకళ లెట్లో వాళ్లకీ అంతే. - అనే ఆలోచన డాక్టరు మనస్సులో మెఱపు మెఱిసినట్లయింది.

అప్పుడాయనాగులాబిని కోమలంగా దరికి లాక్కోడానికి పూనాడు. విదిలించుకుంది. ఆ యేడ్పు వెక్కివెక్కి యేడ్వడం మొదలు పెట్టింది. డాక్టరామెను వక్షాన చేర్చుకొని జేబురుమాలుతో కన్నీళ్లు తుడిచి సంపూర్ణ ప్రేమతో "అయిందానికేమి అనుకోవద్దు - నీవునారత్నానివి"అని ఆప్యాయనంగా ముద్దు గొన్నాఁడు.

తపస్సుచేస్తూ కాచెట్టుకొన్న పరమ సౌఖ్యమా నిమిషాన గులాబిచెంది బ్రహ్మానం దమొందినటు క్షణం తన్మయురాలై బాహు వల్లరులు డాక్టరుమెడకు పెనవేసి ఆయన్ని గాటంగా ముద్దెట్టుకొని తలెత్తిచూచి సిగ్గు వైకోగా ఆయన వక్షస్థలంలో చటాలున మొగాన్ని దాచుకొనింది.

కొంతసేపటి కామె మెల్లగా డాక్టరు గారి ఆకౌఁగిలిలోనుండియే ఆయన మొగ ము నిమురుచూ - "మీా కీవుద్యోగం గొడ వెందుకు ? మనకు కోలెడు తిని వకళ్లకు పెట్టగలిగినంత వుందిగదా ? యీా వూరు మీాకు నచ్చేకపోతే పట్టణమెల్లి వక బంగళా తీస్కుని అందులో వుందాం అనింది."

డాక్టరించుక పశ్చాత్తాపముతో - "గులాబి ! పొరబాటు జరిగిపోయిందే. నేను డబ్బుదస్కం అంతగా లేనివాణ్ణి" నాస్నేహం వల్ల నీకేమిా లాభమువుండదు. ఇప్పుడు జరగింది మఱచిపో, నేవెళ్లొస్తా ! అని లేవ బోయేటప్పటికి గులాబి తల్లివచ్చి సత్యమును తీరుమానమును దెల్పే కంఠస్వరంతో - "నాయనా ! అమ్మాయి చెప్పిందాంట్లో అబద్ధం లేదు. నామాటా అదే. ఇక పడుపు వృత్తిసంపాదనా - యెంత సంపాదించినా చచ్చేకాలానికి పక్కీరుచిప్పతప్పదు, మనస్సు గలిసిన మీారు పెళ్లాడినా మనోహరంగా వుంటుంది."

డాక్టరు గంభీరముగా వక పావుగంటసే పాలోచించి "నీవు చెప్పిందే నీ భావమయితే నీవు ముళ్లులేని గులాబిచెట్టువి."

నాయనా! అందర్లాగు నేనుగూడా 'విటుల పాలిటి యమదూత వేశ్యమాత' నయివుంటే

నాకూ ఆ పిశాచాకారమే వచ్చివుండును. నాకు యావజ్జీవము ఒక బ్రాహ్మణుంతోనే సావాసం ఆయన పెట్టిందే యీ సంపదం తాను. నే నట్లా విశ్వాసంతో వక్కరితోనే వున్నా పెళ్లా మనిపించుకోలేక పోయాను. విశాల మనస్సుగల మీవల్ల నా చిట్టితల్లి కాపేరొస్తుందేమో-అని కన్నీళ్లతో చెప్పింది.

అప్పటికే నిశ్చితుఁడయిన డాక్టరు నవ్వుతూ "స్త్రీ-ర - త్నం - దు - ష్కు - లా - ద - పి" అని ఒక్కొక్క అక్షరంగా అని "అయితే - గులాబీ! నీవు సంసారపాగీలో కొస్తే - నీకు 'సరోజిని' అనే పేరెత్తా - గులాబి-తురకతురకగా వుంటుంది. అయితే మనపెళ్లికి పురోహిత మెవ్వరో - రిజిష్ట్రారే నేమో" అన్నాఁడు.

"ఆపద్ధ తెగదుకండీ-ఆర్యసమాజ ముంది గదా? వారికి వేదమే ప్రమాణము." అని తల్లి అంది.

ఇంతలో మేలయిన మామిడిపండ్ల ముక్కలు వెండిపళ్లెంలో పెట్టుకొని వంట మనిషి గులాబీడాక్టర్ల ముందర వుంచింది. గులాబి వక మామిడిపండుబద్ద డాక్టరుగారి నోటి కందించింది. డాక్ట రదితింటూ "నా కింకేమీ వద్దే గులాబీ"

గులాబి "గులాబీ అంటా రేంటి - సరోజిని నండి" అని నవ్వుతూ అనింది.

'సరే - ఆయనగారు కోరినారు. నీవు వప్పటమూ అయింది." అని గులాబీతల్లి అంది గులాబి—కాదు సరోజిని సిగ్గుతో కుపకాలో మొగందాచుకుంది.

"ఆ పెళ్లిపెత్తనంగూడ నీవు జరిపావు" అని డాక్టరన్నాఁడు.

"కొంచెంసేపు మంచేం మీద పడుకోండి. వస్తాం" అని గులాబితల్లితో వెళ్లి ముస్తాబై వచ్చి ప్రయాణ బడలికతో వున్న డాక్టరుగారికి పాదసేవ ప్రారంభించింది.

చటాల్న డాక్టరామెను లాక్కొని ముద్దుగొని "వక్కముద్దిస్తే అన్నీ అలసటలు పోతవి" అన్నాడు.



# తలఁపులు

వఝ్ఝల - వేంకటేశ్వరకవిగారు, బి. ఎ.

౧

నేలకు వాలికల్ గొను కనీనికలన్ స్ఫురియించు ముగ్ధల
జ్జా లలితత్వముల్, కొనల సాంద్రముగా దిగజాఱు బాష్పవా
పాళుల వ్యక్తమౌ విరహభావము, లింపును సొంపు నింపు నా
లోల వినీల దృక్ప్రభలలో వలపుల్ గల మాధురుల్ సఖీ !

౨

ఇంచుక తొట్రుపాటు ఘటియించిన కోపము, స్నిగ్ధలీల న
ర్తించిన లేఁతనవ్వుల స్ఫురించు ప్రసన్నత, మెల్లమెల్ల భా
షించిన నిర్మలప్రణయసిద్ధిరహస్యము, స్వీకరించి యం
దించిన చుంబనావళులఁ దృప్తి యెఱుంగని కోర్కె, నెచ్చెలీ !

౩

తిలకములేని శోభ, మఱి తీరిచిదిద్దిన సొంపు, నాట్యముల్
సలిపెడి ముంగురుల్ కల విలాసము, నిద్దురలోన ముత్తియ
మ్ములవలెఁ గ్రమ్ము ఘర్మకణముల్ గల చక్కఁదనమ్ము, భ్రూలతా
విలసిత విభ్రమమ్ముల నవీనమనోజ్ఞత, ప్రేమశాలినీ !

౪

ఆనయనమ్ము, లావెదవు, లాసుకుమార విశాలఫాల, మా
యాసన మస్మదీయ హృదయాంతరమంతయు నాక్రమించి పూ
ర్వానుభవాంచితస్మృతు లనంతముగా సృజియించి యిప్పు డ
య్యో ననుఁ దీవ్రవేదనల నొందఁగఁ జేయుఁజుమీ మనోహరీ !

౫

పూచిన మల్లెపూల పొలుపుల్, గళమెత్తిన కోయిలల్ సుధా
సేచన మొప్పలీల విరచించిన గీతులు, మెల్లమెల్లనన్
వీచిన పిల్లవాయువులు నిండిన వీమధువాసరంబులన్
నీచిఱునవ్వు నీపలుకు నీదగు నూరుపు లేదు నెచ్చెలీ !

---

# కుక్క కాటుకు చెప్పుదెబ్బ

గుద్దేటి - వీరసుబ్రహ్మణ్యంగారు,

"ఎక్కడికీ ప్రయాణం ?"

"ఏంటీ?"

"... ... ... ... ..."

"పలుకవేం ? ఏం ఆలాచూస్తూ నిలబడ్డావు? గాలిసోకిందా ? "

"ఇంకా సోకిందికాదు "

"అంటే - "

"తమకే తెలియాలె. "

"ఏందాభాష? ఈ దేశాంది కానట్టుందే? పెడద్రం !"

"చేతిమీద నీళ్లుపోశారో లేదో అప్డే ముచ్చెల్లోకాళ్లా ! "

"ఏంచేయమంటావు మరి ? ఇంట్లోనే బడి చావమంటావా? "

"రోజూ యీలాపోయి ఏ అర్థరాత్రికో ఎప్డో వస్తూవుంటే ఎన్నాళ్లని ఓర్చుకోవడం ? కాపురంకదూ - మీకై మీకు తెలియాలె. "

"ఆఁ హాఁ ! ఇంకనిలుపు - అంతకుమించ నీబాక. వ్యవహారం ముదిరిపోతుంది.

"ఎందుకనీ ? నన్నొంటరిగా కొంపలో తగలేసి మీ రీలా దిగులూవిచారం లేకుండా ... ... ... నాగతేంకావాలని ?"

"నీకంత విపరీతంగుంటే, నచ్చకుంటే - మీ యమ్మగారింటి కెళ్లిపోరాదు !"

"పుట్టింటికా ? అక్కడకెళ్లేం చేయమంటారు? ఎవరి జీవాని కేడవమంటారు? ... ... మా వూళ్లల్లో యిట్లాంటిఘోరాలు జరుగనిస్తారా ? ఈ పాపిష్టిగోతుల్లో బడి వాళ్ల బుద్ధీ పాడై ... ... ... "

"ఛీ ! ఏంటీ ఆడదాని కింతకావరం ? చచ్చిన ట్టింతగతికి పడుండకుండా నోటికొచ్చినట్లల్లా వాగేస్తున్నావు. ఆడదా మగవాడ్నదుపులో బెట్టుకొనేది ? ఆడదానికి చనువిస్తే నెత్తినెక్కి లఘువుల్దోలుతుంది. తప్పితే తలకు చెప్పు లడుగుతుంది. "

"ఔనౌను. ఆడవాళ్లంటే ఆటబొమ్మలు దిక్కూదెసాలేని పాడుబ్రతుకు. అందుకే కామాల ఆడదై పుట్టేందుకన్నా అడవిలో మ్రాకై పుట్టడం మేలన్నారు. వంగినా తప్పే లేచినా తప్పే ! మగవాళ్లెంత పాపాని కొగతెగినా ధర్మమే ! నా కర్మంకాలితే నా కీరాతే రాశాడా పాపిష్టిదేముడు. వాళ్లూ గారవాలకేడ్చి ఎఫ్, ఏ, బి, ఏ., లని నా నెత్తిన నిప్పులు పోశారు. " అను నప్పటి కా యమ గొంతుః బొంగురుపోయినది. ఆ రాధమ్మ కన్నులు చిల్లులు వడిపోయినవి. క్రుళ్లి క్రుళ్లి వెక్కి వెక్కి యేడ్చినది. కాని ఆరాతిగుండె కరగినది కాదు. అచ్చట మోహనరావు లేడు.

మానాభిమానులఁ జెడనాడు పాశ్చాత్య నాగరికీయ పిశాచమునకు దోసిళులొగ్గి సిగ్గు విడిచిన నేటి యువజనులకు మనుష్యత్వ మేమున్నది ? దాంపత్యముల పొందికయన నేమో సైతమెఱుగని పశుప్రాయులకు జాలి యినుమంతైన నుండునా ? 'నాలుగు' యింగ్లీషుకూతలు చదువునప్పటికే నాజూకులు ముదిరిపోవును. స్వదేశ జాతిమత సాంఘిక సదాచార వ్యవహారము లన్నియు గంటగించుకొనును. ఇంక సతీపతుల ధర్మ మేడ ! నిర్వర్తించు టేడ !

౨

రాధమ్మ పల్లెటూరిలోఁ బుట్టినది. కడు గారాబముతోఁ బెంచబడినది. ఏకష్ట నిష్ఠురములు పడినది కాదు. ఆమెతండ్రి ఆంగ్లేయ విద్యాపారంగతుని నల్లునిగా బడయగోరి యెల్లర బ్రతిఘటించి పట్టభద్రుడైన యీ మోహనరావునకు రాధమ్మను దగులగట్టెను. మోహనరావన్ననో పచ్చిషోకిలా ! అత్యంత జారుడు. విజాతీయ నాగరికతా లాలసుడు. రేయింబవళ్లు విలాసాలలో మునిగియుండును. నడిరేయిదనుక సందు గొందులు గాయుచుండును. ఒంటరిపాటున బ్రియుల సంకేత స్థానముల కరుగుచుండు విటకత్తియల బలాత్కరించుట ఆతని కధికప్రియము. ఎంతలేసి పనులనైన నవలీలగా జరుపుచుండును.

పాపము! రాధమ్మ స్వచ్ఛందవాతావరణమున బూచికాచినను నెట్లో కొంతకాల మేగించినది. తుదకు తెంపువహించి రెండు మూడు పర్యాయములు భర్త ప్రవర్తనము మార్చ సమకట్టెను. కాని నిష్ప్రయోజనమై పోయెను. ఆయమ కోపమి పట్టువీడెను. తుదకొకనాడు తెంపువహించి పతి నాక్షేపించెను. కాని అది విషమించెను. ఆయమ కున్న ఆయాశాదీప మారిపోయెను.

దినములు గతించెను. ప్రకృతి మార్పుఁ జెందెను. ఋతువులు పరివర్తన మందెను. పండినవే యెండువాఱెను. మోడులే చిగిరించెను. తలపులు మొలకలెత్తెను. వలపులు మలుపు జూపెను. మనస్సు చలించెను. ఆయెలనాగతలుపున 'నానందో బ్రహ్మ' యన్న లతపుటమరించెను.

౩

"జగన్నాధం !"

"ఆఁ ఇక్కడ !"

"నాకొంచెం ఆలస్యమైంది. నీ వొచ్చి చాలాసేపైందా ?"

"అబ్బే! నేనూ యిప్డే."

"సరేకాని నిన్నటివిషయం ఏమైనా ఆచోకి తీశావా ?"

"ఆఁ లేదురా. ఆవిషయంలో జాగ్రత్తగుండాలె సుమా. బైటబడ్డామా కొంప మునిగిందే. ఈలాగామాత్రం తెలిసింది. ఆ పిల్ల పువ్వులోళ్ల కోడలట. అత్తమీా దలిగి అమ్మగారింటి కెళ్తూడిందంట. ఆ మాట

వినేప్పటికల్లా నా గుండె లవిసిపొయ్యావి. జాగ్రత్తసుమా !"

"నీకేం పిచ్చిపట్టిందా? గొంతు కోస్తేను మాట బయటకొస్తుందా? ఈలాంటి వెన్నో జీర్ణించుకొన్నాముకా ?

"అయితేను జాగ్రత్తగుండాల. ఇది పెద్దింటోళ్ల మాట ! గొంతుమీద కత్తి"

"అన్నట్టు ఈదినంగనక అయినట్లయితే - మనదుంప తెగేదే. ఈ చిమ్మచీకటిలో - అబ్బా! మబ్బులేమోయ్ యిట్లా క్రమ్ముకొన్నాయి? ఎప్పుడీలా ఉంటే బలే గమ్మత్తుగుంటుంది."

"అరే యీదినం వానొచ్చేట్టుంది. ఇప్డే తువ్వరబడుతుంది, ఇంటి కెళ్లిపోతామా ?"

"అడ్డే ఏంచేయనోయ్, ఇంక కొంచెం పుండుము తమాషాగుంది ... ... ... అదో ఎవరో వస్తున్నట్టుంది."

"తొందర పడకోయ్ గలభా కానీకు"

"సరేలే. దగ్గరకురానివ్వు." ఇద్దరు ప్రక్కకొదిగి నిలువబడిరి. తదేకదృష్టితో నా వ్యక్తిని బరిశీలించుచుండిరి. ఆ వ్యక్తియు ముసుగువైచుకొని వడిగా సంకేత స్థానమున కరుగుచుండెను. మోహనుడు తిటాలున నెదురు దగిలెను. ఆ వ్యక్తి ఆగిపోయెను.

ఆ నిబిడాంధకారములో నానిశీధమున నాతడాతురతతో చిఱునవ్వునవ్వుచు నదటున నాయువతిహస్తములు బట్టుకొనెను. ఆ జవ్వని తప్పించుకొనశక్తిజాలమి గుంజులాడ దొడంగెను. మెఱుము మెఱసెను. మోహనుడులిక్కిపడెను. జనార్దనుడు టార్చి లైటు వేసెను. మోహానున కత్యంతలజ్జ గలిగెను. నిలువున నీరాయెను. జనార్దనందగ్గర కరుదెంచెను. రాధమ్మను జూడగానే యాతడు నిర్విణ్ణుడైపోయెను. కారుమబ్బులు జోరున కన్నీరుగార్చెను. వాన జడికొనెను.

——:o:——

## నీవు - నేను

(హాలుడు)

గీ. ప్రోదు ప్రాకులు చిగురించి-పులకరింప
జగతి శాసించు లలిత వ - సంతమీవు;
అతని రాకకుఁ గన్నోడ్చి, - యలరిచొక్కి,
భావశృంగార మెగఁ బోయు - తీవనేను.

వయసుకావరముబ్బిన - పడుచువారి
మనసు లలరించు తీయని - మధువునీవు;
వివిధ చిత్ర వర్ణ ప్రభా - విపుల మగుచు
మధువునొలికించు లలిత సు-మంబునేను.

దిగ్దశాక్రాంత సాంద్ర ధీ - ధితులసృష్టి
రాజ్యమేలెడి మేటి రా - రాజవీవు ;
నెఱివిరామమై నను లేని - నీదు నాజ్ఞ
లను ధరించు ప్రకృతి రాజ్య-లక్ష్మినేను.

# చోరాన్వేషణము

మంత్రిప్రగడ-సూర్యనారాయణగారు

విశల్యాపురం స్టేషను విద్యుద్దీపాలతో దేదీప్యమానంగా ప్రకాశిస్తూంది. అదో ప్యాసింజరు ట్రెయిను రావలసిన సమయం ప్రయాణీకులు ప్లాటుఫారంమీద మూటల్తో కూచున్నారు. ఇంకో అరగంటకి గాని రైలు రాదు. అప్పుడో యువకుడు టక్కుటక్కుమను జోళ్ల చప్పుడుతో ప్లాటుఫారమ్మీద యిటూ అటూ కొంతసేపు పచారుచేసి, ఒక పండ్ల దుకాణం సమీపించి "అబ్బాయీ! ఒకణా అంటిపళ్లియ్యి" అని కొని యిటుచూచుసరికి వానికంటి కోబల్ల కనబడింది. దానిపై యీరీతిగా వ్రాయబడుంది:—

"ప్రయాణీకులారా! జాగ్రత్త—నిన్న రాత్రి కాపలావాని చంపి 50,000 రూపాయలనోట్ల నిచ్చటకు దగ్గరగనున్న బేంకు నుండి దొంగ లపహరించినారు. ఏమరచి యుండకుడు. రైలులో గూడ నట్టిదుష్టు లుందురు."

అది చదివి తలపంకించి, ఆ యువకు డాలోచనాపరుడై యుండ రైలువచ్చి ప్లాటుఫారమ్మీద ఆగింది. తక్షణమే పళ్లూ పళ్లూ అని కొందరు, పాన్‌బీడీ చుట్టా సిగరెట్టని కొందరు, సోడా సోడా అని కొందరు కుఱ్ఱాళ్లు యిటూఅటూ తిరుగుతున్నారు. బండినుండి దిగేవాళ్లు దిగుతున్నారు, ఎక్కాలిసిన వాళ్లెక్కుతున్నారు. మరొక దుకాణదారుడు "తలగడాలో" అని అమ్ముతున్నాడు. మన యువకుడు ప్రతీపెట్టిలోకీ ఒకమారు చూస్తూ పోతున్నాడు. వాడలా చూడడానికి కారణం ఎవరికీ తెలీలేదు. ఇంతలో ఓమిలిటరీఉద్యోగి పెట్టెలోంచివతలకిచూసి "ఒరే! తలగడా లిలాతే" అని ఒక తలగడా కొనుక్కొని లోపుకి పోయాడు. మనయువకుడా మిలిటరీ వానిపై నెందులకో అనుమానించి తాగూడ నందే ప్రవేశించాడు. మిలిటరీ వుద్యోగి కూడా మన యువకుని చూచి అనుమానించు తలగడా ఒడిలో నుంచికొని యేమో సర్దుతున్నాడు. మన యువకు డటుచూచీచూడ నట్లభినయిస్తున్నాడు.

మన యువకు డా పెట్టెయుందలి నలుగురు మనుష్యుల నొకమారు పరికించెను.

మన యువకున కెదురుగా నొక తురుష్కుడు గ్రామఫోనుపాటల పుస్తకము విప్పి చదువుకుంటున్నాడు. వాడిప్రక్కనే సర్దిన తలగడాకి చేరబడి మిలిటరీ యుద్యోగి నిద్ర నభియించుచుండెను. వాడి తలపైనున్న హాటులో కొంతసామాను గలదు. అది వాడిదే అయియుండును.

వాడికి సమీపంగా నొకముసలి స్త్రీ సామానుకు చేరబడి గాఢనిద్రావశయై యున్నది. మన యువకుడు కూర్చొనిన బల్ల చివర నొక బెంగాలీయువతి నూతనముగ వెలువడిన డిటెక్టివునవల నొకదానిని చదువు కొనుచుండెను.

రైలు, స్టేషను విడిచి పోయేవేళయింది. కండక్టరు పెట్టెలన్నీ తాళాలు వేసుకుంటూ వచ్చి మన ప్రయాణీకు లున్న పెట్టెలో కడు గిడి నాలుగువేపులా చూచి క్రిందనించో కార్డుతీసి "అరవిందుడ"ని దానిపై నున్నది గట్టిగా చదివెను.

"అరవిందుడు!" అని వాడు చదవగానే గాఢ నిద్రావశయై యున్నముదుసలి తప్ప తక్కిన వారందరు చకితులై కండక్టరు వేపు తేరిచూచిరి. అరవిందు డొక డిటెక్టివు. అప రాధపరిశోధనా నిపుణుడు.

కండక్టరటనుండి పోయెను.

"అరవిందు డపరాధ పరిశోధనయం దతి చతురుడుగదూ?"అని బెంగాలీయువతి తక్కిన ప్రయాణీకులఁ బ్రశ్నించెను.

"ఇక్కడున్న వాళ్లెవరికేనా అరవిందుణ్ణి తెలుసా?" అని పాటలపుస్తకము మూసి మహమ్మదీయు డడిగెను.

"ఇక్కడున్న వాళ్లెవరూ అరవిందుని పోల్చు కొనజాలరు. ఆత డనేక మారువేష ములు ధరించుచుండును." అని మన యువకు డనెను.

మిలిటరీయుద్యోగి కనుబొమలగూడ దీసి కొని ఆలోచనాపరుడై గాఢనిద్ర నొందు చున్న ముదుసలిఁగాంచి తలపంకించాడు. మన యువకు డది చిరుజూపులజూచి, బెంగాలీ యువతితో "ఇదిగో యీ పత్రికయందు " నిన్నరాత్రి విశల్యాపురపురైలుస్టేషను సమీపమున నున్నబేంకుకాపలావాని చంపి 50,000 రూపాయ లొకదొంగ అపహరిం చెను. వాని బంధించుట కరవిందుడు పలు ప్రయత్నములు చేయుచున్నా" డని వ్రాయ బడెం"దనెను.

"అట్లనా!"అనిబెంగాలీయువతి మళ్లీనవల విప్పింది. మిలిటరీవుద్యోగి అటుంచోమారు తిరిగి పరున్న ముదుసలిని మన యువకునీ ఓమారుచూచి కునకటం ప్రారంభించాడు.

* * *

అర్ధరాత్రయింది. రైలు గమ్యస్థానం పరి గెట్టి పోతుంది. పొగగొట్టంకూడి రైలుగొట్టాల లోంచొస్తూన్న, నిప్పుకణాలు మిణుగురుల్లా యెగురుతున్నవి.

మనయువకుడికి నిద్ర రాలా. లేచి కూచొని జేబులోంచి అంటిపళ్లు తీసి న్యూసు పేపర్లో పెట్టుకుని తినడం మొదలెట్టాడు. అది చూచి మిలిటరీవాడు మాంచినిద్రలోంచి లేచినట్లు

ఒళ్లు విరుచుకుని "నాకూ ఆకలిగా వుంది. ఇంత జీడిపప్పు తింటా"నని పై నున్నసామాను బడీమని లాగేసరికి ఆ పెట్టికి వెల్తురిస్తూన్న కార్బయిడులైటు పగిలి ఆరిపోయింది. పెట్టె చిట్టచీకటయింది. అప్పు "డమ్మో!" అనియెవరో అరచూరుకున్నారు. తక్కినవాళ్లు కంగారుపడి యిటూ అటూ తిరగటం మొదలెట్టారు. ఇంతలో రైలాంగి గార్డు లాంతరు పట్టుకొనందు ప్రవేశించి బ్రేకెవరు లాగారని ప్రశ్నించాడు. మన యువకుడు 'నే' నన్నాడు. గార్డు జరిమానా విధించి లాంతరుడొక్కకొక్కానికి తగిలించి పోయాడు. ముసిలిదిమాత్రం యింతగోలలో కూడా లేవనేనా లేవక పడుంది. మరేం అపాయాల్లేవని యెవరిస్థలాల్లో వారు కూచున్నారు. బండి బయల్దేరింది.

* * *

తెల్లవారింది. రైలు మణిపురంలో ఆగింది. మిలిటరీ ఉద్యోగి ముసలిదాన్ని "అమ్మా! లేవే. మణిపురం వచ్చాశాం" అని లేపాడు. ఆమె లేవలా. వెంటనే జాగుచేయక ఆమెను చేతుల్లో యెత్తుకొని సామాన్తో యివతలికొచ్చి ఒక జట్కా అద్దెకి పుచ్చుకొని ధర్మసత్రానికి తోలమన్నాడు. అరవిందుడు మొదణ్ణించీ యీ మిలిటరీ వానిమీదనుమానం పడుండటంచాత పరస్పరంగా తానుకూడ వానివెనక పడ్డాడు. బెంగాలీయువతి కూడ వేరొక జట్కాపై ఆ సత్రములోనే విరియుటకు బయల్దేరింది. భోంచేసింతరవాతక్కడ పనిచూసుకుని రెండోరైల్లో తన వూరు పోదామని.

మిలిటరీవుద్యోగి ఆ సత్రంలో ప్రవేశించి ఒకగదిలో ముసలిస్త్రీని పడవేసి తన దుస్తులు విడిచి మరియొకరూపంగా తయారవుతూండే సరికి మనయువకు డాతనికెదురుగ పిస్తోలు చూపుచు నిలచి "దురాత్ముడా! నిలు" అనెను. అనంతుడు చేతులెత్తి నిలిచిపోయెను. అప్పుడే బండిదిగిన బెంగాలీయువతియు నా గదిలో ప్రవేశించి యీ దృశ్యము చూచి ఆశ్చర్యపడింది.

మన యువకుడు "మోసగాడా! మిలిటరీ వేషంలో వుంటే నిన్ను నే పోల్చుకోలేనను కున్నావా? నే నెవణ్ణో తెలుసా? డిటిక్టివు అంరవిందుణ్ణి!" అని తన బేడ్జి (Badge) చూపెను. బెంగాలీయువతికి ఆశ్చర్య మినుమడించింది.

బెంగాలీయువతి "మీరా అరవిందుడు! ఇప్పటివాకా పోల్చుకోలేక పోయాను. ఎవరో ప్రయాణీకులనే భావించా రాత్రంతా!" అని నవ్వెను.

అరవిందుడు:—అమ్మాయీ! నిన్న రాత్రి మిలిటరీ వుద్యోగున్నాడే మన పెట్టిలో అతడే ఇతడు. గజదొంగ. విశల్యా



ఎ. వి. టి. అయ్యరుగారి అనుమతిని.

చొక్కట్టాన్ మంటపము—రామేశ్వర దేవాలయము

పురంలో సొమ్మపహరించినవాడు వీడే అని నా అనుమానం. వాడిచంకలో తలగడా లాగించింపు. అందులో యేంవిటో వున్నట్టు నా కనుమానం.

బెంగాలీయువతి నిర్భయంగా తలగడా లాగి చింపింది. అందులో 50,000 రూపాయల నోట్లున్నవి. ఆమె ఆశ్చర్యపడింది. బేంకు దోచినవాడు వీడే అని అరవిందుడికి రూఢయింది. అరవిందుడు ఆ సొమ్ము తన జేబులో పెట్టుకొని రెండోచేత్తో మరో పిస్తోలు తీసి అనంతుని వేపు గురిచూపుతూ బెంగాలీయువతితో "అమ్మాయీ! ఆ ముదుసలి చచ్చిపోయినట్టు నాకు పొడగడుతూంది. చూడు!" అన్నాడు. బెంగాలీయువతి చూసింది. ముదుసలి కొరకుబారుంది. అరవిందుడు "దుష్టా! ఆముదుసలిదాన్నెందుకు చంపావు? ఉన్నదున్నట్టూ చెప్పు. లేకపోతే కాల్చేస్తా" నన్నాడు.

అనంతుడు:—నిన్నరాత్రి నీవు చూపెట్టి లోకి రాగానే అరవిందుడివేమో అనుకున్నాను గాని నిశ్చయం చేసుకోలేదు. తరువాత ప్రసంగాన్నిబట్టి పోల్చుకొనుటనుండి తప్పుకునేందుకేవీ ఆలోచనలు తోచకపోయినవి. ఆ ముసల్ది నాకేవీ అవదు. అయినా అది నావల్ల నిన్ను భ్రమింపచేస్తే దాటిపోవచ్చునని దీపం పగలకొట్టి చీకట్లోగట్టిగా దాని పీక పిసికాను. "అమ్మో" అని పూరుకుంది. అప్పుడే ప్రాణాలు పోయాయి. మీరంతా అది నిదురిస్తూందనే అనుకున్నారు. తెల్లారేక ఆ చచ్చిన శవాన్ని "అమ్మా" అని పిలిచి యెత్తుకొని రైలుదిగి యిక్కడ వుదిలేసి నీ కంటిలో దుమ్ముకొట్టి పారిపోదామనుకున్నా. గాని దొరికిపోయా. నీవు నా వెనకాలే పడ్డావు. ఆ స్త్రీ బ్రతికుంటే నే "నమ్మా" అని పిలిస్తే "ఎవడివిరా ను" వ్వనును. నేనే దొరికిపోదును.

అరవిందుడు:—నీపేరు?

అనంతుడు:—అనంతుడు.

అరవిందుడు:—పద. జైలుకి. నువ్వు వుద్దండపిండానివి. బేంకుసొమ్మూ దొరికింది నువ్వూ దొరికావు.

అట్లరవిందు డనంతుని పోలీసుస్టేషనుకి తీసుకుపోయాక బెంగాలీయువతి అత్యాశ్చర్యమున రైలుకు పోయింది.

(అనుకరణము)

# రాజనీతి శాస్త్రము

విద్వాన్, అష్టావధాని అంబటి - సుబ్బరాయగుప్త గారు, ఎం. ఏ. బి, ఇడి.

[ మే సంచిక తరువాయి ]

(మూడవ ప్రకరణము,)

హక్కులు, బాధ్యతలు

(Rights and Obligations)

గీ. హక్కు, జన్మతోఁ బ్రతిజీవి కనుభవింపఁ
గలుగు నధికారఫల;మది గలుగ దెందు
బాధ్యతాకష్ట మింతైన బడకనున్న
ఖ్యాతి! "కష్టీఫలీ" యనునీతి వినవె!

పైప్రకరణమందు ప్రభుత్వముఁగూర్చి చర్చించు నపుడు ప్రభుత్వము తనయిచ్ఛేమేయి నిరంకుశముగా సంఘమును శాసించుట ముఖ్యధర్మమై దాని శాసనములను దిరస్కరింపక వానిననుసరించి చేయఁబడవలెనని తెలుపఁబడినది. ఇం దా హక్కులనగానేమి? అవి యెట్టివి? ఈ హక్కు లనుభవించుటకు ప్రజ లేబాధ్యతలు వహింపవలయు? అనువిషయములఁగూర్చి ముచ్చటింపఁబడును.

హక్కు:—ప్రతిజీవియు తనజన్మతోఁటి తనయిచ్ఛే మెయి ననుభవింపఁగలుగు నధికారము. తనకుఁగల స్వేచ్ఛను, పిత్రీయముగాని (Paternal) స్వీయము (Self-earned) గాని యైన ధనమును, సంఘప్రజలందఱకు వలె తనకుఁ బ్రభుత్వము వారిచ్చే రక్షణ మున్నగు వానిననుభవింప మానవునికిఁగల యొకవిధమైన జన్మతోఁగలిగిన యధికారమే హక్కు.

బాధ్యత:—ఇట్టిహక్కులేక హక్కులఁ దా నేలాటి తొందరనెవరివలనఁ గలుగకుండురీతిఁ బ్రభుత్వమువారిచే రక్షింపఁబడి యనుభవింపఁగలిగినందునఁ దా నా ప్రభుత్వమునకును, తద్రక్షణార్థమై చేయఁబడు శాసనములకును విధేయుఁడై యుండుట ప్రతివ్యక్తికి విధి. ఆ యా దేశకాలపరిస్థితులఁ బట్టియు ప్రజలవ్యవహారాచారరీతిగతులఁబట్టియు ప్రతిమానవుఁయొక్క స్వేచ్ఛ ధనము మున్నగు వాని ననుభవించుటకు హక్కుల సంఘమందలి యితరమానవు లెట్టియభిప్రాయముతో నైనఁ జేయు హింసాదిక ప్రతిబంధకములనుండి సంరక్షించుటకు ప్రభుత్వమువారు సంఘమునం దెల్లరిని ఫలానారీతి ప్రతివాఁడు నడువవలెనని శాసింతురు. రాముఁడు తన ధనము తాను తనయిష్టము వచ్చిన ట్లనుభవింప వలయునన్న, రంగఁడతని యాస్తిజోలికిఁ బోరాదు. రామునిస్వేచ్ఛకు నెట్టి ప్రతిబంధక మొనరింపరాదు. అట్లు గలిగించినఁ దా శిక్షకు బాధ్యుఁడ నగుదునను భయము రంగని కుండవలయు. ఇట్లుగాకున్న రామునికా హక్కనుభవింప సాధ్యముకాదు. ఇట్టిపరిస్థితులు ప్రభుత్వశాసననిర్మాణమున నే యేర్పడవలయు. కావుననే మహాభారతమునందు:—

కం. తనధన మిది యని యూఱడి
ముల్
మనఁ బరిణయమాది నైన మహోత్సవ
గోని యూడ నెవ్వరికివ
చ్చునె జనపాలుఁడు లేని చో నిర్భయతన్.

కం. యాగములును భోగములును
మహా
ద్యాగములును బహువిధముల ధర్మములు
భాగా! నరపతిరక్షా
యోగంబునఁ జెల్లు బ్రజకునుల్లాసముగన్.

అని చెప్పఁబడియున్నది. అట్లుగాక కట్టుదిట్టములు లేకనున్నచో సంఘమున నరాజకత్వమేర్పడి యరాజకప్రబలును. ఇట్టి కట్టుదిట్టములకు లోబడియుంటయే సంఘ

మందలి ప్రతివ్యక్తికిఁ గల బాధ్యత. అట్టి బాధ్యతయే లేకున్న హక్కు లనుభవనీయములుగాని, యాదరణీయములు గాని కాక నామ మాత్రావశిష్టము లగును. హక్కునకు బాధ్యతకుఁగల యీపరస్పర సంబంధము వ్యక్తీకరించుటకే పాశ్చాత్యరాజనీతి గ్రంథకర్తయగు సిడ్జివిక్ (Sidgewick) అనువారు "A right is really an obligation regarded from a different point of view, *i. e.*, regarded in relation to the person to whom the obligation is intended to be useful" అని తమరాజనీతిమూలసూత్రములు (Elements of Politics) అను గ్రంథమున వాకొని యున్నారు. ఈ హక్కులు, బాధ్యతలు, శాస్త్రోక్తము లనియు, నీత్యుక్తములనియు రెండు విధములు:—

(*a*) శాస్త్రోక్తములు లేక శాసనోక్తములు Legal rights and legal obligations:—ఇవి ప్రజల ప్రవర్తనకు, ప్రభుత్వకర్తవ్యమునకు గల పరస్పరసంబంధము శాస్త్రములచే నిర్ణయింపఁబడి వెలయునవి. నారాయణునితోడి వ్యాపార సమాధానమును (Commercial Contract or Agreement) వానిని మోసపుచ్చవలెనని నరసింహుని యభిలాష; కాని, యా యభిలాషకు, సమాధాన ద్రోహము (Breach of Contract) చేసినవాఁడు దండ్యుండని శాసించు ప్రభుత్వపుశాసనము; ప్రతిబంధకముగా నున్నది. దానివలన నరసింహుఁడు తనయిష్టము నడచిపుచ్చి వర్తించుట తప్పనిది. అటు వర్తించుటయే నరసింహుని శాస్త్రోక్తమగు బాధ్యత. (Legal Obligation) ఇట్టి ద్రోహములనుండి ప్రభుత్వమువారిచే రక్షింపఁబడవలసియుండుటయే నారాయణునికి గల శాస్త్రోక్తమగు హక్కు. అటులనే యొకని ధన మనుభవించుట, యదియది రక్షింపఁబడివలసినదిగా నుండుట వానిహక్కు. దాని నొరులనుండి ద్రోహముచేఁగాని, దొంగతనముచేఁగాని లాగుకొనకుండుట బాధ్యత.

(*b*) నీత్యుక్తములు:—(Moral rights and obligations)-ఈరకములోఁ జేరినహక్కులు బాధ్యతలాయాదేశకాల సంఘపరిస్థితుల మార్పుల ననుసరించి మారుచుండును. ఏసంఘమందైన, నాసంఘమం దేకాలమందైన నావరించి యుండు మతావేశములఁబట్టి, యిది నీత్యుక్తము; యిది యనీత్యుక్తము అని నిర్ణయింపఁబడుచుండును. ఇరువది ముప్పది సంవత్సరముల క్రిందనున్నతజాతిహైందవులందెవ్వరేని తమ్మంత్యజులు సమీపించినంతమాత్రముననే మహాద్రోహముగా పరిగణించుచుండిరి. అపుడే హరిజనునికిగాని ప్రతిసవర్ణహైందవునికి దూరముగా నుండుట బాధ్యతగా నుండెడిది. వానిని దూరముగా నుంచుట సవర్ణహైందవుల హక్కుగా భావింపఁబడుచుండెడిది. ఇపుడన్ననో ఆంగ్లవిద్య నభ్యసించి యున్నతోద్యోగములఁ బొందిన యంత్యకులజుల కిట్టి బాధ్యత లేదు. మీదుమిక్కిలి వారి కున్నతజాతివారితో సరిసమానముగాఁ గలసి వర్తించు హక్కు కూడ యేర్పడినది. ఇపుడిపుడు మహాత్మా గాంధి మున్నగు దేశభక్తుల ప్రచారఫలితముగా నీయంత్యజులు హరిజనులై వారి నింతవరకు వేధించుటచేఁగలిగిన పాపపరిహారార్థము వారిని దేవాలయములకుఁ గూడ రానిచ్చి వారితో సమానముగా సవర్ణహైందవులు మెలగుట హైందవ సంఘమున నానాటి కేర్పడుచున్నది. నిపుడు హక్కంత్యజులదిగాను, బాధ్యత యున్నతజాతి హైందవులదిగాను ఏర్పడుచున్నది. చూచితిరా! నీత్యుక్తజాతిలోఁ జేరినహక్కులు, బాధ్యతలు నిట్లు మార్పుఁజెందును.

రెండిటికిఁగల భేదము:—శాస్త్రోక్తములు రాజశాసనప్రోక్తములు, అనతిరిక్తములు, ప్రభుత్వరక్షితములు. వాని మీఱినవారు శిక్షితులు. నీత్యుక్త లో అట్టివిగావు. అవి కేవలము పెక్కుజనుల మనోభావగతములై మహద్వ్యక్తులమతములై ప్రజాసమ్మతము లగును. వీని కొకరి నియమితమగు రక్షణ లేదు. వీనిఁ

దిరస్కరించినఁ గలుగు శిక్ష లేదు. అయిన నీ నీత్యుక్తములే మహావ్యాప్తుల ప్రోద్బలముచేఁ గొంతకాలమునకు శాసనప్రోక్తములై శాస్త్రోక్తము లగును. సంఘసంస్కరణాభిలాషుల ప్రచారబలమునఁజేసి కొంతకాలమునకుముందు వీరిచే నీత్యుక్తబాధ్యతగాఁ బరిగణింపఁబడుచున్న 'రజస్వలానంతరవివాహములు' శారదాచట్టమునుబట్టి యిపుడు శాస్త్రోక్తము లైనవి గావా! ఢిల్లీ శాసనసభయందు చర్చింపఁబడఁబోవు హరిజన హైందవ దేవాలయచట్ట మామోదింపఁబడినచో, హరిజనులకిపుడు నీత్యుక్తముగా నున్న హక్కు శాస్త్రోక్త మగును. అపుడది మీఱరానిదై వారిని దేవాలయములకు రానిచ్చుట కున్నతజాతివారు బాధ్యు లగుదురు. ఈ బాధ్యత మీఱరాని బాధ్యత యగును. "పదుగురాడిన మాట పాటియై ధరఁజెల్లు" అని తాళ్లపాక - పెదతిరుమలార్యుఁడు తన "వెంకటేశ శతకము"న నుడివిన రీతిగా నీత్యుక్తము సంఘమందలి పదుగురమాట నాధారముగా నుండుపాటిది, శాస్త్రోక్త మట్లుగాక "రాజు చేసినది ధర్మంబై వర్ధిల్లు" అను తత్కవివాక్యరీతి రాజశాసనము నాశ్రయముగా గల ధర్మము.

**ప్రభుత్వమునకు హక్కులు బాధ్యతలు నున్నవా?:**—సంఘమందలి ప్రత్యేకవ్యక్తులకే ప్రభుత్వమువారికిఁగూడ నీ హక్కులు బాధ్యతలు గలవు. ప్రజల శాసించుట హక్కు. ఆశాసనములఁ బరిపాలించుట, వాని నమలునందుంచుట, న్యాయముగాఁ జలాయించుట బాధ్యత. ప్రజల నాజ్ఞాపించి వారిచే మ్రొక్కులఁ గొనుట హక్కు. ఆప్రజల హక్కులగు ప్రభుత్వరక్షణము, ప్రభుత్వపరిపాలన, ప్రభుత్వపు బాధ్యతలు. కాన నొకరిహక్కు, వానితోఁ బరస్పర సంబంధముగల మఱియొక బాధ్యత. అటులనే ప్రత్యేక వ్యక్తులందు నుండును. రాముఁడు రంగనియజమానియై వానినుండి పనులఁగొనుహక్కుఁ గలవాఁడు. రంగడన్ననో, రామునికి నౌకరియై రాముఁడు విధించు పనులనెల్లఁ జేయుబాధ్యత గలవాఁడు. ఈభావమే యాంగ్ల రాజనీతికారుఁడగు 'సిడ్జివిక్కు' (Sidgewick) గారి పైనఁజెప్పిన "A right is really an obligation regarded ......" అను వాక్యమునందును వ్యక్తమగుచున్నది. అయినను హక్కు కేవల మీరీతినే యెల్లవిషయముల రక్షిత. లేక, ప్రాప్తస్వేచ్ఛ. లేక స్వాతంత్ర్యము(Secured or Protected Liberty) అనియే చెప్పరాదు. ప్రజలకు తమ ధనమువిషయమున దానిననుభవించుటకు స్వాతంత్ర్యము గలదు. దానిసంరక్షించు బాధ్యత ప్రభుత్వమునకు గలదు. కాని బిడ్డల విద్యావిషయమున నావిద్యాప్రాప్తిఁ గల్గజేయ తలిదండ్రుల బాధ్యతగాని యందు బిడ్డలకుఁగల యనుభవస్వాతంత్ర్య మేమున్నది?

ఇదింకొక విషయము. ఇట్టి యనుభవస్వాతంత్ర్యము తదీయ ప్రభుత్వరక్షణ వ్యక్తి ప్రభుత్వ సంబంధమందే కాక, ప్రభుత్వసమిష్టి సంఘ సంబంధమందుఁ గూడ గలవు. సమిష్టి సంఘ సంక్షేమము కేవలము వ్యక్తి క్షేమమున కన్న మిన్నగా నాదరణీయ మగుటచేతనే వ్యక్తి యనుభవస్వాతంత్ర్య మెట్టిదైనను దానివలన సమిష్టిసంఘమునకు హాని యొదవుచో, నట్టివ్యక్తిస్వాతంత్ర్యము నరికట్టుట ప్రభుత్వమునకు బాధ్యత్వమునకు బాధ్యత గలదు. ఆటులనే సంఘమునకు వ్యక్తిహక్కుల నిరోధముచేనైన మే లొదవనున్న నటులఁ జేయుట ప్రభుత్వమునకు కర్తవ్యము. మద్యపానమునఁ జేయుటకు వ్యక్తికి స్వాతంత్ర్యమున్నను, దానివలన సంఘమునకుఁ గీడగుటచే ప్రభుత్వమువారు రీవ్యక్తిస్వాతంత్ర్యమునకుఁ గొంతవఱకు హద్దు నేర్పఱచి నిరోధించి యున్నారుకదా?

మొత్తమునఁ దేలున దేమనగా, హక్కులు కేవలము స్వార్థపరాయణత్వమునకై యిష్టమువచ్చినట్లు నిరాటంకముగాఁ జలాయించు స్వేచ్ఛాధికారములు గావు. అవి సమిష్టిసంఘక్షేమముఁ బాటించు హద్దుగల యధికారములు.

[సశేషము]

# కాగితము పరిశ్రమ చరిత్రము

"పేపర్ అండుప్రింటు" అనుపత్రికలో స్టీఫక్ హార్లక్ గారు కాగితముయొక్క ప్రారంభ దశనుగూర్చి యిట్లు వ్రాయుచున్నారు —

"కాగితముచేయు పరిశ్రమ మొదటను చీనాలో ప్రారంభింపఁబడినది. ఆ ప్రారంభము క్రీ॥ శ॥ 105 వ సం॥ లో జరిగినట్లు కొందఱు తలఁచుచున్నారు. చాలకాలము వఱకాపద్ధతి యొక మర్మముగా నుంచఁబడినది. పూర్వకాలమున వ్రాఁత 9 అంగుళముల నిడివిగల వెదురుబద్దలపయినో కొయ్యబద్దలపయినో జరుగుచుండినది. అట్లు వ్రాయఁబడిన బద్దలను దారముతో నొకటిగాఁ గట్టుచుండిరి. చీలిన వెదురు యొకటె కలముగా నుపయోగింపఁబడుచుండెను. చెట్లరసమును బంకలను సిరాలుగా నుపయోగపడుచుండినవి.

'మసీరా—కొన్ని చెట్లపట్ట - వెదురు-గుడ్డ ప్రేలికలు - ప్రాఁత దారము - మొదలయిన వానితో గుజ్జు తయారుచేసి దానితోఁ గాగితముచేయు పద్ధతిని తొల్తను త్సేయిలమ్ అనునతఁడు కనుఁగొనెను. పయినెన్నినట్లు తయారయిన గుజ్జును పలుచగా నెఱపియెండించుచుండిరి. అది యొక పలుచని జేఁకువలె తయారగుచుండెను.

ఈ కాగితము పరిశ్రమనుబేరము తండాల మూలమునతుర్కిస్థానము, రషియా, పెర్షియా అరేబియా, ఈజిప్టు, మొరాకో, స్పెయిను ఫ్రాంసు. జర్మని, అను దేశములద్వారా ఇంగ్లండునకు చేరినవి. ఇంగ్లండులోను యూరోపుఖండములోను ప్రారంభము గావింపఁబడుటకు ముందు కాగితములు మిక్కిలి విశేషములుగా నక్కడికి చీనానుండి దిగుమతి చేయఁబడుచుండినవి. క్రీ॥ శ॥ 300 ల సంవత్సరములవఱకుఁ గల యీ విషయములన్నియును సర్ ఆరల్ స్టెయిక్ గారు గావించిన పరిశోధనలవలనఁ జాలవఱకుఁ దేలినవి. పిమ్మట ఈ పరిశ్రమ తుర్కిస్థానములో నెలకొన్నది. అక్కడినుండి యది సమర్కండునకును అక్కడినుండి బాదునకును పెర్షియాకును, అక్కడినుండి యీజిప్టునకును వ్యాపించినది. ఈ వ్యాప్తి జరగుటకు క్రీ॥ శ॥ 8 వ శతాబ్దముపఱకుఁ గాలము జరిగినది. అటు పిమ్మటను మొరాకో స్పెయిను ఫ్రాంసు కొలోక్ దేశములద్వారా క్రీ॥ శ॥ 1500 వ సం॥ ల నాఁటికి వ్యాపించినది. అనఁగా ఆపరిశ్రమ పుట్టిన 14 వందల సంవత్సరముల

నాఁటి కది ఇంగ్లండునకు వ్యాపించినది. చీనా దేశస్థులు ఈ కాఁగితపు పరిశ్రమను కనిపెట్టి నదేకాక ఆ కాగితమును వ్రాఁతకు నుపయోగమగు పద్ధతినికూడ కనుఁగొనిరి. వారు చేయు రకిములలో మిక్కిలి సున్నితములయిన టిష్యూ కాగితములు మొదలుకొని మిక్కిలి దళసరియయిన కవరు కాఁగితములవఱకును గలవు. పిమ్మట వ్రాఁతకనుకూలము లయిన పరిమాణము లేర్పాటుచేయఁబడినవి. ఈ పనులు లింఘ్వేలమూలమునఁ జేయఁబడెడివి. పిమ్మటను ఆ కాగితము సిరా యద్దుకొనకుండుటకుఁగాను ఆ కాగితమునకు జిప్సం కోటింగు ఇయ్యఁబడినది. ఆ గుజ్జులో పచ్చిపిండికూడ కల్పఁబడినది. దీనిని బట్టి చూఁడగా కాగితము పరిశ్రమ సమగ్రమయిన తరువాతనే చీనానుండి యావలికి వెళ్లినట్లు తోఁచుచున్నది.



# తెలుగు దారి

కుందుర్తి నరసింహారావుగారు,

**విశ్వకళాశాల పుట్టినందుకు:—**

ఆంధ్రభాష నేమో ఉద్ధరిస్తుం దనుకొన్నాము. తప్పదు. ఆ మహాపీఠం కాకపోతే ఇం కెవరున్నా రిప్పుడు? ప్రాచీనకాలపు బతికున్నరోజుల్లో మహా రాజులు చక్రవర్తులు భాషాదేవిని తలమీద పెట్టుకు పోషించారు. అది కళోపాసకులకు సువర్ణయుగము; ఆంధ్రభారతి పట్టుసెల్లాలే కట్టినరోజులు. ఇప్పు డవన్నీ తలచుకుంటే యేంలాభం?

ప్రజలున్నారు లెండి. కాని ప్రజలబుద్ధి భాష వరకూ ప్రాకటానికి నేడేమీ అవకాశాలు లేవు. వారికి ముందు కడుపునిండా తిండికావాలి గదా! ఉదరపోషణ జరగనిదే మానసికాభివృద్ధిని గూర్చి తల పోయటానికి వీలులేదు. వాళ్లింకా మొదటి ప్రయ త్నంలోనే వున్నారు. భాషనుగూర్చి ఆవేశం ఉన్న వారు చాలా తక్కువ. ఆవేశం ఉండీ శక్తి ఉన్న వారు అసలే తక్కువ.

ఇక, యేమాత్రమన్నా తెలుగును బాగుచెయ్యా లంటే ఆంధ్రవిశ్వవిద్యాలయమే.

అయితే ఆవిడగారు చేస్తున్నదేమిటి? ముందుగా ప్రజల్లో విద్య వ్యాపింపజేయటము. కళాశాలల మూలా న ముఖ్యంగా యువకుల కందరికీ తెలుగు భాషాజ్ఞానం బాగా కలిగించా లనుకుంది. అదివరకు ఆంగ్లభాషా ప్రవాహంలో కొట్టుకు పోతున్నవారికి కొంచెం అడ్డు వేసి ఆపింది. బి. ఏ. కికూడా 'రెండవభాగం తెలుగు' అని అందరూ తప్పకుండా చదవాలిసిన భాగం ఒకటి నిర్ణయించి పదిపుస్తకాలు చదివిస్తున్నది. విశ్వకళాశాల స్థానంలోనే బి.ఏ. ఆనర్సు తెలుగుకోర్సు ప్రారంభించి నడుపుతున్నది. మొత్తంమీద విద్యార్థులబుద్ధి ఆంధ్రంమీదికి మరల్చింది.

నిర్ణయించే పఠనీయగ్రంథాలు ఇదివరకు బాగుం డక పోయినా ఇప్పుడిప్పుడు కాస్త దారిలోకి వస్తు న్నవి. కాని, ఇప్పటికీ కుఱ్ఱవాళ్లు తెలుగుమీద అంతగా శ్రద్ధతీసుకోవటం లేదని తాను గ్రహించినది. ఆ లోపానికి మందేమిటి? పరీక్షాపత్రాలు కఠినంగా యివ్వటమా? వీటైనంత తక్కువమందిని ప్యాసుచెయ్యా టమా? లేకపోతే ప్రవీణులైన ఉపాధ్యాయులను వేసి బోధనాపద్ధతిలో మార్పులు చెయ్యటమా?

మొదటి రెండు పద్ధతులూ గర్హ్యములు. అవ్వే ఒకటి రెండేండ్లనుంచీ జరుగుచున్నవి. ఇంటరుమీడి యేటు బి. ఏ. పరీక్షల్లో తెలుగులో తప్పినంతమంది కుఱ్ఱాళ్లు మరి యేభాగంలోనూ తప్పలేదు. కారణం? వాళ్లు చదువుకుంటున్న రేండేండ్లూ నిజంగా వాళ్లకు భాషవస్తున్నదో రాదో గమనించక వీరాపరీక్షకు కూర్చున్న చివరనిమిషంలో వాళ్లను శిక్షించటం జరుగుతున్నది.

అందుచేత కళాశాలలలో ఉపాధ్యాయులమీద కూడా ఒకవిధమైన ఇన్స్పెక్షన్ పెట్టడం, అత్యు త్తమమైన గ్రంథాలుమాత్రమే నిర్ణయించడం, భాష నేర్పడం వల్లకూడా బ్రతుకుతెరువు వేర్పడుతుందనే విశ్వాసం విద్యార్థులకు కలిగించటం ముఖ్యంగా చేయ వలసిన పనులు.

భాషాసేవకులు బ్రతకాలంటే యింకా బాగా ప్రజలలో విద్య వ్యాపించాలి. ఇంకా యెక్కువవిద్యా శాలలు పోషింపబడాలి. మంచిగ్రంథా లేవన్నా వెలు వడేట్టయితే వాటిని విశ్వకళాశాల ఆదరించాలి.

---

**మరచిపోయారూ?—**

తిక్కన చిత్రంవేయించి ఆంధ్రులకు ఒక అమూల్య రత్నం ప్రసాదిస్తామని క్రిందటి సంవత్సరం ప్రకటిం

చారే విశ్వకళాశాల తెలుగుసంఘంవారు? మొదట కొన్ని బొమ్మలు రావటం, వాటిని నిరాకరించటం, బాపిరాజు వెంకటాచారిగార్లను మళ్లీ వెయ్యమనటం జరిగిపోయినవి. కాని ఆ చిత్రకారులను మళ్లీ యేమన్నా కదిలించారా తెలుగుసంఘంవారు? అసలే మరిచిపోయినారా తమ సంకల్పాన్ని?

ఆంధ్రుల్ని యెవరన్నా తిట్ట దలచుకుంటే ముందుగా, 'వాళ్లు అనుకున్నపని సాంతంగా చేయరు' అని మొదలెడతారు. ముందు దూకటమే గాని, ముగించటం మనపని గాదు. కాని ఆ లోపాలన్నీ యేళ్లు పైబడ్డ పెద్దలకేగాని, యిప్పుడిప్పుడు పైకివస్తున్న కుఱ్ఱాళ్లు వాటిని తెలుసుకొని సంస్కరించుకున్నారేమో అనుకున్నాము. తెలుగుసంఘంలో వున్న వాళ్లంతా ఉత్సాహవంతులైన విద్యార్థులు కవిబ్రహ్మచిత్రం వేయిస్తామని చాలా గొప్పప్రతిజ్ఞ చేశారు; అంతా అప్పుడే మరిచిపోయారూ?

అన్నట్లు క్రిందటిసంవత్సరం వున్న విద్యార్థులు చాలామంది వెళ్లిపోయినట్లున్నారు; ఇప్పుడు మళ్లీ కొత్తసంఘం గాబోలు. అయినా అధ్యాపకులు మారలేదుగదా; తమఉద్యమం యేదోవిధంగా కొనసాగేటట్లు ప్రయత్నించలేరూ?

ఇతరదేశాలలో మహాపురుషుల చిత్రాలను గీయించటానికి వారి జ్ఞాపక చిహ్నాలను ప్రతిష్ఠించటానికి లక్షలు లక్షలు ఖర్చుపెడుతున్నారు. షేక్స్పియర్ పేరుతో ఒక నాటకశాల నిర్మించినప్పుడు ఇంగ్లండు దేశమంతా అక్కడే పోగైంది. రాజకుమారుడు స్వహస్తంతో ద్వారం తీసి మహాకవి నామమును గౌరవించాడు. మన కవులనుగూడా మనం గౌరవించుకోవటం ధర్మంగదా!

ఇప్పటికవులను పండితులను ధనమిచ్చీ షష్ఠి పూర్తి మహోత్సవాలు చేసి గౌరవిస్తున్నాము. కాని, మన వాఙ్మయానికి పునాదివేసిన మహాకవులకు మన కృతజ్ఞత చూపే విధాలు వేరేవున్నవి. వానిలో యిటువంటిచిత్ర రచన ఒకటి. దీనివల్ల ప్రతిఆంధ్రుడి కండ్లయెదుటా యెల్లప్పుడూ మన ప్రాచీనప్రతిభ వెలుగుతూ వుండేటట్లు చేయవచ్చును. కాబట్టి తెలుగుసంఘంవారు తమ ప్రయత్నం పునరుద్ధరించాలి తప్పకుండా.

చిత్రకళ తెలుగువారికి సహజమైన విద్య అయినప్పటికీ ప్రోత్సాహం లేక నేడు మందగించి పోతున్నది. ఇలాంటి బహుమతులన్నా క్రమక్రమంగా యేర్పాటుచేస్తే, మళ్లీ గొప్పగొప్ప చిత్రకారులు వెలుపడటానికి అవకాశం వుంటుంది. విశ్వకళాశాల అనిపేరు పెట్టుకున్నప్పుడు, కళలను పోషించకపోతే యెట్లాగు?

తెలుగు సంఘానికి, పాపం, డబ్బులేకపోవచ్చును. అందుకనే నూరురూకలు మాత్రమే బహుమతి యిస్తామని ప్రకటించింది. ఇప్పుడసలే మానుకుంది. అందుచేత, 'ప్రారంభింపరు నీచమానవు' లనేంతవరకు వానిని గౌరవిస్తూ, విశ్వవిద్యాలయమన్నా ఆ పనికి పూనుకొని, బాపిరాజుగారిచేతనో మరియే చిత్రకారునిచేతనో కవిబ్రహ్మ చిత్రం వెలువడేట్టుచేస్తే మంచిది.

---

## వరదలూ, వర్షాలూ—

నదులు పొంగి వరదలురావటం, వర్షాలు యెక్కువై పంటలు పాడైపోవటం ప్రపంచంలో అంతటావున్నదే. అవి భగవంతుడు చేసేనష్టం కాబట్టి దానెవరూ అడ్డుపెట్టలేరు. కాని, మనంకూడా మన తలమీద వర్షాలు కురిపించుకుంటే చెప్పేదేమిటి?

మేఘాలమీదినుంచీ వచ్చిన వర్షాలు మన ఆహారాన్ని పాడుచేస్తున్నవి, మిక్కుటంగా వచ్చినప్పుడు; అర్థంలేని సంగీతవర్షం, కురిపించుకొని మన మెదడునే పాడుచేసుకుంటున్నాం మనం! సినిమాప్రదర్శనాలు ఈ మధ్య వరదలు లాగానే వస్తున్నవి. కాని అవి మనస్సుకు సరియైన సంతోషం తెచ్చేవైతే మంచిదే; కాని

సంతోషానికి బదులు అసహ్యాన్ని ఆవేగాన్నీ కలిగించే వైతే కష్టం. (నాట్యరంగం) అని పేరుపెట్టి పాటక చేరీగా యేలా తయారుచేశామో, సినిమారంగం అని పేరుపెట్టి 'గ్రామొఫోను'గా తయారుచేశాం కేవలం.

పాశ్చాత్యులు సినిమాలో పేరు పొందారంటే నాట్యచాతుర్యంచేత, భావ ప్రకటనచేత—సంగీతం కొద్దిగా యెక్కడో అవసరమైనచోట వచ్చినా, దానివల్ల యేనటకుడికీ పేరు రాలేదు. పాత్రధారణలో చాతుర్యం చూపినవాడినే ప్రజలు మిక్కుటంగా గౌర విస్తున్నారు.

ఇక తెలుగుఫిలుములు చూడండి. (ఇవి ఇప్పు డిప్పుడే పుటుకున్నవి గాబట్టి తీక్ష్ణదృష్టిలో చూడ గూడదు; కాని, పుట్టేటప్పుడే కుక్కమూతి పిందె లయితే యెలాగు?) వేశ్యలు మాత్రమే స్త్రీపాత్రలు ధరించటం మన దురదృష్టం. కాని, మరొకటి. కొత్తగా రాబోతున్న సీతాకళ్యాణం చూడండి. రామ పాత్రధారి 'సంగీతానికి' మాత్రమే మేలు వేయి అని ప్రతీతి. సీత—సరే. ఈ సమ్మేళనంలో పవిత్ర మైన భక్తిప్రేమసంజనిత మైన అలౌకిక భావప్రద ర్శనం బయలు పడుతుందా? శ్రీరాముడు జగత్తుకు చూపిపోయిన ఆదర్శం ప్రేక్షకుల హృదయాల్లో ప్రవేశిస్తుందా? లేక, 'సీనరీ' చూచి సంతోషించ వల సిందేనా? ఏమో చూడాలి—కాని సంగీతవర్షంవల్ల నాట్యకళ ధ్వసంమవటం యెలాగూ తప్పదు. ఈ మధ్య గోదావరి వరదలవల్ల రాజమండ్రీ పొలాలన్నీ అదృశ్యమైనట్టు.

---

# కువలయానందసారము

ఇది సంస్కృతమున అప్పయదీక్షితులు రచించిన "కువలయానందము" ననుసరించి క్రొత్తపద్ధతిని రచింపఁబడిన అపూర్వమగు అలంకారగ్రంథము. రచయిత ఉభయభాషా - సాహిత్య విద్యాప్రవీణులు, అలంకారశాస్త్రమున ప్రత్యేకకృషి చేసినవారును అగు శ్రీ బులుసు - వేంకటరమణయ్యగారు. ఇందు అలంకారలక్షణములు సులభములగు పద్యములలో నున్నవి. ఉదాహరణములు చాలవఱకు వివిధాంధ్ర ప్రబంధములనుండి సేకరింపఁబడినవి. లక్ష్యలక్షణముల వివరణములు వచనమున నున్నవి. శాస్త్రచర్చలు సంకేతపద వివరణములు ఉదాహృత గ్రంథసూచిక ఉదాహరణ పద్యసూచిక గ్రంథముచివఱ అనుబంధమునఁ జేర్పఁ బడినది. దీనికి అమూల్యమగు పీఠిక కలదు. ఇది పండితులయాదరణకు పాత్రమై 1938 సం. "విద్వాన్" (బి) పైనలు పరీక్షకు నిర్ణయింపఁబడినది.

చక్కని అచ్చు మేలురకపుకాగితము. క్రౌనుసైజు 160 పుటలు. వెల రు 1-0-0.

దొరకు చోటు:—ఆర్ - వేంకటేశ్వర్ అండ్ కో. లోన్ స్క్వేర్, మద్రాసు.

# వార్తలు—విశేషములు

## మిక్కిలి చిన్న శిశువు

బ్రిటిష్ ఆంజిలాలో వాతంస్టవులో మిక్కిలి చిన్న శిశువు జన్మించినది. దానితూనిక 1½ పవునులు. పుట్టినప్పటి తూనిక 1 పవును కి అవున్సు. ప్రతి నిత్యమూ శిశువు దాదాఁపు ఒక యవున్సు తూనికయభివృద్ధి చెందుచున్నది. దానికి గంటగంటకు పాలతో బ్రాందీని గలిపి ఫవుంటెన్ పెను ఫిల్లరుతో నిచ్చుచున్నారు.

---

## వింత మనుష్యుఁడు

సముద్రము చూడలేదు. లండన్ నగరము చూడలేదు. మాటాడు సినీమాకు పోలేదు. ఎప్పుడుఃగాని విశ్రాంతి ననుభవింప లేదు. బ్రిటనులోని డెంటనులో ఇట్టి కాపువాఁడొకఁడు గలఁడు. అతనిపేరు జె. జి. రాబిన్సన్ 65 సం॥ వయస్సుగల యతఁడిప్పటికీ పదియేండ్లనుండి యొక పొలములోనే పని చేయుచున్నాఁడు.

---

## పిడుగుపాటువలన పచ్చ

స్వీడన్‌లో ఆ రెన్క్యాటమ్ పర్వతము పయిన తుపాను కల్గినది. అప్పుడు కొందఱు స్త్రీలును పురుషులును ఒక చిన్నయింటిలో తల దాచుకొనియుండిరి. "దాగఁబోయిన చోటదయ్యాలకాట" యన్నట్లు ఆయింటిపయి ననే పిడుగుపడి యొకఁడు మరణించెను. ఒక పిల్లవాని వ్రేళ్లు పోయినవి. స్త్రీల శరీరములు మిక్కిలి కాలినవి. వారి శరీరములపయి నున్న యాభరణములు వేడి యెక్కుటవలన వాని గుర్తులు వారి శరీరములయందు పచ్చపోసినట్లుగా పడినవి.

---

## నిద్దురపెద్ద

ఒక పొగయోడను చీనా దేశస్థులయిన సముద్రపుదొంగలు గాం డ్రాక్రమించిరి. అందులో కార్నీగోయను పెద్దమనుష్యుఁడు ప్రయాణముచేయుచుండెను. అతఁడు మిక్కిలి బాగుగా నిద్రపోవువాఁడు ఒకప్పుడాయోడను చీనాదేశపు దొంగలాక్రమించిరి. అప్పుడు నిద్రపోవుచుండెను. వారివల్లనయిన గడబిడవల్ల నతఁడు మేల్కొనలేదు. కొంతసేపటికి తానుగా మేల్కొని నిదానముగా మొగము కడుగుకొని డ్రస్సువేసికొని తనగదిలో నుండి వెలికివచ్చి పచారుచేయుచు బెద్దతుపాకీ ధరించిన యొక చీనాదేశస్థుని చూచి మిక్కిలి మంచితనముగా ఆతుపాకి వెల యెంతయని యతనిని ప్రశ్నించెను. అంతలో అతనిప్రక్కలకు రెండు పిస్తోలులు మఱి యిరుగురిచే గుఱిగా నదుమఁబడి యుండెను. తాను సముద్రపు దొంగలపాలఁ బడినట్లప్పటి కతని కర్థమయినది.

---

**116 సం॥ వయస్సునందు నాట్యము నడపుట**

దక్షిణపు సర్బియాలో సంటార్టిజిమా అను ఊరిలో అందఱికంటె వృద్ధుడై 116 సం॥ వయస్సుగల మనుష్యుఁడు ప్రతి యాది వారము ఉదయము చర్చి కార్యమయిన పిమ్మటను ఒక జాతీయమయిన ఆటను తన అధ్యాపకత్వమున జరిగించును. 80 సం॥ వయస్సు గలవాడును 7 అడుగుల యెత్తుగల వాడును అయిన యతని కొమరుఁడతనికి సాయము చేయుచుండును.

---

జర్మనీలో నొక గ్రామములో నొక కోడి పెట్ట చేదునయిన ప్రక్కలుగల యొక గ్రుడ్డు పెట్టినది.

---

రోముదగ్గఱఁ బట్టఁబడిన యొక సొరచేప కడుపులో నొక పెట్రోలుడబ్బా దొరికినది.

---

పట్లవ్యాధిని తేనెటీగల కాటు పోఁగొట్టఁ గలదని కొందఱికి నమ్మకము గలదు. ఈ నమ్మకము బ్రిటనులో మఱింత యెక్కువగా నున్నది. ఇందులకుఁగాను తేనెటీఁగలతో ఆ రకము వ్యాధిగలవారిని కుట్టించి జీవించు వారును ఆదేశములో గలరు. వారికడనుండ వలసిన దంతయును తేనెటీగలతో నిండిన యొక పెట్టె మాత్రమే. వానిచేత కుట్టించు కొన్న ప్రతిరోగి 6 పెన్నీల నీయవలయును.

---

అమెరికాలో నొక యింజనీయరు ఫోటో యెలెక్ట్రిక్ సెల్లుతో నొక యంత్రమును తయారు చేసినాడు. దానివలన మనుష్యుఁడు కోరినంతట నేపుస్తకము కాగితములు త్రిప్పుట; రేడియో వాయించుట, దీపములను వెలిగించుట ఆర్పివేయుట అను పనులు జరుగునట.

---

జర్మనీలో నుండు నిలుపుదలలేని (non stop) ఎక్స్ప్రెసు రయిళ్లన్నిటిలోను వయిరు లెసు టెలిగ్రాము లేర్పాటు చేయఁబడినవి.

---

లంకా షయరులో దీపాలు వెలిగించు వేళకు దీపములు వెలిగించుటకును మోటారు బండ్ల వెనుకటి ప్రక్కని దీపములను వెల్గించుటకును వీలుగా నుండునట్లు నొక యంత్ర మనుష్యవిగ్రహము (Robbot) నిర్మింపఁబడినది.

---

**ఒకేతడవ కెనిమిది మందిబిడ్డల సంతానము**

దక్షిణ చీనా దేశములో క్వాంచుపాం ఒక స్త్రీకి ఒకతడవనే 7 గురు కుమారులును ఒక కూఁతురును జన్మించినారు. అందఱును క్షేమముగా యున్నారు. ఆమెపేరు శాంలింగ్. ఆమెభర్త యొక పడవవాడు. ఒక ప్రాంత పురాణ కథప్రకారము తనకేడునక్షత్రములు నుచంద్రుఁడును జన్మించినారని తలంచుచు చాలసంతసము నందియున్నది. 7 కొమరులుండుట యొక గొప్ప యదృష్టమనియును ఒక కూఁతురుండుట తల్లికి మనశ్శాంతికరమని యును ఆయన్ని దినములును గలసివచ్చునట్లుగా నొకచేసారి 7 గురు కొమరులును ఒక కొమార్తెయును జన్మించుట మిక్కిలి శుభప్రదమనియును వారు తలంచుచున్నారు.

---

# ఆరోగ్య విషయములు

## నల్లమందు అభ్యాసము

నల్లమందు నుపయోగించుటలో నేదో సుఖమున్నదను తలంపున ఈ అభ్యాసము ప్రారంభమగుచున్నది. ఈమందున కలవాటు పడినవారు దీనియొక్క గుణవిశేషములను గూర్చి యెన్నిరీతులుగానో వర్ణించి తమ మాట విన దలంచిన స్నేహితులకు మిక్కిలి దృఢముగాఁ జెప్పుచుందురు. సాధారణముగా 20 మొదలు 35 సంవత్సరముల లోపుగానుండు యువకు లుజ్జీవముకొఱకు దీనినికూడఁ బ్రారంభింతురు నల్లమందులో గొప్పశక్తి గలదని యనేకులు నమ్ముదురు. దీనివలన వీర్యోద్రేకము కల్గునని యసంఖ్యాక జనులు దీని వాడుకకు లోనయి యున్నారు. ఈ యౌషధమును బలువూ ఉపయోగించుటవలన దీని యభ్యాస మేర్పడి, దీనికి యువకులు దాసు లగుచున్నారు.

నరములబడలిక గలవారీ యౌషధము నొకసారి సేవించి, కొంత యుజ్జీవమునొంది దీనిని మఱిమఱి పెద్దపెద్ద మోతాదులతో వాడసాగుదురు. ఈమందు నుపయోగించుట మిక్కిలి యపాకరమని తెలిసినవారు సయితము దీని కలవాటుపడినచో దీనినుపయోగింపక మానలేదు. నోటితో గైకొనిన నల్లమందుమోతాదు 10-15 నిమిషములలో తన పనిని ప్రారంభించును. దానిని గైకొనిన వారి శరీరము పాలిపోవుటయో పసపువర్ణమగుటయో యేర్పడును. నాడియును చుఱుకుదనము పొందగించును. నాలుక పయిని దట్టముగా పాకిర పేరును. మలబద్ధకము కల్గును. కొంతకాలము జరిగిన తరువాత జ్ఞాపకశక్తియును ప్రవర్తనమును చెడిపోవుట గూడ గుర్తింప వీలగును. ఈ నల్లమందు తీసికొను నభ్యాస మీదేశములో నిప్పుడు మిక్కిలి కొంచెము జనులలోనే యున్నది. దీని నుండి కల్గఁగల ఘోరమయిన యపాయము వాటిల్లకుండుటకుగాను గట్టి ప్రయత్నము లే యాలస్యమునులేక చేయువలసి యున్నవి.

---

## గృహనిర్మాణము

మదరాసులో, సరే. అది మహానగరం కాబట్టి కలరా వ్యాపించిందంటే కొంతవరకు సహజం. కాని ఆంధ్రదేశపు పట్టణాలల్లో కలరా యెందుకు ప్రవేశించాలి? మొదట్నించీ మనం గ్రామ జీవనానికీ పారిశుధ్యానికీ అలవాటుపడ్డవాళ్లంగదా! క్రమక్రమంగా పల్లెటూళ్ల నన్నిటినీ పట్టణాలుగా మార్చటమే దీనికి కారణమయి వుంటుంది.

గ్రామాలలోకూడా కాఫీహోటల్లు పెట్టించటం ఒక దురభ్యాసం. శుభ్రంగా యింటిదగ్గర ఫలహారం కాఫీ అవి జేసుకోటం మానేసి, కాఫీ హోటలులు ప్రారంభిస్తే రోగాలను ఆహ్వానిచుటంకాదూ? వ్రేలెడంత పల్లె

కొంపల్లోను కూడా యీ లేనిపోని అదిరిపాటెందుకూ ?

పట్టణాలకైతే. సాధారణంగా మునిసిపాలిటీలు మొదలైనవి యేదో వుద్యోగులను నిర్మించి ఆరోగ్యపాలనకై కొంత పాటుపడతవి; కాని గ్రామాలలో ముఖ్యంగా ప్రజలే యెవరికి వారే తమ జనుల ఆరోగ్యం కాపాడుకోవాలి.

అంటురోగాలను ఆటంక పరచాలంటే ముఖ్యంగా గృహనిర్మాణం సరిగా ఉండాలి. పట్టణాలలో ప్రవేశించిన 'అద్దెలు' అనే పెనుభూతాల్ని పల్లెలలో పెట్టకపోవటం అదృష్టమే. కాని ఇండ్లు విశాలంగానూ దూరదూరంగానూ కట్టుకోవటమనేది హిందూదేశస్థులింకా నేర్చుకొనలేదు. పాశ్చాత్యులు, చూడండి, మన నగరాల్లో నట్టనడాన కట్టుకొన్నా పెద్దప్రహరీ వదలిపెట్టి దానిలో పచ్చనిగడ్డి మొలిపించి సుందరోద్యానాలు నిర్మించి, మధ్యభాగంలో బంగాళా కట్టుకొంటారు. వారికున్నసంపద మనకు లేకపోవచ్చు. కాని వున్నంతవరకు మనం ఆరోగ్యపదం నేర్చుకొని నిల్పుకోవాలి. దూరదూరంగా ఇండ్లు కట్టుకోవడం, ప్రతియింటికీ విశాలమైన ప్రహరీ వదలి పెట్టటం గనక వుంటే, అంటువ్యాధులు ప్రవేశించటానికి గానీ, అవకాశం వుండదు. దేవతలకు బలి యిచ్చినంతమాత్రాన మురికిగుంటలన్నీ బాగుపడతవని అనుకోరాదు రక్తప్రవాహంవల్ల ఇంకా కొంత చెడిపోతవి.

---

## ప్రసూతి

బాధలేకుండా ప్రసవించుటకు ఒకమార్గము క్రొత్తగా కనిపెట్టబడినది. ఈపద్ధతిని అనుసరించిన నూర్గురు స్త్రీలలో 58 గురకు ఏవిధమైన వేదనయు తెలియలేదు. 40 మందికి చాల సులభమైనకానుపు; మిగిలిన యిద్దరును మాత్రము కొంచెము సుళువుగా కనగలిగిరి. ప్రసూతిసమయమున ఒక విధమగు మత్తుమందు నాశిక ద్వారా పీల్చుటయే ఈ మార్గము.

—.o:—

# సంపాదకీయములు

## తెలుఁగుపద్ధతి

కొందఱు "వాడుకభాష వాడుకభాష" యనియును అదియే సజీవభాష యనియును, తొంటి మహాకవీశ్వరులు ప్రయోగించిన తెలుఁగుబాస చేచ్చిన యెముకల ప్రాయపు బాస యనియును దానినుండి యీ బ్రతికిన భాసకు చాల నపాయము వాటిల్లుచున్న దనియు నొక్కుమ్మడిగాఁ జింతిల్లుచున్నారు.

ఈ విషయమునుగూర్చి మాకుఁ గొన్ని యనుమానములు కల్గుచున్నవి. భాషలోని యేపద్ధతి యెవ్వరిచే నెందుకు వాడఁబడినప్పటికిని అది వాడుకభాషకాదా? భాషను వాడుకొను పద్ధతులు దేశభాగ దేశభాగమునకును, గ్రామ గ్రామమునకును వ్యక్తి వ్యక్తికిని భిన్నముగా నుండుటలేదా? అట్లయినప్పుడు వాడుకభాష యన్నప్పుడు ఎవ్వరి యెప్పటి వాడుకభాషయో తేలవలయును. ఫలాని వారి వాడుకభాష యన్నచో "వారి మొగాననే పొద్దుపొడిచినదా" యను ప్రశ్నకు జవాబేమి?

తొంటి మహాకవీశ్వరులచే నుపయోగింపఁబడి నిర్దేశింపఁబడిన బాస చేచ్చిన బాసయఁట. ఆ చేచ్చినబాసచే బ్రతికినబాస చేంపఁబడుచున్నది. ఈ నుడికారము శ్రీ బళ్లారి కృష్ణమాచార్యులుగారి నాటకములలో "చేచ్చినపాము కఱువదని నీకెవ్వరు చెప్పిరయ్యా!" యను నుత్తరుని యార్పులను జ్ఞప్తికి తెచ్చుచున్నయది. ఇప్పటి గ్రంథకర్తలలో పలువురు జీవించియుండఁగానే వారి పొత్తములన్నినామావశేషముగా నశించుచున్నవి. పూర్వ కవీశ్వరులలో ననేకుల రీతి యిందుకు భిన్నమని గ్రహింపఁబడును గాక.

తొంటి కవీశ్వరులయొక్క వ్యవహార పద్ధతి నిర్ణయములను గాంచిన దేశభాగము లంతటికిని సుకరముగా భాషకు సర్వజనీన సూత్రము లేర్పాటు చేయఁబడినవి. అవి యవలంబింపఁబడిన యెడలనే ఆ వ్రాయఁబడిన గ్రంథములు సర్వదేశ సమ్మతములగును. లేనిచో ఒక్కొక దేశభాగమున కొక్కొక్క రీతి పల్కఁబడి. ఈ పల్కుబళ్లు ఒకచోటి వేఱొకచోటి కనుకూలముగా నర్థముకావు.

క్రొత్తశబ్దముల చేర్పా? అది యెప్పటికిఁ గాదనఁబడలేదు. నన్నయాదులు వాడని మాటలెన్నో శ్రీనాథాదులు వాడిరి. వారు వాడనివీ లోపలనెన్నో భాసకుఁ జేర్పఁబడినవి. అవి భాషలో నన్యదేశ్యములను పేర నొప్పఁబడినవి.

ఏ బాస వాడుకోఁబడదో అది చేచ్చినది నాఁబడును. ఒకవంకను వాడుకలో నుండిన దానిని చేచ్చినదన్నచో "Because the doctor says I would die by this time. I must be dead" సిఁజెప్పినవాఁడు స్మరణకు వచ్చును.

పయిదెల్పిన వాడుకభాసవాదము వారెల్ల దాదాఁపుగా నొకవైపు వారగుటచే ఆ దేశవాళీమాట దేశమునకంతయు వ్యాప్తి కావలయునన్న ప్రయత్నము వ్యక్తమగును. కాని వీరే ప్రయత్నములోచేసి యిప్పటి వీరి యీవాడుక భాస నెంతకాలమునకో దూర దూర దేశభాగములకు రవాణా చేయఁ గల్గునంతలో వీరివైపున సిప్పుడు వీరికుండు వాడుక భాసపద్ధతులప్పటికి మార్పునొందును గదా? కాఁబట్టి దేశభాగములకు భాసల యాసలు తప్పవు. కనుక సర్వదేశసమ్మతత్వమునకుఁ గాను సర్వైకానుసరణీయ సూత్రభాషాపద్ధతులు కొన్ని యుండవలయును.

వానినే నన్నయాదులు నిర్ణయించినది. వాని యుపయోగ మప్పటినుండి యిన్ని వందలసంత్సరములవిచ్ఛిన్నముగాఁ గొనసాగినది. భాషతో అన్నివిధములయిన (సారస్వతార్థిక రాజకీయాద్యములయిన) అవసరములు గల శ్రీకృష్ణరాయాదుల కాలములన్నియు భాషా సూత్రములకు బాధ గల్గకయే కడచినది. తత్పరిశ్రమకు పాలుమాలిన నేఁటి నాళ్లలో దీనికి మార్పవసరమయినది! ఆమార్పేమో మన ప్రయత్నము లేకయే జరగుచేున్నది. కాని వాడుకభాస – వాడుకభాస – యను నీయాందోళనమునంజేసి తొంటి మహాకవీశ్వరుల గ్రంథములును వారును క్రమేణ విస్మరింపఁబడుదురేమోయనుభయము హెచ్చుచున్నది.

అయినచో దేశవాళీ పల్కుబడి యెంత వఱకవసరమున్నచో ఆవిషయ మాయావస్తు వ్యాపనావసర స్థలపరిమితినిబట్టి యుండును. అనఁగా తెలుఁగుజిల్లాలలో సూత్రమే వ్యాప్తి కావలసిన పాత్రమయినప్పుడు పాత్రాను గుణ్యముగా దేశవాళీ భాష యుపయోగింపఁ బడవచ్చును. మిగత దేశభాగములకుఁగూడ గ్రంథము వ్యాపింపవలసి యున్నచో సమీకరింపునొందిన పద్ధతులనే యుపయోగింప నొప్పునని మాయాశయము. అయినను ఈ భావము కేవలపువాడుకభాసవాదము వారి కానుకూల్యముగా ననుకొనఁబడ్డదేకాని–దేశవాళీ భాషారీతులు – యెంకి పాటలలోవలె పాత్రలుండి పాత్రానుగుణ్యముగా నుండుటల గనియు నిందుకు శ్రీ కీ॥ శే॥ కళాప్రపూర్ణ-వేదము – వేంకటరాయ శాస్త్రులుగారి ప్రతాపరుద్రీయముగూడ నుదాహరణము గాకపోదని మా యభిప్రాయము.

---

## వైశ్యవిద్యాభానూదయము.

బృందావన నగరవైశ్యులచే ప్రచురింపఁబడిన ధర్మవిషయ చర్చాగ్రంథము. దొరకు చోటు – ఓంకారనిలయము ఇంద్రకీలాద్రి, బెజవాడ.

ఈగ్రంథము వైశ్య ధర్మాధికార్యమును గూర్చిన చర్చలుగలదిగా నున్నది. ఇందు బెజవాడలోని శ్రీ కన్యకా పరమేశ్వరీ సత్రమునందు వైశ్యుల యెడజరగిన ప్రతి

కూల్యమును గూర్చియును శ్రీ శ్రీ శంకరా చార్యులవారు వైశ్యులను గూర్చి వైశ్య వేదోక్త వ్యవహారచర్చా పత్రమును పంపు టనుగూర్చియు శ్రీమల్లాది రామకృష్ణ చయను లుగారు వైశ్యులను గూర్చి కావించిన సంభాషణమునుగూర్చియు చర్చలు మిక్కిలి పొందికగాను శాంతోక్తులుగాను గావింపఁ బడి లేనిపోని గొడవలలోనికి దిగక తేటతెల్లముగా కరబదర న్యాయముగా సంశయ ములు దెల్పఁబడినవి. బ్రాహ్మణులను వారి వలనను వారిని బురస్కరించుకొని పీఠాధిపతు లవలనను వైశ్యులకు కర్మాధికారాది విష యములను పలువిధములయిన చిక్కులుగల్గుట తెల్పఁబడినవి. వైశ్యులకు వేదాధికారము లేదని మొదటను, దానిని కదపఁగా వైశ్యులు వైశ్యులుగారని పిదపను, దానిని గదపఁగా వైశ్యులు వైశ్యులేకాని కర్మబాహ్యులయి యెన్నోతరము లయినందున ప్రాయ చిత్తా నర్హులనియును బ్రాహ్మణులనుట యెంత పొంక ముగా నున్నదో తెలియనగును. శ్రీ శ్రీ శంక రాచార్యులవారి పీఠమేర్పాటయిన తరువాత నెన్నివందల వత్సరములలో శ్రీ కన్యకాపర మేశ్వరీవృత్తాంతము జరగుట. అప్పుడేకదా వైశ్యులకు వేదోక్తమునుండి పురాణోక్తా చారములలోనికి వినిమయము ? దాని నప్పుడు ఆపీఠాధిపతులు సరిచేయక మిన్నక చూచు చుండి వేదాచారబాహ్యత వైశ్యులలో రూఢియయిన తరువాత మీకు ప్రాయశ్చిత్త

ములు లేవని ఆ పీఠమునుండియే జబాబు వచ్చుట చాల బాగుగానే యున్నది. యింటిని సరిచూడమని ఆపని నొకని కప్పగించితి నతఁడొప్పుకొనియె. కాని ఆయిల్లు పడి పోవుచుండగా మరామత్తు చేయింపక చూచుచు నూరకుండి పిమ్మట ఇల్లిట్లయిన దేమయ్యా ! అనగా "ఇల్లుపడిపోయి చాల కాలముయినది. ఇకను బాగుచేయ వీల్పడ" దని యామిత్రుఁడు జబాబు చెప్పిన నెంత బాగుగా నుండునో అంతబాగుగా నున్నదీ శ్రీశంకరాచార్యుల వారి జబాబు చెప్పుట యును బ్రాహ్మణులను పేరు విన్నంతమాత్ర మున నే వారిలో నేపాటి బ్రాహ్మణత్వమున్న దని చర్చచేయక యుక్కిరి బిక్కిరియగు వైశ్యసోదరుల సంగతియును వైశ్యులే తమ బాగునకు కారణమయ్యు వారిని లేనిపోని రీతులుగా నిందలపాలు చేయువారిని గూర్చి చర్చలిందు గలవు. నిజముగా ఈగ్రంథము కేవలము వైశ్యులకే కాక యితర వర్ణముల వారికినయితము నుపయోగపడునని దృఢ ముగా తోచుచున్నది.

---

బీహారువఱదలు

భూకంపము వలనఁ జాలవఱకును నాశన మయిన బీహారునకు వఱదలముప్పు తప్పదని అందరు ననుకొనుచునే యున్నారు. ప్రజలును ప్రభుత్వమువారును ఆ అపాయమునుండి

దేశమును రక్షింప చాలగ ప్రయత్నించి యున్నారు; తగిన కట్టుదిట్టముల నొనరించి యున్నారు. అనుకొనినంత పనియు అయినది. మానవుల యల్పప్రయత్నములు వరుణదేవుని ఎదురుకొనలేకపోయినవి. పచ్చని పైరులతో గూడిన పొలములు, పల్లెలు, పట్టణములు, చాలవఱకు జలమయము లయినవి. భూకంపముల వలన క్రుంగిపోయిన బీహారుదేశ మిపుడింకను క్రుంగిపోయినది. ప్రజారక్షణమునకయి నడుముకట్టి పనిచేసిన నాయకులు కూడ కొందరు జలప్రళయము కారణముగ ప్రాణములను కోలుపోయిరి. ప్రజలయు, పశువులయు, అకాల మరణములకు మితిలేదు. మృతశేషులగు బీహారుప్రజలు తినతిండియు, కట్ట గుడ్డయు, నిలువ నీడయు లేక పరితపించుచు సహాయాపేక్షులై నోరు తెరచుకొని చూచుచున్నారు. అట్టివారిని భారతీయులు కడకంటనయినను చూచి సాహాయ్యము చేయవలసి యున్నది.

---

కీ॥ శే॥ వెల్లాల-వేంకటసుబ్బయ్యగారు

చిరకాలము చెన్నపట్టణము పచ్చయప్ప హైస్కూలులో ప్రధానోపాధ్యాయులుగా పనిచేసి చెన్నపురమునందే కాక దేశదేశముల యందుగూడ తమ శేముషీ విశేషమునఁ జేసి కీర్తినొందిన శ్రీ. వెల్లాల - వేంకటసుబ్బయ్య బి. యె. యల్. టి. గారీలోపలనే కాలధర్మము నొందిరని తెల్పుటకుఁ జింతిలుచున్నాము. వీరు ఆంగ్లేయాంధ్రభాషలలో చక్కని యభిరుచి గలవారు. గణితశాస్త్రమునఁ బ్రసిద్ధులు. వీరిపాఠశాలయందు వీరత్యంతశ్రద్ధతో జరుపుచుండిన యాంధ్రసామాజిక కార్యక్రమములు వీరి యాంధ్రభాషాభిమానమును జాటుచున్నవి. వీరు స్వర్గస్థులగుటచేత దేశమునకు తీఱనికొఱఁత వాటిల్లినదని చెప్పనగును. వీరియాత్మకుఁ బరమేశ్వరుఁడు శాంతి నొసంగవలయునని ప్రార్థించుచున్నాము.



# స్వీకారము

## గ్రంథములు

శ్రీమత్కన్యకావిజయము:—(పద్యకావ్యము) కర్త- పేనుమర్తి కృష్ణమూర్తిగారు. క్రౌను 80 పుటలు. చక్కనిఅచ్చు, మంచికాగితము. వెల దొరకుచోటు తెలియవు.

చదువుకొను భార్య:—వాణీగ్రంథమాల ద్వితీయ ప్రచురణము. నవల. కర్త- గ్రంధి సుబ్బారావుగారు. 160 పుటలు. పీచుకాగితము, వెల రు 0 - 4 - 0 దొరకుచోటు, వాణీగ్రంథమాల, రాజమహేంద్రవరము.

తానాజీ:—వాణీ గ్రంథమాల ఐదవ పుష్పము. నవల. కర్త- కొవ్వలి-లక్ష్మీనరసింహారావుగారు. క్రౌను పుటలు 145. వెల రు. 0 - 4 - 0 ఇదియు పై వాణీ గ్రంథమాలా కార్యాలయమున నే దొరకును.

గోవు:—పద్యకావ్యము కర్త- బొడ్డు బాపిరాజు శ్రేష్ఠిగారు. క్రౌను 43 పుటలు, వెల తెలియదు. ప్రకాశకులు గోసంరక్షణ సమితివారు, ఏలూరు.

శ్రీ విద్యార్థినీసమాజవార్షికోత్సవకార్యనివేదిక:— కాకినాడ, డెమ్మీ 19 పుటలు, ప్రకాశకులు, శ్రీ విద్యార్థినీ సమాజమువారు, కాకినాడ.

కువలయానందసారము:— అలంకార శాస్త్రగ్రంథము. కర్త- బులుసు వేంకట రమణయ్యగారు, క్రౌను 160 పుటలు, వెల రు. 1-0-0. ప్రకాశకులు ఆర్ వేంకటేశ్వర్ అండ్ కో., లోన్ స్క్వేర్, మద్రాసు.

విశ్వబ్రాహ్మణ పంచాంగ లఘు విమర్శనము:— కర్త- ఎస్, నారాయణాచార్యులుగారు. డెమ్మీ 17 పుటలు. పీచుకాగితము, వలయువారు, మదరాసు బ్రాడ్వే నెం 83 మేడమీదనుండు గ్రంథకర్తగారికి రు. 0-0-6 తపాలబిళ్లలను పంపిన ఉచితముగ బడయగలరు.

శారదలేఖలు:— గ్రంథకర్త్రి- కనుపర్తి వరలక్ష్మమ్మగారు క్రౌనుసైజు 38 + 200 + 103 = 332 పుటలు. వెల తెలియదు. వలయువారు గ్రంథకర్త్రికి బాపట్లకు వ్రాయవలెను.

---

## పత్రికలు

శాంతి:—పరమార్థవిషయక మాసపత్రిక. డెమ్మీ సైజు. సంవత్సరము చందా రు 2 - 0. శాంతి ఆశ్రమము, శాంతి ఆశ్రమము పోస్టు. తోటపల్లి కొండలు పెద్దాపురం తాలూకా. తూర్పు గోదావరిజిల్లా.

వనౌషధి:—(హిందీ) వైద్యవిషయక మాసపత్రిక. డబుల్ క్రౌనుసైజు సం. చందా రూ 3 - 0 - 0. ప్రకాశకులు—చరక అను సంధాన భవనము, కాశీ.

ఆంధ్ర సారస్వత పరిషత్పత్త్రిక—ద్వైమాసపత్రిక సంపాదకుడు: కోన వెంకటరాయశర్మగారు. రాయల్, సైజు 48 పుటలు సంవత్సరపు చందా రు. 2 - 0 - 0 విడిసంచిక రు. 0 - 6 - 0. వలయువారు పరిషత్కార్యాలయమునకు "నరసరావుపేట"కు వ్రాయవలయును.

# పునర్విమర్శనము

(శ్రీమాన్. యస్. వి. రంగాచార్లగారి విమర్శనము)

1934 వ సంవత్సరము మే నెల 'చంద్రిక' యందు శ్రీమాన్ శిరోభూషణము - వేంకట రంగాచార్యులు గారు వ్రాసిన 'విద్వత్కవి సన్మాన విమర్శనమును, జదివితిని. నే నితఃపూర్వము వ్రాసిన వ్యాసమున కీ॥ శే॥ పురాణం - హయగ్రీవ శాస్త్రిలవారిని జులక నగాఁ జేసినట్లు అచార్యులుగారు తలంచుట శోచ నీయము. మన యాచార్యులుగారు అచ్చటచట 'సుఁడీ! సుడీ!' యని పాఠకలోకమునుఁ దన వైపు నకు మఱల్చికొను టెందులకో తెలియకున్నది. అచా ర్యులుగారి విమర్శనమునకు బదులువ్రాయు నుద్దేశము నాకులేదు. కాని, వారు కడంగిన విషయ మొకప్పుడు కవులచరిత్రగ్రంథమునఁ జేరఁదగిన యంశ మగుటచే నించుకంత సమాధానము చెప్పవలసిన బాధ్యత నాయం దేర్పడినది.

కీ॥ శే॥ బ్ర॥ శ్రీ॥ పురాణం, హయగ్రీవ శాస్త్రులవారు:—

శాస్త్రిలవారి వైదుష్యము మున్నగు నంశములను 'చంద్రిక' లో శ్రీ ఆచార్యులుగారివలనఁ దెలి సికొని మనము సంతసించితిమి. మన ఆచార్యులుగారు నా వ్యాసమును విమర్శించిరని నా కేమాత్రమును జింతలేదు. కాని పాఠకలోకమునకు సత్యమును జాటు టయే మా పని.

శాస్త్రిలవారు మహావిద్వాంసు లనియు, వారు రామాయణాది సద్గ్రంథములకుఁ బెక్కింటికిఁ టీకలు వ్రాసి స్వీయ ముద్రాలయమున ముద్రింపించి ప్రకటించి రనియు విద్వాంసులగు పెద్దలు చెప్పఁగా విని యున్నాను. కాని, వారు రామాయణమునకు శూద్రు లచే నచ్చుఁ గూర్పింపక కేవలము బ్రాహ్మణులగు కంపాజిటర్లచే నచ్చు గూర్పించిరను విషయము మాత్రము మన మాచార్యులు గారివలనఁ దెలిసికొంటిమి. ఇదెంతయు ముదావహమగు విషయముకదా!

శ్రీ నాగపూడి- కుప్పుస్వామయ్యగారికి 'విమర్శకా గ్రేసర, బిరుదము లభించెనని తెలియఁగానే నేను నాకుఁ దోచినముక్కలు నాలుగువ్రాసి నా సంతస మును వెలిఁబుచ్చుచుఁ 'జంద్రిక'కుఁ బంపితిని. మామిత్రు లు శ్రీమాన్- విద్వాన్, ఈ, భాష్యకాచార్లగారు, నన్ను త్వరపెట్టుటచేఁ దర్వాత మించిపోయినచో విషయము. ప్రాఁతగిల్లు నను తొందరచే 'నాంగ్ల విమర్శ నాపద్ధతులను' హయగ్రీవశాస్త్రిలవా రెఱుఁగ రని వ్రాసితిని. ఇంతమాత్రమునకే శాస్త్రిలవారి యశము నకుఁ గళంకము కలుగునా? ఇంతయేల? ఇంచుకంత నిదానించి చూచిన నిదియు సత్యము కావచ్చును. ఏల యన శాస్త్రిలవారి టీకలు, విమర్శనములును నాంగ్ల సంప్రదాయము నంతగాఁ బోలియుండక కేవలము ప్రాఁత పద్ధతి నే తెల్పుచుండును.

శ్రీ కుప్పుస్వామయ్యగారి కిపుడు డెబ్బదియొక్క టవ వత్సరము నడచుచున్నది. మన యాచార్యులు గారి యభిప్రాయముచొప్పున శాస్త్రిలవారి సుందర కాండము మూఁడవకూర్పుది యచ్చుపడి యిప్పటికి డెబ్బదివత్సరము లైనది. దీనియం దొక కిటుకు కలదు. ఏమనఁగా— శాస్త్రిలవారు సుందరకాండమును ముమ్మాఱు కూర్పించిన తర్వాత నెన్ని గ్రంథముల రచించి, యెంతకాలము జీవించి, పరమపదించిరో యా విషయమును మన యాచార్యులుగా రతిగూఢము

గనే యుంచి యున్నారు. నాకు గురుతుల్యులై యొక
ప్పుడు నాతోడఁ బనిచేయుచుండిన కీ॥ శే॥ విద్వాన్
సరస్వతి వేంకట సుబ్బరామ శాస్త్రులవా రాంగ్లవిమ
ర్శన పద్ధతుల ననుసరించి తెలుఁగు గ్రంథములకు విమ
ర్శనములను, పీఠికలను వ్రాయుటకు శ్రీ నాగపూడి-
కుప్పుస్వామయ్యగారే యగ్రగణ్యు లని నాతో నొడివి
యున్న జ్ఞాపకమును బురస్కరించికొని యట్లు వ్రాసితి.
అంతియకాని, పెద్దలును, శ్రోత్రియులును, లోకోప
కారులును, విపశ్చిద్వరేణ్యులును, నగు హయగ్రీవ
శాస్త్రులవారి యశఃకాయమును గళంకితముగఁ జేయ
దలఁచి నేను 'ఒక విద్వత్కవి సన్మాన' మను వ్యాస
మును వ్రాసినాఁడనుగాను. శ్రీ కుప్పుస్వామయ్యగారు
వ్రాసిన పీఠికల నాదర్శప్రాయముగ నుంచికొని
శాస్త్రులవారు తమ పీఠికలను వ్రాసిరని నేను వ్రాసినది
పొరఁబాటే యగుంగాక! కాని, మన యాచార్యులు
గారు నన్ను సవరింపఁబోయి పెను పొరఁబాటునఁ
బడిరి. పాపము! రాయదుర్గము- నరసయ్యశాస్త్రుల
వారిని గుఱించి వారు వ్రాసినది పరిశీలింపఁగా ఆచా
ర్యులుగారి పొరఁబాటు పాఠక లోకమునకుఁ దేటపడఁ
గలదని నా విశ్వాసము.

బ్ర. శ్రీ. రాయదుర్గము-నరసయ్య శాస్త్రులుగారు:—

శ్రీ విమర్శకాగ్రేసర, నాగపూడి- కుప్పుస్వా
మయ్యగారు (బి, ఏ) 1864 వ వత్సరము మే నెల
12 వ తేదిని జన్మించిరి. 1886 వ సం॥ పట్టభద్రు
లైరి. వారు కళాశాలలో విద్యార్థి దశయం దుండిన
కాలమున కీ॥ శే॥ రావిపాటి - గురుమూర్తి శాస్త్రుల
గారును, కీ॥ శే॥ నిశ్చింత-వేపప్పెరుమాళ్లయ్యగారును
క్రైస్తవ కళాశాల (చెన్నపురి) యం దాంధ్రపండి
తులై యుండిరి. అదియునుం గాక వీరి యనంతరము
కీ॥ శే॥ రంగయ్యశ్రేష్ఠిగారి యభ్యర్థనముపైఁ గడ
పలోఁ దాలూకాగుమాస్తాపనియం దుండిన తమ
మిత్రులగు నరసయ్యశాస్త్రులవారిని రప్పించి సిఫారసు
చేసి రంగయ్యశ్రేష్ఠిగారికి వారి నప్పగించి యుద్యోగ
మిప్పించిన వారు కుప్పుస్వామయ్యగారు. ఇది కుప్పు
స్వామయ్యగారు బి. ఏ. పరీక్షలో లబ్ధవిజయులైన
పదంపడి జరిగిన వృత్తాంతమని తెలియ వచ్చెడిని.
చూడుఁడు. శ్రీ కుప్పుస్వామయ్యగా రింత బాల్యదశ
యందే భాషాప్రపంచమునఁ బలుకుబడిని సంపా
దించి రంగయ్యశ్రేష్ఠిగా రంకటి వారిని సయితము
తమ వైదుష్యబలమున మెప్పించి శ్రీ రాయదుర్గము-
నరసయ్యశాస్త్రుల యంతటి పండితుల కుద్యోగ మిప్పిం
పఁగలిగిరి. జరిగినవిషయ మిట్లు స్పష్టముగా నుండఁగాఁ
గుప్పుస్వామయ్యగారు నరసయ్యశాస్త్రులవారికి శిష్యు
లు కావచ్చునని యాచార్యులుగారు వ్రాసిన వ్రాఁత
యవిచారమూలక మని పాఠకులకుఁ దెలిపికొను
చున్నాను. హయగ్రీవశాస్త్రులవారి కాలమునఁ గుప్పు
స్వామయ్యగారు పుట్టిరో లేదో యని మన యాచా
ర్యులుగారు నిరాధారముగ వ్రాయుటకంటెఁ గుప్పు
స్వామయ్యగారి జననకాలమును హయగ్రీవ శాస్త్రుల
వారి దివంగతకాలమును జక్కఁగ నరసి వ్రాసియుండ
రాదా?

విమర్శకాగ్రేసర బిరుదము - ఆచార్యులుగారు:—

గతవ్యాసమున నాచార్యులుగారు 'మొన్న మొన్న
గుంటూరుమండలమున విమర్శకాగ్రేసరు లను బిరు
దము వడసిన బ్ర. శ్రీ. నాగపూడి - కుప్పుస్వా
మయ్య గారిని, అని తమ పరశ్రేయస్సహనత్వ
మును గొంత వెలిఁబుచ్చిరి. ఆచార్యులుగారి యీ
వ్రాఁత యించుకంతమాత్ర ముపాలంభ సూచకముగ
నుండుటచే దాని నిటఁ గొంతచర్చింపఁ దలఁచితిని. వీరి
యభిప్రాయముచొప్పునఁ గుప్పుస్వామయ్యగారు బిరు
దముల నుద్యోగముల నితరులగు విద్వాంసులకుఁ
జిక్కకుండ కిప్పించిరే కాని, యందులకై స్వార్థపర

ఠతోఁ బరిదేవనము చేసినవారు కారు. వారి కట్టిప్ర మేయమును లేదు. యచ్ఛబ్దము చేత వారు 'ధన్యమణి హారము,నఁ 'గో స్తిథన్యో మదన్యః' అని చెప్పికొని యుండినను, మనము 'కోఽ స్తిధద్య స్తదన్యః' అని భావింపఁ దగినవారు.

ఇఁక నరసారావుపేటలోని యాంధ్రసాహిత్య(?)పరి షత్కార్యదర్శిగారగు బ్ర. శ్రీ. కోన - వేంకటరాయ శర్మగారును, దదితర సభ్యులును; విద్వత్సభను గూర్చి కుప్పుస్వామయ్యగారికిఁ దెలుపకయే బిరుద ప్రదాన మును సాదరప్రేమంబుగఁ గావించి రనియు వారి కీ విషయము శ్రీ వేంకటరాయ శర్మగారు వ్రాసెన పిద పనే తెలిసెననియు నేను వినియున్నాను. ఆంధ్ర పత్రికయు నించుమించుగా నిట్లే ప్రకటించినది. ఒక వేళ మన యాచార్యులుగారి కీ బిరుద ప్రదాన మనుచిత ముగఁ దోఁచునేని శర్మగారికి దీని నధిక్షేపించుచు వ్రాయఁగడంగుట శ్రేయముగాని, యిట్లు తిరస్కార ద్యోతకములగు వ్రాఁతలు వ్రాయుట వ్రాయసకాండ్ర పనికాదని సవినయముగ మనవి చేయుదును. వెండియు నీ కార్యములచేఁ బత్రికలపనిని బెంపుచేసి తమ యపూర్వాగుణమును బ్రకటించికొనుట యుచిత ముగ నుండదని తోఁచెడిని. అనేక వత్సరములకాల ముగఁ జెన్నపురి విశ్వవిద్యాలయమున బోర్డుఆఫ్‌స్టడీ సులో మెంబరుగానుండు బ్ర॥ శ్రీ॥ కుప్పుస్వామయ్య గారికడ కప్పుడప్పుడు స్వవిరచిత'కాలనేమి' గ్రంథ మును కళాశాలలలోఁ బాఠ్యముగ నిర్ణయించుటకుఁ దోడ్పడుఁడని కోరుచుఁ దిరుగఁగా నేనును మన యాచార్యులుగారి నెఱింగియుంటిని. ఇందు నా దోషము లెవ్వేని గలుగునెడ వానిం ద్రోసి పుచ్చ మామిత్రులగు నాచార్యులుగారిని బ్రార్థించెదను.

విద్వాన్ తూమాటి - విశ్వనాథశాస్త్రి,

——:o:——

## విమర్శనములు

**కవిపరిచయము**— శ్రీమదష్టావధాని బీరము వేంకటసుబ్బారెడ్డిగారినిగూర్చిన పరిచయమును భ్రాతృ మండలికిఁ గల్గింపనెంచి శ్రీ నీరిపి. ఆంజనేయులు గారు విజయదశమి కానుకగా 1929 వ సం॥ లో రచి యించిన చిన్నిపొత్తమిది. క్రౌను 32 పుటలు. శ్రీమద ష్టావధానిగారిని గూర్చి వ్రాయవలసిన విషయ మంతయు నీ గ్రంథకర్తగారు వచనమున వ్రాసి యట నట నవధానిగారి పద్యముల నుదాహరించినారు.

ఇందు వివరింపఁబడిన యవధానిగారినివాసము కడపజిల్లా - సిద్ధవట ప్రాంతము వేంకటసెట్టిపల్లె యని యును ఆ యవధానిరెడ్డిగారు మొదట సంపదలు గల్గియుండియును బిదపఁ బేదరయై శ్రమపడి ద్రైవాను గ్రహమునఁ గవీశ్వరుఁడై శ్రీగద్వాల ప్రభుని యాస్థా నమునఁ గొంతకాలముండి తత్ప్రభువులు దివంగతుల గుడు నందందవధానములు చేయుచు ననంతపురమునకు రాఁగాఁ దమకుఁ దత్పరిచితి లభించినట్లు శ్రీ ఆంజ నేయులుగారిచేఁ దెల్పఁబడి యున్నది. ఈ రెడ్డిగారి కైత శ్రీనాథకవి ధోరణి ననుకరించెడినని గ్రంథకర్త గారు వ్రాసిరి.

"కాలకంఠకఠోర కంఠహుంకారంబు" ననుకరిం చిన 8 వ పుటలోని "కాకఘూక కఠోరకంఠహుం

కారంబు" ఆ మాట నొప్పించునని స్థాలీపులాక న్యాయోదాహరణము.

శ్రీ రెడ్డిగారియవధానము నీ గ్రంథకర్త గారు విమ ర్శింపుచు 25వ పుటలో "అష్టావధానమున కొక్క-పూట 2 గంటలకాలము నియతము. అంతకుమించి కాల మాక్రమించుచో అది యవధాని పరిశ్రమదౌర్బల్యము" మొదలయిన సంగతులు వ్రాసియున్నారు. తద్విష యకముగా అష్టావధానమునకు 2 గంటలు పట్టుట మామూలే కాని కొన్నిసమయముల యందు ఆ సమయ మితిని దాఁటుటయు యగును. అది యవధాని పరి శ్రమ దౌర్బల్యస్ఫోరక మనుటకంటె ఆ సందర్భ మట్టిది యనఁబోలును.

26 వ పుటలో శ్రీ యవధానిగారు పద్యములను ప్రౌఢ దీర్ఘసమాసములకు దింపఁ బ్రయత్నించి యాశు కవిత్వము నాలస్యముగాఁ జెప్పిరని గ్రంథకర్తగారు వ్రాసిరి. మాకును ఆశుకవిత్వమునందు కేవలము శబ్దాడం బరము కొఱకుఁ బ్రాఁకులాడక భావసారస్యమును గమనించుట మంచిదనియే దోఁచెడిని.

28 వ పుటలోఁ దెల్పఁబడిన ఘంటికాగణ విషయ ములో "గణితములో నొకటి హెచ్చుతగ్గుగాఁ జెప్పి నను గుండుసున్నయే" నను నభిప్రాయము అష్టావ ధానవిషయమునఁ బొసఁగదని మా యభిప్రాయము. సుప్రసిద్ధావధానులుఅష్టావధానములు చేయుటలోఁగూడ గంటలలోఁ బదికొకటి యటేనియు నిటేనియు నించు మించుగా నుండవచ్చును.నను నియతిశ్రుతము. ఈ లెక్క ప్రకారముశ్రీ రెడ్డిగారు ఆ విషయమున నెగ్గిరననొప్పు.

శ్రీ రెడ్డిగారికైతలలో పానకములోని పలుకలవలె నీ వట్టి-ప్టతలు కొన్ని కనపడెడిని:—

పుట 4. ఉవ్విళ్లూరు భాగ్యము - భాగ్య (ముప్వి ళ్లూరునదా ? ఊరించునదా ?

పుట 8. పృథుయశోద్భాస !, పుట 10 ఆంగ్లే యసంత్రాత వ్రాతము, పు 13 తాండవకరణి స్త్రీలకులాస్యమే సాధారణముగా చెప్పుదురు. కరణికన్న "కరీ-కారిణీ" ప్రత్యయములు పొందు నేమో ? ఉ॥ "నిత్యానందకరీ" "హితకారిణి".

పుట 16 జ్యోతిగ్రహావితతి - (జ్యోతిర్గ్రహవితతి' నాఁదగునుఁగదా ?) ఘటనత్వము కన్న "ఘట కత్వము" బాగుగదా ?)

ఇట్లే పుట 17. సాధుసంగతము - ధర్మముగా పుట 20 - శాంతంబు ధర్మముగా - సంస్కృతీబంధ- మొదలయినవి.

దా. వేం గు.

---

## శుక్ల పక్షము

పద్యకావ్యము, కర్త. అనంతపంతుల రామలింగ స్వామిగారు. క్రౌను ౧౦౭ పుటలు. చక్కని అచ్చు, ఆకృతి. మేలురకపు కాగితము. వెల రు ౧. వలయు వారు డాక్టరు, అనంతపంతుల. సూర్య నారాయణ గారు, ఎల్, ఎమ్, ఎస్; పార్వతీపురము, విశాఖ పట్టణంజిల్లా" అను చిరునామాకు వ్రాయవలెను.

ఇది యిప్పటి భావకవిత్వము నధిక్షేపించు హాస్య విమర్శనము. గ్రంథమున హాస్యముపాలు తక్కువ గను, అధిక్షేపణముపాలు ఎక్కువగను ఉన్నవి. ఇప్పటి భావకవిత్వమున భావము లేదనియు, ఇట్టి కవిత నిష్ప్రయోజక మనియు, గ్రంథకర్తగారి యభి ప్రాయము. శైలి సరళముగ నున్నది.

---

# ఆగష్టు నెల సంచికలోని నామపదబంధము

## (ఉ త్త ర ము లు)

సెట్టు. నెం 1.

(a) నిలువుమాటలు:—కోణుఁడు - లాసకము - హారము - లుప్తము - డుక్కు. (ఈమాటల ప్రారంభాక్షరములతో శివునిపేరు:—కోలాహలుఁడు.)

(b) నిలువుమాటలు:—మాణిక్యము - మదావళము - మాతలి - మయము. (ఈ మాటల ప్రారంభాక్షరములలో విష్ణువుపేరు - మామ మామ)

(c) నిలువుమాటలు:—రాక్షస - జన్య - రాణి - జుష్టము - (ఈ మాటల ప్రారంభాక్షరములతో చంద్రునిపేరు:—రాజరాజు)

(d) నిలువుమాటలు:—దేవర - వటువు - కీర్తన - వంది - దశాస్యుఁడు - నుచ్చుమల్లి - డుబుడక్క. (నిలువుమాటల ప్రారంభాక్షరములతో శ్రీకృష్ణుని పేరు - దేవకీనందనుఁడు)

(e) నిలువుమాటలు:—భక్షణము - గడప - వల్మీకము - తిమ్మఁడు - (నిలువుమాటల ప్రారంభాక్షరములలో పార్వతిపేరు:—భగవతి.)

(f) నిలువుమాటలు:—వేఁగి - డిప్ప - వేదన - లుచ్ఛా - పుస్తె - (నిలువుమాటల ప్రారంభాక్షరములలో సూర్యునిపేరు:—వేఁడివేలుపు.)

---

ఈ నామపదబంధములో మొదటి బహుమానము చెందినవారు.

సి. హెచ్. చంద్రశేఖరశర్మగారు-

III సం॥ కోర్సు గవర్నమెంట్ స్కూల్ ఆఫ్ ఇండియన్ మెడిసిన్, - కీల్‌పాక్ - మద్రాసు.

బహుమానము:—రు 3 రూపాయలు,

* * *

రెండవబహుమానము చెందినవారు.

కే. యస్. కోదండరామయ్యగారు. టీచర్ - శాగలూరు. [సేలముజిల్లా]

బహుమానము:—రు 2 రూపాయలు,

* * *

పయి ఇరువురును తప్పులులేకుండ ప్రత్యుత్తరములు వ్రాసినారు.

కర్నూల్ జిల్లా ఆత్మకూరు-మేదూరి-వేంకటసుబ్బయ్య బి. యె. బి. యి. డి. గార్లు జవాబులకు పర్యాయశబ్దములు గూడ వ్రాసియున్నారు. ఏదో యొకటి వ్రాయవలయును. పలుమాటలు వ్రాయఁదగదు.

ఒంగోలు చిత్తరంజనదాసువీధి సి. విశ్వనాధశాస్త్రిగారును పొన్నూరు గుంటూరుజిల్లా - బోర్డు హైస్కూలు టీచరు చింతలపూడి శేషగిరిరావుగారును, ఒకతప్పులోను- తెనాలి సంస్కృత కళాశాల జంధ్యాల పాపయ్యశాస్త్రిగారును సదరు కళాశాలయందే క్రిష్టిపాటి రాఘవయ్యశర్మగారును రెండు తప్పులతోను- అనకాపల్లి తాలూకా ములగపాక వరిగొండ అప్పారావుగారు మూఁడుతప్పులతోను జవాబు పంపినారు. I II బహుమానములవారికిని మిగిలిన వారికిని ఈ సెప్టెంబరు చంద్రికా సంచిక ప్రతి ఉచితముగా పంపఁబడును.

---






| సంపుటము | చెన్నపట్టణము, డిశంబరు, ౧౯౩౪ | సంచిక |
|---|---|---|
| ౧ | భావ సంవత్సర మార్గశీర్షమాసము | ౧౦ |



# శ్రీ త్యాగరాజస్తవము

జనమంచి సీతారామస్వామిగారు.

శ్రీరామ దివ్య పాదారవిందద్వయి
        నిరతంబు మదిలోన నిలిపినావు
అనుపమ గానవిద్యాజనితానంద
        పారవశ్యంబునఁ బరఁగినావు
సంసారసాగర సంతరణోపాయ
        మెల్లవారలకు బోధించినావు
భక్తిసుధారస పానమహిమముచే
        విజితేంద్రియుండవై వెలిఁగినావు
పృథ్విపై రామనామంబు వెలయునంత
కాలమును విరాజిలు కీర్తికాయమొంది
అపరహనుమంతుఁడ వనంగఁ దనరు నిన్ను
గన్న దేశంబు పున్నెంబు నెన్నఁదరమె
**అఖలగాయకకామరభూజ ! త్యాగరాజ !**

అవనిజారమణున కాతిథ్యమొనరించు
మహితభాగ్యంబును గుహుఁడుపొందె
శ్రీరామభద్రుని శ్రీపాదుకలుగొల్చు
పరమధన్యత్వంబు భరతుఁడొందెఁ
గాకుత్థ్సతిలకుతోఁ గాంతారవాసియై
జన్మ సార్థకత లక్ష్మణుఁడు పొందె
జానకీరాముల సౌఖ్యమూలంబయి
నిరుపమయశ మాంజనేయుఁడొందె

రామభక్త్యమృతంబును భూమిమీఁదఁ
గృతులరూపంబునను బ్రవహింపఁజేసి
వారివలెఁ గృతార్థుండవై వఱలు నిన్ను
భక్తి స్మరియింపకున్నచో ముక్తి గలదె?
అఖిలగాయకకామరభూజ ! త్యాగరాజ!

నిధికంటె రామునన్నిధియే సుఖప్రదం
బంచు నీరీతి మోదించు శక్తి
ఇనకులతిలక! నీకెప్పుడు కృపగల్గు
నంచు నీరీతిఁ బ్రార్థించు శక్తి
ఒకమాట యొకబాణ మొకభార్య గల ధీరుఁ
డంచు నీరీతి వర్ణించు శక్తి
నిను వినా నామనము నిలువకున్నది
యంచు నీరీతిఁ గీర్తించు శక్తి

నరునికబ్బునే యెన్నిజన్మంబులందొ
మున్ను పున్నెంబు నార్జించుకొన్నఁగాని
పావనచరిత్ర ! విఖ్యాత భరత పుత్ర !
సూరిజనచంద్ర ! నిస్తుల సుగుణసాంద్ర !
అఖిల గాయకకామరభూజ ! త్యాగరాజ !



# మత్తవిలాసము

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.

## మహేంద్రవిక్రమవర్మ ప్రణీతమునకు తెనుఁగు.

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించును.)

సీ. ఆకార వేష భాషా కార్య గుణముల
వలన నెన్నే భేదములు ఘటిల్ల,
వానిచే వివిధ భావావేశములు గల్గ,
బహురసాస్పదముగాఁ బరగుచున్న
త్రైలోక్యవర్తనాత్మకమౌ నఖండ న
ర్తనమహోత్సవము నిరంతరాయ
మగునట్లుబోధమాహాత్మ్యభిరాముఁడై
నిర్వహించుచుఁదానె సర్వమునకుఁ
గడఁగిమరలఁ బ్రేక్షకత్వమ్మువహియించి
యోలగించు నా కపాలపాణి
భవ్య మవనిభాజనవ్యాప్తమగు యశ
మెపుడు మీ కనుగ్రహించుగాత !

ఓహో ! సవతియని నా చిన్న పెండ్లము మీఁద ద్వేషము పెట్టుకొన్న నా పెద్దపెండ్లమును సంతోష పఱుచుటకుఁ జక్కని సందర్భ మిప్పుడు నాకు సమ కూరినది. ఏమనఁగా, నిన్నాళ్లకు మమ్మ పారిషదులు నాటకప్రయోగాధికారమున నియోగించిరి. కనుక నిఁక నా పెద్ద పెండ్లమును జేరఁబోయెదను. (నేప థ్యాభిముఖముగాఁ జూచి) ఆర్యా ! ఇటురమ్మ.

నటి:—(ప్రవేశించి రోషముతో) ఏమండీ! ఓహో ! ఇదేమిటండీ ! ఇంతకాలానికి, యౌవనగుణభర మత్త విలాస ప్రహసనాన్ని చూప వచ్చారా యేమిటి ?

సూత్ర:—ఔను, నీ వన్నట్టే.

నటి:—అయితే ఆవిడతోటే ప్రదర్శించుకోండి, మీతో అచ్చట్లూ ముచ్చట్లూ ఆడవలసింది ఆకేగాదా !

సూత్ర:—నీతోఁగూడి ప్రదర్శింపవలె నని నా కోరిక.

నటి:—అయితే నాతోగూడి ప్రదర్శించడానికి ఆమే అనుజ్ఞయిచ్చిందా యేమిటి మీకు ?

సూత్ర:—ఔను నిజమే. మఱి కూడ నీ పక్క డికిఁ జేరెదవేని గొప్ప యనుగ్రహమునుం బొందఁ గలవు.

నటి:—అటువంటివి మీరేగదా పొందదగ్గవారు !

సూత్ర:—భవతీ ! నీవు మాత్ర మేల పొందఁ దగవు ? నీ ప్రయోగచాతుర్యమును జూచి పరితో షించి పారిషదులు నిన్ననుగ్రహింతురంటిని !

నటి:—(సహర్షముగా) ఆలాగా ! అయితే సరి ! ఇప్పటికి నాకు ఆర్యమిశ్రుల ప్రసాదము లభించింది.

సూత్ర:—లెస్సగా లభించినది.

నటి:—అయితే ఇక నిప్పుడు ప్రియవార్త చెప్పి నందుకు మీకు ఏమి బహుమానం ఇచ్చుకోనేది ?

సూత్ర:—ప్రియాఖ్యాన బహుమానమును గూర్చి పౌన రుక్త్యమేల ? చాలు ! చూడు !

ఉ. భామిని ! చెక్కుటద్దముల
పైఁ బులకల్ మొలకెత్తెఁ, గన్బొమల్
వామములై రహించె, జిగి
వాతెఱపై నునునవ్వు వెన్నెలల్
ప్రామికొనెన్, సుదుర్లభపు
భాగ్యము నాకిటువంటి నీదు నె
మ్మోమము లభించెఁజెందఁదగు
భోగ్యము నాకిఁక నేమికల్గెడిన్,

నటి:—అయితే తమరిప్పుడు ఆడవలసిందేమిటి ?

సూత్ర:—నీవే పేర్కొంటివిగదా ! 'మత్తవిలాస ప్రహసన' మని ;

నటి:—నిజంగా ! నా కోపానికి తమరి మీద పక్షపాతం ఉన్నదిసుమండీ ! ఏమంటే మీ అభిప్రాయానికి అనుగుణంగానే నా కోపం నన్ను మాటాడించింది. ఔనండీ ! కవీశ్వరుఁ డెవరు ఆ కృతి రచించి ప్రశస్తి కెక్కినవాడు ?

సూత్ర:—భవతి ! వినుము. పల్లవకుల ధరణి మండల కులపర్వతమును, సర్వ నయ విజితసమస్త సామంత మండలుఁడును, ఆఖండల సమపరాక్రమ సంపన్నుఁడును, సంప న్మహి మానురూప దాన వైభవ పరిభూత రాజరాజును, నగు శ్రీ సింహవిష్ణువర్మకు పుత్త్రుఁడు శత్రుషడ్వర్గ నిగ్రహపరుఁడు, పరహిత పరతంత్రతచే మహాభూత సమానధర్ముఁడు మహేంద్ర విక్రమ వర్మ యని మహారాజు కలఁడు. మఱియు

శా. కాంత్యౌదార్య వితీర్ణి సూనృత కలా
కౌశల్య దాక్షిణ్యవి
క్రాంతిక్షాంత్యనుభావముఖ్యగుణముల్
కా లిక్కలిఁ నిల్వ నే
ప్రాంతఁ గానక మొత్తమై శరణ మా
భూపాలునిం జెందెఁ గ
ల్పాంతంబం దఖిలాది నీశ్వరుని న
య్యైస్సృష్టు గన్నట్లుగాఁ.

ఇంకను,

క. ఘన సుగుణ సూక్తి మణి గణ
ఖనియయ్యునతండువిలువగన్పించుఁజుమీ
తనయొద్ద లఘుగుణము లై
నను సుజనులసూక్తులకుఘనంబగు పేర్మిఁ

నటి:—తమ రిప్పుడు జాగు చేస్తా రెందుకు ? సరిక్రొత్తది గాబట్టి యీ ప్రయోగాన్ని వెంటనే సాగించవలెను.

సూత్ర:—నేను, సుమా !

తే. సరససంగీతధనుఁడనై సాంప్రతంబు
కవినుగుణకీర్తనముచేతఁ గట్టుపడితి

(నేపథ్యమున) ప్రియా ! దేవసేనా !

సూత్ర:—చెలియతోఁ గూడ మద్యమ్ముచేత నిటక

కపాల విభవుండయిన యీ కపాలి వోరె.

నిష్క్రమించిరి.

ఇది స్థాపన.

(అంత భార్యతో కపాలి ప్రవేశించును.)

కపాలి:—(మత్తునటించి) చెలీ దేవసోమా ! సత్యమే సుమాఇది ! తపస్సుచేత కామరూపము ధరింపనగును నుట ; ఏమనఁగా నీవు యథావిధిగాఁ బరమవ్రతము ననుష్ఠానము చేసితివి. కనుకనే క్షణములో అనన్యమయిన రూపాతిశయము నందితివి ! నీకు,

సీ. చెలువా రెమోముపైఁ జెమటచిత్తడిజల్లు,
పెల్లువిలాసముల్ వెల్లివిరిసె
భ్రూలతావిభ్రమంబులు వింతలై తోఁచె
నవ్యక్తపర్ణంబు లయ్యెఁ బలుకు
లెట్టిహేతువులేని యట్టహాసము మీఱె
నక్షియుగ్మక మెఱ్ఱనై రహించె
తారకంబు లధీరతరళంబులై పొల్చె
నలసతం బొరసె నపాంగయుగము,

తే. సడలెఁ గ్రొమ్ముడి చిందఱై సాగి రెండు
మూపులంబడి వ్రేలాడె మూర్ధజములు
సరుల పువ్వులు జాఱఁగా సొరుగుదార
మూఁగుచున్నది చాఁగురే!చాఁగు! బాగు!

దేవసోమ:—స్వామీ! మత్తురాల్నిగా ఉన్మత్తురాల్నిగా నన్ను భావిస్తున్నారు మీరు!

కపాలి:—ఏమంటివి నీవు?

దేవసోమ:—నే నేమీ అనలేదే!

కపాలి:—అయితే నాకు మత్తెక్కినా యేమి?

దేవసోమ:—సామీ! గిరగిర తిరుగుతోంది, గిర గిర తిరుగుతోంది, పుడమి. ముందుకు పడుతున్నట్టున్నా! పట్టుకోండిప్పుడు నన్ను;

కపాలి:—చెలీ, అట్లేపట్టుకొనుచున్నాను. (పట్టుకొనుచున్నవాఁడై పతనము నిరూపించి.)

ప్రేయసీ! దేవసోమ! ఏమి నీకు కోపము వచ్చెనా? పట్టుకొనవచ్చుచున్న నన్నుఁ దొలఁగి చనుచుంటివి?

దేవసోమ:—అవునబ్బో! సోమదేవకు కోపమే వచ్చింది. సామి తలతో దణ్ణంపెట్టి బతిమాలుకుంటున్నా దూరంగానే ఉంటోంది.

కపాలి:—ఓమె! నీవు గాదటవే సోమదేవవు? (కనుమూసిచూచి) కాదు దేవసోమవు.

దేవసోమ:—సామీ! అంత నేస్తకత్తెగామల్ను ఆ సోమదేవ మీకు; పనికిమాలిన నా పేరితో పేరు కొంటారెందుకు? అలా పేరుకోకండి;

కపాలి:—భవతి! నామత్తు కొంచెం మాట తబ్బిబ్బు చేసినది. అది నీయెడల నిప్పు డపరాధము జరపినది.

దేవసోమ:—పోనీండి- మంచిది- అపరాధము మీది గాదు.

కపాలి—ఛీ! ఏమీ! మద్యదోషము నన్నిట్లు మార్గివైచుచున్నదా! కానీ! కానీ! ఇదిమొదలు నేను మద్యనిషేవణము మానివైచెదను.

దేవసోమ:—సామీ! వద్దు వద్దు. నామూలాన వ్రతభంగం చేసుకుని తపస్సు చెఱుచుకోవద్దు. (పాదములపైఁ బడును.)

కపాలి:—(సంతోషములో లేవనెత్తి కౌఁగిలించుకొని.) ధుర్ణ ధుర్ణ! నమశ్శివాయ, ప్రేయసీ!

మత్త.కల్లు ద్రాగవలెన్, ప్రియాస్యము
గన్గొనన్ వలె, సాజమై
చెల్లుమేల్మి వికారవేషము
చేకొనన్ వలె, నంచు ని
ట్లోల్లఁబోనక మోక్షమార్గము
నోపి కన్గొనినట్టివాఁ
డల్లవేల్పు పినాకపాణిచి
రాయువై జయమందుతన్.

దేవసోమ:—సామీ! ఇట్టా అంటారేమిటి? అర్హతులు మోక్షమార్గాన్ని వేఱుగా వర్ణిస్తారాయెను?

కపాలి:—ఔనే, వాండ్రు మిథ్యాదృష్టులుగదా! ఏమనఁగా.

తే. కారణగుణంబు నిజముగాఁ గార్యము [నకుఁ
జొప్పడుట హేతువులచేత నొప్పుకొ [నియు
గ్రుడ్డికుంకలు దనుమాట కడ్డముగనె
దుఃఖకార్యంబు సుఖమటందురు మఱి [యును;

దేవసోమ:—హరహర! శాంతం పాపమ్.

కపాలి:—శాంతం పాపమ్, ఆక్షేప ముఖమున నైనను ఆ పాపిష్ఠుల పే రెత్తరాదు. వాండ్రు బ్రహ్మచర్యము, కేశముండనము, మలధారణము, భోజనవేళా నియమము, మలినవస్త్రపరిధానము మొదలయిన పాడుపనులచే ప్రాణులను బాధించుచుందురు. కాఁబట్టి నేనిప్పుడు కుతీర్థ సంకీర్తనముచే పంకిలమైన నా జిహ్వను మద్యముచేఁ బ్రక్షాళనము చేసికొనఁ గోరుచున్నాఁడను.

దేవసోమ:—అయితే మనమిప్పుడింకో కల్లు దుకాణానికి వెడదాము.

కపాలి:—ప్రేయసీ ! అట్లే పోవుదము.

(ఇర్వురును బరిక్రమింతురు.)

కపాలి:—ఓహోహో ! ఓహోహో ! విమాన శిఖరములపై మబ్బులువిడిసి యురుముచున్నవో యన్నట్టు మృదంగములు మ్రోగుచున్నవి. వసంతసమయపుఁ బుట్టుకకుఁ దల్లిపట్లో యనునట్లు పూలయంగళ్లున్నవి. కుసుమశరవిజయ ఘోషణములో యనునట్లు వరాంగనల కాంచీరవము లున్నవి. ఏమి యీ కాంచీపురము వైభవము !

చ. అనతిశయం బనంతమును
నప్రతిబంధమునైన సౌఖ్యముల్
మునివరు లాత్మబోధపరి
పూర్ణులు ముం దెదిగాఁ దలంచిరో
వనితరొ చిత్ర మియ్యెడ న
వారిగ నయ్యది గానవచ్చెడిన్
దనరఁగ గామభోగమయ
తన్ సకలేంద్రియ చర్వణీయతన్.

దేవసోమ:—సామీ ! కల్లమ్మవారికి మల్లే యీ కాంచీపురికికూడా మాధుర్యం వెగటులేంది ;

కపాలి:—ప్రేయసీ ! చూడు, చూడు, ఈ కల్లు దుకాణము యజ్ఞశాలను బోలి యున్నది. ఇక్కడ జెండాకంబము యూపస్తంభము ; సుర సోమము ; త్రాగుఁబోతులు ఋత్విజులు ; త్రావుడుదొప్పలు చమసములు ; కలుకుట్లు మొదలయిన నంజుళ్లు హవిర్విశేషములు ; కైపుకూఁతలు యజుస్సులు ; తందాన పదములు సామగానములు ; ఉదంకములు స్రువములు, దాహము అగ్ని ; అంగడివాఁడు యజమానుఁడు.

దేవసోమ:—మనకుకూడా ఇక్కడ భిక్షం రుద్రభాగం అవుతుంది.

కపాలి:—ఓహో దర్శనీయములుగదా ఈ మత్తవిలాస నృత్యములు ; వీరుగో నర్తకులు మద్దెళ్ల దరువులకు ఒద్దికగా అనేకవిధములయిన యంగవిక్షేపములు, బొబ్బలార్పులు, బొమ్మమార్పులు సెలుపుచున్నారు. ఒంటిచేతులతో నుత్తరీయములను బైకెత్తి పట్టియార్చుచున్నారు. కంఠగుణములు కంగారుకాఁగా కట్టుబట్టలు పట్టువీడఁగా సరిపలుచుకొను సందర్భములందు లయలఁ దప్పుచున్నారు.

దేవసోమ:—బలేరసికుడు సుమా ఆచార్లు.

కపాలి:—ఇదిగో భగవతి మదిర ! దొప్పలలో దైవాలుచున్నది. అందచందములకు నలంకారములకు నిది ప్రత్యాదేశము. పాలయలుకలుగొన్న పొత్తులకిది యనునయము. పదుచుఁదనమున కిది పరాక్రమము. పరవసముల కిది ప్రాణము వేయేల ?

చ. మదనునిమూర్తి, ముక్త్రిపుర
మర్దను చిచ్చుఱకంటి మంటచేఁ
బదడయి పాడువాటె నని
పల్కెదురయ్యెడి తప్పఁబల్కు ; నాఁ
డది ద్రవియించె స్నేహమయ
మాటను దన్నయనాగ్నిసోకఁ గా
నుదిర యదేసుమా సుదతి !
మత్తిలఁజేయు నో కెత్తచిత్తముల్

దేవసోమ:—స్వామీ ! బాగాఁచెప్పితిరి ! లోకోపకారనిరతుడయిన లోకనాథుడు లోకాన్ని నాశపలుస్తాడామత్తి ?

(ఇద్దఱును జెక్కిళ్ల తప్పెటలు వాయింతురు.)

కపాలి:—భవతి ! భిక్షాం దేహి !

(నేపథ్యమున.)

సామి.—ఇదుగో బిచ్చం! పుచ్చుకోండి సాములు!

కపాలి:—ఇదిగో ప్రతిగ్రహించుచున్నాను ప్రేయసీ ! ఎక్కడ నా కపాలము ?

దేవసోమ:—నాకూ కనపడలేదు.

కపాలి:—(కనుమూసి యోచించి) ఆఁ! ఆ కల్లు దుకాణముకడనే విడిచి మఱచిపోయితి ననుకొందును. కానీ తిరిగివెళ్లి వెదకుదము.

దేవసోమ:—సామీ! అధర్మం గాదా యిది? ఆదరంతో పెట్టవచ్చిన బిచ్చం అందుకోక పోవడం? ఇప్పు డేమిటి చెయ్యడం?

కపాలి:—ఆపద్ధర్మమును ప్రమాణీకరించి గోవు కొమ్ముతో ప్రతిగ్రహింపఁ దగును.

దేవసోమ:—సామీ ఆలాగే. ప్రతిగ్రహించును. (ఇద్దఱు పరిక్రమించి చూతురు.)

కపాలి:—ఇక్కడఁ గూడఁ గానరాకున్నదే! (విషాదము రూపించి) ఓహో! మాహేశ్వరులారా! మాహేశ్వరులారా! మాభిక్షాభాజనము నిక్కడ మీరు చూచితిరా? ఏమంటిరీ మీరు? మేము చూడలే దంటిరా? అయ్యో చెడితిని. నాతపస్సు చెడినది. ఇప్పు డెట్లు నే నెట్లు కపాలిని కాఁగల్గుదును. అయ్యో దురవస్థ.

ఉ. పానమువేళ దొప్పయయి,
భాజనమై భుజియించువేళ, ని
ద్రానుభవంబువేళ నుపధానమునై,
యిటులింతదాఁక నెం
తేనుపకారముం జలిపెనిట్టి
కపాలముపోక నాకయో
ప్రాణసమానమిత్రు నెడఁబాటు
తెఱంగున వంతగూర్చెడిన్.

(క్రిందబడి తల మోదికొనుట రూపించి) కలదు లక్షణమాత్రము! కపాలిసంజ్ఞ నాకుఁ బోలేదు. (లేచును.)

దేవసోమ:—స్వామీ! ఎవరూ మీకపాలాన్నెత్తుకుపోయింది?

కపాలి:—కలుకుట్లు దానిలో నుండుటచే కుక్కగాని, శాక్యభిక్షువుగాని యెత్తుకొనిపోయి యుండ వచ్చు ననుకొందును.

దేవసోమ:—అయితే దాన్ని పట్టుకోవడానికి కాంచీపురమంతా తిరుగుదాము.

కపాలి:—ప్రేయసీ! సరే.

(ఇర్వురుఁ బరిక్రమింతురు.)(అంతఁ బాత్రహస్తుఁడై శాక్యభిక్షువు ప్రవేశించును.)

శాక్యభిక్షువు:—అహో! ఉపాసకుడయిన ధనదాస సెట్టిగారి సర్వావాస మహాదానమహిమ! ఆ మహాదాన మహిమచేత నాకు ఇష్టమైన రంగులతో ఇష్టమైన సువాసనలతో ఇష్టమైన రుచులతో నానా రకాలయిన మత్స్యమాంసాదుల వంటకాలు సాపడ గురిరింది. ఇదుగో ఇప్పుడు రాజవిహారానికే పోతాను ఆహా! పరమ కారుణికుడైన భగవంతుడు తథాగతుడు ప్రాసాదాలలో వాసము, చక్కగా పఱుపులు పఱిచిన పట్టెమంచాలమీద పడక, జాము ప్రొద్దెక్కేటప్పటికే సాపాటు, మూడుజాములకు సురసాలయిన పానకాలు, జాజికాయ జాపత్రి యేలకులు లవంగాలు పచ్చకర్పూరము అని పంచసుగంధాలు గల తాంబూలము, సన్న పట్టుసెల్లా వల్లెవాటూ, ఉండవలె నని ఉపదేశంచేత భిక్షుసంఘానికి మహోపకారం చేసికూడా ఇదేమిచెపుమా స్త్రీ పరిగ్రహము సురాపానము ఉండవలె నని గుర్తించలేక పోయినాడు. కాక! ఆ సర్వజ్ఞుడు దీన్ని గుర్తించ లేక పోవడమేమిటి? నిశ్చయంగా చెడ్డముండ కొడుకులీ ముది వయసు బుద్ధాచార్యులు మావంటి పడుచు వాళ్లమీద మాత్సర్యంచేత పిటక పుస్తకాలలో స్త్రీ సురాపాన విధానాలు తీసి పారవేసి ఉంటారనుకొంటాను. ఎక్కడ దొరకుతవి చెపుమా ఆ పిటకపుస్తకాలు సరియైన మూలపాఠాలతో; వాటిని గనక సంపాదిస్తినా సంపూర్ణమైన బుద్ధవచనాన్ని లోకంలో

వెల్లడించి సంఘోపకారం జరిపినవాణ్ణౌతాను. (పరిక్రమించును.)

దేవసోమ:—స్వామీ! చూడు చూడు! అడుగో కాషాయ ధరుడు జనవత్తిడి కలిగిఉన్న రాచబాటలో ఒళ్లంతా కుంచించుకుని ఈపక్కా ఆపక్కా చూసుకుంటూ అడుగడుక్కూ అనుమానిస్తూ తొందరతొందరగా వెళ్లుతున్నాడు.

కపాలి:—ప్రేయసీ! ఔనుసుమా! మఱియు వాని చేత ఏమిటో ఉన్నట్టుకూడ నున్నది. కాషాయమును పైఁ గప్పిపెట్టినాఁడు.

దేవసోమ:—సామి! అయితే అడ్డం పోయి పట్టుకు పరిశీలింతాము.

కపాలి:—భవతి! అట్లేచేయుదము (చేరఁబోయి) ఓయి భిక్షూ! నిలు!

శాక్యభిక్షువు:—ఎవడు చెపుమా వీడు! నన్నిట్లా అంటాడు! (తిరిగిచూచి) వీడు ఏకామ్రవాసి దుష్ట కాపాలికుడా! కానీ; వీడి త్రాగుడుతబ్బిబ్బులలో తగులుకోకుండా తప్పించుకొంటాను. (వడిగా కడచి వెళ్లును.)

కపాలి:—ప్రేయసీ! అబ్బ క్య, దొరకినది కపాలము! వీఁడు నన్నుఁ జూడఁగానే భయమెత్తి పర్వెత్తుచున్నాఁడు. ఆపరుగే సాక్షిసుమా వీఁడు అపహరించినాఁడనుటకు; (వడిగాఁ జేరఁబోయి ఎదురొత్తి అడ్డగించును.) ఓః! పొగరుఁబోతా! ఇంకెక్కడికోయి పర్వెత్తఁగలవు?

శాక్యభి:—కాపాలికోపాసక! తప్పుకో, తప్పుకో, ఏమిటిది? (ఆత్మగతము) బళే! అంగగత్తెసుమా ఉపాసిక!

కపాలి:—ఓయిభిక్షూ! చూపవోయి! అదిగో నీ చేతిలో ఏమిటో కాషాయము చాటున కప్పబడి ఉన్నదీ, నేను చూడవలెను.

శాక్యభిక్షువు:—ఏమున్న దిక్కడ చూడడానికి? భిక్షాపాత్రగదాయిది!

కపాలి:—కనుకనే చూడవలసియున్నది.

శాక్యభిక్షువు:—ఆఁ! ఉపాసక! కూడదు కూడదు; దీన్ని చాటుపరుచుకొనే ఉంచుకోవలె మేము.

కపాలి:—అవును. ఇటువంటివాటిని చాటుపఱుచుకొనుటకే బుద్ధుఁడు మీకు బహు చీవర ధారణము నుపదేశించెను.

శాక్యభిక్షువు:—నిజమది;

కపాలి:—సరి! ఇదేమో సంవృతసత్యము. పరమార్థ సత్యమేదో పలుకుము.

శాక్య:—చాలు ఇంతటితో గేలి. అతిక్రమిస్తున్నది భిక్షావేళ; వెళ్లివస్తాను. (బయల్దేరును)

కపాలి:—ఆః! పొగరుఁబోత! ఎక్కడికేఁగెదవు? నా కపాలము నాకిమ్ము. (చీవరపుఁజెంగు పట్టుకొనును.)

శాక్య:—నమో బుద్ధాయ.

కపాలి:—'నమఃఖరపటాయ' అనవోయి! ఆయన గదా చౌరశాస్త్రికారుఁడు! కాకఆ ఖరపటునికంటె ఈ యధికారమున బుద్ధుఁడే అధికుఁడు. ఏలనఁగా.

ఆ. ఉపనిషచ్చయమున నుండి, మహాభార
తమున నుండి, యర్థతతి హరించి
విప్రు లరయుచుండ నే ప్రతారణమునఁ
గోశసంచయమును గూర్చె నతఁడు.

శాక్యభిక్షువు:—శాంతం పాపం. శాంతం పాపం.

కపాలి:—ఈ విధముగా సద్వర్తనముగల తపస్వికి పాపము శాంతింప కేమాను?

దేవసోమ:—సామీ! బడలినట్లున్నారు మీరు! ఈ కపాలం సులువుగా మనకు ఓపట్టాన వచ్చేటట్టు లేదు. కనుక ఈ గోవుకొమ్ముతో కల్లుతాగి బలం తెచ్చుకొని తర్వాత వీడితో తగవులాడుదురు గాని.

కపాలి:—అట్లే కానీ.

(దేవసోమ కపాలికి కల్లు త్రాగనిచ్చును.)

కపాలి:—(త్రాగి) ప్రేయసీ! నీవుకూడ శ్రమాపనోదనము చేసికొమ్ము.

దేవసోమ:— సామీ! అట్లాగే. త్రాగును.

కపాలి:—ఈతఁడు మన కుపకారి; అయినను, మనసిద్ధాంతమున సంవిభాగ ప్రదానము ముఖ్యమయినది. కనుక శేష మీ యాచార్యున కొసఁగుము.

దేవసోమ:—సామి సెలవుప్రకారము; (భిక్షువునుజూచి) సామీ గ్రహించండి!

శాక్యభిక్షువు:—(ఆత్మగతము) బలే! అభ్యుదయము సులువుగా అబ్బింది. పదిమందీ చూస్తార నేది వొక్కటే చిక్కు. (ప్రకాశము) అమ్మ! ఆఁ! ఆఁ! అట్లా అనవద్దు. మా కిది తగదు. (సెలవులు నాకును)

దేవసోమ:—ఛీ, పో, దౌర్భాగ్యుఁడా! చావు, ఇలాగంటి భాగ్యం నీ కెట్లా లభిస్తుంది.

కపాలి:—ప్రేయసీ! వీనిమాటతీరు లోనికోరికతో విరోధించుచున్నది సుమా! సెలవులు తడియుచున్నవి చూచితివి గదా!

శాక్యభిక్షువు:—ఇప్పుడు కూడ నీకుఁ గరుణలేదు.

కపాలి:—కరుణయే యుండెనేని వీతరాగుఁడ నెట్లగుదును?

శాక్య:—అవును వీతరాగుడవూ కావలెను వీతరోషుడవూ కావలెను.

కపాలి:—వీతరోషుఁడ నగుదును. నా సొమ్ము నా కిచ్చివేసెదవేని.

శాక్య:— నీ సొమ్మేమిటి?

కపాలి:—కపాలము.

శాక్య:—కపాల మేమిటి?

కపాలి:—'కపాల మేమిటి' అనెదవా? అవును, అనకేమి?

ఉ. అప్పటి ధారుణీధర ధ
రాద్యములైన మహాపదార్థముల్
గొప్పగ నెప్పుడుం గనుల
కుం గనవచ్చుచు నుండఁగానెతాఁ
దప్పు తలంపునంబడిత
థాగతుఁ డెల్ల నపహ్నవించెనా
యప్పకుఁ బిడ్డ నెట్లికుఁగ
వల్ప కపాల మపహ్నవింపఁగాఁ.

(సశేషము)



# ఆధునిక కవితావతరణం

తాతా శ్రీరామమూర్తిగారు

మొదట్నుంచీ మల్లెపూలతోనూ, మాల తీలతలతోనూ నాటకమాడించి తమ హృద్భావాలు వెలువరించుకోడం మానంశంలో కవులకందటికీ అలవాటే. లోకం అంతా దారితప్పి అంధకారంచే ఆవరింపబడ్డప్పుడు కవులపేర ఓజ్యోతి అవతరించి మానవ లోకాని కంతటికీ మార్గం చూపిస్తుంది. ఆ జ్యోతే వివిధదేశాల్లో వివిధరూపాలతో ప్రజ్వరిల్లుతుంది. దేశం పరాధీనమై దీనస్థితి నున్నప్పుడు తనగీతాలు పాడి దాస్యవిముక్తికి దారిచూపిస్తాడు కవి. తనప్రజలు యుద్ధానికి సన్నద్ధులై ఉంటే తాను ముందుగా రణభేరీ వేస్తాడు. రాష్ట్రం అరాజకమై అల్లకల్లోలంగా ఉంటే తన శాంతిగీతాలు పాడి చక్కదిద్దుతాడు. అజ్ఞానాంధకారంలో అల మటిస్తూన్న లోకానికి జ్ఞానోపదేశం జేస్తాడు మనకవి. ప్రేమతత్త్వం ప్రభోధిస్తాడు. మానవజీవితమను మహాసముద్రం త్రచ్చి ప్రభవించిన ప్రేమామృతం ప్రతిజీవికీ పంచిపెడతాడు. ఇలాగ తన ఆశయాలు వెలువరించుకోవడములో జనుల అభిరుచుల కనుగుణమైన మార్గ మవలంబిస్తాడు. నాటకమైతే నాటకం, ప్రబంధమైతే ప్రబంధం వ్రాసి అందులో తన ఆశయాలు స్ఫురింపజేస్తాడు.

ఆంధ్రలోకం అంతా అనామకం అయిపోయింది. అంతా అనువాదాలే చేస్తూ వచ్చారు. అంతకు ఐదాఱువందల యేండ్లక్రిందటే ఆంధ్రకవిత్వం అవతరించినా ఆటచూడలేదు, పాటచూడలేదు. ఏదో సంస్కృతకవిత్వం సాకుతోంది కదా అనుకొన్నారు. కాని ఆసాకడం కాకి కోకిల్ని సాకడంలాంటిదనుకొన్నారు కారు. అబ్బలేని బిడ్డై పోయింది ఆంధ్రకవిత్వం. "కాటుకకంటినీరు చనుకట్టుపయిం బడ నేల యేడ్చె" దని పోతన బోటి పూతాత్ములెవరో అప్పుడప్పుడడిగేరు. కాని "ఇల్లాంటివి నీచేతకావు, నీచితారు, చిరతలు పుచ్చుకొని నీభజన నీవు చూచుకో"మన్నాది ఆంధ్రకవితాలతాంగి "ఈ ఆంధ్రులు నన్నింత కిన్నడ చేసేరే! నేనింక ఎవరితో చెప్పుకోడం. ఏంచేయగలను అబలని. ఇలాంటి సమయంలో నన్ను చేరదీసే వాడొకడు కావాలి. నా దీనతః దీర్పడాని కో ధీరుడు కావాలి. నాకొఱకు పోరాడ్డాని కో నిజమైన ఆంధ్రుఁడు కావాలి. ఈ పరమఛాందసులికి భావోదయంచేసే భావమూర్తి కావాలి. నారసికత్వ. నాలాలిత్యం సార్థకంచేసే సరసుఁడు కావాలి. నన్ను తెలిసికోగల వాడు కావాలి" అంటూ దురపిల్లుతూంది.

ఆమెకోర్కెలు ఫలించేయి ఆమె కోరిన పురుషుఁడు, ఆరసికుఁడు, ఆవీరుఁడు అవతరించేడు. ఆధునిక కవితాపితామహు డవతరిం

చేడు. కళ్లారా చూసేడు. కవిలోకంలో కవితావనిత పడే కడగండ్లు. మఱిచూడలేక కాబోలు కళ్లు మూసేశాడు. అంతా ప్రశాంతం. దూరంనుంచి యేదో రోధనధ్వని వినబడుతూఉంది. "ఆంధ్రవీరుడు కావాలి" అంటూ ఎవరో అబల ఆరుస్తున్నట్టుంది. ఒక్క నిట్టూర్పు పుచ్చి లేచాడు పితామహుడు. తాను కన్నదీ, విన్నదీ ఓసారి జ్ఞాపకానికి తెచ్చుకున్నాడు తా నీలోకంలోకి రావడం లోకం మరమ్మత్తు చెయ్యడానికి కదా అనుకున్నాడు. తనకార్యం నిర్వహించడానికి ఆరోజునే దీక్షాకంకణం కట్టేడు. తన జీవితం అంతా అందుకు ధారపోశాడు. తుదకు తలచుకొన్నకార్యం నెఱవేర్చేడు. తనపనికి అడ్డు తగిలిన అయ్యలకందఱికీ అలాగలాగ బుద్ధిచెప్పేడు. భావి కవిలోకానికి మార్గదర్శకంగా ఓజ్యోతి ప్రసాదించేడు. ఆధునిక కవితాలతకొక జీవగఱ్ఱ నాటేడు. మనుచరిత్రచూసి అదేదో అడవిమృగం మధ్యకొచ్చినట్టు హడావుడిపడే వాళ్లు కొందఱు, పెద్దనవైపు కోఱచూపులు పఱపేవారు కొందఱు, మూలమూలల్ని మూతలు కోఱుక్కునేవాళ్లు కొందఱు—వీళ్లందఱ్నీ కనిపెట్టేడు పితామహుడు. ఓసారి వీళ్లందరినీ పిలిచి "వెఱ్ఱిమొగాల్లారా! నేను తొక్కింది మీ కొత్తపంథా కా" వన్నాడు. "ఒక సంస్కృతకావ్యం తీసుకొని సమంగా దానికి ప్రతి తీయలేదుగాని తక్కిన వన్నీ మీ కావ్యాల్లో ఉన్నట్టే ఉన్నా"యన్నాడు. "మీ పురాణాల్లో ఉన్నఅచ్చక్కి బుచ్చక్కి వర్ణనలు నేనూ వర్ణించేను చూడ" మన్నాడు. అసలు గ్రంథనామం నిగూఢంగా ఉంచక 'మనుచరిత్ర' అనేశా నన్నాడు. అయ్యో! తాతా! యెన్నికష్టాలకోర్చావు! మాకోసం ఇన్ని కష్టాలకోర్చిన నిన్ను ఆధునిక కవితా పితామహుడని పిలువకపోతే మానాలికలు చీల్చివేయవద్దా! ఆంధ్రకవితాపితా మహు డట—ఐదువందల యేళ్లక్రిందట పుట్టిన ఆంధ్రకవిత్వానికి పెద్దనగారికి పితామహపట్టం గట్టేరు. ఇలాగే ఉంటుంది మనవాళ్ల వివేకం. ముందు ఎబ్బెబ్బె అనడం. వాళ్లేతఱువాత నేనూ మీవాణ్ణే అన్నంతమాత్రాన "ఔనౌను! నీవు మాకవిత్వానికి తాతవని నెత్తిమీదపెట్టు కోవడం వాళ్లే...

అది హిమవన్నగం. ఆకొండ శిఖరాల మీదినుంచి పడుతూన్న జలపాతాలు మృదంగనిస్వనాలు చేస్తున్నాయి. ప్రవరుడాకొండ మీది కొచ్చిపడ్డాడు—తన విద్యాప్రభావం వల్ల కాదు. ఏవరో సిద్ధుడొకడు కాస్త పాదలేపం పూస్తేను—భగీరథుఁడు తపస్సు చేసిన చోటు, మిన్నేరు జగతికి దిగినచోటు, మొదలుగాగల వింతలన్నీ చూస్తూ ఉండే సరికి మధ్యాహ్నమైంది. ఏదో వాళ్లపురాణాల్లో విన్నచోట్లుగదా అని ఓమాఱు చూసేడు. ఇప్పటి కింటికివెళ్లి కావలిస్తే రేపొద్దామను కొన్నాడు, పాపం ఆ మందు

కరగిపోయింది. ఇంకెలాగ. తోవ తెలియదు. అలాగే తిరుగుతున్నాడు. ఇలా తిరుగుతూంటే ఒక్క గాలి తెవ్వున వీచింది. ఆ పరిమళాలను బట్టి అదేదో జననివాసమే కదా. దగ్గరైనకొద్దీ అవేవో వింత పూలవాసనలు గుబాళిస్తున్నాయి. పంచమస్థాయీ నెవరో వీణ ఆలాపిస్తూన్నధ్వని వినవచ్చింది.

ఆకాంచనసౌధంలో సోఫాలో కూర్చుందో ఆమె. ఆమె పాడేవీణ పాటకు మిన్నేటి యీలపాటలు శ్రుతి కలుపు గుంమన్నాయి. గూళ్లలో నున్న కీరశారికలు కేరుతున్నాయి కోయిలలు గురుభావంతో ఆమెపాట ననుకరిస్తున్నాయి. వాయుప్రచాలనచే అలకలామెగీతాని కనుగుణంగా నృత్యం సలుపుతున్నాయి. కరపంకరుహాలయందలి రత్నకంకణధ్వని తాళమానములు గొలుపుతున్నాది. మనప్రవరు డామెను చేరబోయేడు. ఒక్కమాఱుగా కళవళ పడ్డాడు. ఆమె నరాంగనా, సురాంగనా, కిన్నరాంగనా అని తలుచుగా అందఱికి కలిగే సందేహమే కలిగిం దతనికి. పాపం అనుకోటమే గాని యెప్పుడు చూసేడు కిన్నరుల్ని. అదేదో పిసాచమన్నట్టు భయపడ్డాడు. వెంటనే ఒక్క పులక ప్రసరించిం దతని దేహంలో. వరూథిని కూడా ఒక్క క్రీఁగంటిచూపు చూచింది. స్ఫుర ద్రూపి, యువకుడు, విజనప్రదేశంలో, తనవంటి విలాసవతుల యింటిముంగిట మైమఱచి నించున్నాడు తరువాయి కథ యెలా నడుస్తుందో అని చూచీ చూడనట్టు ఊరుకుంది. విలాసినుల విభ్రమాలు తెలిసికోడానికి వివేకమేదీ మన వైదికుడికి. తిన్నగా ఆస్త్రీ మూర్తిదగ్గఱికి వెళ్లిపోయేడు. జంకుతూ కొంకుతూ "యెవ్వ తెవీవు భీతహరిణేక్షణ యొంటిఁ జరించెదోట లేకిన్వనభూమి" నని కుశలప్రశ్నచేసి నేనొక భూసురుణ్ణి. తోవతప్పి యింటికి పోలేకుండా ఉన్నాను. నాకు దారిచెప్ప పుణ్యం గట్టుకొమ్మన్నాడు. లోకమో పాడో అనుకుంది వరూథిని పాపం. అందఱూ వాళ్ల గంధర్వుల్లాంటి వాళ్లే అనుకుంది కాని యిలాంటి ద్రాపి మొగాలుంటా యనుకోలేదు. అంచేత ఓ చిన్న పరిహాసచక మాడింది. "మాలాంటి ఒంటరిగానున్న అబలాజనందగ్గిఱికి రావడం భావ్యమా? అంత పెద్దకన్నులున్నాయి కదా! నీ వొచ్చినదారి నీకు తెలియద టయ్యా." అంది. పిడుగుపడ్డ ట్టయింది ప్రవరుడికి. నేరక వొచ్చాన్రా అనుకున్నాడు. ముఖంవివర్ణత పొందింది. వొళ్లు చెమటలు పోసేస్తున్నాది. చేతులు నులుపుకొంటూ వెనక్కడుగుబెయ్యబోయేడు. మఱిల్లాగ లాభం లేదనుకొని వరూథిని తన వృత్తాంతముచెప్పడం ప్రారంభించింది. ప్రవరుడిచెవిన్ని ఓనూసైనా పట్టలేదు. ఇందంతా చూసిందామె. అతని మూర్ఖ్యంచూసి ఓమాఱు విచారించింది. ఇంకో యెత్తువేసి చూతామని "మాయింటి కతిథివొచ్చావు. నేను చేసే సత్కారాలు

సంపుటము ౧ సంచిక ౧౦

# చిత్రిక

సచిత్ర మాసపత్రిక

భావ సం॥ మార్గశీర్షమాసము

డిశంబరు 1934.

ఆనంద ముద్రణాలయము,

మద్రాసు.

౧౯౩౪




పుట.

# చిత్రములు

(1) తులసిపూజ—"దుర్గా"—(2) 23 వ శతాబ్దములో "దుర్గా"

—: o :—

గై కొమ్మన్నాది. ఇంకేంగావాలి. పెన్నిధి దొరికింది పేదబాపడికి. సిరివచ్చి కాళ్లను చుట్టు కుంది. సిరిశా మోకాలొడ్డేవా రుంటారా అంటే, ఉంటారు మన ప్రవరు డిలాంటివారు. స్వర్గసుఖం సశరీరంగా ప్రాప్తించినా నిరాకరించేడుకాదూ ఇలాంటి మిసిమి యావనంలోనున్న పురుషు డింతబేలమై పోయేడే అనుకొని "నేను నిన్ను వలచేను" అని చెప్పేసింది. ఊఁహు. ప్రవరు డంతెకంటె మొండిపట్టు పట్టేడు. వరూధిని చెప్పిచెప్పి విసిగి వై బడ్డాది. మనప్రవరుఁడు మన ఛాందస ప్రవరుడు, మందబుద్ధియై ఆ నవకుసుమ గాత్రిని బుజాలుపట్టి తోసేశాడు. ఎక్కడైనా ఆ జవ్వాదివాసన అంటుగుంటుం దేమో అని గంగాజలంలో కాళ్లు, చేతులు పామి పాము కడిగేసుకున్నాడు.

ఓ గంధర్వకుమారుఁడు ఈ ప్రేమమూర్తినే అన్వేషిస్తూ ఆ ప్రాంతాల నలా తిరుగుతున్నాఁడు. ప్రవరుడు రావడం పోవడం యీ నాటకం అంతా చూసేడు. ఒక్కచిఱునవ్వు నవ్వేడు. తనమనసున నాటుకున్న ప్రేమమూర్తి యిదేకదా అనున్నాడు. ఆమె మనస్సు ప్రవరుడిమీద లగ్నమై ఉందికదా అని తానూ ఆ వేషమే ధరించేడు.

ప్రవరుడు విరులు చిదుముతున్నాడు. వరూధిని తోడి చెవులతో విరహోపశాంతి కోసం విహారాని కొచ్చింది. నాయికానాయకు లొకరినొకరు చూచారు. అనురాగదృక్కులొండొరుల హృదయాలవైపు పరుగులెత్తేయి. చెయ్యిచెయ్యి కలిసింది. సమాన వియ్యం సమానపెయ్యం అన్నారు. ఇద్దఱూ ప్రౌఢులే. ఇద్దరూ రసికులే. ఇద్దరూ ఒక్కచోటనే పుట్టేరు. ఇంకేంతరవాయి. వీ రిద్దఱికీ సంధానం కాకపోతే ప్రవరుడి వైదికానికీ, వరూధినివైదగ్ధ్యానికీ యెలా పొసగుతుంది. అల్లాంటి రసికదంపతులకు కలిగిన అపత్యంకూడా వారినే పోలియుంటుంది. చిలుక కడుపున కాకి పుడుతుందా?

ఇది మనుచరిత్రలో కథ ఎంత కొంపెత్తేశాడు ముసలాడు! "గ్రంథనామం నిగూఢంగా ఉంచక మనుచరిత్ర అనేశాడట! మనం వినేది మనుచరిత్ర, మనుసంభవం కాదు- మొదటి నాలుగాశ్వాసాలే అని తెలుసు. ఎవరికికావాలి. స్వరోచికి మనువు డితే మనకెందుకు, పుట్టకపోతే మనకెందుకు. కాని ఆపేరు పెట్టకపోతే ఆపుస్తకం అప్పటి వాళ్లెవరూ చదవరు తమపురాణాల్లాగ లేదని. పేరేదయితేనేం మనకార్యం కావాలన్నాడు. వరూధి న్నంకించుకుంటె చాలని గంధర్వకుమారుడు ఛాందస బ్రాహ్మణవేషానికొప్పు కున్నట్టు.

మనలోమాట ప్రవరుడి పరమఛాందసాని కసహ్యించుకొని వాళ్లూను, గంధర్వకుమారుడి కళాభిమానానికి మెచ్చుకొని వాళ్లూ ఉంటారా? కవిత్వతత్వం కళ్లారా కనుగొన్నా ఛందస్సు మొదలైన కట్టు

బాట్లు లేవని కంగారుపడ్డాడు కవి. ఆ కవిత్వంలో ఉద్బోధకమాతూన్న ప్రేమతత్త్వం వినటంచేత మఱీ కంగారుపడ్డాడు. ఆ తత్త్వం తెలుసుకోడానికి ప్రయత్నమే చెయ్యలేదు. ఆ తారాపథాల్లోకి దనశక్తినల్ల తాను వెళ్ల లేకపోయాడు. దైవికంగా అక్కడ ఉట్టిపడ్డాడు. కల్పలత కాళ్లను చుట్టుకుంది. దాన్ని విదుల్చుకు పాఱిపోయాడు. ఆతని వెంటనే ఓవ్యక్తి వచ్చాడు. కల్పలత కనుపించింది. తానువలచిన తీగ కాల్దగిలింది కదా అని సంతసించేడు. కవిత్వతత్త్వం తెలుసుకోగలిగేడు. ఆ కవిత్వాన్ని ఉపాసించేడు. ఈ ఛాందసులతో మాకేమీ పనిలేదన్నాడు ఆప్రశాంతవనాల్లో ఆపూర్వ వ్లోకాల్లో వారల్లా విహరిస్తున్నారు. ఆసంతతివార మంద అమూ అలాగే యీ లోకంతో సంబంధం లేకుండా ఆ ప్రేమమూర్తి ఒళ్లో అలా నిదురిస్తాం. ఆ దివ్యమూర్తి తీయని గీతాలకు వినోదిస్తాం. మాజీవితం అంతా ఆ ప్రణయ మూర్తికే ధారవోస్తాం. అలాంటి కవే కావాలని వాపోయింది కవితాలతాంగి. అలాటి కవికుమారుణ్ణే గంధర్వకుమారుడి రూపంలో చిత్రించేడు కవితాపితామహుడు. ఇది చూశారు పురాణకవులు మీరు కొత్తపద్ధతులు తొక్కుతున్నారు. అన్ని ఆధునికంగా ఉన్నాయిగా మీచేష్టలు. మీరు మాతో కలియరన్నారు. మేము అందుకేచూస్తున్నాం. పెద్దన్ననిమాత్రం యేమీ అనలేక పోయేరు. ఏమంటారు అన్ని పురాణలక్షణాలు కనబడుతున్నాయి. పైగా వాళ్లందఱూ ఆనాడు వాళ్లకవిత్వానికి తాత అని అంగీకరించే రతన్ని. అంచేత అతన్ని ఆంధ్ర కవితాపితామహుడని వారూ, అధునిక కవితాపితామహుడని మేమూ అంటాము. అలా అవతరించింది మాకవిత్వం ఆనాడు కలిగింది మనలో యీ భేదం.



# ఏసుక్రీస్తువు

శ్రీనివాస కవీశ్వరులు

శా. ఏసుక్రీస్తువు కృష్ణదేవు తెఱఁగెంతేఁ బూని యా స్వామికిం
దా సంతానమనంచుఁ బల్కియుఁ దదుద్యత్సత్ప్రమాణంబులన్
వాసిన్ వన్నెఁ జెలంగఁ జూపి జగతీ భవ్యప్రమోదం బిడన్
భాసిల్లెం గద ? యాతఁ డాతనికె శేవం బోల్కి చెప్పం దగున్.

శా. "ఆదా" మాత్మపదమ్ముఁ దెల్పఁగను- "ఈ" వన్ మాట జీవాత్మనుం
బ్రోదిన్ దెల్పఁగఁ-గృష్ణచిహ్న మితఁ డింపుం గొల్పుచున్ దాల్చి స్వీ
యోదారామల శాంతిముఖ్యమత మీ యుర్విం దగం జేసెఁ గ్రీ
స్తూదంశుప్రభుఁ-డట్టి వానికి జయం బొప్పున్ సదా యెందునన్.

ఉ. లేవు కలాఁడఁటంచు నమలీమసుఁ డౌ భగవంతుఁగూర్చియున్
భావము పర్వునట్లు నిజవర్తనముం దనరంగ జేసియు
న్నీ విడినట్టి బోధ కడు నిర్మలమన్న రహిం గనంగనై
వావిరి మింతు వెప్పుడును బాడుపడంగను బోని మెన్నునన్.

శా. కారుణ్యంబున కబ్ధి వీ వనఁగ నీ కార్యంబె సాక్ష్యంబు వి
స్తారోదారఘణంధణధ్వనులతో సర్వసహామండలిన్
జారుప్రక్రియఁ జేసె నీ తుది దశన్ సవ్యేతరుల్ నీ యరుల్
వీటెండుల్ నినుబాధ వెట్టఁగను- నే నేరంబు నవ్వారిపై
సారింపఁ జేన కల్ల వారికి శుభన్యాసంబునుం గోరినా
వీరమ్యంపుఁబ్రమాణ మొక్కటియె నీ యిం పేసు! వాక్రువ్వదే ??

శా. ప్రేమాధిక్రియ నొప్పు నీ మత మయారే! కట్టులుం జుట్టుఁ బో
ల్లే మాత్ర మొక్కక పాటిగాఁ దలఁప కర్షిన్ భావనైర్మల్యమున్
సామంజస్యము సర్వసామ్యమును సంస్థాపింనఁగాఁ బూను నీ
శ్రీమాన్యప్రభుతావిశేషమునకున్ గ్రీస్తూ! జయధ్వానముల్ !!

# ఆత్మహత్య

"చలం"

[ఫ్రెంచి కథకుడైన మోపాసా యీకిందికథను 'ఆత్మహత్యలకు క్లబ్బు'అని పేరుతో వ్రాశాడు. దానికి నేను స్వేచ్ఛగా తెలుగు వ్రాస్తున్నాను యిందు.]

ఉదయ సూర్యకాంతి సేనునదీ ప్రవాహా నికి మెరుగు పెట్టింది. నా యింటిముందు నది ఒక్క చిన్న అలకూడా లేక శాంతంగా ప్రవహిస్తో పొడుగైన, అందమైన నెమ్మదైన, వెండికడ్డీవలె కనపడుతోంది. రెండో వొడ్డున యెత్తైన చెట్లు పచ్చనిగోడవలె వున్నాయి.

ప్రతి వుదయం ప్రారంభమయ్యే జీవనశక్తి, నవీనంగా, అల్లరిగా, ఆకుల్లో కలపించింది, గాలిలో వూగింది, నీళ్లల్లో జారింది.

పోస్టుమనిషి పత్రికల్ని తీసుకొచ్చి యిచ్చాడు. వొడ్డున కూచుని విప్పి చదివాను. మొదటి దాంటోనే యీవార్త కనిపించింది. "ఈ సంవత్సరం ఆత్మహత్యల సంఖ్య:- గతసంవత్సరంలో 8500 మనుషులు వాళ్లప్రాణాన్ని వాళ్లు తీసుకొన్నారు.

వెంటనే 8500 మందీ నా కళ్లముందు కనిపించారు. జీవితం మీద విసుకుపుట్టిన ఆ నిర్భాగ్యుల స్వచ్ఛంద అపమృత్యువుని తలుచుకుని దిగులుపడ్డాను. కొందరు దవడలు పగిలి రక్తం కారేవాళ్లు, తలలు బద్దలైన వాళ్లు, తుపాకీ గుళ్లతో రొమ్ములు చిల్లులుపడ్డవాళ్లు, ఏ నిర్జనమైన గదిలోనో క్రమంగా మరణ వేదన పడుతో, ఆ వేదనకన్న అధికమైన తమ దౌర్భాగ్యాల్ని తలుచుకుంటో, కనిపించారు. గొంతులు కోసుకున్నవాళ్లు, పొట్ట చీల్చుకున్నవాళ్లు, చేతులో యింకా యే కత్తినో పట్టుకుని కనిపించారు. విషవాయువులు పీల్చి చచ్చినవాళ్లు, అగ్గిపుల్లల మందు తిన్నవాళ్లు, విసంమందుసీసాలు చేతులతో పట్టుకున్న వాళ్లు- అందరూ కదలక గుడ్లు తేలివేసి, తాగి లేచారు. మొహాలు వంకరతిరిగాయి, పెదవులు బిగించారు, కళ్లలో భీతి, అవసానం సమీపించేముందు యింతబాధ కలుగుతుందని తెలీదు- పాపం, పైకి లేవబోతారు. ఆగుతారు, పడతారు, చేతులతో పొట్ట పట్టుకుంటారు. శరీరమంతా చెమటలు, ఇంకా జ్ఞానముండగానే పేగుల్లో అమితమైన మంటలు ... ... ...

గోడ మేకులనించి, దూలాలనించి, చెట్ల కొమ్మలనించి వేళ్లాడేవాళ్లు, నాలికలు వేళ్లాడే శవాకారాలు కావడానికిముందు వాళ్లనుభవించిన బాధ, నిరాశ, భయం, అంతా యోచించుకున్నాను. వాళ్లు తటపటాయించుకోడం సంకోచించడం, తాడు మేకుకి కట్టేందుకు వాళ్లు వెళ్లడం, గట్టిగా బిగిసిందో లేదో లాగి చూడడం, మెడకి వుచ్చు తగిలించుకోడం ... ... పాపం !

ఇంకా- మురికిపక్కలమీద చచ్చినవాళ్లు, చంటిపిల్లలతోటి తల్లులు, మాడి చచ్చిన ముసలివాళ్లు, ప్రేమవల్ల మోసపోయిన యువతులు - అందరూ నాళ్ల చేతులు బిగిసి ఉక్కిరి బిక్కిరై ... ...

నిర్మానుష్యమైన వంతెనలమీద నడిచే వాళ్లు- వంతెన ఆర్చీలకింద నీరు ప్రవహిస్తోంది- వాళ్లుచూడరు- నీటి వాసనమాత్రం తగులుతోంది. ఆ నీళ్ల కోసమే వెతుక్కుంటూ వెచ్చారు ; కాని నీళ్లవంక చూడ్డం భయం- తప్ప దాపని. కాని బుద్ధిపుట్టదు. గడియారం దూరంనించి గంటలు కొడుతోంది. కాలమూ సన్నమయింది. నిశ్శబ్దమైన ఆ చీకట్లో మునుగుతున్న కంఠస్వరాలు - బలువాటి శరీరం యెత్తునించి పడ్డచప్పుడు - వ్యర్థంగా నీటి మీద కొట్టుకునే చేతులశబ్దాలు - నిర్భాగ్యుడు కాళ్లకి రాళ్లుకట్టుకున్నప్పుడు, చల్లగా అడుక్కి పొయ్యేశరీరం. ...

దురదృష్టవంతులు - పాపం-వాళ్ల బాధను నేనెంతగా అనుభవించాను. నా మరణాన్ని అనుభవించినంతగా బాధపడ్డాను- వాళ్లకఠోరజీవితాల్ని ప్రతి నిమషమూ నాలో నేను మననం చేసుకున్నాను - వాళ్ల వేదనంతా పొంది కృశించాను. వాళ్లదుఖ్ఖాలన్నీ తెలును నాకు - ఏ నిరాశవల్ల వాళ్లకాగతి తప్ప యింక శరణ్యం లేకపోయిందో నాకర్థమయింది. ఈ మనుష్య జీవితం యెంత నిస్సహాయమో, యెంత పరాధీనమో, యెంత నీచమో, బాగా వ్యక్తమయింది.

ఏ పనిచేసినా బంగారుపడితే మన్నైన వాళ్లు; ప్రాణతుల్యులైన వారిని బూడిదచేసుకున్నవాళ్లు; అన్ని ఆశలూ, ఆనందాలూ నశించినవాళ్లు - ఈ జన్మనంతా కఠోరమైన కాలుకింద రాసినవిధి, అనంతరము కరుణచూపుతుందనే ఆశతో మరణదేవిని కావిలించుకుని యీ మాయ జగత్తునించి నిష్క్రమించినవాళ్లు -

ఆత్మహత్య - శక్తి నిశ్శేషంగా నశించిన వాటి అధికశక్తి-ఆశలేనివారి కడపటి ఆశ- జీవితమంటే అధైర్యపడ్డవారి అద్భుతసాహసం- జీవితం దుర్భరమైనప్పుడు నిష్క్రమించేందుకు ఏర్పడ్డ ఏకకవాటము - ఆ తాళం చెవి మనచేతుల్లోనే పెట్టించి విధి - మనని యీ లోకంలో బంధించిన సృష్టి- తన కాలికింద నిర్దయతో నలిపే క్రూరవిధి, ఒక్క నిమషం ఎందుకో దయతలిచి, మనకి ఈ మార్గం చూపించి వొదిలింది. యీ ఒక్క తలుపు తాళం వెయ్యడం మరిచింది.

గడచిన సంవత్సరంలో చచ్చిన 8500 మందే కలిసి యేకగ్రీవంగా యీ లోకంలో ఒక పెద్దప్రార్థన వొదిలి వెళ్లినట్టు తోచింది.

"సోదరులారా, బతికివున్నన్నాళ్లూ మా గతికి మమ్మల్ని వొదిలారు. ఒక్కరూ మాకు సహాయం చెయ్యలేకపోయినారు. పోనీ మేము సుఖంగా చచ్చేందుకన్నా తోడ్పడండి. మాకీ

కడపటి సహాయం చెయ్యమని ప్రార్థిస్తు న్నాము. బతుకులో సుఖం లేనే లేదు. మాకు - చావులోనన్నా సుఖం ప్రసాదిం చండి. మేమింతమందిమి-ఇంత మందికి వారు కోరే సౌకర్యం కలిగించవలిసింది యీ దేశపు ప్రజలవిధి. అడగడానికి మాకు హక్కువుంది.

ఈ విధంగా ఆనిర్భాగ్యుల్ని గురించి తలు చుకుంటూ ఇంద్రజాల లోకాలలో నా మనసును స్వేచ్ఛగా వొదిలాను.

ఇంతలో నేను ఒక గొప్ప పట్టణం ప్రవే శించినట్టయింది. పారిసు నగరమై వుండవొచ్చు; కాని ఏ యుగమో, ఏ సంవత్సరమో నిర్ణ యించలేను.

మేడలు, నాటకశాలలు, ఆఫీసులు, షా పులు చూస్తూ వెడుతున్నాను. చాలా అంద మైన ఒక హర్మ్యం మీద బంగారు అక్షరా లతో ఇట్లా వ్రాసివుంది.

"స్వచ్ఛందమరణ సమాజము"

మన ఆలోచనలూ, కలలూ ఎంత విచిత్ర మైనవి! ఊహకు అందనివీ, దుస్సాధ్యమైనవీ ఏవీలేవు. ఏమి తోచినా ఆశ్చర్యం కాదు, బెదురురాదు.

ఆ హర్మ్యాన్ని సమీపించాను. వరసగా నౌకర్లు కూచుని వున్నారు, క్లబ్బులోవలె. నన్నుచూసి ఒకడు లేచి-

"దొరా! ఏమి ఆజ్ఞ?" అన్నాడు.

"ఈ సంస్థ ఏమిటి?"

"శెక్రటెరిగారి దగ్గిరికి రండి తీసుకువెడ తాను."

"ఆయన నాతో మాట్లాడతారా?"

"చాలా సంతోషంగా! రండి."

లోపలికి వెడుతూవుంటే మధ్య గదుల్లో క్లబ్బులోవలె చాలామంది ఆడుతున్నారు. చదువుతున్నారు. చక్కని గదిలో కూచుని, ఉత్తరం వ్రాసుకుంటూ మంచి గంధముగల చుట్ట కాలుస్తున్నాడు శెక్రటరీ.

"ఏం సహాయం కోరి వొచ్చారూ?"

"నే నీసంస్థను ఎన్నడూ చూడలేదు. పేరు చూసి ఆశ్చర్యపడి వొచ్చాను. ఈ క్లబ్బు ఉద్దేశ్య మేమిటి?"

"ఇక్కడ ఎవరైనా సరే, వుచితంగా, సు ఖంగా, జాగ్రత్తగా చావడానికి వీలవుతుంది. చావతలుచుకున్న వాళ్లందరికీ ఆసౌకర్యాలు కలగచేస్తాము."

నాకు ఆశ్చర్యం కలగలేదు. ఆ మాటలు సహజంగానూ న్యాయంగానూ తోచాయి. కాని యీ లోకంలోని బాధమీద దయ దలిచి, యిట్లాంటి సంస్థను ఏర్పరిచినవారి ఉ దారత్వం చూసి ఆశ్చర్యంవేసింది. "స్వేచ్ఛను నాశనంచేసి, తమమతనైతిక నిబంధనలతో ఎంత ప్రజలు నలిగి మూల్గితే అంత సంతో షించే, నీచులూ, స్వార్థపరులూ, ఐన యీ ప్రజలలో యింత దయగలవారు కూడ వున్నారా!"

"ఎందు కీట్లాటిబుద్ధి కలిగింది అసలు మీకు ?"

"పోయిన ఐదు సంవత్సరాలలోను ఆత్మ హత్యలు అమితంగా పెరిగిపోయినాయి. వీధుల్లో, సంతల్లో, హోటళ్లలో, నాటకశాలల్లో, రైళ్లలో సభలలో, ప్రతిచోటా, విచక్షణలేకంపా ఆత్మహత్యలు ప్రారంభమైనాయి. చూసేవారికి అసహ్యం, పిల్లలకు అనారోగ్యకరమైన దృశ్యమయింది. కనక యీ ఆత్మహత్యలను కేంద్రీకరింప తలచాము."

"అసలు యీ హత్యలు పెరగడానికి కారణమేమంటారు ?"

"నాకు తెలీదు బాగా. లోకానికి వయసు హెచ్చింది. ప్రజలు పూర్వపు మూర్ఖత్వాన్ని వొదిలి స్పష్టంగా జీవితమంటే ఏమిటో, యెటువంటిదో, చూడ గలుగుతున్నారు. మతమూ, మూర్ఖత్వమూ, బోధించే భయాల నించి విముక్తులైనారు. జీవితం ఆనందంగా వుంటే బతికివుంటారు. బాధకరంగావుంటే వెళ్లిపోతారు. దేవుడు మోసంచేస్తాడనీ, దొంగతనం చేస్తాడనీ, మనుష్యుల్ని పీడించుకు తింటాడనీ, వాగ్దత్తాలుచేసి చెల్లించు కోడనీ, తెలీగానే, ఆ దొంగ ఆశలన్నీ మాయంకాగానే, ప్రజలు స్వతంత్రంగా ఆలోచించుకున్నారు."

"సరే మీరెట్లా సహాయం చేస్తారు ?"

"ఇది క్లబ్బు. మీరూ చేరవొచ్చు."

"క్లబ్బా !"

"చాలా ఆనందంగా వుంటుంది మాకిక్కడ."

"ఇక్కడ ."

"అవును."

"నాకు ఆశ్చర్యంగా వుంది."

"మన ఆనందాలన్నిటినీ నాశనంచేశేది భయం. మరణమంటే భయం పోయింది మాకు."

"మరి మీరుకూడా ఆత్మహత్య చేసుకోవలిసిందేనా ?"

"అఖ్ఖర్లేదు. చేసుకో తలిచినవాళ్లకు సహాయం చెయ్యడమే యీ క్లబ్బు వుద్దేశ్యం. మరణం భయంకరమైనదిగాని, విచారకరమైనదిగాని, కాకూడదని మా వుద్దేశ్యం. వూరు నించి వూరుమారడమెట్లానో, లోకాలుమారడంకూడా అంతే. చావుని సంతోషకరంగా చేశాము మేము. పుష్పాలతో, పరిమళాలతో, సంగీతంతో సులభమైనదిగా మార్చాం."

అని నన్ను క్లబ్బు చూడ్డానికి వెంట తీసుకు వెళ్లాడు.

"ఎట్లా చంపుతారు?"

"ఒక కొత్తవాయువు కనిపెట్టాం. అటువేపు వీధిలోకి మూడుతలుపులు వున్నాయి. ఎవరైనా సరే ఆతలుపుల్లోంచి లోపలికిరావొచ్చు. రాగానే మేము ముందుప్రశ్నిస్తాము. అతను చావడానికి నిశ్చయించుకున్నందుకు కారణాలు అడుగుతాము. తీర్చడానికి వీలైన

కారణమైతే, సహాయం చెయ్యడానికి ప్రయత్నిస్తాము. వాళ్లు చెప్పిందంతా నిజమో కాదో వాకబుచేసి కనుక్కొని ఉదారులైన మెంబర్ల సహాయాన ఆ నిర్భాగ్యుణ్ణి నూతనంగా జీవితం ప్రారంభింపచేస్తాము. మా సహాయానికి అందని వ్యవహారమైతే, అతన్ని కులాసాగా పరలోకానికి పంపుతాము. భాగ్యవంతుడైతే చాలా 'ఛార్జి' యివ్వాలి. బీదవారికి వుచితము.

మా సహాయంకోరి వొచ్చేవాళ్లని చూడాలి. వాళ్ల మరణంకన్న జీవితమే ఘోరం. పేలికలైనా లేని ముసలివాళ్లు, కుక్కలవలె వీధులో పారేసింది ఏరుకుతినేవాళ్లు, యెముకలవరకు క్షీణించినస్త్రీలు, పక్షవాతంతో పడిపొయ్యేవాళ్లు, అరగానీ సంపాయించుకో శక్తిలేనివాళ్లు:-కొందరు ఏమీ మాట్లాడరు. 'ఎక్కడ ?' అంటారు. నిమషంలో దాటిపోతారు.

"ఆ స్థలం చూపండి?"

అది చక్కనిగది. నీలపుగాజు కిటికీలు, చక్కని దివానులు, సోఫాలు, తాటి మొక్కలు, పూలమొక్కలు—బల్లమీద పుస్తకాలు, పెట్టెలో చక్కని చుట్టలు, సిగరెట్లు, పెప్పరమెంట్లు, అద్దాలు ...

"అసలు స్థల మెక్కడ యీగదిలో ?"

ఒక పొడుగాటి పట్టుదిళ్లుగల కుర్చీ ఒక చెట్టుకింద వుంది.

"ఏ పరిమళం కావాలో కోరుకోమంటాము—మల్లె, గులాబి, చందనం—ఏ వాసనలోనైనా వొదలగలం ఆ వాయువును. మీరు కొంచంగా పీలుస్తారా ?"

"అప్పుడే చావాలని లేదు."

"ఏమీ అపాయం లేదు. నేను చాలా సార్లు పీల్చాను అమితం కాకండా."

"సరే."

"దానిమీద పడుకోండి?"

పడుకున్నాను చక్కని పువ్వుల పరిమళం వొచ్చింది. మధురమైన నిద్ర కమ్మింది. నా చెయ్యి పట్టుకుని ఎవరో లేపారు.

"లెండి. ఆహా ! చూశారా, ఎంత మధురంగా వుందో! బావుందా ? " అని శెక్రటరీ లేపుతున్నాడు.

మెళుకువ వొచ్చింది.

కలలో కాక ఎవరో నాతో నిజంగా మాట్లాడుతున్నారు. నా కల తేరిపోయింది.

సూర్యకాంతిలో సేనునది మెరుస్తోంది. పోలీసువాడొకడు నావంక నడిచి వొస్తున్నాడు.

"ఎక్కణ్ణించి వొస్తున్నావు నారాయణస్వామీ ? " అన్నాను.

"ఈ బ్రిడ్జీకింద ఒకడు పడి చచ్చాడు. ఎంతమంది, యిట్లా నీళ్లలోపడి చచ్చింది, యీ వేడు ? కాళ్లు తాడుతోకట్టుకుని మరీ దూకాడు."

మోపాసా వ్రాసిన యీ కథ చదివిం తరువాత ఇదివరకు నా మనసులో వున్న అభిప్రాయాలు చక్కగా ఒక రూపం వహిం చాయి. ఏ దేశపు న్యాయచట్టమైనా, ఒకరి స్వేచ్ఛ నొకరు ఆటంకపరచకుండా కాపాడుతుంది. కాని ఆత్మహత్యా, గర్భవిచ్ఛేదమూ యీ రెండు విషయాల్లో వ్యక్తి స్వాతంత్ర్యానికి అడ్డం వస్తోంది.

కుదరని జబ్బుని, తీరని రోగాన్ని, చివరికి వదలని దారిద్ర్యాన్ని, అర్చ లేని తీర్చ లేని ప్రభుత్వం "నీవు చచ్చి, యీ వ్యథలనించి తప్పించుకోడానికి వీలులేదు. నీవు బతికివుండి అనుభవించవలసిందే'' నని శాశించడానికి దానికి యే మధికారం వుంది!

ప్రజలకు సునాయాసంగా, సుఖంగా చచ్చే విధాలు ఇంకా తెలీవు. అటువంటి పద్ధతుల్ని ప్రచారం చేశేందుకు, ఆత్మహత్య అపరాధ మనే భావాన్ని తొలిగించేందుకు, మరణమన్నా పరలోకమన్నా భయమనేది మూఢ నమ్మక మని రుజువుచేసేందుకు, ఒక క్లబ్బు యేర్పడడం చాలా అవసర మనిపించింది. మొపాసాకు కలలో కనపడ్డ క్లబ్బువంటి క్లబ్బు స్తాపించగలిగితే, ఎంత మందికి సలహాల నిచ్చి, సహాయంచేసి, చావు నించి కాపాడవచ్చును! అత్తలతో పోట్లాడి బావుల్లో దూకే కోడళ్లు, సంఘం తరిమేస్తే దిక్కులేక చచ్చే అనాథలు, కోర్టుకు వెళ్లి క్రూరత్వం రుజువుచేసుకునే లోకజ్ఞానంలేని అబలలు, మానం కాపాడుకోడానికి ప్రాణం అర్పించే యోధులు—వీళ్లందరికీ సహాయం చెయ్యవచ్చునుకద! ప్రభుత్వమే విచక్షణతో అనుజ్ఞ నిస్తే, ఇంక గతీ ఆశా లేని వాళ్లకి, మానవసహాయానికి అందక అధోగతిలో పడ్డవాళ్లకి, అజ్ఞానంలోపడి దారుణ బాధలు పడకుండా సుఖమైనమృత్యువును ప్రసాదింపవచ్చును కదా!



# ముకుందమాల

(శ్రీ కులశేఖరాళ్వారులవారి సంస్కృతమునకు తెలిఁగింపు)

ఆంధ్రీకర్త—శ్రీ కవిభూషణ, శతావధాని, విద్వాన్ దోమా - వేంకటస్వామిగుప్తగారు.

## శ్రీ కులశేఖరస్తుతి

గీ॥ అలర శ్రీరంగయాత్ర యహర్నిశంబు
విన౯గ వచ్చు మిక్కిలిగ నెవ్వని పురాన
మహితు నల కులశేఖరక్ష్మాతలేంద్రు
మస్తకము నేల సోఁక నమస్కరింతు.

## ముకుందమాల

శా॥ "శ్రీపా" యంచు "వరప్రదా!" యని "దయాసింధో" యఁటంచున్ "భవ
వ్యాపారాపహృతిప్రగల్భ!" యని "భక్తార్తిప్రియా!" యం, "చేనా
థాపారాదర!" యంచు, "శేష శయనా!" యంచున్ "జగద్వాస!" యం
చోఁపంబో కనిపింపు నా నుడి - ముకుందా! దీనబృందావనా!! 1

చ॥ జయము జయంబు దేవునకు సారెకు దేవకిదేవిబిడ్డకున్
జయము జయంబు కృష్ణునకు శౌరికి వృష్ణికులైకమాలికిన్
జయము జయంబు నల్లనగుసామిముకుందునకున్ మురారికిన్
జయము జయంబు భూభరవినాశకుఁడైన మనోజ్ఞమూర్తికిన్. 2

ఉ॥ ఫాలము నేలఁసోఁక నభివాదనముం బొనరించి "యో ముకుం
దా! లలి నొక్కటే యభిమతంబును నీకడ వేఁడువాఁడ; నీ
మేలగుపేర్మి నాపయిన మించెఁగ నేను భవత్పదాబ్జముల్
పాళిని జన్మజన్మముల నాత్మ ధరింపఁగఁజేయు మిమ్మునన్. 3

మ॥ తగ నద్వంద్వపుఁ గారణంబుగనొ-లేదా? రౌరావాదిస్థలా
ళిగతిం బాయఁగనేని-సుందరవనీ లీలా విహారార్థమే
ని-గడుం బేర్మిని దావకాంఘ్రియుగమున్ సేవింప నే-నో హరీ!
నెగడ న్నెమ్మది జన్మజన్మముల నిన్నే యెంచెదంగావునన్. 4

మ॥ ధనముం గోరను-ధర్మ మొల్లను-సుఖౌదార్యాఽఽ స్థయుర్ లేదు-తో
ల్లిని గావించిన కర్మమేర కెటు లెట్లేఁ బ్రాప్తియాఁగాకఁ-బా
వన! ని న్నొక్కటి వేఁడువాఁడఁ-బటుదివ్యశ్రీ భవత్పాదకం
జనిరూఢంబగు భక్తి నిమ్ము ప్రతిజన్మంబందు నా-కీశ్వరా!! 5

మ॥ ధరనైనం-దివినైన-లేక నరకాంతఃకూపమందైన-మృ
త్యురుజావాప్తుల వేళలందయిన - నా యుల్లంబు గాఢంబుగా
దరదంభోరుహ సుందరారుణ భవత్పాదద్వయిం బొల్చు ని
ర్భరభక్తిన్ నరకాసురారి ! మదభిప్రాయం బిదే పొల్చెడిన్. 6

మ॥ భవదీయాంఘ్రిసరోజపంజరమునన్ బద్ధాత్మ ! నా డెంద మ
న్నవిధిం బొల్చెడి రాజహంస మిపుడే నల్వారఁగాఁ జేరఁగా
త! వెసం బ్రాణము లూడునప్డు కఫవాతప్రోద్ధతిన్ మాటరా
మి వహి న్నీస్మరణంబు వీలుపడునా ? కారుణ్యవారాన్నిధీ!! 7

ఉ॥ నారద దానవార్భక సనందసముఖ్య మునీంద్రచంద్రబృం
దారకబృందవందితుని, నందకుమారుని, మందహాసరే
ఖారుచి రాననాంబుజునిఁ గాఢముగా మది నెంచువాఁడ ల
క్ష్మీరమణీశుఁ, గామితవశీకరు, నాశ్రితవజ్రపంజరున్. 8

చ॥ భవమను పే రెడారిఁ బలుపాటులనొంది కరాంఘ్రికంజవై
భవము, శ్రమాపనోదనము, భాసురలోచన మీనమున్, భుజా
పరిఘతరంగమున్ గడునపారగభీరము శ్రీవరాఖ్యపున్
సరసి మునింగి తేజ మను నారము గ్రోలి యిదే! సుఖంచెదన్. 9

మ॥ సరసీజాక్షుఁడు శంఖచక్రయుతహస్తప్రోల్లసన్మూర్తి యా
మురదైత్యారి భజించు టెన్నఁటికినిం బోనాఁడకే డెందమా !
హరిపాదస్మరణామృతంబునకు సామ్యంబైన సౌఖ్యంబు నే
నెఱుఁగన్ లే దెట నేని కావునను నీ కిట్లుం బ్రబోధించెదన్. 10

మ॥ తెలియన్ లేని మనంబ ! నారకమహార్తి వ్రాతముంగూర్చి భీ
తిల నేలా ? మన సామి శౌరి మనఁగా; నీ పాపపుం దాయ లె
క్కలతం గొల్పఁ గలారె ? కొల్వు మిఁక భక్తక్లేశ దేవున్ వడిన్
నెలయన్ లోక మహార్తు లాపు దొర యెంతే దాసులం బ్రోవఁడే? ? 11

మ॥ భవవార్ధిం బడి, ద్వంద్వవాయుపటలీవ్యాధూతులై, పుత్ర బాం
ధవ పుత్రీ తరుణీ ప్రపోషణ మహాఘాటీపరిభ్రాంతులై,

మిన్వులం దుర్విషయాంబుమగ్నులయి నెమ్మిం జెంద కల్లాడు మా
నవులం బ్రోవఁగ శ్రీవరుం డొకరుఁడే నౌకాకృతిం బొల్చెడిన్. 12

మ॥ అమితాగాధ భవాబ్ధి దుస్తరము గాదా ? యెమ్మెయిం దాట శ
క్య, మఁటంచున్ భయ మేల ? నారకభిదాదార్య ప్రభుండైన య
క్కమలాత్ముం డగు దేవదేవునెడ రంగద్భక్తి నీ కున్న - న
ల్ల మహత్త్వంబుననే యవశ్యముగ దాఁటంజెల్లుఁ బాపంబులన్. 13

శా॥ దారాఽవర్త మనంగ వాయుచలితోద్యన్మహా భంగంబు తృ
ష్ణారంగజ్జల మాత్మజానుజమహాయాదోభయోదగ్ర సం
సారాంభోనిధిలో మునింగినమనున్ బాగా భవత్పద్ద్వయియా
నీ రేరుడ్వరభక్తి నౌకఁ, ద్రిజగన్నేతా ! రయం బిచ్చి, మో
దారూఢిం గనఁ జేయవే ? వరద ! వందారూరుమందారమా!! 14

ఉ॥ కాంచెను ద్వత్పదాశ్రయము గాసని పుణ్యవిహీనపంక్తి, నా
లించెను శ్రావ్యబంధవిబుధేడ్యభవత్కథ లక్క నేదియే,
నెంచెను నిన్నుదబ్బఱగ నెంచు మదిం దగు వారి, నెందు వ
ర్తించెను నీదు పూజ విడి, యిట్లిడు నాకు వరంబు మాధవా!! 15

ఉ॥ నాలుక ! యెంచు కేశవు ; మనంబ ! మురారి భజింపు ; శ్రీధరుం
గేలు గవా ! యజింపుమి ; యొగిన్ హరిగాధ వినుండి వీను ! లో
కాలు గవా! హరిస్థలికిఁగాఁ జను ; కన్గవ ! కృష్ణుఁజూడు-ము
క్కోలి ! ముకుందపత్తులసి దొందుము వాసన ; న య్యధోక్షజున్
హాళి నమస్కరింపుము ; తలా ! - యల లాగుల మీకు మే లగున్. 16

శా॥ యోగీశానులు యాజ్ఞవల్క్యముఖులే యుక్తిం బ్రసాదించిరో
యా గణ్యంబగు యుక్తి నిద్ది వినుఁ డయ్యా ! ఆధి మృత్యు వ్యధా
రో గాపాయహహా రౌషధం బొకటియే ప్రోదిన్ దగున్ గృష్ణనా
మాగణ్యంబగు తేజమన్న యమృతం బానంద మిచ్చుం గదున్. 17

మ॥ ఒక మర్మంబును దిక్ప్రదర్శనముగా నో మర్త్యులారా ! వినుం
డు ! కదున్ సంసరణాంబురాశి బహుళం బుద్యద్విపద్భంగమం
దకటా ! తెల్విడి మ్రగ్గనేటికి ? " నమో నారాయణా" యేతి భా
వుకమంత్రంబును నోంక్రియానతులతోఁ బ్రొందిం జపం బూనుఁడీ!! 18

మ॥ అతిమాత్ర త్వదుదారవైభవముఁ గన్నారం గనుంగొన్న, సీ
క్షితి నల్కంబలె, బిందుమాత్రములుగా సింధుల్, మఱిన్ మిణ్గురుల్

గతిఁ దేజంబులు, నార్పునట్లనిలమున్, రంధ్రంబుగా నాకసం
బలిభవ్యుల్ విధిముఖ్యదేవతలి కీటాళింబలెం దోఁతు, ర
ద్భుత మా నీ మహిమంబు డంబుగ జయంబుం బొందు, సర్వేశ్వరా!! 19

మ॥ భవదీయాంఘ్రిసరోజయుగ్మభజన వ్యాజామృతాస్వాదనం
బు వెసం బొల్చెడి మాకు జీవిత, మదెవ్వన్ మోడ్పుఁగే లొప్ప, శీ
ర్షవినమ్రత్వముతోడనుం బులకితాంచద్దేహగాద్గద్యయు
గ్రవసాశ్రుప్రజదృక్కులం గడచుతన్ ; గంజాక్షు ! నీ సత్కృపన్. 20

శా॥ ఓ గోపాలక ! యో కృపాజలనిధీ ! యో సింధుకన్యాపతీ !
యో గోపీవర ! యో జగత్త్రయగురూ ! యోరామసోదర్య ! యో
నాగేంద్రావన ! యోయి కంసహర ! యో నాళీకపత్త్రేక్షణా !
యో గోమిన్యధిపా ! కన న్నినువినా యుల్లంబునన్ గావుమా !! 21

సీ॥ భక్తసంబాధకాపాయంబు లను పేరి ఘటసర్పముల పాలి గారుడమణి,
గోపికానేత్ర చకోరికాసంతతానంతసంతోషప్రదాంబుదమణి,
సకలలోకైక రక్షాదక్ష వరమణి, సౌందర్యముద్రాప్రశస్త సుమణి,
వరపదప్రవిలసద్వందారుబృందారకామంద కోటీరకానులమణి,

గీ॥ కామినీమణి రుక్మిణీ ఘనకుచయుగ, శైకభూషామణి యనఁగ నలరు మేటి
నెఱిని గోపాలచూడామణి విజయంబు, నందు దైవశిఖామణి యనవరతము. 22

ఉ॥ అరులను ద్రుంప జోలి, నిగమాంత వచస్సుల పూజనొంది, సం
సరణము దాఁటఁ జేయఁగను, సంతమసాకరమున్ వెలార్పఁగాఁ !
బౌరి సిరులీయ జన్మఫలముం గవగూర్పఁగఁ భాముకాట్లనం
బరఁగెడివైన దుర్వ్యసనపంక్తి నడంచెడి కృష్ణనామ సు
స్థిరజయకారిమంత్రమును జిత్తమ ! లెమ్మ ! జపింపు నిత్యమున్. 23

శా॥ వ్యామోహంబునుబాఁప- మానిహృదయ వ్యాపారముం గొల్ప, దై
త్యామందార్తిని రేఁప, భక్తతతి కత్యంతబు మేల్గూర్ప, శ్రే
యోభూస్యత్వ మిడన్, వడిన్ భవభయం బాఁపన్, జగన్మండలై
కామోదం బిడఁ, గృష్ణనామకపు మం దానందగున్ డెందమా!! 24

(సశేషము)

---

# చిన్న కథ

'వసంత'

చిన్నకథలు వ్రాయాలనే సరదామాత్రము నాలుగైదు సంవత్సరాల పూర్వమునుంచే నా మనసులో వుంది. చిన్నపుడు ఇంటర్ చదువుకొనేటప్పటి నుంచీ కూడా- క్లాసులోకంతా ఫస్టుకాకపోయినా నీడు గట్టివాడు అనేపేరుమాత్రము నాకు ఉన్నది లెండి. మా ఊళ్లో ఉండే చిల్లర పత్రికలవాళ్లూ, మా కాలేజి తాలూకు మాగజైనువాళ్లూ ఏదైనా వ్రాసిపెట్టమని ఒకటే యిదిగా నన్ను ఫోర్సుచేస్తూ ఉండేవాళ్లు. ఆ దినాలలో నాటకాలలో పెద్దపెద్ద వేషాలు కూడా వేశేవాణ్ణే. మా కాలేజి ఇంగ్లీషు పండితుడు ఒకసారి నన్ను లైబ్రరీలో కలుసుకొని "ఏమండీ......... గారూ"- [ఈ మధ్య కొన్ని సంవత్సరాల లగాయితు అయ్యవార్లు తమ స్టూడెంట్సును "ఏమండీ!" అనీ పేరు చివర "గారూ" ను అంటించే, మాట్లాడడం గాని, తదితరవ్యవహారాలను గాని సాగిస్తూండే విషయం అందరికీ తెలిసిన విషయమే నని నా అభిప్రాయము. పూర్వకాలములో ఎంత జమీందారు బిడ్డనైనాసరే అయ్యవారు 'ఒరేయ్' 'ఓయ్' అని పిలుస్తూవుండిన సమాచారము ఇక చెప్ప నక్కఱలేదు. అప్పుడు అట్లా పిలిచిన దానివల్లవారికి పిల్లకాయలను వృధాగా చిన్నబుచ్చవలెనన్న అభిప్రాయము లేదు. కాలముతో పాటు అన్నిటికీ వచ్చిన మార్పులే ఇందులోనూ వచ్చాయని నాతలంపు.] "మీరైనా మన మాగజైనుకు వ్రాయకూడదూ! మరి మాగజైను స్టూడెంట్సదికదా-మీరు వ్రాయకుండా అంతా మేమే వ్రాస్తే మీకేం లాభం" అని అడిగి- కడాకు "నాటకాల విషయం ఏదేనా వ్రాయండీ!" అన్నారు. ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే విషయ పరిజ్ఞానం కొంచెం ఉన్నా వ్రాయ దలచుకొనేటప్పటికి కలం ఆడేది కాదు. అప్పటి స్థితికి తగినట్టు కొంచెమో గొప్పో ఉపజ్ఞకూడా ఉండేదే- మంచి పరిశీలనా అదీన్నీ - కాని అదేమో; ఏమి వ్రాయబోయినా కష్టమయ్యేది. కడాకు ఒక చిన్నకథ వ్రాయడం మొదలుబెట్టాను. చిన్నకథ అంటే ఇప్పటి మాస-వార-దిన పత్రికల్లో ప్రకటింపబడే చిన్ననాటకాలను కూడా కథలకిందే పరిగణిస్తున్నానని మనవి చేస్తున్నాను. ఏ విషయం ఎత్తుకొని కథవ్రాయడం? చిన్నకథకు వస్తువు ఎట్లావుంటే బాగుంటుంది? ఏ విధమయిన భాష ఉండాలి? అనే పరిశీలన మనసులో పడి మరి విషయమే మనసుకు తట్టలేను. ఎట్లయితేనేం కథను ఒకదాన్ని కొంత సంభాషణలోను, కొంత చెప్పినట్లుగాను, కొంత చూచినట్లుగాను, కొంత అట్లా కొంత ఇట్లా మొత్తానికి 'భ్రష్టాంధ్రము'లోనని తోస్తుంది యిప్పుడు నాకు వ్రాసిపడేశాను. మా అయ్యవారు అభినందించాడు నా యీ చిన్ని ప్రథమప్రయత్నానికి. మొహమాటానికే అన్నాడో, నిజంగానే అన్నాడో తెలీదు కాని "బాగుంది! అయితే కొంచెం పెద్దది. మన చిన్న మాగజైనుకు ఇంత పెద్దది ఎట్లా అబ్బా!" అని నొసలు పట్టుకొని ఆలోచన అభినయిస్తూ 'సరే' నన్నాడు. నేనొక వినయపూర్వక నమస్కారం చేసి మరీ క్లాసుకు పోయాను. తరువాత ఆ కథ సమాచార మేమయిందీ నాకు తెలీదు. మాగజైనులో మాత్రం అచ్చుపడింది కాదు.

... ... ... ...

ఇటీవల మరీ రెండుమూడు సంవత్సరాలుగా చిన్నకథలను వ్రాయాలని మనసున్నా, కొన్ని విషయాలు ముఖ్యంగా సంఘానికి సంబంధించినవీ డిటెక్టివుకథలు, మొదలయిన వాటినిగురించి నా ఆలోచన తీవ్రంగా సాగింది. కథకు కొంత చక్కని వ్యూహంకూడా లభిం

చింది. అంతదాకా ఎందుకండీ! ఒకసారి హైకోర్టు దగ్గరినుంచి మౌంటురోడ్డుదాకా ట్రాములో గాని బస్సులో గాని పోయి వస్తే ఎన్ని విషయాలో మనసుకు తట్టుతాయి; వాటి నన్నిటిని చక్కగా గమనించి పరిశీలించి, కథలలో ఇమిడ్చగలిగిన శక్తే గనుక ఉంటేనా ఎంత బాగుంటుం దంటారు!

కథ మొదలుపెట్టడం అనేది ఎట్లు? అమ్మమ్మ కథలు ఉండాలా - 'అనంగనంగా ఒకరాజు, ఆ రాజు కేడుగురు భార్యలూ' అని వ్యావహారికం. అట్లా కాకుండా ప్రబంధరీతగా 'అఖిలాండ బ్రహ్మాండకోటి నాయకుం డైన' అని మొదలయ్యేవి కొన్ని. 'అది సాయంసమయము, నిర్మానుష్యము, ప్రకృతియే సన్యసించినదా యనినట్లు కాషాయవర్ణము ఆవరించినది గగనమంతయు. గూళ్లకు చేరుకొను పక్షుల కూతలయందు మాధుర్యము మృగ్యము. ఇట్టి ప్రపంచమందు విరక్తి గలిగినట్లు దిన కరుడు క్రుంగిపోయినాడు.' అని ప్రారంభమయ్యేవి కొన్ని. ఈ విధంగా పరిపరి విధాలున్నాయి; ఎన్నని వ్రాసేది. మచ్చుకు మాత్రం చూపెట్టాను.

కథలలలో మానసిక తత్త్వ పరిశోధన చేసేవి కొన్ని. కొన్ని స్వాంతాలు. కొన్ని దురంతాలు. కథలను వ్రాయడంలో నేర్పుచాలక అంతాన్ని ఆదిలోనే బయలుచేసికొనే చప్పు పుచ్చు కథలు కొన్ని ఉన్నాయి. కొందరు పాపం చక్కగా వ్రాయగలిగినవాళ్లే అనవసరంగా కథను పెంచి పెంచి పాడు చేసి పాఠకుల్ని విసిగిస్తారు.

మన సారస్వతములో చిన్నకథలు-పిట్టకథల లాంటివి-పిల్లలకు చెప్పేవి వేనకు వేలుగా ఉన్నాయని పెద్దలు చెప్తారు. వీటియందు చమత్కారం మెండుగానే వుంది. పరిశీలించి గనుక చూస్తే చిన్నప్పుడు చదువుకొనే హితోపదేశం కథలు, పంచతంత్రకథలు ఎంత బాగుంటాయో చూశారు! వాటిల్లో ప్రతివాడికి కావలసిన విషయాలూ ఉన్నాయి. కాని కథలు ఇట్లనే ఉండాలి అట్లా ఉండకూడదని నిర్దేశం ఎక్కడాలేదు. కాని బాగా వ్రాయబడిన కథలో చక్కని పోంకిక, చక్కని విషయం, లోకోపకారకమయిన నీతి యివన్ని కంటికి కట్టినట్లు కనుపిస్తాయి. కొన్ని కథలలో సాంఘిక దుస్థితులు, దురాచారాలు, అంధ విశ్వాసాలు ప్రకటితమౌతుంటాయి. వ్యాస విస్తరభీతిచేత మరీ లోతుకు దిగడానికి సంకోచిస్తున్నాను. లేకపోతే లోతుకు పొయ్యే కొద్దీ పొగడాలు, ముత్యాలతో బాటు నత్తగుల్లలను కూడా ఏరి పారేసి చూపవచ్చు.

సాంఘిక దురాచారాల విషయమై ఆలోచిస్తే, లెక్చెర్లనిచ్చి మనసుకు నచ్చ చెప్పడంకన్నా, ఒక చిన్నకథమూలంగా చెప్పకలిగితే తొందరగా మనసుకు నాటుతుంది. దీనికే బోధనా పద్ధతులలో కూడా ఏదో పేరు ఉంది. అంత ఎందుకండీ! సామాన్యంగా మనకు పదిబారలలో వుండాలిసిన పంచములు - వారిమీదుగా వచ్చే గాలికూడా స్పృశ్యానర్హం అని చెప్పాడు-సదాచారసంపన్నుడను కొనే ఒక సనాతనుడు - నెల్లూరు గాలివానప్పుడు శిష్టాచారులయిన బ్రాహ్మణుల యిండ్లల్లోకి వచ్చి రాత్రంతా వారితోనే గడిపారుట. వారిలో కూడా బాలింతలు మొదలయిన వారంతాకూడా నచ్చారట! చూచారు! ఇట్లా ఎవరయినా జరగనిస్తారా! సామాన్య సందర్భాలలో, ప్రపంచానికంతా ఆపదలు ఒకటే. అట్టివి ఏవయినా - గాలివానలుగాని, వెల్లువలుగాని, అగ్నిప్రమాదాలుగాని, భూకంపాలుగాని వస్తే అట్లాంటప్పుడు జాతి, వర్ణాలకు పాటింపు ఉండదనే నామనవి. అప్పట్లో ఎవడి ప్రాణం వాడికి తీపి గనుక ఎక్కడివా ళ్లక్కడ ప్రాణసంరక్షణార్థం కాలికి బుద్ధిచెప్తుంటారు. ఈ జ్ఞానం ఎప్పుడూ వుంటే యిట్లా ఎందుకు వుంటుంది? మనవంటి మనుష్యులే కదా వారున్నూ అని సర్వమానవసమానత్వాన్ని గురించి చెప్పబూనుకుంటే లెక్చెర్లకన్నా కథలు ఎక్కువ లాభకారులని చెప్పవచ్చు.

సోమారిపిల్లా డొకడు బడికి వైష్ణవమిప్పించి-(అంటే పంగనామంవేసి) తిరగడానికి బోయి తనతోకూడా ఆడుకోడానికి ఎవరూ లేకపోగా, కొన్ని జంతువులను చూడగా అవికూడా తమ తమ పనుల్లో ఉండడంచూచి తనకు తోడు లేకపోవడం కనుక్కొని చిన్న చీమవల్ల బుద్ధితెచ్చుకొన్నవాడి కథలో ఎంత 'మేలు పలుకు' ఉంది? కవిసార్వభౌముడు రవీంద్రనాథటాగోరు వ్రాసిన చిన్నకథలన్నీ ప్రాయికంగా యింతేననవచ్చు. విషయాన్ని స్పష్టంగా చెప్పటం - ఫోర్సుకు లోటులేకుండా, కథ మూలాన్ని లోకానికి తెలుపవలెననుకున్న తత్త్వాన్ని అట్లా చూచాయగా పాఠకుడి యూహాకే వదలడంవంటి దదొక పద్ధతి.

చిన్నకథ నొకదాన్ని చెప్పబోతున్నా నని యిప్పటికే అనేకులు పొరపడియుంటారు. చిన్నకథల లక్షణాలు మొదలయినవాటిని గురించి వ్రాయడమే ఉద్దేశం అని హెచ్చరిక.

చిన్నకథలు (Short stories) అనేవి ఎట్లా ఉండవలెననే నిర్ణయానికి రావలంటే చాలాకష్టం. కేవలం ఒక నీతిని బోధించడానికి చిన్న కథలను వ్రాయడం ఒకపద్ధతి. నీతిబోధ చేయడానికి వ్రాయడే కథల్లో పశుపక్ష్యాదులు మాట్లాడడం కద్దు. నిజంగా యివన్ని మాట్లాడాయా అంటే మాట్లాడ లేవన్నా చిక్కులేదు. ఎందుకంటే కథకుడి దృష్టిలో నీతి నొకదాన్ని బోధించడమే గురి గనక ఏవి మాట్లాడితే నేమి? చెట్లు, చేమలు, ఇళ్లువాకిళ్లు కూడా మాట్లాడవచ్చు. ఇదే ఇంకొకపద్ధతికి వచ్చి మనుష్యులు చేతనాచేతనాలని సంబోధించడం, అవన్నీ వాటికి సానుభూతి తెల్పినట్లుండడం. మొదలయిందంతా పూర్వకాలం నుంచే చూస్తున్నాము. మనకు ఇష్టులయిన కుక్కలు గాని పిల్లులు గాని ఉంటే మనకు కష్టాలు సంభవించిన సమయాల్లో అవి మన స్థితిని కనుగొని వర్తించడం, అవికూడా దుఃఖపడ్డట్లుండడం మనం గమనించే వుంటాము. కనుక మనభాషతో మనతో ప్రసగించకపోయినా భావాలను గ్రహించుకుంటున్నాయి అవి. కనుక నీతిబోధకములగు కథలయందలి పాత్రముల విషయమింతే. వీూదు మిక్కిలి వాటివల్ల మనం నేర్చుకో తగ్గవిషయా లనేకం ఉన్నాయి.

పురాణకథలు, చారిత్రకకథలు మొదలయిన వాటి విషయం వేరు. కల్పనాకథల విషయం వేరు. ఎట్లంటే పురాణాలు, చరిత్రలు మొదలయినవాటి విషయం మనం కొద్దిగా గ్రహించి, అందలి పాత్రల గుణాలనట్లే యుంచి, ప్రవాహం చెడకుండా ఉండేటట్లు వ్రాస్తున్నామే కాని ఎన్నిసార్లు శ్రీరాముడి కథవ్రాసినా రావణుడు రాముణ్ణి చంపేశాడని వ్రాయడంలేదు. హిరణ్యకశ్యపుడు నృసింహస్వామిని సంహరించాడని చెప్పటంలేదు అట్లే చరిత్రలో కూడా. కనుక కల్పనాశక్తిని, రచనానైపుణ్యాన్ని ఎక్కువగా ఉపయోగపెట్టవలసిన కథలు ఇతరములు. అయితే అందుకూడ ప్రకృతికి విరుద్ధమయిన విషయాలను వ్రాయగలగటం కష్టం. ఎలుక పిల్లిని చంపింది అని యెట్లయ్యా వ్రాయడం!

కల్పనల విషయంలోకూడా రెండు తెరగులు - అవి - నవలలు చిన్నకథలు. ఈ రెంటికి లావులోనే గాక ఉద్దేశ్యము, గుణములలో గూడా చాలా భేదముంది. కథలో ఉండే సంపూర్ణత్వం నవలలో కనుపించదు

* "A true short story is nothing other and something more than a mere story which is short. A true short story differs from the novel chiefly in its essential unity of impression. In a far more exact and precise use of the word, a short story has unity as a novel cannot have it.

It shows one action, in one place, in one day. A short story deals with a single character, a single event, a single emotion or the series of emotions called forth by a single situation."

* "The Philosophy of the Short Story" by Brander Matthews.

ఈ వాక్యాలకూ ప్రస్తుతం కథలు వ్రాయబడే పద్ధతులకూ కొంచెం వ్యత్యాసం ఉన్నమాట నిజమే, కాని ఆ వ్యత్యాసం అంతచెప్పతగింది కాదు.

చిన్నకథలలో అనవసరమైన ప్రసంగం అధికంగా ఉండకూడదు. కథవ్రాస్తూ, లేకపోతే చెప్తూఉండి, అడ్డదారి తొక్కి చాలదూరంపోయి, కడాకు దారిగానక 'ఇంతా చెప్పవచ్చిం దేమిటంటే' నని అసలు రస్తా కోసరం తడుముకొనే కథకులు అపారంగా వుంటారు. కథను ఎందుకొరకు ఏవిషయాన్ని, అది సాంఘికం కానీయండి, రాచకీయం కానీయండి, సనాతనం కానీయండి, అధునాతనం కానీయండి, లేకపోతే డిటెక్టివు రకం కానీయండి, ఒకదాన్ని అల్లుతున్నామో, దానికి సంబంధించిందైనప్పటికీ అధికప్రసంగచేస్తే ఏం బాగుంటుందీ! ఇందుకనే Poe అనేఆయన ఇట్లన్నాడు;

"In the whole composition there should be no word written, of which the tendency, direct or indirect, is not to the one pre-established design.........The idea of the tale has been presented umblemished, because undisturbed; and this is an end unattainable here as in the poem; but undue length is yet to be avoided."

కథలు'brief' గాఉండవలెనని ఒక వాదము ఉంది. Brevity అంటే రామాయణాన్నంతా మూడు మాటలతో చెప్తారు, చూశారూ!'కట్టె కొట్టె, తెచ్చె' నని ఆలాగు కథంతా తెలిశిన వారికేమో బాగుంటుంది గాని తతిమ్మా వారికి ఏదో టెలిగ్రాఫిక్ కోడ్ మాటల మాదిరి ఉంటాయి. విషయన్నంతా చర్చించి, మారుమూలలనంతా శోధించి, పాత్రల స్వభావాన్ని పరిశీలనాదృష్టితో సువ్యక్తము చేసి వ్రాయాలంటే కథలో brevity ఉండడం చాలా కష్టం. కనుక కథ సాంగోపాంగంగా నడవ్వాలిసిందేకాని అనవసర ప్రసంగాలకు చోటివ్వకూడదని బ్రివిటీ పక్షులవాదం.

ఒకరు అన్నారు లెండి-

"Body and end of a short story is bone of the bone and blood of the blood of the begining"

అని. అట్లా ఒక కథను కనుక వ్రాస్తే అందులోనుంచి ఒక అక్షరాన్నిగాని, కడాకు ఒక కామా, ఫుల్ స్టాపను కూడా ముట్టుకోడానికి వీలుండదు.

ఎదేనా ఒక విషయాన్ని గురించి కథవ్రాయబూనుకున్న వాడు అంతా ఆలోచించి పాత్రముల నేర్పరుచుకొని మరీ వ్రాత కుపక్రమిస్తాడు. ప్రస్తుతం కొందరు కథకులు వ్రాసే కథలు మన మాసపత్రికలలో రెండు మూడు, నాలుగు, సంచికల కంటె కూడా ఎక్కువయ్యేవి ఉన్నాయనే విషయా న్నెవరూ కాదనలేరు. ఈ పద్ధతి మంచిదంటారా! ఇవాళగనుక కథను చేదివితే మరి పైనెలకేగా దాని తర్వాతి భాగాన్ని చదవగలగడం. ఇంతలో అసందర్భాలేవయనా వస్తే అసలేపోతుంది. నాటకశాలలో సీనుకు సీనుకు మధ్య విరామం ఎక్కువగా ఉంటే మనకు విసుగుపుట్టి నాటకాన్ని ఆనందించలేము. అందుములాన్నే నాటకం బాగలేదని కాదు. ఈ విరామకాలం విషతుల్యం. అట్లేకథల విషయంలోకూడా.

---

# ఆత్మకథ*

ఉభయ భాషాప్రవీణ తుమ్మల-సీతారామమూర్తి చౌదరిగారు

గాంధి మహాత్ముఁ డిట్లు చెప్పుచున్నాఁడు.

తే॥ బందరు దివాణమున మంత్రిపదవి నెడసి
న్యాయసభయందు సభ్య మర్యాద వడసి
నాకు నేడేండ్ల వయసున్ననాఁడు చేరె
రాజకోటకు నాతండ్రి తేజవెలయ

తే॥ అతఁడు నన్నప్పురంబునం దలరు నొక్క-
ప్రాథమికపాఠశాలకుఁ బంపె నందు
నాపఠించిన విద్యనెన్నంగఁదగు వి
శేష మొక్కటిలేదు యోచించిచూడ.

వ॥ అంతఁ గ్రమక్రమంబున నే నున్నతపాఠ
శాలకుం జేరితి, నప్పటికి నాకుఁ బండ్రెం
డేఁడుల యీడుండు, నక్కాలంబున.

క॥ బొంకాడి యెఱుఁగ నెన్నఁడు
జంకుదు సిగ్గెక్కుడగుట సంఘము దరి [యన్
బొంకపుఁ బొత్తమ్మొలె గా
కిం కెవ్వరు లేరు నాకు నించిన మిత్రుల్.

ఆ॥ ప్రక్కనున్నవాని పలకను దిలకించి
నకలు వ్రాయు టెఱుఁగ నొకదినంబు
గురుఁడు దీనిమప్ప దొరఁకొనెఁగాని నే
లొంగనైతి నిట్టి దొంగ పనికి.

ఆ॥ ఇట్టి దుర్గుణంబు లెన్నేనిఁ దద్గురు
నంటియుంట వింటిఁ గంటి గాని
యతని దెస మదీయ మగు వినయంబుతోఁ
జిన్నమంత యేని జెదర దయ్యె.

క॥ గురువుల యాదేశంబుల
శిరమున ధరియింతుఁగాని, చిత్తమ్మునఁ ద
చ్చరితంబులఁ దర్కించుట
యెఱుంగనేనాండు; నాకు నిది సాజమగున్.

ఆ॥ కన్నుఁ బ్రాము టెఱుఁగ నెన్నండు నొజ్జల
నీతిమాలి గురులచేత నొక్క-
మాట పడుటనాదు మతమునకు స్వప్వ
పట్టువడియె నాకు నిట్టినడత.

వ॥ కావుటం జేసి లాఁతి పొత్తమ్ములపైఁ
జిత్తంబు హత్తుకొన నీక పాఠ్యగ్రంథమ్ము
ల నిరంతరంబు వల్లించు వాఁడ; నిట్లయ్యు
నొక్కతఱి మజ్జనకసంపాదితంబు పితృ
భక్తిబోధకంబు నగు శ్రవణచరిత్రంబను
నాటకంబు పై నాకన్ను వడియె నంత
నద్దానిఁ దుదముట్ట నిట్టలంబగు నవధా
నంబు మెయిం జదివితి; నయ్యవసరంబునంద
బొమ్మలాటకాండ్రు కొందఱు మా మం
దిరంబునకుం వచ్చి,

* ఇయ్యది పద్యకావ్యముగా నా రచించు నాత్మకథ (ప్రథమభాగము)లోని "బాల్యము" అను ప్రకరణమునుండి యుద్ధృతము.

క॥ నేత్రోత్సవ కరములఁ బలు
చిత్రంబులఁ జూపిరందుఁ జీకుముసళ్లన్
మాత్రపితలఁగా వడి నిడి
యాత్రకుఁ గొని పోవు శ్రవణునాకృతిఁ [గంటిన్

క॥ ఈ చిత్తరు వాహృత్తము
నాచిత్తమునందు పెద్దనాటు కొనియె సా
రాచారుఁ డక్కుమారుఁడు
తోఁచెనునా కొజ్జ బంతితో నెన యగు [చున్.

చ॥ అతఁడు కథాపశిష్టుఁడయి
సట్టితటిన్ దలిదండ్రులార్తిమై
సుతుని దలంచుచు న్గడుపు
చుమ్మలువాఱుగఁ నేడ్చుగీత మ
చ్యుత మయినాస్మృతి న్నిలిచె
శోకము పైకొనుమాడ్కి నన్నుఁ ద
త్కృతి కరఁగించె, దాని గుఱుఁ
డిచ్చిన జంత్రము మీఁదఁబాడితిన్.

మ॥ సరిగా నత్తరుణంబునం దల హరి
శ్చంద్రావనీనాథు స
చ్చరితంబాడఁగ నొక్కనాట్యసభ, యు
త్సాహంబు దీపింప మ
ద్గురునాజ్ఞంగొని దానిఁగంటి; నదిగిం
గుర్వొప్పెడిన్ శ్రోత్రగ
హ్వరమం దిప్పటికేని ; దోఁచె నది నా
భావంబు సువ్యాప్తిగన్.

ఆ॥ ఆప్రదర్శనంబ ననిశంబుఁ దిలకింప
నిచ్చపొడమెఁగాని, యెన్నిసార్లు
జనకుఁడాజ్ఞనిచ్చు ? స్వాతంత్రమేపాటి
కలదునాకు ? ''దానిఁగాంచుటెట్లు''.

తే॥ అనితలఁచి వేళాకండుపాయంబులేమి
నాహృదయ రంగముందె తన్నాటకంబుఁ
గోటినార్లు ప్రదర్శించికొంటి నేన
నిసపమానంద సామ్రాజ్య నేత నగుచు.

క॥ నిత్యంబు హరిశ్చంద్ర
స్తుత్యపథం బూని గుణనిధుల్ జయపెట్టన్
సత్యంబు పల్కి జను లా
న్నత్యముఁ గనరాదె ? యని మనంబున [నెంతున్.

క॥ ఆ యనఘునిగతి సత్యముఁ
బాయక తద్ధర్మమూర్తిభంగి విపత్తుల్
మాయించు టొప్పను నభి
ప్రాయము న న్నావరించె బంధుర మగు [చున్.

---

# హీ రా సు ం ద రి

యనమండ్ర - సాంబశివరావుగారు బి.ఏ.

1653-వ సంవత్సర ప్రాంతమునం దౌరంగజీబు రెండవతూరి దక్కనుకు సుబేదారుగ నియమింపబడినాడు. ఔరంగబా దాతని యాస్థానమై యుండెడిది. మర్షి దుఖులీఖాను డాతని ప్రధానమంత్రియై రాజ్యాంగ విధానమున నౌరంగజీబునకుఁ బలువిధముల సహాయుఁడై యుండుటయేగాక మిక్కిలి నమ్మిన స్నేహితుఁడునుగూడ నై యుండెను. ఆ సమయమందే యౌరంగాబాదునకుఁ బోవుమార్గమునఁ గల భరణిపురరాజ్య ప్రతినిధిగ నౌరంగజీబు పినతల్లి పెనిమిటియగు సయూఫ్ ఖానుఁ డుద్యోగముఁ జేయుచున్నాడు. ఈతని జనానాయందు నవలావణ్యవతి యగు, ' హీరా ' యను పదునెనిమిదేండ్ల ప్రాయముగల దివ్య సుందరి యొకతె కలదు. ఈమె సయూఫ్ ఖానుని కుమార్తె యని కొందరు, నుంపుడుకత్తె కుమార్తెయని మఱికొందరును చెప్పుదురు. ఏదియెట్లున్నను, హీరామాత్రముసయూఫ్ ఖానుని భార్యవలనఁ గడుపునఁ గన్నబిడ్డకన్న నెక్కుడుగ బెంపబడుచుండెడిది. హీరా తపతీ నదీతీరమునఁ గల 'జైనబాడి' యను పట్టణమునఁ జనన మొందిన కారణమున, నాటి యక్బరు శాసనముప్రకార మూమెకు 'జైనాబాడి' యను నామ మొసంగబడియెను; 'హీరా' యనునది యామె ముద్దులపేరు. సౌజన్య, సౌకుమార్య, సౌందర్య ప్రభృతి లలితగుణాలాలసయగు హీ రా పు ష్ప ము సయూఫ్ ఖానుని హృదయానురాగ కటాక్ష వీక్షణలచే సహస్రగతులఁ బెంపఁబడి యుండుటచేత నామె కంపురించిన యంద మూహ్యమే కాని వర్ణింప నలవి కాదు.

పినతల్లి యాహ్వానము సంప్రీతితో నంగీకరింపుచు నౌరంగజీ బౌరంగాబాదునకుఁ బ్రతినిధిగ నేగుతఱి, దక్కు సిబ్బందితో భరణి పురమునకు వేంచేసెను. ఢిల్లీ పాదుషాహి కుమారుఁడునుఁ బ్రస్తుత మొకరాష్ట్రప్రతినిధియు, వేఱుగఁదోబుట్టువు తనయుఁడు నగు నౌరంగజీబు, పాదస్పర్శచేఁ దన గృహమును, బవిత్ర మొనర్ప రానున్న, సయూఫ్ ఖానుని భార్య యెంతయు వేడ్క సన్నాహములఁ గావించినది. పినతల్లిగృహమునకే పోవుచుండుటచేఁ గాబోలు,జనానా నియమముల నిర్లక్ష్యించుచు, సంభ్రమమాలికయమున, తిన్నగ యంతఃపురమునకే వెడలినాఁ డీ యువరాజు. ఆమెమహలుఁ జేరులోపున, నడుమ నొక సుందరమై, ప్రకృతిబాల నూయల నూపు యుద్యానవన మొకటి కలదు. అందు ఋతు వివక్షతను బట్టి పూచి ఫలించు వృక్షరాజము లుండుటచే, సర్వకాలములయం దావనము వనలక్ష్మీ తాండవనిలయమై యుండెను.

యచ్చటి లతామండపములు, సూర్యరశ్మిని ప్రతిబింబించుచు జిగుళ్లఁ ధరించుచు, వేవేగఁదో డ్తెంచు మలయమారుతమును గొఁగిళ్ల నింపి భారముచే శిరస్సుల వ్రాల్చుచు నూతన యౌవనశోభను ప్రకాశించు నవ్రోఢలో యనునట్లు,ముద్దుల మూటలై, నీటుల నిగ్గులై, రత్నాలరాసులై,విరాజిల్లుచున్నవి. ఒక్కచో రత్నఖచితమై, సువర్ణమయమై, చంద్ర కాంతశిలానిర్మితమగు కుడ్య కోటీరములచే శోభిల్లు సరోవర మొకటి; అందు నడుమనున్న గాజుజలయంత్రమునందు కుముదినీకాంతలు మిన్నంటిన తమప్రియుని ప్రతిబింబమును గాంచుచు, భ్రమపడి, యాతని జేరఁబోవ నుత్సహింపుచున్నట్లు సరోవర సంచలనముచే నిటునటు నూగీస లాడుచున్నవి. తారా నాథుఁడు దర్శనీయములగు నా కుముదముల సంయోగముఁ గోరి, దినరా జేంబరవీథిని నడయాడువేళ నెచ్చటనో నక్కి, యాతఁడు పశ్చిమాద్రిని గ్రుంకుతతి, వేవేగ నిండు కళలతోఁ బ్రత్యక్షుడై, నర్మాలాపంబులఁ బెరయు దరహాసంబులచేఁ దనకోర్కె వారికి వెల్లడించినట్లుండెను. కుముదములును దమ యాప్తుని వియోగబాధకుఁ గలఁగి ముకుళిత ముఖులై వెలవెలబోయి, తమ్మర్థించు నిశా రాజేన కాహ్వానమీయక యుండ, నాతనికిఁ గల్గిన విరహబాధ యశ్రురూపమున వెల్లు వలై పాఱి,మేఘమండలమును వీడి, మారు తముచేఁ దాకఁబడి బిందురూపమున నచ్చోట లేఁబసరున వ్రాలి యా ప్రదేశమంతటిని శీతలం బొనర్చెను. అట్టిసమయమున నా యుద్యానవన మార్గముల బాటులు తీర్చి యున్న గంధపుజెట్టు లొకదానినొకటి రాపి డియై తీయని గంధపుఁ బొడిని రాల్చుచు, నా దారుల వెంబడి నేగు యౌరంగజేబ కుమా రుని యంగమునఁ బూఁతపూసెను. ఆ ప్రదేశము వసంతమందిరము; దాని ప్రాకా రములనడుమఁ బ్రకృతిరమణి భావనాపురు షునితో నెల్ల సమయములఁ గ్రీడించుచుం డును; వనస్పతియు నీశ్వర ధ్యానమున నే కాంత సేవఁ జేయుచుండును; బాల్యము క్రేళ్లు రుకును; యౌవనము వెంపొందును; ముదిమి చిగుర్చును. ఇట్టి ప్రకృతిమాతృక నిలయమున కేగు తనయు లనురాగ,మోహాపరవశులగుదు రనుటలో నతిశయోక్తి యేమి కలదు? నిరుపమాన సౌందర్యరాశియగు నౌరంగజేబు నీ యుద్యానవన సౌందర్య మెంతయు వికలచిత్తునిఁ జేసెను. అదే క్షణమున నాయు ద్యానవనోపరిభాగముననుండి మనోవికాస స్ఫురణైకమధురగీతి యొకటి, మానవతీ మానసతరంగములనుండి స్రవించుచు, నౌరంగజేబు హృదయతీరమును వేవేగ తాఁకెనెను. సమయాసమయ విచక్షత వీడి పరవశత్వమున, నంతఃపురమనియు, యువతీ విలాసక్రీడా ప్రదేశమనియు,యోచింపక,యీ తురుష్క రాజకుమారు డా కంఠస్వరము విన నగు దిక్కు ననుసరించియే శరవేగమున

నేగినాడు. పోఁబోన నొక విశాల రసాల చ్ఛాయ సమర్పఁబడిన రతనాలపలకలతిన్నెపై నధివేష్ఠించియున్న హీరాసుందరిని నివ్వెరపు జూడ్కులతోఁ జూచినాడతఁడు; ఆమె, హస్త మునఁ గొఱంతఁగల్గిన మల్లెదండను గ్రుచ్చు చు, నేమరుపాటునఁ బ్రణయగీతికలఁ బాడుచు న్నది. అదే తొలిసారి యౌరంగజీ బామెను చూచుట. తొలిచూడ్కులే యాతని నామె యధీనను గావించినవి. శిలాప్రతిమమాడ్కి జేష్టల దక్కియున్నాడాతఁడు. నిమిషమాత్ర మున, హీరా సౌందర్యాతిశయ లక్షణమునకు నీగి, చైతన్యము వీడ, యాతనిమేను కుంభిని వ్రాలెను. ఆహా! యువకులకు యువతీ సందర్శనభాగ్యము దుర్భరము కానోపు!

2

నూతన యౌవనపురుషావలోకనము హీరాసుందరికిఁ గొంత గగుర్పాటును, భయ కంపమునుఁ గలుగఁజేసినది. ఇందు మిశ్రి తమై కనుకొనలందు జొత్తిలుచున్నది నును గారుసిగ్గు. హృదయమును దుర్భరముగ వేధించుచున్నది మోహము. అది ప్రేమయా? ఔరంగజీబునుఁ జూచినదై హీరాయుఁ దడవున నాతని సేద దేర్చ నుత్సహించియు లజ్జపడి, రివ్వున సయూఫ్ఖానుని భార్య చెంతఁజేరి 'అమ్మా! నవరత్నఖచిత కిరీట ధారియు, శ్వేతాంబరధరుడును, భానుకోటి ప్రభాభాసమాన స్వరూపుఁడు నగు పురుషు డొకడు మన యంతఃపురోద్యానవనవాటి కను మూర్ఛఁ జెందియున్నాడు,'' అని చెప్పెను. వృద్ధయైన యౌరంగజీబు పినతల్లి, ఆ పురుషు నౌరంగజీబుగ నెఱిఁగి, పరివార సమేతయై నచ్చోటకుఁ జని, ఔరంగజీబును గాంచి, వ్యాధిగ్రస్తుడై యుండె నను భ్రమచే రోదనముచేయుచు, నాతని శిరమునెత్తి సకల శీతలోపచారములఁ జేసినది. కొంతవడి నౌరం గజీబు స్మృతి దేరినాడు. పినతల్లి హృదయ నాడి సంతోషవీచికలఁ దేలుచుండెను. ఆతనిఁ గాంచియు నామె

"తండ్రీ! ఇ దేటివింత! నీవుమూర్ఛిల్లఁ గారణమేమి? వ్యాధియా?'' యని ప్రశ్నిం చెను.

ఔరం:—'పిన్నీ! నాకు నిజముగ వ్యా ధియే; చికిత్సఁ జేయించెదవా'?

పిన్ని:—తప్పక చేయించెదను, ఎట్టిదా వ్యాధి?

ఔరం:—'పిన్ని! అయ్యో దీ యుద్యాన వనమందలిగల కుసుమ పరిమళముచే నంకు రంచినది. తప్పక వ్యాధిని వారింపఁజే తువా? నేను రారాజువంటివాఁడను. జవ దాఁటవలదు సుమా!

పిన్ని:—'కుమారా! నా యాన గలదు. త్వరగఁ జెప్పుము.'

ఔరంగ:—'పిన్నీ! ఇంతదనుక నా చ లువరాతి తిన్నెసధిష్ఠించియున్న స్త్రీకుసుమ మే లతాశిరీషము? అద్దాని నాకిరీటమున గ్రుచ్చినఁగాని నా ప్రాణము నిలువదుసుమా!'

పినతల్లి యీ పలుకులు వినుటతోడనే విస్మితహృదయ యయ్యెను. భయ విభ్రమములఁ గనుల వెంబడిఁ జిమ్ముచు నామె 'ఆ కుసుమము హీరాసుందరి' యనెను.

ఔరం:—'పిన్నీ! హీరా నావ్యాధి నివారణఁ జేయఁగలదు. పృథ్విపై మరి యే వైద్యుఁడునునాకు నెమ్మది నొసఁగఁజాలఁడు. చేయింపఁగలవా? హీరా నా హస్తనాడిని బరిశీలించి, హృదయవేదన నరసి, పాత్రనింపి యౌషధీసుధ నొసగిన నేను జీవింపగలను. లేనియెడల నీపాదముల కడనె'... ...

పిన్ని:—సాహసము వలదు తండ్రి! హీరా నీ వ్యాధి నివారించుట నాకును సమ్మతమే. కాని, సయూఫ్ ఖాను మాత్రము మూర్ఖుఁడు, కిరాతుఁడు. షాజహాను చక్రవర్తి యన్నను, నీవన్నను, జులకనగ జూచును. హీ రా యం ద లి నీయనురాగవృత్తాంత మాతఁడెఱిఁగిన మా ఇరువుర ప్రాణములనాతకు హరించును, గాన నీకోరిక నిర్వ 'హింప నశక్తురాలను. అన్యథా తలంపకుము.'

ఔరం:—'పిన్నీ! నీవు నిజముఁదెల్పితివి. వేఱుమార్గమున నే నామెను వివాహమాడ దను లే'!

పినతల్లి హృదయము ఝల్లు మనియెను.

3

ఔరంగజీబు విడసిన దివ్యభవనపుఁజావడి యం దౌరంగజీబును, దివాను వజీరుఖానుఁ దును సంభాషించుచుండిరి.

ఔరం:—'వజీర్! సయూఫ్ ఖానునొద్ద కేగి, నేను హీరానుజేపట్టఁ దలచితిననియు, దీని కెట్టి ప్రతిబంధకమును నేను సహింపననియు నెఱిఁగించిరమ్ము.'

వజీర్:—'చిత్తము; ఆతడు సమ్మతింపనియెడల నాతనిఁ జెగటార్చి వత్తును, అనుజ్ఞ.'

ఔరం:—'వలదు, వలదు, క్రౌర్యము వలదు. ప్రేమవాహినికి నంతరాయము లుండవు; ఆతడు నిర్లక్ష్యించిన, వేఱుమార్గ మున్నది. కాని ఆతనికెట్టి హానియుఁ జేయ వలదు'.

వజీరు:—'ప్రభూ! శీఘ్రమ నే శుభవార్తఁ దెల్పెద' ననుచు నాతడచ్చోటు బాసెను.

హీరానుగాంచి, ఎట్లైన నామెతోఁ దన మనోవాంఛ విన్నవింప నుంకించి, సమ్మతిఁ బడయఁగోరు నౌరంగజీబంతఃపుష్పోద్యాన వనమునఁ బ్రవేశించినాడు. ఎప్పటివలెనే హీరా చలువఱాతి తిన్నెపై కూర్చునియున్నది. వెనుకనుండి, యౌరంగజీబు పావుర మొకదానిని హీరాపై గుఱిఁబెట్టి విసర నద్దియు బోయి యామె భుజముపై వ్రాల, సగము విడివడిన మేల్ముసుఁగంతయు బూర్తిగ జారెను. ఆమె త్రుళ్లిపడి వెనుదిరిగి, జూచునంత నౌరంగజీబు ప్రత్యక్షమాయెను. పోవ నున్నను వీలులేనట్టి స్థితియందు హీరా చిక్కు వడెను. అచ్చోట నే నిలచి ముసుఁగుదిద్ది, మోము వ్రాల్చి యున్న దామె. అంట నౌరంగజీబు,

'హీరా !' యని పిలచెను.

నూతన పురుషుడామె నామము నుచ్చరించుటచే శరీర మొకవిధమైన చలనమునకు లోనైనది. కాని, యామె మాఱు పల్కలేదు.

'హీ ... ... రా!'

'... ... ...'

'హీరా!'

'... ... ...'

'హీరాసుందరీ!'

హీరా:—'ఎవరది'.

ఔరం:—'నన్నెఱుంగవా'?

హీరా:—'ఉఁ ఊఁ'.

ఔరం:—'పురుషుఁడను'

హీరా:—(చిరునగవునను,చిఱుత కోపమునను) 'అట్లనా! పురుషులైన స్త్రీల శుద్ధాంతమేల జొత్తురు.

ఔరం:—(ఉల్లాసముతో)'అంతఃపురము' జేరకముందు నేను స్త్రీనైతిని.

హీరా:—'అదెట్లు?'

ఔరం:—' తెల్పెదఁ గాని—హీరా ! చూచితివా; అదిగో ఇటు! ఆ జలయంత్రము-ఆహా, ఎట్లునీటినిఁ గనయుచున్నదో! చూడు, ఆ శిఖరమెట్లు నాకాశకాంతను జుంబనముఁ జేయుచున్నదో! చూచితివా ? ఆ చంద్రుని ప్రతిబింబ మీ సరోవరకాంత యొడియందెట్లూయల లూగుచుండెనో ! కాదా ! హీరా ! ఏమనియెదవు, హీరా !

హీరా:—(కన్నులు మూసుకొని) 'నేఁబోయెదను'.

ఔరం:—'నా జీవముఁ గొనిపొమ్ము'

హీరా పోఁ బోవును.

ఔరం:—'పోయెదవా హీరా ! ఢిల్లీపాదుషా కుమారుని నిర్లక్షింతువా'.

హీరా:—' అట్లైన మీ ఔరంగజీబు నామధేయులా?'

ఔరం:—'ఔను.ప్రస్తుతము నీదాసుఁడైనా డాతఁడు.

హీరా కనులు మూసికొని, 'ప్రేమకు గొప్ప, కొద్ది యను వివక్షత లేదు కదా !' ఢిల్లీ పాదుషా తనయుఁడేడ, అన్యథా శరణార్థినై యున్న నేనేడ? ఆతఁడు నన్ను వలచుటేడ! హా దైవమా!ఔరంగజీబునకై నా ప్రాణముల నర్పింతును, నీవే నాసాక్షివి. (పైకి) 'అయ్యా ! నే జేయునదేమి'? నేనెందులకు నసమర్థురాలను. క్షమింపుము.'

ఔరం:—.ఈలోపున నేను మరణింతునేమో'.

హీరా:—(త్రుళ్లిపడి) 'అయ్యో ! ఔరంగజీబ్ ! నీవు మరణింపవలదు. నే జీవింపఁజాలను'.

ఔరం:—'అట్లైనఁ బాణిగ్రహణ మొనర్పుము'.

హీరా:—'అందులకు సయూఫ్‌ఖానునను జ్ఞ కావలయును. మన వివాహమున కాతఁడీయకొనఁడు. నాయాశవీడి పొమ్మనుచు

హీరా,రివ్వునఁ బిట్టవలె జనానాలోని కేగెను.

'హీరా ! హీరా'!

5

హీరా:—' అమ్మా ! భవనమున హర్ష సన్నాహములకుఁ గారణ మేమై యుండును'.

సయూఫ్ భార్య:—' ఆమ్మా ! నూతన బంధు వెవ్వరో నిన్ను వివాహమాడ నుండెనని సయూఫ్ ఖాను వా_ర్తనం పెను.

హీరా:—'ఆతఁ డౌరంగజేబగునా' ?

సయూఫ్ భార్య: — 'అదెద్దియు నాకుఁ దెలియదు. నిరంకుశుడగు సయూఫ్ని యాజ్ఞ యనుల్లంఘ్యము గాన, నవ్విషయ మెద్దియుఁ దెలియక యే నిన్ను ముస్తాబుఁ జేయుచుంటిని.'

హీరా కనుల వెంటఁ గన్నీరు ప్రవహించెను. తనకుఁ గాబోవు భ_ర్త యెవ్వరైనదియుఁ దెలియరాని యీ ఘోరాస్థాన పంజరమున శారికనై_తినిగా' యని వగచుచు 'ఔరంగజేబు నా ప్రియుఁడు కానియెడలఁ ప్రాణముల విడచెద'నని నిశ్చయించి పెండ్లి దుస్తులలో నొక క_త్తిని దాఁచి యుంచినది. వివాహసమయమున హీరా హృదయము హాలాహలము ప్రమింగనట్లున్నది. ఔరంగజేబుకాక పరపురుషుఁడు తన్ను స్వీకరించునేమో యనెడి భీతి హృదయనాళముల నంటెను. కాని దైవమామె పవిత్ర ప్రేమ తరంగములపట్ల ననుకూలుడై యుండి యౌరంగజేబు నామెపతిగాఁ జేసెను.

తన నిలువున నొక మాలతీమాల ధరించి, యౌరంగజేబు హీరాను సమీపించి, మాల నామె కంఠసీమనలంకరింప దాని నిరుకొనల నిర్వురు నిలచియుండిరి. నెమళ్లు పురులవిప్పి నాట్యమాడుచు 'ప్రేమ విశ్వకళ్యాణ దాయిని' యని ప్రేంకారముల నొనర్చుచున్నవి. ఆ నాటనుండియు హీరా, యౌరంగజేబు హృదయవేదిక నలంకరింపుచు సౌభాగ్యవతియై యుండెను. సయూఫ్ ఖానుతో వజీరు గావించిన యొడంబడి ప్రకారము ఔరంగజేబు తన జనానాయందలి చాతురీభాయిని సయూఫ్న కర్పించెను.



# ద్వీపాంతర వాసము

ఆవంత్స వేంకట రంగారావుగారు, బి. ఏ. బి. ఇడి.

అదిగో ! శ్రీసతీ పూత లాక్షార్ద్రపాద
చక్రచిహ్నిత సురనదీసైకతంబు,
అదిగో ! సురసౌరభేయీ మహానినాద
ముఖర మందారవృక్షసమూహ సీమ,
అదిగో ! చంపక పారిజాతాది గంధ
గానమధురిమోద్గారి ప్రసూనభూమి.

ఆ పవిత్ర ప్రదేశ విహారమెడలి
ఆ విశాల ప్రదేశ వాహ్యాళిఁ దొలఁగి,
జన్మపర్యంత కఠినశిక్షలను బొంద
మృత్తికా భిత్తికాది నిర్మితనిబంధ
నాలయంబుల, నిచట, ద్వీపాంతరమున
నేను యుగములనుండి బంధితుఁడ నైతి.

నిన్నుఁగనఁ జేయు విద్యల మిన్నయంచుఁ
గవితఁ జెప్పంగ నేర్చితిఁ గాంక్షతోడ,
అధికతరతాప శుష్క దేహమ్ము క్రీల
ధరణి రజమునఁనిండు పాదములు నొవ్వ
నెన్ని సోపాన పంక్తులో యెక్కి యెక్కి
చంద్రశాలలను గని చేయిఁ జాపినాడ.

అందికొనవయ్య ! తండ్రి ! నీ యంకమునకు
జనక పరిచిత వదనదర్శనము లేక
యీ సుదూర దేశమ్మున నేడ్చుచున్న
నన్నుఁబోలిన శిక్షితులున్న వారు-
వారలం గూడ నాతోడ వరములొసఁగి
అందికొనవయ్యం! తండ్రి! నీయంకమునకు.

# రాత్రి కూలీ

మలపాక వేంకటాచలపతిగారు, బి. ఏ. (ఆనర్సు.)

(అనువాదము.)

[ఒక గనిప్రదేశము. సమయం ప్రాతఃకాలము. రాముడి గుడిసెలో, జానకి- అతని భార్య, అంతకు మునుపే పుట్టిన బిడ్డతో పడుకుని ఉంటుంది. కాంతమ్మ - రాముడితల్లి, పురిటిగది గుమ్మందగ్గర నిలబడి పొరుగింట మహంకాళితో మాట్లాడుతూ ఉంటుంది.]

కాంతమ్మ:—నాకొడుకు! అమ్మో... స్స, జానకి వింటే యింకేముంది? నిజమే నమ్మా మహంకాళీ?

మహంకాళి:—నిజమే తల్లీ, అబద్ధమాడుతానా? గనిలోనించి ఒక్కడు కూడా పైకి రాలేదన్నారు.

కాం:—అమ్మ నా కొడుకో ... ... ... జానకి వింటే అదీ పిల్లాడూ కూడా దక్కరు.

మ:—ఎప్పుడో ఒకప్పుడు వినక తప్పుతుందా?

కాం:—రాత్రి తెల్లవారులు జానకికి నిద్రలేదు. నిద్రపోతోంది, లేపి ఎల్లాగ చెప్పను? తర్వాత చెప్పక తప్పకపోతే చెప్పదాం ఏం జేస్తాం?

మహం:— తప్పదనే నా నమ్మకం... రాత్రి పడుకున్నాం. తెల్లవారే ముందు దబ్బుమని పెద్ద చప్పుడయింది. లేచిన పిల్లల్ని పడుకోపెట్టడానికని నే నాగి పోయాను. మా యింటాయన ఏమిటో చూతా మని వెళ్లాడు. నా అదృష్టము మూలాన మా ఆయనకి పగలుపని అయింది. లేకపోతే ... ... ఈ సంగతి నీతో చెప్పదామని వచ్చా. పాలెంవాళ్లంతా అక్కడే ఉన్నారు. ఏమి జరుగుతోందో చూసివస్తా.

[మహంకాళి నిష్క్రమణం]

కాంతమ్మ:—రాముడూ, కొడుకా!... ... పైకి ఏడవడానికేనా వీలులేదు, లోపల లోపల కుమిని చావవలసినదే. నేనుకూడా వెళ్లిచూస్తే బాగుండును. కాని ఎల్లాగ యీ బాలింతరాలిని వదిలి వెళ్లటం. ఇంకా ఏం కొడుకు ... ... ...

జానకి:—[మెలకువ వచ్చి] ఆయన వచ్చాడా?

కాం:—రాలేదు.

జా:—పైమంతయింది?

కాం:—పైమా ... ... [గడియారం దగ్గరకి వెళ్లీ పెండ్యులం పట్టుకుని ఆపేసి] గడియారం ఆగిపోయింది.

జా:—ఏమిటో నిద్రలో 'టిక్ టిక్' అని విన్నట్లుంది ... ... తెల్లవారినట్లుందే. ఇంక వస్తూంటారు. మగపిల్లవాడు పుట్టాడంటే ఎంతసంతోషం ఆయనకి? కొడుకు పుట్టాడని వినగానే అయన మొహం మెల్లా

ఉంటుందో చూడాలి, నువ్వు చెప్ప కేం అత్తా ?

కాం:—ఎవ్వరూ చెప్పరమ్మా జానకీ, మాట్లాడక పడుకుందూ.

జా:—ఆయన వచ్చేవరకు పడుకుంటాను. ... ...ఏమి టా టిక్ టిక్.

కాం:—ఏమీ లేదు.

జా:—(మత్తుతో) గడియారం గావును.

కాం:—గడియారం ఆగిపోయింది.

జా:—ఏమిటో 'టిక్ టిక్' మంటోంది. నిద్రమత్తులో అల్లా అనిపిస్తోందేమో. ఆయన రాగానే లేపుతావా ? మరిచిపోతావా ?

కాం:—మరిచిపోనమ్మా తల్లీ, పడుకో.

జా:—(కళ్లుమూసుకుని) అదిగో, టిక్ టిక్ మంటోంది. (నిద్రపోవును.)

కాం.—ఇంటికి రాగానే లేపుతానూ ? ఎవరు యింటికి రాగానే లేపుతాను? ఒకవేళ యిప్పుడే చెప్పేస్తే ? ... ...ఎల్లా చెప్పనూ ... ...ఏమో వస్తాడేమో ఎవరు చెప్ప గలరు? "ఇంటికి రాగానే లేపు;ఈసరికి వస్తూం టారు" అన్నది. దాని సౌభాగ్యంవల్ల రాకూ డదూ ?... చెవులు గింగురు మంటున్నాయి, ఏమీ వినపడదు.

జా:—(చటుక్కున లేచి కూర్చుని) విను అత్తా, అదిగో, టిక్ టిక్ ఎవళ్లో తలుపు కొట్టుతున్నారు.

కాం:—జానకీ, ఏమీ లేదు, కలవరిస్తు న్నావా ? పడుకో.

జా:—అదేమిటి 'టిక్, టిక్, టిక్' ... ...ఏమిటో చీకటికొట్లో నడుస్తోన్నట్లు భూమి విరిగి మీదపడినట్లు అనిపించింది. నల్లటి రాళ్లు నన్ను అణిచేసినట్లుగా ఉంది. (పడుకుంటుంది.)

కాం.—ఏమీ లేదమ్మా తల్లీ. నీ మంచ మమీదే పిల్లవాడి పక్కనే పడుకున్నావు.

జా:—(అర్ధనిద్రలో) టిక్, టిక్. ఎవళ్లో తలుపు కొడుతున్నారు. (నిద్రపోవును)

కాం:—నా కేమీ వినబడటం లేదు. ఏమీ దానికేమైనా తెలుస్తోందేమో ?

జా:—(చటుక్కున లేచి) ఎవరా చప్పుడు ఊరికే. నిద్రపట్టనివ్వరు. వా ళ్లెవరో్నే లోప లికి రానిచ్చి ఆ చప్పుడాపరాదూ ?... ... ఎక్కడికో దించుకుపోతున్నట్లుంది. ... ... అదిగో మళ్లా టిక్, టిక్. (నిద్రపోతుంది)

కాం:—దాని కళ్లెదుర అన్నీ కనపడు తున్నాయిగావును ... అయ్యో దేముడా! ఎంతపని జేశావురా, రాముడూ!—కొడు కా! ...

జా:—(నిద్రలో లేచి) ఎవరా చప్పుడు? (మరల పండుకొనును)

కాం:—పడుకున్నది. నిద్రపట్టితే బాగుం డును.

జా:(లేచి) చిట్టీ! మీనాన్న వస్తాడులే... రాలేదండీ అత్తా ?

కాం:—కాదమ్మా !

జా:—టైమెంతయింది ?

కాం: ... గడియారం ఆగిపోయింది.

జా:——యింత వెలుగు వచ్చింది, యింకా రాలేదేమి ?

కాం:——వెలుగు రాలేదమ్మా, చీకటి కోణంగా ఉంది. నువ్వు మాట్లాడక పడుకో తల్లీ !

జా:——వెలుగువస్తేనే, అత్తా.

కాం:——లేదు. చీకటికోణం అంధకార మయం.

జా:——అయితే మళ్లా పడుకుంటాను ... ...(నిద్రతో) లేపుతారు గదూ.

కాం:——(కుంపటివద్దర కూర్చుని) అంధ కారమయం, చీకటికోణం, అంతా చీకటి, చీకటి. (నెమ్మదిగా) రాముడూ కొడుకా! (ముందరికి పడిపోవును.)

మహంకాళి:——(ప్రవేశించి) కాంతమ్మా! ... ...ఎక్కడా కనబడదే. అమ్మయ్యో, పడిపోయాను. మూర్ఛపోయినట్లుందే ! లీలా ! (లీల, కూతురు, వచ్చును.) చచ్చి పోయినట్లుందే గుండె బద్దలయి చచ్చిందే.

లీల:——గడియారం ఆగిపోయింది.

మహం:——జానకి ఏమిచేస్తోందో చూడు.

లీల:——నిద్రపోతోంది.

మహం:——అయ్యో ! జానకీ ! నీ కెంత కష్టంవచ్చిందే బిడ్డా !

లీల:——పిల్లాడు చూడమ్మా - ఎంత అందంగా ఉన్నాడే!

["కూడు: కూలి" నుండి.]



# చాటు వాక్యములు

కవిశాబ్దిక జయంతి పట్టాభి రామశాస్త్రిగారు

(సంస్కృతమునుండి అనువాదము.)

చ. అరయగ నెన్ని లేవు సలిలాకరముల్ విచలన్మరాళ సం
భరితము లబ్జషండ పరిభాసురముల్ మఱి యేమి సత్ఫలం
బరిమురిఁ గోరి చాతకము లాస్థమెయిన్ సహవజ్రపాత నూ
సురపతి నూత్నవారియెడఁ జూడ్కు లలర్చి చరింపనున్నవో ?

చ. కనిన ఫలం బదేమి, పలు కార్లు గనుం గద సూకరంబు తాఁ
గనినపుడెల్లఁ బుత్రశతకంబుఁగనుం గడు దుర్భగంబువే
గనదు కనం దలంచినను క్ష్మాధవకోటికిరీటలాలనీ
యుని సుతు నొక్కనిం గను నుదూఢబలుం గజయోష భూస్థలిన్.

గీ. పెద్దలగు తండ్రు లెనసి జీవించియుండఁ
గ్రొత్తగా భార్య మదిఁ దళుకొత్తియుండఁ
బిలిచి పెట్టెడు తల్లులు వెలయుచుండ
మంచి దివసంబు లవి గతియించె మనకు.

చ. అనుదినమందు శీతసలిలాభిషవంబు బహిర్వితర్దులం
దున శయనంబు గాక బహుదూరము పాదచరత్వ మిన్నియు
న్నను వెతయే ప్రవాసి కల నాతిమెలంగియుఁ బ్రహ్మచర్యముం
దనుప నశక్య మౌను గద! దాని నెఱింగి యనుజ్ఞ నిమ్మఁకన్.

చ. సరసిజగర్భు మ్రొక్కినను సారసలోచను మ్రొక్కినన్ మనో
జరిపుని ఫాలలోచనుని సారెకు మ్రొక్కిన లాభ మేమి ? ని
ర్భర భుజయుగ్మ సంకషదభంగురవృద్ధి కుచత్రుటద న్మృదూ
త్తరవసనంబు కామినుల దర్పితయౌవనము న్నుతింపు డీ !

—

# స హ న ము

## ఇందుకూరి సత్యనారాయణరాజుగారు

రామనాథం:—వయస్సు 28 సంవత్సరాలు

విశ్వనాథం:— ,, 17 సం॥ రామ [నాథంతమ్ముడు

సుందయ్య:— ,, 55 సం॥ పూజారి, ఆయుర్వేదవైద్యుడు.

రాజ్యం:— ,, 20 సం॥ రామ [నాథం భార్య.

చిట్టి:— ,, 4 సం॥ రామ [నాథం కూతురు.

స్థలం:—పరమశ్రితం అనే పల్లెటూరు ; కాలం—1933 సం॥ మే నెలలో ఒకనాటి ఉదయం 10 గంటలు మొదలు సాయంకాలం 7 గంటలవరకు.

[పూజారి సుందయ్యగారి యిల్లు. లోపల హాలులో చిన్న అరుగుమీది దళసరిగా అల్లిన తాటాకుల చాప ఉంటుంది. ఒకమూల కల్వంలో మందు నూరుతూ ఉంటాడు. పాలేరు. ఒకప్రక్క కలబంద మట్టలు, ఏవో వేళ్లు వగయిరాలు చిందరవందరగా పడి వుంటాయి. సుందయ్యగారు ఓ చిన్నగావంచా కట్టుకొని, పైన అంగవస్త్రం వేసుకొని, పాత ఆంధ్రపత్రిక నుచించి, చాకుతో పొట్లాల్కి పనికి వచ్చేటట్టు కోస్తూవుంటాడు. అప్పుడు విశ్వనాథం తొందరగా లోపలికి ప్రవేశిస్తాడు.]

విశ్వనాథం:

సుందయ్యగారు! మీరు యిప్పుడు మా యింటికి ఒకసారి రావాలి. మా అన్నయ్యకూతురు చిట్టికి రెండు మూడు రోజులనించి జ్వరం వస్తోంది. ఈవేళ చాలా హెచ్చుగాఉంది. మంచంమీద యిటూ ఆటూ దొర్లుతూ, కాళ్లా, వేళ్లా, కొట్టుకొంటోంది. మా అన్నయ్య వూళ్లో లేదండి. ఒక్కసారి మా యింటికి దయ చేయాలి. పిల్లని జూచి చక్కా వచ్చేద్దురు కాని.

సుందయ్య-

విశ్వనాథం! అట్లా చాపమీద కూర్చో!

విస్వనాథం:

చిత్తం. [అంటూ చాపమీద కూర్చుంటాడు]

సుందయ్య:

అబ్బా! యిప్పుడే అలా వూళ్లోకి వెళ్లి తిరిగివచ్చానోయి! గొట్టుముక్కలవారి అబ్బాయి దగ్గులో బాధ పడుతూవుంటే చూడ్డానికి రావలసినదని కబురు వచ్చింది. అక్కడికి వెళ్లాను. దార్లో సూరయ్య కాపుగారు కన్పించి, వాళ్ల మరదలికి సుస్తీగావుంది, యింటికి రావలసినదని కోరితే, అక్కడికివెళ్లి చూచి వస్తూ, ఒక్కసారి కరణంగారి యింటికి వారి దర్శనం చేద్దామని లోపలికి వెళ్లాను. అక్కడ వారు కనుపించి వదిలారుకారు. చాలసేపటికి - వారి అల్లుడ్కి పట్నంలో ఏదో పెద్దపని వచ్చిందనీ, వచ్చే సంక్రాంతికి తీసుకువస్తా మని, ఏవో కబుర్లుచెప్పి ఆలస్యం చేశారు. ఒక్కనిమిషం కూడా తీరుబడిలేక చచ్చిపోతున్నానోయి! చూడు-అలా-ఆ నూరే మందును, మధ్యాన్నం తప్పకుండా పుటంవేయాలి. లేకపోతే, అది అంతా

వృథా అయిపోతుంది. అప్పుడే పదకొండు గంటలు కావచ్చినట్లు వుంది. చూరుక్రింద నీడ కరివేపాకు మొక్కదగ్గరకు వచ్చేసింది. స్నానంచేసి గుళ్లో, దేముడికి నైవేద్యం వగయిరాలు నెరవేర్చాలి.కొంచెం తాళి వస్తాను. వెళ్లు, బాబూ!

విశ్వనాథం:

అట్లాకాదండి. దయచేసి మీరు యిప్పుడేరానాలి. మా వదినెకు చాలా కంగరుగా వుంది. మీరు వచ్చి మా అమ్మణ్ణిం చూస్తే, కొంచెం ధైర్యంగా వుంటుంది.

సుందయ్య:

అబ్బాయీ! అలా ఆదుర్దా పడితే ఏలాగు? జ్వరం వచ్చేటప్పటికే యింత గాబరా! కొంచెం యింగ్లీషు చదువుకున్నవాళ్లు కూడాను. పసుమర్తి వారి పాపాయికి పదిరోజులనుంచి జబ్బుగా వున్నా, కంగారుపడకుండా, నాచేత వైద్యం చేయించుకొంటున్నారు. కంగారుపడితే పనులవుతాయా? వెళ్లు బాబూ! తప్పకుండా వస్తాను.

విశ్వనాథం:

[కొంచెం జాలిగా] అయ్యో! తాతయ్యగారు! మీరు అట్లా మాట్లాడితే ఎట్లా! పెద్దలు. కొంచెం వచ్చి మా చిట్టినిచూచి, సలహాచెప్పి మీ చేతిలో ఔషధం. యిస్తే మాకు సంతోషం. మీదను!

సుందయ్య:

కాదటయా మరి! నా వైద్యం, నా చేతి చేలవ సంగతి యీ చుట్టుప్రక్కల ఎవరికి తెలియదు!

విశ్వనాథం:

[లేచి] తాతయ్యగారు! నేను వెళుతాను. ఇంటి దగ్గర ఎవరూ లేరు. మీకోసం ఎదురుచూస్తూ వుంటాము. తప్పకుండా దయచేయాలి.

[విశ్వనాథం కొంచెం ఆశాభంగంతో, యింటి వైపువెళ్లి పోతాడు.]

సుందయ్య:

బాగా ప్రొద్దెక్కింది. కాలవకి వెళ్లి స్నానం చెయ్యాలి.

[అంటూ తను చేస్తూవున్న పనిని కట్టిపెట్టి "అమ్మాయీ" అని కేకవేసి బిందెతెమ్మని ఆజ్ఞాపించి, గది లోకి వెళ్లిపోతాడు.]

—౨

[రామనాథం యిల్లు - లోపల విశాలమైనహాలు. దానినంటుకొని దక్షిణతట్టున ఒకపడకగది. చాలా శుభ్రంగా వుంటుంది. నర్సారావుపేట యీజీఛెయిర్ ఒకటి, మామూలు, పడకకుర్చీ ఒకటి, వుంటవి-ఉత్తరంగా చూస్తూ. గోడకు "భారతి"లో చించి కట్టిరించిన త్రివర్ణ చిత్రపటాలు మూడు, సినీమానటి "మాధురి" చిత్రం వుంటవి. అమృతాంజనం డిపో వారి 'సుందరి" క్యాలండరు గోడకు కొట్టబడి వుంటుంది. గదిలో కిటికీదగ్గర ఎత్తు తక్కువైన చిన్ని పట్టిమంచంమీద చిట్టి పడుకో బెట్టబడి వుంటుంది. ప్రక్కన పీకిదానా ఒకటి వుంటుంది. మంచందగ్గర నేలమీదవున్న తుంగ చాపమీద కూర్చుని, చిట్టికాళ్లను నిమురుతూ వుంటుంది రాజ్యం.]

రాజ్యం:

విశ్వం యింకా రాలేదు సుందయ్యగారు వస్తారో. లేదో! ఆయనకు చాదస్తం జాస్తి. యిదిగో వస్తానంటారు. ఎప్పటికో కాని రారు. చిట్టికి ఉష్ణం హెచ్చుగానేవుంది.

[విశ్వనాథం లోపలికి మనోరథం విఫలమైనట్లు సూచించే చూపులతో వస్తాడు. కుర్చీని కొంచెం మంచం దగ్గరగా లాగి, కూర్చుంటాడు.]

రాజ్యం:

విశ్వం బాబూ! సుందయ్యగారు వచ్చి చేయి చూస్తానన్నారు! చిట్టికి జ్వరం ఎక్కువయింది.

విశ్వనాథం:

[చికాకు మొగంతో]

వదినా! ఆయన వస్తాను. వెళ్లమన్నారు. గుళ్లో దేవతార్చన, భోజనం వగయిరాలు చేస్తేనే కాని వచ్చేటట్లు తోచదు.

రాజ్యం:

[ధైర్యాన్ని చిక్కబెట్టుకుంటూ]

బాబూ! ఏంచేస్తాం - ఆయన రాకపోతేమాత్రం సర్వేశ్వరుడి దయ. చిట్టి బ్రతికి ఎప్పుడు బయట పడుతుందో!

చిట్టి:

[ఆయాసంతో] అమ్మా! అమ్మా! అమ్మా!

రాజ్యం:

ఏం! తల్లీ! మంచినీళ్లు పట్టునా?

చిట్టి:

అమ్మా! మరి నాన్న ఏడీ!

రాజ్యం:

మరేం. నాన్నగారు ఊరికి వెళ్లారు. నీకు యించ క్కాకారపూస పొట్లాం తెస్తారు. అమ్మా! నీకు వుష్ణం వచ్చింది అమ్మా! తగ్గింతరువాత తిందువు కాని ఏం! బాబయ్యను కూడా అడుగు ఇంకాను.

చిట్టి:

బాబయ్యా!

విశ్వనాథం:

మరేనమ్మ చిట్టీ! ఆ యొచ్చిందమ్మా నీకు. కొత్త రబ్బరుబొమ్మ తీసుకునచ్చాను. తగ్గింతరువాత ఆడుకొందువు కాని అమ్మా!

[చిట్టి యిటూ అటూ దొర్లి ఓ ప్రక్కకి ఒత్తిగిలి పరుంటుంది.]

విశ్వనాథం:

[విసుగులో] వదినా! చూడు- అన్నయ్య యింకా రాలేదు. రెండు రోజులయింది వెళ్లి. చిట్టి వాడు వెళ్లిన్నాటికే ఖులాసాగాలేదు. వాడికి యిల్లూ సంసారం సంగతి ఏమన్నా వుంటేనా.

రాజ్యం:

బాబూ! వస్తారు. యీవేళో రేపో! అది నా పుణ్యం! మనం ఏంచేస్తాం.

విశ్వనాథం:

ఏమిటో! వదినా! నీవుకూడా అట్లా అంటావు. రెండు ఏళ్లల్లో, ఊరిదగ్గర బాడవచేను అమ్మివేశాడు. నీవు కూడా ఏమీ అనవు వాణ్ణి.

రాజ్యం:

నాతండ్రీ! ఏమిటీ అనేది వారిని - ఎన్నోసార్లు ప్రార్థించాను - వారి పాదాలమీద పడి - ఆ పనిమానమని. వారు విద్యావంతులు కూడాను!

విశ్వనాథం:

నిజమే! విద్యావంతుడైతే మాత్రం ఏమిటి లాభం! జ్ఞానంలేక పోయిన తరువాత. వదినా! మా అన్నయ్య ఎంతో తెలివిగలవాడనీ, బుద్ధిమంతుడనీ చాలా పేరుండేది. అట్లాంటివాడు యిట్లా అయిపోతాడని ఎప్పుడూ అనుకోలేదు.

రాజ్యం:

విశ్వంబాబూ! అది అంతా నా అదృష్టం. పైకి ఏదో యిట్లా వున్నానుకాని లోలోన కుమిలి పోతున్నాను వారి వర్తనాన్నిగూర్చి.

విశ్వనాథం:

వదినా! నానాటికి చిక్కిపోతున్నావు కూడాను,

చిట్టి:

అమ్మా! అమ్మా! నాన్న ఏడే!

రాజ్యం:

నాన్న వస్తారు ఏం! పండుకో అమ్మా! నీకు మంచి గౌను కుట్టించుకు వస్తారు!

చిట్టి:

[మూలుగుతూ] ఊ! ఊ! ఊ!

విశ్వనాథం:

వదినా! చిట్టికి జ్వరం తగ్గేటట్లు కన్పించడం లేదు. ఇప్పుడు ఎట్లా వుందో చూడు. [రాజ్యం చిట్టిమీద చేయివేసి చూస్తుంది. ఒళ్లంతా కాలిపోతూవుంటుంది - రాజ్యం కళ్లు చెమ్మగిల్లు తవి.]

రాజ్యం:

చిట్టికి జ్వరం హెచ్చుగానే వుంది బాబూ! నాకు ఖంగారు వుతది. ఈ జ్వరానికి చిట్టి బతికి బయట పడి బట్ట కడుతుందా!

విశ్వనాథం:

అట్లా అనకు వదినా! భగవంతుని దయవల్ల తగ్గుతుంది. ఈ అవస్థలో అన్నయ్యవు టే ధైర్యంగా వుండును. అన్నయ్య యీవేళకూడా వచ్చేటట్టు లేదు. ఏమిటో నాకు ఆదుర్దాగా ఉంది చిట్టి విషయంలో.

రాజ్యం:

మీ అన్నయ్య యిట్లాంటప్పుడు యింట్లో వుంటే కొంచెం ధైర్యంగా వుండును. ఏం చేస్తాం. నాయనా! చిట్టికి యిట్లా వున్నప్పుడు ధైర్యంగా వుండటానికి, వారు సమీపాన్ని ఉండట భాగ్యం నోచుకోలేదు-నేను.

విశ్వనాథం:

వదినా! మా అన్నయ్య యిట్లా అయిపోతాడని ఎప్పుడూ కలలో కూడ అనుకోలేదు. ఎప్పుడూ వాడికి ఆ గొడవే. చిట్టిని, వాడు, అక్కడికి తగలడే రోజున కూడ, జ్వరంగా వుంది కదూ! తాను వెళ్లిన తరువాత ఎట్లాగున్నదనే చింత లేదే!

రాజ్యం:

[ప్రసంగంమార్చి] విశ్వంబాబూ! సుందరయ్యగారు యింకా రాలేదూ! చిట్టి విషయం ఆత్రుతను కలిగితా డేపల్లిగూడెం స్టేషను నుంచి డాక్టరు గారినైనా తీసుకువస్తే బాగుంటుందేమో!

విశ్వనాథం:

అవును, వదినా! డాక్టరుగారిని తీసుకొనివస్తే బాగానే వుంటుంది. మన సైకిల్ కూడాలేదు. యింట్లో. అన్నయ్య తీసుకు పోయాడు.

రాజ్యం:

అట్లా అయితే ఎవరిదైనా సైకిల్ అడిగి తీసుకుని వెళ్లి చక్కా రా బాబూ!

[విశ్వనాథం వెళ్లిపోతాడు. రాజ్యం వేదనాభారంచే వేడి నిట్టూర్పు విడుస్తుంది.]

రాజ్యం:

వారు యింకా రాలేదు. చిట్టికి జ్వరం హెచ్చుతోంది. నాకు ఏమో ఆవేదనగా ఉంది......అక్కడ నుంచి వదలిరాలేరు. చిట్టి పుట్టినదగ్గరనుంచీ వారికి మరీ ఎక్కువై పోయింది. నాదగ్గర ఏదైనా లోపం వుంటే' చెప్పితే సవరించుకుంటాను అని వారి పాదాలమీద పడి' పరి పరి విధాల ప్రార్థించాను. అత్తయ్య బ్రతికివుంటే పరిస్థితి యిట్లా అయిపోయి వుండదు. యింట్లో పెద్ద దిక్కు ఎవ్వరూలేరు. వారి పాదపూజ తక్క నాకు అన్యచింతలేదు. పదికాలాల పాటు వారు జీవించి, నాకుయింత పసుపు, కుంకుమ ప్రాప్తి వుంటే చాలు. యింతకూ, యీవేళైనా వారు వస్తారో, లేదో!

[రాజ్యం వీధిగుమ్మంలోకి వెళ్లి ఎవరైనా వస్తున్నారేమో అని చూస్తుంది. కోమటి అమ్మన్న కాలువకి నీళ్లకు వెళుతూ "అమ్మాయికి ఎలావుంది అమ్మా!" అని అడిగి వెళ్లిపోతుంది. రాజ్యం మళ్లీ గబగబా లో

పలికి వచ్చివేస్తుంది. చిట్టి ఏవో కలవరిస్తుంది. రాజ్యం కంగారు పడుతుంది. ఏమీ తోచక యిటూ అటూ తిరిగి, మంచందగ్గర చిట్టి తలవద్ద కూర్చుంటుంది.]

బహుశా డాక్టరుగారు వూళ్లోనే వుంటారు. విశ్వం బాబు తప్పకుండా తీసుకువస్తాడు. డాక్టరుగారివ్వి రెండు మోతాదులిస్తే జ్వరం తగ్గిపోతుంది. అవసరమైతే యింజక్షనుకూడా యిస్తారు. సుందయ్యగారి మాత్రలకు యీ జ్వరం తగ్గదు! ఏవో కషాయాలు పెట్టమంటారు. ఆ వస్తువులు యీవూళ్లో దొరకడం కష్టం. గొల్ల సుబ్బమ్మను సుందయ్యగారి యింటికి పంపించాను. ఆయన కొమ్మరవెళ్లారని కబురు తెచ్చింది. వారు యీవేళ వస్తే ఎంత బాగుండును!

[వీధిలో గుమ్మంవద్ద సైకిల్ బెల్ చప్పుడవుతుంది. ఒకవేళ వచ్చినవారు వారేమో అని హాలులోకి వెళ్లుతుంది, రాజ్యం. రామనాథం సైకిల్ దిగి సైకిల్నిలో పలహాలులోకి తీసుకువచ్చి, గోడకు జేర్లవేస్తాడు. పైమీదిశల్కు ఖండువా హాలులో ఉన్న బల్లమీద గిరాటు వేస్తాడు.]

రాజ్యం:

కొంచెం దాహం పుచ్చుకుంటారా! ఎండపడి వచ్చారు.

రామనాథం:

... ... ... ... ...

[రాజ్యం పడమటింటిలోనికి వెళ్లి మజ్జిగలో నిమ్మరసంపిండి వెండిగ్లాసులో పోసుకొని తీసుకువస్తుంది. రామనాథం గడ గడ త్రాగివేస్తాడు.]

రామనాథం:

విశ్వం ఏడీ! ఎక్కడికి వెళ్లాడు?

రాజ్యం:

విశ్వం తాడేపల్లిగూడెం వెళ్లాడు - డాక్టరుగారిని తీసుకొని రావడానికి. చిట్టికి మీరు వెళ్లిన దగ్గరనుండీ జ్వరం వస్తూ యీవేళ హెచ్చుగా వుంది. చిట్టి జీవిస్తుందనే ఆశ సంశయంగా వుంది. భగవానుని దయ దక్షిణపు గ[illegible] వుంది. రండి- చూద్దురుగాని.

[రాజ్యం కళ్లనిండా. నీరుక్రమ్మింది. పొంగి పొరలి వచ్చేదుఃఖానిద్రమింగి నెమ్మదిగా దక్షిణపుగదిలోకి వెళ్లుతుంది. రామనాథం కూడా వెళ్లుతాడు. మాట్లాడకుండా ఓపడక కుర్చీలో కూలబడి, "గోల్డెన్ ఫ్లేక్ సిగరెట్టు" ను వెలిగించి పొగపీలుస్తూ, యింటి దూలాలవైపు చూస్తూవుంటాడు.]

చిట్టి:

అమ్మా! అమ్మా! అమ్మా!

రాజ్యం:

[చిట్టి మొహమ్మీద ముసరిన ముంగుర్లను సవరిస్తూ] చిట్టీ! చిట్టీ! నాన్నగారు వచ్చారు. చూడు అమ్మా.

చిట్టి:

ఊ! ఊ! ఊ!

రాజ్యం:

చిట్టి మీకోసం కలవరిస్తోందండి. ఒక సారి యిట్లా వచ్చిచూడండి. మీకొరకు కళ్లు కాయలు కాచి పోయాయండి. ప్రతిక్షణం మీరాకకోసం ఎదురు చూస్తున్నాము.

[రామనాథం కుర్చీలోంచి లేచి, గట్టిగా రెండు సిగరెట్టు దమ్ములు లాగి, సిగరెట్టును మూలకు పారవేసి, మంచందగ్గరకు వెళ్లుతాడు. చిట్టికి కప్పిన దుప్పటిని కొంచెం తొలగించి, పొట్టమీద చేయివేసి చూస్తాడు. తరువాత కుడిబుగ్గమీద హస్తంవేసి తాకుతాడు. గదిలో యిటూ అటూ, కుడిచేతి వ్రేళ్లతో క్రాపుపాపటను సవరించుకుంటూ పచారు చేస్తాడు.]

రామనాథం:

[నెమ్మదిగా] చిట్టికి జ్వరం తీవ్రంగానే వుంది. తుదకు ఎలా పరిణమిస్తుందో!

రాజ్యం:

[విశాల నయనాల్ని ఆక్రమించిన కన్నీటిని చీర చెరగుతో తుడుచుకొంటూ, కొంచెం గద్గదిక స్వరంతో.]

చిట్టి మళ్లీ మనతో కలసి ఎప్పుడు తిరుగుతుందో బ్రతికి బయటపడేవరకు నాకు నమ్మకం లేదు! రామలింగేశ్వరుని కృప. వాళ్ల నాన్నగారి ప్రసాదం యింత దానికి ప్రాప్తివుంటే జీవిస్తుంది. బ్రతకడం అదృష్టముంటే చిట్టికి యిట్లాంటి జ్వరం వస్తుందా!

రామనాథం:

... ... ... ... ...

[రామనాథం హాలులోకి వెళ్లిపోతాడు. శూన్య దృక్కులతో యిటూ అటూ తిరుగుతాడు.]

[రాజ్యం చాపమీద కూర్చుంటుంది. ఆమె వీక్షణాలు చిట్టి మొహంమీదనే వుంటాయి.]

రాజ్యం:

[భయంతో] ఏమండోయి! మీరు ఒక్కసారి లోపలికి వచ్చి చిట్టిదగ్గర కూర్చోండి. నాకు ధైర్యంగా వుంటుంది.

రామనాథం:

... ... ... ... ... ...

[చీకటి క్రమ్ముకుంటుంది. గదిలో దీపం వెలిగించబడలేదు- యింకా. వీధిలో గుర్రపుబండి వచ్చినట్టు చప్పుడు. డాక్టరుగారు, విశ్వనాథం బండిలోనుంచి దిగి లోపలిహాలులోకి వస్తారు. బండివాడు గుర్రాన్ని విప్పి, తోలుసంచి తీసుకొని లోపలికి వస్తాడు.

చిట్టి ప్రాణవాయువులు పైకి ఎగిరిపోయి చీకటిలో లీనమవుతాయి. రాజ్యం రోదనధ్వని గదిలోని నిశ్శబ్దాన్ని చీల్చి వేస్తుంది.]

---

# కువలయానందసారము

ఇది సంస్కృతమున అప్పయదీక్షితులు రచించిన "కువలయానందసారము" ననుసరించి క్రొత్తపద్ధతిని రచింపబడిన అపూర్వమగు అలంకారగ్రంథము. రచయిత ఉభయభాషా-సాహిత్య విద్యాప్రవీణులు, అలంకారశాస్త్రమున ప్రత్యేకకృషి చేసినవారును అగు శ్రీ బులుసు-వేంకటరమణయ్యగారు. ఇందు అలంకారలక్షణములు సులభశైలులగు పద్యములలో నున్నవి. ఉదాహరణములు చాలవఱకు వివిధాంధ్ర ప్రబంధములనుండి సేకరింపబడినవి. లక్ష్యలక్షణముల వివరణములు వచనమున నున్నవి. శాస్త్రచర్చలు సంకేతపద వివరణములు ఉదాహృత గ్రంథసూచిక ఉదాహరణ పద్యసూచిక గ్రంథముచివఱ అనుబంధమునం జేర్పంబడినది. దీనికి అమూల్యమగు పీఠిక కలదు. ఇది పండితులయాదరణకు పాత్రమై 1938 సం॥ "విద్వాన్" (బి) పైనలు పరీక్షకు పఠనీయగ్రంథముగ నిర్ణయింపంబడినది.

చక్కని అచ్చు మేలురకపు కాగిదము. క్రౌను సైజు 160 పుటలు. వెల రు. 1-0-0.

ఆర్ వేంకటేశ్వర్ అండ్ కో, లోన్ స్క్వేర్, మద్రాసు.

## స్త్రీ లోకము

### నేటి విద్యలో మార్పులు

పథికుఁడు

స్త్రీలు విద్యావతులు కావలెనని రాష్ట్రములన్నియు నంగీకరించి యొకదానికంటె వేరొకటి ముందడుగు వేయుచున్నవి. కాని నిజమైన విజ్ఞానమును మనోవికాసమును కలిగించు విధానమింకను ప్రచారమునందు లేదు. విశాలభావములు కలిగించుటకు ఉపాధ్యాయినులు గూడ అంతటి ప్రజ్ఞాశాలినులై యుండవలెను. అట్టివారుగాక నేడు కళాశాలలం దెచ్చట జూచినను పట్టభద్రలు మాత్రమే పరిపాలించు చున్నారు. వీరువివిధ దేశసంచారము వలనను వివిధనాగరకతా పరిశీలనమువలనను విశాల హృదయలై శిష్యురాండ్రకు ఉన్నతాదర్శములు కలిగింప వలెను.

**బాలబాలికలు:**—పది పండ్రెండేండ్లలోపలి వయస్సు వారికి—కలిసియే పాఠశాలలు స్థాపించుట మంచిది. ఇందువలన ఆర్థిక సౌకర్యము చాల నుండును. దైహికముగ, మానసికముగ, నైతికముగ లోపములున్నవారికి ప్రత్యేక విద్యా శాల లుండ వలయునే గాని సామాన్య పాఠశాలలు పనికిరావు.

ఉన్నత విద్యలో గృహనిర్వహణమును గూర్చి సర్వవిషయ ములును బోధించుట మేలు. శిల్పము, గాన, చిత్ర కళాదులతో పాటు, ప్రత్యేక వృత్తి నవలంబింప నిచ్చలేని యువతులకు ఉన్నతములగు అభిరుచులు కలిగించు విషయములు బోధింపవలెను. అత్యంత సామాన్యములైన దుస్తులును అలంకారములును అభ్యాసములును అలనడవలెను.

బాలకులకు శరీరపరిశ్రమను నియమించినట్లే, బాలికలకు పాఠశాలలందు నాట్యము తప్పని సరిగా నేర్పవలెను. నేడు హైందవ యువతీ యువకు లెందఱో ప్రాచీన నాట్యకళ నుద్ధరింప ప్రయత్నించుచు సర్వదేశములందును ప్రస్తుతింపఁబడుచున్నారు. శాస్త్రయుక్తమగు భారతీయ నాట్యకళను విద్యార్థినుల కెల్లరకు నేర్పవలెను. దీనివలన శారీరకబలమును వృద్ధి చెందును. (టెస్కో రివ్యూ).

**ఋణములో వివాహము - రష్యాస్త్రీల సంపాదన:**—

మన దేశమందలివారికి రష్యా స్త్రీల పరిస్థితులు చూచిన విడ్డూరముగ నుండును. వారి జీవన మార్గము, వివాహ విధానము, విడాకుల వ్యాపారమును గూర్చిన విశేషములు వినుడు.

ద్రవ్యసంపాదన మందును న్యాయశాసన దృష్టిలోను రష్యాస్త్రీ పురుషునితో సమాన స్థితియందున్నది. సంతానముమీదిహక్కులో పురుషునికన్న ఎక్కువగా నున్నది.

నియమిత కాలములో చేయు పనికి పురుషుని కెంత జీతము వచ్చునో స్త్రీకిగూడ అంత జీతము వచ్చును. సాధారణముగ మగవాని సంపాదన భార్యాపుత్రుల పోషణమునకు చాలదు గాబట్టి, స్త్రీగూడ ఉద్యోగము చేసి సంసారపు ఖర్చులో సగము సంపాదించి తేవలసి యున్నది. గర్భధారణ సమయమందు మూడు మాసములకు తక్కువ గాకుండ స్త్రీకి సెలవిచ్చెదరు. అట్టి సెలవు దినములలోఁ గూడ నామెకు ఫ్యాక్టరీలోని తక్కిన పనివారికి వలెనే పూర్తి జీతము ఇంటికి పంపుదురు. ప్రకృతి వశమందున్న అట్టి అసహాయ స్థితిలో గూడ రష్యాస్త్రీ మరి యొకరిపై ఆధార పడవలసిన పని లేదు.

ప్రపంచ మంతటిలోను ఒక్క రష్యా స్త్రీయే సర్వతంత్ర స్వతంత్ర యై కాన్పించుచున్నది. ఆర్థిక విషయములో నామె మగవానితో సమానము. గృహములో సగమును, కుటుంబమునకు గల ఆస్తిలో సగమును ఆమెది. ఇష్ట మైనచో మరి యొకరితో తనకు పని లేదని చెప్పుకొనఁ గలదు. ఆమె ఒకరి ఆస్తికాదు.

సర్వదేశములందును కాన్పించు 'గృహిణి' అను శబ్దము రష్యాలో క్రమక్రమముగ అదృశ్యమై పోవుచున్నది. ఒక కుటుంబ మనియు దానిని కాపాడు భారము స్త్రీ దనియు నచ్చట లేదు. కుటుంబమున కొక ప్రత్యేక గృహమనియు, దానిలో వంట యిల్లని శయన గృహ మని వివిధ భాగములుగాని ఆ దేశమందు లేవు. పసి పాపలను పెట్టుకొనుటకొక గది మాత్రము తల్లి కుండును. ప్రత్యేకముగ వంట యనునది లేనే లేదు. కర్మాగారములందే యేర్పరుప బడిన హోటలుల లోను ఇతరభోజన శాలలందును జను లందరును భుజించుచుందురు. వేడి నీళ్లు మొదలగు వానికిగూడ అందరకును కలిసి ప్రత్యేక స్థలముల సౌకర్యము లేర్పరుపబడి యుండును.

శిశువులు నాలుగేండ్లు వచ్చు వరకును రాత్రులందు తల్లుల యొద్దనే యుందురు. పగలు ప్రభుత్వ నియమితలగు దాదుల యొద్దనో లేనిచో తల్లులు పనిచేయు కార్యాలయములందు నియమిత రక్షణశాలలలోనో ఉందురు తరువాత ప్రత్యేకవ్యక్తులుగా పరిగణింపబడి పాఠశాలలయందే వసింతురు. లేక తలిదండ్రులు కోరినచో వారియొద్దను వసింపవచ్చును.

వివాహముగాని, విడాకులు గాని విశేష కాల ద్రవ్యములు నష్టము గాకుండ ముగిసి పోవుచుండును. పురుషుడు గాని స్త్రీ గాని తనంత తాను రెజిస్ట్రేషను ఆఫీసుకు పోయి, అక్కడ నున్న గుమాస్తా (సాధారణముగ స్త్రీయే) వద్ద ఒక కాగితముపై సంతకము చేసి మూడు 'రూబులు'లు చెల్లించినచో వివాహము రద్దయినట్లు వెంటనే ఒక సర్టిఫికెట్టు నిచ్చెదరు. అంతతో సరి. రెండవ

వారికి మరునాడే ఆ విషయమై పోస్టుద్వారా తెలియపరచెదరు. ముందుగా ఒకరొకరికి నోటీసులు మొదలైన వేవియు ఈయన క్కర లేదు. భార్యగాని భర్తగాని తన వివాహము రద్దు చేసికొన వలె ననుకొన్నచో వెంటనే ఒంటరిగా రెజిస్ట్రేషను ఆఫీసుకు పోయి సర్టిఫికెట్టు తెచ్చుకొనినచో అంతయు ముగిసిపోవును. వారి సంతానమునకు వారి జీతములనుండి కొంత భాగము ప్రభుత్వమే తీసికొని యిచ్చుచుండును.

వివాహముగూడ నింతకంటె సులభముగా జరుగుచుండును. స్త్రీ పురుషులు కోర్టులోనికి వచ్చుట, సంతకములు చేయుట, ఏడు నాణెములు చెల్లించుట, సరి. చాల వివాహములు రిజిస్ట్రేషను చేయకుండనే జరుగుచుండును. ప్రభుత్వమే అట్టి వానిని ప్రోత్సహించును. అన్యోన్యాంగీకార మున్నచో మరి యేమియు నక్కర లేదు.

ఇట్టి అపూర్వస్వేచ్ఛావాతావరణము నందుగూడ విడాకులు మిక్కుటముగా నుండు ననుకొనుటకు వీలు లేదు! రష్యాలోని లెక్కల పరిశీలించినచో, ప్రతి యేటను విడాకులు తగ్గిపోవుచున్నట్లు కాన్పించును. అది గాక, ఎన్నియో నిర్బంధము లున్న తక్కిన దేశములందునవలెనే రష్యాలో అనేకులు విడిపోవుట యనునది లేక ప్రాణమిత్రములై యావజ్జీవము సుఖముగా గడపుచున్నారు. అట్టి వారి సంఖ్య వృద్ధి యగుచున్నది.

## హైందవ వనితల దుస్తులు:-

ఒక విద్యాధికారి యువతీ సంఘమునందు పన్యసించుచు సామాన్యమగు చీర ధరించిన హిందూవనితను చూచినచో ప్రకృతిలోని సౌందర్యమంతయు మూర్తీభవించినట్లు పొడకట్టును. ప్రాచీనార్య నాగరకతయంతయు ప్రసన్నమగు స్త్రీ స్వరూపాలంకారమునందే దాగియున్నట్లు గోచరించును. పాశ్చాత్యుల దుస్తులయందు లజ్జాశూన్యత తప్ప మరేమియు గోచరింపదు.'' అని నుడివెను.

పశ్చిమఖండముల నాగరకత మనపై నెంతగా వచ్చి పడినను, వారి వస్త్రధారణ విధానము మాత్రము స్త్రీలలో మిక్కుటముగ వ్యాపింపకుండుట ముదావహము. కొన్ని చోట్ల ఆ యుపద్రవముగూడ పొడసూపుచున్నది. హిందువుల దుస్తులు వేసికొనినను, వానిని ఆంగ్లేయుల 'బాడీ'లు జాకెట్ల వలె వికారముగా చేతులు మెడలు లేనివిగా చేసికొని, భగవద్దత్తములగు కోమలతా లజ్జా సౌందర్యాదులను గోల్పోవుట నింద్యము.

మన బాలికలకు ముఖ్యముగా గౌనులు వేసి మురిసిపోవుట అభ్యాస మగుచున్నది. ఇదిగూడ తొలగి పోవలెను. చిన్ననాటి నుండియే 'పరికిణీ' మొదలగు జాతీయ వస్త్ర విశేషములపై అభిరుచి గలిగింప వలెను. జుట్టు కత్తిరించుకొను టెంత విపరీతమో, స్వతంత్రమైన దుస్తులు మార్చుకొనుటయు నట్టిదే.

# స్వవిషయములు

## మనవి

కారణాంతరముల వలన ఈ మాసమున మా చంద్రికా పత్త్రిక ఆలస్యముగా వెల్వడుచున్నయది. చేదువరులు మన్నింప వలయు నని ప్రార్థన.

చంద్రికా పత్రిక చేందా రేట్ల తగ్గింపు:—

అనేకులగు మిత్రుల యొక్క కోరిక ననుసరించి 1935-వ సం॥ జనవరినుండి యీ పత్రిక యొక్క సం॥ చేందా రు. 3-0-0 (మూఁడు రూపాయలుగా తగ్గింపఁబడుచున్నది. కాని పత్రిక యొక్క గుణ మే మాత్రమును తగ్గించు తలంపు లేదు. మీఁదు మిక్కిలి తద్విషయకము గానింకను అభివృద్ధి గావించుటకు మిక్కిలి శ్రద్ధ గైకొనఁ బడును. ఈ రేటు తగ్గింపు పత్త్రిక జనుల కింకను ఎక్కువ యందుఁబాటులో నుండ వలయు నను భావముచేతనే యేర్పాటు చేయఁ బడినది. ఈ తెలుఁగునప్రజల మన్నన కొఱకుఁ బ్రయత్నించిన మా యుద్యమముపట్ల ఆంధ్రసోదరు లాదరణ వహించి యీ చంద్రికా పత్త్రిక నింకను నెంతయు ప్రోత్సహింతురు గాక.

ఇదివఱకు చేందాదారులుగా చేరియున్న వారికి ఇంకను పంపవలసి యున్న సంచికలకు గాను ఇప్పుడు తగ్గింపు రేటు ప్రకారము లెక్క సరిపోవునట్లు కాలము పొడిగింపఁబడి అంతవఱకు పత్త్రిక పంపఁబడును.

సంపాదకుడు.

---

## సవరణలు

కడచిన సంచికలో శ్రీ దోమా-వేంకటస్వామి గుప్తగారి బ్రహ్మేశ్వరపురాణమును గూర్చిన విమర్శనము ప్రకటింపఁబడినది. తద్విమర్శనము బ్ర॥ ఉభయభాషాసాహిత్య విద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారు గావించినది.

* * *

కడచిన సంచికలో శ్రీ గుమ్మలూరు సత్యనారాయణగారి "ఉద్బోధన" అను వ్యాసములోని ఈషద్వైషమ్యములు.

| పేజీ. | కాలం. | పేరా. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|---|---|
| 603 | 1 | 2 | 5 | ఆవర్గము......ఆ [రోజులలో | ఆవర్గము వారు బ్రాహ్మణులే యనుకొనుఁడు కాని ఆ రోజులలో. |
| 604 | 2 | 1 | 8 | పూర్వ శాస్త్రము [లకుగల భేదమెనఁగా | పూర్వ శాస్త్రములకు నిప్పటి శాస్త్రములకుగల భేదమేమనఁగా. |
| ,, | ,, | ,, | 10 | అపసర— | అనవసర. |

చేదువరు లీసవరణలఁ బాటింపవలయునని విన్నపము.

# సంపాదకీయములు

## గ్రామజీవనము.

ఇప్పటి విద్యాధికులును, ఉన్నతోద్యోగులను, నిరుద్యోగులును గ్రామజీవనము గ్రామజీవన మని యనుచుండుట జగద్విదితము. ఇన్నాళ్లకు దేశమునందు "కృషితో నాస్తి దుర్భిక్షు" మను వాక్కు నోటఁ బల్కఁబడుచున్నది. ఈ భారత దేశము గ్రామమయమయినది. కృషిపయిననే యాధార పడియుండున దని యందఱు నంగీకరించిన విషయము.

ప్రకృతము నాగరకత యనఁబడు యంత్రోపజీవనము (**depending upon machines**) మొదలయిన పద్ధతులు తొల్లి నీ దేశమునం దుండినవే. అందులకు విమానములు (పురాణకథలలో సర్వత్ర వీని ప్రశంస గలదు గదా ? మహాభారతములోఁ దెల్పఁబడిన మహా మహోన్నత జ్యోతులు (**search lights**) శతఘ్నులు (పిరంగులు) మొదలయిన వానివల్లఁ దెల్లమగుచున్నది. యాంత్రిక విధానప్రాధాన్య మిప్పటివలెనే పూర్వమీ దేశమునం దొక తఱి నుండి యుండును. అప్పుడు మనుజులలో పనిపాటులు లేక కొందఱును-తిన తిండి కట్ట గుడ్డ లేక కొందఱును అగచాట్లు గుడువవలసి యుండియుండును. అట్టి కటుతర పరిశోధన లయిన తరువాత ఏ గ్రామముయొక్క పరిస్థితులు ఆ గ్రామమువంటిననే ఆధారపడి యుండునట్లుగా ఆర్థిక పర్యాయముగాను ఐహికాముష్మిక పర్యాయముగాను ఆలోచించి— గృహపరిశ్రమలు, పాతివ్రత్యపద్ధతులు, పురుషుని కర్తవ్యములు, పంచాయతి పద్ధతులు, వర్ణాశ్రమ ధర్మములు. అను శాస్త్రలచే నిర్ణయింపఁబడినవి. ఆ నిర్ణయములలో నిరాడంబరజీవనము - దేహపరిశ్రమ - ఆధ్యాత్మిక ప్రకారమయిన మనోనియమము - మొదలయిన సత్పథములు ఇమిడియున్నవి.

అట్టి యిమిడిక సౌహార్దము పరోపకార స్వభావము నాగరకతయను పేరి పెనుభూతమునకు లోనయిన సుఖదాస్యమునకు నునికిపట్టైన పట్టణజీవనములోఁ గాక గ్రామ జీవనములోనే యనుకూలపడును. నిజముగా వ్యామోహ వాతావరణమునుండి సంతృవివాతానరణము అనఁగా గ్రామజీవనపద్ధతిలోనికి మార్పు జరగవలసినచోఁ గొంత యలజడి కొంత శ్రమ కొందఱి యభినివేశ పరిశ్రమ త్యాగములు అత్యవసరములు.

ఈ విషయములోఁ అప్పుడే నాయకులు ప్రయత్నించుచున్నారు. అనుచరులు వెంబడించుచున్నారు. కాని యీ విషయమున, బాలక మహాశయులకు నొక యంశము జ్ఞాపకము చేయవలసి యున్నది. గ్రామ్యజీవనవాదులగు నాయకానుచరులొక యార్థిక దృష్టినే తమ దృష్టిలో నుంచుకొనియున్నారు.

కాని - ఆధ్యాత్మిక పరిశీలన విశేషము వారి కెంతమట్టున్నదో తెల్లము కాలేదు. సనాతన గ్రంథములయందు స్మృతి పురాణాదుల యందు నిర్ణయింపఁబడిన యేతద్విషయకము లయిన ధర్మవిధానములయందు వారికి నే మాత్రము విశ్వాసమున్నదో నిర్ణయింప వీల్గాదు. ఒకరు పల్కిన యొకానొక విషయము మంచిది గాక పోయినంతమాత్రమున వారు చెప్పినవన్నియును వారి మనఃప్రవర్తనము లన్నియును త్రోసి రాజేనఁదగదు గదా? కాఁబట్టి ఆర్థికైహికాధ్యాత్మిక విషయకముగా తొంటి వారే యాశయముతో నేమి నిర్ణయించినది పర్యాలోచించి తదనుసారముగా గ్రామజీవనవిధానముఁ నిర్ణయించుట బాగని తోఁచెడిని.

## ఆతిథ్య ధర్మము.

అతిథిపూజ భారతదేశమునందలి ప్రధాన ధర్మములలో నొకటిగా నున్నట్లుగా నందఱు నంగీకరింవలసినదే కదా? ఇప్పటికి పంక్తిలో అతిథిలేక భోజనము చేయనివారు నాగరకతావాసములయిన పట్టణములలోఁ గాక పోయినను పల్లెటూళ్లలోఁ బెక్కుఱు గానవత్తురు.

ఈ ఆతిథ్య విధానములో దేశజనులకు సేమముఁ గూర్చు విధాన మెంతగా నిమిడి యున్నదో చూడనగును. అతిథి సాక్షాన్మహావిష్ణువే యనియును శాసకగ్రంథ నిర్ణయము. అట్టి గౌరవ మతిథులయెడఁ జూపఁబడవలసియున్నందున గృహస్థు లతిథిపూజ నత్యంత శ్రద్ధాభక్తులతోను నిర్దుష్టమయిన యన్నాహారములతోను గావింతు రనుటకు నాక్షేపణ యుండదు. అయినను ఈ విశ్వాసమా యను శాసకగ్రంథములయందు గౌరవము లేని వారి కెంతవఱకుండునో చెప్పుటకు వీలు గాదు. ప్రతి వారికి అతిథిపూజావిధాన మనుసరణీయధర్మముగాఁ దొల్లి నుండిన దనుటకు - బిచ్చగాండ్రు సయితము తమకు భైక్షుకవృత్తివల్ల వచ్చిన యాహారములో దప్పని సరిగా అతిథిపూజకు వినియోగించుచుండి నట్లనుశ్రుతవిషయములు గలవు గదా? ఇప్పటికిని రయిళ్ల సంబంధము తక్కువగా నుండు గ్రామమున కొకరు వెళ్లినచో భోజనము చేయక యా గ్రామమున వీడి బయటకు వెళ్లుటకు వీ లుండదు.

మన దేశముయొక్క దురదృష్ట మేమో కాని-మనతొంటి యనుశాసకులు-విద్యావిశేషములు అనుక్రమముగా వ్యాప్తి యగుటకును, ఐకమత్యము, జాతీయత పెరుగుటకును ఆనుకూల్యములు గావించుటకు శ్రద్ధ గైకొనలేదు. ఒకరికడ నొక విద్యావిశేష మున్నచో "రహస్యము రహస్య" మని అది యతనితోనే యంతరించెడిది. ఈ రీతిగా ఈ దేశమునందు విద్యావిశేషవ్యాప్తి చాల తగ్గి నేఁటి దశకు వచ్చినది. ఐకమత్యము సరిగా నుండని కారణమున నెవ్వ రెవ్వరి చేతనో యాక్రమింపఁబడి ఆర్థిక వైజ్ఞానికాధ్యాత్మికముగా నెంతయో బాధనొందినది. అట్టి పరరాజాక్రమణ కాలమునందు పరమత వ్యాప్తివల్ల ఈ మతమునందు జనులకు విశ్వాసము తగ్గి అతిథిపూజ యొక వెట్టిగాను ఒకరింట భుజించుట యొక దోసముగాను అవమానముగాను పరిగణింపఁబడుట ప్రారంభ

మయినది. కాని తా నొకని గారవించునప్పు డితరులచేఁ దాను గారవింపఁబడుట కర్హుఁడే కదా? ఈ రీతిగాఁ బరస్పరవిధానముచే ప్రవాసులయొక్క యారోగ్యము కాఁపాడఁబడు చుండెడిది.

ఆతిథ్య విధానమునకు మాఱుగా నిప్పుడు హోటళ్ల విధానము చెలరేఁగినది. చద్దివేఁడి యన్నముల కలిపిళ్లు - పులుసులలో బరిణపురుఁగుల తిరుగఁబోఁత, పచ్చళ్లలో మెతుకులు - నేతిలో క్రొవ్వు - ఎంగిలి కూళ్లు-ధర్మదూరత్వము-అధర్మానుకూల్యము మొదలయిన వానికి హోటళ్లు నెలవులు. వీనివలన జనుల యారోగ్య మెంతగాఁ బాడగు చున్నది? ఎన్ని యయోగ్యతలు పుట్టుచున్నవి? ఎన్ని వ్యాధులు చెలరేఁగుచున్నవి? అర్థము గాని విషయముగాదుగదా? హోటళ్లలో నెన్ని దుష్కార్యములో జూదము మొదలయినవి) జరుగుచుండును. అంతేకాక చాల వఱకు గతిలేని గంగమ్మలే యీ హోటళ్లను నిర్వహింతురు.ఇందు చాల కాలముండినవారు రోగములకును దురభ్యాసములకును బాల్పడుదురు. ధనికు లేర్పాటుగావించిన కొన్ని పెద్ద హోటళ్లుకూడఁ గలవు.అందుఁగూడన నేకములయిన నవనాగరక దురభ్యాసములు పట్టుపడి అం దున్న వారియొక్క శారీరక మానసిక పరిస్థితులను బాడుచేయుటకుఁ జాలును. ఈ విషయము చాలవఱకును విదితము. విజ్ఞులీ తెఱంగును పరిశీలించి దేశక్షేమవిధానము నిర్ణయించి దాని నాచరణలో పెట్టింపఁజూతురు గాక.

---

## చిత్రప్రశ్న.

(ధవళే వేంకట బలరామయ్యగారు.)

పది అక్షరముల పేరు. ఒక మహాపురుషుని దగును. అత డెవరు?

| | | |
|---|---|---|
| 1, 10 | అక్షరములు కలిపిన | నక్షత్రములలో నొకటి యగును. |
| 2, 7, | ,, | కాంతివిశేష మని యర్థము. |
| 1, 2, | ,, | ఒక దైనము పే రగును, |
| 3, 2, | ,, | అణచు వా డనియర్థము. |
| 4, 2, | ,, | కులస్త్రీ అని యర్థము. |
| 5, 6, 5, | ,, | సంవత్సరములలో నొకటి. |
| 7, 8, 7, | ,, | ఒక చెట్టుపేరు |
| 7, 8, 9, 10, | ,, | ఉత్తర హిందూదేశములోని ఒక నదిపేరు. |

దీని జవాబు 1935 జనవరి 10-వ తేదీ లోపల మాకుఁ జేరినచో సరిగా వ్రాసిన వారి పేర్లు ప్రచురింతుము.

స్వామి దయా నంద సరస్వతి 3-1-35

# మేటూరు ఆనకట్ట.

మేటూరు ఆనకట్ట అద్భుతమైన యింజనీయరింగు కార్యము. ఈ బ్రిటీషు సామ్రాజ్యమున కంతయు నదియే పెద్ద ఆనకట్ట. దాని పొడవు సరిగా ఒక మయిలు. నది యడుగు నుండి దాని యెత్తు 2200 అడుగులు. వెడల్పు 171 అడుగులు. ఈ యానకట్ట యంతయును 5½ కోట్ల ఘనపుటడుగులు కానచ్చును. దీనికి రెండు నీటి సరఫరా కాల్వ లున్నవి. ఈ ఆనకట్టవల్ల నేర్పడిన నీటినిలువ చోటు సుమారు 60 చేదరపు మయిళ్లు కానచ్చును. అక్కడి ప్రకృతి సౌందర్యము మిక్కిలి యందముగా నుండును. ఆ నీటి ట్యాంకు నిండినచో అందు 10 కోట్ల ఘనపుటడుగుల నీరు పట్టును.

కావేరీజలము తంజావూరు డెల్టాలో పైరు పంటల కుపయోగపడవలయు నను ముఖ్యోద్దేశముతో ఈ ఆనకట్టనిర్మింపఁబడినది.

ఈ మేటూరు ఆనకట్టకు సమీపమున నుంచి రోడ్లు, కట్టడములు మొదలయినవానితో నొక మనోహరమయిన పట్టణము "మేటూరు" అను పేరితో నేర్పడినది. అందు మంచి నీటి సరపరాయును విద్యు ద్దీపముల యేర్పాటును, నవీనమయిన పారిశుద్ధ్యపు టేర్పాట్లును గలవు, కనుక ఆ పట్టణము ఆకర్షకముగా నుండు ననుటకు సందేహము లేదు. హిందువులకును యూరోపియనులకును అక్కడ విశ్రాంతి భవనములు కలవు. అందు వసతి కావలసిన వారా మెట్టూరు ఎక్జిక్యూటివు ఇంజనియరుగారికి దరఖాస్తు పెట్టుకో వలయును.

"మేటూరు డాం" అనునది సేలము జంక్షనుకు 1½ మయిళ్లదూరములో నుండు ఒకరయిలు స్టేషను. అక్కడి కా రయిలు మార్గ మాఁగి పోవును. అక్కడినుండి మేటూరికి బస్సుల సర్వీసున్నది.

కొండపయిన నొక మనోహరమయిన బంగళా కలదు. అక్కడికి అందమయిన మోటారు రోడ్డున్నది. అక్కడినుండి గంభీర మనోజ్ఞమయిన ఆ మహాసరస్సును దానిని జుట్టుకొన్న దేశములు కన్నుల పండువుగాఁ గాన నగును. ఆ తటాకమునందు విహరించుటకు మోటారు లాంచుల నేర్పాటు గావింప నాలోచన జరగెడిని.

ఆ యానకట్టను నీటి సరపరా కాల్వకును మధ్యప్రదేశమునందు చక్కనియుద్యానవన మొక్కటి కలదు. దాని నడుమను అతిసుందరమయిన నీటి ఫౌంటెన్ కలదు. ఇది చూడఁ దగినది.

దీని అంచనా వేయఁబడిన తరువాత ఈ మహాకార్యము నిర్వహించుటకు గాను ఎగ్జిక్యూటివు కౌన్సిలు మెంబరుగా నొకరు నిర్ణయింపఁబడిరి. ఆనకట్ట ప్రస్తావనవచ్చి యీనిర్ణయము నాఁటికే యెంతో కాలమయినది.

ఈ యంచనా ప్రకారము ప్రారంభము చేసి తన హయాములోపల దీనిని బూర్తి చేయించిన సర్. సి. పి. రామస్వామయ్యరుగారికి ధన్యవాదములు చెందవలసి యున్నది. ఈ నీటి నిలువయును ఈ గంభీరనుయిన యాన కట్టయును తిరుచినాపల్లినుండి 10 మయిళ్లు దూరములో నున్నవి. దీనినుండి తంజావూరి డెల్టా కంతయును నిరంతమును గావలసినంత నీటి సరపరా జరగుచున్నది.

---

# పరిశ్రమలు

## అగ్గిపుల్లలు

బొంబాయి మద్రాసు నగరములందును, బెంగాలులోను అగ్గిపుల్లలు విరివిగా తయారు చేయబడుచున్నవి. 1932-వ సంవత్సరము నాటికి పదిమూడు కర్మాగారములు బొంబాయిలోను పదునాలుగు బెంగాలులోను, నాలుగు బర్మాలోను, ప్రతిరాష్ట్రమున కొకటి వంతున, పంజాబు, మదరాసు, మధ్యపరగణాలు, అస్సాము, మొదలగు వానియందును ఉండినవి. ఇండియాలో 1914-వ సంవత్సరమునకు పూర్వము అగ్గిపుల్లల కర్మాగారముల సంఖ్య చాల తక్కువగా నుండెడిది; కాని సంరక్షణపద్ధతి (Protection Policy) వలన ఈ పరిశ్రమ చాల యభివృద్ధిజెంది యిప్పుడు సంవత్సరమునకు 400,000-రూపాయల వెలకు మించిన సరుకు తయారుచేయబడుచునున్నది.

పరిశ్రమాభివృద్ధివలన 1918-19వ సంవత్సరములో 165 లక్షలకు షైంగా నుండిన దిగుమతి సరుకు ఖరీదు కిమ్మతు 1932-33వ సంవత్సరము నాటికి అర్ధలక్షకు, దిగినది. క్రొత్తగా ఏర్పాటు చేయబడిన మెక్సైజు పద్ధతి వలన ఈ పరిశ్రమాభివృద్ధి మునుముందెట్టి యాటంకము కలుగునది మనము జూడవలసియున్నది.

## సిగరెట్లు

భారతీయుల యాధిపత్యమున నించుమించుగా మన దేశమునందన్ని భాగములందును సిగరెట్లు తయారు చేయు కర్మాగారములు నెలకొల్పబడియున్నవి, కాని యిప్పటికిని భారతీయ స్థాపితమైన కంపెనీలు చేయు వ్యాపారము, పరదేశీయులచే నెలకొల్పబడిన కంపెనీలవలన జరుగు వ్యాపారమునకంటె చాల తక్కువగా నున్నది.

దేశమునందలి ప్రజలందఱు స్వదేశీసరుకులే వాడుటకుగాను స్వదేశీకంపెనీలు పరిశ్రమా విధానము చాల యభివృద్ధి పఱుపవలయును.

సిగరెట్లు తయారు చేయుటకు పొగాకు మంచిదిగా నేర్పఱచుకోవలయు నను మాట గమనింపఁబడుట లేదు. మూఁడేండ్లు నిలువా యుంచిన పొగాకే పరిశ్రమకు బాగుగా పనికి వచ్చును.

పొగాకు మంచిది గానప్పు డూరక దానికి రసాయన పద్ధతుల వల్ల పరిమళ మెక్కించి నంత మాత్రమున హిందూదేశపు సరకునకు నాణ్యము కలుగదు.

హిందూదేశపు సరకులలో నొక్కొక రకమున కొక్కొక రీతిగా పద నెక్కింప వలసి యుండును. ఆరకములను బట్టియే ఆపదనుల పాళ్లు నిర్ణయము కావలయును. అప్పుడే మంచి సిగరెట్ల తయారు చేయుటకు వీ లగును.మంచి కార్ఖానాగారమునఁగా సరిక్రొత్తపద్ధతు లన్ని యును నుండవలయును కావలసినంత పెట్టు బడి యుండ వలయును. అమ్మకమునకు మంచి ఏర్పాట్లు ఉండవలయును. వీటిలో నేదిలేకున్నను పరిశ్రమాభివృద్ధి బాగుగా జరుగదు. కాన మన నర్తకు లీ విషయములను బాగుగా గమనింప వలయును.

# తెలుఁగు కత్తి!

గుడ్డేటి వీర సుబ్రహ్మణ్యముగారు

సీ. పగతురమెయి డిగ్గ పచ్చినెత్తురు టేటి
నులి వెచ్చని జలాన జలకమాడి
వచ్చి జాతిఁబెకల్చఁ జొచ్చిన పెఱవారి
గుండెకాయలలోని గుజ్జుమెసవి
స్వాతంత్ర్య బలివేది వ్రాలి రాల్చిన జెగ
జట్టీల పర్యంక శయ్యఁ బండి.
గండు మగంటిమి గడిచేరి కదిసిన
కంఠాల మనసారఁ గ్రోఁగలించి

కారు మబ్బుల మందలో నిరులువిరియఁ
గెరలి మిఱుమిట్లుఁ గొల్పెడు మెఱపుఁదీవ
నా రిపువసాళులోఁ జిత్ర నటన సలిపి
తవిరితి నిరంకుశతఁ దొల్లిఁ దెలుఁగుకత్తి!

# ఆరోగ్య విషయములు

## ఫలభక్షణము – ఉపవాసము

"ఫలభక్షణము - ఉపవాసము" అను నియమములు మన వారిలో చాల కాలము నుండి నాచారముగా నున్నట్లు "ఫలాహారము - ఉపవాసము" అను వాడుక మాటలు సాక్ష్య మిచ్చును. మన వారిలోఁ జాల కాలమునుండి యుండు దౌర్బల్య మేమనఁగా మన వారు ఏకార్యమునయినఁ గావింతు రే కాని, దాని తత్త్వమునుగూర్చి యది మిథ్య మని యాలోచింపరు. అట్లాలోచింపఁబడిన యభిప్రాయమును సాధారణముగా నొకరికి వెలిపుచ్చేరు. అట్లగుటవలన నెవ్వ రయిన నొకరు క్రమాగతముగా వచ్చుచున్న మన యాచారాదులను గూర్చి ప్రశ్నించినచో మనలోని సామాన్యులు సాధారణముగా సంతృప్తి యయిన ప్రత్యుత్తరము నీయఁ జాలరు. అందువలన మన యాచారములు వానిలో నెంతటి గొప్ప యభిప్రాయ మిమిడియుండినప్పటికిని ఔదాసీన్యము నొందుచున్నయవి. కాఁబట్టి ఈ జనసామాన్యముయొక్క విశ్వాస మంతయు వెట్టి విశ్వాసముక్రిందఁ బరిణమించును. ఆ నడిం జూచుకొని యెన్నియో యర్థము లేని యాచారము లిందులోఁ జొరఁబడుచున్నవి.

ఒక ముఖ్యమయిన సంగతి యే మనఁగా మన హిందూమతములో ఐహిక పారమార్థిక విషయానుకూల్యములు మిక్కిలి సామర్థ్యముతోఁ గుదిరింపఁబడి యుండును. "ఫలాహారము- ఉపవాసము" అను నియమములుగూడ ఐహిక పారిమార్థిక ఫలదృష్టితోనే నిర్ణయింపఁబడినవి. ఉపవాసమువలన మొదటి సంగతి జీర్ణకోశముయొక్క కర్తవ్యము మిక్కిలి తేలికపడి యది నెమ్మదిగా పని చేయుటకు శక్తి నొంది అందు నిలువా యుండిన కశ్మలము బయటికిఁ ద్రోయఁబడును. రక్తపరిశుద్ధియును భావనానైశిత్యమును గూడ బాగుపడును.

### ఫలభక్షణవిషయము.

పండ్ల నాహారార్థ ముపయోగించుటలో చాల విశేష మున్నది ఫలములలో దేహారోగ్య కరములయిన లవణములును నిర్మలమయిన జలమును ఉండును. దానివలన నెంతటి యానుకూల్య ముండునని చెప్పవలసిన యవసరము లేదు. ఎందు కనఁగా అది సర్వవిదితమే. శరీరము ఆరోగ్యముగా నుండినప్పుడు మనస్సుగూడ ఆరోగ్యముగా నుండి చురుకుగా పని చేయుటకు వీలగునుగదా? **(A sound mind in a sound body)** అని ఆంగ్లేయ వేత్తలయొక్క సూక్తి.

ఏకాదశి మొదలయిన రోజులలో నుప వాసము నూనుటవలన శరీరపరిశోధనజరగు నని తెల్పఁబడినది గదా? ఈ నియమము కేవలము శరీరారోగ్యముకొఱకే యని చెప్పినచో కొన్ని యిబ్బందులు కల్గును, జను లకు కేవలము శరీరవిషయక లాభమే యుండి మానసి కౌన్నత్యము కల్గుటకు వీలుండనిచో లాభ ముండునా? కనుక ఆ నాఁడు దైవధ్యానము చేయ వలయు నని తెల్పఁబడినది. భోజనము లేనినాఁటి రాత్రిని చక్కఁగా నిద్ర రాదు. కనుక జాగర ముండి దేవు నెంచేవలయుననిరి. ఆరోగ్యనియమముల ననుసరించి వైద్యనియ మముల ననుసరించి మఱునటి యుదయ మున సూర్యోదయమునకు భుజింపవలయు ననియును అందు ఆమలకాది భక్షణము జరగ వలయు ననియును తెల్పఁబడినది.

ఏకాదశ్యాదులలో సంపూర్ణముగా నుప వసింప లేని వారు ఫలభక్షణము చేయ నచ్చు ననఁబడి యున్నది. అదియే ఫలాహా రము. ఉపవాసములు చేయుటకు ప్రాల్మా లిక నొంది- (కేవలము వృద్ధులకును బిడ్డల కును రోగులకును నిర్ణయింపఁబడిన) ఫల భక్షణమునకు యావనములోని వారు ప్రా రంభించిరి. జిహ్వాచాపల్యావశమున ఆ ఫల భక్షణము పిండివంటల తిండిగా మాఱి "ఫలా హార" మను మాటకు పిండివంటల తిండి యను నర్థము వాడుక యయినది. ఏ రీతిగా మన వాడుకలు తప్పు త్రోవలకును తప్పుటర్థ ములకును బొల్పడినవో యిందువల్ల తెల్ల మగునుగదా?

ఇందు మేము ముఖ్యముగా విన్నవించు నది ఉపవాసములు ఫలభక్షణము మొదల యిన నియమములు చాల సదాలోచన జని తము లనియును కొందఱు తెల్పినట్లు వట్టి వెఱ్ఱి పద్ధతు లని తలఁపరాదనియును- నయి యున్నది.



# విమర్శనములు.

## గ్రంథములు.

### ఆహారశాస్త్రము

మొదటిభాగము.

చెన్నపురమునందు శ్రీ తేకుమళ్ల. రాజగోపాలరావుగారిచే నెలకొల్పఁబడిన శ్రీ మదాంధ్రసరస్వతీ గ్రంథమాలయం దిరువదిరెండవ కుసుమముగాఁ బ్రచురింపఁ బడినది. 208 పుటల గ్రంథము వెల పోస్టేజి గాక ఒకటిన్నరరూపాయ.

ఆహారవిషయమునం దీ దేశమునందును మిక్కిలిగా తెనుగు వారిలోను తాము పుచ్చుకొను తిండి తమదేహమునకే రీతిగా అవసరమును సరిపెట్టుచున్నదను చర్చ గలవారు చాల తక్కువ. ఆ విజ్ఞానముగల్గుటకుఁగాను పుచ్చుకొను వస్తువులయొక్క తత్త్వము సరిగా తెలియవలయును. దానివలన శరీరమునకే యే వస్తువు లవసరమో తెలియఁగలదు.

ఈ దేశమునందు సుమారు వంద మయిళ్లు పోవునప్పటికే యాహారపద్ధతులు మారును. ఇప్పుడిప్పుడే కాఫీ మొదలయిన పదార్థముల రూపమున సార్వజనైక పద్ధతి భోజనము తలచూపుచున్నది. యూరపునందు ఎంతదూరము వెళ్లినను ఆహారము మార్పు అను బాధ యుండదు. గ్రంథకర్తగా రీ గ్రంథమునందు విశేషముగా ఆంగ్లేయాహార విషయములను వివరించి యున్నారు. ఇప్పటిపద్ధతి భోజనముల వారికీ గ్రంథము ఆ భోజనములను గూర్చి తెల్ప నిల్పడదు. అయినను పాశ్చాత్య నాగరకత బలసిపోవుచుంటం జేసి త్వరలో ఆ దేశము భోజనపద్ధతి గూడ ఈ దేశములోనికి రావచ్చును. అంతియకాక తత్త్వము తెలియఁబడని యీదేశము భోజనము జేయుటకంటెఁ అవసరసమయములలో తత్త్వము తెలియఁబడిన యీ యాహారశాస్త్రము ననుసరించిన భోజనము చేయుట మంచిది కదా యనియు నాలోచింప వచ్చును.

"ఆహారము—దేహపటిమ" "ఆహారములోని పొట్టు" "శరీరములోని లోహాదిపదార్థములు" "శరీరోష్ణము" ఆమ్లత్వము" "క్షారసుగుణము" "మాంసకృత్తులు" అను విషయములును అనుబంధములు నిండుఁ గలవు. గ్రంథకర్తగారు బహు గ్రంథ పరిశోధనతో మిక్కిలి ప్రయాసతో ఇందత్యమూల్య విషయంబులను బొందు పఱచినారు. ఇయ్యది యుపయోగించుకోఁ దలఁచిన వారి కెంతయు నత్యంతోపయోగకర మయిన దనుటకు సందియము లేదు.

సుప్రసిద్ధులయిన సంపాదకుల (శ్రీ తేకుమళ్ల రాజగోపాలరావుగారి) సంపాదకత్వమున ఈ గ్రంథమును ఏతద్గ్రంథమాలయును సమస్తాభ్యుదయముల నొందవలయు నని మా యభిలాష.

## పత్రికలు

### విజయపత్రిక,

విజయనగరమునుండి ప్రచరింపఁబడు సచిత్రమాస పత్రిక. సంపాదకులు శ్రీ కాకులపాటి. కృష్ణమూర్తి గారు. మొదటి సంపుటముయొక్క మొదటి సంచిక ప్రతి మాకార్యస్థానము నలంకరించినది. డబిల్ క్రౌను క్రౌన్ సయిజు 32 పేజీలు. మంచి ఆకృతి. విడి పత్రిక అణన్నర. ఇందు గద్యపద్యమయ వ్యాసములు కలవు. సాంఘిక మత నైతిక సారస్వత విషయము లుండవలయునను నుద్దేశము చూపట్టుచున్నది. ఆయా విషయములను దెల్పుటకు అందమయిన కత లుపయోగింపఁ బడినవి. "మావూరుదేముఁడు" మరివిషయమును "అప్లికేషన్" ఆర్థికవిషయమును. " "ఖిల్జీరాజ్య పతనము" విమర్శనమును "శ్రీ విజయనగర పూసపాటి మహారాజ పూర్వ ప్రశస్తి గద్యము" చరిత్ర

విషయములను "సదరు షణ్ముగం" హాస్యరసమును మొదలుగా నానాప్రయోజనములను వెలయించుచున్నది. వ్యావహారిక మభిమానభాష. మొత్తమునకు పత్రిక ఆంధ్రులప్రోత్సాహముఁ గోరుచున్నయది. కేవలము వ్యావహారికమే గాక గ్రాంథిక భాషామయ వ్యాసములు గూడఁ గలవు. కనుక అందందుఁ గల మంచిని గైకొన నీ పత్రిక యిచ్ఛగించినట్టు తోఁచెడిని. పరమాత్ముఁడు విజయకు విజయమొసంగును గాక!

### ఐరావతి దీపావళి సంచిక.

రంగూను నగరమునుండి ప్రకటింపఁబడుచున్న ఐరావతి యను వారపత్రిక ప్రకటించిన దీపావళి సంచిక డబుల్ క్రౌను ౧౦౨ పుటలు. వెల రు. ౦ - ౬ - ౦.

బర్మా ఆంధ్రుల ఆంధ్రభాషాభిమాన సూచకము నీ సంచికయందు పేరుపడిన బర్మా ఆంధ్రులు స్థానికాంధ్రులును రచించిన గద్యపద్య వ్యాసములు చాల గలవు. అవి బర్మాకు వలసపోయిన ఆంధ్రుల స్థితిగతులను, దేశభాషావాఙ్మయాభిమానమును తెలుపఁజాలి యున్నవి. బర్మాయందల సుప్రసిద్ధులయొక్క దర్శనీయ ప్రదేశములయొక్కయు చిత్రము లిదు పెక్కు గలవు. సుప్రసిద్ధ చిత్రకారులు శ్రీ అంకాల వెంకటసుబ్బారావుగారు చిత్రించిన "నరకాసురవధ" యను ముఖచిత్రము హృదయంగమముగ నున్నది. అన్నివిషయములను తగిన సౌకర్యములు లేకున్నను బర్మాఆంధ్రు లొనర్చు నీ భాషావాఙ్మయ పరిపోషణము ప్రశంసనీయము. ఐరావతి యిట్టి విశేష సంచికల నప్పుకప్పుడు ప్రకటించి ప్రశస్తిని పడయుఁగాక!

---

## స్వీకారము.

### గ్రంథములు.

నాగకన్య:—[శ్రీ సోడ్ఢలకవి విరచితసంస్కృత గ్రంథమునకు తెనిగింపు.] రచయిత వంగల వేంకటరామశాస్త్రిగారు. క్రౌను ౧౨౧ పుటలు. వెల ముప్పావలా. వలయువారు "వంగల వేంకటరామశాస్త్రిగారు, తాడికొండ; గుంటూరుజిల్లా." యని వ్రాయవలయును.

సులభ్యవస్తు వైద్యబోధిని:—కర్త, సరస చతుర్విధ కవితాసామ్రాజ్య ధురంధర - నాదెళ్ల పురుషోత్తమ కవివరులు. వెల 6 అణాలు తపాలుకూలి ప్రతేకము. డెమ్మి 47 పుటలు. వెల ఆఱు అణాలు. దొరుకుచోటు నాదెళ్ల పురుషోత్తమకవిగారు, మచిలీపట్టణము.

### పత్రికలు.

మాధురి—మాసపత్రిక. డబుల్ క్రౌను ౩౨ పుట. సంపాదకులు. పి. వెంకట రామయ్యగారు. సం. చందా రు. ౦-౧౧-౦ లు. విడిసంచిక ఒకఅణా. వలయువారు, "మాధురి - తెనాలి" అని వ్రాయవలెను,

The young Reader (ది యెంగ్ రీడరు) ఆంగ్లమున బాలురకై ప్రత్యేకముగా ప్రకటింపఁబడు సచిత్ర మాసపత్రిక. డబుల్ క్రౌను 16 పుటలు. సంపాదకులు వి. యస్. కృష్ణస్వామిగారు. బి. ఏ ఎల్. టి. సంవత్సరము చందా రు. 1-8-0. విడిసంచిక రెండు అణాలు. వలయువారు "ది లిటిల్ ఫ్లవర్ కో. బుక్కుసెల్లర్సు: 317 లింగచెట్టివీధి, జి. టి. మద్రాసు" అని వ్రాయవలెను.

# క్రిస్టుమస్ సీజన్ టిక్కెట్లు

## మదరాసు అండు దక్షిణ మరాటా రైల్వేమీద

## 10-రూపాయలకు

## ప్రత్యేకమగు మూడవ తరగతి ప్రయాణము.

## 1934-వ సం॥ డిశంబరు నెల 20-వ తేది మొదలు

## 1935-వ సం॥ జనవరి నెల 15-వ తేది వరకు.

---

ఎమ్. ఎస్. ఎమ్. రైల్వే కొన్ని ప్రాంతములమీద యిష్టము వచ్చి నన్నిమార్లు ప్రయాణము చేయుటకు అవకాశము కలదు. ఇందుకు అతి తక్కువయైన రు. 10 లకు అమ్మబడే ఈ టిక్కెట్టును కొని ఆయా యాత్రాస్థానములను వెళ్లునపుడు యాత్రికుల పన్ను స్వల్ప మూల్యముగల పన్ను టిక్కెట్లు బుకింగు ఆఫీసులవద్ద కొని హాయిగ ప్రయాణము చేయవచ్చును.

ప్రాంతమున కొక టిక్కెట్టువంతున మూడు వేరువేరు ప్రాంతములకును మూడు వేరువేరు టిక్కెట్లు యున్నవి.

"ఏ" సీరీస్ టిక్కెట్టుకు యీ క్రింది సెక్షనులు చెందును:—

| | | | |
|---|---|---|---|
| బెంగుళూరు | పూనా | లోండా | మార్మగోవా హార్బరు |
| మిరాజ్ | కోల్హాపురం | హుబ్లి | హాస్పేట |
| మిరాజ్ | సాంగ్లి | గదగ్ | షోలాపురం (ఎం. ఎస్. ఎం.) |

"బి" సీరీస్ టిక్కెట్టుకు యీ క్రింది సెక్షనులు చెందును:—

| | | | |
|---|---|---|---|
| మదరాసు | రాయచూరు | బెంగుళూరు | ఆర్కోణము |
| ద్రోణాచలం | హాస్పేట | వాలాజారోడ్డు | రాణిపేట |
| బళ్లారి | రాయదుర్గ | కాట్పాడి | రేణిగుంట |
| గుంటకల్లు | బెంగుళూరు | బౌరింగుపేట | మారికుప్పం |

"సి" సీరీస్ టిక్కెట్టుకు యీ క్రింది సెక్షనులు చెందును:—

| | | | |
|---|---|---|---|
| మదరాసు | విశాఖపట్నం | గుంటూరు | మాచెర్ల |
| మదరాసు | రేణిగుంట | నిడదవోలు | నర్సాపురం |
| తిరుపతి | గూడూరు | గుడివాడ | భీమవరం |
| నర్సరావుపేట | బెజవాడ | సామర్లకోట | కాకినాడ |
| బెజవాడ | మచిలీపట్నము | కాకినాడ | కోటిపల్లి |
| గుంటూరు | రేపల్లె | | |

ప్రతి ప్రాంతపు ప్రయాణావకాశమును 900 మైళ్లకు మించియున్నది. మార్గమధ్యమున యెక్కడనయినను ప్రయాణము నిలుపవచ్చును. మొత్తము రోజులు మించకుండ యెన్ని నాళ్ళయినను ఆ లైనులో యెక్కడ ఆగినను ఫరవాలేదు.

ఈ టిక్కెట్లలో దేనిని కొన్నను ఆ శెక్షనుకు చెందిన టిక్కెట్టుతో మీ యిష్టము వచ్చినన్నిమారులు ఆ శెక్షనుమీద పోవు యే బండిమీదనైనను అనగా మెయిలు లేక ప్యాసింజరు బండ్లమీద డిశంబరునెల 20-వ తేది నుండి 1935-వ సం॥ జనవరినెల 15-వ తేది అర్ధరాత్రివరకును యథేచ్ఛగా ప్రయాణము చేయవచ్చును.

మీరు 30 రూపాయలకు యీ మూడు టిక్కెట్లను కొన్నయెడల యీ 27 దినములలో ఎమ్. ఎస్. ఎమ్. రైల్వేనంతా పూర్తిగా ప్రయాణముచేసి రావచ్చును. ఇది కారుచౌక. తూర్పుకోననుండి పడమటి తీరమువరకు గల దేశమునంతటిని అతి స్వల్పమగు మూల్యమునకు చూడవలెనంటే యిదియే మంచి అవకాశము.

మఱియును సాధారణముగ క్రిస్టుమసుకు యియ్యబడే మొదటి తరగతి, రెండవ తరగతి, మూడవతరగతి క్రిస్టుమసు తగ్గింపు టిక్కెట్లు యిప్పుడు కూడ మీ సౌకర్యమునకు గాను కల్పింపబడియున్నవి. గాన దానిని మీరు వినియోగించుకొనవచ్చును.

1934-వ సం॥ డిశంబరు నెల 14-వ తేది మొదలు; 1934 డిశంబరు 31-వ తేదివరకు (రెండు దినములు చేర్చి) యీ క్రింది చూపబడిన తగ్గింపు రేట్ల ననుసరించి చౌకయగు తిరుగు ప్రయాణపు టిక్కెట్లు ఎం. ఎస్. ఎం. రైల్వేమీద జారీ చేయబడును.

| | |
|---|---|
| 100 మైళ్లకు పైబడిన దూరములో నున్న యే రెండు స్టేషనుల మధ్యనైనను | 1, 2 తరగతులకు ఒక ప్రయాణపు చార్జికి అందులో మూడవ వంతుచార్జి కలిపి ఆ తక్కువధరకు తిరుగు ప్రయాణపు టిక్కెట్టు యియ్యబడును. 3-వ తరగతి తిరుగు ప్రయాణపు టిక్కెట్టు ఒక ప్రయాణపు చార్జికి అందులోని ½ చార్జిచేర్చి ఆ ధరకు యియ్యబడును. |
| 100 మైళ్లుగాని అంతకు తక్కువ గాని దూరములోన గల రెండు స్టేషనులకు | 1, 2 తరగతి తిరుగు ప్రయాణమునకు 101 మైళ్లకు అయ్యే చార్జికి 1⅓ రేటునకు 3-వ తరగతి తిరుగు ప్రయాణమునకు 101 మైళ్లసాధారణచార్జికి 1½ రేటునకును యీయబడును. ఈ రేట్లు రెండు సింగిల్ ప్రయాణపు చార్జికంటె తక్కువగా యున్నయెడల తిరుగు ప్రయాణపు టిక్కెట్లు అమ్మబడును. |

ఈ తిరుగు ప్రయాణపు టిక్కెట్టు కొనినవారు తిరుగు ప్రయాణమును 1935-వ సం॥ జనవరినెల 14-వ తేది అర్ధరాత్రిలోగా పూర్తిచేయవలయును.

ఇంతేగాక 1934-వ సం॥ డిశంబరునెల 14-వ తేదినుండి 31-వ తేది వరకు మదరాసు బొంబాయిల మధ్య ప్రయాణము చేయువారికి సౌకర్యార్థము చౌకయగు సర్క్యులర్ టూర్ టిక్కెట్లు సాధారణపు చార్జీలకు 3-వ వంతు తక్కువగ అమ్మబడును. ఈ టిక్కెట్లు పొందువారు 1935-వ సం॥ జనవరి నెల 14-వ తేదీ అర్ధరాత్రి లోపుగా తిరుగు ప్రయాణమును పూర్తిచేయవలయును.

సర్క్యులర్ టూర్ చార్జీలు.

ఒకటవ తరగతి—రు. 138-3-0, రెండవ తరగతి—రు. 69-1-0, మూడవ తరగతి (1, 2 తరగతి ప్రయాణీకుల సేవకులకు మాత్రము) రు 23-13-0.

ఈ టిక్కెట్లు కొన్నవారు బొంబాయికి బెంగుళూరు పూనా మీదుగానైనను లేదా రాయచూరు మీదుగానైనను ప్రయాణము చేయవచ్చును. పోవు ప్రయాణమును ఒక మార్గమున చేసినయెడల తిరుగు ప్రయాణమును రెండవ మార్గమున చేయవచ్చును. ఏమార్గమున ప్రయాణము చేసినప్పటికిని సౌకర్యమైన రైలుబండ్లున్ను సకల సదుపాయములుగల రెస్టోరెంటు బండ్లును యుండును.

సామాన్యపు క్రిస్టమసు తగ్గింపు రిటర్ను టిక్కెట్లకు యీక్రింది నిబంధనలను గమనించవలయును.

1. నిబంధనములు:—ఈ ఎం. ఎస్. ఎం. రైల్వేలో మాత్రము ప్రయాణము సలుపు మూడవ తరగతి క్రిస్టమసు రిటర్ను టిక్కెట్టుకొనువారు (I-వ II-వ తరగతుల వారి సేవకులు గాక) క్రింద కనుబరచిన బండ్లలో ప్రయాణము జేయరాదు.

| | |
|---|---|
| (1) నెం. 7 & 8 బెంగుళూరు మెయిల్లు<br>(2) నెం. 1 & కలకత్తామెయిల్లు<br>(3) నెం. 21 & 22 బొంబాయి మదరాసు ఎక్స్ప్రెస్‌లు | 100మైళ్ళలోపు టిక్కెట్టువారు ఉపయోగింపరాదు. 100 మైళ్లు, అంతకు అధికము ప్రయాణము చేయువారు ఉపయోగింప వచ్చును. |

(4) నెం. 13 & 14 ఎస్. ఐ. రైల్వే మలబారు ఎక్స్ప్రెస్‌లు, నెం. 45 & 50 బ్లూమౌంటెన్ ఎక్స్ప్రెస్‌లలో మదరాసు—జోలారుపేటలకు మధ్య టిక్కెట్లు గలవారు ప్రయాణము చేయగూడదు. జోలారుపేట మార్గముగా ఎస్. ఐ. రైల్వే స్టేషనులకు టిక్కెట్టు గలవారు యీబండ్లలో ప్రయాణము చేయవచ్చును.

2. మార్గమధ్యమున ఆగుట:—ఈ రిటర్ను టిక్కెట్లు గలవారు మార్గమున నున్న స్టేషనులలో యెన్ని పర్యాయములైనను దిగవచ్చును. తమ యిష్టప్రకారము యెంత కాలమైనను యుండవచ్చును. కాని ఒకే ప్రయాణమునందు ఒక పర్యాయము దిగిన స్టేషనులో మరొక పర్యాయము దిగకూడదు. పైటిక్కెట్లకు గల కాలమును అతిక్రమించకూడదు. దిగునట్టి స్టేషనులలో రైల్వే వుద్యోగస్తుల యొద్దనుండి టిక్కెట్ల మీద తాము దిగినట్టియు, తిరిగి యెక్కినట్టి వివరములను వ్రాయించుకోవలయును. టిక్కెట్లు యివ్వబడిన రోజే ప్రయాణము ప్రారంభింప వలయును.

3. 1, 2-వ తరగతుల చౌక రిటర్ను టిక్కెట్లు గలవార్లకు వీలున్నచో స్థలము రిజర్వు చేసుకొనవచ్చును.

4. మూడేండ్లకు పైబడి పండ్రెండేండ్లకు లోబడిన పిల్లలకు పైనుదహరించిన చార్జీలలో అర్ధచార్జీకే టిక్కెట్లు యియ్యబడును.

5. మూడవ తరగతి రిటర్ను టిక్కెట్లుగలవారు, పైతరగతులకు గల వ్యత్యాసపు చార్జీలు యిచ్చినను పై తరగతులలో ప్రయాణము చేయుటకు అనుమతిని యొసంగబడదు.

6. ఏ పరిస్థితులలో నైనను యీటిక్కెట్ల ధరలు వాపసు చేయబడదు. డబ్బు ఎంత అధికముగా యిచ్చుటకు సిద్ధముగా నున్నను, యీరిటర్ను టిక్కెట్లకు గల కాల పరిమితిని పొడిగించుటకు సాధ్యపడదు. యీ టిక్కెట్లు గలవారు—సూచించిన మార్గముగాక యితర మార్గములలో ప్రయాణము చేయకూడదు.

# శ్రీ మదాంధ్ర మహా భారతము

## ఆంధ్ర వచనము.

---: o :---

"మహత్వాద్భారవత్వాచ్చ మహాభారత ముచ్యతే" అని యీ భారతము గొప్పదగుటచేతను, భరతఖండమందలి ధర్మక్షేత్ర మగు కురుక్షేత్రాది వృత్తాంతములను దెల్పుటచేతను, భరతునివృత్తాంతమును ప్రతిపాదించుటచేతను లోకమునఁ బ్రసిద్ధిఁ జెందినది. "భారతః పఞ్చమో వేదః అన్నట్లు వేద మనుట జగద్విదితము. కేవలము వేదము మాత్రమే కాదు. "ఇదంకురు ఇదంమాకార్షీః" అనునట్లు ఇది చేయుము, ఇది చేయకుము అని చెప్పుటచే వేదమును, సర్వమును వదలి నన్నే శరణము పొందుము అని గీతలో ఉపదేశించుటచే వేదాంతమున కంటె నధికమైనదియును నగును. ఇయ్యది మిక్కిలి సారమైపదునెనిమిది పర్వములుగవిభజింపఁబడినది. పర్వములనగణుపులు. చెరుకుయొక్క గణుపు లెట్లు రసవంతములో అటులే ఇందలి పర్వములు రసవంతములైన కథలు గలవి. ఇది అన్నింటిసారము. సకల శాస్త్ర సర్వస్వము. రాజోత్తముల యుదాత్త చరిత్రములును, మహర్షుల మహత్త్వవిశేషములును, శ్రీకృష్ణపరంధాముని వాత్సల్య సౌశీల్య పరమ సౌలభ్యాది గుణవైభవములును, అతి మానుష చేష్టితములును, నిందుఁగలవు. ఇంతేకాక ఇందు బ్రాహ్మణాది బ్రహ్మచర్యాది వర్ణాశ్రమధర్మములును, ప్రవృత్తి నివృత్తిధర్మములును, స్వామిభృత్య ధర్మములును, ఆపద్ధర్మములును, దేశక్షేమహామాడంబరాది సూచనలును, అన్నియు నిందుఁగలవు. ఇందలి యవాంతరకథలా ఇన్నియన్నియని చెప్ప నలవిగాదు. ఇది కథకు కథ. వేదమునకు వేదము. "పురాపి నవం పురాణమ్" పూర్వము జరిగినవానినైనను నూతనముగ జరిగినవిగ జెప్పుటచే పురాణమునకు పురాణము "ఇతిహాసః పురావృత్త" మనునట్లు పూర్వవృత్తమును దెల్పు ఇతిహాసమునకు ఇతిహాసము. "శాసనాచ్ఛాస్త్ర" మనునట్లు ధర్మముల శాసించునట్టి శాస్త్రమునకు శాస్త్రము. "కవేః కర్మ భావో వా కావ్య" మ్మను కవి చాతుర్యమును దెల్పు కావ్యమునకు కావ్యము. ఎద్దానికి అది, అన్నిటికి అన్ని. "యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్" అని ఇందుఁ గలదియే తక్కిన యెడనుగలది. ఇందు లేనిది మఱియెందును లేనిదే. ఈ భారతమున తంత్రములు, తత్త్వరహస్యములు, హితములు, భీష్మ కృప సంజయ విదుర శ్రీ కృష్ణాదులయొక్క హితోపదేశముల

సంపుటము ౧

సంచిక ౧౨

# చంద్రిక

## సచిత్ర మాసపత్రిక

భావ సం॥ మాఖమాసము

ఫిబ్రవరి 1935

ఆనందముద్రణాలయము

మద్రాసు

౧౯౩౫




—:o:—

---

# చిత్రములు

(1) అలంకృతి—(2) జపాన్ కన్య—(3) " దమయంతి-సోమేశ్వరరావు—(4) కీ॥ శే॥ బొల్లిని మునిస్వామినాయుఁడుగారు.

—:o:—




అలంకృతి

చిత్రకారుడు: ఎస్. దుర్గారావు




| సంపుటము | చెన్నపట్టణము, ఫిబ్రవరి, ౧౯౩౫ | సంచిక |
| --- | --- | --- |
| ౧ | భావ సంవత్సర మాఘమాసము | ౧౨ |

# భ్రమరకాంతుఁడు

ఓలేటి సీతారామమూర్తిగారు, బి. ఏ.

౧

వలపుటాకలి యెడఁదలోఁ బ్రబ్బికొనఁగ [illegible]
వికసితాహ్లాద మీ కుంజవీథి[illegible]ందు
వరుస నొక్కొక్క ననచాన పజ్జ కదిగో !
వెడలు భ్రమరకాంతుఁడు ప్రేమభిక్షకొఱకు.

౨

నిస్తులానందరసము స్యందించుచున్న
షట్పదవతంసు ప్రణయశాంతప్రగీతి
పరిమళస్ఫూర్తిఁ దోఁగి యీప్రకృతికాంత
హాసదృక్తతితోడ మాధ్య్యము వహించె.

3

యౌవనానూన సందీప్త లలముచుండు
ముగ్ధనయనాల సఖుని క్రొమ్మెరుపు గాంచి
పచ్చివలపులు గురువులు వాఱుకొనఁగ
నెడఁద, మల్లి కాసతి పులకించుచుండె !

౪

తులలేని తెలినవ్వు పలుకరింతలతోడఁ
గాననలక్ష్మి స్వాగత మొసంగ
హృద్యలతా పత్ర మృదుతాళవృంతాన
నూత్నాగత సమీరణుండు వీవ
గొజ్జంగిపొదరిండ్లు గొనబు వేఁకువ మంచు
ముత్యాలసేసలమురువు సూప
గోరువంక చెలికాడు పరువమ్ముదోలుకాడు
హాస్యప్రసంగాల హర్ష మీన
ప్రకృతిరాజ్యాధిపుండు బంభరవరయోవి
లాస నుతమూర్తి కుసుమ విలాసవతుల
అమిత రాగార్ద్రదృష్టి వాహ్యాళిఁగొఱకు
నేగుదెంచెడు—అతఁడు ప్రేమైకజీవి.

సొగియు నొకపూవు డొందాన సుప్తిఁజెంది
ఒక సుమశ్యామ కౌఁగిట నోలలాడి
ప్రకృతిలోఁ బ్రేమకల్యాణర క్తినించు;
భ్రమరుఁ గికురించు తతభోగపరు డెవండు??

---

## మగ—రోఁకలి

విద్వాన్ పి. పాపారావుగారు

ద్రావిడభాషలోనుండు పెక్కు పదములు సంస్కృత జన్యములనుటలో నావంతయు సందేహము గానరాదు. కాని యందులోఁ గొన్ని పదములు మాత్రము తద్భవ పదము లని నిర్ణయింప వీలులేనట్టి స్థితిలో నున్నవి. వానిని విమర్శనా బుద్ధిని సూక్ష్మ దృష్టితోఁ బరికించినఁగాని యెఱుంగుట కష్టము. అట్టి పదములలో 'మగ' పద మొకటి. ఈ 'మగ' పదమును ఆంధ్రులు పురుషవాచకముగా వాడుచున్నారు.

ఉ॥ మగవాఁడు, మగఁడు, మగటిమి మగతనము మొ॥

ఈ పదమునకు సరియగు పురుషవాచక పదము సంస్కృతమున నగపడలేదు.

కాన నిది శుద్ధాంధ్ర దేశ్యమని పలువురి తలంపు. ప్రౌఢవ్యాకరణ, శబ్దరత్నాకరాది బహు గ్రంథకర్తయగు బహుజనపల్లి సీతా రామాచార్యులుగారును దేశ్యమనియే చెప్పియున్నారు. కాని యిదికూడఁ దద్భవ మనియే నాయూహ, చూడుఁడు.

కొన్ని పదము లొక భాషనుండి మఱియొక భాషకు రాఁగానే యుచ్చారణమునను, నక్షరమునను గాక యర్థమునను మార్పును బొందుచున్నవి. 'నిజము' - అను పదము సంస్కృతమున నున్నది. దీనికి 'తన' అని యర్థము. ఇదియే తెలుఁగున నున్నది. దీనికి 'సత్యము' అని యర్థము. ఇంకను నిట్టి పదంబులు పెక్కులు కలవు.

| సంస్కృతము | తెలుఁగు. |
|---|---|
| ఉ॥ తరువు(చెట్టు) | —తరువు ఋణము నిమ్మని నిర్బంధించుట. |
| కరము (చెయ్యి) | —కరము (మిక్కిలి) |

వీని కన్నిటికిని నర్థమున మార్పెట్లు వచ్చినదో దురూహ్యము. ఇంతేగాక యొకే పదము పెక్కు భాషలలోఁ, బెక్కు స్థలముల నుపయోగింపఁబడి పలువిధములగు నర్థముల నొసంగుచున్నది.

'బేడ' అను పదము తెనుంగున నున్నది. విశాఖపట్టణముజిల్లావారు దీనిని 'రెండణాలు' అను నర్థమున వాడుదురు. కడప, కర్నూలు, అనంతపురము, బళ్లారి జిల్లాలవారు దీనినే 'పప్పు' అను నర్థమున వాడుదురు. ఉ॥ కందిబేడలు, పెసర బేడలు. కన్నడ భాష యందును నీ పదమే కలదు. వారు 'వద్దు' అను నర్థమున దీనిని వాడుదురు. ఇట్లే భాషలలో ననేక చిత్ర విచిత్రములు కలవు. వీని నన్నిటిని కనుంగొనుట మిగుల దుస్సాధ్యము.

'మగ' శబ్దము కూడ నిట్లే సంస్కృతము నుండి తెనుఁగునకుఁ దద్భవరూపముగా వచ్చి యర్థమున మార్పుచెందినదని తోఁచుచు

న్నది. అది యెట్లందురా? చూడుఁడు. సంస్కృతమున 'మహాన్' అను పదము కలదు. ఈ పదమును ధైర్య సాహసాదార్యాది సద్గుణ సంపన్నుఁడగు వాని విషయమున వాడుదురు. ఈ 'మహాన్' పదమును అరవవారు 'మగాన్' అని యుచ్చరింతురు. ద్రావిడభాషలలో 'హ' కారము 'గ'కారముగా మారుచుండుట స్వభావము కదా.

సంస్కృతము అరవము తెలుఁగు.

ఉ॥ ఆహారము ఆగారము ఓగిరము.

తెనుఁగునకంటె నరవమున నీ విషయము స్పష్టముగాఁ దెలియును.

ఉ॥ సం. మహాత్మా - అ. మగాత్మా, సం. విహారము - అ. విగారము.

ఇట్లే సంస్కృతపదములలోని 'హ'కారను అరవమున 'గ'కారముగా నుచ్చరింపఁబడును. ఎప్పు డట్లుచ్చరింపఁబడునో వ్రాఁత యందును నట్లే వ్రాయఁబడుననుటలో లేశంబును సందేహము గానరాదు. ఇట్లు హకారము గకారముగా మారుచుండుటచే 'మహాన్' అనునది 'మగాన్' అయినది. దీనినే యుచ్చారణసౌకర్యార్థము 'మగ' అని యుచ్చరించి యుందురు. ఈ పదమే తెనుఁగున కేవలపురుషవాచకము క్రింద వాడఁబడుచున్నది. ఇది మహచ్ఛబ్దభవమే యైన 'మహతి' అని స్త్రీలింగమునఁగూడ నున్నదే! దీనినేల కేవల పురుష వాచకము క్రిందనే వాడుచున్నారని యందురేమో? చూడుఁడు. అరవభాషలో మాత్ర మిది రెండు లింగములందును వాడఁబడుచున్నది. అనఁగా - కేవల పురుష, స్త్రీ వాచకముల యందుఁగాక కొడుకు, కూఁతురు-అల్లుఁడు, కోడలు అను నర్థమున వాడఁబడు చున్నది.

పుంలింగము. స్త్రీలింగము.

ఉ॥ మగన్ (కొడుకు) - మగళ్ (కూఁతురు)
మరుమగన్ (అల్లుడు)మరుమగళ్ (కోడలు)

తెనుగున మాత్ర మిది స్త్రీవాచకముగా వాడఁబడుచున్నది. ఇందుకుఁ బూర్వోదాహృతభాషావైచిత్ర్యమే గారణము కానోపును.

మఱియు నీ పదము కేవల పురుష వాచకముగానే గాక సంస్కృతమున 'మహాన్' శబ్ద మేయర్థమున వాడఁబడుచున్నదో యా యర్థముననే తెనుఁగునను నించుమించుగా వాడఁబడుచున్నది.

ఉ॥ నీవంటి మగవాని కిది పాడిగాదు.

ఇచ్చట కేవల పురుషుఁ డని యర్థమా? కాదు. ధైర్యసాహసాదార్యాది గుణ విశిష్టుఁ డనియే యర్థము. అందుచేతనే బ॥ సీతారామాచార్యులుగారు శబ్దరత్నాకరమున 'శూరుఁ' డనియు వేఱొక యర్థమును వ్రాసియున్నారు. ఇందుకుఁ బ్రయోగము లనేకములు కలవు. ఒకటి, రెండిని మాత్ర మిచట నుదాహరించెదను.

1. తనయింతి నొకనిచేఁ దాఁ గోలుపోయి, మన నిచ్చ చేయుట మగపాడికాదు.

2. మగఁటిమి కలవాఁడవేని మఱి నిలుము.

ఈ పూర్వోదాహృతకారణములచే నీ 'మగ' శబ్దము మహచ్ఛబ్దభవ మనియే నా యభిప్రాయము.

**రోఁకలి**-ఇట్టి పదములలోఁ జేరినదే రోఁకలి యను పదమును. దీనిని గూడ నెవరును దద్భవ మని తలంపఁజాలరు. కేవలదేశ్యమనియే తలంతురు. కాని యిదికూడఁ దద్భవ మనియే నా యభిప్రాయము. సంస్కృత మున 'ఉలూఖలము' అను పదము కలదు. దీనికి 'ఱోలు' అని యర్థము. ఈ 'ఉలూఖ లమే' అరవ భాషయందు 'ఉలక్కై' అయి నది. కాని యర్థమున రెంటికిఁ జాల భేదము కలదు. అరవమున 'ఉలక్కై' నకు రోఁకలి అని యర్థము. సంస్కృతమున ఉలూఖల మునకు ఱోలు అని యర్థము ఇట్లర్థమునఁ దారమారగుటకు ఉలూఖల ముసల పదార్థ భ్రమయే కారణము కానోపును. ఇది తఱ చుగా జరుగుచుండును.ఇందాశ్చర్య మంతగా లేదు; కాన నిది తప్పక యులూఖల శబ్ద భవమే కానోపును. ఇంక తెలుగున రోఁకలి యనునది ఉలూఖల భవమెట్లో నిరూపింప వలయును. సాధారణముగఁ దత్సమము తద్భ వముగా మారునపుడు వర్ణలోప, వర్ణాగమ, వర్ణవ్యత్యయ, వర్ణాదేశ రూపములగు మార్పులఁ బొందుచుండును. ఇందు మొదటి యచ్చు లోపింపఁగా "లూఖల"మని యుం డును. లకారము రకారముగా మారెను. తద్వర్తి 'ఉ'కారముఓ'కారమయ్యెను.రకా రము లకారముగా మారుట కుదాహరణము.

రేఖ-లేఖ; తరము - తలము.

ఉకారము 'ఓ' కారముగా మారుటకు-

పురము - ప్రోలు; ప్రాంతము - పొంత.

'ఖ' అను నక్షరము శుద్ధాంధ్రమున నుండదు గాన నది 'క' అగును. లకారోపరి వర్తి యగు 'అ' కారము 'ఇ' కారముగా మారఁ రోఁకలి యనునది నిష్పన్న మగు చున్నది. అర్థ భేదము పూర్వమువలె నూహించునది.

బహుశః యీ యభిప్రాయమును మన స్సులో నుంచుకొనియే శబ్దరత్నాకర కారు లగు బహుజనపల్లి. సీతారామాచార్యులు గారు రోఁకలి యనునది వైకృతము అని వ్రాసి యున్నారని తోఁచుచున్నది. కాని వారు దానిని స్పష్టముగా నిర్వచింపలేదు.

లక్ష్మీనారాయణీయమునందు మాత్ర మిది గోకిలశబ్దభవమని యున్నది. గోకిల యనఁగా రోఁకలి యని యర్థమఁట. ఈ గోకిల పదము అమరనిఘంటువున లేదు. సుప్రసిద్ధపదము కూడఁ గాదు. పలువురు విద్వాంసులకు నిఘంటువును జూడనిది దీని కర్థము చెప్పుట దుర్లభమనియే నా తలంపు. కాన, నిట్టి యప్రసిద్ధ గోకిల పదమునుండి రోఁకలి యను పదము పుట్టినదనుటకంటెను లూఖల శబ్దమునుండియే పుట్టినదనుట యుత్త మము. అర్థభేదమునకుఁ గారణము ఆశ్ర యాశ్రయ లగు ముసలోలూఖల శబ్దముల యర్థభ్రమయే యని తోఁచుచున్నది. ఇందలి యుక్తాయుక్తములను వివేకులగు పండితులే యరయుదురుగాక.

# హాస్యము—సమాజము

కొల్లిప్పిడి. రామలింగారు

మానవుడు జీవించడానికి వాయువు యెంత అవసరమో కావ్యము ఆకర్షణీయంగా ఉండడానికి రసపోషణ అంత అవసరము. శృంగార రసాన్ని రుచిచూడాలంటే శాకుంతలనాటకం చదివి తీరాలి. కృష్ణరాయల కాలంనాటి ఆంధ్రవీరుల చరిత్ర మనకు జ్ఞాపకం తేవాలంటే రయితచకు వీరరసం ఉట్టిపడించే శక్తి ఉండాలి. ఏకావ్యమైనా రసవంతంగా ఉన్నప్పుడే అన్నికాలాలవారి మన్ననలకూ పాత్రమవుతుంది. కాని పరిశోధకనవలలవంటి కథాప్రాముఖ్యమైన గ్రంథాల్ని ఒకసారి చదివినంతమాత్రాన్నే వాటి ప్రయోజనం తీరిపోతుంది. అయితే కావ్యరచనలో రసపోషణ యింత ప్రాముఖ్యమైన స్థానం ఆక్రమిస్తున్నదికదా, అన్నిరసములతోపాటు హాస్యరసాన్ని మనకవులు ఆదరించారా ? ఆంధ్రసారస్వతంలో హాస్యరసం అన్ని రసములవలె సరియైన స్థానాన్ని ఆక్రమించినదా ?

ఆంధ్రసారస్వతంలో హాస్యరసప్రధానమైన గ్రంథాలే కావాలంటే అవి చాలా అరుదుగా ఉన్నాయి. వేదుల సత్యనారాయణ శాస్త్రిగారు చెప్పినట్టు ఏ విజయవిలాసంలోనో లేక ఏహారవిలాసంలోనో కొన్నిచోట్ల నున్నితమైన హాస్యరస సంఘుట్టనలు కనిపించవచ్చునుగాని కేవలము హాస్యరసప్రధానమైన గ్రంథాలు మన సారస్వతంలో చాలా తక్కువగా ఉన్నవని యిదివరకే చెప్పినాము. హాస్యము కేవలము మనోవికాసాన్ని కలిగించడానికి తప్ప మరెందుకూ పనికిరాదనిన్నీ, హాస్యరసమును మిగిలిన రసములవలె ప్రోషించనక్కరలేదనిన్నీ మన కవులు అనాదరణచూపబట్టే హాస్యరసము అధోగతి పాలైనది. హాస్యము కేవలము మనోవికాసాన్ని కలిగించుటకు మాత్రమే కాదని నా మనవి. గ్రామాఫోను లోని హాస్యపుపాటలు విన్ననూ, అమ్మవారిసంబరము మొదలగు ఉత్సవములలో హాస్యపాత్రా వేషధారులను చూసిననూ, సినీమాలలో కామిక్ చూసిననూ మనోవికాసం గలుగుతుంది. ముఖ్యంగా విద్యనేర్వని పామరజనానికిపైన చెప్పిన సందర్భాలే ఎక్కువగా మనోవికాసాన్ని కలిగిస్తాయి. కనుక మనోవికాసానికి మాత్రమే హాస్యము చేయూత నీయనక్కరలేదని మనవి.

అయితే మన సారస్వతములో హాస్యము యిప్పుడు ఎలాగ చెలామణీ అవుతున్నాదో తేలుసుకోవాలి. వెక్కిరింపుకూడా హాస్యమే అని భ్రమపడేవాళ్లు ఏచాదస్తపు పుల్లమ్మ చరిత్రతో ప్రహసనాలకింద వెళ్లగక్కుతున్నారు. కొందరు తమ శత్రువులపై కసి తీర్చుకోడానికి వారిశత్రువులకుండే గుణాల్ని ఏకు-

క్కకో పిల్లికో ఆరోపించి దాన్ని తిడతారు. యింతకంటె మోటుహాస్యము మరి ఉండదను కుంటాను. ప్రస్తుతము అసభ్యపు వ్రాతలు కూడా హాస్యముకిందే చెలామణీ అవుతు న్నాయి. దీనంతకు కారణము మిగిలినరసను లవలె హాస్యరసము కూడ సంఘకళ్యాణానికీ, ప్రజాభ్యుదయానికీ తోడ్పడుతుందని తెలిసి కొనకపోవడమే. యీసంగతే మనకవులు గమనించినట్లయితే హాస్యరసము ఎప్పుడూ యింతహీనస్థితికి రాదు.

18-వ శతాబ్దం ప్రారంభంలో యింగ్లండు దేశంలో ఉన్న సాంఘికలోపాల్ని రూపు మాపి సంఘౌన్నత్యంకోసం పాటు పడిన సుప్రసిద్ధ కవీశ్వరుడైన Joseph Addison తన దైనికపత్రికయగు స్పెక్టేటరును నడిపించు టలో తన ప్రధానాశయములను యీవి ధంగా సూచించేడు.

..To correct the vices, redicule the follies, dissipate the ignorance..........were the great and noble objects of Spectator,.......... by enlivening morality with wit and tempering wit with morality not only were those objects attained, etc.

యీ మహానుభావుడు హాస్యాన్ని ఒక పరికరంగా తీసికొని సంఘంలో ఉండే అవి నీతిని సంస్కరించే వాడు. తాను వ్రాసే ప్రతి విషయంలోనూ హాస్యరసం ఉట్టిపడుతూ ఉంటుందిగనక కొంచెం విద్య నేర్చిన సామ రులూ, విద్యావంతులూ కూడా చదివేవారు. చదివినతరువాత దానిలో నిరూపింపబడిన అవినీతిని సంస్కరించుకోకుండా ఉండలేక పోయేవారు. మచ్చుకు ఒకటి చూడండి. తన Opera lions అనే వ్యాసం ప్రచురింప బడకపూర్వం ప్రజలంతా ఒక సింహం ప్రతి రోజూ రంగస్థలంమీదకు తీసుకొని రాబడు తున్నదని భ్రమపడే వారు. కాని సింహములు నివసించుటకు మన దేశపు శీతోష్ణస్థితి సరిపడ దుగదా! యిన్ని సింహములను తీసుకొని రావ వడానికి ఎలా సాధ్యమవుతుంది? అనేయోచన వారికి లేకపోయింది. కాని Addison తను ఒక సింహంతో మాట్లాడితిననిన్నీ మరి ఒక సింహం సిగరెట్టు కాలుస్తూ కూర్చున్నదనిన్నీ వ్రాసేసరికల్లా ప్రజలంతా తమతప్పిదాన్ని ఒక్కసారి తెలుసుకున్నారు. కాని ఎడ్డి సను చమత్కారమైన వ్రాతలకు నవ్వకుండా ఉండలేక పోయేవారు.

హాస్యము కేవలం సంఘంలోఉండే పొర పాటులను నిరూపించి ఎత్తిపొడవడమునకు ఉపయోగపరచవలె ననుకొనుటకంటె పొర పాటులేదు. సంఘంలో ఏదైనా ఒక అవినీతి ప్రబలుతున్నప్పుడు దానిని ధర్మశాస్త్రనిర్ణ యముప్రకారం దిద్దఁగలమనుకోడం పొర పాటే కాని ఆ అవినీతినే సమర్థుడయిన రచయిత చిత్రించి ప్రజలముందు పెడితే వారికే దానియందు అసహ్యం కలుగుతుంది. చమత్కార శీలుడికి ప్రతివిషయంలోనూ హా స్యరసపూరితమైన సంఘటనలు కనిపిస్తాయి. కాని హాస్యాన్ని అనుకరించడంకంటే నగు

ంాటు మరిలేదు. పానుగంటివారి 'సాక్షి' సంఘ సంస్కారమిళితమైన హాస్యరసవ్యాసాలను ఆంధ్రలోకంలో మొదట విజృంభింపచేసింది. కాని అవేశిష్టవ్యవహారిక భాషలో ప్రచురింప బడి ఉంటే యింతకంటేకూడా బాగుండే వేమో అని అనిపిస్తుంది. ప్రస్తుతం సున్నిత మైన హాస్యరసవ్యాసాల్ని వ్రాసేవారు లేక పోలేదు. సున్నితమైన హాస్యరచనకు ప్రసిద్ధి పొందిన వారిలో మునిమాణిక్యంవారు ఒకరు. కాని వారివ్రాతల్లోనే కొంత సంఘ సంస్కరణ కూడా మిళితమైఉంటే బంగా రానికి తావి అబ్బినట్టుఉంటుంది.

నేటి క్లిష్టమైన ఆర్థికపరిస్థితులకు కూడా జంకకుండా ఆంధ్రదేశంలో అనేక పత్రి కలు ప్రచురింపబడుతున్నాయి. అన్ని పత్రి కలతో పాటు హాస్యరసపత్రికలు కూడా ప్రచురింపబడుతున్నాయి. యీ పత్రికలు పామరులకు ఆనందదాయకంగా ఉండే వ్యా సాల్నే తీసుకుంటున్నారుగాని మన పత్రికవల్ల ప్రజలకు ఏమయినా ప్రయోజన మున్నదా అన్న సంగతి యోచించినట్లు కనపడదు. కొందరు రచయితలు తమ హాస్యపు వ్రాతల కనుగుణ్యముగా ఉండవలెనని కాబోలు వినుటకు కూడ కష్టముగా ఉండే నామకర ణాల్ని చేస్తున్నారు. ఒక అవినీతికరమైన స్త్రీపాత్రను సృష్టించి దానివల్ల లభించే హాస్యరసాన్ని అనుభవిస్తున్నారు. కాని శకుంతలనాటకంలో ఉండే శృంగారానికీ తోలుబొమ్మలాటలో ఉండే శృంగారానికీ ఎంత భేదం ఉందో పచ్చిశృంగారంవల్ల లభించే హాస్యానికీ సరసమైన హాస్యానికీ అంత భేదం ఉన్నదని మనవి. కనుక ఉన్న తాశయములుగల పత్రికా సంపాదకులందరు సున్నితమైన హాస్యరస వ్యాసాల్ని ప్రచరి స్తూ, అవుసరమైనప్పుడు హాస్యపు పలుకుల తోనే సంఘంలో ఉండే తప్పులను దిద్దుదురు గాక అని మనవి.



# మహాసాధ్వి ఊర్మిళాదేవి

జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు

౧

ప్రాణవిభుతోడ నేగిన జానకమ్మ,
గడపివచ్చును ఏడొక్క గడియమాడ్కి
మగనికెడబాసి శూన్యమౌ నగరిలోన
నెట్లు నిలచెదు పదునాలుగేండ్లు తల్లి !!

౨

రమణునిచెంత నుండిన నరణ్యములే యపరంజిమేడలౌ
రమణునివీడ మేడలె యరణ్యములౌ నటుగాన జానకీ
రమణికి రాణివాసమె యరణ్యనివాసము, కాని నీవు నీ
రమణుని బాసి ఘోరపు టరణ్యములోఁ బడిపోతి వమ్మరో !!

౩

" వదినెయు నన్నగారు వనవాసము సేయగ, నన్నగారి శ్రీ
పదముల సేవ జేసికొను భాగ్యము స్వేచ్ఛగఁ గల్గునాకు, నీ
యదనున నీవు రావల" దటంచు ప్రియుండు నిరాకరింప, నీ
హృదయము క్రుంగిపోవ పొరలెత్తెడి దుఃఖము మ్రింగికొంటివే !!

౪

అత్తరి " పోయివత్తును ప్రియా యిఁక నే" నను భర్తకెట్టి ప్ర
త్యుత్తర మీయలేక యెటులో తల యెత్తి యెలుంగురాని డ
గ్గుత్తికతోడ నీలికనుగొల్కుల బాష్పజలమ్ములుబ్బఁగా
" చిత్త" మఁటన్న నిన్ గనిన చిత్తము నీరయిపోదె యేరికిన్ ??

౫

పైఁటచెరంగుతోఁ దుడిచివైచుకొనం గదవమ్మ! వేగ నీ
కాటుకకన్నుదామరలఁ గాలువలై ప్రవహించు వేడి క
న్నీటి కణాలు క్రిందఁ బడనీయకు ముత్తమసాధ్వివైన నీ
బోఁటి వధూటిబాష్పములు భూమి భరింపఁగలేదు తల్లిరో !!

౬

అన్నపదంబులన్ గొలుచు నాన మనోహరుఁ డేఁగినాఁడు, తాఁ
జన్నది భర్తృపాదపరిచర్యకు ప్రేమపుటక్కగారు, ఏ
మున్నది దిక్కు నీకిచట ? నొంటరివైతివి తల్లి ! యెంతయున్
జిన్నతనంబు, ఏకరణిఁ జేతువొ ? కోడరికం బయోధ్యలో ??

౭

" మీరా ! నన్ను వధించి నా సుతుని భూమింగూల్చి శ్రీరామునిన్
రారాజుం బొనరించు లక్ష్మణుని గారాబంపు దేవేరులా !
రా రం" డంచును సోపహాసముగ నా రాకాసి యామారి యా
క్రూరవ్యాఘ్రము కైకపల్కు కసిపల్కుల్ ముల్కులై నాటవే !!

౮

జిలిబిలిపల్కులన్ వలపుచెయ్వుల చూపర కన్నుపండువై
చిలుకయు గోరువంకవలె, చిన్నరి పొన్నరి లక్ష్మణుండు నీ
వలరుచునుంటి రింతవఱ కక్కట ! రక్కసి గంగ గల్పె మీ
కలకలలాడు కాపురము కన్నులు గుట్టెనో యేమొ కైకరున్.

౯

చెల్లెం డ్రిద్దరు ప్రాణవల్లభుల సంసేవింపుచున్, సంతతం
బుల్లాసంబున పచ్చపచ్చగ దినంబుల్ పుచ్చఁగా, నీవెటుల్
తల్లీ ! భర్తృవియోగదుఃఖమున యుల్లం బల్లకల్లోలమై
యల్లాడన్ గడఁద్రోతువమ్మ ! పదునాల్గబ్దంబు లేకాకృతిన్ ??

౧౦

నలుగురు విన్నవారు " గహనాలకు భర్తను బంపి యింటిలోఁ
గులుకుచుఁ గూరుచున్న దనుకొందురొ యేమొ ? " యఁటంచు నుంతయున్
దలఁపక్షమ్మమ్మ ! నీమది జనమ్ములకెల్లను దెల్లమయ్యె నీ
యలఘుపతివ్రతామహిమ యద్భుతమై ఘనమై పవిత్రమై.

౧౧

కమ్మనిజవ్వనం బడవిఁ గాఁచిన వెన్నెలఁ జేసి భర్తవా
క్యమ్ముల కడ్డుసెప్పక జగన్నుతమౌ పతిభక్తిలోన సీ
తమ్మను మించిపోయితివి, తావకదివ్యయశోలతా వితా
నమ్ములు ప్రాఁకిపోయె భువనమ్ముల, పుణ్యవతీవతంసమా !!

# ఆంగ్ల కవుల నూతనయుగము*

(1800 - 1850)    విద్వాన్- ఎస్. వీరేశ్వర దీక్షితులుగారు, యమ్. ఏ.

ఇదివఱకే యీ యుగలక్షణములను దిఙ్మాత్రముగ గమనించియే యుంటిమి. ఈ యుగము వర్డ్స్‌వర్త్ "లిరికల్ బాలెడ్స్" అను గ్రంథమును ప్రకటించిన 1798-వ సంవత్సరముతోఁ బ్రారంభించుచున్నది. సారస్వతమున నూతనయుగ మెప్పుడు ప్రారంభించునో చెప్పుట కష్టము. అందువలన నీ యుగము రమారమి 1800 సంవత్సరముతో ప్రారంభించి 1850 తో ముగియుచున్నది. తర్వాతవచ్చిన యుగమందలి లక్షణములను గనిపెట్టి దానికి విక్టోరియా యుగ మని పేరు వచ్చినది.

పందొమ్మిదవ శతాబ్దాదియందు రాజకీయ రంగమున ప్రజా ప్రభుత్వమును సారస్వతమున "రొమాంటిసిజమ్" ను ప్రబలినవి. ఈ రెండును పరస్పరము పెనవేసికొనియుండుటచే. వీనికేమైనను సంబంధము కలదా ? యని మనకుఁ దోపకమానదు. ఇంగ్లండు దేశమున జరిగిన రాజకీయపరిణామ మంతయు ఈ నూతనాభిప్రాయముల ఫలితమే యని చెప్పఁగలను. 1815-వ సంవత్సరముతో ఇంగ్లండు నెపోలియన్‌తో జరపిన మహాసంగ్రామ మంతరించెను. విదేశములం దెక్కువ హక్కులను గడించి ఇంగ్లండు దేశము సాంఘిక రాజకీయ విధానమునందు మార్పులను జేసికొనసాగెను. ఆఫ్రికా దేశపుతోడి నీగ్రోసేవక వ్యాపారము గర్హితమైనదని జనులు గ్రహించిరి. బాలు రెక్కువకాలము పారిశ్రామిక గృహములందుఁ బనిచేయుట యుక్తము కాదనియు. క్యాథలిక్ తెగవారిని నిర్బంధించు శాసనములు మార్పుఁజెందవలె ననియు, ముద్రణాలయములకు స్వాతంత్ర్య ముండవలయు ననియు, పాఠశాలల సంఖ్య యభివృద్ధి కావలయు ననియు నభిప్రాయములు దేశమందంతటను వ్యాపించెను. 1832 వ సంవత్సరమున సంస్కరపు చట్టము అమలులోనికి వచ్చెను. ఇట్లీక యర్ధ శతాబ్దములోఁగనే ఇంగ్లండులోని ప్రజలు నూతన నాగరకతను అవలంబింపసాగిరి.

ఈ యుగాదిని అమెరికా ఫ్రాన్సు దేశములందలి రాజకీయాందోళము ఆంగ్ల సారస్వతమున ప్రతిఫలించినది. ఆందోళనము ముగిసినపిదప సారస్వతము నూతనపథము ద్రొక్కనారంభించెను. వర్డ్స్‌వర్త్, కాలెరిడ్జ్, బైరన్, షెల్లీ, కీట్స్ మొదలగు వారి పద్యకావ్యములందును, స్కాట్, ల్యాంబ్, డిక్వెన్సీ మొదలగు వారి గద్య

* దీని మొదటిభాగము అక్టోబరు (౧౯-౩౮) చంద్రికలో ప్రకటింపబడినది.

రచనలయందును ఒక నిర్మాణ శక్తి యుండు టను జూతుము. స్వాభావికమును, కృత్రిమ రహితమును నగు విషయము సారస్వతమున ప్రతిబింబించియుండవలె నని వీరి మహాదాశయము. ఇదే విషయము ఎలిజబత్ నాటి గ్రంథకర్తల యందుఁ గాననగును. షేక్స్పియర్ మొదలగువారు విమర్శకుల చట్టము నతిక్రమించి తమ బుద్ధికి సూటిగాఁ బోయి "నదీ ప్రవాహములందు గ్రంథములను, ప్రతి వస్తువునందు మంచితనమును" జూడఁ గల్గిరి. అట్లే ఈ కాలమునందలి వర్డ్స్‌వర్త్ మొదలగువారు తమ స్వాతంత్ర్యము ననుసరించి సాధారణ వస్తువు లందలి యంత రంగప్రదేశమునకుఁ బోఁగల్గిరి. అనఁగ "రవి గానని చోటును కవులు గాంచి" రని చెప్పవచ్చును. ఈ కాలమున ముఖ్యముగ పద్యకావ్యము లుదయించినవి. పూర్వయుగమున గద్య కావ్యముల కున్నంత యాధిక్యము పద్యకావ్యములకు లేదయ్యెను. ఇప్పుడో వర్డ్స్‌వర్త్, కాలెరిడ్జి, బైరను, కీట్స్, షెల్లీ, మూర్, సూథీ మొదలగు వారి పద్యకావ్యములకు అఖండగౌరవము ప్రాప్తించెను. నవలలను వ్రాసి కీర్తి పొందిన స్కాటు సహితము పద్యకావ్యములను వ్రాసెను.

ఇక్కాలమున స్త్రీలు కూడ గ్రంథములను వ్రాయఁదొడగిరి. వారికబ్బిన స్వల్ప విద్యయు, వాతావరణమున వ్యాపించియున్న ఉద్రేక భావములును వారి కట్టి యవకాశములను గల్పించెను. ఇదియే స్త్రీలు భాషారంగమునఁ బ్రవేశించుటకు మొదటి పర్యాయమని చెప్పఁగలము. "అత్యావేశము ఒక్కొక్కప్పు డొక్కొకవిధముగ పరిణమించుచుండును." అని రాడ్‌క్లిఫ్ అను నామె అతిమానుషభయజనకములగు నవలలను వ్రాసెను. ప్రస్తుతకాలపువారికా గ్రంథములు రుచింపకపోయినను, ఆ కాలమున వానిం జదువువారు వేనవేలుండిరి. జేన్ ఆస్టెన్ అనునామె సామాన్య గృహ జీవితములను నవలలలోఁ జిత్రింప సాగెను. మేరియా యెడ్జివర్త్ అను నామె ఐరిషు దేశీయుల జీవితమును జూపు నవలలను వ్రాయ మొదలిడెను. ఈమె గ్రంథములే స్కాట్లాండు దేశీయుల జీవితములకు సంబంధించిన నవలలను వ్రాయుటకు స్కాటునకు ప్రోత్సాహము కలిగించినవి. ఇంకను అనేక కవయిత్రులు గలరు. అప్పటి నుండి నేఁటివఱకును స్త్రీలు భాషారంగము పైఁ దలయెత్తి యుత్తమగ్రంథములను వ్రాయుచునే యున్నారు.

ఈ యుగముననే సారస్వతవిమర్శన యభివృద్ధినొందసాగెను. పదునెనిమిదవ శతాబ్దాంతము వఱకు డ్రైడెన్, ఎడిసన్ వ్రాసిన గ్రంథములు తక్క ఋజుమార్గమును త్రొక్కిన విమర్శనగ్రంథములు లేవని చెప్పఁగలము. ఇంతవఱకును విమర్శన విమర్శకుని యభిప్రాయములను వెల్ల

డించుటతోడనో లేక యీర్ష్యను ప్రకటించుటతోడనో గడచినది. ఇంగ్లండుదేశమున మాసపత్రికలును, పక్షపత్రికలును వెలువడుట ప్రారంభించినవి. ఇవి ఇప్పటి మన కాలపునాటి, భారతి, చంద్రిక, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక మొదలగువాని వంటివి. ఎడింబర్గు రెవ్యూ, వెస్టు మిన్‌స్టర్ రెవ్యూ, స్పెక్టేటర్, ఫ్రేజర్‌స్ మ్యాగజీన్ మొదలగు పత్రికలు కొన్ని గ్రంథములను భాగములుగ ప్రకటింప సాగెను. లాక్‌హార్టు అనునతఁడు స్కాటు జీవితమును ప్రకటించెను. జెఫ్రీ అనునతఁడు స్కాట్, వర్డ్‌స్‌వర్త్, బైరన్, మొదలగు వారి పద్యకావ్యములను, లాక్‌హార్ట్, కీట్స్, టెన్నిసన్ పద్యకావ్యములను తీవ్రముగ ఖండింపసాగిరి. ఇట్లు విమర్శన ఖండనలతోఁ బ్రారంభించి తుదకు గ్రంథకర్తయెడ సానుభూతినిఁ జూపమొదలిడెను. డిక్వెన్సీ అనునతఁడు (**Not to sympathise is not to understand**) "సానుభూతిని జూపకుండుట సరిగ గ్రహింపపోవుటయే" అని చెప్పిన వాక్యము ఆ కాలపునాఁటి విమర్శకాభిప్రాయమును దెలుపుచున్నది. కాలెరిడ్జి, ల్యాంబ్, అనువారలు తమ పూర్వులకు తగిన మర్యాద నిచ్చుచు, నూతన కవుల గ్రంథములను జదివి వారందుఁజూపిన నూతనాంశములను శ్లాఘించుటయే యని భావింప సాగిరి. ఇక్కాలమున వ్రాసిన గ్రంథములందు తరుచుగ సృష్టిసౌందర్యప్రకటనమును, పూర్వౌన్నత్య ప్రదర్శనమును, బాధితులయెడ సానుభూతియు, ఎలిజబత్ రాణి నాఁటి కవుల యాదర్శముల ననుసరించుటయు, తన బుద్ధికి సూటిగఁబోవుటయు గాననగును. ఇవియే రొమాంటిక్ కాలపు నాఁటి లక్షణములు. వీనిని జ్ఞప్తియందుంచుకొని వారి గ్రంథములను జదివితిమేని వానిని సక్రమముగ గ్రహించి యానందింపఁగల్గుదుము. ఆంగ్లకావ్యములనుగుఱించి లఘుటీకలను జదివి సారస్యమును గ్రహించుట కష్టము గాన అట్టి పనిని మాని యుగలక్షణములు సర్వజనులును దెలిసికొని యుండుట శ్రేయస్కరము.



# "ఏకాకి నయి యుంటిఁ"

శ్రీ జొడ్డపాటి కుటుంబరాయశర్మగారు

౧

గువ్వలన్నియు గూళ్లుసేరెను.
రాజు లంతిపురాలు సేరిరి.
తమ్మిఱేకుల శిబిరములలో
తుమ్మెదలు మీరేఁ.
నేనుమాత్రమె- నేనుమాత్రమె-
ఎచటఁజూచిన నేనుమాత్రమె !

౨

చుక్కకన్నెలు ప్రభువుకౌగిలిఁ
జొక్కుటకునై యొక్కటొక్కటి
పన్నిదంబులఁ జరచుకొని తా
పరుగు లిడు చుండేఁ——
నేనుమాత్రమె - నేను మాత్రమె
ఎచటఁ జూచిన నేనుమాత్రమె !

3

గాలిబాలుఁడు మేఘముల నే
కరుపుబెట్టెడు శ్రుతులలోపల
భ్రమర ధీర కుమారిగీతా
రవసమేళము మమ్మరించెను,
నేనుమాత్రమె- నేనుమాత్రమె
ఎచటఁజూచిన నేనుమాత్రమె !

౪

భేదమందున గూడ నైక్య మ
భిన్నమయి కనుపట్టు విశ్వ
ప్రకృతిలోపలి ప్రాణితతిలో !
నేను మాత్రమె - నేనుమాత్రమె
ఎచట జూచిన నేనుమాత్రమె !

"తుమ్మెద పాటల"నుండి

# నలందా విశ్వవిద్యాలయము

వరిగొండ సత్యనారాయణమూర్తిగారు

విద్యవలన నరు డైహికాముష్మిక సుఖముల నందునను రహస్యమును మొట్టమొదట నెఱింగినవారు భారతీయులు మానవ జన్మము దుర్లభ మనియు, అట్టి జన్మ సార్థక మొనరించుకొనుట ముఖ్య మనియు దెలిసిన భారతీయులు, విజ్ఞానసముపార్జనమునకు సర్వవిధములఁ బ్రయత్నించుచుండినారు. అందులకు ఫలితముగా ఆసేతుశీతాచలము విద్యాలయములు నెలసినని. ఆ కాలమున వీనికి 'విద్యాపీఠములు' (విశ్వవిద్యాలయములు) అని పేరు. ఈ విద్యాపీఠములన్నియు దిగ్దంతుల వంటి పండితులకు నిలయములై, విశ్వవిఖ్యాతములై యుండినవి. దేశ దేశములనుండి విద్యార్థు లీ విద్యాపీఠములకు వచ్చి, అందలి విజ్ఞానామృతసాగరమునందు దమ జ్ఞానపిపాసను దీర్చికొని ధన్యులగుచుండెడివారు. తక్షశిల, ఉజ్జయిని, వైశాలి, కాశీ, కౌశాంబి, కంచి, మున్నగు పట్టణములయందుఁ బూర్వమిట్టి విశ్వవిద్యాలయము లుండినవి. కాని నలందా విశ్వవిద్యాలయముమాత్ర మన్నింటి కెన్న మిన్నయై యుండినదనుట జగద్విదితము.

నలందానగరము బీహారమునందు రాజగృహమునకు నుత్తరముగా నేడు మైళ్లలో నుండినది. ఇప్పు డాప్రదేశమునకు బారగాఁ అనిపేరు. ఈమధ్య కూడ భూగర్భమునుండి నాటి నలందానగరమునందుండిన గృహములు బయటఁబడినవి. అప్పటి లోహవిగ్రహములుకూడ చాల లభించినవి. ఈ నలందాపట్టణము అశోక చక్రవర్తికాలమందున్నైత ముండినది. కాని క్రీస్తునకుఁ బూర్వము గుప్తరాజ్యమునందు పేర్గాంచినది. గుప్తరాజు లిచటి విద్యాపీఠమును బోషించి వృద్ధికి తెచ్చినారు. నరసింహగుప్త బాలాదిత్యుఁడు విద్యాపీఠముయొక్క యుపయోగార్థము బ్రహ్మాండములగు భవనముల నాఱింటిని నిర్మించినాడు. ఒక్కొక్కభవనము 'ఆశ్రమము' అను పేర వ్యవహరింపఁబడుచుండినది. అచటి గురుశిష్యులకొఱకా మహారాజొక దేవాలయమునుగూడఁ గట్టించినాడు. బాలాదిత్యుఁ డా విశ్వవిద్యాలయమునకు రెండువందల గ్రామములను దానపూర్వకముగ నిచ్చినాడు. ఆ గ్రామములనుండి వచ్చు రాబడితో నా విద్యాపీఠము పుష్టితో నుండినది. దాదాపు మూఁడు వేలమంది యుపాధ్యాయు లా విద్యాలయమునం దుపదేశకులై, అర్హవేతనములను బడయుచుండి రన, ఆ విద్యాపీఠముయొక్క మహాదశ యూహాతీతమని నొక్కిచెప్పనగును. విద్యాభ్యాసమునకు వివిక్తప్రదేశము ముఖ్యమగుటంజేసి, విద్యాపీఠ భవనములకు

జుట్టును నున్నతమగు ప్రాకార ముండెడిది.

నలందా విశ్వవిద్యాలయమునందు బోధింపఁబడు విషయములను సావకాశముగ విమర్శించినచో, భారతీయుల సూక్ష్మబుద్ధియు, జీవిత పరిజ్ఞానమును సువ్యక్తమగును. మానవుడు తన జన్మను సార్థక మొనరించుకొనుటకీ విషయము లెంతయో యుపకరించుచున్నవి. వానికి 'పంచవిద్య' లని పేరు.

1. శబ్దవిద్య(వ్యాకరణము).
2. శిల్పవిద్య.
3. చికిత్సావిద్య(వైద్యము).
4. హేతువిద్య(తర్కము).
5. అధ్యాత్మవిద్య(మతము).

విద్యార్థి దశ యేఁడవయేడునుండి ముప్పదియవయేడువఱకుండెడిది కేవలము భాషాభ్యసనముతో నచటి విద్యా విధానము ముగియక, ఏదియేని వాణిజ్యకళనో, వృత్తి విద్యనో అచటి విద్యార్థు లభ్యసించి, జీవిత రంగమునకు నడుము కట్టుకొని వచ్చుచుండెడివారు. మఱి ఇహమున భుక్తికొఱకిట్టి యుపకరణముల నార్జించి, పరమున ముక్తికొఱకు దైవారాధనము, మానవసేవ, వినయవర్తనము మున్నగు సద్విషయములందు గడితేఱి, ఆ విద్యార్థులు మానవోత్తము లగుచుండిరి. మీదుమిక్కిలి స్వయంసాహాయ్యసూత్రమును సాదృశ్యముగ బోధించుటకో యనఁ బ్రతివిద్యార్థికిని కొలదిగనో గొప్పగనో వైద్యము నేర్పఁబడుచుండినది.

ఇట్లుండియు నచటి విద్య ఏకముఖముగా బోధింపఁబడుచుండెడిది కాదు. కేవలము విజ్ఞానాభివృద్ధియే ఆ విశ్వవిద్యాలయాధికారుల యాశయము కాదు. శరీర మారోగ్యముగా, బలముగా నుండినఁగాని, ఆత్మవిద్యాభ్యసనము దుష్కరమని నాఁటి భారతీయులకు బాగుగాఁ దెలిసి యుండినది. 'జీర్ణశక్తిని నిలుపుకొనుటకును, ఆరోగ్యభాగ్యమును అభివృద్ధిపఱచుకొనుటకును, సన్న్యాసులు సంసారులు ప్రతిదినమును చాల దూరము వాహ్యాళి వెడలెడివారు. వాహ్యాళి యంతమగు చోట్ల చైత్యము (విశ్రాంతస్థానము) లుండెడివి' అని యొకానొక చీనా దేశీయుఁడు వ్రాయుచున్నాఁడు.

'అధ్యాత్మికవిద్య బౌద్ధులకు మాత్రము బోధింపబడుచుండెడిది. మొదటి నాలుగు విషయములు బౌద్ధులకును, బౌద్ధేతరులకును బోధింపబడుచుండినవి. అచట బోధకులు వేలకువేలుగా నుండిరి. వారు దిగ్దంతులవంటివారు. వారి పాండిత్యము కూలంకషము. వారి యశము కకుబంతవ్యాప్తము. విదేశీయులు సైత మీ విద్యాపీఠమునకు వచ్చి, అచటి యాచార్యోత్తములనుండి తమ సంశయములను దీర్చికొనుచుండిరి. దానంజేసి ఆ విశ్వవిద్యాలయాధ్యాపకుల బుద్ధివైభవము నలువైపులకు వ్యాపించి యుండినది' అని హుయాన్‌సాంగు వ్రాసియున్నాడు.

ఈ విద్యాపీఠమునం దాచార్యపదవి లభించుట కష్టసాధ్యమై యుండినది. ఆచార్యపదవి నభిలషించువారు ప్రవేశపరీక్షయం దుత్తీర్ణులు కావలసి యుండిరి. దాదాపు నూటికెనుబదిమంది కది యలభ్య మగుచుండెడిది. ఈ విధమున బుద్ధిమదగ్రగణ్యులుమాత్రము ఉపాధ్యాయపీఠముల నధిష్ఠింపఁగలుగుచుండిరి. తత్ఫలముగా నచటి విద్యార్థులు సక్రమవిద్యను సంపూర్ణముగ నభ్యసించుట కవకాశ ముండెడిది.

విద్యాబోధకులలోఁ జాలవఱకు బౌద్ధులుండినారు. అయిన నేమి? జీవయాత్ర నంతటిని కేవలము మతప్రచారమునందే గడపుటకుఁ దగిన విద్యనుమాత్రము వారు బోధించెడివారు కారు. అచటి విద్యావిధాన మంత సంకుచితమై యుండెడిది కాదు. నేఁటికాలపు క్రైస్తవ మిషను పాఠశాలలయందుబోలె, నాటికాలమున నలందా సర్వకళాశాలయందలి బౌద్ధేతరులగు విద్యార్థులకు బౌద్ధమతోపన్యాసముల నాలకింపవలయు నను నిర్బంధ ముండెడిది కాదు.

ఐహికాముష్మికవిద్యల రెండింటఁ బ్రజ్ఞావంతుఁడు 'బహుశ్రుతుఁ' డను గౌరవాభిధేయమును గలిగి యుండినాఁడు. పాఠ్యవిషయము లైదింట మొదటి నాల్గింటిని బఠించు విద్యార్థులు 'బ్రహ్మచారు' లను పేరఁ బరగుచుండినారు.

విద్యాభ్యాసమున కచటి విద్యార్థు లెట్టి శుల్కమునుగాని చెల్లింప నవసరము లేదు. కాని విద్యాపూర్తి యైనపిదప, వారి వారి శక్త్యనుసారము గురుకట్నమును జెల్లించుట తమ విధి యని విద్యార్థు లట్లొనరించుచుండెడివారు. చాలమట్టున కచటి విద్యార్థులు మధుకరమువలనఁ బొట్టఁబోసికొనుచుండినారు. ఇట్లు విద్యార్థులు చిన్నతనమునందే స్వయంసాహాయ్యసూత్రము ననుష్ఠించుచుండఁగలుచుండినారు.

వయస్సు, అనుభవము, పాండితీపటిమ మున్నగు వానినిబట్టి, ఆ విద్యాపీఠమునందలి యధ్యాపకులలోఁ గొన్ని యంతరము లుండినవి. కనీసము పది వత్సరములైనను 'ఆశ్రమము' నం దనుభవము కలిగినవాఁడే అధ్యాపకత్వమున కర్హుఁడై యుండినాడు. అట్టి వానికి 'ఉపాధ్యాయు' డని పేరు. ప్రధానోపాధ్యాయునకు 'ఆచార్యు' డని పేరు. భద్రలక్షణులును, వినయసంపన్నులు నగువారు 'కర్మాచార్యులు' గా నియమింపఁబడుచుండినారు. ఆదర్శపురుషు లగునట్టి యుపాధ్యాయుల సన్నిధిలో నచటి విద్యార్థులు మానవోత్తములు కాఁగలుగుటలో సందియ మే మున్నది?

'నలందావిశ్వవిద్యాలయమునందలి యుపాధ్యాయులకు దమ శిష్యులపై పుత్రవాత్సల్య మున్నది' అని పంట్సిం గను చీనాదేశీయుఁడు వ్రాసినాడు. శిష్యునకు గురువు

పైని భక్తి యెక్కువ. గురువునకు శిష్యుని పైని వాత్సల్యము మెండు. ఇట్లు గురుశిష్య సంబంధము భక్తివాత్సల్యబద్ధమై యుండినది.

కాల మొకతీరున నుండదుకదా! తొమ్మిదవ, పదియవ శతాబ్దములలో బంగాళము, బీహారు దేశములయందు బౌద్ధమతము క్షీణదశకు వచ్చుటంజేసి, నలందా విశ్వవిద్యాలయము సడలిపోయినది.

నిజతేజః పుంజములను నలుగడల వెదజల్లుచు విజ్ఞానఖనియై యుండిన యా విద్యాపీఠమున కవసాన సమయము సంప్రాప్తించినది. మహమ్మదు-బిన్-భక్తియారు బీహారముపై దండెత్తినాడు. దేశముతోపాటు, నలందా విశ్వవిద్యాలయమునుగూడ నేలమట్ట మొనరించి, దేశీయులను కత్తి కొకకండచేసి, చంద్రహాసమును ఒఱయందుంచి, తన రాక్షస కృత్యమునకు సంతృప్తాత్ముడై వికృతాట్టహాస మొనరించినాడు.

కాని సుకృతులు గతాయువులు.
లోకబాంధవులు చిరంజీవులు.

---

# ప్రేమజీవి

ఆలపాటి కామేశ్వరరావుగారు

ప్రేమయే నాకు నీ విశ్వవిశ్వమందుఁ
జాలముఖ్యమ్ము; నాకు విశ్వాస మందు,
దృఢము; దానితో జీవన మే నొనర్తుఁ ;
ప్రేమ సత్త్వమహత్త్వ సంవిలసితమ్ము,
నమితమధురమ్ము, భవ్యసౌఖ్యప్రదమ్ము,
ప్రాణమానావన సమర్థ మైనదియును;

ప్రేమపావన జీవన విమలసుఖమె
ఘనతరానుపమానభాగ్యమ్ము నాకు
దానిచే నెట్టి గాఢచింతాదరిద్ర
తయయినంగూడ దూరీకృతమయిపోవు
నమలచంద్రికచే నంధతమస మటుల

# ము కు ం ద మా ల.

ఆంధ్రీకర్త: శ్రీకవిభూషణ, శతావధాని, విద్వాన్ డోమా - వేంకటస్వామిగుప్తగారు.

(డిసెంబరు సంచిక తరువాయి)

సీ॥ ఆమ్నాయములను నభ్యాసంబుసేఁత యరణ్యరోదనముతోఁ బ్రతియ యగును,
వేదవ్రతంబుల వెస నిత్య మూనుట దేహంపుబలుపు నుదింపఁగలదు,
మొగి సప్తసంతానముఖపూర్తకర్మలు బూడిదలో హోమములను బోలు,
సకలతీర్థంబులఁ స్నానంబులాడుట యేనుఁగుల్ సలిపెడి స్నానము లగు,

గీ॥ దేవదేవుఁడా యెవని భక్తి మదిలేని యెడల-నతఁడు భక్తసులభుఁ డీశ్వరుండు,
జయము నందునుగావుత సంతతంబు, ఆశ్రితపరాయణుండు - నారాయణుండు.

క. "శ్రీమన్నారాయణ!" యను, నామం బను పాపులును గనంగల రిచ్చేల్
నామం బది నే ననఁ దొలి, హా! మఱి యిటు పుట్టు గంటి నందక ముక్తిన్. 25

గీ॥ నీకుఁగల దాసతతి దాసనికరదాస, దాస దాసానుదాసానుదాసుఁడను గ
జ్జన్మస్థితియుంపుమి ; అదె నాకు జన్మఫలము,గాఁగ దయ సేయు ; లోకేశ ! కైట
[భారి!! 26

మ॥ పురుషోత్తమఁడు లోకనాథుఁడు మనఃపూజ్యుండు నిత్యుండు భ
క్తిరస క్రీతుఁడు సత్కృపానిధి రమాధీశుం డెసంగన్, గటా!
నరుల న్నీచుఁడుఁ గొన్ని యూళ్ల దొరయున్ స్వల్పంబుగా నెప్డా యి
చ్చు రసాజ్ఞు న్వెదుకంగఁ బోవు మన కెచ్చోఁ దెల్వి యం చేమన్న దే?? 27

చ॥ సరగ ముకుందపాదజలజాతము లొప్పెడి నాదు నెమ్మనం
బరరె! యనంగ! వీఁడి చేనుమా! తొలి శంభు నిటాలనేత్ర భా
గురుతరవహ్నిలోఁ గృశత నొందితి విప్పుడు చక్రి చక్ర వి
స్ఫురిత పరాక్రమక్రమము సొంపు గనుంగొన నింపు పుట్టెనో ?? 28

క॥ సత్యంబులలో సత్యం, బత్యంతంబు విను - నాలుకా! తేనియల
న్నిత్యం బొల్కించు రమాపత్యాఖ్యం బల్కు మెపుడుఁ బ్రాంజలి నగుదున్

మ॥ పనిలేనట్టివి మందు వ్రాఁకులఁ గొనన్ వద్దో విమూఢాత్మ! కా
లనితాంతత్వము కొద్ది నిత్తనువు జీర్ణత్వంబునుం జెంది, యం
గనికాయంబుల సంధు లెల్ల వదలంగాఁ డ్రెళ్లు ; రోగంబు లుం
డని శ్రీకృష్ణరసాయనంబు గొని పూర్ణంబైన మే లొందుమా!! 30

శా॥ నీ కిల్లాలు పయోధికన్య; కొడు కా నీరేజగర్భుండు; నీ
లోకం బెల్లను నీదు కల్పన; శ్రుతుల్ పొల్పొందు నీవందులై
నీకారుణ్యము ముక్తి; దేవవితతుల్ నీబంట్లు; గాండీవి తా
నీకు న్మిత్రుఁ; డితఃపరం బెఱుఁగఁ దండ్రీ! యేదియు న్నీయెడన్!! 31

శా॥ శ్రీ కృష్ణుం డఖిలాండనేత మనుచున్ శ్రీ కృష్ణుఁ జేతు న్నతుల్
శ్రీ కృష్ణ ప్రభుచే సురారులు హతుల్ శ్రీ కృష్ణుకై దండముల్
శ్రీ కృష్ణేశునినుండి లోక మెసఁగున్ శ్రీ కృష్ణు దాసుండ నే,
శ్రీ కృష్ణేశ్వరునందు సర్వ మెసఁగున్ శ్రీ కృష్ణ! నన్నేలుమా!! 32

శా॥ కానన్ సంసరణాంబురాశిఁబడి వీఁకం దీనతం గుందు న
న్నో నారాయణ! విష్ణు! ప్రోవుము, కృపాసింధుండ వీ వాట నెం
తేనిం బేర్మిని గాంచు దిక్కఁటిన న, న్నీశేశ్వరా!! స్వామి! నీ
వానో కావుకో పూరుషోత్తముఁడ? వప్పా! ఆగమాగోచరా!! 33

శా॥ శ్రీ నారాయణపాదపద్మయుగకిం జేకూర్తు సాష్టాంగముల్,
శ్రీ నారాయణపూజనంబును సదా సేతుం గరం బొప్పఁగన్
శ్రీ నారాయణనిర్మలాఖ్య నెపుడున్ జిహ్వాస్థలిం బల్కెదన్,
శ్రీ నారాయణనిత్యతత్త్వ మెపుడుం జింతింతుఁ జిత్తంబునన్. 34

గీ॥ శ్రీద! నారాయణా! దేవ! కృష్ణ! రామ! శ్రీవరా! వాసుదేవా! యరిదరహస్త!
శ్రీహరీ! కైటభారి! నాళీకనయన! శ్రీకమలనాభ! భక్తప్రియా! కృపాబ్ధి!! 35

మ॥ "హరి! వైకుంఠ! ముకుంద! మాధవ! అనంతా! కృష్ణ! నందాత్మజా!
యురగాధీంద్రశయాన! పక్షితురగా! యో దీనమందార! సుం
దర! గోవింద!" యఁటంచు బల్కఁ దగు శక్తత్వంబు లో నుండియున్
జరపంబో రటు, లక్కటా! వ్యసనవిన్యాస ప్రధానత్వముల్!! 36

మ॥ హృదయాంభోరుహకర్ణికా సతతవర్తిష్ణున్ ప్రభానిత్యు ని
ర్మదచిత్తాఢ్య నిరంతరాభయదు శ్రీరమ్యప్రభావున్ శుభా
స్పదు విష్ణున్ మది నెంచుధన్యులు పునర్భంగంబు లేనట్టి య
ప్పద సుశ్రాంత సుఖప్రదంబు గన నౌ వా ర్నిక్కమిమ్మాటయున్. 37

మ॥ వర దుగ్ధాబ్ధితరంగశీకరచమూ వర్షోత్పతద్బిందుభా
సుర దివ్యాంగుఁడు, భోగిభోగమహిమాఽస్తోకైక పర్యంకశా
యి, రమానేత, మధూరువైరి, వినమద్బృందారకేంద్రుండు నా
సరసీజాక్షు పదారవిందములకుఁ సాష్టాంగముల్ సల్పెదన్. 38

గీ॥ శ్రుతిధరులు, కవిలోకవీరులు ద్విజన్మ, వరుఁడుఁ బద్మశేరుఁడు మిత్రవరు లెవనికి
నల జలజదృక్పదాబ్జ మత్తాళి యయిన, నృపుఁడు కులశేఖరాఖ్యుఁ డీ కృతిని సలిపె.

* బొంబాయి పాఠమునందుఁ గల మఱి కొన్ని శ్లోకముల తెలిఁగింపు పద్యములు.

మ॥ వరబృందావనమందిరుఁ, బదయుగీవందారు బృందారకే
శ్వరముఖ్యామరు, నిందుకుందదరభాస్వద్దంతు, గోపార్భక
స్ఫురణాఢ్యుఁ, వసుదేవనందను, దయాంభోధిఁ, ముకుందుఁ, దళ
త్సరసీజాతదళాయతాక్షు సనమస్కారంబుగాఁ గొల్చెదఁ. 40

శా॥ శ్రీగోవిందపదారవిందమధుసుశ్రీ యద్భుతం బెంతయుఁ
బాగా న మ్మధు వానువా రది విడఁ భావింప రద్దానిఁ
లోఁగొనట్టిసు దాని పేఁడుదు ; రిఁకఁ లోకంబునం దీని కెం
తేఁ గ్రాలుఁ భిద భృంగసృష్టమధురీతిఁ; గాంతువే? స్వాంతమా!! 41

చ॥ రజమునఁ దూలి మోహ మని క్రాలెడి వాగురయందుఁజిక్కి - మృ
త్యు జననదోలికాంతరమహోగ్ర గతివ్యథలంది దిక్కు లేఁ
క జరగఁ గానసట్టిరకుఁ గ్రమపథం బిడి ప్రోఁచుపొంటెఁ గ
ల్గు జగదధీశ్వరుండు శ్రితలోకహితుం డల చక్రి యొక్కఁడే. 42

శా॥ పాపానీక మహోగ్రసంసరణ దీవ్య ద్వార్ధి గర్భంబునం
దేఁపా భీవ్యథ లందుచుఁ మునిఁగి యెంతేఁ గుంది యల్లాడు చెం
దే ప్రోఁపం గతిలేక నీ శరణమెంతే కోరు న న్నాదృతి
శ్రీసారమ్యముతోడ నేలు మిడి నీ చేఁ, దో్ప రమావల్లభా!! 43

శా॥ స్త్రీజన్మంబును దుస్స్వభావమును దుర్దేశిత్వముఁ మూర్ఖ్య దు
ర్వ్యాజజ్ఞానము నాకు నెట్టి జననంబందైనఁ గల్గింప, కెం
తో జాగ్రద్భవదీయభక్తి నిడి యిందుం బైజగంబందు నీ
రాజత్సత్కృప కగ్గమానటుఁ బొనర్పంజూడు-మో శ్రీవరా !! 44

* ఈ యధిక శ్లోకములతోడి పొత్తము సంస్కృతాంధ్రలిపులలో వివరణముతోడను మద్రాసు ఆర్. వేంకటేశ్వర్ అండ్ కంపెనీవారిచేఁ బ్రచురింపఁబడినది.

చ॥ హృదయవచశ్శరీరముల నెయ్యది యెవ్వెపు డాచరింతు నె
యృదియెది యింద్రియాళి మతి నాత్మ నుటిం బ్రకృతిః గుణాన నే
యదనుననేనిఁ జేతు - నవి యన్నియు నే నల దేవదేవుఁడై
పొదలెడి శ్రీముకుందునకుఁ బోల సమర్పణముం బొనర్చెదన్. 45

క॥ శ్రీమత్కులశేఖరరా
టోసీమకృత ముకుందమాల సొరిదిఁ దెలుఁగునం
దీ మెయి వ్రాసెను భక్తిన్
దోమా. వేంకటవరకవి తొండఅలణఁగన్. 46

శ్రీ ముకుందమాల (సంస్కృతము) జగత్ప్రసిద్ధమయినది. భక్త రత్నము లయిన శ్రీకులశేఖరాళ్వారులవారిచే విరచితము. భాగ్యవశమున దీనిం దెలింగించు నదృష్టము నాకుఁ గల్గినది. ఆ మహాగ్రంథమున కిది తెలిఁగిం పనుటకన్న నీ నా తెల్గింపునం దెక్కువ గొనము కనుపడునని నాకుఁ దోఁపదు. అయినను "తద్గుణైః కర్ణ మాగత్య చాపలాయ ప్రచోదితః" గా వ్రాసినాను. దో. వేం. గుప్త.



# న్యాయం అంటే యిల్లా ఉండాలి

భోగరాజు పేర్రాజుగారు

౧

## అది రాయల రాజ్యకాలం

"ఓం ! సహనా భవతు. సహనౌ భునక్తు. సహ" "అయ్యా! చీకటిపడింది. ముందు గ్రామం చాలా దూరం. యీ రాత్రికి పడుకోవటానికి కొంచెం జాగా యిప్పించాలి" అన్నాడు బాటసారి.

"అంతకన్నానా? లోపలకి దయచేయం" డంటూ లేచి లోపలకు ఆహ్వానించాడు అతిథిని గృహయజమాని.

రామశాస్త్రి గ్రామం అందరిలోనూ పేదవాడూ, పిల్లలు గలవాడూను. అయితే. నేం? కాకికయినా మెతుకు వేయని ఆ గ్రామంలో కల్లా ఒక్క రామశాస్త్రి గృహమే అతిథులతో అలంకరింపబడేది. భోజనం పూర్తి అయింది. పక్కలు వేసుకుని అతిథీ, గృహయజమానీ సంభాషణ కుపక్రమించారు. క్రమేణా మామూలువిషయాలలోనుంచి రాజ్యపరిపాలన, న్యాయపీఠము నైపుకు వెళ్లింది చర్చ. కాని అతిథి చెప్పినమాటలు శాస్త్రి కాదన్నాడు. రాయలరాజ్యం రామరాజ్యం కాదనీ, ధనికులు చేశే మోసాల వల్ల బీదలకు న్యాయస్థానాల్లో అన్యాయమే కలుగుతోందనీ వాదించాడు.

" అయితే ! నీకు ఆ న్యాయపీఠంవప్పగించితే నీవు సరిగా నడువగలవా ? " అని అడిగాడా అతిథి. " పూర్తి అయిన న్యాయం కలుగచేయగలననే నా ఊహ " అన్నాడు శాస్త్రి.

౨

## రాయల ఆస్థానంలో

సభాసదు లందరూ సమావేశ మయ్యారు సింహాసనానికి ఎదురుగా రామశాస్త్రి నిలువబడ్డాడు. ప్రక్కన అంగరక్షకుల చేతుల్లోని కత్తులు తళతళా మెరుస్తూన్నాయి. రాజుగారి కిరీటం ధగధగలాడుతోంది. రాజుగారు చకచకా నడిచివచ్చి, సింహాసనముపైన కూర్చుని రామశాస్త్రిపంక చూశాడు. శాస్త్రిగుర్తు పట్టాడు. రాత్రి తానాదరించిన అతిథే రాజు. రాజుగారికి నమస్కారం చేశాడు.

రాజు ప్రతివందనంచేస్తూ—" అయ్యా ! శాస్త్రిగారూ ! రాత్రి తాము సెలవిచ్చిన మాటలు నిజమని రుజూ యిప్పిస్తారా? మీరు చెప్పినట్లు చేస్తారా ? " అని అడిగాడు.

" చిత్తం. తమ శెలవైతే " అన్నాడు శాస్త్రి. " సరే ! యీ పట్టణానికి నేటినుంచీ మీరే న్యాయాధికారులూ, రక్షకులూను. అంతా మీచెప్పుచేతల్లో వుంటారు. యిదుగో

రాజముద్ర" అని వేలినుంచి తీసి శాస్త్రి చేతికి యిచ్చాడు.

3

## రామశాస్త్రి న్యాయపరిపాలనలో

ధర్మం నాలుగు పాదాలతోనూ నడుస్తోంది. దొంగలకూ, జారులకూ శాస్త్రి పేరు వింటే సింహస్వప్నం. ధనవంతులకుగుండె దడ దడ. మునుపటిలాగ వారు బీదలమీద విజృంభించటానికి వీలులేకుండా వుంది. గృహస్థులు యిళ్ల తలుపులు వేసుకోవటం అవుసరం లేకుండా వుంది. పిల్లలు సామానులు బయట పారవేసినా ఉదయం వరకూ ఎక్కడి వక్కడే వుంటున్నాయి. చీకటి పడింది. వీధుల వెంట రాజభటులు పారా యిస్తున్నారు. రాజ వీధిలో ఒక యింటికి ఒకధనికుడు ఆడంబరంగా వచ్చి, తలుపు తట్టాడు. ఒక స్త్రీవ్యక్తి లోపల కిటికీవద్ద నిలువబడి "నీవు ఎవరికొరకు వచ్చావో ఆ మని షిక్కడలేదు వెళ్లిపో" అని జవాబుచెప్పింది.

కాని అతడు గుమ్మంవద్దనుంచి కదల కుండా అదే విధంగా తలుపు కొడ్తూ ఆమెను తలుపు తీయమని బెదరిస్తున్నాడు.

"ఇక్కడ నీకు బెదిరేవారెవరూ లేరు ఇది రామశాస్త్రి పరిపాలన. ధనికుల ఆగడాలకు రోజులు కావివి. మెదలక పో"మ్మని చెప్పిందామె. యింతలో ఒక పారావాడొచ్చి, "యీ గోలేమి"టని ప్రశ్నించాడు.

"ఏమిటయి తేనేమిలే? నువ్వు వెళ్లిపో" అంటూ ఆ ధనికుడొక కాసు తీసి అతడిచేత పెట్టబోయాడు.

ఆ రక్షభటుడు దానిని కిటికీలోనుంచి బయటికి వచ్చే ఆవెలుతురులో చూశి కాసుగా తెలుసుకోవటంలోనే పామును చూశినట్లు దాన్ని దూరంగా విసిరి.-"ఛీ! ఆ రోజు లంతరించాయి. లంచాలు పుచ్చుకుని యింత వరకూ మీకు లొంగివుండే ఆన్యాయాధికారులూ, ఆ భటులూ కూడా సెలవు పుచ్చుకున్నారు. ఇది శాస్త్రిగారి ధర్మపరిపాలన. అతడు మా అందరిచేత ధర్మంకోసరం ప్రాణాలు విడుస్తామని ప్రమాణాలు తీసుకున్నాడు. నాకు లంచం అక్కరలేదు. నువ్వు యిక్కడి నుంచి వెళ్లిపోవలశిందే" అన్నాడు గట్టిగా.

కాని అతడు కదలలేదు.

అతడిని పట్టుకోవటంకోసరం రక్షక భటుడు ముందుకు అడుగు వేశాడు.

ఆ ధనికుడు ఒరలోంచి కత్తి తీశాడు. ఆవేగంలో పక్కనవున్న భటుడి తల ఎగిరిపోయింది. అతడు చాలాపశ్చాత్తాప్పడి శవం రోడ్డుమీదకు తొలిగించి అక్కడినుంచి వెళ్లిపోయాడు. మరునాడుదయాన్నే రోడ్డుమీద రక్షకభటుడి శవం అందరికీ కనుపించింది. న్యాయాధికారి వచ్చి హత్యజరిగిన స్థలం అదీ పరిశీలించాడు. హంతకుడికోసరం ఆచోకీ తీస్తున్నారు. కాని తెలియటం లేదు.

వారం రోజులు గడిచిపోయాయి. రాజుగారు ప్రతిరోజూ పిలిచి "హంతకుడు దొరికా

డా? " అని అడుగుతున్నాడు " లేదు మహా ప్రభో! " అని శాస్త్రి సమాధానం. ఒక రోజున పిలిచి " మూడురోజుల్లో హంతకుడిని పట్టుకుంటే సరి. లేదా నీతల తీయించవలసి వస్తుం" దన్నాడు రాయలు.

'చిత్త'మని సెలవు పుచ్చుకున్నాడు శాస్త్రి.

౪

మూడవరోజు రాత్రి

పదిగంట లయింది. పట్టణం మాటు మణిగింది. రామశాస్త్రి ఊరువెంట తిరుగుతూ రాజబాటకు వచ్చాడు. ఒక యింటిలోనుంచి కేక వినుపించింది.

" ఎవరా వెళ్లేది? "

" నేను ! న్యాయాధికారిని. "

" యిట్లా రండి. "

దగ్గరకు వెళ్లాడు. అతడిని పిలిచినదొక స్త్రీ.

" రాజుగారిచ్చిన గడువు మూడవ రాత్రి కాబోలిది! " అన్నది.

" ఔను " అన్నాడు శాస్త్రి.

" హంతకుడి పేరు కావాలా మీకు ? "

" అవును. చెపు" మన్నాడు శాస్త్రి.

ఆమె ఆ రోజు రాత్రి జరిగిన సంగతంతా చెప్పి ఆఖరున చెవిలో రహస్యంగా హంతకుడి పేరును చెప్పింది. శాస్త్రి ఒక నిముషం అక్కడే నిలువబడి మళ్లీ కదిలి వెళ్లిపోయాడు.

౫

మరునాడు దర్బారులో

తన రక్షకభటులతో శాస్త్రి సింహాసనానికి ఎదురుగా నిలువబడి రాజు రాకకోసరం నిరీక్షిస్తున్నాడు. సభంతా కిటకిటలాడుతోంది.

రాయలు వచ్చి, సింహాసనంపైన కూర్చున్నాడు.

" ఏం ! దొరికాడా హంతకుడు ? "

" చిత్త " మన్నాడు శాస్త్రి.

" ఏడి ? " అని అడిగాడు రాయలు.

" చిత్తం " అంటూ రక్షకభటాధికారికి సంజ్ఞ చేశాడు. అతడు జేబులోనుంచి సువర్ణ శృంఖలలు తీశాడు పైకి.

"ఏడీ?" అని రాజు మళ్లీ ప్రశ్నించాడు.

సంకెలలతో అధికారి సింహాసనముందుకు నడిచి ఆజ్ఞకోసం న్యాయాధికారివంక చూశాడు. సభాసదులంతా వెర్రెత్తినట్లు న్యాయాధికారిని కోపదృష్టులతో చూస్తున్నారు. రాజుకళ్లు ఎర్రబడ్డాయి.

శాస్త్రి అధికారస్వరంతో —"రాజా ! సింహాసనముమీదనుంచి దిగి యిటు రండి. హంతకులు మీరే!" అన్నాడు.

రాయలు అడుగు క్రిందపెట్టి నిలువబడ్డాడు. శృంఖలలు చేతికి తగిలించాడు భటాధికారి. " నా న్యాయస్థానానికి దోషిని తీసుకురా " అంటూ శాస్త్రి ముందు నడిచాడు.

ప్రజలంతా వెనుక నడిచారు.

౬

న్యాయాధికారి న్యాయస్థానంలో

అపరాధుల స్థానంలో నిలువబడ్డాడు రాయలు. శాస్త్రి తన ఆసనంపై కూర్చు

న్నాడు. ప్రజలందరూ న్యాయాధికారివంక చూస్తున్నారు.

"నీమీద రక్షకభటుడిని చంపిన నేరం మోపబడింది. సమాధానం ఏమిటి?" అని అడిగాడు న్యాయాధికారి.

రాయలు గద్గదికంఠంతో జవాబిచ్చాడు—"అవును; నిజమే. కాని నాకు చంపుదామనే ఉద్దేశ్యం లేదు. బెదిరించుదామని కత్తి తీయగా తల తెగిపోయింది." అన్నాడు.

"సరే! యీ నేరం పొరపాటుగా చేశినా శిక్ష యథావిధిగా జరుగవలశిందే. నీకు ఉరి శిక్ష విధిస్తున్నాను" అన్నాడు శాస్త్రి.

రాయలు, ప్రజలు నిశ్చేష్టులయి చూస్తూన్నారు. ఇంతలో ప్రక్కగదినుంచి ఒక భటుడు రాయల సువర్ణవిగ్రహం పట్టుకొచ్చాడు.

"రాజా! నీవు మహారాజువు. అయినా, నీ అపరాధం అపరాధం కాక పోదు. నీవు లేక పోయిన రాజ్యము నడవదు. అందుచేత ఒక ధర్మ సూక్ష్మను వెతికాను. నీకు బదులుగా నీ సువర్ణవిగ్రహం కోటగుమ్మంలో ఉరి తీయబడుతుంది" అంటూ లేచి రాయలవద్దకు వచ్చి—

"రాజా! యీపీఠం నాకు వద్దు. నేను యీపీఠానికి తగను. నామాట బోటుపోకుండా ఉండటం కోసమే యిన్నాళ్లూ యీ అధికారం వహించి నాచేతనయినట్లు ధర్మస్థాపనము చేశాను. యిక నాకు సెలవిస్తే పోయి నా అగ్రహారంలో నే పడివుంటాను, శలవు" అన్నాడు.

రాజు అతడిని కౌగిలించుకుని సాదరంగా "అయ్యా! మీకంటె యీ న్యాయపీఠం అలంకరింపదగ్గవా డెవ్వడూ నా కింతవరకు కనుపించలేదు. "న్యాయం అంటే యిల్లాగే ఉండాలి" అని అతడిని తిరిగి ఆసనంపైన కూర్చోపెట్టాడు,

ప్రజలంతా హర్షధ్వనులు చేస్తూ, "న్యాయం అంటే యిల్లాగే ఉండాలి" అన్నారు.



# బలవంతపు పెండ్లి*

(ఏకాంక నాటకము)

మంత్రిప్రగడ సూర్యనారాయణగారు

---

## పాత్రలు:

సోమేశ్వరరావు—ఒకపౌరుడు.
గురునాధరావు—అతని స్నేహితుడు.
ఆనందరావు—దమయంతి తండ్రి.
జోగారావు—ఆనందరావు కుమారుడు, దమయంతి తమ్ముడు.
లక్ష్మీనాధరావు—దమయంతి ప్రియుడు.
ప్రభాకరశాస్త్రి } వేదాంతులు.
రామానవధాని }
దమయంతి—ఆనందరావు కుమార్తె.

---

### ఒకటో రంగం

(సోమేశ్వరరావు దుస్తులు వేసికొని యింట్లోవాళ్లతో)

సో:—నే నిప్పుడే వీధులో కెళ్లొస్తాను. ఇల్లు జాగ్రత! నే నొచ్చేలోపు నెవరేనా డబ్బు గాని తెస్తే గుర్నాధరావుగారింటికి పంపించండి; లేకపోతే మళ్లీ రమ్మంటే సరి.

(అని వీధిగుమ్మంలో అడుగు పెట్టేసరికి గురునాధ రావు ఎదురై)

గు:—బాగు. బాగు.

సో:—ఓహో! గుర్నాధరావుగారు! ఇప్పుడే తమదర్శనానికి బయద్దేరుతున్నా.

గు:—ఎందుకు?

సో:—మీతో కొంచెం మాటాడవలసిన పనుండి.

గు:—ఏవిటో? ఇక్కడే మాటాడుకుందాంవా?

సో:—నే నో కార్యం తలపెట్టుకున్నా. ఒకాయన వాగ్దానంకూడా చేశాడు. అయినా మీవంటి స్నేహితుల సలహా లేందీ చేసుకోడం యిష్టం లేదు.

గు:—ఏవిటోయి ఆకార్యం?

సో:—నామాట సాంతంగా విని—నన్ను పొగడకుండా-మీ ఉద్దేశం చెప్తానంటే ..

గు:—తప్పకుండా...

సో:—మర్మం లేకుండా మాట్లాడినవాడే స్నేహితుడు గదా మరి......

గు:—నిజం.

సో:—ఈకాలంలో ప్రాణస్నేహితు లరుదు...

---

* ఘాలియరునాట కానుసరణము.

గు: ..ఔ నాను !

సో:—అంచేత మీరు నా వుద్దేశం విని మర్మం విడిచి సలహా యిస్తా నని ఒప్పేసుకోండి.

గు:—ఓ!

సో:—ఒప్పేసుకోండి చెప్తా.

గు:—భగవంతుడు సాక్షి !

సో:—(మెల్లిగా) ఆయితే మరి నేను వివాహం చేసుకుందికి తగుదునా తగనా ?

గు:—ఎవరు? నువ్వేనా ! !

సో.—నేనే ! మీ వుద్దేశం ?

గు.—అయితే నా ప్రశ్నలకి టక్ టక్ మని జబాబు చెప్పు.

సో.—ఆఁ!

గు.—నీ వయస్సు ?

సో.—నడిగాలం.

గు.—నీకు, ఒకటి, రెండు, వారాలకేం? సమంగా యెన్నేళ్లు ?

సో.—నాకు తెలేదు.

గు.—మనిద్దరం స్నేహితుల మయ్యేటప్పటికి నీ కెన్నేళ్లు ?

సో.—అప్పటి కిరవై.

గు.—మనం కలకత్తాలో యెన్నేళ్లున్నాం ?

సో.—ఎనిమిది.

గు.—బొంబాయిలో ?

సో.—ఏడేళ్లు.

గు.—తరవాత నువ్వు చెన్నపట్నం వెళ్లేవు గదూ! అక్కడెన్నే ళ్లున్నావు?

సో.—అయిదేళ్లనర.

గు.—ఎప్పు డెళిపో వచ్చే వికడికి ?

సో.—1852 లో.

గు.—ఇది 1864 గో సంవత్సరం. అందులో 52 తీసేస్తే 12. అయిదేళ్లు చెన్నపట్నంలో వున్నావు.—17. ఏడేళ్లు బొంబాయిలో 24. ఎనిమిదేళ్లు కలకత్తాలో-32 దా మొత్తం. ఈ ముప్పయిరెండుకి మనం స్నేహితులఁనయినప్పుడు నీ కున్న 20 ఏండ్లకి కలుపుతే 52. అంచేత నీ కిప్పు డించుమించుగా 52, 53, ఏ ళ్లుంటాయి.

సో.—నాకు నమ్మకం చాల దన్నే ళ్లుంటా యని.

గు.—నా లెక్క తప్పు కాదు. అయినా నువ్వు నా ప్రాణస్నేహితుడివి కాబట్టి మర్మం విడిచి చెబుతున్నాను—ఈ వయస్సులో వుండి నువ్వు పెళ్లి చేసుకోడం మంచిది కాదు. పెళ్లివరికో తెలుసా? నవయవ్వనంలో ఉన్నవాళ్ల కేగాని ఉట్లుడిగి చట్లుడిగి, కూ డొల్లక, కాడు రమ్మంటూన్న మనలాటి వాళ్ల కింకా పెళ్లి దుర్దేవి టోయి? వెఱ్ఱివాడివిగాని! ఇలా గన్నా నని మరో విధంగా అనుకోకుమా! పెద్దవాడి వయ్యుండీ యీ మాత్రం ఆలోచించక పోయావు గదా అని విచారిస్తున్నా. ఇపుడు నీకు సగం కాలం గడిచే పోయింది ; గన కిహను "రామా! నారాయణా!" అనుకుంటూ హాయిగా మిగిలిన కాలం వెళ్లబుచ్చుకోకుండా డబ్బిచ్చి తద్దినం కొనుక్కున్నట్టు భార్యా లంపటం తగిలించుకో వద్దని నా సలహా! తరవాత నీ యిష్టం. విను.

సో.—నేను పెళ్లి చేసుకుందికి నిశ్చయించేసికొని మాటిచ్చేనుకూడా. నేనో పిల్లని ప్రేమించి పెళ్లాడ కూడదూ ?

గు.—అది వేరే సంగతి మాటకూడా యిచ్చేనని చెప్పావా ముందు?

సో.—ఆ పిల్లని మనస్పూరా ప్రేమించాను.

గు.—అయ్యం డొచ్చు

సో.—దాని తండ్రికూడా తనకూతుర్ని నాకే తప్పకుండా పెళ్లి చేస్తానన్నాడు.

గు.—అలాగా !

సో.—ఆహా! ఇవాళ సాయంకాలంవే లగ్నం కూడా నిర్ణయం వయింది.

గు.—తలములిగి తాటిప్రమాణం తెచ్చుకొని నా సలహా అడుగుతే నే నేం చెప్తా? తప్పకుండా పెళ్లాడు మరి.

సో:—గుర్నాధరావుగారూ! మన్లో మనమాట- నేను పెళ్లాడదగనూ? ముప్పయ్యేళ్లవా డెవడేనా నాలా ఉక్కుముక్కలా వున్నవాణ్ణొక్కణ్ణి చూపండి! శుభ్రంగా నడువగలను. పళ్లన్నీ దిట్టంగా వున్నాయి (అని పళ్లు చూపును). కడుపునిండా తింటాను, తిన్నదరుగుతుంది (అని దగ్గుతూ) ఏఁవంటారు? నా శరీరపటుత్వాన్నిబట్టి నే పెళ్లి చేసుకోవచ్చు ననుకుంటా.

గు:—బాబూ! వద్దనడం నా పొరపాటు. తప్పకుండా పెళ్లి చేసుకోవోయి బాలాకుమారుడా!

సో:—వయస్సులో వున్నప్పుడు అస్ఖలిత బ్రహ్మచారినయి యీలోకం విడిచేదాం అనిపించింది. ఇప్పుడు నాయీడువాళ్లని చూడగానే వాళ్లల్లా పెళ్లాం పిల్లలతో సుఖంగా వుండాలనే వాంఛగలిగింది. పెళ్లి చేసుకుని పిల్లల్నికని వీధులోంచి రాగానే "నాన్నా! నాన్నా!" అంటూ పిల్లలు కాళ్లల్లో పడితే ఆ ఆనందం అనుభవించాలనుంది. భార్యో! నే నేఁ వేనా అలుస్తే భార్య ఉపచారం పొందాలనుంది ఆహా! గృహస్థుడి కేం సంతోషం!

గు:—ఆహా! పెళ్లాం పిల్లలు లేనివాడి దేంజన్మం?? తప్పకుండా పెళ్లి చేసుకో.

సో:—హాస్యంవా? నిజంవా?

గు:—నీతో నాకు హాస్యం వేఁవిటోయి! చిన్నవాడివా? చితకవాడివా? అయితే నువ్వెవర్ని పెళ్లాడు తావు?

సో:—దమయంతిని.

గు:—ఆ కందునా?

సో:—......

గు:—ఆనందరావు కూతురు కదూ!

సో:—అవును.

గు:—ఆజన్మవీరుఁడు జోగారావు అప్ప కదూ.

సో:—అలాగే.

గు:—అలాగా! హి! హి! హి!!!

సో:—ఏఁవలాగ?

గు:—ఈడూ జోడూ బాగుందని సంతోషం. మరేఁవుంది?

సో:—బాగుందా?

గు:—మెల్లిగా అంటున్నావింకా. తప్పకుండా పెళ్లాడు.

సో:—అయితే సంతోషం. తమరు నాపెళ్లికీ రాత్రి దయచెయ్యాలి.

గు:—అయ్యో! ఎక్కడున్నా ఆవేళకి ఉట్టిపడతాను.

సో:—ఇక నే శలవు తీసుకుందునా? (అని నిష్క్రమించును).

గు:—ఇంకా ముక్కుపచ్చలారని దమయంతీకీ, కాటికాళ్లు చాచుకున్న యీ ముద్దేశ్వరానికీ పెళ్లా! ఆహాహా! ఎంతబాగుంది! ధనాశచేత పిల్లల్ని ముసిలిముద్దలికేనా యిచ్చి పెళ్లిచేసే తండ్రులున్నారు గదా లోకంలో? (అనుకొనుచు పోవును).

---

## రెండో రంగం.

సోమేశ్వరరావు:—(తనలో) పెళ్లినాటి సంతోషం మరిలేదు. నేను వివాహం చేసుకుంటాన నెవరితో చెప్పినా "పోనీ యిప్పటికేనా యీబుద్ధిపుట్టింద"ని నవ్వుతున్నారు. ఇప్పుడుగదా నేను ధన్యుణ్ణి!

(అప్పుడు దమయంతి సేవకునితో ప్రవేశించును.)

ద:—(సేవకునితో) ఒరే! వేగం నడువు.

సో:—(దమయంతిని చిరుజూపులజూచి తనలో) ఇదిగో! నా కాబోయేభార్య వస్తూంది. ఆహా! దానందం! పుబ్బ రెండు కళ్లు చాలవు. ఆ గజగమనం. ఓహోహో! ఈమే నా భార్యవుతూంది. ఇక నా ఆనందసముద్రానికి ఒడ్డెక్కడుంది? (అనుకుని, సమీపించిన దమయంతితో) పిల్లా? ఎటు?

ద:—బట్టలషాపుకి. మనకి పెళ్లికదూమరి?

సో:—బాగుంది! అహ్హాహ్హా! (తనలో) తన్మయం చెంది పోతున్నాను. (పైకి) పిల్లా! నువ్వు నా దానివి. బూరుగుదూదిలా కోమలమయిన నీవొళ్లూ, కలువల్లాటి కళ్లూ, ముత్యాల్లాటి పళ్లూ, ఎఱ్ఱగన్నేరు పెదవులూ, ఆ గులాబీచెక్కులూ అన్నీ నావే! అబ్బ! ఏంవీ సంతోషసముద్రం! నీముఖచంద్ర మండలం చూసేసరి కెలా పొంగుతూంది!- ఇంకెందుకు పిల్లా! యివాళనుంచి నువ్వు నా భార్యవి గదూ! ఇక మనకి భేదంవేవిటి? నువ్వే నేను నేనే నువ్వు! (దమయంతి చిన్నసగవు నగును. అంత సోమేశ్వరావు సంతోష పారవశ్యము నామెను గౌగిలించుకుని) దమయంతీ! మన యీడూ జోడూ బావుంది గదూ? సంతోషంవేనా?

ద:— మహాసంతోషం. ఎంచేత నడగొచ్చు. ఇప్పటిదాకా నాతండ్రి నన్నింట్లో పడేశాడు బానిస కంటే అన్యాయంగా. నాకు స్వేచ్ఛ ముఖ్యావసరము. ఆడవాళ్లకూడా స్వేచ్ఛ యివ్వడంచేతేగదా పశ్చిమఖండాలవాళ్లు మహా ఘనత గలిగున్నారు. నువ్వూ మంచివాడివి. మనం భార్తా భర్తలమయి యే అరమరా లేకుండా వుందాం. (సోమేశ్వరరావాలోచనాపరుండగును) ఏం? నీకిష్టంవేనా? కాని యివాళి లాగున్నావేం?

సో:—కొంచెం తల నొప్పిగా వుంది.

ద:—అదేం కాలంవోగాని అందరికీ తలనొప్పులే. మనపెళ్లీ తలనొప్పులన్నీ పోంగొడుతుంది. నాథా! బట్టల కొట్టుకెళ్లి వివాహావసరంవయిన బట్టల బిల్లు నీదగ్గిరకి పంపుతాను. చెల్లించీ సొమ్ము.



[అని దమయంతి సేవకునితో పోవును. సోమేశ్వ

(అని దమయంతి సేవకునితో పోవును. సోమే రా వాలోచనాధీనమనస్కుండై నిలిచియుం అప్పు డతని స్నేహితుండు గురునాథరావు ప్రవే

—సోమేశ్వరం! ఇంకా యిక్కడే వున్నావు
! నీతో ఒక కబురు చెప్పాలి. పెళ్లికాలమంకు



లోచనాధీన మనస్కుడై నిలచియుండును.]

కి పెట్టడానికి నక నవ్రజపావుంగరం నీకాకా
అని తెలిసి ఒహ వర్తకుడు తన దగ్గిర మంచి
రాఉన్నాయని చెప్పమన్నాడు.



సో:—సరే. తొందర్లేదు లెండి.

గు:—సాయంకాలం పెళ్లి పెట్టుకుని తొందర్లేదం టావేం?—మనసు తిరుగుసుఖఁవవుతూందేఁవిటి? పెళ్లి వుబలాటఁవంతాపోయిందేఁవిటి ?

సో:—ఇప్పుడు నాకు కొన్నసుమానాలు కలిగాయి. పెళ్లి చేసుకుందాఁవా? మాందాఁవా ? అని మళ్లీ ఆలోచనలు పుడుతున్నాయి. అందులోకీ నిన్న రాత్రో కలొచ్చింది. అదిప్పుడు మళ్లిజ్ఞాపకం వచ్చింది. కలలంటే నాకు నమ్మకం లావు. ఆ కలేఁవిటంటే-కెరటాల్తో కిందా మీదా అవుతూన్న సముద్రమ్మీద నేనో పడవలో వున్నట్టు. అది మంచి కలో చెడ్డదో....

గు.—సోమేశం! కలలగురించి నాకేఁవీ తెలీదు. ఇప్పుడు నాకు చాలాపనుంది పోతాను. దానిగురించి నీకు సలహా కావలిస్తే మీ యింటికిదగ్గరే వేదాంతులున్నారు; పోయి అడుగు. మరి నేవస్తాను. (అని పోవును)

సో:—మంచిసలహా యిచ్చాడు. నే నిప్పుడే పోయి, వాళ్లని, నా వివాహంగురించీ- కలనిగురించీ- అడుగుతాను.

(అని యాతఁ డనుకొనుచుండ నెదుటిగృహము నుండే ప్రభాకరశాస్త్రి యను వేదాంతి యీవలకు వచ్చి సోమేశ్వరరావును చూడకుండా తా వచ్చిన యింటివేపు తిరిగి)

ప్ర:—పొమ్ము! నాతో మాటలాడ వలదు. నీవు పనికిరానివాడవు. న్యాయముగ నాలోచించిన నీకు వేదాంతి మండలమునం దావు లేదు.

సో:—నేను చాలా అదృష్టవంతుణ్ణి. సమయానికే యెదురయే డీ వేదాంతి కూడా.

ప్ర:—(సోమేశ్వరరావును చూచీచూడక) నిజము జెప్పుతున్నాను వినుము. శంకరాచార్యాదులగు మహాపండితులరీతిని నే వాదించుచుండ నీవు నోటికి వచ్చినట్లు వాదించుచుంటివి. నీవు వాజవు. వాజ వాజా, వాజస్య, వాజః—సరిగదా యిక నోరు మూయుము.

సో:—(తనలో) ఈ పండితుడు వేదాంతంలో మరొహాయన్తో వాదించి సిగపట్లగోత్రంలో దిగి యిప్పుడే యివతలి కొచ్చినట్లుంది. అయినా పలు కరిస్తా. (దగ్గరికివెళ్లి) అయ్యా!

ప్ర:—ఓరీ! భ్రష్టా! మరల మాటలాడుట కూడనా? ఆఁ! నీవే మెఱుఁగుదువు? నీకే సూత్రము లును రావు. మరి నన్నవసరముగ వాదనకుఁ బ్రేరే పింపకుము.

సో:—ఇక బాగానే వుంది రికం! ఎదుటివాని మీద కోపం నామీద చూపుతున్నాడీయన. అయ్యా!

ప్ర:—(విని) ఏల?

సో:—నేను......

ప్ర:—దుర్మతీ! మదాంధా! నిలుకడలేని మాట లాడఁదగునా? వేయి విధములుగ నఱచిన లాభమేమి?

సో:—పండిత మాన్యా!...

ప్ర:—(వెనుదిరిగి) వాజా! నోరు మూయుము.

సో:—నేను...ఏఁవండోయి...

ప్ర:—యథాప్రకారము) నీవు చెప్పిన దంతయు వృథాయని సూత్రములతో ఖండించెదను.

సో:—ఆర్యా!—

ప్ర:—ఇఁకముందిట్టి మృషావాదనలకుఁ గడం గకుము.

సో:—బాబూ! తమ కింతకోపాని క్కారణం ఏఁ విటండీ?

ప్ర:—తగినంత కారణమున్నది.

సో:—నేను వినొచ్చా?

ప్ర:—ఒక తుచ్ఛుఁడు, నీచుఁడు, దుర్మదాం ధుఁడు తానుగూడ మహాపండితుఁడనని బయల్వెడలి, నాతోఁదర్కమున వాదనకు బూనుకొని, భయంకర మును, దుర్భరమునగు నొక జవాబిచ్చెను. అదియే నా యాగ్రహ కారణము.

సో:—చిత్తం.

ప్ర:—సోమేశ్వరరావూ! కాలమహిమ ఏమని వర్ణింపఁగలను? ఉండుండి మాటాత్తుగ ప్రపంచము నాశన మగునేమో యను భయము నా కతిశయించు చున్నది. ప్రతివాఁడును బండితుఁడే, కవియే, గాయ కుఁడే. ఇక నేమందును! ఇళ్లెల్లరు నొక్కపర్యా యమే కవులు, గాయకులు, పండితు లగుచుండ శాస్త్రి ముల మూలముట్టుగఁ జదివి వాటిప్రకారము వర్తిం చుచున్న మాబ్రతుకులు మూలఁబడినవి. ఆహా! కాల మహిమ!!

సో:—ఆఁ!

ప్ర:—మదాంధా! దుర్మతీ!!

* * * * *

సో:—(తనలో) వెధవబాధలా వుంది (పైకి) అయ్యా! శాస్త్రీజీ! నామాట వినరూ? గంటసే పాయి మాటాడుమన్నాను గాని నాగోల చెప్పుకుఁదికి అదును దొరకనిచ్చారు కారు. ఇకనేనా మీ పుణ్యం వుంటుంది వినురూ.

ప్ర:—క్షమింపుము. ఆ దుర్మార్గునిపైఁ గల కోప భరముచే నీమాటలు వినకుంటిని.

సో:—ఇక చెప్పనా?

ప్ర:—చెప్పుము.

సో:—మీతో ఒహ సంగతి చెప్పాలి.

ప్ర:—దేనితో మాటలాడుదువు?

సో:—నానాలుకతో.

ప్ర:—అదికాదు. యే భాష నన్నమాట.

సో:—మీకు తెలీయదా?

ప్ర:—సంస్కృతమా?

సో:—కాదు.

ప్ర:—అరవమా?

సో:—కాదు.

ప్ర:—కన్నడమా?

సో:—కాదు.

ప్ర:—మహారాష్ట్రమా?

సో:—కాదు.

ప్ర:—వంగభాషనా?

సో:—కాదు.

ప్ర:—హిందీయా?

సో:—కాదు.

ప్ర:—అరబ్బీనా?

సో:—కాదు.

ప్ర:—ఇంగ్లీషు గాబోలు?

సో:—కాదండీ! తెలుగు, తెలుగు.

ప్ర:—ఓస్! తెలుగునా ?

సో:—ఆఁ!

ప్ర:—అట్లయిన నీ వంకకు రమ్ము (ఒక చెవిఁ జూపి) యీ చెవి యన్యదేశభాషలకును వేదాంతవాద నలకును, ఈరెండవది మాతృభాషకును; కాబట్టి యీ చెవివద్దకు వచ్చి మాటలాడుము.

సో:—(తనలో) పండితులికింత పిచ్చేఁవిటో సుమా!

ప్ర:—నీకేమి కావలయును?

సో:—నేనో చిన్న విషయం చెప్తాను. మీ సలహా చెప్పాలి దాన్నిగురించి.

ప్ర:—వేదాంత విషయమా?

సో:—కాదు.

ప్ర:—లక్షణశాస్త్రి సంబంధమయిన సందేహమా?

సో:—కాదండీ!

ప్ర:—తర్క శాస్త్రి విషయమా?

సో:—కాదు! ఏఁవిటీ వెధవ డబ్బా !

ప్ర:—అట్లయిన నీకేవిషయమునుగూర్చి మాట లాడ నన్ను సమీపించితివి?

సో:—మరనవసరంగా మాటలు పెంచక నా మాట వినండి—నేనో చక్కని పిల్లని పెండ్లాడదలచు కున్నాను. 'మీ పిల్లన్నాకిత్యు'మని దాని తండ్రిని కూడా అడిగాను. కాని.-

ప్ర:—(అతని మాటలవినక) మాటలాడుట ; మనో గత భావముల వెలిబుచ్చుటకై భగవంతునిచే మాన వుల కొసంగఁబడెను. తెలిసినదా? (అని మొదట తా వచ్చిన యింటి గుమ్మమువద్దకు బోవును. అపుడు సోమే శ్వరరావు 'ఆగు' మని చే యెత్తి సౌజ్ఞఁజేయును. అంత నావేదాంతి మరలివచ్చి) ఇప్పుడే నేఁజెప్పిన దంతయు మరచితివా ? భగవంతుఁడొసంగిన మెసడు వలనఁ బ్రయోజనమేమి ? సంజ్ఞలుమాని నోటఁబలు కుము (అని యటనిలువక మరల గృహమువంక బోవును).

సో:—(కోపోద్దీపితుఁడై యావేదాంతి నింటిలో నికి ద్రోసి, తలుపుపల గడియవేసి) ఈ వెధవ వేదాం తులు లోకంలో చెడబుట్టేరు !

ప్ర:—(ఇంటి కిటికీలోంచి) తమ్ముడా ! కోపము నాపుము. 'మాట' హృదయమునకు సేవకునివంటిది. హృదయ మెటుచెప్పిన నట్లు మాటవచ్చును. గాన మాటలాడి నీయుద్దేశ మెరింగింపక గోపించిన లాభ మేమి ?

సో:—నీ గోలే లావుగావుంటే నే చెప్పడం ఎక్కడ ?

ప్ర:—అలాగునా ? వినెదను. చెప్పుము.

సో:—వేదాంత విశారదా!

ప్ర:—త్వరగ జెప్పుము.

సో:—తప్పకుండా.

ప్ర:—పెద్దవాక్యములు వలదు.

సో:—వెఱ్ఱికుదిరింది రోకలి బుఱ్ఱకిచుట్టమన్నట్టుంది.

ప్ర:—నీవున్నదే వాడుకభాష మాటలాడిననూ వ్యాకరణము జాగ్రత్త!

సో:—చెప్పనిస్తావా ఒకటే పురాణంవా?

ప్ర:—కఠినపదములు వలదు. చిన్నచిన్న వాక్య ములు, సొగసగు నుచ్చారణయు నుత్తమము. వ్యాక రణ దోషరహితమై యుండవలెను.—నేను వ్యాక రణశిరోమణి నగుటచే లోకము నన్నుజూచి తల్లడిల్లు చున్నది. వ్యాకరణమును పాటించనివాఁడు మూర్ఖుఁడు (అని లోనికేగును)

సో:—ఓరి వీడమ్మకడు బ్బంగారంగానూ! వీణ్ణి పిచ్చాసుపత్రికి పంపాలి.

ప్ర:—(మళ్లీ కిటికీలోంచి) నేను కవిగ్రామణిని; విద్వద్విభూషణుడను; వేదాంత విశారదుడను; పండితపుంగవుడను. నాకు సాటిఏడీ?!!

సో:—నీగొప్ప దొప్పలట్టినట్టే వుంది.

ప్ర:—ప్రకృతి, నీతి, రాజ్యాంగ శాస్త్రవేత్తను; కవిరాజును; వ్యాకరణ శిరోమణిని; అలంకార చూడామణిని; శిల్పశాస్త్ర, వైద్యశాస్త్ర, నాడీ పరిజ్ఞానాదులలో నసమానుడ. (అనుచుండ రోడ్డుమీద రాళ్లు తీసి సోమేశ్వరరావు వాతనిపై విసరును. ఆ వేదాంతి లోనికేగును.)

సో:—ఏం వేదాంతిరా నాయనా. వీడి బుజ్జుబుగ్గి కానూ. డబడబ యేంవాగేడు. ఇక నారెండో వేదాంతేనా మంచివాడైతే—(అని రామావధాని యింటివైపేగును.)

---

## మూడో రంగం.

(రామావధాని—సోమేశ్వరరావు.)

రా:—నీవెవరు? ఇటకేల వచ్చితివి?

సో:—వేదాంతవిశారదా! నాతో సంబంధించిన ఒక విషయంలో తమలాటి పండితుల సలహా కావలసుం డిల్లావచ్చేను. (తనలో) ఈ వేదాంతి నామాట వినేటట్టుంది. పాపం! మంచివాడు.

రా:—మా బోటి వేదాంతులు "నేను" అనిన నమ్మరు. "నా" అననదేమి? "నే" నెవరు? దానిం గూర్చి మానవమాత్రుడవగు నీకుం జెప్పుట కష్టము. నీకు వేదాంతజ్ఞానము శూన్యము. మాకు ప్రపంచముతోగాని యీ శరీరముతోగాని సంబంధములేదు. గాన "నేను వచ్చితి" ననక "తమ సలహానిమిత్తమై నే వచ్చినటులున్న" దనుము.

సో:—బాగుంది. నే నిక్కడకొస్తే యింకా వచ్చినట్టుండడం వేంవిటగోరం.

రా:—నే ననినటు లనుము.

సో:—నేనలాగన్ను. నే నిక్కడికొచ్చాను; నాకాలాటి అనుమానం లేదు.

రా:—నీవు ప్రశ్నింపదగవు. మేము నమ్మము. నీవు వచ్చినట్లుండెను.

సో:—నే నిక్కడికొచ్చి మీతో మాటలాడుతున్నానుగదా!

రా:—ఏమో! ఒక వ్యక్తి ఎవరో మాతో మాటలాడుచున్నట్లుండెను. నేను వినుచుంటిని గాబోలు కాని నీవు అనువారు నాతో మాటలాడుచుండ నేను వినుచుంటినో లేదో మాకు దెలియదు.

సో:—సర్రా బాబూ! ఇదో కొత్తపాట—వేదాంతీ! నాకు పెళ్లి చేసుకోవాలనుంది.

రా:—నా కేమిరుక?

సో:—నేను చెబుతున్నానుగదా!

రా:—అయితే కావచ్చు.

సో:—నే వివాహం చేసుకోవా లనుకున్న పిల్ల చాలా అందకత్తె.

రా:—అయి యుండును.

సో:—నేను పెళ్లిచేసుకుందునా? వద్దా?

రా:—చేసుకుంటే చేసుకుందువు; లేకున్న మానివేయుదువు.

సో:—పెళ్లి చేసుకుందునా?

రా:—నీయిష్టం.

సో:—వద్దంటా రేంవిటి?

రా:—అంతే గాబోలు!

సో:—మరి హాస్యాలాడక సరయిన జవాబియ్యండి.

రా:—నా యుద్దేశమంతే.

సో:—ఆపిల్లని నేను చాలాప్రేమించేను.

రా:—అయితే కావచ్చు.

సో:—వాళ్ల తండ్రికూడా ఒప్పుకున్నాడు.

రా:—ఒప్పుకోవచ్చును.

సో:—నే నిప్పుడు పెళ్లాడితే యేం దోషం లేదు కదా?

రా:—ఏమో?

సో:—తమ అభిప్రాయం?

రా:—నాకు నమ్మకం చాలదు.

సో:—అయితే ఏం చెయ్యమంటారు?

రా:—నాకు తెలియదు.

సో:—మీ సలహా?

రా:—నీ యిష్టం.

సో:—నా కోపం వస్తూంది.

రా:—నాకేమి?

సో:—ముసిలి వెధవా!

రా:—అంతే.

సో:—వెధవ వేదాంతీ నేనెవరా? (అని లెంప గొట్టును.)

రా:—అయ్యో! అయ్యో!!

సో:—చావు.

రా:—ఓరీ! మూర్ఖా! మాలాటి వేదాంతుల కొట్టకుము.

సో:— నిన్ను నేను కొట్టేను కాబోలు! నాకు నమ్మకం చాలదు.

రా:—ఇప్పుడే పోయి రక్షకభటుల కెఱింగించెదను.

సో:—నాకేం!

రా:—నీవు నన్ను కొట్టినట్టు లీతల్లే నిదర్శనములు.

సో:—అవును గాబోలు!

రా:—నీవే నన్ను కొట్టితివి.

సో:—నాకేం తెలుసు?

రా:—నిన్ను శిక్షింపఁజేయుదును.

సో:—అంతే.

రా:—శిక్షింపించి తీరుదును.

సో:—కానున్నది కాకమానదు.

రా:—అట్లయినఁ జూడుము. (అని నిష్క్రమించును.)

సో:—ఇద్దరికిద్దరూ డీలాంటి వెధవవేదాంతులే. అదుగో యెవరో యీదారంట వస్తున్నట్టుంది. పోలీసు వాళ్లా!...ఏమో! యీ రోడ్డుపక్క చెట్టువార నిలచి చూస్తా. (రోడ్డు ౘగి చెట్టువార దాఁగును.)

[దమయంతి—ఆమె ప్రియుఁడు లక్ష్మీనాధరావు వచ్చి]

లక్ష్మీనాధరావు:—దమయంతీ! నీ అభిప్రాయ మేఁవిటి?

దమయంతి:—నీకు తెలియదా?

లక్ష్మీ:—వాణ్ణి పెళ్లాడేస్తావన్న మాటే?

ద:—ఆహా! తప్పకుండా—

లక్ష్మీ:—ఈ రాత్రి కాబోలు నీపెళ్లి.

ద:—ఊఁ—

లక్ష్మీ:—దమయంతీ! మరేఁవను కోకుగాని, నీకేఁవేనా న్యాయంగా వుందీ చెప్పు. నన్ను పెళ్లాడ తానని ఇంతకాలం నమ్మించి యిప్పుడు మరొకాళ్ని పెళ్లాడ్డాని కొప్పుకోడం నీకేఁవేనా బాగుందా!

ద:—ప్రియా! లక్ష్మీనాధం! (అని వానిభుజం మీద చేయుంచి రాస్తూ) నేనతన్ని పెళ్లాడ్డాని కొప్పుకుందికి మరో కారణం వుంది. ఇప్పుడు నేను పెళ్లాడ్డాని కొప్పుకున్నా నే—ఇటు చూడు—అతనికి చాలా ధనం భూఁవులూ వున్నాయి. రెండోది ముసిలాడుకూడాను. విన్నావా?—ఎవరికేనా ధనం ముఖ్యం అతన్ని వివాహమాడేననుకో. యివాళ మనసులో యెలాగున్నా పైకి ప్రేమించినట్టు నటించి, పెళ్లాడితే మాత్రం వాడివల్ల నాకున్నబేం దీరుతుంది? మనస్సెప్పుడూ నీమీదే వుంటుంది. ఏకో ఆ రవంత ముడీ పడ్డాక వాడితో నాల్రోజులు కాలక్షేపం చేస్తా. చస్తాడనుకో. తరవాత మూటాముల్లే భద్రం చేసుకొని నీదాన్నవుతా. అప్పు డధమపక్షం 10 వేలేనా ఆడొచ్చు మన చేతులో. దర్జాగా వెలిగిద్దాం. ఇప్పుడు విధవా

వివాహం తప్పలేదుకూడా. ఇదినాయాహా (అని చెబుతున్న సమయంలో సోమేశ్వరరావు దాగున్న స్థలం నుంచి వచ్చి వాళ్లనిచేరును. అప్పుడు దమయంతి) అయ్యా! మీగురించే యితగానితో చెప్తున్నా; మీరింతవా రంతవారని.

లక్ష్మీ:—దమయంతీ! ఈ యనేనా నీకు కానున్న మొగుడు?

ద:—(సిగ్గునభినయించి) ఊఁ—

లక్ష్మీ:—అయ్యా! నమస్కారం. నేటినుండి నేను మీస్నేహితు ణ్ణనుకోండి. నాకు దమయంతిని దాని తండ్రిని మొదలయిన వాళ్లందర్నీ బాగా తెలుసు. దమయంతీనేనూ చిన్నప్పట్నుంచీ ఓ కంచంలో తిని ఓ మంచం మీద పడుకున్నామంటే అలాగంటి మా యిద్దరికీ అంతస్నేహ మన్నమాట. అది మీ భార్యయిన తరవాత దాన్ని చూడాలనున్నప్పుడు మీ యింటికి కొస్తా. మరేం అను కోకండి!

ద:—బాగుందోయి! ఆయనమాత్రం యేం తెలియని వారను కున్నావేం! రా—పోదాం—ఇప్పుడింట్లో చాలా పనుంది. (అని వానితో పోవును.)

సో:—ఇదంతా చూస్తే పెళ్లికో పత్రం యిచ్చేస్తేనే బాగున్నట్టుంది. ఇంకా పెళ్లి లేదు, పెడాకులూ లేవు. అప్పుడే యీ అమ్మాయి నే జస్తేప్రియుడితో వుడాయించాలని చూస్తూంది; డబ్బూ యేగానీ చూసుకుని. బాబూ! నాకీ పిల్లొద్దు, పెళ్లొద్దు. మరి నేనై పెళ్లాడను. వెంటనే వెళ్లి దాని తండ్రితో చెప్పేస్తే మంచిది.

---

## నాలుగో రంగం.

(సోమేశ్వరరావు—దమయంతి తండ్రి ఆనందరావు)

ఆ:—అల్లుడూ! ఇలా రావోయి.

సో:—క్షమించి నన్ని వాళనుంచి! "అల్లుడా!" అనకండి.

ఆ:—అయితే మాపిల్లని వివాహం చేసుకోవూ?

సో:—చేసుకోను.

ఆ:—ఏఁ వలాగంటావు? పెళ్లి సన్నాహాలన్నీ చేసుకు న్నే కూచుంటే యిప్పుడా పెళ్లి చేసుకోననడం? ఇదేఁవేనా తగుమనిషి తరహాకీ.

సో:—చెప్తా వినండి.

ఆ:— ఏఁవిటి?

సో:—మీపిల్లని నేను వివాహం చేసుకుంటానని మీకు మాటివ్వడం నిజఁవేగాని ఆలోచించుకుంటే నే నామెకి తగిన వరుణ్ణి కానని తేలింది. ఎంచేతా? అనండి. కాలమామల్లి. పళ్లూడాయి. కాళ్లూ చేతులూపట్టుతప్పే అవస్త వచ్చింది. ఇప్పుడు నే నా పిల్లని పెళ్లాడితే అదేం సుఖించుతుంది? నాకు చాకిరీ చెయ్యడం తప్ప.

ఆ:—అదా భయం? నా పిల్ల నిన్ను ప్రేమించింది. నిన్ను తప్ప మరొకాణ్ణి పెళ్లాడదట! మరి నీ యిష్టం. నీకాలూ చేతికి అది కాకపోదు.

సో:—వద్దు. ఈ పెళ్లి వద్దు. ముసిలివాణ్ణవడంవల్ల అప్పుడప్పుడు కోపం వచ్చి దాన్ని కొట్టేసినా, ఎందుకు పెళ్లాడేనురా అని దుఃఖిస్తుంది.

ఆ:—అబ్బే! నా కూతురు మహా పతివ్రత. నువ్వు చంపీ; నీ నోటిమీ నే నడుస్తుంది.

సో:—ఇవన్నీ యెందుకు? నాకు పెళ్లి చేసుకోడం యిష్టంలేదు. ఒకటేమాట.

ఆ:—అలాగంటే యెలాగవుతుంది? నీకు నాకూతుర్నిచ్చి పెళ్లి చేసి తీరుతాను.

సో:—నేను చచ్చినా పెళ్లి చేసుకోను. నా యిష్టానికి మీరు కర్తలేవిటి?

ఆ:—అది కాదు. నువ్వు మా పిల్లని పెళ్లి చేసుకుంటా నని మాటివ్వడంవల్ల, తరవాతెన్నో సంబంధాలొస్తే కాళ్లదన్నేను. అందువల్ల నువ్వేందే మా దమ

యంతి భర్తవయితేగాని వీలుగాదు. కాకపోతే అయేట్టు చేస్తా.

సో:—(తనలో) ఈ సైతాను సంబంధం యెందుకు తెచ్చుకున్నానో!

ఆ:—సోమేశ్వరరావూ! నువ్వు నా స్నేహితుడ వవటంవల్ల నీ మీద నాకున్న గౌరవంచేత, మహా రాజులలో సమానమయిన సంబంధాలొస్తే "మా సోమేశ్వరానికి తప్ప యితరులికి నా పిల్ల నివ్వ,నని భీష్మిం చేను. అలాటి సమయంలో నువ్విప్పు డయిష్టం చూపితే యేం లాభం?

సో:—కాదండీ! నిజంగా ముందెందుకు మాటిచ్చారా అని దుఃఖిస్తున్నా.

ఆ:—అయితే నా పిల్లొద్దూ?

సో:—ఒద్దు బాబూ! కారణం యేమంటే నాకు ముసలితనం దగ్గరయింది.

ఆ:—ఏమో! చెప్పితే వినకుండా వున్నావు. నేనూ ముసిలివాణ్ణవడంచేతను ఆస్తీ పాస్తీ యింటో హక్కులన్నీ నా కుమారుడయిన జోగారావుకి వీలు వ్రాసిచ్చేశాను. నేను పోయి వాణ్ణి పంపుతాను. వాడు మాచెడ్డ కోపిష్టి; వాడిష్టం. నీయిష్టం! వాడు చెప్పినట్టు నువ్వు నడుస్తావో లేక మీయిద్దరూ బుజ్జిలు బద్దలుకొట్టుకుంటారో కానీండి. ఇకనీ ఖర్మం. (అని నిష్క్రమించును).

సో:—ఏఁవిట్రోయి! కధట్నుంచిటు గిఱ్ఱుని తిరిగింది! ముందే పెళ్లివూసే తలపెట్టకపోతే యెంత బాగు! ఇంకా నాకు పెళ్లేఁవిటికి? చూద్దాం. ప్రాణాలు తీసెస్తాడేఁవిటి? ఆ జోగారావు—వాడొస్తే యేదో తేలొచ్చు.

(జోగారావు ప్రవేశించి)

జో:—అయ్యా! నమస్కారం.

సో:—దీర్ఘాయుష్మంతుడ వవు!

జో:—మరో సంగతి. మీరు మా అక్కని పెండ్లాడరట! ఇదే ఏలాగ?

సో:—అవునవును. కారణా లున్నాయి.

జో:—కాయం వేసేఁవిటి.

సో:—ఆహా!

జో: — (పక్కబీరువాలోంచి రెండు కత్తులు తీసి) ఇదుగో యీ కత్తందుకో. నేనీ కత్తి పట్టుకుంటా, ఇద్దరం దెబ్బలాడదాం, నేనోడిపోతే నువ్వు మా అప్పని పెళ్లాడొద్దు. నువ్వోడిపోయావా పెళ్లాడాలి.

సో:—(తనలో) పీడొదుల్తే పిశాచం పట్టుకుంది. (పైకి) నాయనా! నన్నింత బలవంతం చెయ్యకు. నీ పాదాలి కో దండం. నాకు కత్తి పట్టుకోడం తెలీదు. నీ అప్పని పెళ్లాడను.

జో:—అయితే ఫలితం అనుభవించు (అని గూబ గింగుమన్న ట్టో లెంపకాయతీసి) పెళ్లి చేసుకుంటావా?

సో:—(వణకుచూ) వద్దురా బాబూ!! చంపకు!!!

జో:—నోరు ముయ్యి. ఆ మాటంటే యివాళ నీ పని సరి. (అని జుత్తుపట్టుకునొంచి వీపుమీద గుద్దులు వర్షం కురిపించును).

సో:—(ఏడుస్తూ) అబ్బా! బాబో! దండం రా బాబూ! ఈ పెళ్లొద్దురా.

జో:—చంపేస్తాను. నీకివాళనూరేళ్లూ నిండాయి. (అని అడాపెడా లెక్కకు మీరినట్టూ లెంపలు వాయించి, దగ్గరదో కఱ్ఱతీసి గొడ్డును బాదినట్టు బాదును.)

సో:— బాబూ! నీ అమ్మ కడుపు మాడా! మరి నీ బాధ పడలేనురా!

జో:—నీకేం పోయికాలంరా పిల్లనిస్తావంటే పెళ్లి చేసుకోకపోడానికి? (అని మరి రెండు లెంపలు వాయించును.)

సో:—కానీరా వెధవా! రాక్షసీ!నీపాలే పొంగనీ! ఆ బరువేదో యీ ముసలి మెడకక్కట్టీ ! పద !! నే చచ్చేకది ఎవరిలో పోతే నాకేం!!

జో:— మొదలే ఒప్పుకుంటే ! అయ్యా! బావ గారూ!! - నే నింత బాధ పడక్కర్లేదే. రండి. యిప్పుడేం మించింది?

(అని వాణ్ణి తండ్రిదగ్గిరి కీడ్చుకునిపోయి) నాన్నా ! దార్లో కొచ్చేరు బావగారు!

ఆ:— సోమేశ్వరరావూ ! ! పదవోయి మంగళ స్నానానికి. లగ్నం దగ్గరపడింది.

---

## మెఱుపు

బొడ్డు బాపిరాజుగారు

ఈ తిమిరావగుంఠనము లించుక యించుక దించుచున్ సుధా
శీతల మందహాస పరిషిక్త విలోల విలోచనోన్మిషత్
జ్యోతులలో దిగంతముల నొక్కపరిన్ వెలిగించుచుండి ని
ర్భీతి చరింతు వింత వివరింపుము నీకథ లోతటెన్నటీ !

జలదాంతఃపుర కేళివాసముల లాస్యశ్రీపదన్యాసముల్
పలుమా రధ్యయనమ్మొనర్చు దివిషద్బాలామణీ! నీ తనూ
విల సత్కాంతి విభా విలాసముల నువ్విళ్లూరు డెందమ్ముతో
కలయంజూతుము కాని, పాంథ హృదయక్ష్వాభమ్ము లా నృత్యముల్.

చెలువారన్ సురలెల్ల రాగడప కుర్చీలందు కొల్వుండ బల్
మెలపుల్ మై జిగిసొంపు జూపి సభవారిన్ రక్తి గట్టింతు మ
ద్దెలకా డెవ్వ డపస్వరమ్ములను పృథ్వీ గోళ మూగించు? నే
ర్పులకుం దగ్గ మరొక్కనిన్ వెదకి కీర్తుల్ నింపు దిగ్భిత్తులన్.

పనిగొన కూరకే తిరుగుబా టొనరించుచు మబ్బుగుర్రముల్
గొనగొనలాడ కొట్టు తళుకుంగొరడా మెగ పద్ది యా మహేం
ద్రుని దని యందురే! యుబుసు దోపమికిన్ ముసలమ్మ లంచు వే
ళను వెలువడ్డపుక్కిటి పురాణము కాదు గదా క్షణప్రభా !

ఏమయినగాని నీ రూపు, నా మనమ్ము నింపు కొన్నది, సౌదామినీ ! నిజాన
కింతయో అంతయో హృదయేశ్వరికిని సాటివచ్చుట నయనప్రచాలనముల.

# వజ్రతార

మల్లవరపు సుబ్బారావుగారు, బి. ఏ., బి. ఇడి.

ఆది ప్రజ్ఞా, ఆది బుద్ధుడూ, సర్వమానవులకూ తల్లిదండ్రులని భావిస్తారు బౌద్ధమతస్థులు. బ్రాహ్మణములలో ప్రకృతి పురుషులూ శివశక్తులూ, ఎంత ప్రాముఖ్యస్థానం అలంకరిస్తారో, వీరు బౌద్ధమతంలో అంత ప్రాముఖ్యంగా ఎన్నబడుతారు. ధ్యాననిమగ్నులైన బౌద్ధభక్తులంతా ఈ ఆదిదేవతలనుండే పుద్భవించారని చెప్తారు. ప్రపంచ గొడవలలో వారు ఏమాత్రమూ కలుగజేసికోరు. కాని వీరు ఎల్లప్పుడూ జతగా వుండి వరుసయుగాలలో సృష్టికి సహాయభూతు లవుతూ ఉంటారు. వీరిలో ఒకరు అవలోకితేశ్వర ప్రభువు; అతనిశక్తి—అంటే అర్ధనారి లేక స్త్రీత్వము—తార అని పిలువబడుతోంది.

శరీరచ్ఛాయనుబట్టి తారకు అయిదు రూపాలున్నాయి— తెలుపు, పసుపు, నల్లన, నీలములేక ఎరుపు. ఈ రూపాలలో ఒక్కొక్కదానికి పెక్కు అంతరరూపా లున్నాయి. ఇప్పుడు మనము తెలుసుకొనేతార, పీతవర్ణపు తార. డా॥ ఫౌచరు తన "బౌద్ధ స్తూపాలూ, విగ్రహాలూ" అనే గ్రంథం రెండో సంపుటంలో, ఈ దేవతయొక్క చిత్రమూ, ఆవాహనమూ తెలిపి ఉన్నాడు. ఫౌచరు దీనిని 'ఒక చిన్న చులుకనైన దేవళము' అన్నాడు—ఈ విగ్రహము అష్టలోహాలతో చేయబడిన ఒక తామర కమలము. దానికి ఎనిమిది దళాలుండి క్రిందకూ పైకీ కదలుతూ పుష్పము ముడుచుకోవడానికీ, వికసించడానికీ వీలుంటుంది. ఈ విగ్రహము భాగల్పూర్ జిల్లాలో పాతర్‌ఘట్ట మనేచోట దొరికింది. ఇప్పు డది కలకత్తా ఇండియన్ మ్యూజియమ్‌లో ఉన్నది. డక్కా మ్యూజియమ్‌లో కూడా, అలాంటి విగ్రహమే ఒకటి, ఫరీద్‌పూర్ జిల్లాలో మాజ్‌వారీ గ్రామాన్నుండి సేకరించబడింది.

ఫౌచరుగ్రంధాన్నిబట్టి, వజ్రతారను ఈ రీతిగా కమలంలో ప్రతిష్ఠించడం అంటే కమలం ఒక పవిత్రస్థలము (మండలము) గా భావించబడిన దని తెలుస్తోంది. ఈ మండల మధ్యాన్ని వజ్రతార నివసిస్తూంటే ఎనమండుగురు ఉపదేవతలు (మాతలు) ఈమెచుట్టూ కనిపెట్టుకొని ఉండాలి. వారిలో, వజ్రాంకుశి, వజ్రపాసి,వజ్రస్ఫుతి,వజ్రఘంత అనే నలుగురు యోగినులు, మండలానికి నలువైపులా నాలుగుద్వారాలూ కాచి ఉంటారు. నాలుగు మూలల్లోనూ, పుష్పమూ, జ్యోతీ, ధూపమూ, పరిమళమూ అనే నాలుగుతారలు కాచి ఉంటాయి.

కదుల్తూన్న ఎనిమిది దళాలు కలిగి, వికసించిన ఈ పద్మము, సరిగ్గా తారయొక్క పవిత్రమండలాన్ని నిరూపించడానికి తగి ఉన్నది. వజ్రతార పద్మమధ్యాన్ని కూర్చొని ఉంటుంది. ఎనమండుగురు మాతలూ ఎనిమిది దళాలపైనీ ఆసీను లవుతారు. ఈ కమలం మూసుకొనిపోయి, మాతలు వజ్రతార చుట్టూ ఆవరించుకుపోయినప్పుడు, ఒక పవిత్ర

వాతావరణం ఏర్పడి, భక్తుల హృదయాల్లో ఆవేశం కలుగుతుంది. కమలం వికసించగానే దేవత సర్వశోభితంగా భక్తులకు దర్శనమిచ్చి వారి అర్పణలు గైకొంటుంది; ఈ కమలం మామూలు కమలంలాగే సాయంత్రానికి మూసి ఉండి, ఉదయాన్నే వికసింపజేయబడుతుంది.

వజ్రతార ఎనిమిది చేతులూ, నాలుగు ముఖాలూ కలిగి, ఒక్కొక్క ముంఖలో మూడేసి నేత్రాలు, పంచ వర్ణాల్లోనూ ఉన్నట్లు చిత్రింపబడింది. ముఖములన్నీ కుడి ప్రక్కకే వొరిగి వుంటాయి. తార, యౌవనవతియగు కన్యకు ఉండాలిసిన లక్షణాలన్నీ కలిగి ఉంటుందిఎర్రని కమలమధ్యాన్ని కాళ్లు, మడతవేసుకొని అష్టదేవతల మధ్య ఆసీనమై ఉంటుంది. కుడిప్రక్క చేతులలో ఉరుమూ, అంబులూ, శంఖమూ, వరదముద్రా (ధర్మచిహ్నము) ధరిస్తుంది వజ్రతార. వామహస్తాలలో నీలికమలమూ, విల్లూ, అంకుశమూ, పాశమూ కలిగి ఉంటుంది.

ఫారిద్‌పూర్‌లో దొరకిన విగ్రహము, కొలది శిథిలావస్థలో ఉన్నది. వజ్రతార అసలు విగ్రహం విరిగిపోనే పోయింది. కాని కమలంమధ్య రెండు పాదములు మాత్రమే మిగిలి ఉన్నాయి. ఎనిమిదిదళాలలోనూ మూడు పోయినయి. మిగిలినవాటిలో రెండిటిపై మాత్రమే ఉపవిగ్రహాలున్నాయి. కమలాన్ని మూసే సాధనంకూడా పోయింది.

ఈ విగ్రహదళాలపై ఇరువురు నాట్యకత్తెల బొమ్మలు చిత్రింపబడి ఉన్నాయి. కుడికాలెత్తి, ఎడమకాలిపై నృత్యంచేస్తూన్న ఆ విగ్రహాలు కొంత ఆశ్చర్యం కొల్పుతాయి. రెండు విగ్రహాలూ, అయిదాకుల కిరీటాలు ధరించి, మోకాళ్లవరకూ పుర్రెలతో చేయబడిన మాలలు ధరించి ఉన్నాయి.




ఉపదేవతల స్థానాలు

ఈ విగ్రహాలలో ఒకదానిచేతిలో బాకూ ఇంకొకదానిచేతిలో డోలూ ఉన్నాయి. డోలును ధరించిన విగ్రహము ఉరుమును సూచిస్తుంది గనుక, అది వజ్రస్ఫూతి అని అనుకోవచ్చును. కాని రెండవవిగ్రహము ఇచ్చట అసందర్భంగా ఉన్నది. ఈ విగ్రహములో చూపిన వజ్రతారయొక్క పాదాలు, బల్లపై కూర్చునిఉన్నట్టున్నాయి. కాని,'సాధన'లో చెప్పబడినట్టు మడతవేసుకొని లేవు.

మొత్తంమీద ఈ విగ్రహము శిల్పియొక్క చాతుర్యాన్ని చాటుతోంది. చారిత్రాత్మకంగా, క్రీ.పూ. 9–11వ శతాబ్దాలలో ఈ రకం విగ్రహాలు భారతదేశంలో చెక్కబడినట్టు తెలుస్తోంది.

(నా 'ఆంగ్లపత్రికల సంగ్రహం' లోంచి)

# రాజుగారి బిడ్డ

దివాకర్ల రామమూర్తిగారు

అనగా అనగా ఓ రాజు.

ఆ రాజు ఒక దేశం పరిపాలిస్తున్నాడు.

ఆ రాజుగారికి ఓ పెద్ద మేడ వుంది. అటువంటిది మరోటి దేశంలోనే లేదు. అది నీ వెప్పుడూ చూచి ఉండవు. అది రాజధానిలో మధ్యగా ఉంది. ఆ పెద్ద మేడ దేశంలోని పెద్ద మేడల్లో పెద్దది.

ఆ రాజధానిలోనే ఒక కాలువ ఉంది. ఎప్పుడూ పారుతూ ఉంటుంది; రాజుగారి ముఖ్య పట్టణంలో ఉంది కాదూ! అందుకని. లేకుంటే వేసవికాలంలో మన కాలువలకు మల్లే ఎండి పోయేది.

ఆ కాలువ ప్రక్కనో గుడిసె వుంది. అటువంటి గుడిసెలు నీవు చాలా చూస్తావు. దేశం అంతటా ఉంటాయి. చూడాలంటే రాజధానికే పోనవసరం లేదు. కాని కాలువప్రక్క నున్న ఆ గుడిసెను చూడాలనే ఉంటుంది. రాజుగారికైనా అంతే - ప్రకృతిని ఆనందించ గలిగిన శక్తి ఆ మహారాజులో నుంటే.

ఆ పెద్ద మేడలో ఉండేది మహారాజుగారు. పారా కూడా ఉంటుంది. ఎవరూ రాత్రిళ్లు దగ్గరసగా గబగబా నడచేందుకు వీల్లేదు. గమనవేగంలో గలిగే చప్పుడు రాజుగారి నిద్రకు భంగం గలిగిస్తుందని పారావాని జాగ్రత. ఆ మహారాజుచెవులు చప్పుళ్లు వినవు. ఒకొక్కక్కప్పుడు గట్టిగా మొరిగితేనే వినబడదు. చప్పుళ్లు వినబడతాయి? కాని అది శ్రీ వారి ఆజ్ఞ. శిరసా వహించ దగ్గది. ఆ అధికారాన్ని ప్రశ్నింపగల సామర్థ్యం గల వారెవరు? ఆయన మహారాజు!

కాలువప్రక్కన గుడిసెలో ఉండేది ఒక బీద బ్రాహ్మణుడు. ఎప్పుడూ రొదగానే ఉంటుంది. ఆయనచెవులు ఆ రొదలను వింటూనే ఆనందాన్ని అనుభవిస్తవి. కుక్కలు మొరుగుతాయి. చిన్న పిల్లలు కేక లేస్తారు. రాత్రిళ్లు గుడ్ల గూబలు కూస్తాయి. ఆయన నిద్రాభంగం లేదు. నియమభంగం లేదు. గుడిసె చుట్టూ ఆ బ్రాహ్మణుడూ మహారాజే.

మహారాజుగారి అధికారం కృత్రిమ ప్రకృతిమీద.

సహజమయిన దివ్య ప్రకృతిమీద అధికారం బ్రాహ్మణస్వామిది.

౧

ఆ రాజుగారి పెద్దమేడ కొండమీద కట్టారు. అందరికీ కనబడుతుంది. గాలి బాగా వీస్తుంది. కాని ఎవ్వరూ అక్కడికి వెళ్లరు.

ఆ పూరిగుడిసెను కాలవగట్టుక్రింద కట్టారు. అది యెవరి దృష్టిపథంలోనూ పడదు. కాని అందరూ అక్కడికే వెడతారు.

రాజుగారి మేడ సున్నంతోనూ చంద్రకాంతశిలలతోనూ కట్టారు. లోపల అద్దాలుంటాయి. వెలుతురు వచ్చేందుకు ప్రత్యేకంగా అద్దాలు. క్రింద పాలరాయి. పైని సరంబీకూర్పు. ఛాందినీ. అన్నీ బొమ్మలు కనబడతాయి. ఏ బొమ్మ నిజమో ఎవ్వరికీ తెలియదు.

ఆ గుడిసె పూరిగడ్డితో కట్టబడింది. లోపల వెలుతురుకు అద్దాలు లేవు. సూర్యచంద్రుల కిరణాలు నిరాటంకంగా లోనికి వస్తాయి. అక్కడ అనేక బింబాలు గోచరించవు. ఒక్కటే నవ్వుతూ ఉంటుంది.

ఆ పెద్దమేడలో విద్యుద్దీపాలు, పంకాలు ఉన్నాయి. ఇంకా గాలికోసం ఆరాటమే.

పూరిగుడిసెలో ఆముదం దీపాలు. గాలిచేత దీపాలు ఆరిపోతాయేమో అని భయం.

పెద్ద మేడలో రాత్రిళ్లు సంగీతాలు పాడుతారు. పిల్లంగోవులు ఊదుతారు. సన్నాయి ఊదుతారు. గ్రామోఫోనులు వేస్తారు. ఎవ్వీ ఒకప్పుడు రాజుగారికి నచ్చవు. రాజుగారి చెయ్యి ఊపితే అన్నీ, మీటర్ నొక్కితే విద్యుద్దీపాలు ఆరిపోయినట్లు, ఆగిపోయి నిశ్శబ్దం కురుస్తుంది.

ఆ గుడిసెలో సంగీతాలు ఎవరు పాడతారు! వేదాలు చదువుతారు. సామవేదం గానం చేస్తారు. కోకిలలు గోరువంకలు కూస్తవి. పాడుతవి. ఆ పాటలంటే బ్రాహ్మణునకు విసుగే లేదు. ఎప్పుడూ విసిగించకుండా క్రొత్తరాగా లాలాపిస్తాయి అవ్వి.

రాజుగారు హంసతూలికాతల్పంమీద శయనిస్తారు. అదికూడా వత్తుకుంటుంది పాపం! జోడించినా నిద్రపట్టదు. లోకం కంగారుపడి కలవరిస్తుంది రాజుగారి నిద్రకోసం.

ఆ గుడిసెలో దర్భలు పరచుకొంటాడు బ్రాహ్మణుడు. హాయిగా గుండె మీద చెయి వేసికొని నిదురిస్తాడు.

రాజుగారి పెద్దమేడ తలుపులు రాత్రిళ్లు వేసే ఉంటాయి.

పూరి గుడిసెతలుపులు బారుగా తీసి ఉంటాయి.

రాజుగారికి ఉదయాన్నే వందిమాగధ స్తోత్రాలు; మేలుకొలుపులు ; ఎంత మొద్దునిద్దుర పట్టుతుందో కాని! ఇవి అన్నీ అయ్యేవరకు మెలకువే రాదు.

బ్రాహ్మణదేవునికి ఉదయాన్నే వస్తుంది మెలకువ. పిట్టలు మేలుకొలుపులు పాడుతాయి. కాలువ తరంగాలు మృదంగాలు వేస్తాయి.

రాజుగారి దేవిడీగుమ్మాలు తుడవడం నీళ్లు చల్లడం అంటూ ఉండదు. ఎప్పుడూ అందంగానే ఉంటాయి రంగుల ముగ్గులు. ఎంతమంది త్రొక్కినా చెరిగిపోవు. ఏళ్లపర్యంతం అల్లాగే ఉంటాయి.

ఆ బ్రాహ్మణదేవుని పూరిగుడిసె ముంగిట గృహలక్ష్మి ఉదయాన్నే పిండిముగ్గులు పెడుతుంది. ఎదుకో ఒక్కగంటలోనే ఎక్కడికో ఎగిరిపోతాయి గంటన్నర సేపు నడుము వంచి పెట్టిన ముగ్గులన్నీ.

మహారాజుగారు పన్నీట స్నానం చేస్తారు. ఉష్ణోదకాలు సబ్బులు సిద్ధం. తోమేందుకు వందమందో వెయ్యిమందో మంగళ్లు తయారు.

బ్రాహ్మణుడు ఉదయాన్నే ప్రవాహజలంలో స్నానం చేస్తాడు వంద్రు మట్టితో తోముకుంటాడు.

రాజుగారు పట్టు శాలువలు కట్టుగొంటారు. అత్తరువులు పులుముగొంటారు.

బ్రాహ్మణస్వామి నీరుకాయ అంగవస్త్రాన్ని మోకాలు దిగకుండా కట్టుగొంటాడు.

రాజుగారికో ఘన వైద్యుడు.

బ్రాహ్మణునికి వైద్యులు లేరు.

రాజుగారికేదో అస్వస్థత వస్తూనే ఉంటుంది.

బ్రాహ్మణునకు జ్వరమేనా రాదు.

౨

రాజుగారి కోటారం నిండా ధనం ఉంది. అది లౌకిక ధనం. భయయుక్తమయినది.

బ్రాహ్మణునిది విద్యాధనం. దొంగలవలన దొరలవలన భయం నాస్తి.

రాజుగారు తెగించి దానం చేస్తే ధనాగారం సన్నగిలుతుంది.

బ్రాహ్మణుడు హృదయపూర్వకంగా దానంచేస్తే పదింతల వృద్ధి.

రాజుగారి ముఖారవిందం అలంకారాలతో స్వచ్ఛందంగా వెలుగుతుంది.

బ్రాహ్మణుని ముఖబింబమో అలంకారాలు, రత్న కిరీటాలు లేకుండానే తేజోవంతంగా ఉంటుంది.

ఆ మహారాజు నాశ్రయించుగొని వందలాది మహామహ జనులు ఉంటారు. వారి ముఖాలు అలంకారాల

చేత భాసితాలు. నిజానికి అలంకారాలు వినాగా వారి ముఖాల్లో వర్చస్సు సున్న.

ఆ బీద బ్రాహ్మణుని చుట్టూ వేలాది శిష్యులు. వీరి ముఖాలు స్వప్రకాశాలు.

౩

మహారాజుగారికీ బిడ్డలు లేరు.

బ్రాహ్మణాయనికి బిడ్డలు లేరు.

మహారాజుగారు బిడ్డలకోసమై నూతులు త్రవ్వించాడు. సత్రాలు కట్టించాడు. ఇంకా ఎవ్వో చాలా చేయించాడు.

బ్రాహ్మణుడు యజ్ఞ యాగాదులు చేశాడు.

మహారాజుగారి భార్య గొలచిన దేవుళ్లకు మితిలేదు. ఆ రాణి మునుగని గుంటలేదు. ఇదంతా పిల్లలకోసం.

ఆ బ్రాహ్మణి భర్తనే ధ్యానించింది. మనస్సులో ఒక్కడినే దేవుణ్ణి కాలకంఠ విశ్వనాధుని గొలిచింది.

మహారాజుగారికి పుత్రులు లేకుంటే తన అనంతరం ఇతరులకు పోతుందని విచారం.

బ్రాహ్మణునకు పున్నామనరకం వస్తుందని విచారం.

రాజుగారిది ఐహికమయిన చింత.

బ్రాహ్మణునిది ఆముష్మిక చింత.

రాజుగారు కార్తాంతికుల రప్పించి పృచ్ఛించారు.

బ్రాహ్మణుడు తానే ఎరుగును సర్వమూ.

౪

మహారాజుగారికి పుత్రప్రాప్తికై దేశమంతా జపాలు జరిపింది. తపస్సులు చేసింది. ఉపవాసాలుంది. యజ్ఞ యాగాదులు చేసింది. మహానదులలో మునకలిడింది. గయలు నడిచింది. బ్రహ్మకపాళం వెళ్లింది. కైలాసగిరి తాకింది.

బ్రాహ్మణునకు పిల్లలు లేరని ఎవ్వరూ అనుకోలేదు. ఎవ్వరి కవసరం? ఆ సంగతి ఎవ్వరూ ఆ వూసే ఎత్తరు.

మహారాజుగారి కో పిల్లవాడు జన్మించాడు.

బ్రాహ్మణునకు పిల్లవాడు పుట్టాడు.

౫

రాజుగారు మహానందభరితు లయ్యారు. రాజ్యం తనవానికే అని మురిశారు. జ్యోతిష్కులను పిలిపించారు. జాతకం వ్రాయ నియమించారు.

బ్రాహ్మణుడు నరకం తప్పిందని సంబరపడ్డాడు. జ్యోతిష్కులను రావించి గొప్పగా జాతకం వ్రాయ నియమించలేదు.

రాజు సంతర్పణలు చేశారు. సామంతులు ఉపహారాలు పంపుకొన్నారు.

రాజుగారి కోటారం నిండింది. దేశం శాంతించింది.

బ్రాహ్మణుడు ఉన్నట్టే ఉన్నాడు. పుత్రోత్సాహంతో మురిసిపోలేదు.

రాజుగారు పురిటిచూరి మేళతాళాలతో, పంచదార చిలకలతో ఊరంతా ప్రతీగడపకీ పంచిపెట్టించారు.

బ్రాహ్మణుడు తన గుడిసె ప్రక్కనున్న ఇండ్లలో పుణ్యస్త్రీలకు పురిటి ఇంగువ ఆవగింజంత పంచిపెట్టి సంబరపడ్డాడు.

రాజుగారి అబ్బాయి జననం పత్రికల్లోపడింది పెద్ద క్షరాలతో.

బ్రాహ్మణబాలుని జననం చిత్రగుప్తుడు వ్రాసుకొన్నాడు.

రాజుగారింటినుండి మంత్రసాని మోయలేకుండా వెళ్లింది చీరలతోనూ ధాన్యంతోనూ. బొడ్డుకోత రూపాయలతోనూ.

బ్రాహ్మణుని ఇంటిలో పురిటిగదిలో ఎరుకలది మూతి ముడుచుకొంది.

౬

రాజుగారు నామకరణాది మహోత్సవాలు మహత్తుతో జరిపారు. బ్రాహ్మణులను దక్షిణలతో తృప్తి

పరచారు. పిల్లవాని ఆరోగ్యానికి ఆశీస్సు లందుకొన్నారు.

బ్రాహ్మణుడు నామకరణాది జాతకర్మలు సర్వమూ జరిపాడు. అయితే అంత అట్టహాసం ఎల్లా వస్తుంది?

"కుమార మహారాజ శ్రీమాన్ ........." అంటూ గుక్క తిరగకుండా రాజుగారు కుమారునకు నామకరణం చేశారు. ఆ పేరు జనులందరూ వేదబుక్కల వలె కంఠస్థం చేసుకొన్నారు.

బ్రాహ్మణుడు "........శర్మ" అని నామకరణం చేశాడు. ఈ మాట లోకం నోటికి ఉచ్చరించేందు కసాధ్యమైంది.

2

రాజుగారు వీధిలో, ఉత్సవంలో, ఏనుగంబారీమీద కూర్చున్నారు. జయజయ ధ్వానులతో ఉత్సవం జరిపారు. ప్రజలంతా ఆ ఉత్సవంలోనే ఉన్నారు.

బ్రాహ్మణుడు కాలి నడకను పనిమీద వీధిని బోయాడు. ఆయన కేమాత్రం త్రోవ దొరికిందిలేదు. ఆయన ఆ సంబరంలో 'వా' డయ్యాడు.

రాజుగారిమీద పుణ్యస్త్రీలు అక్షతలు చల్లారు. ఇంకా పదిమంది పిల్లల తండ్రి వగుమన్నారు.

బ్రాహ్మణునకు విద్వాంసులంతా నమస్కరించారు. ఆశీస్సులు పుచ్చుకొన్నారు.

మహారాజుగారి బిడ్డకు తూగుటుయ్యేలలు. పూల పాన్పులు. దానీజన స్తనదుగ్ధము. రాణీగారు పాలివ్వడం నాగరకతకు లోపంకాదూ?

బ్రాహ్మణుని బిడ్డకు గుడ్డ ఉయ్యేల. బ్రాహ్మణి నిజ స్తనదుగ్ధము. దానీజన స్తనదుగ్ధములో మాంద్యము గలదు. నిస్తేజం గలదు.

బ్రాహ్మణి దుగ్ధము వేదబుక్కల సారము.

వేశ్య వనితలు రాజుగారి బిడ్డకు లాలిపాటలు పాడిపోతారు. మంగళారతుల నిస్తారు. మంగళహారతి తాంబూలాలను చేబట్టి ముసిముసినవ్వులు చిలుకుంటూ పోతారు.

బ్రాహ్మణి లాలిపాట పాడును. సామగానము మూర్తీభవించును.

రాజుగారి బిడ్డకు దృష్టి దోషము తలిగి ఏడ్చును. మారాము వెట్టును. నిద్దుర పోదు. ఇది లోకానికి నిద్రలేనంత!

బ్రాహ్మణుని పేరు చెపితే బిడ్డకు దృష్టి దోషాలు తురాయి కట్టు.

౯

రోజులు గడిచాయి. నెలలు నిండాయి. ఏడాదులు పరుగిడినవి.

రాజుగారి అబ్బాయికి ఐదుఏళ్లు నిండాయి. దేశంలోని జనులందరూ కానుకలు పంపారు. సర్దారులు బహూకారాలను పంపుకొన్నారు.

బ్రాహ్మణబాలునకూ వచ్చాయి ఐదు సంవత్సరములు. కానుకలు ఎవ్వరు పంపుతారు!

కవులు పద్యాలు వ్రాసి మహారాజు బిడ్డను దీవించారు.

బ్రాహ్మణుని బిడ్డనికి పద్యదీవెనలు చేరలేదు.

మహారాజుగారి బిడ్డకు గణన చేయలేనన్ని ఆభరణాలు. ఆభరణములు తళతళలాడును. ఆతని ముఖము మిళమిళలాడును.

బ్రాహ్మణుని బాలునకు అలంకారాలు లేవు. కాపీనం ఉంది. దానిలోనే కళావంతుడై భాసిస్తున్నాడు.

మహారాజు బిడ్డను దానీజనము ఆడింప జూచి మహానందభరితుడగును.

బ్రాహ్మణుడు తన చెంగట తప్పటడుగులతో తొలుకు మాటలాడు కుమారుని చూచి ఆనందాశ్రువులను రాల్చును.

రాజుగారి బిడ్డడు మహాభవనములను విడిచి ఈవలకు రాలేదు.

బ్రాహ్మణబాలుడు సదా కాలు వద్దునే ఉండును.

రాజుగారు కుమారుని క్వాచిత్కంగా జూస్తాడు.

బ్రాహ్మణుడు తనకుమారునిజూడని క్షణ ముండదు.

౧౦

రాజుగారి పెద్ద మేడనిండా కాగితా లంటించారు. పందిళ్లు వేశారు. నృత్యగీతాదులు జరుగుచున్నాయి.

ఆ గుడిసెముంగట ఏమీ నృత్యగీతాదులు లేవు. గుమ్మానికి మామిడితోరణాలు వ్రేలాడుచున్నాయి.

ఆ రోజుననే రాజుగారు పిల్లవానిని బడిలో వేశారు.

బ్రాహ్మణుని పిల్లవానికి ఉపనయనం చేశారు.

గురువులు వచ్చారు. శాలువలు ధరించారు. కుండనాలు వ్రేలాడవేసుకొన్నారు. గొంతుకులు సవరించుకొన్నారు. మహారాజుగారి బిడ్డనికి ఓనమాలు వ్రాయడం చెప్పారు. ఒకసారి వ్రాయించి అలసిపోతాడని ఆగిపోయారు.

ఉపనయనంలో కుమారుణ్ని భిక్షుకని చేశారు"భవతి భిక్షాందేహి" అనిపించారు. భిక్షనిడి ఆనందించారు తల్లిదండ్రులు. వేదాధ్యయనం ఆ దినముననే ప్రారంభింప చేశారు.

మహారాజుగారి భవంతిలో రాజుగారి కుమారుడు విద్వాంసుడగునని పండితులు గొణుగుకున్నారు రాజుగారి శృతిపథంలో పడేటట్లు.

ఆ విషయం రాజుగారు విని ఎక్కువగా జరిపారు సత్కారాలు. ఆశీస్సులు పలికారు. ఆ బ్రాహ్మణ బృందం ఇంటి కరిగారు.

౧౧

రాజుగారి అబ్బాయి బడి వేరు.సామాన్యులందరి బడీ వేరు. ఉపాధ్యాయుడు వేరు. విద్యాభ్యాసవిధానంవేరు.

బ్రాహ్మణుని కుమారునికి వేదపాఠం. తండ్రి దగ్గరనే శిష్యులతో గూడి వల్లె వేస్తాడు.

రాజుగారి అబ్బాయి ఉత్సాహాన్ని సరదాని అనుసరించి చదువులు ఒజ్జలు చెబుతారు

తండ్రిమనస్సు ననుసరించి బ్రాహ్మణబాలుడు విద్యాభ్యాసం చేస్తాడు.

రాజుగారి అబ్బాయి ఒజ్జలు చెప్పింది విని ఊరుకుంటాడు. లోతుగా ఆలోచించడు.

బ్రాహ్మణుని కొడుకు తండ్రి చెప్పింది విని తండ్రితో వాదించి తన మేధావిశేషాన్ని విద్యావ్యాసంగాన్ని వృద్ధిచేసుకొంటాడు.

రాజుగారి అబ్బాయికి యుక్తవయస్సు వచ్చింది. ఇంక ఆ వ్యక్తిని యువరాజుగా రనాలి.

బ్రాహ్మణ బాలునకూ వచ్చింది యుక్తవయస్సు. ఆతడింకా గురుకులవాసంలో ఉన్నాడు.

౧౨

రాజుగారి పెద్దమేడలో లావు సంబరం అయింది. ఆ సంబరం దినాలు, నెలలూ, సంవత్సరాలు పట్టింది. రాజుగారి ఇంటికి ఒక రాజకుమారీరత్నము వచ్చింది. యువరాజుగారు ముసిముసినవ్వులు నవ్వుకొన్నారు. వేశ్యయువతులు యువరాజుగారిని ముందుంచుకొని అభినయించారు. యువరాజుగారి పెండ్లి జరిగింది.

బ్రాహ్మణబాలునకు ఇంకా గురుకులవాసం మారలేదు.

యువరాజుగారి విద్యాభ్యాసం గురువులదగ్గరకు పోయింది. వేటాదికములందు వేడుక హెచ్చింది.

బ్రాహ్మణబాలునకు శాస్త్రవిచారంలో బుద్ధి పెరిగింది.

౧౩

మహారాజుగారు రాజ్యాంగంలోంచి విశ్రాంతి వాంఛించారు.

బ్రాహ్మణునకు వేదవ్యాసంగంలో విసువు లేదు.

మహారాజుగారు యువరాజుగారిని మహారాజుగా చూడాలనుకొన్నారు. చాటించారు. సంబరాలు అమితంగా జరిగాయి. దేశమంతా అలంకారాలతో నిండి అందాల బండిలా వుంది.

బ్రాహ్మణు డింకా బ్రహ్మచారి. సచ్ఛాత్రులలో ఒక్కడే. యువరాజుగారు సింహాసనం అలంకరించారు. విద్వాంసుల స్తుతులకు వంగిపోయారు. తన రాజసంలో ఆయనకు దేశం కనబడలేదు. తాను తన స్తుతులలో తన్నెంచుకొన్నాడు.

బ్రాహ్మణబాలుడు ఇప్పుడు గుర్వాజ్ఞచే గృహస్థ డయ్యాడు. తండ్రి సంతోషించాడు.

౧౪

యువరాజుగారు ఇప్పుడు మహారాజుగారు.

బ్రాహ్మణబాలుడు ఇప్పుడు విద్వత్ప్రభువు.

అతడో చక్రవర్తి.

ఇతడో కవి చక్రవర్తి.

అతడో దేశమునకు నియంత.

కవిమహారాజు గీసిన గీత ప్రపంచం పొదల దాలుస్తుంది. చక్రవర్తిగారు ఎక్కడికి పోయినా గుర్రాల మీద, సారటుల మీద పోతారు బ్రాహ్మణులు మోయరు.

కవిరాజుకు బ్రహ్మరథం పడతారు పండితబృందం.

మహారాజు సామర్థ్యంతో సృష్టిని పరిపాలిస్తాడు. లేదా తాను పోషిస్తాడు.

కవిరాజు తన అనంతసృష్టిచే కమలభవుని సృష్టికి ప్రతిచేస్తాడు. తాను కవిబ్రహ్మ అవుతాడు.

* * *

చక్రవర్తి దేశానికి లొంగును.

కవిరాజు ప్రకృతిని లొంగదీస్తాడు.

చక్రవర్తి యశస్సు దేశంలోనే వ్యాపిస్తుంది.

కవిప్రభుని యశశ్చంద్రికలు ప్రపంచవ్యాప్తాలు.

చక్రవర్తి కీర్తిసంపద క్షణికము.

ఈతని యశస్సు సుస్థిరము.

చక్రవర్తి తన దేశంలో స్వతంత్రుడు. అతని ఆజ్ఞ ఆ నాలుగు గీతలూ దాటితే పాలింపబడదు.

కవిప్రభుని స్వతంత్రత సర్వత్రా చెందుతుంది. అన్ని దేశాలవారు అతని వాక్యాల నొప్పుకుతీరాలి.

చక్రవర్తి రాజ్యాలను జయించును.

కవిచక్రవర్తి పండిత ప్రభులను జయించును.

చక్రవర్తి తన జయాంకములను శాసనముల చెక్కించును. కవిచక్రవర్తి జయమును పండితులు తమంతటనే సువర్ణాక్షరములల పుస్తకాల్లో లిఖించెదరు.

అతడు దేశమునకు చక్రవర్తి.

బ్రాహ్మణుడో కవిలోకానికి చక్రవర్తి.

౧౫

చక్రవర్తితల తెల్లపడినకొలదీ సామంతులు స్వతంత్రతను పెంచుకొంటారు. ఆతని ఆజ్ఞచెల్లే వైశాల్యం తరుగుతుంది.

కవిచక్రవర్తి వృద్ధమూర్తి అగు కొలదీ ఆతని శాస్త్రవిచారం వన్నెకెక్కుతుంది. పండితులు దాసోహమంటారు.

సంవత్సరాలు గడిచినవి.

ఆకాశంలో ఒక తోకచుక్క తోచింది. కార్తాంతికులు లెక్కలు గుణించారు. ఋత్విక్కులు చక్రవర్తి క్షేమానికై యాగాలు జరిపారు. చక్రవర్తి దీర్ఘనిద్ర చెందాడు. లోకం ఏడ్చింది. దర్బారు అంతా నల్ల కోటులు తొడుక్కొంది ఆకాశంనుండీ తోకచుక్క క్రిందికి పడింది.

కవిచక్రవర్తి కైవల్యాన్ని పొందాడు. శిష్యులు శోకగీతాలు రచించి తమ విచారానికి స్థిరరూపాన్నిచ్చారు. ఆకాశంలో ఒక జ్యోతి వచ్చింది. అది మహాతేజస్వి. అవి ఆ కవిచక్రవర్తి కీర్తిని ప్రళయాంతం వరకూ జూపే అనార్తపంపు పువ్వు. అదికూడా ఒక నక్షత్రం.

లోకంచూచి ఇదేమిటని ఆశ్చర్యం పడింది.

చక్రవర్తి మృతినీ జూచింది లోకం. కవిరాజు మృతినీ జూచింది.

చక్రవర్తినీ ఎరుగును దేశం.

కవిచక్రవర్తినీ ఎరుగును ప్రపంచం. [కెరుక.

చక్రవర్తి రాజుగాను. వన్నెల బిడ్డడనియును లోకాని కవిప్రభువు బీదబాపన బిడ్డడని కూడా లోకం ఎరుగును. అయినా లోకం ఎవరికోసం విచారించింది?

రాజుకోసం.

కవిచక్రవర్తికోసం విచారించనే లేదు లోకం.

రాజు చస్తే ఇంకోడు!

కవిరాజుచస్తే?............కొన్ని యుగాలకు.

రాజుబిడ్డ మృతుడు.

కవి మృతజీవుడు. పాడు లోకానికి విచక్షణజ్ఞానం లేదే?

---

# తొలిపలుకు

(మత్తవిలాసము)

మత్తవిలాస మను పేరు గల ప్రహసన మిది. మహేంద్రవిక్రమవర్మ యని పేరెన్నికగన్న పల్లవమహారాజు (క్రీ. శ. 7-వశతాబ్ది పూర్వభాగమున రాజ్య మేలినవాడు) రచించినది. ఇప్పటికి దొరకిన ప్రాచీన సంస్కృత ప్రహసనములలో నిది రెండవది. తొల్తటిది భగవదజ్జుకము. దానికంటె నిది సర్వవిధములను దర్వాతిదే. భగవదజ్జుకము బోధాయన ప్రణీతముగాఁ గానవచ్చుచున్నది. కాని యదికూడ నీ మహేంద్రవిక్రమవర్మ యాస్థానిలో రచితమయ్యెనేమో యని యనుమానించుటకు సాధనలేశము లున్నవి. ఈ ప్రహసనములోని శ్లోకమును—

"పేయాసుధా ప్రియతమాముఖమీక్షితవ్యం।
గ్రాహ్య స్స్వభావలలితో౽వికృతశ్చ వేషః।
కే,నేద మీదృశ మదృశ్యత మోక్షవర్త్మ ।
దీర్ఘాయురస్తు భగవాన్ స పినాకపాణిః॥"

అనుదానిని యశస్తిలక చంపువులో సోమదేవసూరి (క్రీ.శ. ౯౬౦ నాఁటివాఁడు) భాస రచితముగాఁ జేర్కొనియున్నాఁడు. (౨ భా. ౫ ఆశ్వాసము, నిర్ణయసాగరప్రతి. పుట ౨౫౧.) బౌద్ధ కాపాలిక పాశుపత మతముల వారి యసభ్య వర్తనము లిందుఁ బ్రదర్శింపఁబడినవి. ఏతత్ప్రహసన రచనాకాలమున నా మతములవారి కట్టి యవనతగతి కలిగియుండ వచ్చును. ఉపనిషత్తులు, భారతము, బ్రాహ్మణులు, కాంచీపురి, రాజకులికులు, ఇందు పేర్కొనఁబడినవి. [పాగడ్తగనిరి.]

కాంచీపురమువైభవ మిందుఁ గొంత వర్ణిత మయినది. అక్కడ 'రాజ విహార'మని యొక బౌద్ధ విహారము ధనదాస సెట్టి యను వాఁడు వెలయించినది కలదని, ఏకామ్రము (ఒంటి మామిడి) కలదని, పూర్వ స్థలీనివాసి యీశ్వరుఁడుకలఁడని యిందుఁ జెప్పఁబడినది.

చిత్రకలాకుశలుఁడును బహుప్రఖ్యాతుఁడు నగు మహారాజు రచించినదన్న గౌరవము ను బట్టి చరిత్రోపయుక్తమగునన్న యాశనుబట్టి చిరకాలమునకు ముందే దీనిని నేను వెలిఁగించితిని. ఇదికూడ భగవదజ్జుకముతోపాటు వెలయఁదగినదే యన్న తలఁపున నిపుడు ప్రకటించితిని.

వేటూరి ప్రభాకరశాస్త్రి.

కీ॥ శే॥ బొల్లిని మునిస్వామినాయుడుగారి

# జీవిత సంగ్రహము.*

శ్రీ దివాన్ బహద్దరు బొల్లిని మునిస్వామినాయుడుగారు కమ్మకులజులు. చిత్తూరుజిల్లాలో తిరుత్తనికిసమీపమున నున్న వేలంజేరియను గ్రామమున అక్కమాంబా బొజ్జినాయుడుగార్లను జననీజనకుల గర్భశుక్తిముక్తాఫలంబై క్రీ. శ. 1885 సంవత్సరము ఏప్రెల్ మాసమున జననమందిరి. విద్యాభ్యాసము మొదట తిరుత్తనిలో కొంతవఱకు జరిగినది. ఆపై మదరాసున క్రైస్తవ కళాశాలలో ఉన్నత విద్య నభ్యసించి 1906 లో పట్టపరీక్షయందుత్తీర్ణులైరి. వీరు విద్యార్థిదశయందే మిగుల ధీశాలురని ఉపాధ్యాయులచే పొగడ్త గాంచుటయేగాక కొన్ని బంగారుపతకములను గూడ గడించిరి. జాన్స్టన్ గారిపేర నీయబడుచుండిన విద్యార్థి వేతనము సైతము వీరిగుణగణముల చేతను, విద్యాభిమానముచేతను వీరికి లభించినది. 1908 సం॥న న్యాయవాద పరీక్ష యందు కృతార్థులై మొదట చెన్నపురమందప్పుడు సుప్రసిద్ధ న్యాయవాదులుగ నుండిన పి. ఆర్. సుందరయ్యరుగారియొద్ద న్యాయవాద శిక్షణముం బొంది 1912 సం॥ చిత్తూరికి వచ్చి టి. టి. వీరరాఘవాచార్యులవారి యొద్ద జూనియరుగా నుండిరి. శీఘ్రకాలము ననే శ్రీనాయుడుగారు వృత్తియందు స్వతంత్రులై 1920 సం॥ నందు చిత్తూరు న్యాయవాది సంఘము (Bar Association) నకు మార్గదర్శకులు (Leader) గా ఎన్నుకోబడిరి. వీరు పట్టినదెల్ల బంగారమగుచుండ న్యాయవాదులవలననేగాక న్యాయాధికారులవలనను మిక్కిలి గౌరవింపబడుచుండిరి.

శ్రీ నాయుడుగారు ప్రపంచరంగమునం గాలిడినది ముఖ్యముగా 1918 నుండియే యని చెప్పవచ్చును. ఆ సంవత్సరము అక్టోబరు నెలలో తిరుత్తనియందు జరిగిన పదునాఱవ చిత్తూరుమండలమహాసభా స్వాగత సంఘమునకు అధ్యక్షులుగ నుండిరి. 1921 లో చిత్తూరు మునిసిపల్ కౌన్సిలులో సభ్యులై అగ్రాసనాధిపత్యము వహించిరి. 1920 నుండి 1923 వఱకు చిత్తూరు డిస్ట్రిక్టుబోర్డు వైస్ప్రెసిడెంటుపదవి నధివసించిరి. తరువాత 1923 సంవత్సరమున డిస్ట్రిక్టుబోర్డు ప్రెసిడెంటు పదవి నంది 1930 లో మదరాసు గవర్నమెంటునందు ప్రధాన మంత్రి పదవి ననుష్ఠించువఱకు నుండిరి. 1921 నుండి చిత్తూరుడిస్ట్రిక్టు ఎడ్యుకేషనల్ కౌన్సిలు ప్రెసి

---

* శ్రీ పూతలపట్టు శ్రీరాములురెడ్డిగారిచేతను శ్రీబూదూరు రామానుజులురెడ్డిగారిచేతను రచియింపఁబడిన పొత్తము నుండి యుద్ధృతము.

డెంటుగాను సెకండరీ ఎడ్యుకేషనల్ బోర్డు ప్రెసిడెంటుగాను నుండిరి. చిత్తూరుమండల సహకారనిధికి డైరెక్టరుగా నుండిరి.

1920 సంవత్సరమున క్రొత్తగా ఏర్పడిన మదరాసు శాసనసభకు చిత్తూరుమండల ప్రజాప్రతినిధిగ ఎన్నుకొనఁబడి యిప్పటివ రకు సభ్యులుగ నుండిరి. 1922 సంవత్సరమున చిత్తూరునందు జరిగిన రాష్ట్రీయాంధ్రమహా సభకు ఆహ్వానసంఘాధ్యక్షులుగ నుండిరి. 1929 సంవత్సరమున నెల్లూరునందు జరిగిన చెన్నరాష్ట్రీయ బ్రాహ్మణేతర మహాసభకు అధ్యక్షులుగనుండి ఆసభయందే జస్టిసుపక్ష నాయకులుగ వరింపఁబడిరి. 1926 సంవత్స రము నవంబరు నెలలో లిన్‌లిత్‌గో ప్రభువు గారి అధ్యక్షతక్రింద నేర్పఱుపఁబడిన వ్యవ సాయసంబంధమైన రాయలు కమిషను నందును, బ్యాంకింగు విచారణసంఘము నందును, శరీరవ్యాయామ విషయవిచారణ సంఘమునందును, సభ్యులుగ నుండిరి. 1929 జనవరి 5 వ తేదిని జరిగిన చెన్న రాష్ట్ర అటవీ పంచాయతీమహాజనసభకును, 1929 జూన్ 15 వ తేదీని కృష్ణామండల మందలి అంగలూరున జరిగిన "పదియవ కమ్మమహాజనసభ"కును, 1929 జూలై 12 తేది గుంటూరున జరిగిన కమ్మవిద్యార్థి వసతిగృహ ప్రవేశమహోత్సవమునకును, అంతకుమున్నే దక్షిణాపథమందలి సాత్తూ రున జరిగిన కమ్మమహాజనసభకును అధ్య క్షులుగ నుండిరి. మదరాసు విశ్వవిద్యా లయ సభ్యులుగను, చెన్నపురి శాసనసభకు సంబంధించిన దేవాదాయముల బిల్లుకమిటీ, ఆంధ్రయూనివర్సిటీబిల్లుకమిటీ, ఫారెస్టు అడ్వైజరీకమిటీ, లోకల్ సెల్ఫ్ గవర్న మెంటు అడ్వైజరీ కమిటీ, ఎస్టేట్‌ల్యాండు సవరణచట్టమునుగూర్చిన కమిటీలు మున్న గువానియందును సభ్యులుగ నుండిరి. ఇంచు మించుగ వీరు పాల్గొనని సంస్థయే లేదని చెప్పవచ్చును.

బొజ్జినాయుఁడుగారికి అయిదుగురుకొమా రులు; ఇద్దఱు కొమార్తెలు. కుమారులు అప్పాస్వామినాయుఁడుగారు, మునిస్వామి నాయుఁడుగారు, నారాయణస్వామినాయుఁడు గారు, రంగయ్యనాయుఁడుగారు, ఆచార్యులు నాయుఁడుగారు. కుమార్తెలు సుందరమ్మ, శ్రీమతి చెంగమ్మగార్లు. కుమారులలో జ్యేష్ఠులగు అప్పాస్వామినాయుఁడు గారు కృష్ణామండలమందలి గుడివాడలో పోలీసు ఇన్‌స్పెక్టరుగ నుండి 1916 లో పరమపదమం దిరి. ద్వితీయపుత్రులే మన యీ విషాదకర చరిత్రకు వస్తువైన మునిస్వామినాయుఁడు గారు. మూఁడవవారగు నారాయణస్వామి నాయుఁడుగారు ప్రస్తుతము బందరున పబ్లిక్ ప్రాసిక్యూటరుగ నున్నారు. నాల్గవవారును, అయిదవ వారును నగు రంగయ్యనాయుఁడు, ఆచార్యులునాయుఁడుగారులు వేలంజేరిలో స్వగృహమందే యుండి గ్రామాధికారమును,

స్వవృత్తియగు వ్యవసాయమును నిర్వహించుచు నలుగురిలో పలుకుబడి గలవారై యున్నారు.

శ్రీ మునిస్వామినాయఁడుగారి సంతతి ప్రథమకళత్రమందు చిరంజీవులు శ్రీయుత నరసింహులునాయఁడుగారు. కళత్ర వియోగానంతరము ప్రస్తుతము దుఃఖభాగినియై యున్న లక్ష్మీకాంతమ్మగారిని ద్వితీయకళత్రముగ పరిగ్రహించి ఆమెయందు ఆఱుగురు కుమార్తెలను ఇద్దఱు కుమారులను గాంచిరి. కుమారులును చిరంజీవులు అయిదేండ్ల యీడుగల గోవిందరాజులు, పదునొకండునెలల యీడుగల శ్రీరాములు. జ్యేష్ఠ పుత్రియగు శ్రీమతి ఆదిలక్ష్మమ్మగారు శ్రీనాయఁడుగారి మేనల్లుడగు శ్రీయుత దావులూరు మునికన్నయ్యనాయఁడు బి. ఏ. బి. ఎల్; అడ్వొకేట్, (డిస్ట్రిక్టుబోర్డు మెంబరు) గారి ధర్మపత్ని. తక్కినకుమార్తెలు చిరంజీవినులు అవివాహితలు జానకీబాయి, కమలాబాయి, సరస్వతీబాయి, రామాబాయి, అక్కమ్మ.

### ఆ శ్రి త ర క్ష ణ ము.

శ్రీనాయఁడుగారి నాశ్రయించిన కుటుంబము లెన్నియో వృద్ధికివచ్చినవి. వారినాశ్రయించి చెడినవా రెవ్వరులేరు. సామాన్యులెందఱో వారినాశ్రయించి యున్నతదశ నందియున్నారు. గొప్పతప్పిదము లొనర్చి జైలునకు పోఁదగిన పరిస్థితులయందున్న వారి నెందఱినో మన్నించి మందలించి సన్మార్గవర్తులఁ గావించి అపరాధుల చిరస్మరణమునకు పాత్రులైరి. వారు చిత్తూరికి వచ్చినప్పుడు వారియొద్ద గుమాస్తాగాఁ జేరిన ఉమాపతయ్యగారు ఇప్పటికిని వారియొద్దనే ప్రేమైకపాత్రులుగానుండి యజమాన వియోగదుఃఖ మనుభవించుచున్నారు. శ్రీనాయఁడుగారి గుణవాసనచే ఉమాపతయ్యగారును ప్రజాహితమునకే నిక్కలి పాటుపడుచున్నారు. శ్రీనాయఁడుగారు జిల్లాబోర్డునందధికారము వహించినదాదిగ పొన్నుసామి అను ప్యూను ప్రియభృత్యుఁడై వారిని విడిచియుండలేక మంత్రిపదవి నందినప్పుడు సైతము బోర్డులో సెలవుపెట్టి మదరాసునకేగి శ్రీనాయఁడుగారికి పరిచర్యచేసి కృతార్థుఁడైనాఁడు. నేఁటికిని ప్రియుఁడై పిలిచిన పలుకువాఁడై యుండి స్వామివియోగదుఃఖమున పాల్గొనుచున్నాఁడు. శ్రీనాయఁడుగారి ఉదారహృదయమొకదా యింతకు కారణము. తదితర పరిజనము సైతము ఏనాఁడు వారియొద్ద చేరెనోగాని యింతవఱకు వియోగచింత యనుమాట యెఱుఁగకయుండి నేఁటి తీఱని వియోగదుఃఖమున మునుఁగుచున్నది. శ్రీనాయఁడుగారి సౌజన్య సౌహార్దములే కదా చెంతఁజేరినవారిని చెంగనీయక చేశినది.

### న్యా య వా ద వృ త్తి.

శ్రీనాయఁడుగారు న్యాయవాదవృత్తిలోఁ ప్రవేశించిన నాఁటినుండి ప్రజాసేవమె పర

మావధిగ నెంచినవారగుటచే డబ్బువై మన నుంచినవారు కారు. కక్షిదారులకు ఎన్నఁడును డబ్బువిషయమై ఎట్టి శ్రమకాని నిర్బంధముకాని కలిగించినవారు కారు. కక్షిదారులు చెల్లించు డబ్బును జీవితాంతమువఱకు చేత ముట్టి గైకొన్నవారుకారు. ఈ వ్రతమును వారు పట్టుదలతో నాచరించుచు కక్షిదారులకు వారింట అన్నపానాది సౌకర్యములను గలిగించుచుండెడివారు. ఇందులకు దృష్టాంతము- తోడిన్యాయవాదులు లక్షల కొలఁది నార్జించుచుండఁగా వారికంటె నెక్కుడు వాకచక్యము, మాట గౌరవము, వసుమానము కలిగిన వీరి కుటుంబస్థితి ఎదుగుఁబొదుఁగులేక ఏకరీతినుండుటయే. న్యాయనిరూపణమందు టాటోటుతనముచే మసిపూసి మారేడుచేయుటగాని బల్లగ్రుద్ది ఆర్భటించుటగాని వీరికిఁ గిట్టనివి. కల్లకేసులను గాని, కారణ రహితములగు పనులనుగాని చేపట్టి నేను జయించెదను ; ఫీజును కుమ్మరింపుఁడు అని బడాయికొట్టి కక్షిదారులను త్రిప్పలుపెట్టుట వీరి మతముకాదు. కక్షిదారులవలననూత్ర మెగాక న్యాయాధిపతులచేత సైతము మమితముగ గౌరవింపఁబడుచుండుటయే వీరి శక్తి సామర్థ్యములను న్యాయశీలతను జాటుచుండెడివి. అప్పుడప్పుడు ఇతర న్యాయవాదులు ఏవో కారణములచే న్యాయస్థానమునకు హాజరుగాకుండు సమయమున న్యాయాధికారి వారి వ్యవహార పరిష్కారమునకు పూనుకొనగా కక్షిదారులు పొందుచుండు ఆవేదనలను గాంచి మనసు కరఁగినవారై శ్రీ నాయుఁడుగారు తామె ఆ కక్షిదారుల పరముగ నిలిచి అప్పటి కప్పుడే ఆ వ్యవహారముల పక్షమున వాదించి న్యాయాధిపతుల మెప్పించి పక్షమునకు అనుకూలము గావించి అటు ఆవేదన పడుచుండిన కక్షిదారులకును ఇటు తన తోడి సోదర న్యాయవాదులకును సాయమొనర్చి స్తవనీయులగుచుండిరి. వాదనైపుణ్యమున తమకుఁ గల అపార వాగ్ధారకు తోడి న్యాయవాదులును న్యాయాధిపతులును గూడ ముగ్ధులగుచుండెడివారు. వ్యవహార మెట్టి క్లిష్ట పరిస్థితియం దుండినను సరే మృదు మధురవాక్య సంతతులచే న్యాయాధిపతుల హృదయములు రంజిల్ల వివరించు నైపుణి వీరి కుగ్గుఁబాలతో వచ్చినది.

### ప్రజా సేవ.

ప్రజాసేవయే జన్మపరమావధిగ నెంచిన శ్రీనాయుఁడుగారు, జాతి మత భేదముల పాటించినవారు కారు. బ్రాహ్మణేతర నాయకుఁడయ్యును బ్రాహ్మణ గౌరవమును మానలేదు. బ్రాహ్మణేతర సంఘమున బ్రాహ్మణులకు సైతము ప్రవేశము ఉండఁదగినదనియు, ఎట్టివారినిగాని మనము నీచులనుగా భావింపరాదనియు, అట్టిది మన భావనాబలమునకు లోటనియు వాదించిన ధర్మవేత్త. సర్వసంఘ సహకారము జాతీ

యాభివృద్ధికి సాధనమని సూచించిన ప్రబోధ. చిత్తూరు జిల్లాబోర్డు అధ్యక్షులుగ నుండి ప్రజలకు వీ రొనర్చిన సేవ అపారము. చిత్తూరుజిల్లాయందు దించుమించుగా అన్ని గ్రామములకును మంచి బాటలను వేయించి మార్గదర్శకు లన్నమాటలను సార్థకము గావించిరి. వీరిచే వెలసిన బాటలు ప్రజలకు మార్గ దర్శకము లగుటయేగాక యితర జిల్లాల నాయకులకు సైతము మార్గదర్శకము లైనవని ప్రభుత్వమువారిచే పొగడ్తగాంచి నవి. మాండలిక ప్రజల ఆరోగ్యాభివృద్ధి కొఱకు మిక్కిలి పాటుపడి పెక్కు లనుకూల ములను గల్గించిరి. విద్యాభివృద్ధికై వలసి నన్ని పాఠశాలలను క్రొత్తక్రొత్తగ నిర్మించి క్రొత్త కట్టడములను గల్పించి ఉపాధ్యాయు లకు వేతనములను హెచ్చించి ప్రజల మన్న నలకు పాత్రులైరి. వీరి ప్రజాహితైక పరత్వ మును గాంచి దొరతనమువారు సంతసించి 1926 లో 'రావుబహద్దరు' బిరుదమును దయచేసిరి. శ్రీ నాయుఁడుగారు శాసన సభ యందుఁ ప్రవేశించినదాదిగ వా రొనర్చిన ప్రజాహితకార్యము లెన్నేని గలవు. మొదట ప్రధాన మంత్రిగా నుండిన గా॥ శ్రీ॥ శే॥ పానగల్లు రాజాగారికి కుడిభుజముగ నుండి పెక్కు రీతుల ప్రజాభ్యుదయమునకు పాటుపడిరి. ఫారెస్టు తగాదాలచే రైతులు పడుచుండు ఇబ్బందులను గాంచి వానిని తొలఁగింప సంకల్పించి వానివలనఁ గలిగిన లెక్కలేని విఘ్నములను లెక్కగొనక పట్టు దల వదలక పోరాడి పోరాడి తుదకు అడవి పంచాయతులను, గ్రామములకు చెందిన పట్టాభూములకు చుట్టు ఒక మైలునకు లోఁబడియున్న అడవులను పంచాయతుల స్వాధీనము చేయించి రైతుల తరతరము లకు మఱవక చెల్లింపఁగల కృతజ్ఞతకు పాత్రులైరి. మలబారు రైతు సంఘమునకు అధ్యక్షులుగ నుండి వారికి హితబోధము చేసి చక్కని సలహాలొసంగి మలబారుటెనె న్సీబిల్లుపై శాసనసభ నిర్మించిన సెలెక్టు కమి టీకి అధ్యక్షులై పెక్కు సవరణలు గావించి అచ్చటి రైతుల కొనర్చిన మేలు స్వర్ణాక్షర ములతో లిఖింపఁదగి యున్నది. బ్యాంకింగ్ విచారణ సంఘమున సభ్యులై యుండి చేసిన కృషి ప్రశంసనీయము. దేశభాషయెడల శ్రీనాయుఁడుగారికి విశేషాభిమానము. పెక్కండ్రు పండితులను ఆదరించిరి. గ్రంథ ములను అంకితముగొనిరి. తదితరోపాధ్యా యులకంటె పండితుల నెక్కుడు ప్రేమతోఁ జూచుచుండిరి. దేశభాషా సేవయే దేశ సేవకు పునాది యని భావించిన విజ్ఞాన మూర్తి! దేశ భాషా గ్రంథాలయములను పెక్కు గ్రామములందు స్థాపింపఁజేసియు వాని వార్షికసభల కధ్యక్షత వహించియు తన్మూలమున ప్రజలకు కన్నుదెఱపిన లోక వైతాళికుఁడు! సాంఘిక సేవయే ఉత్కృష్ట ధర్మమని యెంచి బాలభటోద్యమమునకు

మిగుల చేయూతనిచ్చిన సంఘసేవా పరాయణుఁడు! శ్రీ నాయుఁడుగారియందుఁ గల సర్వమానవ సౌభ్రాతృత్వము, నిర్మలమగు దేశాభిమానము, అత్యద్భుత మేధా సంపన్నత్వము, రాజనీతివేత్తృత, మొదలగు సుగుణములను ప్రభుత్వమువారు గుర్తించి మరల 1930 లో దివాన్‌బహద్దరు బిరుద మొసంగి సన్మానించిరి

జమీందారీ రైతులకొనర్చిన సాయము:

జమీందారి రైతులు పడుచుండిన దుస్సహ దురంత దుర్భర కష్టములను తొలఁగింప కంకణము గట్టుకొని వీరు కావించిన పోరాటము, స్వార్థత్యాగము లోకవిదితము. 1920 సంవత్సరమున నగరియందు శ్రీయుతులు గుండా రెడ్డి రంగయ్యా రెడ్డి ప్రభృతుల నిర్వహణమున జరిగిన కార్వేటినగర సంస్థాన ప్రథమ రైతులమహాసభకు శ్రీనాయుఁడుగారు అధ్యక్షులై రైతులకుచేసిన ప్రబోధమే కర్షకజనోద్ధరణకృషికి తొలిచాలు. అప్పటినుండియు పెక్కు రైతుసభలకు అధ్యక్షులై సభ్యులై వారికి పెక్కువిధముల ప్రోత్సాహ సాహాయ్యము లొసఁగి చేసినసేవ అపారము. శాసనసభయందు పెక్కుసార్లు జమీందారీ రైతుల దీనచరిత్రమును స్మరణకుఁ దెచ్చి జమీన్‌రైతుల పాలిటి గుదిబండయగు ఎస్టేట్ ల్యాండు చట్టమును సవరణకు వచ్చునట్లుచేసి ఆ విషయమైన సెలెక్టు కమిటీలయందు చేరి జమీందారుల దయాదాక్షిణ్యములకు లొంగక ధీరోదాత్తతతో చట్టము సవరణలపట్ల రైతుపక్షము వహించి వీరొనర్చిన గంభీరోపన్యాసములు, నిర్ణయములు మఱువరానివి. తిరుపతి దేవస్థానముఎస్టేటునకు సంబంధించిన తిరుత్తని జమీన్‌రైతుమహాజన సంఘనిర్మాణమునకు సంఘపోషణమునకు వీరు ముఖ్యులై యుండిరి. శాసనసభయందు చర్చకు వచ్చిన ఎస్టేట్ ల్యాండు సవరణ చట్టమునుగూర్చిన వ్యవహారములలో జమీన్ రైతుల పక్షము, వహించి వీరు పోరిన పోరాటము పట్టుదల వీరి ప్రధానమంత్రి పదవీ విసర్జనమునకు కారణమైనది. తోడిరైతుల సౌఖ్యమే పరమోద్దేశముగ నెంచిన కర్మయోగి కావుననే వీరు మంత్రిపదవిని తృణప్రాయముగ విసర్జింపఁగలిగిరి. రైతుల కష్టములు రైతుబిడ్డకుఁ గాక మఱొక్కరికెట్లు గోచరమగును? గొడ్రాలు బిడ్డకు ప్రాకులాడుగునా? ప్రధానమంత్రిపదవిని వదలి చిత్తూరుచేరి దుగ్మతతో బాధపడుచుండియు వెంకటగిరి రైతుల పిలుపునాలించి జయంపు సభకేగి అందలి వేలకొలఁది రైతుల నుద్బోధించి యొనర్చిన స్వాతంత్ర్య శంఖారావమిప్పటికిని ప్రజలచెవులఁ బ్రతిధ్వనించుచునే యున్నది. కృషికులు ప్రత్యేకము రోడ్డుసెస్సు చెల్లించుచుండియు ఇల్లు వదలఁగానే పెనుభూతమువలె టోలుగేటు ప్రత్యక్షమగుట చాల యన్యాయకరమని

యెంచి సుంకపుమెట్టుల పేరు లేకుండ రూపు మాపిరి. పక్షమురోజుల క్రిందట జరిగిన పార్టీసంప్రతింపుల సందర్భమున రైతుల క్షేమముకొఱకే నక్షమువారు పట్టుదలతో పనిచేయవలయు ననియు, జమిాందారి రైతులకు గవర్నమెంటు రైతులకువలె అన్ని విధముల హక్కులు కలిగి యుండవలె ననియు, అడవులలో ఉచితముగా పశువులను మేపి కొనుటకు హక్కు రైతుల కుండవలె ననియు, పంచాయతిబోర్డులను వృద్ధిచేయవలె ననియు, టోలుగేటులు ఇఁకముందు ఏ రూపముననుగూడ విధింపఁబడవని ప్రజలకు నచ్చఁజెప్పవలెననియు, రీసెటిల్ మెంటుప్రయత్నము లన్నియు ఆపివేయవలె ననియు ప్రకటనము గావించి తమ నిష్కళంకహృదయమును వెల్లడించి వ్యతిరేకపక్షవాదుల తలయూఁపులకును, సన్నుతులకును భాజనులైరి. కర్షకసంఘాభిమానమే తన యమాత్యపదవికి ఎక్కుడు రాపిడి కలిగించుటచే ఆత్మధర్మమునకు అధికారమును బలి గావించి జస్టిసుపక్షమునువదలి ప్రజాహిత పక్షమును స్థాపించి తత్పక్షమునకు నాయకుఁడై నను ప్రతిపక్షప్రతిష్ఠంభనమునకు ప్రయత్నింపక ప్రతిపక్షమును సాధించుటకంటె ఆదర్శసాధనమే ఉత్తమమానవ జీవితపరమావధిగానెంచి తత్ప్రయత్నమున మగ్నుఁడై తుదకు కృతార్థుఁడై నా జన్మతపము ఫలించినదని సంతసించిన సిద్ధార్థుఁ డతఁడు!

### హరిజనాభిమానము.

శ్రీ నాయఁడుగారికి జాతి మత భేదములు బొత్తిగలేవని మున్నె చెప్పియుంటిమి. కాస్మాపాలిటన్ క్లబ్బునందు వీరు సభ్యులు. హరిజనులయందు వీరికిఁగల దయ అపరిమితము. అది గాంధిమహాత్ముఁడు ప్రబోధింపఁగాఁ గలిగిన క్రొత్త అభిమానము కాదు. జన్మముతో అలవడిన సుగుణము. 1925 సంవత్సరము అక్టోబరులో యతిరాజదాసు అను మదరాసుమాల భక్తుఁడు తిరుపతియాత్రకు వచ్చి తిరుచానూరు దేవాలయములో ప్రవేశించినట్లు పోలీసువారు తెచ్చిన అభియోగములో తిరుపతి సబ్ మేజస్ట్రీటువా రాతనికి మూఁడునెలలు శిక్షను విధించిరి. శ్రీ నాయుఁడుగా రప్పుడు మాలభక్తునియొద్ద ఏలాటి ఫీజును గైకొనకయే చంద్రగిరి సబ్ కలెక్టరువారియొద్ద జిప్పీలున వాదించి శిక్షను రద్దు చేయించిరి. పేరునకై ప్రాకులాడువారివలెఁగాక మనఃపూర్వకముగ వీరు హరిజననిధికై చందాలను విరివిగా సేకరించి యిచ్చిరి. చిత్తూరు జిల్లా హరిజన సేవాసంఘమునకు అధ్యక్షులుగ నుండి తమ దీనజనాభిమానమును వెల్లడించిరి.

అట్టి విమలచరిత్రుఁడు, కారణజన్ముఁడు, కర్మయోగి, ప్రపంచరంగమునకు నుఱుఁగగుట లోకమునకెంతటి విషాదకరమో, ఎంత నష్టదాయకమో వర్ణనాతీతముగదా! సు

మారు రెండేండ్లుగ అప్పుడప్పుడు కన్పించుచు బాధించుచుండిన కోశవ్యాధి యిప్పుడింతతీవ్రముగ విజృంభించి నోటనైచుకొనునని యెవ్వరే ననుకొనలేదు. భావ పుష్య శుద్ధదశమి (13-1-1935) ఆదివారమురాత్రి 7-30 గంటలకు ఆలుబిడ్డలనందఱ దగ్గఱ నుంచుకొని శ్రీ కోదండరామ, వేంకటేశ్వర పటములకు గృహిణిచే కర్పూరనీరాజనము సమర్పింపఁజేసి ఆపటములనందికొని వక్షమున కానించుకొని నిమీలిత నేత్రుఁడై రెండునిమిషములు ధ్యానించి పటముల యథాస్థానమున నుంచనిచ్చి ఆమెకు గోవిందస్మరణమున కనుజ్ఞనిచ్చి బిడ్డల చెక్కిళ్లను పుణుకుచు రామస్మరణము కావించుచు సునాయాసముగ రెండునిమిషములలో ఇహలోకమును త్యజించి శ్రీరాముని సన్నిధానముచేరి ఆలుబిడ్డలను, కుటుంబమును, బంధువులను, జాతిని, సంఘమును, మండలమును, రాజ్యమును, దేశమును దుఃఖవార్ధిలో ముంచివైచెను. "మంచివారినడత మరణమందు తెలియవలయు" ననెడి లోకోక్తికి తార్కాణముగ ధన్యజీవులైన శ్రీనాయుఁడుగారు భీష్ముఁడంప శయ్యనుండి యెదురుచూచిన ఉత్తరాయణపుణ్యకాల ప్రవేశసమయమున, శుక్ల పక్షమున, దశమియందు భగవంతుని సన్నిధి కేగి రనుటకంటె వేఱు సాక్ష్య మక్కఱయుండదుగదా! వారు ధన్యజీవులు. మనము దౌర్భాగ్య జీవులము. అకాలభూకంపజనిత భూగర్భమున వ లె అకాల మృత్యుగర్భమునఁబడిన తనముద్దుబిడ్డకై పరితపించుచు పరిదేవనము చేయుచున్న దేశమాత మఱింత దురదృష్టవంతురాలు. వారి యాత్మకు సర్వేశ్వరుఁడు మొదటినుండియు శాంతి యొసఁగుచుండెను. ఇప్పుడును ఒసఁగఁగలఁడు. వారు మున్నును ఇప్పుడును ఎప్పుడును మృతజీవులు ! అమృతజీవులు ! వారికుటుంబమునకు స్వాస్థ్యము నొంద ధీశక్తుల పరమేశ్వరుడు ప్రసాదించుఁగాక! శ్రీనాయుఁడుగారి యుత్తమ చరితము లోకుల కాదర్శమై వారికీర్తి చిరస్థాయియై యలరుఁగాక !

---

# స్త్రీ లోకము

'పథికుఁడు'

### "అదృష్టశాలినులు" లకు విద్య యెందుకు?

ఇక్కడ "అదృష్టశాలినులు" లనగా కుటుంబస్థితివలన తమ జీవనోపాధిని తామే యేర్పరచుకొని పాటుపడవలిసిన అక్కఱ యేమాత్రమును లేని స్త్రీలని యర్థము. భర్తయో కుమారుడో సంపాదించితేగాని అనుభవింప జాలిన స్త్రీలన్నమాట. సాధారణముగ మన సంఘమునందలి నారీలోకమంతయు నిట్లే యున్నది. ఎవరో కొందరు వితంతువులు మొదలగువారు మాత్రే మిందుల కపవాదముగా నుండవచ్చును. అట్టి యువతులకు విద్యలేకపోయినచో నష్టమేమని ప్రశ్నించుచు "గీతాసేన్ అన్నవారు 'పీపుల్' పత్రికలో తామే యిట్లు ప్రత్యుత్తర మొసగుచున్నారు."

అట్టిస్త్రీలకు విద్యార్జనము కేవలము జ్ఞాన సంపాదనార్థమని సమర్థింపవచ్చును, కాని నిజమైన జ్ఞానము కళాశాలలో విద్యాభ్యాస మొనర్చి ఉత్తీర్ణలైన యువతులకు కూడ లభించుచున్నదని యెవ్వరును నిర్ధారణముగ చెప్పలేదు. జీవితమును సామాన్యులకంటె విశేషముగ ననుభవించి యానందించు శక్తి వారికి లభించుచున్నదా? లేక సంఘమున కేవిధముగ నైన ఉపకరించు సామర్థ్యమైన కలుగుచున్నదా? ఈ రెండు ప్రశ్నలకును నేడు ప్రత్యుత్తరము దొరకుటలేదు.

పట్టభద్రయైన యువతి పదియేండ్లపాటు ఆంగ్ల భాషాయుక్తమైన నవీనవిద్య నభ్యసించి నదిగదా! ఆమె ఆంగ్లము నేర్పుగా వ్రాయనుగాని మాటాడనుగాని నేర్చినదని విశ్వసింపజాలకున్నాము. ఆంగ్ల సారస్వతమునందలి యుత్తమ గుణములను గ్రహించి సజాతీయులకెవ్వరికైన బోధింపజాలునని చెప్పజాలము. లేదా, ప్రపంచమునందు జరుగుచున్న రాజకీయములగు మార్పులేమైన తెలియునా? అవి యసలు పాఠశాలలో చెప్పనే చెప్పరు. తుదకు స్వమండలమునుగూర్చిన "భూగోళపాఠము" లైనను నైసర్గిక విధాన జ్ఞానమైనను కలిగి యుండదు. అది చిన్ననాడు నేర్చిన దానాటి పరీక్షతోనే మఱపునకు వచ్చును.

ఇక స్వభాషాపాండిత్యముమాట యెవ్వరును చెప్ప నక్కఱలేదు. కాకపోయిన, నల్వురిలో కలిసి మెలసి తిరుగుట యొక మంచి గుణ మలవాటు పడవచ్చును. కాని దానివలనగూడ నొకవిధముగ నష్టమే మన కన్నులార జూచుచున్నాము. తమవలె ఆంగ్ల విద్యాపారీణ లైనవారితోనే వారు తిరుగుదురు. ఇంటియందలి బంధువులతోను స్నేహితులతోను ఒక విధమైన విముఖభావమును అల్పత్వారోపణమును ప్రకటించు చుందురు.

నేడెల్లరును విద్యావిధానము మారిపోవలె ననియు నిట్టిలోప భూయిష్ఠమైన మార్గములయందు నడచు విశ్వకళాశాలలవలన ప్రయోజనము శూన్యమనియు విమర్శించుచునే యున్నారు. కాని ప్రాచీనాధునాతన విద్యాదర్శములయందలి సుగుణముల నొక్కచో చేర్చి నవ్యవిద్యాలయ మొకటి దేశమునకు కేంద్రస్థానముగ నెవ్వరైన నిర్మింప ప్రయత్నించినచో మేలుగ నుండును.

బాలికావిద్య—జపాను పద్ధతి.

మన దేశమున బాలికలకు ప్రత్యేక పాఠశాల లేర్పడుచున్నను, అవి కేవలము బాలుర విద్యాలయములనే సాధారణముగ ననుకరించుచున్నవి. చదువను వ్రాయను లెక్కలువేయను నేర్పినచో చాలు నను అభిప్రాయముతో చాలవరకు సాగుచున్నవి. ఈ నడుమ కొలదిగ జాతీయ విద్యాలయాదులు బయలుదేరి స్త్రీలకు ప్రత్యేకముగ నేర్పవలసిన విషయ విశేషములు కొన్ని బోధనా పద్ధతిలో చేర్చినవికాని, అవి యింకను వ్యాప్తి నందలేదు. జపానులోని నవీన బాలికాపాఠశాల లెట్లు నడచుచున్నవో చూచి వచ్చిన యొకరు మనలో గూడ నట్టి మార్పులు కొన్ని రావలెనని సూచించుచు వానిని గూర్చి యిట్లు వ్రాసిరి:—

'అనేక విషయములతోపాటు సరిగా నడచుట యెట్లో అచ్చటి బాలికలకు ముందుగా నేర్పెదరు. వినయము, సౌందర్యము, దానిలో ఉట్టిపడునట్లు వారి కభ్యాసము కలిగింతురు, టీ మొదలగు ఫలాహారములను శుభ్రముగ తయారుచేయుటతోపాటు వానిని బల్లలపై నెట్లు జాగ్రత్త చేయవలెనో అతిథుల నెట్లు సత్కరింపవలెనో సాంఘిక నియమముల ననుసరించి యే తరగతి అతిథుల కెట్లు ఫలాహారాది సౌకర్యములు సమకూర్పవలెనో ఆ విద్యార్థినులు ప్రతి దినమును సక్రమముగ నేర్చుకొందురు.

నిడువైన బల్లలపై గూర్చుండి నీతి పాఠములను గూర్చిన దీర్ఘోపన్యాసములను సాయంతనములందు వినుచుందురు. 'సరియైన జీవితమునుగూర్చియు, శిశుపోషణమును గూర్చియు ఉపాధ్యాయినులు తెరపిలేకుండ ఉపన్యసించుచుందురు.

తమ దేశపు విధానమునందేకాక అన్ని దేశములందలి వంటచేయు మార్గములను వారు నేర్చుకొందురు. అల్లే కుట్టుపని, పూలదండలు గ్రుచ్చుట, లేఖా రచనము, వీణాగానము, పాశ్చాత్య జాతీయ సంగీతము, జపాను చిత్రరచనా విధానమును ప్రతి బాలికయు నేర్చుకొని తీరవలయును.

మధ్యాహ్నములందు తోటలలో వారు భుజించునప్పుడు తమకు కావలసిన పదార్థముల నన్నిటిని వారే వంతులమీద సమకూర్చుకొనుటయు, వానిని మరల జాగ్రత్తపరచి ఆరోగ్య విధానముల నాచరణయందుంచుటయు చూడ ముచ్చటగ నుండును.

# ఆరోగ్య విషయములు

## అల్యూమినం విషమా ?

జి. డబ్ల్యు. యల్. డే గారు

ఒక సత్యాన్వేషకుని సాక్ష్యము.

మొదట్లోనే చెప్తాను. నేను వైద్యుణ్ణి కాదు. దోషభూయిష్టమైన ఒక అపవాదును గురించి పరిశోధన చేస్తూన్న పత్రికా విలేఖరిని.

వంటశాలలో నుపయోగింపబడే అల్యూమినం పాత్రలవలన కలిగే చెరుపువిషయమై లండనులోని కొందరు పేరుగల వైద్యశాస్త్ర వేత్తలను చూచాను. తరువాత అల్యూమినంయొక్క సుగుణములను తెల్పే సాక్షి వ్రాతలను చూచాను. ఇవి చాలావరకు కోపపూరితులైన స్కాచిడాక్టర్లు వ్రాసినవే ; చాలా సంశయాలకు జవాబులు లేకుండానే.

ప్రజలు దీని విషయమై ఇంకా వినవలెననే ఉద్దేశంతో నా సాక్ష్యాన్నిగూడ ప్రచురించమని కొందరు పత్రికా సంపాదకులను కోరితే వారు నిరాకరించారు. కాని అందులో కొందరు యిండ్లకు పోగానే వారి యింటిలోని అల్యూమినం పాత్రలను బయట పారేశారు. ప్రచురణ విషయంలో కఠినమైన నిబంధనల నేర్పాటు చేశారు సాధారణ వైద్యసంఘం వారు. నేను కలుసుకుని మాట్లాడిన వైద్యులంతా తమ పేర్లుమాత్రం ప్రచురించవద్దని కోరారు. అందువలన నేను పొడి అక్షరాలను మాత్రమే వాడుతున్నా.

కథ క్లుప్తంగా చెప్తాను. 12 సంవత్సరాల క్రిందట డాక్టరు యల్. యస్. అను ఒక సుప్రసిద్ధ లండను వైద్యుడు, కొన్ని దినాలు యూరపులో వైద్యవృత్తి నవలంబించినవాడు, ఇగ్లాండులోని ప్రజలు యూరపు ప్రజలకంటె అనేక రకములైన రోగముల చేత బాధపడుతున్నట్లు కనిపెట్టాడు. ముఖ్యంగా చర్మవ్యాధులు, కడుపునొప్పిచేత రోగులు యూరపు పోగానే ఆరోగ్యం పొందేవారు; ఇంగ్లాండు రాగానే తిరుగబెట్టేది జాడ్యం.

తరువాత ఆయనకే జబ్బుచేసింది. చర్మం చెడిపోయింది. కడుపునొప్పి ఏర్పడింది. ప్రవీణులైన వైద్యులుకూడా ఏమీ చేయలేకపోయారు. నిరాశతో వంటయిల్లు పరీక్షించాడు. అంతా అల్యూమినం గిన్నెలమయం. అవి తీసివేయించాడు. ఆతని సందేహనివర్తి అయింది నాలుగు వారాలలోనే. ఇంతవరకు మళ్లీ ఆ జబ్బులులేవు ఆతనికి.

తాను గొప్ప పరిశోధన చేశాననే దృఢనమ్మకంతో కొంతమంది రోగులపైన ఈ ప్రయోగం జరిపి చూచాడు జయప్రదంగా.

అల్యూమినం గిన్నెలతో సంబంధం లేకుండా చేసి దాదాపు 200 మంది రోగు

లను రోగవిముక్తులను చేశాడు.

యూరోపులో వంటఅంతా ఇనుపపాత్ర లలో చేస్తారుగదా అని అప్పుడు తట్టింది ఆయన మనసుకు. అజీర్ణము, ఆకలిపోవడం, కడుపులో గుల్మములు, వాపులు, కురుపులు, తీట మొదలైన అనేకవ్యాధులు ఇంగ్లీషు వారికి ఈ అల్యూమినంగిన్నెలవలన వస్తు న్నాయని గ్రహించాడు.

ఈ విషయం పత్రికలలో ప్రచురిద్దా మని చూస్తే ఎవరూ చోటివ్వలేదు. అంతా కూడబలుక్కున్నారా అన్నట్లు !

ఈలోగా వింపోలు వీధిలోని డాక్టరు యల్. హెచ్. సి. అను ఆయన దాదాపు ఇదే అభిప్రాయమును పొందాడు, ఆతని అనుభవాన్నిబట్టి 1930 లో, అజీర్ణవ్యాధి చేత బాధపడుతూన్న ఒకరోగి వచ్చింది ఆయన వద్దకు. అనేక సంవత్సరాలబట్టీ వాడు తున్న అల్యూమినం గిన్నెలను వాడకుండా చేశాడు ఆయన. వెంటనే ఆమె ఆరోగ్యం పొందటం ఆరంభించింది.

కెన్యాలోని ఉద్యోగులు అల్యూమినం గిన్నెలలో నిమ్మరసమునుంచి త్రాగుటవలన కడుపునొప్పితో బాధపడేవారు. ఇప్పుడు వారు నికెల్‌గిన్నెలతో త్రాగుతున్నారు.

కెన్యాలోని దేశీయబాలకులు అల్యూ మినం గిన్నెలలో వండుకుతింటానికి నిరాకరిం చారు. బరువైనా ఇనుపగిన్నెలనే మోసుకు పోతుండేవారు.

సైనికులకు అల్యూమినంతో చేసిన నీటి చెంబులను యివ్వడం సాఫుగా ఆపివేశారు.

నీళ్లు కాచినప్పుడు అల్యూమినం గిన్నెలో అడుగున నల్లగా మలిన మేర్పడుతుంది.

డాక్టరు. యల్. హెచ్. సి. తన వంట యింటిలో నుపయోగింపబడిన ఒక అల్యూ మినం పళ్లెమును ఆరోగ్యశాఖరసాయనిక శాలయందు కొన్ని ప్రయోగములచేత పరీ క్షించాడు. లండను పంపునీరు దానిలో 24 గంటలుంచినా,నీళ్లు ఇరవై నిమిషాలు దానిలో కాచినా అల్యూమినం, సత్తు లేచినస్తాయట.

ఇదే ఆ నల్లని మలినము!

పాలు కాగపెడితే యింకా యెక్కువ వస్తుందట ఈ మలినము. మాంసముకాని, కూరగాయలనుగాని వుడికించి 24 గంటల కాలముంచితే వచ్చేమలినము విపరీతము. సోడా వుపయోగిస్తే మరీ యెక్కువ.

అల్యూమినం, దానికి సంబంధించిన లవణ ములు మానవుని కడుపులో సులభంగా కరిగిపోతాయి.

స్ట్రాసుబర్గు, యేలు విశ్వవిద్యాలయముల లోని పరిశోధనల ఫలితంగా తెలిసిన విష యాలు—కొద్ది కొద్దిగా అల్యూమినం శరీ రంలో ప్రవేశిస్తే డాక్టరు యల్. హెచ్. సి. రోగుల చిహ్నాములు కనుపడతాయనీ, అది విషం మాదిరిగా కూడా పరిణమించి నయం చేసుకోటానికి వీలులేని రుగ్మతను కలగజేస్తుం దనీ గ్రహింపబడింది. ఈ విషయం రోగుల

మీాద చేసిన ప్రయోగాలవలన దృఢపడినది. కాని ఈ అల్యూమినంవలన కలిగే అజీర్ణము, ఉబ్బసము, దగ్గు, బలహీనత మొదలగునవి అంతకంతకు జాస్తీ అవుతునే వున్నాయి. కారణం అల్యూమినం గిన్నెల వాడకమే. అమెరికాదేశీయుడైన చార్లెసు టిబెట్సు అనే వైద్యుడు పంటి రోగములు కూడా దీనివలననే కలుగుతాయని కనిపెట్టాడు. మొత్తంమీాద అల్యూమినంగిన్నెలతో వంట చేసుకునేవారంతా జబ్బు పడతారనీ, ముఖ్యంగా ముసలివారు ఎక్కువ బాధపడతారనీ తేలింది.

ఏ పత్రికవాళ్లు వేసుకోనకపోవడంవలన స్వంత ఖర్చులమీాద తానే 30,000 కాపీలు "అల్యూమినం చరిత్ర"ను గురించి అచ్చువేసి, వైద్యులు, శాస్త్రజ్ఞులు మొదలైనవారిలో పంచాడు.

చాలామంది యితని వాదనను బలపరుస్తూ ఉత్తరాలు వ్రాశారు. ఒక వైద్యుడు 12 సంవత్సరాలు గుండె జబ్బువలన బాధపడి, అల్యూమినం గిన్నెలను వాడటం మానేసి రోగవిముక్తుడైనాడు.

డాక్టరు యి. పి. అనే శిశువైద్యుడు తన రోగుల విషయంలో ఈ అల్యూమినం గిన్నెలవలన నష్టాలు గ్రహించాడు. ఇతర లోహపు గిన్నెలు వాడటంవలన అనేకమంది శిశువులు ఆరోగ్యం పొందారు. కుక్కలుకూడా అల్యూమినంవలన అనారోగ్యం పొందినాయి.

కాని దీని విషయం ఒక ఆదివారపు పత్రికకు వ్యాసం రాస్తే అది నిరాకరించారు. అంతవరకు ఆయన వ్యాసాల్ని వాళ్లు నిరాకరించలేదు.

డాక్టరు ఏ. యఫ్. అనే మరో డాక్టరు ఈ అల్యూమినం గిన్నెల వాడుకవలన అజీర్ణ రోగం పొంది బాధపడినాడు చాలా కాలం. తరువాత వాటిని వదలి ఆరోగ్యం పొందినాడు; ఇప్పుడుకూడా అల్యూమినంగిన్నెలంటే ఆతనికి సరిపడవు. ఆయనగూడా అల్యూమినంయొక్క చెరుపులనుగురించి ఒక వ్యాసం రాసి స్వంత ఖర్చులమీాద ప్రచురించాడు 1933 లో.

ఆతనికి అనేక ఉత్తరాలు వచ్చాయి అతని వాదన బలపరుస్తూ. స్థలాభావము చేత ఎక్కువ ముచ్చటింపలేను గాని ఎక్కువ విషయం కావాలంటే బ్రిటిషు మెడికల్ జర్నల్, లాంసెట్ పత్రికలలో ప్రకటించబడిన వ్యాసాలు చదవవచ్చు.

ఆరోగ్యశాఖ ప్రధానామాత్యుడు దీన్ని గురించి మాట్లాడుతూ "అల్యూమినం వస్తువులను వాడుటవలన కలిగే నష్టాలను గుర్తించాము. ఆఖరు పరిష్కారము అప్పుడే యివ్వలేకపోయినా పరిశోధనల ఫలితంగా తగుచర్య తీసుకోవడమే మంచిది" అన్నాడు.

"ప్రజామిత్ర"

# కొన్ని వర్తకసరి మెలఁకువలు

### ఇంటివెచ్చాల దుకాణదారునిగూర్చి

ఒక వర్తకుఁడు తన బేరగాండ్రు తన యొక్క యదృష్టమునుబట్టి యేర్పడుదురని తలంపరాదు. ఒక బేరగాఁడు క్రొత్తవాఁడని వాని నుపేక్షింపఁదగనే తగదు. ప్రాఁత బేరగానిని నిల్పుకొనుటకన్న క్రొత్తబేరగాని నేర్పాటు చేసికొనుట తక్కువవిషయము కాదు. ఒక క్రొత్తబేరగాఁడు కుదిరినంతమాత్రమున వాఁడు స్థిరపడినట్లు తలంపరాదు. మంచి బేర మున్నచో క్రొత్త బేరగాండ్రు కావలసినందఱు కుదురుదురు. అట్టి సమయమునందు ప్రాఁతబేరగాండ్రు మనకు మాయమయి యెదురంగటివారికిఁ గ్రొత్త బేరగాండ్రుగా చేరకుండునట్లు జాగ్రత్త పడవలయును. ఒక చిన్నకారణముచేతనే యొక బేరగాఁడు వర్తకుని విడిచిపెట్టవచ్చును లేదా నమ్మకము కుదిరి యతనికడనే స్థిరపడవచ్చును! నిజముగా కంటికి కనుపడికనుపడని - చెవికి వినఁబడివినఁబడని చిన్న కారణములచేతనే బేరము చెడునదియును బాగుపడునదియును ననేక సందర్భములలో నేర్పడుచుండును.ఒకబేరగాఁడు తనకునీవలనఁ గల్గిన నష్టములను దెల్పినచో నీవు వానిని తగురీతిని తృప్తిపఱచినచో అతఁడు నిన్ను విడిచి యెదురంగటికిఁ బోవఁడుగదా ?

క్రొత్తబేరగాండ్రను సంపాదించుటకును, ప్రాఁతవారిని నిల్పుకొనుటకును సదుపాయములలో నొకటి, వారు కోరిన సామానులు హెచ్చుగా నున్నచో అవి వారియింటికి వీలయినంత చేవుకగా చేరునట్లు వర్తకుఁడే యేర్పాటు చేయవలయును. వారికి తృప్తి గల్గనిచో అందులకుఁ గారణము తెలిసికొని యాలోటును సరిచేయవలయును. ఈ కారణమువలన వర్తకునికిని బేరగాండ్రకును బేరమే కాక సఖ్యముగూడఁ గుదురును.

### నిజమయిన అమ్మకములు

వ్యాపారపుఁ బ్రకటనలు (**advertisements**) చేయుటవలన బేర మభివృద్ధి యగునని యనేకులచే - లేనిచో- అందఱిచే చెప్పఁబడిన విషయమే కాని అందులో కొన్నిమెలఁకువలున్నవి. ప్రకటన నాచరణలోఁ బెట్టు విషయమున వానిని తప్పక గమనింపవలయును. ప్రకటనఖర్చులకుఁ దగినట్లు బేరసారము విశేషముగా జరగనిచో ఆ ప్రకటనల వల్ల లాభమేమి? హిందూదేశములో ఈవఱకెన్నియో ప్రకటన సంస్థలు పనిచేసినవి గాని అవి తగిన ఫలిత మందకపోవుటకు కారణము ఆ ప్రకటనల ప్రకారముగా సరిఅయిన అమ్మకపుటేర్పాటులు లేకపోవుటయే. ఆ అమ్మకపుటేర్పాట్లేవనఁగా —కేట్లాగులు, మీఁద

జాబులు, మంచి అమ్మకముగాండ్రు, పనిచేయువారందఱియొక్క సముత్సాహము.

ప్రత్యేకయోగ్యతా సంపాదనము:

ప్రకృత మేర్పడిన విస్తార జనబాహుళ్యమునకు వారి వారి యక్కఱలను దీర్చుట కెన్నెన్నియో యేర్పాట్లు జేరుగవలసి యున్నవి. ఈ గొప్పయేర్పాట్లకు ముఖ్య సదుపాయము ఏ విషయమున కా విషయము నందు సంపూర్ణమయిన నేర్పు గలవానిని నియోగించుటయే. ఇట్టిది ప్రతి వృత్తియందును అవసరముగా నున్నది. ఈ యేకైక విషయనైపుణ్య మనునది యిప్పు డెంతయును ప్రాముఖ్యమును వహించియున్నది. క్రమేణ కొన్నినాళ్లలోనే యిది తప్పనిసరి యగును. పోటీయును హెచ్చుచునే యున్నది. ఒకపని లోకమునందు నెగ్గవలయు నన్నచో ఆ పని యత్యంతనైపుణ్యముతో బాగుగా చేయఁబడవలయును. కాఁబట్టి యువకులు తమ తమ కర్తవ్యములయందు చాంచల్యము మాని యేకాగ్రత వహింపవలయును.

బాకీల వసూళ్లు:

వర్తకులు తమ బేరముల విషయములో ఒకటే మాటపయినున్నచో, తమ బేరగాండ్రకు నమ్మకము కుదిరి, బాకీలు సులభముగాను త్వరగాను వసూలగును. ఒకరు మనకు బాకీ యుండినప్పుడు వాయిదాకు మొత్తము బాకీనిమ్మని వారినడుగుట తప్పని కొందఱు తలంచుట తప్పు. ఆ బాకీయున్నయతఁడు యోగ్యుఁడయినచోఁ దనపని జ్ఞప్తిచేయఁబడినందుకు సంతసించును. కాని బాకీ నిమ్మని యడుగుటవలన బాకీలు నిల్పుకొను స్వభావము గలవారికిఁ గోపమువచ్చిన రావచ్చును.

"సరియే" యని, "మాకు కసాలాగా నున్నది గనుక పయికము తక్షణము పంపవలయు"నని ఆసాములకు వ్రాయుట చాల వికారమయినపద్ధతి. బాకీ వసూళ్లకు కాలము యొక్క జరగు బాటున క్రమము ఈ క్రింది మూఁడు పద్ధతు లుపయోగ్యములు.

(1) "బాకీ వాయిదా దాటినది; ఏకారణముచేతనో పంపలేదు; పంపవలయును" అని.

(2) పయిజాబు తేదిని, విషయమును దెల్పుచు, "త్వరలో లెక్కలు తీర్చుకోవలసి యుండుటచే బాకీ మొత్తము ఇన్నిదినాలలో (ఉదా. ఒక వారములో) పంపవలయును" అని.

(3) "రెండు మూఁడుసారులు వ్రాసినప్పటికిని బాకీ మొత్తము పంపలేదు కనుక ఇన్నిరోజులలో పయికము పంపవలయు"నని యును, "అట్లు పంపనిచో విషయము మాచే తిని దాఁటు"ననియును సవినయముగానే వ్రాసి, వ్రాసినట్లు జరపవలయును.

(అనువాదము)

# సంపాదకీయములు

## అస్తమయము

కొంత కాలముక్రింద ప్రధానమంత్రులుగా నున్న శ్రీ ది.బ. మునిస్వామినాయుఁడు గారు జనవరి నెల 13-వ తేది ఆదివారము పరమపదించిరి. వీరి యకాలమరణమునం జేసి దేశమునకు తీఱని నష్టము వాటిల్లినది. వీరు సగౌరవమయిన కమ్మకులమునకుఁ జెందినవారు. వీరి స్వగ్రామము తిరుత్తణి చెంతనున్న వేలంజేరి. జననము 1883. చెన్నపురి క్రైస్తవ కళాశాలలో పట్టభద్రులై, లా చదివి, చిత్తూరున న్యాయవాదవృత్తి నవలంబించి, 1920-వ సంవత్సరమునకు న్యాయవాదులలో మేటు లనిపించుకొనిరి. న్యాయవాదులకును న్యాయాధిపతులకును వీరియెడ గౌరవము మెండు. వీరికి సర్వజనులయందును, విశేషించి బీఁదలయందును, రయితులయందును, పేరు హెచ్చు.

జిల్లాబోర్డులో సభ్యులుగా నుండి చాల కాలము అధ్యక్షులుగా నుండిరి. విద్యాసంఘములయందు వీరు గావించిన సేవ ప్రశంసార్హము. రైతు లన్నను రయితుల విషయములన్నను వీరు మిక్కిలి ప్రేమతో నాదరింప నభినివేశము నొంది ప్రయత్నించెడివారు. 14 సంవత్సరములుగా శాసనసభయందుండి అందు కీ॥ శే॥ శ్రీ॥ పానుగల్లురాజాగారి చెంతయును గొప్ప యాదరువుగా నుండిరి.

నిశ్చయముగా వ్యావసాయిక, గ్రామపునర్నిర్మాణ విషయములలో వీరి బుద్ధివైశద్యము కొండాడఁదగినది. బ్రాహ్మణేతరుఁడయ్యు జస్టిసుపక్షీయులయ్యు బ్రాహ్మణులయందితని కీషన్మాత్రవైషమ్యము లేకపోవుటయే కాక వీరికి బ్రాహ్మణు లెందఱో ముఖ్య మిత్రములు కలరు. వేయిమాటలేల? జస్టిసుపక్షమునకు బ్రాహ్మణప్రవేశము ఉండవలయు నని కోరినది వీరు గాదా ?

నిరాడంబరుఁడు; ప్రేమ నిధానము; పరిశుద్ధ వర్తనుఁడు; ప్రజ్ఞానిధి; ధైర్య సంపన్నుఁడు; మితభాషి; మిత్రవత్సలుఁడు; ఆశ్రిత పోషకుఁడు; చుట్టాల సురభి; విద్యాభిమాని; దేశీయ విద్యాపండిత రాజపోషకుఁడు. ఇట్టి మహనీయుని నిఁకఁ గాంచఁ జాలమన్న నెవ్వరికిఁ గన్నీ రుప్పతిల్లదు ?

కొన్నిరోజులక్రింద వీరీ చెన్నపురిని జరగిన పక్షసమావేశములో (పార్టీమీటింగులలో) తెల్పిన కార్యశేష మందలికిని వీరి ఆదర్శనైర్మల్యమును తెల్లపఱచి యున్నది.

వీరు ఒక్కపక్షమునకు ఒక్క కులమునకు మాత్రమే యనుకూలు రనుట మాని దేశమున కంతయును ఆదర్శప్రాయులనియును అనుకూలురనియును చెల్ప సందియము లేదు. దేశమంతటను వీరి కాలధర్మమునుగూర్చి యంగలార్చుచున్న వీరి మిత్రమండలియే యిందుకు సాక్షి.

వైష్ణవోత్తముఁడయిన యీ సౌజన్యనిధి యొక్క యాత్మకు పరమాత్ముఁడు శాంతి నొసఁగునుగాత.

### ద్రావిడ నాగరకత

ద్రావిడ నాగరకత వేదకాలమునకన్నఁ బురాతనమయిన దనియును, ద్రావిడులు సింధునది లోయలో నుండిరనియును, వారిని జయించ వచ్చి జయించిన యార్యుల కన్న వారు (ద్రావిడులు) పరాక్రమశాలురు గాకపోయినను— ప్రశాంతత్వములోను, నాగరకతలోను అధికులుగా నుండి రని యును వీరినుండియే మెసపొటోమియాకును ఈజిప్టునకును నాగరకతయును పంటలపద్ధతి యును వ్యాపించిన వనియును 10-సంవత్సర ముల క్రింద డాక్టరు గిల్బర్టు స్లేటరుగారు ఇండియన్ రివ్యూ' పత్రికయందు వ్రాసియుం డఁగా ఆ విషయ మప్పు డత్యంతముగా ఖండింపఁబడి యుండినది.

అయినను ఇటీవలను "మోహెంజో దారో"లోల భించిన ప్రమాణములవలన ఆ డాక్టరుగారు వ్రాసిన సంగతులు బలపఱుపఁ బడినవి. అందులకు కొన్ని నరాస్థిపంజరములు ద్రావిడులవానిని బోలియున్నవట. మఱికొన్ని ప్రమాణములు వారి నాగరకత నైలు తీరము వారికంటెను యూఫరటీసుతీరమువారికం టెను పురాతన మయినదని తెల్పుచున్నవి.

పయిఁ దెల్పినది"సన్ డే టయిమ్స్"పత్రికా ప్రచుర సారాంశము. ఇటీవల మ॥ బారిష్ట రు త్రిపురనేని రామస్వామిచౌదరిగారు రచి యించి ప్రచురించిన "శంబూకవధ" నాటక ములోనేమి, తదితరు లనేకులయొక్క యభి ప్రాయప్రకారమేమి, ద్రావిడులు తొల్లిని గంగా సింధుతీరములలో నుండి ఆర్యుల యాక్రమణమునంజేసి దక్షిణమునకు వచ్చినారనియును, వారే యార్యులచే ఆర్య గ్రంథములలో రాక్షసులనఁబడినారనియును తెల్పఁబడుచున్నది. దాని నవుననిపించు టకు రక్కసులకు "పూర్వదేవతలు" "తొలి జేజేలు" అను పర్యాయములును గలవు. కాని వేదములకుఁ బ్రాఁబల్కులను పర్యాయ మును గలదు. అయినప్పుడు ద్రావిడనాగర కత ప్రాఁబల్కులకాలమునకన్నఁ బ్రాఁతది యగునా ? అట్లయినప్పుడు వారి విజ్ఞాన విషయకముల కాపేరు తగునని వా దేర్ప డును. ఏతద్విషయమునుగూర్చిన సకారణ చర్చలు సనమస్కారముగానందికొనఁబడును.

### ఆంధ్ర సారస్వత సంఘము, చెన్నపురి

తక్కిన సంస్థలవలెనే ఇప్పుడు తెలుఁగు మాగాణమున సాహిత్యసంఘములు వెల్లు వెరిగినవి. దేశ భాషా వాఙ్మయాభిమాను లగు కొందఱాంధ్రులు సంఘములుగా కూడి వాఙ్మయోద్ధరణమునకు బద్ధకంకణు లగుట శుభసూచకము. ఉత్సాహయుక్తు లగు యువకులు స్థాపించిన సంస్థలలో మద్ర పురమునందలి "ఆంధ్ర సారస్వత సంఘ" మొకటి.

ఆంధ్ర సారస్వత సంఘము పుట్టి యెంతోకాలము కాలేదు. దీనిపేరు చాలమంది ఆంధ్రులకు తెలియకపోవచ్చును. కాని భాషావాఙ్మయసేవ నొనర్చుటలో మాత్ర మిది యేమాత్రము తత్పూర్వసంస్థాపిత సంస్థలకుఁ దీసిపోలేదు.

ఆంధ్రమున సంపూర్ణగ్రంథాలయ మొకటి నెలకొలుపుట, పండితకవులను సత్కరించి వారిచేఁ బరిశోధనలను చేయించి విజ్ఞానాంకురములను తెలుఁగుదేశమున వెదఁజల్లించుట, ప్రాచీనములు అపూర్వములు నగు గ్రంథములను ప్రకటించుట, సమర్థులచే ఉపయుక్తములగు గ్రంథములను రచియింపఁ జేయుట, మహామహులచే సంఘముపక్షమున నుపన్యాసముల నిప్పించి తత్సారాంశమును పత్రికాముఖమున తెలుగుదేశమునకు పంచిపెట్టుట మొదలగునవి యీసంఘముముఖ్యోద్దేశములు.

ప్రతి సారస్వతపరిషత్తును కొన్నిగొప్ప పనులను నెరవేర్చుతలంపుతోనే తలయెత్తుచున్నది. కాని ఆ తలంపులు కార్యరూపమున పరిణమించుట యరుదు. అందులకు కావలసినంత ధనము లేకుండుట యొక కారణము. అట్టి ధనాభావస్థితి పయిసంఘమునకును దుర్నివార నయినది. కాని యది అంతతో నిరుత్సాహపడక స్వల్పవ్యయమునఁ జేయఁదగు కార్యములపట్టుల శ్రద్ధవహించుట ప్రశంసనీయము.

ఏడాది కొకసారి యేదో యొక చోటఁ గూడుటయు, ఏవో కొన్ని తీరుమానసములను గావించుటయు, పిదప నా యుత్సాహము సన్నగిల్లుటయు పరిషత్తుల సామాన్యపద్ధతి. అట్టిసంఘములు వయసున పెద్దవయినను చేసినసేవలపట్టున శైశవమున నేయుండుట తటస్థించుచున్నది. ఈ "ఆంధ్ర సారస్వత సంఘ" మట్టివిషయమున వేరురూపు తాల్చినది.

విశేషధనవ్యయమున నెఱవేఱు గ్రంథభాండాగార సంపాదనము, గ్రంథప్రకటనము మొదలగువాని విషయమున ఈ సంఘము చురుకుగఁ బని చేయలేకున్నను సంఘపక్షమున నెల కొకటి రెండు పర్యాయములయినను విద్యాధికులచే నుత్కృష్టవిషయములంగూర్చి యుపన్యాసము లిప్పించి వారిని గౌరవించి తదుపన్యాససారమును తెలుఁగుదేశమున కంతకును పంచిపెట్టుట మిగుల ప్రశంసనీయము. కడచిన మూఁడు నాలుగు నెలల కాలమున సుప్రసిద్ధాంధ్రపండితులు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు మొదలగువా రొసంగిన యుపన్యాసములలో పండితులు గమనింపవలసిన విషయము లనేకములు కల వనుట ఆంధ్రదేశము ఎరుగని దికాదు.

ఈ సారస్వత సంఘము వయసున చిన్న దయినను ఆశయములను కార్యరూపముగఁ

బరివర్తించువానిలో మొదటివని చెప్పవలెను. భాషావాఙ్మయాభిమానము గల ఆంధ్రులు దీనిని పోషించుట విధి. ఉదాత్తులగు పోషకులు లభించినచో ఈ "ఆంధ్ర సారస్వత సంఘము" తన యావదుద్దేశములను అచిరకాలమున సఫలము చేసికొనఁగలదు. ఆంధ్రులెల్లరు దీనియెడ సానుభూతి చూపి యథార్థమగు వాఙ్మయసేవకు తోడుపడుదురుగాక !

### రాయలసీమ క్షామము

ఏసీమ తొల్లి రాయలవారిచేఁ బరిపాలితమై సమస్తైశ్వర్యధుర్యమై విలసిల్లినదో నేఁటి కాసీమ కరవున కాకరమై తన పేరిలోని రెండవ యక్షరములేని యర్థమును జెందుచున్నది. తొల్లి వీరగ్రామమున కాఁటపట్టయిన దేశ మిప్పుడు నీరక్షామమున కాకర మయినది. ఈకరవిప్పటిదికాదు. ఈ సీమయొక్క భాగ్యవిశేషదశయది యెట్టిదో కాని తరములనుండియుఁ గరవుండుచునే యున్నది. దానిని గూర్చి తుంగభద్ర ప్రాజెక్టు మొదలయిన చర్చ లెన్నియోసారులు జరగినవి. ఫలిత మింతవఱకేర్పడలేదు. ఇప్పుడు దేశమునందలి మహాజను లీ సీమయొక్క యోగక్షేమములనుగూర్చి దృష్టినిబరగించుట శుభసూచకము. దేశీయులును ప్రభుత్వమువారును మిక్కిలి సానుభూతితో ఈ రాయలసీమయొక్క క్షేమసంపాదనమునుగూర్చి తగు ప్రయత్నము గావించి తనపేరిసీమమేలిని గూర్చి యెదురుసూచు నాంధ్రభోజుని యాత్మకు సంతసము నొసంగుదురు గాక !

---

## మనవి

వ్యాసకర్తలు తాము పంపు వ్యాసములకు తమయొద్ద ప్రతి నుంచుకొని పంపుటయే మేలు. వ్యాసములు వాపసుపంపుట కష్టతరము. వ్యయమూలములును. వ్యాసములు చిన్నసైజు కాగితములపై వీలగునంత సంగ్రహముగ వ్రాసి పంపవలెను. గద్య వ్యాసములను, అందును ప్రస్తుత పరిస్థితులను తెలుపుచు దేశాభివృద్ధికి ఉపయోగించునవై ఉండినచో ప్రకటనము శీఘ్రముగఁ గాఁగలదని మనవి.

రాఁబోవునది (మార్చిసంచిక) ద్వితీయసంపుటపు లోఁసంచి . ఆతర్వాతిది యువ సంవత్సరాదిసంచిక. ఆరెండుసంచికలయందును వివిధములగు అమూల్య వ్యాసములు ప్రకటింపఁబడును. రాఁబోవుసంచిక క్రొత్తదనముకల్గి సర్వజనాకర్షకముగ నుండును.

సంపా. చంద్రిక.

# విమర్శనములు

**శ్రీ గౌతమక్షేత్ర (బుగ్గ) మహాత్మ్యము:**

శ్రీ వాఙ్మయ వినోదినీ గ్రంథమాల ద్వితీయ కుసుమము (పద్యకావ్యము). రచయితలు - కవిభూషణ శతావధాని విద్వాన్ శ్రీ దోమా వేంకటస్వామి గుప్త గారు, తెలుఁగు పండితులు ; క్రిస్టియన్ కాలేజి, మద్రాసు. క్రౌను ౧౭+౧౩౪ పుటలు, వెల రు. ౧.

"చిత్తూరుజిల్లా నారాయణవరముతాలూకాలోని "నగరి" పురసమీపమున శ్రీ కుశస్థలీనదీతీరమున వెలసియున్న శ్రీ గౌతమక్షేత్ర (బుగ్గ) మహాత్మ్యమిందు సలలితముగ వర్ణింపఁబడినది.

శ్రీగౌతమక్షేత్రమునుగుఱించిన స్థల పు రా ణ ము మృగ్యము. అయిన "నా స్థలపురాణము నొక తెలుఁగు ప్రబంధముగా వ్రాయఁ గోర్కి" యుప్పతిల్లుటచే గ్రంథకర్తగారు "శ్రీ నగరి, గుండాల నరసయ్యగారి పొత్తమునుండియు, ఉత్తరరామాయణ పద్మపురాణములనుండియును ప్రణాళిక నేర్పాటుగావించుకొని యీ ప్రబంధమును" రచించిరి.

శతావధానులు, విద్వత్ప్రకాండులు, ఆశుకవిశిరోమణులును అగు శ్రీ వేంకటస్వామిగుప్తగారి కవిత్వ విషయమునుగుఱించి వేఱ చెప్ప నక్కఱలేదు. ఈ గ్రంథమందలి శ్రీవారికవిత ద్రాక్షాపాకమునఁబడి ప్రాచీనకవుల పోలికల నలరుచున్నది. ఉదాహృతి—

సీ. వందారు జనబృంద మందిరాంగణ లస
న్మందార ! నీ కిదె వందనములు;
దీనులపాలి నిధివగు నీ కిదే దేవ !
నా నమస్కృతులు చెన్నారు నభవ !
ఆపన్నజనపాలి కభయుం బొసంగు ముం
గొంగు బంగరు! వేటికోట్లు నీకు;
చంద్రావతంస! తుషారహీరపటీర
ధవళాంగ! నా నమస్తతులు నీకు ;

గీ. మహిత కారుణ్యవారిరాశి హృదయాఢ్య !
దాసదాసోహ మవ్యయాత్మక ! పురారి !
ధన్యతముఁడ నైతిని నే డుదారచరిత!
కుధరతనయాప! హతపాప! కుధరచాప!

మ. త్రిజగద్రక్షణకారణాయ భవతే
శ్రీశాదివంద్యాయ పం
కజనేత్రాఢ్య శరీరిణే సుమహతే
కారుణ్య సన్మూర్తయే
గజచర్మాంబరధారిణే బహుశః
కాండం కరోమీతి స
ద్విజ నేహా నిజవాక్కులం బలికి యం
బాధర్త కమ్మానియున్.

ఇయ్యుదాహరణములంబట్టి శ్రీ గుప్తగారికి సంస్కృతమునందును అనర్గళకవిత లలితలలితముగ సాగుట తెల్లమగుచున్నది.

"ఈ పొత్తము రచన" యందందు "ర ల డ ల యతులును, పద్యములు (ఉ. చ. గీ సీ. శా. మ.) 4 పాదములకన్న నధికముగా నక్కడక్కడ వ్రాయుటయును నిందు" కవిగారు "ఇతర గ్రంథములలోవలె నే పాటించినా" రు.

గ్రంథమునందలి విషయము పవిత్రమగు శ్రీ గౌతమక్షేత్రమాహాత్మ్యము. రచయితలు సుప్రసిద్ధులు. ధారయనర్గళము. ఇట్టి యుద్గ్రంథమును ప్రకటించి వాఙ్మయసేవ యొనర్చిన శ్రీ వాఙ్మయవినోదినీ గ్రంథమాలవారు ప్రశంసార్హులు. ఆంధ్రులెల్లరును ఈ గ్రంథమును పఠించి శ్రీ గుప్తగారి పరిశ్రమను సఫలము నొనర్తురుగాక!

బు. వేం. రమణయ్య.

## శ్రీ రామానుజగురు వరణము:

ఈ చిన్నపొత్తము ఏకాంకనాటకము. రచయిత లును. ప్రచురణకర్తలును. విశాఖపట్నముజిల్లా, నెల్లిమర్లపోస్టు, రామతీర్థము కరి నారాయణాచార్యులు గారు. 2+4+2+47 పుటలును,తప్పొప్పుల పట్టికయును గలవు. వెల: 12 అణాలు. శ్రీరామానుజాచార్యులవారు తొల్తను శ్రీయాదవమిశ్రుల వారికడ శుశ్రూష గావించి వారికడను మాని శ్రీ కాంచీపూర్ణులను సేవించిన విషయ ను శ్రీ రామానుజ తన్మతవిశేష సంప్రదాయములును నాటకమూలముగాను వరదాచార్య వామదేవ శర్మ సంభాషణరూపముగాను చక్కగాఁ దెల్పఁబడినవి. రూపకలక్షణములకీ పొత్తము సరిపడినను పడకపోయినను ఇది మంచి నైపుణ్యరచన యని యును వైష్ణవుల కెంతయును నానంద ప్రబోధ దాయకమనియును విష్ణుభక్త్యుత్పాదక మనియును ఏతద్రచయితలయొక్క దైవభక్తికి సంప్రదాయ జ్ఞానమును ఇది తెల్పెడి నియును చెప్పక తప్పదు. గ్రంథకర్తగారి యీ ప్రయత్నమును పెద్దలెంతయుఁ బ్రశంసించియున్నారు. ఈ గ్రంథకర్తగారిట్లే సద్గ్రంథములనేకములు వ్రాయుదురు గాక.

దా. ఁం. గుప్త!

**సుభాషితరత్నమాల :** నీతిని బోధించు పద్యములుగల యీ ఖండకావ్యమునకుఁ గర్తలు విద్వాన్ శ్రీవేదం వేంకటకృష్ణశర్మగారు. మదరాసు వేపేరి "సెంటు పాల్సు హైస్కూలు"లో ప్రధానాంధ్రోపాధ్యాయులు. క్రౌను ౪౫ పుటలు; వెల ౪ అణాలు.

పిన్నలకు పెద్దలకును ఉపయోగించునట్లుగ ఇందు సులభశైలిలో నూటికెక్కువగ నీతిపద్యములు రచింపఁబడియున్నవి. పద్యములు రసవంతములు. సుభాషిత గ్రంథములు అరుదుగా గల తెలుఁగు వాఙ్మయమునకిది యొక అలంకారము కాఁదగును. పాఠశాలలలోని విద్యార్థుల కిది పఠనీయగ్రంథ మగుట లెస్స.

---

## స్వీకారము

వేశ్యారహస్యము—చిన్న పద్యకావ్యము. రచయితే - అప్పల వీరవెంకట జోగయ్యశాస్త్రిగారు. క్రౌనుసైజు 8 పుటలు. ప్రకాశకులు- బి. వి. యస్. రావ్ అండ్ కో., కాజులూరు.

రామనామం—చిన్న నాటకం. గ్రంథకర్త ముద్దా విశ్వనాథంగారు. ఫుల్‌స్కేపు ౧/౮ సైజు ౧౧ పుటలు. తపాలు ఖర్చునకుఁగాను ఒక అణా చీటిని పంపువారికి ఉచితము.

ఆనంద సామ్రాజ్యము—కర్త: ముద్దా విశ్వనాథముగారు (కవితాసమితి). క్రౌను ౨౦ పుటలు చక్కనికూర్పు. వెల ౨ అణాలు. ప్రకాశకులు- వ్యాస కుటీరమువారు, మేడపాక, ఎలమంచిలి, విశాఖపట్నముజిల్లా.

కాశీపీఠాంచే ప్రాచీనత్వ—(హిందీ). కర్త: వేదతీర్థ. చి. మ. వీరభద్రశాస్త్రిగారు. క్రౌను ౨౭ పుటలు. వెల ౨ అణాలు. వలయువారు "పండిత చి. మ. వీరభద్రశాస్త్రిగారు, శైవభారతీభవన, కాశీ; అను చిరునామాకు వ్రాయవలెను.

ఆంధ్ర హంస సందేశము—పద్యకావ్యము. గ్రంథకర్త: శ్రీమాన్ నడాదూరు అమ్మాళ్ నరసింహాచార్యులుగారు, బి. ఏ., ఎల్. టి., డిప్యూటీ ఇన్‌స్పెక్టరు ఆఫ్ స్కూల్సు, మచిలీపట్టణము. క్రౌను ౮+౫౫+౧౦ పుటలు. మంచి అచ్చు. వెల ౧౨ అణాలు. ప్రకాశకులు- ఎం. శేషాచలం అండ్ కంపెని, హిందూ ప్రెస్, మచిలీపట్టణము.

పూలదండ—సచిత్ర మాస పత్రిక. క్రొత్తది. డబుల్ క్రౌను, ౪౮ పుటలు. విడిసంచిక - రెండు అణాలు. ప్రకాశ స్థలము - రాజమండ్రి.

---

PRINTED BY M. SARAVANAM PILLAI AT THE ANANDA PRESS, LOANE SQUARE, MADRAS
EDITED AND PUBLISHED BY V. A. KESHUB CHENDRA, MADRAS.

సంపుటము ౧౨ సంచిక ౫

# భారతి

## సచిత్ర మాసపత్రిక

యువ సం॥ ఆషాఢ

జూలై 1935

ఆనంద ముద్రణాలయము

మద్రాసు

౧౯౩౫



# విషయసూచిక

—:o:—

---

## చిత్రములు




దుర్యోధన దురాలోచన

[చిత్రకారుడు: పెంద్యాల వెంకట రామారావుగారు]





| సంపుటము | చెన్నపట్టణము, జూలై ౧౯౩౫ | సంచిక |
|---|---|---|
| ౨ | యువ సంవత్సర ఆషాఢమాసము | ౫ |


# దేవి

ఉభయభాషాప్రవీణ కొమ్మనమంచి జోగయ్యశర్మగారు

(రాయల జయింప నుపాయాంతరము గానక, కూతునొడఁగూర్చి, యామెచే రాయల వంచింపనెంచి, యొకనాఁటి నిశీథ సమయమునఁ గూఁతు రావించి, యెన్నియో యుపదేశము లొనర్చి, కైజారొసంగి రాయల నెట్లైన సంహరింపవలయునని యామెను రాయల యేకాంతవాసమున కంపినాఁడు గజపతి. తండ్రిమాట కెదురాడి చేయునది లేక భావి భయంకరకృత్య భావనచే కంపితగాత్రయై)

గజపతియనుంగుపట్టి యా గతిని తండ్రి, నూరిపోసిన యుపదేశసారమెల్ల
నాలకించి భయభ్రాంతయై తెనుంగు, రాజు నిదురించు నా మందిరంబు చొచ్చె.

తెలినునుమబ్బుతున్కపయిఁ దీర్చిన పూర్ణ సుధాకరుండు నాఁ
దళుకుహారంగు మేలుజలతారు మడుంగుముసుంగులో సుధా
కలిత మనోజ్ఞహాసరుచికందళితాఁననుఁడై నిగూఢపుం
దెలివిగలాఁడునై కపటనిద్ర నటించుచునుండె రాయలున్.

అతఁడు శయనించియున్న శయ్యాతలోప
కంఠమునకేఁగి ముసుఁగెత్తి కాంచెనంత
మబ్బుతెర వీడు చంద్రబింబంబుకరణి
చలువ లెగఁజిమ్ము నా రాజచంద్రు మోము.

కాంచినంతనె మేనెల్ల గగురుపొడిచి చెమ్మటలుగ్రమ్మ వణకుచు చేతిలోని
శాత చురికమ్మ నేలపై జారవిడిచి యిట్లు తలపోయఁజొచ్చె నా యిందువదన.

ఆహవంబున శాత్రవాళిఁగూర్చిన కత్తి కావేరిసీటితోఁ గడుగు జోదు
సకలదిగంతవిశ్రాంతకీర్తిచ్ఛటా చంద్రికాపూర్ణ నిశాకరుండు
తన పరాక్రమస్రవంతిని మహదాంధ్రభూమిని ప్రవహింపఁజేసిన కడింది
కవిపుంగవాశిషాశ్రుతవర్ధమాన ప్రఖ్యాత భూమండలాఖండలుండు
అఖిలసామంతమౌళివిన్యస్త మణిఘృణిమతల్లినీరాజితాంఘ్రియుగపీఠి
యైన కృష్ణరాయలఁ దెగటార్ప మనఁగ, తాలు వెట్లాడెనో కన్నతండ్రి నీకు!

రాయలెట్లైన మరణింప రాజ్యమెల్ల, హస్తగతమగునని యెంచి తండ్రిగాని
మరిపెముగఁబెంచుకొన్నట్టి ముద్దుకూతు, కంటికెరటాల నొక్కింతఁ గానవైతి!

కదన మొనరింప భీరువై గజపతి తన కూఁతురాయల కొడఁగూర్చి, కూళమైర
హాస్యమందిరమునఁ జంపెననఁగ లోకు, లాడిపోవరె!! తలలెత్త నగునె తండ్రి!

అనిమొన నాఁగలేక తనయన్నొడఁగూరిచి యెట్లొ యాంధ్ర భూ
పునిఁ దెగటార్పుమంచు నను బుచ్చితి వట్లె యొనర్చుదానపో
కనికరమింతలేక తన గాదిలిపట్టి యమూల్యమంగళం
బును సెగపాలుజేసి యెటు భారమ నేలుదువయ్య కూరిమిన్?

క్షితితలనాథు లీ కపటకృత్యములన్విని యక్కటక్కటా
పతి దిగమ్రింగుకున్న కులపాంసని జాలి యొకింతలేని దు
ర్మతియని నన్ను నోటికనరాని విధంబుల నాడిపోవనే
గతి భరియించుదాన జనకా కడిపోయిన జీవబంధమున్?

ఆహవభూమి నిల్వఁగ సమర్థత నీకిఁక లేకయున్న దు
స్సాహసముం బొనర్చి సుతజన్మము వమ్మొనరించుకంటె "మాం
పాహి దయానిధే! విజితపార్థివ మౌళివిరాజితాంఘ్రి! దా
సోహ" మటన్న దోసమె? దయామతి రాయలు సైపకుండునే!

అనుచుఁ గనలి కనలి జనకుని క్రౌర్యంబు, గర్భగోళమెల్లఁ గాల్చుచుండ
ననుఁగుభర్తఁ జంప హస్తంబురాక య,య్యతివ యేడ్వదొడఁగె నట్లెనిలిచి.

అంతవఱకూరకున్న య య్యాంధ్రభర్త, 'యేమి యెఱుగనియట్టులలిట్లేల యిచట,
కంటనీరోడ్చుచుంటివో కాంత?' యనుచు, నక్కునం జేర్చి యోదార్చి యాదరించె,

# "రెంటికిం జెడిన రేవడ"

ఇది యొక పురాతనలోకోక్తి. అనంతామాత్యుఁడు దీనిని మొదట భోజరాజీయమున వాడినాఁడు. పెద్దనామాత్యుఁడు మనుచరిత్రమునఁ దరువాత వాడినాఁడు. భోజరాజీయమునకు వ్యాఖ్యానము లేదు కాని, మనుచరిత్రము చిరకాలమునుండి టీకాతాత్పర్యములతోఁ బ్రకటితమగుచున్నది.

మనుచరిత్రమందలి పద్యము సుప్రసిద్ధము; మాయాప్రవరుఁడైన గంధర్వుఁడు వరూథినితో నన్న వాక్యము—

"ఉ. నీ చనుదోయి సంకుమద
నిర్భరవాసన మేను సోఁక న
య్యో! చిరసౌఖ్యముల్ గనుట
యొండె, తపంబొనరించి పాపముల్
రాచుట యొండె కాకిహప
రంబుల కూరక దూరమై వయ
శ్శ్రీ చన 'రెంటికిం జెడిన
రేవడ' నౌదునె? నీరజేక్షణా!"

('రేవఁడ' నని బిందుయుక్తముగా నేఁటి ముద్రితగ్రంథములలో నున్నది.)

నాకు లభించిన ప్రాఁత సటీకామనుచరిత్ర చెన్నపట్టణమున శ్రీరంగవిలాస శ్రీ వాణీవినోదమందిర ముద్రాక్షరశాలయందు 1893-వ సంవత్సరమున ముద్రితము. 'రెంటికిం

కవిభూషణ సెట్టి లక్ష్మీనరసింహముగారు

జెడిన రేవణ నౌదునె?' యన్నది దానిలోని పాఠము. మఱి కొన్ని గుజిలీ పుస్తకములలో 'రెంటికిం జెడిన రేవడ నౌదునె?' యని యున్నది. రెండు పాఠములకు వ్రాసిన టీకయు నొకటియే: "రెంటికిం జెడిన రేవణ(డ)గా, ఔదునె, రెంటికిఁ జెడ్డ రేవణ(డ) యనునట్టు అయిపోదునా, అనఁగా నాలాగునఁగానను‌ట, లోకమందెవ్వరైన నొక కార్యమునుగురించి రెండవ కార్యమును గూడఁ జెడఁగొట్టుకొన్న పక్షమందు రెంటికిఁ జెడ్డ రేవణ(డ) యను లోకసామెత గలదు. అట్టి సామెతకుఁ బాలౌదునా యని పలికె నని భావము." ఈ యర్థమును వ్రాసిన వ్యాఖ్యాత యా సామెత కట్టి యర్థమేల కలిగినదో తెలుప లేదు.

ఎవరా వ్యాఖ్యాత? ప్రాఁత ప్రబంధముల కనేకములకుఁ బండితులచేతఁ దాను వ్యాఖ్యానములు వ్రాయించినట్లు బ్రౌనుదొర తెలుపుకొనినాఁడు. బ్రౌణ్యానిఘంటువున 'రేవడు' అను మాటను జూడఁగా నిట్లున్నది: "రేవడు. N. S. A rogue. కృపణుడు. D. కుచ్ఛితుడు. Swa. 3. 140. టీ॥ వొక కార్యమును గురించి రెండో కార్యమును కూడా చెడగొట్టుకొనే వాడు." 'D' యన్న గుఱుతు దీపికను దెలుపును. దీపిక యన్న గ్రంథము మచిలీపట్ట

ణము (బందరు) నందలి మామిడి వెంకయ్య గారు (వెంకయ్య వ్యాకరణ గ్రంథకర్త) 1816-వ సంవత్సరమున రచించి 1848-వ సంవత్సరమునఁ జెన్నపట్టణమందు ముద్రిం పించినది. మామిడి వెంకయ్యగారే మను చరిత్ర వ్యాఖ్యాత కావచ్చును.

ఆనంద ముద్రాక్షరశాలవారు మను చరిత్రము కొమాండూరు - అనంతాచార్యుల వారి టీకాతాత్పర్యములతోఁ బ్రకటించి నారు. నాయొద్దనున్నది 1923-వ సంవత్సరపు ముద్రణము. అది బ్రహ్మశ్రీ పురాణము సూర్యనారాయణ తీర్థులచేఁ బరిష్కృతము. దానికిఁ బీఠికయుఁ గ్రంథాది విమర్శనమును వ్రాసినవారు తం॥ తేవప్పెరుమాళ్లయ్య గారు. కథాసంగ్రహము వ్రాసినవారు కోపల్లి వేంకటరమణారావుగారు. 'రెంటికిం జెడిన రేవఁడ' నన్న లోకోక్తికి దానియందుఁ గ్రొత్త కథ యొకటి కనఁబడుచున్నది. వారి వ్యాఖ్యానము : "చెడిన రేవఁడను = చెడి పోయిన రేవు వాఁడను - చాకలివాఁడను, ఔదునె. (ఒక చాకలివాఁడొక యేటిలో గుడ్డ లుదుకఁబోయి, యొక బాతిమీఁద గుడ్డ లుదికి, యా యుదికిన వానిని గొంత దూర మున నున్న మఱియొక బాతిమీఁదఁ బెట్టుచు, నుదుకవలసినవానిని మొదటి బాతిదగ్గఱనే యుంచుకొని యుదుకు చుండఁగాఁ బ్రవాహము వచ్చెను. అప్పుడు వాఁడు తొందరచేత నుదుకవలసిన బట్టల నున్నతావుననే విడిచి, యుదికిన బట్టలకై యా బాతి దగ్గఱకుఁ బరుగెత్తఁగా, నింతలో వఱద పెరిగివచ్చి రెండు చోట్లనున్న వస్త్ర ములును గొట్టుకొని పోయెను. తెలివిలేమి చేత నొక బాతిమీఁది వస్త్రముల నైన నిలుపుకొనలేకపోయిన చాకలివానిని జనులు రెంటికిఁ జెడిన రేవఁడనిరి. నాఁటనుండి యది లోకోక్తిగా వాడఁబడియె నని యొక కథ చెప్పుదురు.)

అనంతాచార్యులవారి కథ కిట్టింపుగాఁ గనఁబడినదే కాని, సరియైనదిగాదన్న సందే హము మొదటినుండియునా కుండెను. వ్యుత్ప త్తులు కాలక్రమమున విస్మృతములైన లోకోక్తులలో నిది యొకటి యని నేను నిశ్చ యించుకొంటిని. అట్టివి యాంగ్ల గ్రంథము లందును దఱుచు కనఁబడుచుండును. ఈ నడుమ షేక్స్పియరు రచించిన నాటక మొకటి శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజుగారి యెదుటఁ జదువుచు, వ్యుత్పత్తి తెలియదని వ్యాఖ్యాతలన్న యాంగ్లేయలోకోక్తి యొకటి తగులఁగా, 'రెంటికిం జెడిన రేవఁడ' నన్న తెలుఁగు సామెత యట్టిదే యని నే నంటిని. వెంటనే యా సాహిత్యసమ్రాట్టు తడుము కొనకుండ దానికి సరియైన యర్థము చెప్పి నారు : "సాగు చేయుటకును గాఁపురముం డుటకును బనికి రాక, రెంటికిని జెడిన రేవడ (భూమి) వంటి వాఁడ నౌదునా ?" యన్నది వారు చెప్పిన యర్థము. 'రేవడ' యన్న పద

మున కట్టి యర్థము గలదా యని శబ్దరత్నా కరము విప్పితిని. 'రేవడ. దే. వి. రేగడ యొక్క రూపాంతరము. "ఇచట నల్ల రేవ డయ దూరము పోయినఁ బాండుమృత్తికా కరములు గానము." పగ. ౨౨, ఆ.' యని యు, 'రేఁగడ. దే. వి. (చూ) రేగడి. (చూ. రేవడ)' యనియు, 'రేగడి. దే. వి. బంక మన్ను'; అనియుఁ గనఁబడి నా సందేహము దీరినది.

ఒక చిత్రము: రేవడశబ్దమునకు బంక మన్నన్న యర్థము వ్రాసిన 'సీతారామాచా ర్యులవారు దాని మీఁదనే, 'రేవఁడు. దే. వి. (రేవు + అఁడు) చాకలవాఁడు. "ఇహపరం బుల కూరక దూరమై వయశ్శ్రీ చెడ రెంటికిం జెడిన రేవఁడ నాదునో." స్వా. ౩, ఆ.' యని యనంతాచార్యులవారి యర్థమే వ్రాసి నారు. శబ్దరత్నాకరమునకు ముఖ్యమైన వ్రాయసకాఁడు కో-అనంతాచార్యులే యని యీ గ్రంథపీఠిక తెలుపుచున్నది. చాకల వాఁడైన రేవఁడు చక్రాంకితము పొందుట యాచార్యద్వయమువలనను గాఁబోలు!

కన్నులయెదుటఁ గట్టినట్లున్న యర్థ మింత కాలమునుండి యింతమంది పండితులకు గోచ రింపమికిఁ గల కారణము వింతమైనదే! 'రేవడ నాదునె?' యన్నదానిలోఁ గల 'రేవడ' నన్న యుత్తమపురుషైకవచనము 'డు' ప్రత్యయాంతమైన మహద్వాచకమన్న భ్రమ గలిగించినది. దానిని బిందుయుక్త ముచేసి, రేవఁడన్నది పురుషవాచకమని వ్యాఖ్యాత లూహించినారు. దానిని మతు బర్థక మనుకొని చాకలవాఁడని యర్థము చెప్పుట సీతారామాచార్యులవారి పాండి త్యము; రెంటికిం జెడిన చాకలవాని కథ పుట్టించుట యనంతాచార్యులవారి కల్పనా శక్తి. ఈ విషయములో వారు ప్రథమా చార్యులు, ద్వితీయాచార్యులు నయినారు!

మఱియొకచిత్రము: 'రాచు' అను పదము క్రింద మనుచరిత్రపద్యమునే యుదహ రించుచు, "తపంబొనరించి పాపముల్, రాచుట యొండెగా కిహపరంబుల కూరక దూరమై వయ, శ్శ్రీ చన రెంటికిం జెడిన రేవణ నాదునె," యని శబ్దరత్నాకరకార కుఁడు వ్రాసినాఁడు. 'రేవణ' యను మాట కర్థమేమి వ్రాసెనో యని చూడఁగా, నా పదమే లేదు. దీని భావమేమి? అడంగ్వా దులలోఁ జేర్చుకొన్న పక్షమున, 'రేవడ' కు 'రేవణ' రూపాంతరమగును. డు ప్రత్యయ మందలి డకారమున కట్టి మార్పు గలుగదు. 'రేవణ నాదునె' యన్న పాఠ మంగీకరించిన నాఁటికి సీతారామాచార్యులవారికి 'రేవఁడు' చాఁకలవాఁడన్న యర్థము స్ఫురింపలేదన్న మాట. ఆ తరువాత ననంతాచార్యులవారికి రజకుని మూలమున వస్త్రనష్టము కలిగి, వఱద యొక మిషగాఁ జెప్పఁబడినదేమో?

# కృతి

కవిభూషణ శతావధాని విద్వాన్ దోమా వేంకటస్వామిగుప్తగారు

కృతిసమర్పణపద్ధతి యాంధ్రదేశమునందు సుమారు వేయి సంవత్సరములకు ముందునుండి యాచారమునం దున్నది.

ఈ రీతియొక్క ముఖ్యాభిప్రాయము గ్రంథము వ్రాయు కవీశ్వరుని శ్రీమంతుండయిన రసికుఁడు ధనాదికమొసంగి యాదరించుట.

కృతినొసంగువాఁడు కృతికర్త (గ్రంథము వ్రాసిన వాఁడు). కృతినిగైకొనువాఁడు కృతిభర్త. ఈ యిరువురికి నిర్మలమయిన ప్రేమ పొసంగనియెడల కృతి సమర్పణము సరిగా జరుగదు. కనుకనే కొందఱు కవులిట్టి ప్రేమానుబంధము పొసఁగక తమగ్రంథములను దేవాంకితము గావించిరి. అనేకులు నరాంకితము గావించిరి. ఈ రెండుపద్ధతులలో నించుక యౌత్కృష్ట్య భేద ముండినప్పటికి రెండవపద్ధతి అనఁగా నరులకు కృతులు సమర్పించుట లోకువయినదికాదు. నిర్మలమయిన ప్రేమానుబంధముతో కవీశ్వరుఁడు తన పోషకుఁడయిన కృతిభర్తయొక్క మేలును గోరును. అట్లు మేలుగోరు పద్ధతులు వ్రాయుటకు మనవారు కొన్ని నియమములుగూడఁ జెప్పియున్నారు.

పయిఁ దెలిపినరీతిగా కృతిభర్తయొక్క మేలు గోరుచు, లోకకల్యాణార్థము వ్రాయఁబడిన గ్రంథము నిరంతరంబుగా భూమండలమునందు నుండి, కృతిభర్తకును కృతికర్తకును గీర్తికల్గించు ననుటకేమి సందేహమున్నది ?

ఈ కృతి యిచ్చి పుచ్చికొనుటలఁలో దేశక్షేమమున కత్యవసరములయిన యార్థిక పారమార్థిక సమస్యలు పరిష్కారంబు నొందుచున్నవి. అదెట్లనిన, ఉత్తమమయిన గ్రంథమును కవీశ్వరుఁడు నిర్మలమయి యుద్రేకపూరితమయిన మనసుతోఁ గాని వ్రాయఁ జాలఁడు. కవీశ్వరునికి నిర్మలాంతఃకరణంబును ఉద్రేకంబును, ఆర్థికవాంఛాపరిపూర్తి (ద్రవ్యలోపము లేకుండుట) వలనను, సద్గౌరవమువలనను గల్గును.

బమ్మెరపోతనాదికవీశ్వరులు గ్రంథములు దేవాంకితముగా వ్రాసినారది యుత్కృష్టపద్ధతి యనువారు గలరు. ఇట్లనువారిలో పలురకములు గలవు. కృతిని సమర్పింపఁగోరు కవీశ్వరునికి దేవాంకితముగా గ్రంథమును వ్రాయుమని చెప్పినచో అతఁడు తమ్మును ద్రవ్యము యాచింపఁ డనుకొను శ్రీమంతు లొకరకము. నరునికంటె దైవమెక్కువ గనుక దేవునికొసంగఁబడిన గ్రంథము మంచిది. తత్కవి యోగ్యుఁడని తలఁచువారు కొందఱు. మొదటిరకమువారికి జబాబవసరములేదు. రెండవరకమువారికిఁ బ్రత్యుత్తరము చెప్పవచ్చును. ఎట్లనిన:—కవీశ్వరు లందఱియొక్క మానసికస్థాయి పోతనాదుల మానసికస్థాయిని బోలియుండదు. అంతకంటె హెచ్చేయిన సాంసారికవాసనగల్గి యుండును. భోగము లనుభవించుటవలనను గౌరవములఁ జెందుట వలనను మానసికోల్లాసము గల్గుచుండును. అట్టివారు ఆయా యభివాంఛాపరిపూర్తిలేనిదే కవిత్వము నుజ్జీవవంతముగాఁ జెప్పఁజాలరుగదా ? కాఁబట్టి కవీశ్వరుఁడు స్వమానసికోల్లాసోద్దీపన సామగ్రిం జెందవలయునను నభిప్రాయముతోనే యాంధ్రకవితాపితామహుఁడయిన యల్లసాని పెదనామాత్యుఁడు—

చ॥ నిరుపహతి స్థలంబు, రమ
ణీ ప్రియదూతిక దెచ్చియిచ్చు క
ప్పురవిడె, మాత్మ కింపయిన
భోజన, మయ్యెలమంచే, మొప్పుఁ ద

ప్పరయు రసజ్ఞు, లూహతెలి
యం గలలేఖకపాఠకోత్తముల్ ।
దొరకినఁగాక, యారక
కృతుల్ రచియింపు మఁటన్న సాధ్యమే ?

కాఁబట్టి కృతిసమర్పణమును కృతిపరిగ్రహమును యోగ్యము లనఁజెల్లు. అందుకే సప్తసంతానములగు "శివాలయము, తటాకము, ఆరామము, అగ్రహారము, ఔరసుఁడు, ధన నిక్షేపము, కృతిపరిగ్రహము" అను వానిలలో కృతిపరిగ్రహముగూడఁ జేర్కొనఁబడినది. అంతియకాక అది చాల నుత్తమమైనదని యీదిగువఁ దెల్పఁబడు కొన్ని కారణంబులం జేసి తెమల్ప వచ్చును:—

దేవాలయము, తటాకము, ఉద్యానవనము, అవి యుండు చోటులకు వెడలి కాంచినయెడలనే వాని వైభవము గాననగును. అగ్రహార మెవ్వరి కొసంగఁబడునో వారే దానిరాఁబడి ననుభవింపఁ నగును. ఔరసుఁడ యోగ్యుఁడయినచో నిఁకఁ జెప్పవలసినది లేదు. గదా ? ధననిక్షేపముయొక్క యుపయోగ మది యెవ్వరికొఱకుద్దేశింపఁబడియుండునో వారే కాంచే నగును. కాని కృతి దేశమంతటను వ్యాపించి, కృతికర్తయొక్కయును, కృతిభర్తయొక్కయును కీర్తిని వ్యాపింపఁజేయును. ఇప్పటికిఁ గూడ ప్రబంధములలో నయిన యుత్కృష్టాంధ్రగ్రంథములకు కృతికర్తలును, కృతిభర్తలును ఏర్పడినచో నయ్యది దేశాభ్యుదయంబు గాకపోదు.

క॥ "గుడిగూలును,నుయి పూడును,
చెడును దటాకంబు, వనము చెలువంబూడున్
చెడనిది గ్రంథంబొక్కటె
కుడి యెడమలఁ జూడకన్న! గువ్వలచెన్నా!!

---

# " సాహిత్యలత "

రాబోవు గ్రంథము:— " ఆంధ్రదేశము "

ఇదియొక పవిత్రమైన సాంఘిక నవల

ఇందలి ముఖ్యవిషయములు

ఆదర్శకప్రాయుడగు ఆధునికాంధ్రుని జీవితము—ఆంధ్రుల గొప్పతనము—నాటి, నేటి, విజ్ఞాన నాగరికతలు—పల్లెటూరి జీవితము—పట్టణవాసము—పరిపాలనా విధానము—గాంధీ తత్త్వము—సత్యాగ్రహోద్యమము—అందలి కష్టనష్టములు మున్నగు విషయములు గలవు.

పలయువారు:—కర్లపాలెం. కృష్ణరావు,
ఎడిటరు & ప్రొప్రైటరు, " సాహిత్యలత "
చీరాల అని వ్రాయవలెను.

# ఆంధ్రజ్యోతి

కొడాలి వేంకటరాజారావుగారు

పూతస్రవంతికా గౌతమీ వీచికో
    ద్గతరావ మరులకు కఠిన శ్రుతులు
కృష్ణస్రోతఃపూర ఖేయావృతాంధ్రావ
    నీ లంఘనము లన్య నిహననములు
తుంగభద్రా సముత్తుంగ భంగాళుల
    తాకులు పరులకు శోకహతులు
పెన్నాతరంగిణీ పీయూష జలధార
    లరితృష్ణ కానీరు గరళ ధునులు

నదులు సైతమ్ము మా తెల్గు నాఁడునందు?
మా పురాతనాధీశుల మంచి కోరి
పరనృపాగమ దుర్గమ ద్వారములయి
రక్షణ మొనర్చెనంట మా రాష్ట్రప్రజల.

తెలుఁగచలంబు లాంధ్రమునఁ దీరిచి పెట్టని కోటగోడలై
మలగొనె, శత్రుసేనలకు మాటలుకా దహహా వాని దాటగన్
పులులుగఁ గానుపించెనట పో; భయచిహ్నసమాకృతాళియై
తెలుఁగుమహామహీపతుల దేశముగాచి ప్రశంసనీయమై.

౧

శ్రీ కృష్ణాతటినీప్రదేశపురమా శ్రీకాకుళాంధ్రావనీ
నాకాకస్సమమేనటే? జనులు నానావైభవోపేతులై
చీకాకున్ పడలేదటే? నృపులు ప్రాచీన ప్రజా సౌఖ్యమై
స్వీకారం బిడిరంట శత్రులకు సజ్జీవాకృతాళిన్ ధృతిన్.

౨

అది మహా ఆంధ్ర(?) రాజ సింహాసనభువి
నమద శాత్రవపతికి స్మశానభూమి,
చిత్రవధ రక్తఝరులతో చివికి నేడు
పెచ్చు లెఱుపులె వదలెఁగా వేఁగిధరణి.

వేఁగులు సంచరించు పృథివీ స్థలి యిద్ది తెలుంగు భూప్రభు
త్యాగప్రభావదీధితులు ధాత్రి వెలింగి దిశాంతరాళము
ల్సాఁగి ప్రజాసమూహముల సాకిననాడట కాని నేఁ డటన్
వేఁగులులేవు, వీరపృథివీపతిసౌధశిలాళి తప్పహో.

౩

తుంగభద్రానదీదేవి తొంగలించి
చిఱుత కెఱటాలు మెఱయగ చిందులాడు
పూతజలతీర మది; తెల్గు పుణ్యతలము
విజయనగరమ్మ, శ్రీ కృష్ణవిభుని పురము.

రాయలు రాజ్యమేలినవి రాజప్రతాపధరాతలం బిటన్
దాయల వేఁటకుక్కలట; ధైర్యము లేక పరాజితాత్ములై
ప్రాయిని వీడి పాఱెనట, బాల శశావళి ఘుర్ఘురార్భటిన్
కూయ పరాక్రమోన్నతిని గుల్మ సమూహ ముఖోన్ముఖోగ్రులై.

౪

ఘోరతర భీకరాకార క్రూర కేసరములు తిరుగాడె నిట మహారావములను
తమ పరాన్వేషణార్థ ముత్కంఠితము నసింహపురికోటముందు గస్తీలు నెఱపి.

విరిగెను క్షీరం బిట మునుపరులకు వెనుజూపినట్టి బాపని బువ్వన్
ఎఱిగియు క్షీరముకాదని అరిగెను తన రక్తమనుచు నాజిని గెలువన్.

౫

వెలమ వరప్రభూత్తముల వెచ్చటి నెత్తురు పీల్చినట్టి బొ
బ్బిలిపురి లోష్టమిద్ది. సెగవేడికి మాఁగితళత్తళాభలన్
చలనము గాంచెగా వెలమసాములు కుక్కుట ద్వంద్వ(?) యుద్ధము
ల్సలిపెడివేళ శాత్రవులు సాత్వికగర్వవృథోక్తు లాడగన్.

౬

తొలినాఁడీ యాంధ్రంబున, పలనాడే పౌరుషమున ప్రథమపురంబై
వెలిగెను; రెడ్డుల పేరులు తలచినమాత్రాన పగుల దాయల గుండెల్.

---

# ప్రేమపుష్పాంజలి

## దేవగుప్తపు విశ్వేశ్వరరావుగారు

(శ్రీ నవ్య సాహిత్య మండలి)

'సత్యం శివమ్ సుందరమ్'

జాతి మత వివక్షత లేక అందరిని సమానముగ ప్రేమింపుము. ఈశ్వరునికి సర్వజాతులును సమస్తమాన వులును సమానులే. ఆత డందరిని సమానముగ ప్రేమిం చును. అట్లే మానవులు జాతిమత వివక్షత లేక జీవకోటి నంతటిని ప్రేమించవలయును.

—బైబిల్

ప్రేమ నెరుగని కఠినులు తమకొరకు మాత్రమే జీవిం తురు. ప్రేమపూరితమైన పవిత్రహృదయకులు స్వార్థ మును గణింపరు. ఆత్మ ఎట నుండునో ప్రేమ అట నుండును. ప్రేమలేక అయ్యది ధూళితుల్యము.

—కురల్

మీశత్రువులను ప్రేమించి మిమ్ములను బాధించు వారికొరకు ప్రార్థింపుడు—

—క్రీస్తు

ప్రేమ కుసుమములు జీవితవనము నలంకరించును.

? ? ?

బుద్ధి విఫలమైనకడ ప్రేమ విజయమునందును.

—రామతీర్థులు

సుందరమగు వస్తువు సంతతానందదాయకము.

—కీట్సు

వివిధాలోచనములకు, వివిధవాంఛలకు, వివిధములగు వేడుకలకు ప్రేమయే మాతృస్థానమును వహించు చున్నది. గంభీరాలోచనములు, వివిధ మనోవాంఛలు, వేడుకలు, క్షణభంగురమగు నీ మానవజీవితమునుఉత్కృ ష్టాశయ పరిపూర్ణముగ నొనరించునవేవియైనను - ప్రేమావిర్భావమునకే. ఆ పవిత్రాగ్ని ప్రజ్వరిల్లజేయుట కివన్నియు దోహదములే.

—బేకన్ ఫ్రాన్సిస్

ప్రేమ యుదారములగు నుపకృతులకు జూపు కృత జ్ఞతకాదు; తురీయగుమ జ్ఞానము నెడ జూపు యెప్పు గాదు; అకలంకమగు పవిత్రతకు జూపు గౌరవము గాదు; అమోఘమగు దైవనిర్ణయమునకు జూపు విశ్వా సముగాదు; ప్రభునియాజ్ఞకు జూపు వినయముగాదు; హానికరముగాని సత్యమునకు జూపు సమ్మతిగాదు. వినమ్రత, అకలంకవిశ్వాసము, కృతజ్ఞత, గౌరవము- ఇట్టిభావములకన్న ప్రేమ అతినిర్మలము, అతిపవిత్రము, అతివిశాలము, అత్యాకర్షణీయము, అతిమోహనము.

—మహర్షి వేంకటరత్నము

ధనాశచేతనా నన్ను ప్రేమింతువు? అట్లయిన నన్ను ప్రేమింపవలదు. గంభీరుడును, విస్మయాస్పదు డును నగు సాగరుని ప్రేమింపుము. అందలి ధనరాసులు నాయందలి ప్రేమకంటె గణనీయములు.

—ఒక గేయ శకలము

విశ్వము ప్రేమజన్యము. సూర్యుని జన్మరహస్యము, అసంఖ్యాకములగు నక్షత్రము లభ్రవీధి నెప్పుడు వెద జల్లబడెనో ప్రేమమాత్రమే ఎరుగును. దుఃఖమృత్యు భూయిష్ఠమయ్యు జీవిత మెట్లు సౌఖ్యకరమో బ్రతు కెందులకు తీపియో ప్రేమయే నిర్వచించగలదు.

—రాబర్ట్ బ్రిడ్జిస్

ప్రేమ, పరమసత్యానుభవము కలిగి వానిని ప్రక టింపగలుగువాడు కవి. సత్యములో పరమసత్యము ప్రేమ.

—బెయిలీ

సామాన్యమందిరమును స్వర్గతుల్యముగ మార్చ గలుగునది ప్రేమప్రభావమే.

—ఛాసర్

తన సృష్టిని ప్రేమించువారిని పరమేశ్వరుడు ప్రేమించును.

—ఆస్కార్ వైల్డ్

సంఘము, స్నేహము, ప్రేమ - యివి మానవుల ఆనందమునకై భగవత్ప్రసాదములు.

—విలియం కౌపర్

నాశనరహితమగు ప్రేమ పవిత్రకణము లనవరతము దేదీప్యమానముగ ప్రకాశించుచుండును. ఇది స్వర్గము నుండి దిగి మరల స్వర్గమునకే మరలును.

—సౌదే

ఎవ్వడు భగవత్సృష్టియందలి సమస్తజీవులను నిర్మలముగ ప్రేమింతురో వారిని భగవంతుడు గాఢముగ ప్రేమించును. ఏలనన, భగవంతుడు తనచే నిర్మితమైన సమస్త సృష్టిజాలమును సమానముగ ప్రేమించును.

—కాలరిడ్జి.—"Ancient Mariner"

ప్రేమదానంబు ప్రేమను వృద్ధిజేయు;
ప్రేమచే వీచుఁబవనుండు పృథివియందు;
ప్రేమచే బూవులెల్ల బరిమళించు;
ప్రేమచేఁ గొగలించు వార్ధిని నభంబు;
ప్రేమచే గాంతినిచ్చు నీరేజసఖుడు;
ప్రేమచే శిలయును మంచురీతి గరగు;
ప్రేమచే స్వర్గమర్త్యముల్ వెలయు నొకట;
ప్రేమకాంతిని విశ్వంబు వెలుఁగుచుండు;
ప్రేమవిజయముఁ గీర్తించు విహగతతులు;
ప్రేమగానంబుచే నభోవీధి మ్రోగు.

షెల్లీ—(జొ. స.) "(మావారు పతనము.)"

ఎన్నడును ప్రేమింపకయే యుండుటకంటె, ప్రేమించి తనప్రేమావలంబమును పోగొట్టుకొనుటయే మేలు.

—టెనిసన్

ప్రేమించువానికే దండించు నధికార మున్నది.

—టాగోరు

సంపూర్ణజీవనమునకు ప్రేమ అత్యావసరము. జీవన్ముక్తులను కాగోరితిదుని ప్రేమోన్మాదులను కావలయును.

—ఏమియల్

ఈశ్వరునియందు భక్తికలిగి మానవునియందు ప్రేమలేక యుండుట అసంభవము. మానవుని ప్రేమింపక ఈశ్వరుని ప్రేమించినటుల నగపడువారు కపటవేషధారులు. మానవకోటిని ప్రేమింపవలయును.

—మాజనీ

అన్నిమతములకును ప్రేమయే గమ్యస్థానము. సర్వమతములకును ఆధారము ఆదర్శముకూడ ప్రేమయే. ప్రేమలేనిది మతమేలేదు. ప్రేమలో నిండియున్నపుడే మనలనును మత దైవముతో ఐక్యసంధాన మొనర్చుచున్నది.

—శ్రీ ఓంకారస్వామి

చిత్కలానంద కలికా ప్రేమరూపా ప్రియంకరీ ప్రాణేశ్వరీ.

—లలితాదేవి స్తోత్రము

"కమ్మని.తావిగ్రమ్మెడి పువ్వునిచయము ప్రేమెకా! అదిలేక మంకెనకెంపు కాంతల యందము."

"ప్రేమ కలుగక బ్రతుకు చీకటి"

"మరులు ప్రేమని మది దలంచకు
మరులు మరలును వయసుతోడనే,
మాయమర్మము లేని నేస్తము
మగువలకుమగవారి కొక్కటె
బ్రతుకు సుఖముకురాజమార్గము."

—గురుజాడ అప్పారాయకవి

"ప్రేమ యాధ్మాత హృదయంబె వ్యోమ మయ్యె
దానియుచ్ఛ్వసితమె జగత్ప్రాణమయ్యె
ఊర్పుటావియె తేజమై యుజ్జ్వలించె
నంబువయ్యెను బాష్పకణంబె యగును.
వ్యక్తమయిన ప్రేమ రసార్ణవంబునందు
కాలకర్మ స్వభావయోగమునఁజేసి
కరడుగట్టిన పయిపాలు గట్టిపడఁగ
ధాత్రియయ్యెను జగదేకధాత్రి ప్రేమ."

—జనమంచి వేంకటరామయ్య

'సౌరభము లేల జిమ్ము పుష్పవ్రజంబు?
చంద్రికల నేల వెదఁజల్లు జందమామ?
ఏల సలిలంబుపాఱు? గాడ్పేలవిసరు?
ఏల నాహృదయంబు ప్రేమించు నిన్ను?

—శ్రీ కృష్ణశాస్త్రి

"—ఁవమృణాళనాళ మధురాన్నము భుజించు
నోట ప్రేమ సందేశముల్ నుడువదగును"

కొడాలి

"ప్రకృతిమార్దవ పూర్ణశోభలను దెలిపి
పురుషుని విభూతి గుణయోగమును వెలార్చి
పరమశుచియైన ప్రేమప్రపంచమునకు
నడుచు మార్గము మఱల నేర్పడునె సకియ!"

—రాయప్రోలు సుబ్బారావు

"ప్రియేషు సౌభాగ్య ఫలాహి చారుతా."

—కాళిదాసు

"...జరసా యస్మిన్నహార్యో రసః। కాలేనావరణాత్యయాత్పరిణతే యత్ప్రేమసారే స్థితం । భద్రం తస్య సుమానుషస్య కథమప్యేకం హి తత్ప్రార్థ్యతే॥"
"అంధే తమసి విధురో మజ్జతీ వాంతరాత్మా"

—భవభూతి

త్వమసి మమ భూషణం-త్వమసి మమ జీవనం
త్వమసి మమ భవజలధిరత్నం—
ప్రియే చారుశీలే-ప్రియే రమ్యశీలే !

—శ్రీ జయదేవుడు-అష్ట(గీత)పదులు.

ప్రకటింపఁబడని ప్రేమయే అతిపవిత్రమైనది.

సౌఖ్యముకాదు మనము ప్రేమింపవలసినది. ఈశ్వరుని ప్రేమించవలయును.

—కార్లయిలు

ప్రేమస్వర్గమునకు మార్గము.
ప్రేమ ఎట నుండునో ఈశ్వరు డట నుండును.

—టాల్‌స్టాయి

ప్రేమ ఆత్మగుణము; ఆత్మస్వరూపము. ప్రేమ బలమునందు మనకు విశ్వాసమున్నచో నద్దానిమూలమున నీ సమస్తప్రపంచమును నుఱ్ఱూతలూగింపఁ గలుగుదుము. ప్రేమలక్షణము నవగాహనము చేసికొనిన ప్రేమపూరితుడే పరమాత్ముని తెలిసికొనగలడు.

—శ్రీ గాంధీ మహాత్ముడు

# హైందవ సతీత్వము

శ్రీమతి సుమతీ దేవిగారు

చంద్రచంద్రికలకుఁ గల సంబంధము, మేఘమునకు మెఱుపుఁదీఁగకును గల సాహిత్యము, ఎండకును నీడకునుగల నైరంతర్యము, పూగుత్తికిని నెత్తావికిని గల అవినాభావము, వాక్కునకు నర్థమునకుఁ గల ఇమిడిక, ప్రకృతి పురుషులకుఁ గల ఉత్పాదనశక్తి, హైందవులగు సతీపతులందు వ్యక్తమగుచున్నది. ఇందులకు నిదర్శనము శివా శివులు. వీరు భారతీయుల కిష్టదైవములై గార్హస్థ్యతత్త్వమును ప్రదర్శించిరి. శివుఁడు గిరిజ కర్ధశరీరము నిచ్చి ఆమెను భిన్నత్వమునుండి ఐక్యతత్త్వమునకుఁ బ్రాపింపఁజేసినాఁడు. తన్నుగా వలచిన సతీమఁణికిఁ దాన దైవ మ నన్నాఁడు. తానుబ్రీతిమెయిఁ బరిగ్రహించిన స్త్రీరత్నము దేవి యేల కాకుండును? పంచేదారకును దీపికిని ఎట్లవినాభావసంబంధము స్ఫుటమో, అట్లే దేవీదేవులును గదా! ఇచట ఉపకారోపకారక భావములు ఉభయాశ్రయములు. అట్లే స్వామిభృత్యభావములును, పోష్యపోషక భావములు నని శివుఁడే తన ధక్కను మ్రోయించెను. అయిన నిఁక ఉపాస్యమెద్ది? అదియు నన్యోన్యమే యని పరమశివుఁడు మొదలు మహాపురుషుల అనుభవములు సువ్యక్తములు. అనఁగా సతికిఁ బతి ఉపాస్యవస్తువు, ధ్యేయము. పతికిని సతియే సమారాధనీయ. ఈ యభిగమ్యద్వారములనుండియే పరమప్రాప్యసంసిద్ధి. ఇఁక నిటఁ దారతమ్యమేమి? అను ప్రశ్న కవకాశము లేదు. సామర్థ్యము (శక్తి) లలో న్యూనాధిక్యములన్యోన్యము సంవర్ధనీయములు. కాని ఆ తారతమ్యమును బురస్కరించుకొని ఒకవస్తువు గర్హ్యము కాదు. ఇది హిందూవివాహములలో సతీపతులకుఁ గల పరమలక్ష్యము. దీని ననుసరించియే వివిధకార్యకలాపములు విభజింపఁబడినవి. ఈ తత్త్వమే ఖండాంతరవాసులచేఁ గూడ జోహారు పెట్టించినది. నేఁటికిని భారతీయుల పూజ్యత ఇందే యుపనిబద్ధము. ఈ పరమతత్త్వమున కాదర్శప్రాయులైన శివాశివులకును, దాని నాచారమని సిద్ధాంతీకరించిన వేదద్రష్టలగు ఋషులకును వేయి నమోవాకములు. ఈ యాత్యంతిక సంబంధమునే వధూవరు లాసించవలసినది.

సతీపతుల యైక్యతను ఋగ్వేదములోని రెండుమంత్రములిట్లు చెప్పుచున్నవి. అందు వరుఁడు పత్నీకరగ్రహణము చేసిపలుకుచున్నాఁడు:—

“గృష్ణామి తే సౌభగత్వాయ హస్తం
మయా పత్యా జరదష్టిర్యథాసః
భగో అర్యమా సవితా పురన్ధి
ర్మహ్యం త్వాదుర్గార్హపత్యాయ దేవాః”

(సౌభాగ్యము పొందుటకై నీ పాణిగ్రహణమును చేయుచున్నాను. నాతోడనే నీవు వృద్ధురాలవయ్యెదవు. నేను గృహపతిని గా వలయునని భగుఁడు, అర్యముఁడు, సవిత, పురంధి, అను దేవతలు నిన్ను నా కొసఁగినారు.)

తరువాత వరుఁడు ఇట్లు కోరును:—

"సమఞ్జన్తు విశ్వేదేవాః
సమాపో హృదయాని నౌ,
సమ్మాతరిశ్వా సన్ధాతా
సముదేష్ట్రీ దధాతు నౌ".

భాష్యానుసారార్థము:—"విశ్వేదేవతలు మా వధూవరుల హృదయములను దుఃఖములు లేకుండఁగాఁ జేసి లౌకిక వైదిక కర్మలలో ప్రకామముతోఁగూడుకొన్నట్లు చేయుదురుగాక! ఉదకములును మమ్ము ఎక్కువ రంజింపఁజేయునుగాక ! వాయువు మా హృదయములకు ఐక్యమును గూర్చునుగాత! మా బుద్ధులు పరస్పరము అనుకూలముగా నుండునట్లు చేయునుగాక! బ్రహ్మ, ఫలముల నిచ్చు సరస్వతియు మాకు సంధాన మొనరింతురు గాక!"

సతీత్వ పతిత్వములలో మనకుఁ బ్రస్తుతము సతీత్వముగాన నించుక విచారింతము. దైవస్వరూపులగు తలిదండ్రులచే బాల్యము నుండి సుశిక్షితలై వరునకు దానము చేయఁబడిన కన్యలే సతులని పిలువఁబడుదురు. అట్టి సతులయొక్క ధర్మము సతీత్వము— లేదా పాతివ్రత్యము. అనఁగాఁ బతియే తమ జీవనసర్వస్వమని మహావ్రతము నవలంబించి దానిని పాలించుట. స్త్రీలొనరించెడు వ్రతములలో నిక్కెల్ల నిదియే మొదటఁ జేర్పఁదగినది. స్త్రీ వయస్సునఁ జిన్నదగుటచే(పురుషునికన్న) సమగ్రముగా ధర్మములనెఱిఁగి యుండదు. అపుడు వయోఽధికుఁడగుటయేగాక జ్ఞానజ్యేష్ఠుఁడునగు పతి ఈమెకుపదేష్ట. ఆయనఆజ్ఞలను భక్తిశ్రద్ధలతో నారీతిలకము పాటించి, ఆతని సుబోధామృతమును గ్రోలి ధన్యయై అతఁడు చూపిన సన్మార్గములలోనే నడుచుచునుండి భర్తయే దైవమని ఉపాసించిన స్త్రీ తన సతీత్వమును కాపాడుకొన్న దగును.

"యస్య భార్యా శుచి ర్దక్షా
భర్తార మనుగామినీ,
నిత్యం మధురవక్త్రీ చ
సా రమా న రమా రమా."

(పవిత్రతను, నేర్పును గలిగియుండి భర్తననుసరించుచు మధురముగా మాటలాడుచుండెడి స్త్రీయే లక్ష్మిగాని లక్ష్మి లక్ష్మి గాదు.) పూర్వకాలమున సీత, సావిత్రి, చంద్రమతి మున్నగు స్త్రీలు తమ సతీత్వమువల్లనే మహాకార్యము లొనర్చి చిరస్థాయియగు కీర్తినిబడసి ఇహపరలోకములలోఁ దమజీవితమును చరితార్థముఁ జేసికొనిరి. సతికిఁ బతి కంటె వేఱైన దైవము లేదు. వరునిగృహమే సతికి దేవాలయము. ఆతనిసేవయే ముక్తి

హేతువు. ఆయనవాక్పరిపాలనమే తన సౌఖ్యమునకును శాంత్యానందములకును నిలయము. వివేకానందస్వామి శిష్యురాలగు "సోదరి నివేదిత" అనునామె హిందూసతీత్వమున కచ్చెరువొంది భక్తి గౌరవము లొక్కుమ్మడి నతిశయింప నిట్లు పలికినది.

"యూరపులోని వనిత దేవాలయమున కేఁగుటయు, హిందూదేశములోని సతి పతిగృహమున కరుగుటయు నొకటి ."

పై వాక్యమువలననే భారతసతులకుఁ బతివిషయమునఁగల పవిత్రత, దైవభావము, ఆజ్ఞాపాలనావశ్యకత మున్నగు నెన్నియో విషయములు బుద్ధ్యారూఢము లగుచున్నవి. ...పవిత్రమగు హైందవసతీత్వ తత్త్వమును గ్రహించి నా సోదరీమణులు భారతౌన్నత్యమునకు హేతుభూత లగుదురుగాత ! యని ప్రార్థన.

---



భార్య:—మీరిలా తాగి సర్వనాశనం చెయ్యబట్టే కంటికి దమ్మిడీ కనబడడం కష్టంగా వుంది.

భర్త:—(మత్తుచేత తూలుతూ కాళ్లీడ్చుకుని జేబులోంచి డబ్బులు రాలుస్తూ), త-త-త-తాగుతేనే—రు-రు-రు-రూపాయిలు—జ.జ-జ- జలజల రాల్తాయి.

# బాల్యమిత్రుడు

(గత సంచిక పుట ౫౪౪ తరువాయి)

భోగరాజు పేరాజుగారు

౪

మరునాడుదయాన్నే శ్యామం జమీందారును కలుసుకున్నాడు. తన స్నేహితుడు రామయ్యనాయుడని ఒకరు "రైటువే"లో హెడ్డుగుమాస్తాగా వున్నారనీ, అతడి ఆఫీసులో ఒక ఖాళీ యిరవైఅయిదు రూపాయిలమీద సంవత్సరంవరకూ వుందనీ, పని బాగాచేస్తే తరువాత ఏబది రూపాయిల జీతంమీద వేసుకుంటారనీ చెప్పాడు.

శ్యామం నిట్టూర్పు విడిచాడు—"యింత కొద్ది జీతంతో గడుపుకోవటం కష్టం. మా యింట్లో రోజుకు ఒకరూపాయకు తక్కువ సరిపోదు. యింకా చాకలి, మంగలిఖర్చు వేరే కావాలి." అన్నాడు.

జమీందారు—ఆఫీసులో అంతకంటే ఎక్కువ యివ్వరు. యింకా చాలా చోట్ల ప్రయత్నించాను గాని ఎక్కడా దొరకలేదు. సరే! మీ కొకపని చేయండి. యిది మా అక్కగారిల్లు. నా మేనల్లుడికి తెనుగు చెప్పే మాస్టరు ఒకడు కావాలి. నెలకు పదిరూపాయిలు యిస్తారు. ఇది మీ కిష్టమయితే వప్పుకోండి. సాయంత్రం 6 గంటలనుంచి 9-30 వరకూ చెప్పాలి రోజూను.

శ్యామం—"యిష్టమే" నన్నాడు.

జమీందారు—మీకు యింట్లో గడవటం ఎట్లాగ? యీ జీతాలు నెల అయ్యేవరకూ రావుగా!

శ్యామం—"అదే నేనూ ఆలోచిస్తున్నాను." అంటూ ఉదయం దాసీ చెప్పిన కథంతా చెప్పి "అందులోనుంచి ఏమైనా దాసీవద్ద పుచ్చుకొని జీతాలు వచ్చేవరకూ గడుపుకోవాలి" అన్నాడు.

జమీందారు—అట్లా అప్పుచేయ నక్కరలేదు. నే నొకవిధం చెపుతా నట్లా చేయండి. రేపు మీరు ట్యూషను చెప్పటానికి వచ్చినప్పుడు మా అక్కగారివద్దనుంచి ఒక రూపాయి తీసుకువెళ్లండి. యిట్లాగే ముప్ఫైరోజులూ, రోజు కొక రూపాయి చొప్పున తీసుకువెళ్లండి. నెలఅయి మీ జీతం వచ్చాక యిరవైఅయిదులోనూ, యిరవైరూపాయి లిస్తే ఆమె బాకీ తీరిపోతుంది, మీకు రావలసిన పదిరూపాయిలూ పోను. మిగతా అయిదురూపాయిలూ అయిదు రోజులకి సరిపోతాయి. తరువాత మళ్లీ రోజుకు ఒక రూపాయిచొప్పున నెలయ్యేవరకూ తీసుకువెళ్లి మీకు రావలసిన పదీ పోను మిగతా పదిహేను యిచ్చేయండి. యిట్లాగే ఆరునెలలు చేసేసరికి మీకు అప్పుచేయవలసిన అవుసరం లేకుండాపోతుంది. యీ యేర్పాటు మీబాగుకే చేశాను. వేరుగా భావించకండి.

శ్యామం—అట్లా అనుకోను. మీరు ఏదిచేసినా నామంచికొరకే; నాకింత ఉపకారంచేసిన మీకుర్రాడికి చదువుచెప్పి డబ్బుపుచ్చుకోవటం మంచిపనికాదు. అయినా తప్పకవచ్చినప్పు డేమిచేస్తాను లెండి.

జమీందారు—"మీరట్లా అనబోకండి. ఆ రూపాయిలు మేము ఎవరికైనా యిచ్చేదే! మేము మీకు వూరికే యివ్వటంలేదు. పనిచేసి పొందుతున్నారు. తప్పేమిటి? సరే రేపు రండి! మిమ్మల్ని ఆఫీసులో ప్రవేశపెడతాను" అన్నాడు. మరునాడే వెళ్లి శ్యామసుందరుడు ఆఫీసులో జాయిను అయ్యాడు.

౫

ఆఫీసులోని హెడ్లుక్లర్కు రామయ్యనాయుడి వయస్సు నలభైఅయిదువరకూ వుంటుంది. కాని రిజిస్టరు దాఖలా ముప్ఫైఅయిదే. యజమానుడికి అతడంటే పరమ విశ్వాసం. అతడికి కొంచెం త్రాగుడు అభ్యాసం వుంది. ఆఫీసులోకి వచ్చేటప్పుడు ఒక సీసాలోతెచ్చి ప్రయివేటురూములో పెట్టుకొని కొంచెము త్రాగి ఆఫీసులోకి వస్తుంటాడు. తిరిగి నీరసంగా ఉన్నప్పుడల్లా

ఆ గదిలోకి వెళ్లి త్రాగి మళ్లీ వస్తూవుంటాడు. అది అందరికీ తెలిసిన రహస్యమే. పదినెలలు బాగానే గడిచాయి. మొదట్లో ఎడతెరిపిలేని ఆ బండపని బొండలాగ శ్యామాన్ని చిక్కులుపెట్టినా గతం ఆలోచించుకుని విచారపడటానికీ, సారా దుకాణందారి పట్టకుండా వుండటానికీ అదే ఆధారం అయింది. సాయంత్రం ఆఫీసునుంచి రాగానే కాళ్లూ చేతులూ కడుక్కొని, విశ్రాంతి అయినా లేకుండా ప్రయివేటు చెప్పటానికి వెళ్లేవాడు. ఆఫీసులోకి వెళ్లేటప్పుడుప్రక్కనే వున్న సారాదుకాణం కొన్నాళ్లపాటు అతనిదృష్టిని ఆకర్షించేది, కాని జేబులో చేయిపెట్టుకుంటే దమ్మిడీ అయినా కనుపించేదేలేదు. యింటివద్దనుంచి తెద్దామనుకుంటే పిల్లల చినిగిపోయినగుడ్డలూ, భార్య చిరుగులచీరా చూశి తీసుకోవటానికి సిగ్గుపడేవాడు. యింకా కొన్నిరోజులు గతించేసరికి దుకాణం ప్రక్కనుంచే వెడుతున్నా, దుకాణం లేనట్లే తలిచేవాడు.

పదినెలలబట్టీ యజమాని వాత్సల్యంతోటే చూశేవాడు. కాని కొన్నివారాల్నుంచీ ప్రతిచిన్నతప్పుకీ విసుక్కుని శ్యామాన్ని చీవాట్లు పెడుతున్నాడు. కారణం ఏమిటో అతనికి అర్థంకాలేదు. ఆఫీసులో గుమాస్తాలలో సుందరంతో యితడికి బాగా స్నేహం. అత డొకరోజున అన్నాడు—"యీ మధ్యను జమీందారు ఎప్పుడైనా వచ్చాడా?"

"ఆఁ వచ్చాడు."

సుందరం—దానిఫలితమే యిది. నీవు మొన్న అతడు వచ్చినప్పుడు మన మానేజరుగారి మందునీసా ప్రమేయం ఎత్తావుటకాదూ? అత డీయనతో చెప్పివుంటాడు.

శ్యామం—నేనేం చెప్పలేదే. అతడే అడిగాడు. నేను లేదన్నాను.

సుందరం—"అది చాలు. దానికే చిలవలూ, పలవలూ అల్లివుంటారు. దీనికి ఒక వుపాయం వుంది. అట్లా చేయి. మేము ప్రతి ఆదివారమూ సాయంత్రంపూట మానేజరు యింటికి వెడుతూంటాము. నీవుకూడా వస్తూవుండు. యిచ్చకాలకి రోజులివి!' అన్నాడు.

తరువాత ప్రతిఆదివారమూ శ్యామం నాయుడు యింటికి వెళ్లేవాడు. రెండువారాలు బాగానే వున్నాడు మేనేజరు. మూడవ వారము ఏదో పనివుండి వెళ్లలేదు. మరునాటినుంచీ మళ్లీ మండిపడుతున్నాడు మానేజరు.

మరునాడు మళ్లీ సుందరం చెప్పాడు—"నీవు ఎక్కడో అన్నావుట లేదూ! మాఆఫీసుస్టాఫంతా త్రాగి తందనా లాడుతామని. దానిఫలితమే యిది. నేను నీతరపున యజమానితోటి చాలా మాట్లాడాను. గాని అతడు వినుపించుకోలేదు. అతడిమాటే అతడికి. నీవు వారి అనుమానం పోగొట్టడానికి అతడియెదట రెండు గుక్కలు త్రాగితే నిన్ను నమ్మతాడట; లేదా నీ వుద్యోగం యింతటితోటి సరియేనట. ఏదో సమాధానం చెప్పు. నేను నీవు నామాట వినకపోవనే ధైర్యంతోటి మేనేజరు ఒక్కడే వుండగా త్రాగుతావని చెప్పాను."

శ్యామానికి ఏమి జవాబు చెప్పటానికీ తోచలేదు. ఉక్కిరిబిక్కిరి అయి చివరకిసరే "రేపు చెపుతానులే" అన్నాడు. ప్రయివేటుకు వెళ్లి వచ్చి భోజనం చేయటానికి యిష్టంలేక ఆకలి లేదని పడుకున్నాడు. వసుమతి పిల్లలకుపెట్టి తాను తనకుండా భర్తవద్దకు వచ్చింది. భర్త ఆమెతో వున్న స్థితిగతులన్నీ చెప్పాడు.

ఆమె అంది. "మీరు ఎన్నోప్రయత్నాలు చేశి యిప్పటికి మానగలిగారు. ఒక్కసారి దాటితప్పారా, మిమ్మలను మీరు ఎన్నటికి సవరించుకోలేరు. ఉద్యోగం పోయినా సరే! మీరు మాత్రం త్రాగవద్దు."

శ్యామం—నేను బ్రహ్మచారి నయితే ఎట్లాగో ఒకలాగ కాలం గడిపి వుందును. గాని పిల్లలూ, నీవూ అందరం ఎట్లా బ్రతుకగలము?

వసు—లేదు, లేదు. అందుకు మీరు విచారపడకండి. నారు పోశినవాడు నీరూ పోస్తాడు. త్రాగనని చెప్పెయ్యండి. నౌఖరీ పోయినా సరే.

సుందరం అడగటానికి వచ్చినప్పుడు త్రాగనని చెప్పేశాడు శ్యామం.

౬

ఆరోజు సంక్రాంతి. వూళ్లో అంతా పండుగ చేసు కుంటున్నారు. శ్యామసుందరాన్ని యజమాని "నీ వుద్యోగం నేటితో సరిపోయిం" దని చెప్పాడు నిన్ననే. నిన్నటితో నే యింటి నిమిత్తం చంద్రశేఖరం యిచ్చిన సంవత్సరపు వాయిదా పూర్తి అయింది. యివ్వాళో రేపో లేచిపొమ్మని నోటీసు వస్తుంది. ఏ చెట్టుక్రిందనో నిలవబడాలి. ఎంత ఐశ్వర్యంతో బ్రతికిన వాడికి ఎంతగతిపట్టింది ? యింతలో పిల్లలు "నాన్నా! యివ్వాళ పండగట. కొత్త గుడ్డలు కొని యియ్యవూ ?" అని అడిగారు. ఏం సమాధానం చెపుతాడు ? చిన్న కుర్రాడు "అమ్మా! ఏమైనా కొనుక్కొంటాను, నాకో కానీ యియ్యవూ ?" అన్నాడు. ఏం సమాధానం చెపుతుందా తల్లి ? భార్యాభర్తలిద్దరికీకళ్లు, నీరు తిరుగు తున్నాయి. దుఃఖము ఆగటం లేదు.

యింతలో క్రిందనుంచి చంద్రశేఖరంనౌఖరు కేక వేశాడు. "బాబుగారూ ! వుత్తరం యిచ్చారు" అంటూ.

శ్యామం దిగివెళ్లి సంతకంచేశి కవరు చేతపట్టు కుని పైకి వచ్చాడు. మంచంపైన కూర్చొని కవరు విప్ప బోయినాడు. చేతులు వణుకుతున్నాయి.

యింతలో వసుమతికూడా "ఏమి టా వుత్తరం ?" అంటూ భర్త దగ్గిరికి వచ్చింది.

"ఏముంది ! యింటినుంచి లేచిపొమ్మని యిచ్చి నట్లున్నాడు చంద్రం నోటీసు." అంటూ కవరు చింపి కాకితం పైకి తీశాడు. అందులో ఉత్తరం తోటిపాటు ఒక చెక్కు శ్యామసుందరంపేర 13 వేల చిల్లరకి యింపీరియల్ బ్యాంకి పేర వుంది. అది కాకితానికి పిన్నుతో గుచ్చబడీ వుంది.

తన పేరట చెక్కా ! శ్యామానికి మూర్ఛ వచ్చి నట్లయింది. వసుమతి నీళ్లు తీసుకువచ్చి చల్లి తెలివి వచ్చాక "ఏమి టా వుత్తరంలో" అని అడిగింది.

చెడ్డకబురేం కాదు. అంటూ ఆ వుత్తరం అంతా చదివి ఆమెకు వినుపించాడు.

"శ్యామం !

మన స్నేహము చిన్నప్పుడు ఎట్లా వుండేదో యిప్పుడూ అల్లాగే నిలిచి వుంది. గాని కొన్ని అని వార్యమైన కారణాలవల్ల నేను కాఠిన్యం వహించక తప్పలేదు. నీతండ్రి చచ్చిపోయాక నీవు త్రాగుడు మొదలుపెట్టావని తెలుసుకుని నిన్ను అనేకసార్లు మంద లించాను. గాని నీవు వినుపించుకోలేదు. తరువాత ఋణదాతలు తొందరచేయగా, నీవు నావద్దకు అప్పుకు వచ్చావు. నా దగ్గిర తనఖాపెట్టి మళ్లా యిం కొకళ్లదగ్గిరకూడా పెట్టకుండా వుండటంకోసరమే నేను నీచేత స్వాధీన తనఖా వ్రాయించుకున్నాను. ఆ అయిదేళ్లు నీ ప్రవర్తన కనిపెడుతూనే వున్నాను. గాని ఏమీ మారలేదు. కాని యింత అంధకారం లోనూ, నీలో మిగిలివున్న జ్యోతి ఒకటి కనుపిస్తోంది. అదే నీభార్యా పుత్రాదులమీది మమత. నీభార్యా పిల్లలు అన్నంలేకుండా బాధపడినప్పుడుగాని, నీమ నస్సు మారి సరిఅయిన దారిలోకి రాదని నిశ్చయించు కుని యిట్లా చేశాను. నా వుపాయం నెరవేరింది. జమీం దారుగారి సహాయాన నీవు మంచిదారికి వచ్చావు. అతడు నా ప్రాణస్నేహితుడు. ఆతనిని నేనే కోర్టుకు పంపాను. కుర్రాడికి ప్రయివేటు చెప్పటం అనే పేరుతో నిన్ను రాత్రి తొమ్మిదిన్నరవరకూ అక్కడ ఆపి వుండేటట్లు చేశాను. తొమ్మిదిగంటలకు ఊరిలో దుకాణాలన్నీ మూసివేస్తారు. యింతవరకూ నేను వేశినప్లాను బాగానే సాగింది. గాని యిది పూర్తిగా నిలుస్తుందో లేక డబ్బు చేతికి రావటంతోటే తిరిగి

మామూలు దారిన నడుస్తావో పరీక్షకోసరం, మేమిం కొక దారి తొక్కాము. దానిఫలితమే, రెండుగ్రుక్కల సారాయి త్రాగితే వుద్యోగం వుండటమూ, లేక పోతే, తీసివెయ్యటమూను. దీనిలో కూడా నీవు వుత్తీర్ణుడ వయినావు. యిందులో మానేజరు ఒక ఉప లక్ష్యము మాత్రమే. నేటికి నా ప్రయత్నం తుదనెగ్గింది· నీవు మంచిదారికి వచ్చావు. నేను నీవద్దనుంచి నీ యిళ్లు తీసుకున్న కొద్దిరోజులకే, ఆ రెండు యిళ్లూ హెచ్చు ధరకే అమ్మగలిగాను. నా బాకీకి నీవువ్రాసిన ప్రకారం రూపాయివడ్డీ తీసుకోకుండా, బ్యాంకులో వచ్చేవడ్డీ ప్రకారమే తీసుకోగా నీకు యింకా పన్నెం డువేలు మిగిలాయి. అసలు, వడ్డీ చేరగా అయిన మొత్తమే యీగోజున నీకు చెక్కు పంపాను. నేను నాడబ్బుకు వడ్డీ లేకుండా అసలు తీసుకుందామను కున్నాను. గాని నీ ఆత్మసమ్మానానికి నష్టము కలగకుండా వుండటము కోసరమే, నేను వడ్డీ తీసు కున్నాను. నీవు కాపురమున్న యిల్లు నీదే. దస్తావేజు నీవు అడిగినవెంటనే వ్రాసి యిస్తాను. నా పత్రముపైన సొమ్ము పూర్తిగా ముట్టినట్లు చెల్లు వ్రాశాను. నీవు యీ డబ్బుతో వ్యాపారం చేయి. అది నీ తాతలనాటి వృత్తి. యిదివరకు నీకు అనుభవం కూడా వుంది. వృద్ధిలోకి రావచ్చును. లేదా నౌఖరీ చేయదలచుకుంటే తిరిగి ఏభైరూపాయిల జీతం యిస్తారు. అక్కడే ప్రవే శించవచ్చును. వర్తకముచేయటం మంచిదని నా అభి ప్రాయం. నేను స్వయంగా వచ్చి మాట్లాడదా మను కున్నాను. గాని వుత్తరం వ్రాయటమే మంచిదని యిట్లా చేశాను. మీరు సాయంత్రం పిల్లలను తీసుకుని మాయింటికి రాగోరుతాను.

నీ మిత్రుడు

చంద్రం."

ఆ రోజు సాయంత్రం వసుమతి శ్యామసుందరులు బండిమీద పార్థసారథిస్వామి దర్శనానికి వెళ్లారు. తిరిగి వచ్చేటప్పుడు చంద్రశేఖరునియింటికి వెళ్లారు. ఆరోజు చంద్రశేఖరం భార్య సరస్వతి వారిని అక్కడే ఆపి వుంచింది. ఆ రాత్రి ఆ బాల్యమిత్రు లిద్దరూ యిద్దరి భార్యలూ సంతోషంగా కబుర్లతో కాలక్షేపం చేశారు.

---

## బాలభక్తుఁడు

బొడ్డు బాపిరాజుగారు

అతఁడు సుకుమారగాత్రుఁ, డాకృతినిఁ గొన్న
శాంత తేజఃప్రకాశ, మీ జగము తోడి
తగుల మెఱుఁగక నమ్మ నద్వైతమూర్తి
నెడఁద నిండించి పూజాప్రవృత్తుఁ జేయు.

తలఁగని బత్తి రేబవ లితఃపర మెంచక మించు పాలబు
గ్గల పసిబాలదాసు కడకన్నుల మొల్చిన చిన్నినవ్వులోఁ
గలసి లయించిపోయిన దఖండకృథా పరికల్పిత, మ్మమం
గళనిచయమ్ము; తండ్రి వెతఁగల్గిన యూరుపు తోటిపాటుగన్.

ఆ రమణీయమూర్తి నయనాంచలరేఖల జాలువాఱు వి
స్తారదయాప్రవాహ సముదాయము లారసి యీరసమ్ము లోఁ
గూరినఁ గేలుదమ్ము లనుకోక తనంతనె దోయిలింప హృ
ద్వారము దీఱు వైరిజనవర్గములున్ సుఖతాండవమ్ములో.

కఱవఁబోయిన భయంకర భుజంగశ్రేణి
 పడగలాడించి సంబరము నెఱపు,
త్రొక్కవచ్చిన సముత్తుంగ ఘటానేక
 ములు తొండములు సాఁచి కులుకుసూపు,
మ్రింగఁ జూచిన మహోర్మిచ్ఛటామాలిక
 ఫేనపంక్తులఁ దేల్చి ప్రియమునింపు,
చంపఁజాలిన కర్కశదృఢోపలవ్రాత
 మలరుసెజ్జవితాన నాదరించు,

విసము పాయసమైయుండు, విచ్చుకత్తి
వలపు లొలికించు పూగుత్తిపోలుపుఁ గొలుపు,
ఆ మహాభక్తమూర్తియం దఖిలజగము
త్రోయగారాని ప్రణయమ్ములోన మునిఁగి!

"తనకెదురెవ్వ?" రంచు గడిదాఁటి, యథేచ్ఛ మెలంగి పోతరిం
చిన యమరారి, కిన్మనక చెప్పినచొప్పునఁ జేయుచున్న కు
ఱ్ఱని చిఱునవ్వుచూపులఁ బరాజితుఁడయ్యె; దిగీశపాళి ను
క్కన మొగసాల యూడిగముఁ గొన్న బలమ్మది యంతరించెఁబో!

గుండెలులేని క్రూరభుజగుల్ దనుజార్భకులెల్ల పుణ్యముల్
పండగ దుష్టకర్మపరివర్జితులై, హరిపాదభక్తులై
యుండుట యబ్బురమ్మె? అతఁ డూఁది వచింపని చిన్నమాట బ్ర
హ్మాండము లేలునట్టి పరమాత్మయు నూఁకొనకుండఁ దీఱునే?

ధర్మ మెఱుఁగని రాక్షసత్వమ్ము మ్రోల
నదరు బెదరును లేక సత్యాగ్రహమ్మ
తెగువ సాత్వికజయము సాధించినట్టి
నిర్మలానందమూర్తి వినీతుఁ డతఁడు!

---

# కవిస్వప్నము

గిరాజు రామారావుగారు

చైత్ర చంద్రిక లుద్యానవనమున సమీరునితో గలసి సల్లాపము లాడుకొనుచుండెను. అచ్చట నొక కవి యేకాంతమున జింతామగ్నుడై యుండెను. చింతకు గారణము ప్రేమ. కవి ప్రేమస్వరూపుడై ప్రేమోన్మత్తుడై యుండెను. అతడు తనలో దాను "భగవంతుడు ప్రేమనిధి; వాని సృష్టి యంతయు ప్రేమాగారము. ప్రేమయే మానవ జీవనసారము. ప్రేమయే స్వర్గము." అనుకొనుచుండెను. బుద్ధుని జగన్మాయాతత్త్వము వీనికి స్ఫురించుటలేదు పాపము! అయ్యది వసంతసమయము. పుష్పములు పూర్ణయౌవనము బొందినవి. సుగంధ భారముచేత పవనుడు మందముగా నుండెను. భ్రమరములు వీణాగానము ప్రారంభించెను. రసాలముల నుండి యప్పుడప్పుడు కోకిల తన సందేశముల నంపుచుండెను. కవి ప్రేమముగ్ధుడై, చంద్ర కిరణముల లెక్కించుచు, క్షణములో అర్ధ నిమీలిత నేత్రముల నేదియో కాంచుచు ప్రేమనిద్రలో మునిగిపోయెను. నిశ్శబ్దము నలుదిశల నావరించినది. కొంత కాలమునకు ప్రస్ఫుటముగా నొక సంభాషణ వాని చెవుల బడెను; కాని వాని నిద్ర యధిక మైనగొలది నింద్రియములు మరింత చురుకుగా గ్రహింప సాగినవి.

చంద్ర కిరణములు బాలికలవలె పూవుల పై నాడుకొనుచుండెను. ఒకకిరణము చంపకిని ముద్దిడికొని "ప్రపంచము ననుభవించుట నెంత సుఖమున్నది చెప్పుకో?" అని ప్రశ్నించెను. ఆ పూవు వ్యథాభరవివశాంగియై "అబ్బ! భ్రమ - అంతయు భ్రమ" అనెను.

"భ్రమరమనబోయి భ్రమ యని చమత్కారముగా త్రిప్పుకొంటివే!"

ఆ పూవు సిగ్గుచే "నూహూ" యని నిట్టూర్పువిడిచి "నాకొక చక్కని కథ చెప్పుదూ!" యని కోరెను. 'సరే'యని కిరణము ప్రారంభించినది.

చంద్రుని కొక్క కూతురు గలదు. ఆమె చంద్రుని కోమల కిరణములపై గూర్చుండి పృథ్వీపై శృంగారముల జూడ వచ్చుచుండును. ఒకప్పుడు మామిడిచిగుళ్లలోనుండి నూతన దంపతుల ప్రేమాలాపములను, ఒకప్పుడు నావపై విహారము సలుపుచు నలల కైవడి నొండొరు లైక్య మగునప్పుడు వారి హృద్వేగమును బరీక్షించుటకై పరిగిడును. మరి యొకప్పుడు కామినీ కేశముల డాగి ప్రియుని గృహ ప్రవేశమున నామె నేత్రముల జ్యోతిని, కోమల కపోలముల చుంబనమొనర్చు నప్పుడు నటించు లజ్జ నవలోకించుచుండును, అప్పుడు "ఆహా! ప్రపంచమున

నంతయు సుఖమే. ప్రేమ యెచ్చట గలదో అచ్చటే సుఖము గలదు. ప్రేమ పారావారముపగిది అనంతమైనది.'' అని యనుకొనుచు నొకనాడు తన తండ్రికడ కేగి తన సుకుమార బాహువుల వాని మెడకు జుట్టి

''తండ్రీ! నన్ను కొంతకాలము భూమిపై నుండనియ్యవు ?'' అని యడిగెను.

''అచ్చట నీవేమి చూచితివి తల్లీ !''

''ప్రేమలో సుఖమున్నదని నేర్చికొంటిని. నేను ప్రేమానుభవము బొందవలెను.''

''అయ్యయో ! ఆ వనప్రాంతమున నున్మత్తులై సంచరించు మానవుల యనుభవహీనములగు మాటలను వింటివా? మాయ, మిథ్య, మృగతృష్ణ, చలము, నిరాశ మొదలగువానికి క్రీడాస్థలము ప్రపంచము. మనుజులు మనోవికారములచే చెడ తిరుగుచుందురు. ఈ విషయమునుగూర్చి బుద్ధుని వాక్యములు చదువలేదా ?''

''అవును నాన్నా ! నిన్న భూలోకమున నొక కవి ''గంధ విహీనమైన పూలు, వెన్నెల లేని రేరాజు, ప్రేమ లేని మనుష్యుడు నొక్కటే. ప్రేమయే స్వర్గము. ప్రేమ దుఃఖమును మాన్పును. ఈశ్వర ప్రతిబింబము ప్రేమ. ప్రేమయే హృదయమును ప్రకాశింపజేయును'' అని పాడుచుండెనే! ప్రేమ యెంత మధురముగా నుండును? మానవులు ప్రేమకొరకే జీవించుచున్నారు. కావున నేను పోక తప్పదు.''

చంద్రుఁడా కన్య యున్మత్తత దెలిసికొని మర్త్యలోకమున మూడు వర్షము లుండుమనియు, ఆమె మానవ శరీరమును తాకినచో తనకు మానవ శరీరము కలుగుననియు తెల్పెను.

బాలిక యానందమున తాండవం బాడుకొనుచు, కిరణములపై గూర్చుండి క్రిందికి జారెను. మెల్లగా విహరించుచు నొక పుష్పోద్యానమున ప్రవేశించి నిశ్శబ్దమున చెవులొగ్గి వినుచుండెను. ఒక మొగ్గ మాత్రము తన్నుతా దూషించుకొనుచుండెను. ''ఇది యొక యభాగ్యపు మొగ్గ'' అని చంద్రకన్య మరియొక ప్రక్క జూచెను. ఒక భ్రమరము పూవుముఖమున గూర్చుండి ''ద్వారము తెరువుము. నేనొక ప్రేమ భిక్షుకుడ''నని బ్రతిమాలుచుండెను. ఈ వాక్యము వినునప్పటికి బాలికహృదయము చంచలమయ్యెను. 'నేనుకూడ నా ప్రియు నిట్లు పీడింతును గదా!' అనుకొనెను.

ఆమె మానవ స్పర్శకొరకొక పూవుపై గూర్చుండెను. ప్రభాత సమయమున భగవదర్పణమునకై పూవు లవసరము లయ్యెను. మానవశరీరము తగిలినంతనే చంద్రకన్య క్షణభరములో యౌవనమదయై షోడశ వర్షముల యువతి యయ్యెను. పూవులుకోయు గొల్లడు తనమనోవేగము నాపుకొనలేక చంద్రకన్యను తన కౌగిటజేర్చుకొనెను. చంద్రకన్య పాశ

బంధనమున సొమ్మసిల్లెను. అతడు 'చంద్రా!' యని, పిదప మాటాడలేకపోయెను. ఆమె కదియే పేరయ్యెను. గొల్లవాడు చంద్రాను తన కుటీరమునకు దీసికొనివచ్చెను. చంద్రా యుదాసీనయై యుండెను. గొల్లవాడది కని పట్టలేదు. అతనికి సాంత్వనవచనచాతుర్యము లేదు. ప్రేమాలాపము లాడుటయు తెలి యదు. అతడు కేవలము చంద్రాయొక్క సౌందర్యమున కచ్చెరువంది యట్టి యలౌకిక సౌందర్యరాశి యింట నున్న చాలునను కొనియె. చంద్రాను చూచి యతడు ముగ్ధు డగుచుండెను. అంతియే. ఇందులకు గారణ మాతని కనుభవము లేకపోవుటయే.

రెండు వర్షములు గడచినవి. చంద్రా యే సుఖమునకై భూలోకమునకు వచ్చినదో యది స్వప్నమునకైనను కలుగ లేదు. ఆమె జీవనము మర్త్యలోకమున నేహ్యము గా గన్పట్టెను. ఆమె వికసించిన పుష్పమును జూచినప్పుడు "ఈ పుష్పము నెవరు గ్రహిం తురో?" అనుకొనుచుండును. ఆమెకు మూడు మాసములు మాత్రము గడువు కలదు. ఒక నాడు చంద్రదేవుడు సృష్టిపై నున్మాద వృష్టి గురిపింపసాగెను. చంద్రా తాపమున కోర్వలేక పైటచే తల గప్పికొనెను. చల్లని గాలికి ఉస్సురనుచు నిజపల్లవాధర మధురస మును దిగమ్రింగుచు పూసెజ్జపై వ్రాలి "సారహీన మగు ప్రేమ నా మనంబున నేల యుత్పన్నము కావలెను? నిజముగా మానవ జీవితములో ప్రేమ యున్నదా? మనుష్యు లలో సుఖము కలదా? ఇది యంతయు ముమ్మాటికి మోసము." అని యనుకొను చున్నంతలో కోకిలశబ్దము వినవచ్చెను. "అబ్బ! ఎంతగయ్యాళివే!" యని గుప్పెడు పూలను విసరివైచెను.

ఒక రాకుమారుడు ఆ వనప్రాంతముల విహారమునకుఁ నేతెంచెను. చంద్రకిరణ ములు నదీహృదయమున జొరబడి తరంగ ముల లేపుచున్నవి. తరంగములభంగి వీని హృదయ ముప్పొంగుచున్నది. చంద్రాహృద యము మోహానానలజ్వాలల రాయి యయ్యెను. రాకుమారుని హృదయము సువాసనతోడి గాలికి వెన్నయయ్యెను. కరాళ కంతు శరవేదనకు చంద్రా కంపింప దొడంగెను. కోకిల కంఠనాదమునకు యువ రాజు దిగ్భ్రమ చెందుచుండెను. ఒకరి నొకరు చూచుకొనకయే హృదయము లను రక్తము లైపోయినవి. నదీ తీరమున-ఏకాంత స్థలమున వసంతకాలపు నిండు వెన్నెలలో- రసాలములపొంత-రెండు అనురాగహృదయ ముల మధ్య - సంకోచముల బారతోలుటకు గాబోలు కొమ్మలోనుండి కోకిల 'కూ' యనుచుండెను. నదీ శబ్దమును, కోకిలాలాప ములను శ్రుతిగా గైకొని రాకుమారు డేదో పాడ ప్రారంభించెను.

"నా హృదయము నీ యాధీనమయ్యె. చెలీ
పల్కుము—ఎవ్వతెవో—సఖియా—
ప్రకృతిలక్ష్మివేనా?"

* * *

ఈ పాట విన్నది చంద్రా. కాని తండ్రికి సందేశమంపుచుంటచే నూరకుండెను.

"పుష్పసంతతి వికసించిన భ్రమరము
పొంగిపోవు నానందవార్ధిలో
కాని సమీరున కేమి కోపమో
కఠినమున విదల్చు పూవులను."

యువరా జదివిని.

"శ్రీయుతు తాను సృజించి, అల
సృష్టి సహింపదు గాంచి;
ప్రకృతిలోన భేదములు లిఖించి
పాపకర్ములను జేసె విరించి;
నిండుచంద్రుదు మండలము గని
నీలిమబ్బు సహింపజాలదు;
హాయిగూర్చు శరద్వసంతముల
నాక్రమించి యా కాలముమ్రింగును."

ఆమె యది విని బిగ్గరగా "ఎందుల కిట్లు పాడెదవు? ఎవ్వరవు నీవు?" అనెను.

రాకుమారుడు:—చంద్ర కిరణములతో దాగుడుమూత లాడుచుంటివి నీవేనా? ఎందులకో?

అనుచు శబ్దములబట్టి యిద్దరును సమీపమునకు వచ్చిరి.

చంద్రా:—'గులాబీ పొదలలో నేలదాగెదవు? కాచికొమ్మని కొన్ని పుష్పమాలికలు వానిపై విసరి మరియొక పొదచాటున దాగెను. రాకుమారు డామెసాహసమున కచ్చెరువడి "ఈ మాలికలే బరువా నాకు?" అని లేచి సమక్షమునకు వచ్చెను. అతండామెరూపసుధాపానము లానుచు నిలునబడిపోయెను. యువరాజు మాటతో చంద్రా హృదయము విచిత్రముగా మారెను; కన్నులు తేజోవంతమై యుండెను. ఆమె "ఏమంటివి? పుష్పములే బరువుకానిచో, నంతకంటె బరువు కలది బరువేకదా?"

రాకుమారుడు:—"క్షమించుము. బరువుగల పుష్పమునే నామీద వేయుమని నా కోరిక." అనుచు చిరునవ్వు నవ్వెను.

ఈ విధము సంభాషణ జరిగినది కాని చంద్రామనను రాకుమారున కర్థమగుట లేదు. వారిరువురును రాజమహలున కరిగిరి. చంద్రాకు నానాటికి చింత యధికమగుచుండెను. రాకుమారుని యర్ధ నిమీలిత నేత్రముల జూచుచుండెడిది. ఆ చూపులో హర్షము, విషాదము కూడ కలవు. ఒకనాడు యువరాజు "చంద్రా! నేను నీదాసుడను. నా రాజ్యము నీయది." అనుటతోడనే చంద్రా దీర్ఘమైన నిట్టూర్పు విడచెను. కన్నులవెంట నశ్రుకణములు రాలెను. రాకుమారుడు 'నీ కేల దుఃఖ?' మని యామెకపోలము, నధరమును స్పర్శించెను; కాని చంద్రా నిర్జీవ ప్రతిమవలె నుండెను. కాలము మెల్లగారే

బవళ్ళను దొంగిలించుకొని పోవుచున్నది. మూడు వత్సరములు గడచినవి. ఒక్కరాత్రి మాత్రము మిగిలి యున్నది. ఆరాత్రి శీతల మంద సుగంధ సమీరుడు వారి నిరుపుర నిద్రాదేవి తొడపై బరుండబెట్టి జోల పాడెను. అకస్మాత్తుగా చంద్రాశరీరము వడక సాగెను. అర్ధ జాగ్రదవస్థలో చంద్రా ప్రియ తము ననేక మారులు ముద్దిడికొనెను. రా కుమారుడు మేల్కాంచెను. అంతవరకు నుదాసీనయైయున్న చంద్రా నాడట్లు విచిత్ర ముగా నుండుటచూచి "చంద్రా! నేటికి నేను ధన్యుడనైతిని." అనెను. చంద్రా:—

"మన కిదియె కడసారిరాత్రి! ప్రేమలో తృప్తిలేదు. తరంగములేకాని మెడ్డులేదు నిలుచుటకు! ప్రేమసాగరము నీదుట దుర్ల భము!" అనుచు యదృశ్యయయ్యెను. రాజు నిశ్చేష్టు డైపోయెను. చంద్రా కంటినుండి యొక్కొక్క నీటిచుక్క భూమిపై పడుచుం డెను. ఆ బిందువులే తుమ్మెద లైనవి' అని కిర ణము చెప్పుచుండగనే తుమ్మెద పరిగిడి వచ్చి మొగ్గపై వ్రాలెను. ఆ మొగ్గ నెమ్మదిగ తుమ్మెదను లోన నిమిడ్చికొని తెల్లవారి విడ చెను. అది మత్తిల్లి కవిముఖముపై బడు టచే యదరిపడిలేచి "కలసారమేమిటో?" అనుకొనెను. కవి.



# ఎఱుక *

మఠం వాసుదేవమూర్తిగారు బి. ఏ.

౧

ఒకదినంబున మాపల్లె కొకఁడ కాలి
జాడను నడచి నడచి యెచ్చటను నిప్పుఁ
జల్లెడు తరణి బుజుకరజాలములను
మఱుఁగుపరచెడు నీడకై యరయుచుంటి.

౨

వేడిప్రొద్దది, క్రాగిన పెనము వోలె
మీఁద నీలవర్ణమునను మిన్ను గానఁ
బడియె; సగమువాడిన గడ్డిపరకలందు,
ముండ్లపొదలను జీమచప్పుడును లేద.

౩

ఎచటనో యొకానొకయప్పు డేదొ పక్షి
యఱచి యచ్చటి నిశ్శబ్దమధికముగ నొ
నర్చెఁగాని; నిక్కముగఁ బర్ణంబుగదల
నట్టి-గాలియులేని మధ్యాహ్నవేళ.

౪

నడచి వేసారి యెండకు బడలి దూలి,
యొడల ఘర్మాంబుధారలు వెడలుచుండఁ
గోకిలాధ్వని నాచెవిసోక నొకటి—
చెట్టులిచ్చోట ననుచు నాచెంతఁబోతి.

౫

అందు నెండిపోయిన భూరుహములు గొన్ని
పలిత పర్ణంబులను జటాపటలిగాఁగ,
నిశ్చలత సమాధియుఁగఁగొని తప మాచ
రించుచున్నట్టిక్రియ గోచరించె నాకు.

౬

ఆ తరువుల విశాలమైనట్టిదాని
క్రింద నంగవస్త్రము [1] నాస్తరించి పండు
కొంటిఁ బైమనోహరముగఁ గోకిలయును
పాడె నెడనెడ గొంతెత్తి ప్రకృతిగీతి.

౭

మాటికిఁ జంచువునను గొమ్మఁ బొడుచుచు, మఱి
పలుమఱును నుబ్బి కఱి యెఱకలు విదుర్చు;
గొంతుసారించి మఱిమఱి 'కొవ్వ్వ' యనుచు
సరసగాయనప్రవర మా పరభృతంబు.

౮

సరిగమయను నారోహణ సరణిలేదు;
సనిధయను నవరోహణజ్ఞతయులేదు;
పంచమస్వరమున నాలపించెఁగాని
సరసగాయనప్రవర మా పరభృతంబు.

౯

వెంటఁ గావలెనని యొక్క వీణగాని,
వినఁగఁగావలెనని శ్రోతృవితతిగాని,
వేడఁబోవద యూరక పాడుగాని
సరసగాయనప్రవర మా పరభృతంబు.

---

* ఎఱుక = కిరాతుఁడు. నిఘంటువున "ఎఱుకు" అనురూపము మాత్రము గలదు. అకారాంతముగనే ఈ పద మీ సీమ (రాయలసీమ)లో విశేషముగ నంగీకృతము.

1. పఱచి.

౧౦

కొంచె మటుపాడ ధనము నాశించుచుంద్రు
ధరణిఁ బాటకాండ్రిదియేమొ యెఱుకపడదు;
తానె పాడు, నడుగ దొక్కకానిగాని
సరసగాయనప్రవర మా పరభృతంబు.

౧౧

మాటలను నేర్వ; దా చిన్ని మానసంబుఁ
గలఁతిపెట్టుచున్నట్టి యా తలఁపులేవు
మనుజుఁ డెవ్వఁడెఱుఁగనోపుఁ? బాడునంతె
సరసగాయనప్రవర మా పరభృతంబు.

౧౨

అర్థమున కందరాక యున్నట్టి పాట
ద్వ్యక్షరి మధురగీతికఁ బాడిపాడి
చెవికి మదికిని నాకుఁ దనివియొనర్చె
సరసగాయనప్రవర మా పరభృతంబు.

౧౩

ఆ విశాల నిశ్శబ్దమునందున నొక
సారి, 'కొహ్వ్వా' యటన్న నా చారుగీతి
తీవసాఁగి దూరముగఁ బ్రాకి తెరలిపోవు
చుండెఁ దనవెంట నామది నూడ్చుకొనుచు.

౧౪

కొంతసేపటి కట్టులె కూర్కురాఁగ
నచటనే నిద్రించి తెలిసి యర్కుఁ డపర
మునకు వ్రాలుచుండుటఁజూచి ముందుమఱల
దారి సాగించి మాపల్లెఁ జేరినాను.

౧౫

సాంధ్యరాగంబు పశ్చిమాశాముఖాన
తాండవించుచునుండ నొక్కండ ముందు
పండి యుండినచోటికి వచ్చి కాంతు
నుగద ఓచెల్ల! యేమందు కుగతవిధికి!

౧౬

బడలివచ్చిన నాకింత యొడలుచేర్ప
ఛాయనొసఁగి కోకిలకు నాశ్రయమునొచుఁ
దనరిన తరువులేద [1] కృత్తమయి నిలిచి
యుండె కాండావశిష్టమై యుర్విపైని.

౧౭

ఎవఁడు నటికెనొకో యింధనేచ్ఛఁగాని
నిలిచియున్న యాబోదె క్రిందియెడఁ జెదరి
పక్షిగూడొంపు నాశిత ప్రణయ హృదయ
లీల ననుకరించుటఁగాంచి జాలిగొంటి.

౧౮

వృక్షకాండంబుపై నొంటిపికము నిలిచి
కంఠమెత్తి కూయుచునుండెఁ గరుణయొదవ,
నెట్టి శోకగీతమొ యది యెవ్వఁడెఱుఁగు?—
వ్రాసి కరుణస్వనంబు చూపంగనగునె!

౧౯

ఉన్నమితచంచువును, గించి దుర్గతచ్ఛ
దన[2]యుగము, విస్ఫు[3]రదురస్సుఁ దాల్చి తెఱపి
లేక కూయుచుండెను మదిదాఁకునట్లు
కరుణమయరాగగేయ మా పరభృతంబు!

---

1. నఱుకఁబడి. 2. ఱెక్క. 3. విస్ఫురత్ = అదరుచున్న (Throbbing.)

౨౦

ఇచ్చటనెకదా తన హృదయేశ్వరునిఁ గ
లసి నిరంతర ప్రణయలీలల వసించె,
నవి దలఁచి ప్రేమగుఱుతుల కడలెనేమొ,
కరుణమయరాగగేయ మా పరభృతంబు !

౨౧

ధనము గోల్పడినట్టి నిర్ధనుని యేడ్పుఁ,
బిల్లనిం గోల్పడినయట్టి తల్లి యేడ్పు,
నన్ని పోయినయట్టి శూన్యహృది యేడ్పు,
నేడ్పులన్నియుఁ జేర్చి తా నేడ్చెనేమొ
కరుణమయరాగగేయ మా పరభృతంబు

౨౨

చుట్టు శయనించియుండిన శూన్యమునకుఁ
దెల్పెనో లేక నిశ్శబ్దదేవతాశ్ర
వణములకు మొఱవెట్టెనో పాప! మపుడు
కరుణమయరాగగేయ మా పరభృతంబు.

౨౩

నాఁడు నేఁటికి మఱపలేన యట వీను
లంబడిన కరుణరుతము, వెంబడిన క
నుంగొనిన క్రూరదృశ్యమును వచియింతు
గాని పేసమాటల నుడివోని కరుణ !

౨౪

కనులఁగప్పిన నీళ్ల వీక్షణగణంబు
మందగింప, నట్టులె పక్షియందె చూడ్కి
నిలిపియున్నట్టితఱిని వెన్దిక్కునుండి
ఱివ్వమని యమ్మొకటి సాఱె రువ్వఁగొనుచు.

౨౫

అకట ! మఱుతెప్పపాటునఁ బికము మేన
రక్తముదొరంగ ధరఁబడి ప్రాణములు వి
డిచెఁ, దటాన హర్షముననార్చుచు నెఱుక యొ
కండు విల్లునమ్ములతోడ కంటఁబడియె.

౨౬

పలుక గద్గదికంబున పలుకురాక,
ఎవరితప్పని తెలియంగ నెఱుక లేక,
నిముసమైనను నచ్చోట నిలువలేక
వెడలిపోతి నా దృశ్యమే యెడఁద నిలిపి !






By-Mr. [illegible]-జగన్నాథ శర్మ

పొట్నూరి బసవరాజుగారిది మొదటి పూసపాటి రాజకుటుంబమై యుండఁగాఁ గుమిలెలోఁ దమ్మిరాజుగారిది రెండవ పూసపాటి కుటుంబమని చెప్పనొప్పును. ఇందు మొదటివారిది పొట్నూరి పరగణా. అందుకు దోడు భీమునిపట్నం తాలూకాలోని భోగాపురం పరగణా. రెండవకుటుంబమువారిది కుమిలె పరగణా. అందుకుఁ దోడు విజయనగరం తాలూకాలోని భోగాపురము పరగణా. ఇందు నేఁడొక భోగాపురము వేచి రాఘు గ్రామములలోఁ జేరి కోటభోగాపురమని చెప్పఁబడుచున్నది. పొట్నూరివారికి ఒడ్డెరాజులు తోడునీడ. వత్సవాయివారు, కాకర్లపూడివారు మొదలగు నంధ్రరాజులు కుమిలెవారికిం బరిచితులు. ఇట్లుండి యొకరిపైనొకరు ద్వేషము, పట్టుదల గల్గి రాజ్య విస్తరము గావించిరి. వీరిలోఁ గృష్ణవిజయకర్తగాఁ దమ్మిరాజుగాను రఘునాథరాజుగారి సోదరులు ప్రసిద్ధి పడసిరి. రఘునాథరాజుగారు రాజ్య నిర్వహణదక్షులు. వీరి కాలము 1652-1685. పొట్నూరి పతాకశకము వీరి రాజ్యారంభకాలముకంటె 56 సంవత్సరములు పెద్ద.

సీతారామరాజుగారు కుమిలెను పాలించుచుండఁగా బొబ్బిలికడ చిత్రకోటను శంభరదేవు (జయపుర రాజ్యాధీశులకుం బూర్వులు) పాలించుచుండిరి. అంతట బొబ్బిలికడ నొక చెఱువులో ధన నిక్షేపము కంటఁబడెను. దానికై ఘోర యుద్ధము జరిగినది. అందులో నీ సీతారామరాజుగారు ముఖ్యముయిన కక్షిదారు. ఈ సీతారామరాజుగారు గంట్రేడు, దేవుపల్లి, నెల్లిమర్ల, వెలగాడ, మధురవాడ, అలుగోలు, గంధవరం మొదలుగాఁ బది పరగణాలను సంపాదించిరి. వీరి కాలము 1685-1696. ఈ ప్రభుని కౌరంగజేబు ఇచ్చిన యుత్తరువులో విశాఖపట్టణము, గంజాము, బందరు మొదలుగాఁ గల ఇంగ్లీషు కంపెనీలన్నిటిని ఒక్కుమ్మడిగా స్వాధీనపఱచుకొనెను. ఇందునుగూర్చి లండను ఆఫీసులో రికార్డు దండకవిలెలు కలవు. వీరికి ముస్తాఫా ఖులీఖానుఁడు పరమమిత్రుఁడు.

వీరి కుమారులలోఁ బెద్ద, అన్నమరాజుగారు 1697 లోఁ దొఱగడ్డయుద్ధమున బాల్యమునందే కీర్తిశేషులయి వీరస్వర్గముం గొనిరి. రెండవవారు తమ్మిరాజుగారు 1697-1699 లమధ్య మూఁడేండ్లు పాలించిరి. వీరు నిస్సంతుపడుసందర్భమున పైని వివరించిన రీతిగా రేవిడి గోపాలరాజుగారి పుత్త్రిని ఆనందరాజుగారిని దత్తు గావించుకొనిరి. ఇంతకుముందు ఆనందరాజుగారి సోదరుఁడు వేంకటపతివహామండలేశ్వరులు పొట్నూరి సీతారామరాజుగారికి దత్తుపడినందున పొట్నూరు,

కుమిలె రెండు కుటుంబములవారు ఒకరిపై నొకరు స్పర్థగల్గి వృద్ధిచేసిన రాజ్యద్వయము సోదరు లిరువురికి సంక్రమించి వీరికుటుంబ సంపత్తు పెద్దది యైనది. హైద్రాబాదు నవాబు పొట్నూరి రాజ్యాధీశులుగా వేంకటపతి ప్రభువులకును, కుమిలె ప్రభువులుగా ఆనంద గజపతి ప్రభువులకును దయచేసిన ఫర్మానాలు వేలు వేలుగా సాంస్థానిక పత్రావలియందుం గలవు. ఇటీవ ( సాధారణ మార్గశీర్ష బహుళ త్రయోదశీ మంగళ వారము గల ఫర్మానా యొక్కటి ఆనందరాజుగారి పేర కన్పట్టినది. ఔరంగజీబు ప్రతి ధులని సన్నదులు కొన్నికలవు. ఈ కుటుంబములోఁ బేర్గాంచినవారిని ఇరువురను కవులు వర్ణించుచుందురు. "పిడుగు నఱికిన చిక్క భీమావనీపతి" యని చిక్కభీమరాజుగారిని; "అల గోలకొండ తల్పులు వేయు నానందగజపతి పేర విఖ్యాతిగాంచు" యని ఈ యానందరాజుగారిని. వేంకటపతి, ఆనందరాజు మహాప్రభువులలో వేంకట పతిగా రాముష్మికపరులు; ఆనందరాజుగా రైహిక వ్యాపారదక్షులు. వీరి రాజ్యమును స్వామిద్రోహపరులై కూలఁద్రోవనెంచిన బూడి జగ్గన్న—ముఖీ భూపతి-ఇట్టి వారిని ఆనందరాజుగారు ఔరంగజీబిచ్చిన ఖడ్గముతోఁ బూస్వాడ్పవ్రితాపము మెఱయ నిలువున నఱికిన రక్తపు వేడి మఱకలు నేటికిని మాయక మోతీ మహలున ఖడ్గమొకటి సందర్శనీయ మగుచున్నది. ఈ యానంద గజపతి ప్రభువే మరుచెఱువను ప్రదేశమును విజయ పురిగా నిర్మించినవారు. క్రీ॥ శ॥ 1143-1322ల మధ్య భోగరాగ విరాజితమై యుండిన సోమేశ్వర దేవాలయము చోడగంగ రావుతరాజు, అనంత పద్మదేవు చోడగంగరాజు నల్లుఁడు పూజించినచోటు నేటి లేజికా యావరణముం గాంచి క్రీ॥ శ॥ 1713 లో ఇది ధిల్లఁగగిన చోటని తమ సేనానితోఁ జల్కు చుండఁగా గుఱ్ఱము సకిలించి నంతట నది శుభసూచకమని తోఁచి, విజయనగరనిర్మాణమునకు శంఖుస్థాపనము గావించిరి.

ఆనందరాజుగారికి చందనాడ ప్రభువులగు కాకర్లపూడి దేవనరాజు పాయకరావు అనువారు బంధువులు-మిత్త్రులు. వీరిరువురునుగూడి ఫకీర్లాఖాను, హెల్కొంబు అను రాజకీయ తాంత్రికులను ఆర్థిక వ్యాపారములో నాల్గుచెఱువుల నీళ్లు త్రావించి యుద్ధములు కల్పించిన గాథలు మదరాసురికార్డులం దున్నవి. టాల్బొయి వీలరు ఈ గాథల నెంతగనో వర్ణించెను. ఈదేవనరాజ వంశస్థులే అలమండ, కోట, మెరుపాక, దోమపాక్ సంస్థానము (రామచంద్రపురము) పొందూరు, మళ్ళవరం, చోడువాడ, అనకాపల్లి, సత్యవరం, రాపర్తి, ఆరట్లకోటలు పాలించిరి. ఆనందరాజుగారు పద్మనాభమున గోస్తనీ నది యొడ్డునను, కొండమీఁదను ఆలయములను నిర్మించిరి. వీరు సింహాద్రిని పాలించు నవసరమున గోకులపాటి కూర్మనాథుని దేవుపల్లినుండి రావించి సింహాచలమున ధర్మకర్తగా నియమించిరి. అప్పుడు పిండారీలచందు మూఁడుదినము లాలయ మాక్రమించి శిల్పభాగములను చెడమొత్తిరి. సింహాద్రి నాథుని జవాహిరీ-ధనము అత్తిటి దేవరహస్య మంటపమున గలదగుటచే పిండారీలకుం దక్కలేదు. ఈ సందర్భముననే కూర్మనాథకవి "వైరిహరరంహ సింహాద్రి నారసింహా!" యని మకుటమిడి నీసపద్యములలో నృసింహదేవర స్తవమొనర్చి నట్లును, అట్లు 60 పద్యము లొనర్చునప్పటికిం గండిరీగలు చెలరేగి యా ముక్కడులను విశాఖపట్టణము పొంత కండిరీగల మెట్ట యనుచోటువఱకుం దరిమినట్లును ప్రతీతి కలదు. కూర్మనాథకవి * విజయనగరమున తిరుమలపెద్దింటి వారి శిష్యుఁడు. ఆనందగజపతివారి రాజ్యకాలము 6799-1717. వీరు మొహిద్దీనుఖానుఁడు, రుస్తుందిల్ మనుఁడు మొదలగువారినుండి భీమునిపట్నం, గొల్లల ఖార్లాం, నేరెళ్ళ, బత్తిలి మున్నగు పదమూఁడు పరగ

* ఇతఁడు రామతీర్థనివాసి. ఆయూరిలోని శ్రీమత్తిరుమలపెద్దింటి సంకత్కుమార వేంకటాచార్యులయ్యావార్లం గారి శిష్యుడు. విశేషములకు చూ. గోకులపాటి కూర్మనాథకవి. చంద్రిక సం. ౧. సంచిక ౬; (సం. చంద్రిక)

ణాల రాజ్యమును సంపాదించిరి. నీసమాలికలో ౧౧-వ వారుగాఁ జెప్పఁబడిన ఆనందరాజుగారు వీరే. ఇఁక మీఁద మాలికలోని ౧౩-వ ప్రభువుల చరిత్ర సంక్షేపించి చెప్పఁబడుచున్నది.

౧౩ మణికిరీటి విజయరామరాజుగారు

విజయనగర నిర్మాతలగు నానందరాజుగారు వీరిం గన్నతండ్రి. వీరి యసమాన రాజకీయ వ్యాపారదక్షతను ఫ్రెంచిదుబాషీ ఆనందరంగపిళ్లె తన డైయిరీలో పలుచోట్ల వర్ణించెను. వీరు ఫ్రెంచివారి నొకచేతను, ఆంగ్లేయుల నొకచేతను హస్తగతపఱచుకొని క్రయ విక్రయ వ్యాపారములోఁ దమరాజ్యమునుప్రజలను ధనవంత పఱచిరి తోడరమల్లుయొక్క భూమి రైతువారీ సంబంధమును నిశ్చయముగా నర్థముచేసికొని శ్రీ పూస్పాట్ సింహాసనమునం గూర్చుండి రాజ్యాభివృద్ధి గావించిన వారిలో వీరితోఁ దుల్యులు కన్పడరు. వీరి జాడలంబట్టి పోఁగల్గినవారు సింహాద్రి సీతారామ రాజుగారు. అటుపిమ్మట మహారాజా మీర్జా విజయ రామమూర్తి కే. సి. యస్. ఐ. వారు. వీరి పరిపాలనా పంథయే తాణాలవిభాగము మొదలుగాఁ బ్రతియేలుబడి యంశమునను నేఁటికిని మార్పులేకుండ అమలు జరుపుటవలన విజయనగరసంస్థాన పరిపాలన నిరాటంకముగా జరుగుచున్నదని చెప్పవలెను. మణికిరీటి విజయరామగజపతివారి పరిపాలనా పద్ధతికిం బునాది వైచినవారు బుద్ధాబుచ్చన్నగారు. గణకపద్ధతికి ఖరడే హాలు రామయ్యగారు. మణికిరీటులు రాజ్యాధీశులయిన తక్షణమే పాంద్రంగి, గోపాలపల్లి మొదలగు పది పరగణాల రాజ్యమును సంపాదింపఁగల్గిరి. శ్రీకాకుళమునకు ఫౌజుదారులయి ఒడ్డెరాజులందఱినిలోఁబఱచుకొనిరి. అరబ్బేగుసజరుల్లాఖాను అన్వరుద్దీనుఖానుల నుండి వీరి పితృవ్య పుత్రులగు సీతారామచంద్రసార్వభౌములు గడించిన రాజ్యమును వీరు సంపాదించిన దానిలోఁ గలిపి పంచుకొనిరి. భరతపురయుద్ధమున నింగ్లీషువారికి సేనలిచ్చి తోడ్పడిరి. బాదుల్లాఖాను జాఫరల్లీఖాను, భోంసల రఘుజీ మున్నగువారి గర్వ మడిగించిరి. తుమ్మపాల, చేబ్రోలు, గొల్లప్రోలు, ప్రతాపగిరి, కాశీపురము మొదలగుచోటుల మరాఠులతోను, మహమ్మదీయులతోను యుద్ధము లొనర్చిరి. సువర్ణచ్ఛత్రము మణికిరీటము గల్గిన ప్రభువు నేఁటివఱకు బూస్వాడ్పతాకము ధరించినంతలో వీరొక్కరే!! మహానదిమొదలు కృష్ణానదిపర్యంతము గల మహీపతి, నరపతి, అశ్వపతి, గజపతు లందఱు వీరికిం గప్పము కట్టినవారే! వీరు మొగలితుఱ్ఱు ప్రభువులగు కలిదిండి రంగరాజుగారికి దౌహిత్రులు. వీరు వీరకాహళ బిరుదు లందిరి. కవులకును, భరతశాస్త్రాది పండితులకును పగటి దివిటీ బిరుదులతో మాన్యము లిచ్చిరి. విజయరామ యశోభూషణ మను కావ్యమును గృతినందిరి. డచ్చివారికి భీమునిపట్టణము నందు అనేకవసతులిచ్చి, యధికారము లిచ్చి ఆదరించినట్లు డచ్చిరికార్డులు తెలుపుచున్నవి. వీరి ధర్మపత్ని చంద్రయ్య మహారాజ్ఞిగారికి మేనకోడలి కుమారులగు రాయ జగపతిగారికొఱకు కాంద్రకోట యనుచోట దుర్గనిర్మాణమును గావించిరి. పెద్దాపురశత్రువులగు హాజీహుస్సేనుని వధించిరి. వీరు ఫ్రెంచి ప్రతినిధియగు బుస్సీనుండి పాలకొండ, పెదగాడి మున్నగు నెనిమిది పరగణాలను సంపాదించిరి. వీరు ఉంతలపాటివారి యాఁడుబిడ్డను చంద్రయ్యమ్మగారిని, పాకలపాటి నరసింహరాజుగారి పుత్రిక రాజమ్మగారిని ధర్మపత్నులుగా గ్రహించిరి.

౧౩-వ ప్రభువుగా నుగ్గడింపఁబడిన బసవరాజు, వీరరాజు అను సహోదరులలో బసవరాజు అనువారు బారాబట్టి రాజ్యాధీశులయిన వీరకృష్ణగజపతివారి పుత్రికను తమసోదరుఁడగు వీరరాజుగారికి వివాహించి

వివాహము చేసికొనిరనియు వీరకృష్ణగజపతిదేవు తన కులకాంతయు ధర్మపత్నియు నగు నాపెయందుగన్న నుగ్గురకుమారులకు జయకోట, పర్లాకోట, ఖిమిడి రాజ్యములగు మన్నె రాజ్యములనొసంగి పర స్త్రీయు, శూద్రకాంతయు నగు నాపెయందుఁ దనకుఁగల్గిన కుమారునికి గౌరవనీయ మైన పూర్వ కటకపురి రాజ్య సింహాసనము నర్పించి నీతిదూరుండయ్యె ననియు, నిట్టి యొడ్డెరాజులతో సంబంధము పెట్టుకొన్న బసవరాజు గారికిఁ బౌత్రులగు వెంకటపతిగారు మణికిరీటులకుం బితృవ్యు లనియు నొక యైతిహ్యమున్నది. ఈపితృవ్య సంబంధమైనను దత్తతసంబంధములో వచ్చినదని చెప్పఁదగును. ఈ యైతిహ్యభాగములోఁ దమపావన జన్మకింతయును బాధింపఁదగిన సంబంధము లేకుండినను మణికిరీటులగు శ్రీవిజయరామరాజు మహారాజు మన్నె సుల్తానువారినిగూర్చి వారు ఉత్తమక్షత్రియులు కారని తీటికూర్చుండి బొబ్బిలి వెలమసంస్థానమువా రనుచుండువారఁట! అందుమీఁద రావు సింగన్న, దామెర్ల తిమ్మన్నల నోడించిన పూసపాటి మాధవవర్మ, రాచిగారుగార్ల యుద్ధము మఱువవద్దని మణి కిరీటులు కబురిచ్చెడివారంట! ఇట్లుండ నొకనాఁడు మణికిరీటుల వారిసర్దారు పూసపాటి విజయరామరాజను వారు ఏనుఁగుమీఁద సాలూరు వెళ్లుచుండఁగా ఏనుఁగు మీఁద వెళ్లుచున్న విజయరామరాజుగారి పేరును బొబ్బిలి రంగారావుగారు విని మణికిరీటి మీర్జామహా రాజా విజయరామరాజుగారే అనుకొని భ్రమించి రేగులవలసజమీందా రగు మంగళరాజును సేనతో బంపి వారినెదిరింప నియోగించిరఁట! ఒంటిగాకార్యాం తరముపై నేగుచున్న పూసపాటి విజయరామరాజు గారీ కుట్ర తెలియక తమ్మెదిర్చిన మంగళరాజు సేన చే వెంటనే వధింపఁబడిరఁట! రూప శౌర్యాదులందు మణి కిరీటులతోఁ దీటుగల యీ విజయరామరాజుగారట్లు తమ పేరున తమ శత్రువులచే వధింపఁబడుట విని మణి కిరీటులు వెంటనే ససైన్యముగా బైలుదేరి మంగళ రాజును వధించి ఆతని రేగులవలస జమీని లాగుకొని సర్దారు విజయరామరాజుగారి కుటుంబమునకుం జెందఁ జేసి వారి కుటుంబమును జమీందారులను గావించిరఁట! ఇట్టి సేఁతలు బొబ్బిలివారివలన మణికిరీటుల కాగ్ర హమునుగొలిపి చిరకాలము రగిలినంత బొబ్బిలియుద్ధ మేర్పడినది. బొబ్బిలి రంగారాయనితో డీకొని యుద్ధము జరిగించుట మొదలుగా లభించు బొబ్బిలి నాటకము మన్నగు నాంధ్రవాఙ్మయము నాటకోత్తర కథారంగమని తెలియఁదగును. పైని వివరించిన శాత్రవ బీజములను వినాయించి,ఉత్తరకథను కేవలవధా పూర్వ కమైనదానిని నాటకముగా రచించి ప్రదర్శించుట చారిత్రక సత్యములేని పని యనియు, నాటక లక్షణము దెలిసిన విబుధు లాక్షేపింపఁదగినపని యనియుఁగొఁ జెప్పవలెను. యుద్ధము ముగిసిన పిమ్మట యుద్ధవిరామ దివసమగు నొకనాంటి రాత్రి నడుమయి నలసటవడి నిదురించుచుండిన అఱువది సంవత్సరములు వయస్సుగల మన్నెసుల్తానువారిని - నిరాయుధులయి యున్నవారిని తాండ్ర పాపయ్య యను వెలమ సేవకుఁ డొకఁడు. దొంగపోటున పొడిచిన ఖూనీ కథను మహావీరలక్ష ణముగల నాటకముగాఁ బ్రదర్శింపఁబూనుట మణి కిరీటుల మరణవార్తగాక, దానిని ఆంధ్రదేశమం దలి నాటకరంగ మరణవార్తగా విబుధులు తలంప వలసియుండును.

మణికిరీటుల రాజ్యకాలము 1731—1757. వీరు విష్ణుభక్తి సుధాకరమున వర్ణింపఁబడిరి. వీరి దానశాస నము లెన్నియో కలవు. వీరికాలమున యుద్ధ విద్యా నైపుణ్యము లేని క్షత్రియులు రాజ సభాస్తారులుగా వచ్చెడివారు కారు.

మణికిరీటులు బొబ్బిలియుద్ధానంతరము మరణిం చిన పిమ్మట ఇందు ౧౭ వ వారుగా విశదీకరింపఁ

బడిన ఆనందగజపతి మహాప్రభువువారు రాజమహేం ద్రమున నాకస్మిక మరణ మందుపడుటకు వారు రాజ్యాధీశులయి యుండిరి. వారు దివంగతులుకాఁగనే మణికిరీటుల భార్య చంద్రయ్యమ్మదేవిగారు రాజ్య భారము వహించిరి. ఇత్తరి పూర్వ శాత్రవముచేఁ బూసపాటిసంస్థానమును లాగుకొనవలెనని ఫ్రెంచి వారిప్రేరణచే సేనాసమేతులయి వచ్చిన మొహిరి సంస్థానాధీశ్వరులగు నారాయణదేవు మున్నగు ప్రబల శత్రువులను, రణధీరులగు తమక్షత్రియపరివారమును పంపి విదిర్చి శత్రువులను ధిక్కరించి చంద్రయ్యమ్మ దేవిగారు రాజ్యమును నిలువఁబెట్టఁ గలిగిరి. అప్పుడు గుండాల అప్పాజి, బుక్కా బుచ్చన్న, ఖరిడేహాలు రామయ్య మున్నగువారు వీరిచెంగట నిరుపమాన రాజకీయజ్ఞత, స్వామిభక్తి పరాయణత గల్గి ఎన్నిచిక్కులు వచ్చినను చక్క నొత్తుచుండెడివారు. అనకాపల్లి పాయకరావు గారికి దగ్గటి బంధువులగు తాళ్లపాలెం పూసపాటి రామభద్రరాజుగారి ద్వితీయపుత్రుని, వేంకటపతి యనువానిని వీరు శ్రీమీర్జా మన్నెసుల్తాను విజయరామగజపతి యని పేరిచ్చి యభిమానపుత్రులనుగా గ్రహించిరి. ఈ దత్తతను నామమాత్రముగా నుంచి తాము రాజ్యమాక్రమింపవలెనని యింతకు ముందుగా యత్నించుచుండిన యీ వేంకటపతిగారి సపత్నీక సోదరులు సీతారామరాజనువారు తమ బలిష్ఠతను ప్రదర్శించి రాజ్య మపహరింప నిశ్చయించిరి. ఇందులకయి తటి వెదకుచు రేవుపల్లిలో మీర్జా వారికిం జంద్రయ్యమ్మ మహారాజ్ఞివారు అన్నము పెట్టుచున్న వేళలోఁ గుట్రచేసి ఖిల్లేదారు సాగి నారాయణరాజుగారితో గంట్యాడనుండి కలిసుండి బాపిరాజుగారిని, మునగపాటి పేరాజుదారిని పంపి సీతారామరాజుగారు చంద్రయ్యమ్మగారిని కత్తివేటున వధింప సయోగించిరి.

అయ్యకోనేరనువది విజయనగరమున నీ మహారాజ్ఞివారి నిర్మాణము. సీసమాలికలో ౨౫వ వారుగాఁ జెప్పఁబడినవారు వీరే! ఇఁకమీఁద సీసమాలికలోని ౨౬-వ వారి చరిత్ర ౨౭-వ వారి చరిత్ర వివరింపఁబడుచున్నది.

### ౨౬. సీతారామరాజుగారు

### ౨౭. మీర్జా విజయరామగజపతిగారు

పైహత్యకుఁ గారకులయిన వారగు సీతారామరాజుగారి దౌష్ట్యములను చెప్పుట విరమించినచో వారి రాజకీయ విజ్ఞానము నిరుపమానమైనదిగా వర్ణింపఁదగును. వారు పట్టుదల గల్గి విజయనగరరాజ్యమును వృద్ధిపఱచిరి. ఐనను ఆత్మలాభపరాయణత్వమునఁ గుటుంబమునకు రాజ్యమునకును మిక్కుటమైన చిక్కులను దెచ్చిపెట్టిరి. వీరు స్వకీయప్రజ్ఞచే బ్రిటీషు పాలకులను మచ్చికపఱచుకొని, వారితో దౌష్ట్యమును జోడించి విజయనగరసామ్రాజ్యమును స్వాధీనపఱచుకొని కిరీటములేని రాజయి పదునెనిమిది సంవత్సరములేకచ్ఛత్రముగాఁ బాలించిరి. ఏకచక్రప్రభుత్వముగల వీరికాలమున నింగ్లీషుకంపెనీవారు ఉత్తరసర్కారులను వీరి శాహిరీమీఁదికి విడిచిపెట్టవలసివచ్చెను. శ్రీకాకోళము సర్కారు లెఖ్ఖలనుబట్టి చూడఁగా 1787-వ సంవత్సరములోర్లు—6,45,251లు తమకు జమ గలదానికి కంపెనీ కిస్తు రు 2,65,206 చెల్లించెడివారు. ఇట్లే వీరిచేతికి వచ్చిన ఖాశింకోట, విశాఖపట్నం వగైరా సర్కారులు గూడ వీరికి మంచి లాభమును గూర్చుచుండెను. ఫ్రెంచికంపెనీవారి కాలమున మణికిరీటులకట్టి లాభమును, పలుకుబడియు లభించెనో ఇంగ్లీషు కంపెనీవారి కాలమున నీ సీతారామరాజుగారికి అట్టి లాభమును పలుకుబడియు సమకూడెను. ౧. జయపురము, ౨. శృంగవరపుకోట, ౩. మాడుగుల, ౪. సాలూరు, ౫. కోటపాలెం, ౬. కురుపాం, ౭. అనకాపల్లి,

౮. సత్యవరం, ౯. గొలుగొండ, ౧౦. పాలకొండ, ౧౧. ఆంద్ర, ౧౨. రేగులవలస. ౧౩. కోగాం, ౧౪. త్యాడ, ౧౫. పాచిపెంట, ౧౬. సంగమవలస, ౧౭. చెముడు, ౧౮. రాజాం, ౧౯. నరవ, ౨౦. బొబ్బిలి, ౨౧. మెరికి, ౨౨. ఖిమికి, ౨౩. పార్వతీపురం, ౨౪. చక్కవ, ౨౫. మేరంగి, ౨౬. ఆరండ, ౨౭. గుమసూరు, ౨౮. చీకటి ౨౯. జలంత్రా జమీందారులను విజయనగరసామ్రాజ్యమునకు సామంతులనుగాఁ జేసికొని వీరిలో ధిక్కరించిన ప్రతివారిని దేవుపల్లి కోటలోనికి ఖైదీగాబట్టి తెచ్చుచు, అందఱిని అదుపులో నుంచినవారు. ఈ రాజ్యతృష్ణ మిక్కుటమై వరంగల్లు ప్రతాపరుద్రుని కాలము మొదలుకొని ఒకరికింగప్ప మీనక్కఅరాకుండ స్వతంత్ర ప్రభుత్వము నెఱపుచుండిన బస్తరునుంకి కూడ వీరు కప్పముగొనవలె నని నాగపురభోంసల ప్రభువులనుండి సన్నదు సంపాదించిరి. ఇంతలో ఆంగ్లకంపెనీ ప్రభుత్వ మొకటి బలపడినది. వీరి సామంతు లందఱిని వీరినుండి వేఱుపఱచి వీరికిం జెల్లింపు కప్పమును కంపెనీవారు వసూలుగొన నారంభించిరి. వీరికిని మన్నెసుల్తాను విజయరామగజపతివారి మామగారగు జంపనజగన్నాథ రాజుగారికిని సరిపడక కుటుంబకలహము లుదయించెను. ఒక్కటె మనము తలంపవలసి యుండెను. పూసపాటి కుటుంబములో నానాఁడు కలతలు లేక ఐకమత్యమే కల్గినచో నీ సీతారామరాజుగారి ప్రతిభవలన తిరువాంకూరు త్రీటీకి నకలుగా సర్వాధికారములు గల రాజ్యపదవి, సాలువారీ కోటిరూప్యముల ఆదాయము గల భూభాగము విజయనగరసింహాసనమునకుఁ దక్కి, బ్రిటీషుకంపెనీతో సంధి జరుగవలసి యుండెను. ఈ కుటుంబ కలహములవలన అట్టి మహోన్నతపదవికిం బదులు పద్మనాభయుద్ధమేర్పడి ఎందఱో క్షత్రియ వీరశిఖామణుల యసువులు పోయి జవాహిరీ ఎంతయో పోయి, ఆఱులక్షల సాలువారీ రాఁబడిగల రాజ్యము మాత్రము మిగిలి, అందు ఐదులక్షల పేష్కషు చెల్లింపఁబడునట్లు షరతేర్పడి వసూలయితే మిగిలిన లక్షరూప్యములును కుటుంబవ్యయమునకు, పై ఆఱులక్షలు వసూలు చేయు సిబ్బందీవ్యయమునకు సరిపడువట్లు పరిస్థితు లేర్పడినవి. ఇట్లు పేరునకుం బ్రభుత్వము మిగిలిన నాఁడు పడరాని పాట్లుపడి పూసపాటి గోపాలరాజుగారి కుటుంబము, పూసపాటి రామచంద్రరాజుగారి కుటుంబము అతిరథులై నిలువఁబడి సంస్థానము రాఁబడులను పెంపొదవించి పూర్వాడ్పతాకగౌరవమును నిలువఁబెట్టుటకుఁ దమ సర్వశక్తులను ధారవోసిరి. ఈ సీతారామరాజుగారు తమ కుమారులకు రాజ్యము దఖలుపఱచవలె నన్న సంకల్పముతో నుండ, పద్మనాభయుద్ధమునకుఁ గారకులయి తమ సోదరులు మన్నెసుల్తాను విజయరామమూర్తివారు దివంగతులగుట దెలిసి, మదరాసునుండి విజయనగరమునకై వచ్చుచుండఁగా దారిమధ్యమున నలమేల్మంగాపురమునఁ దనువు దొరంగిరి. వీరు అనకాపల్లిలోను, మాడ్గులలోను కోటలను నిర్మించిరి. సింహాచలమునఁ బూఁదోటలను, ఫలోపవనములను పెక్కిటిని నిర్మించిరి.

వీరిసోదరులు మీర్జా విజయరామమన్నెసుల్తానువారు చంద్రయ మహారాజ్ఞీవారి దత్తులు. తేజోనిధులు. దైవభక్తి సంపన్నులు. సీతారామరాజుగారి జీవిత మంతయుఁ గుట్రలతోఁ గడచుటవలన వీరి జీవితము, రాజ్యపాలనము నెమ్మది లేనిదిగాఁ బరిణమించినది. ఈ యిరువురు సోదరుల తగవులాటలలోను ఒక పడవ ధనమును సర్ థామస్ రంబోల్డు, ఇంకఁ గొంద ఱును లంచములుగాఁ గొని ఇంగ్లండునకు వెడలిరని వాల్యుములు ప్రకటితములయి యుండెను. శ్రీ మీర్జా విజయరామమూర్తిగారికిం బుత్రులు నారాయణగజపతి మన్నెసుల్తానువారు. నీసమాలికలో వీరే ౨౮-వ వారుగా వివరింపఁబడిరి. వీరు జన్మించుటకు ముందు శ్రీ మీర్జా విజయరామమూర్తి మన్నెసుల్తానువారు

సీతారామరాజుగారి బలవంతముపై నరసింహగజపతి అనువారిని దత్తు తీసికొనవలసి వచ్చెను. ఈ నరసింహ గజపతిగారు సింహాచలమున నొక శాసనములో వివరింపఁబడిరి. కుమరాం తాణాలోఁ గొన్ని దానపత్రము లిచ్చిరి. పద్మనాభయుద్ధమునఁ గ్రుత్రిమముగాఁ గొట్టఁబడిన శ్రీ మీర్జా విజయరామగజపతివారు తమ పుత్రులగు నారాయణగజపతి బాబువారిని కాపాడవలెనని నమ్మకము పల్కించుకొని వారిని జొన్నవలస పూసపాటి గోపాలరాజుగారి కుటుంబమునకును, ద్వారపూడి పూసపాటి రామచంద్రరాజు గారికుటుంబమునకును, అన్నమరాజుపేట జంపన జగన్నాథరాజుగారి కుటుంబమునకును, ఉర్లాం కన్నేపల్లి రామావధానులుగారికిని ఎస్టేటు జవాహిరీ. వగైరా ఆస్తులన్నిటితో వర్ధిపరచి యుద్ధమున కేగినంతట పూసపాటి పతాకరక్షణమునకై పైవారెన్నెని కష్ట యలను బడి కాపాడిరని మిలిటరీ కౌన్సల్ డేసనులు వగైరా రికార్డులు చెప్పుచున్నవి. మీర్జావారితో నారాయణబాబువారిని కాపాడు విషయమున నమ్మకము పల్కిన ప్రకారము జరిగించుటలో పై క్షత్రియ కుటుంబము లెన్నెని కష్టము లందవలసి వచ్చెను. ఐనను అన్నిటిని సహించి పైవారు పూసపాటి సంస్థానమును కాపాడిరి. ఈ విశ్వాసము మది నుంచుకొనియే కే. సి. యస్. ఐ. విజయరామ గజపతివారు ఈ పై కుటుంబములన్న నెంతయో గౌరవము చూపుచుండెడివారు. అట్టి గౌరవమే శ్రీమదానందగజపతీంద్రులు కూడ పైవారి కుటుంబములకు జరిగించుచు వచ్చిరి. 1791-వ సంవత్సరములో మైసేలు కీటింగు నుండి కన్నేపల్లి వెంకటావధానిగారు సంపాదించిన సంస్థానమును ఋణపఱచి వారి సోదరులగు రామావధానులుగారు శ్రీ మీర్జా విజయరామమూర్తి మన్నెసుల్తానువారికి ఒక లక్షరూపాయిలకు పైఁగా అవసర సమయములందిచ్చిరి. ఈ సొమ్ములు రామావధానులుగారు తమయవసరములకు తిరిగి వెంటనే రాఁబట్టుకొన వీలులేకుండ శ్రీ మీర్జావారు పద్మనాభయుద్ధమున దివంగతులైనందునను శ్రీ నారాయణగజపతి బాబువారిని పట్టభద్రులను గావించుటకు కాపాడు భారముకూడ రామావధానులుగారే వహింపవలసి వచ్చినందునను వారు ఎన్నియో కష్టనష్టములు పొందవలసివచ్చెను. ఈ తొందరలోనే కన్నేపల్లివారి గొప్ప సంస్థానము అన్యాక్రాంతము గావలసి వచ్చెను. ఐనను సైరించి రామావధానులుగారు పూసపాట్వడ్వతాకము నంక భక్తిప్రేమములను ప్రదర్శించి కీర్తి విస్తారులైరి.

శ్రీ మీర్జా నారాయణగజపతి మన్నెసుల్తానువారు నిరంతర వైష్ణవభక్తి శీలురు. దైవబ్రాహ్మణులకు వీరొసంగిన దానపత్రాలకొక ప్రత్యేక చిఠాను గవర్నమెంటువారేర్పఱచిరి. అవి 800 దానములని లెక్క తేలినది. నిరంతర ధ్యానపరాయణులును, దానశీలురు నగు శ్రీ నారాయణగజపతివారి మరణకాలమునఁ జక్రవర్తికి జరుగు సైనిక మర్యాదలు బ్రిటిషువారు జరిగించిరి. నిమేషమున కొక ఫిరంగి వంతున శ్రీవారు జీవించిన సంవత్సరముల సంఖ్యగా ఫిరంగులు పేల్పించిరి. ఆ మర్యాద సార్వభౌములగు వారికి మాత్రమే జరుగునది.

సీసమాలికలో ౭౯-వ వారుగాఁ జెప్పఁబడిన శ్రీ కే. సి.యస్.ఐ. విజయరామ మన్నెసుల్తానువారు శ్రీనారాయణ గజపతి బాబువారి యేకైకపుత్రరత్నము. వీరు శ్రీ విజయనగర సామ్రాజ్యలక్ష్మీ పునరుద్ధారకులు. వీరికాలమున నీసంస్థానమునకు క్రోయిజరుదొర గావించిన గ్రామపునర్నిర్మాణపద్ధతి చాల మేలొదవించినది. శ్రీ కే. సి. యస్. ఐ. వారిరాజ్యనీతివలన సంస్థానము తిరిగి మహోన్నత పదవికి వచ్చినది. శ్రీవారు భూమ్యాకాశములు నిండినఖ్యాతికిం గారణములగు దానములు గావించిరి.

గతశతాబ్దమున నింగ్లాండులో మహారాజు జనమాట కర్త మేమనంగా విజయరామమూర్తి. కే. సి. యస్. ఐ. అని. అంత పేరు గల్గునట్లు దానకర్ణులై ప్రాక్పశ్చిమ దేశములందు ఖ్యాతిగడించి శ్రీవారు ప్రవర్తించిరి పిఠాం బెనుమత్స జగన్నాథరాజుబహద్దరుగారు దివానై యుండిరి. వీరిది చక్కని పాలనము. ఈ యుగళ మిప్పు డుండినచో విజయనగర రాజ్యమునకు అర్థకోటి రూప్యముల సాలువారీ రాబడి లభింపఁదగినదే. శ్రీ కే. సి. యస్. ఐ. వారికి దివాన్ జీ జగన్నాథరాజుబహద్దరు వారిపై అత్యంత గౌరవము. శ్రీవారు దివాన్ జీకి స్వయముగా వ్రాసిన లేఖ నిక్కడ ప్రచురించుటవలన వారిగౌరవపద్ధతి యెట్టిదిగా నుండెనో ఎఱుంగుట సులభమగును.

[illegible]

శ్రీ కే. సి. యస్. ఐ. వారి తేది, వారి జీవితసంగ్రహము నిచ్చి ఇచట అవసరమైన యంశములను విశదీకరించుచున్నాను.

1826. ఆగస్టు 7. శ్రీవారు వ్యయ, శ్రావణ శు. ౮ సోమవారంనాడు జననమందుట.

1827 శ్రీ నారాయణగజపతిబాబువారి కాశీయాత్ర.

1832. మే. 3. బనారసుచెంగట చంద్రావతీ రాజ్యపాలకులగు ఫిదూసింగు బహద్దరువారికి శ్రీ అలకమహారాజ్ఞీవారు పుత్రికగా నుదయించుట.

1843. శ్రీ దాట్ల సీతారామరాజుగారి దివాన్గిరీ.

1844. కే. సి. యస్. ఐ. వారి వివాహము.

1845. విశ్వావసు భాద్రపద బహుళ ౯ శ్రీ మీర్జా నారాయణ గజపతిబాబువారి నిర్యాణము. కాశిలో కే. సి. యస్. ఐ. వారికి మాతామహులగు కాకర్లపూడివారితోఁ గూడిన ఆస్తి దఖలుపఱుట.

1818 ఏప్రిల్ 8. శ్రీవారు కాశీనుండి విజయనగరమునకు విజయంచేయుట.

కీలక వైశాఖ శు. ౩, శుక్రవారంనాడు సింహాసనాసీనులగుట.

1819. ఫిబ్రవరి, 17 శ్రీ అప్పలకొండయాంబా కోవరుదేవివారి జననము.

1850. ఫిబ్రవరి 10 శ్రీ నారాయణగజపతివారు అనుపుత్ర జననము.

డిశంబరు 31 మీర్జా ఆనంద గజపతి మహారాజా వారి జననము.

1851. శ్రీవారికి ఆంగ్లచక్రవర్తి సందర్శనము. శ్రీవారు జయపురం, బిస్సంకటకు రాజ్యాధీశుల మధ్య నరబలివిషయమునం గల్గిన వివాదములలో మాధ్యస్థము బూనుట.

# విదేశవ్యాపారము

రావుబహాదరు - తుంపూడి భగవంతంగుప్తగారు

1. ప్రతిదేశమందును దిగుమతులఖరీదును ఎగుమతుల మూలముగ చెల్లించుచుందురు. దిగుమతులు ఎక్కువ అయి ఎగుమతులు తక్కువ అయినప్పుడు ఈ వ్యత్యాసము బంగారు, వెండి మూలకముగ చెల్లుబడి యగును. అట్లే ఎగుమతులు ఎక్కువఅయి దిగుమతులు తక్కువ అయినప్పుడు వెండి బంగార్లు దేశము చేరును. వెండి బంగార్లను సరకులతోపాటు చూచుకొన్నయెడల ఎగుమతులు దిగుమతులు సరిపోవును. సరకు ఎగుమతికంటె దిగుమతి ఎక్కువ అయినయెడల వెండి బంగారులు దేశము విడుచును. సరకు దిగుమతికంటె ఎగుమతి ఎక్కువ అయినప్పుడు వెండి బంగారులు దేశము చేరును.

2. ఇండియా దేశమునుగురించి మరి యొక సంగతి ఆలోచించవలసి యున్నది. ఇండియా పరిపాలనవిషయమై ఇంగ్లండులో కొంత సిబ్బందికి జీతములు పెన్షన్లు ఇవ్వవలసి యున్నది. ఇంగ్లండు వగైరా దేశముల నుండి వచ్చినవారు ఇండియాలో పనిచేయుచు సంపాదించిన దానిలో కొంతభాగమును తమదేశము పంపుచుందురు. రైల్వేలు మొదలగువానిమీద విదేశీయులు పెట్టిన పెట్టుబడిమీద వారికి కలిగే లాభము వారికి ఏటేట పంపబడుచుండును. ఇవి అన్నీ చేరి సంవత్సరముకు 50 కోట్ల రూపాయలు ఇండియానుండి ఇతరదేశములకు వెళ్లుచుండును. ఇందుకు బదులు ఇండియాకు రాదగినది ఏమియు లేదు. దేశము సక్రమముగ పరిపాలింపబడుటయే మనకు కలుగు ప్రతిఫలము. ఎగుమతి దిగుమతులు సమముగా నుండదగిన తరుణములలో కూడా దిగుమతుల కంటె ఎగుమతులు 50 కోట్ల వరకు జాస్తిగానే యుండును.

3. దిగుమతులకంటె ఎగుమతులు 50 కోట్లకు పైబడినప్పుడు వెండి బంగారులు మనదేశము చేరుచుండెను. ఐరోపాసంగ్రామ కాలములో మనదేశమునుండి సరుకులు విశేషముగా వెళ్లుట విదేశములనుండి వచ్చు సరుకులు తక్కువగానుండుట తటస్థించుటచే మనదేశమునకు బంగారు వచ్చుచుండెను. కాని యిప్పుడు మనదేశమునుండి సరుకులు వెళ్లుట తగ్గినందున బంగారము దేశము విడుచుచున్నది. ఈ స్థితిగతులు ఇట్లే ఉన్న యెడల ఒకటి రెండు సంవత్సరములో దేశమందలి బంగారు అంతరించును. అప్పుడు ఎగుమతి చేయుటకు బంగారు లేకపోవుటచే, దిగుమతులు తగ్గిపోవును. ప్రజలు ఇప్పుడు అనుభవించుచున్న సౌకర్యములు వారికి ముందు లభింపజాలవు.

4. ఎగుమతులు తగ్గిపోవుటకు కారణములుఅనేకములుకలవు. ప్రతిదేశమువారును దిగుమతులను తగ్గించి తమకు కావలసినవి తమదేశమందే ఉత్పత్తి చేసికొనుటకు ప్రయత్నించుచున్నారు. యుద్ధము సంభవించినప్పుడు తమదేశము ఇతర దేశములపై ఆధారపడియుండవలసినది లేకుండునని వీరి యుద్దేశము. ఇట్టి తలంపులోనే బ్రిటిషు సామ్రాజ్యములోని దేశములు తమలో తాము చేసికొను వ్యాపారము హెచ్చు అగుటకును, వీరు తక్కిన దేశములతో చేసికొను వ్యాపారము తక్కువ అగుటకునుగాను అటావా అగ్రిమెంటు ఏర్పడినది. దీనివలన ఇండియాకు బ్రిటిషు సామ్రాజ్యములో చేరని దేశములలో వ్యాపారము తగ్గినది కాని సామ్రాజ్యములోని దేశములతో వ్యాపారము హెచ్చులేదు. సామ్రాజ్యములోని దేశములు కూడా తమకు కావలసిన సరుకును తామే ఉత్పత్తి చేసికొను ప్రయత్నములలో నుండుటచే ఇండియా నుండి సరుకు తెప్పించుకొనుట తగ్గించినారు. ఇండియానుండి వెళ్లు సరుకు భూమినుండి ఉత్పత్తి అగునది అనియు, వచ్చుసరుకు ఫాక్టరీలలో తయారు అగునది అనియు వేరుగ చెప్పనక్కరలేదు.

5. వెండి బంగారులు ఇండియాయందు అంతరించిన తర్వాత మన దిగుమతులకంటె ఎగుమతులు 50 కోట్లకు మించుటకు వీలు లేదు. విదేశీయుల ఏర్పాట్లనుబట్టి మన యెగుమతులు తగ్గుచుండును. ఎగుమతులను బట్టి దిగుమతులు తగ్గును. ఈ వ్యాపారము పూర్తిగా అంతరించజాలదు. ఆలోచన నిగుడ్చుటకొరకు దిగుమతులు లేవనియు, ఎగుమతులు 50 కోట్లే అనియు అనుకొందము. ఇది దేశమునకు క్షేమకరమా కాదా? మన దేశమందు భూమినుండి ఉత్పత్తియగు సరుకుల ధరలు బొత్తిగా తగ్గిపోవును. మన ఫాక్టరీలలో తయారగు వస్తువుల ధరలు పెరుగును. భూములు దున్నుట తక్కువ, ఫాక్టరీలలో వస్తువులు తయారు చేయుట ఎక్కువ అగును. ఈ మధ్యకాలములో విదేశవస్తువుల వలన ఇప్పుడు మనము అనుభవించుచున్న సుఖము లయమగును. భూమిలో పండిన బియ్యము చేతిమగ్గముమీద నేసిన బట్ట తప్ప మరేమి నాజూకులు ఉండజాలవు. ఇది తాత్కాలికముగ కష్టతరముగ నున్నను కొంత కాలమునకు లాభకరముగ పరిణమించునేమో అనియే తోచుచున్నది. కాని వెండి బంగారులు దేశమందు అంతరించకముందే ఇట్లు చేసికొన్నయెడల కష్టకాలమునకు అవి వినియోగించును. మూలధనము కలిగిన మనుష్యునికిని, ఏ పూటకు ఆ పూట కూలిచేసికొని గ్రాసము సంపాదించుకొను వానికిని ఎంత వ్యత్యాసములుండునో, వెండి బంగారులను నిలువచేసిన దేశమునకును

వానిని పూర్తిగా పోగొట్టుకొన్న దేశమునకును అంతే వ్యత్యాసము. కనుకనే యునైటెడ్ స్టేట్సు మొదలగు దేశములవారు ఎంత ఖరీదైన పెట్టి వెండి బంగారులను కొని నిలువ చేయుచున్నారు. బంగారుకు మంచి ధర వచ్చుచున్నదని మనము కులుకుచున్నాము. బంగారు చేరుట యునైటెడ్ స్టేట్సుకు లాభకరమైనచో, అది విడుచుట ఇండియాకు క్షేమకరము కానేరదు. కాని ధనము చేతనున్న వాడు సుఖము విడువడు. ధనము ఉండుట నష్టము కాకపోయినను కష్టపడకపోవుట చెరుపే. ధనము ఉన్నంతకాలము కష్టపడకపోవుట నిశ్చయమే అయినయెడల, ధనము అంతరించుటయు, కష్టపడుటయు, అందు మూలకముగ క్షేమదశ వచ్చుటయు ఎంత శీఘ్రముగ జరిగిన, అంత సంతోషించవలసినదే. బుద్ధిమంతుడు, దీపము ఉండగనే పని చక్కబెట్టుకొనుట. బుద్ధిహీనుడు అది ఆరిపోయిన తర్వాత చీకటిలో తడుముకొనుట. మనము బుద్ధిమంతులము కాము. గనుకనే వెండి బంగారులు దేశమందుండగానే ఎగుమతులను హెచ్చించియో దిగుమతులను తగ్గించియో, విధాయకమగు 50 కోట్లుకాక తక్కిన ఎగుమతి దిగుమతులు సరిపోవునట్లు చూచుకొనజాలకున్నాము.

---

# స్నేహం

"రావు"

౧

మొదటిరోజు—మధ్యాహ్నం.

[కచేరీసావిడికి వెనక వసారా. ఆ వసారాలో కమలం, సుందరం ఒక తివాసీమీద కూచుని వుంటారు. కమలం పదిహేడు, పద్ధెనిమిదేళ్ల పిల్ల. దబ్బపండు లాంటి శరీరం, దానికి తగిన అంగసౌష్టవం, కుదురైన మొగం, చేరడేసికళ్లూ, పిరుదులవరకూ వేలాడే వాల్జడా ఆమెకి అందం కూరుస్తున్నాయి. దక్షిణాది పట్టుచీర, పైటచెంగు పొట్టిగా వేలాడేటట్టు కట్టు కుంటుంది. లోపల బాడీ ఆపైని జంపరు ధరించి వుం టుంది. అవి ఆమె అందానికి వన్నె కలిగిస్తున్నాయి. సుందరం ఆమెకన్న మూడేళ్లు పెద్ద. వేషం అంతా అదే మాదిరి. ఏం తక్కువో చెప్పలేము గాని కమలం అంత అందమూ, సౌకుమార్యమూ ఆమెలో లేవు. యిద్దరూ చిన్నప్పుడు ఒక బడిలోనే చదివేరు. చిర పరిచితలు.]

సుంద:—ఒక్క క్షణం నేను మేడమీంచి కని పెట్టకపోతే మాయింటికి రాకపోయివుందువు కాబోలు కమలం? ఎంతలో, ఎంత నేర్చుకుపోయావే? మేమీ వూళ్లో వున్నామని తెలిసుండి కూడానూ. బతికున్నా మనుకున్నావా? మరేమన్నా అయిపోయా మను కున్నావా? ఒక్క 'కార్డు' ముక్క రాసి పారేస్తే స్టేసను దగ్గిర మీకోసం కాచుకుని కూచుందుమే! ఏం పని చేశావే? కుర్రజట్టు యిద్దరూను. తెలిసినతనమూ కాదు, తెలియనితనమూ కాదు. అప్పుడే రావడమూ, బస మాట్లాడుకోవడమూ, ప్రవేశించడమూ అన్నీ జరిగి పోయాయి?

కమ:—కాదక్కయ్యా! అసలు మాకీవూరు బదిలీ అవుతుందని యెరగమే యెరగం. తెలిస్తే రాయమా మీకూ. ఎలాగేనా యెడ్రస్సు కనుక్కునీ? ఒకచోటి కనుకున్న ప్రయాణం మరోచోటికి తగిలింది. వచ్చి న్నాడే డ్యూటీలో జాయినవాలిట వారు! మీ యిల్లు వెతుక్కుంటూ వస్తే టయిమయిపోతుందని, వారి స్నేహితుడు కుదిర్చిఉంచిన బసలోనే వెంటనే ప్రవే శించాం. వెంటనే వంటకి వీల్లేక హోటేల్నుంచి అన్నం తెప్పించుకుని రెండుమెతుకులు ఎంగిలిపడ్డాం. మీ యిల్లు మా బసకి యింత దగ్గిరని తెలపనే తెలవదు యిప్పటి దాకానూ!

సుంద:—హోటేలు మెతుకుల ఖర్మమేమిటే మీకు? యెంతపని చేసారే? నేనుండికూడా మీరు యిలా చేశా రంటే నలుగురూ నానోట్లో గడ్డిపెట్టరూ? మీరు వచ్చేరని తెలిస్తే నే నలాంటిపని చెయ్యనిస్తానా! పట్టున పదిరోజులపాటు—మీ కొత్తకాపరం అంతా సద్దుకునీదాకా యిక్కడే వుంచేసుకుంటానుగాని! ను వ్వా వీధిగుమ్మంలో నిలబడీ దాకా, మీరిలా వచ్చే రని యెరగనే యెరగనూ!

కమ:—అక్కయ్యా! యేదో అయిపోయింది. రోజులు గడపడం ప్రధానం! మరోవూ రయితే యేం జేస్తాం? హోటేలు మెతుకులూ తినక, యేమీ తినకానూ! కొత్తవూళ్లో నో రోజుకి ఆమాత్రం గడుపుకోవద్దూ! సామానూ, అవీ సద్దుకు నేదాకా! అంతసామాను యిము డ్చుకుని సర్దేను. రాత్రికి యింత చారూ అన్నమైనా వండుకుని హాయిగా తినొచ్చును.

సుంద:—యింకా వంటమాట ఎత్తుతున్నావూ? వంటా లేదు, పెంటా లేదు. అయిదారు రోజులపా

టన్నా మాయింటో వుంటేనేగాని వాటంకాదు. వెర్రి వేషాలు వెయ్యక!

కమ:—ఉండావచ్చు, వెళ్లావచ్చు. ఊళ్లో నేగా వుంటాం! వస్తే నేంగానీ, అనవసరంగా యెందుకూ శ్రమ నీకూ?

సుంద:—ఊహూ! అలా వీల్లేదు. చాలా రోజులకి కళ్లకి కనబడ్డావు. కళ్లు కాయలు కాచిపోయాయి. రాక రాక వచ్చేవు. నువ్వు రెండురోజులన్నా మా యింటో వుండకపోతే నామీద వొట్టే సరిగదా!

కమ:—బాగుందక్కయ్యా నీమాట! వొట్టూ లేదు, గిట్టూలేదు ఒకనాటి భాగోతమా యేమిటిది? అవసరమైతే, నువ్వొద్దన్నా రాక మానం! ఇప్పుడెం దుకూ? నువ్వు పట్టి చావస్తం మనిషివి లెస్తూ!

సుంద:—అదేమో నమ్మా! ఒహరు చెప్పినట్టు వినే రోజులా యివి? తమ పంతమే నెగ్గాలి; సరే! నీయిష్టం. కాఫీ అన్నా తీసికోకూడదు కాబోలు యిక్కడ!

[యింతట్లో ఆఫీసుకి కాఫీ తీసికొని వెళ్లడానికి పంకాకుర్రవాడు వచ్చి "అమ్మా! వచ్చే" నని తెలియజేసి నుంచుంటాడు సావిట్లో.]

కమ:—యిప్పుడే కాదూ వారికి కాఫీ యిచ్చి నేను తాగింది! మళ్లీ యెందుకూ?

సుంద:—మాటిమాటికీ యేవో సొడ్డింతాలు పెడు తూనే వున్నావే! ఇక ఏమయినాసరే వప్పుకునేది లేదు. బలవంతాన్ని పడదోసన్నా నోట్లో పొయ్యక మానను; తెలిసిందా! ఒహమాటు తాగితే మరో మాటు తాగకూడదా యేమిటి!

[అని వెళ్లి వక వెండి ప్లేటుతో వుప్మా, రెండు గ్లాసులతో కాఫీ తీసికొని వస్తుంది. అవి తివాసీమీద వుంచి కుర్రాడివేపు చూసి]

సుంద:—ఓ రబ్బాయి! బాబుతో, యివ్వాళ యెవరో బంధువులు వచ్చేరనీ, అయ్యరు హోటేల్లో నే కాఫీ తాగమని అమ్మగారు చెప్పేరనీ చెప్పు.

[అలాగే నంటూ పిల్లవాడు పోతాడు.]

కమ:—ఏంప నక్కయ్యా నీది? బావకి కాఫీ పంపడం మానీసి నన్ను తాగమంటున్నావు! ఆయన తిండి పడగొట్టేను నేను! నోటికి ఎలా పోతుందమ్మా నాకు?

సుంద:—చాల్లెద్దూ నీ వేషాలూ నువ్వూను! ఆయన కేమిటే తక్కువ? మరీ సంతోషం. అయ్యరుకాఫీ అంటేనూ! నా పోరు పడలేకే కాఫీహోటేళ్లు మానారు. నీపేరు చెప్పుకుని యివాళ ఆబదీరా ఎక్కుస్తారులే! భయం అక్కర్లేదు!

[ఇద్దరూ ఉపక్రమించి ఉపమా ప్లేటుకాళీ చేస్తారు. చెరో గ్లాసూ పుచ్చుకుని కాఫీ తాగి చేతులు కడుక్కుంటారు. సుందరం ఆ పాత్రలు దూరంగా పడవేసి, తమలపాకులూ, వక్కపొడీ తెస్తుంది.]

సుంద:—నిన్ననే యెవరో చెన్నాపట్టంనించి వస్తుంటే వక్కపొడీ, తమలపాకులూ తెప్పించాం. ఎంతో బాగుంటాయి.

[యిద్దరూ తాంబూలం వేసికొంటారు.]

సుంద:—కమలం! నేనోమాట చెప్తా విను! మా యిల్లు చాలా విశాలంగా వుంటుంది. మీా రెందుకు వేరే వుండాలీ! యిక్కడికే వచ్చేయండి! మాకూ పిల్లా పిచికా యెవ్వరూ లేరుగదూ! అల్లరి యేమీా వుండదు. మనకీ మనకీ పొం: తుంద. వకపూటాకరూ, వకపూటాకరూ యిద్దరం షనిచేసుకుంటూ కాలక్షేపం చేద్దాం యిష్టమైతేనూ! లేకపోతే వేరే వుండొచ్చు! ఏదో మీా ఆయన్ని కనుక్కొని చెప్పు.

కమ:—నాకూ యిష్టమే నక్కయ్యా! తప్ప కుండా కనుక్కొని రేపు చెబుతాను. పొద్దుపోయింది. మరి వెళ్తా.

సుంద:—తప్పకుండా రేపు రావాలి సుమా చెల్లీ!

కమ:—వస్తానక్కయ్యా! రెండు గంటలకీ.

సుంద:—నువ్వెళిపోతా వంటే అదోలాగున్నాదే! ఏమిటో గాని రేపు వస్తానని వట్టు వేసికో.

కమ:—వస్తానంటే నమ్మకం లేదేం? నీకు.

[యిద్దరూ వకర్ని వకరు కౌగలించుకుని విడవలేక విడవలేక విడుస్తారు.]

## ౨

### మర్నాడు - మధ్యాన్నం.

[రెండున్నర ఘంటలు. సుందరం వెనకింటో కాఫీ తయారుచేస్తూ వుంటుంది. వీధితలుపు కొట్టినట్లు చప్పుడవుతుంది. సుందరం లేవలే. మళ్లీ "తలుపు! తలుపూ!" అంటూ పిలుపు. డికాషను వొడబొయ్యడానికి కూచుంటుంది సుందరం. రెండు నిమిషాలు పోయేక మళ్లీ పిలుపు.]

సుంద:—[లేచి వెళ్తూ] ఎవరలా తలుపు బద్దలు కొట్టేస్తున్నారు? కాస్సేపుండ కూడదూ! ఏం తొందర! [అంటూవచ్చి తలుపు తీస్తుంది. ఎదుట కమలం.]

సుంద:—నువ్వేనుటే! ఎవరో అనుకున్నాను. నువ్వయితే పిలవకూడదటే చెల్లీ!

కమ:—పిలిచే నక్కయ్యా ఒహమాటు! నువ్వేదో లోపల పనిచేసుకుంటున్నావు. వీధులో నిలబడ్డానికి సిగ్గేసి రెండుమాట్లు గట్టిగానే తలుపు కొట్టాలసి వచ్చింది. యీ తప్పు నాదే. [అని నవ్వుతుంది.]

సుంద:—దానికేం లేస్తూ. లోపలికి రా. వెనకింటో కాఫీ తయారుచేస్తున్నాను; అంచేత నీమాట వినబడ్డంలేదు. [యిద్దరూ లోపలికి వెళ్తారు. సుందరం వీధితలుపు గడియవేస్తుంది.]

సుంద:—కమలం! యింకా నిప్పున్నాది. నీకూ కాసిని నీళ్లు మరిగించమన్నావా?

కమ:—ఒద్దక్కయ్యా! అన్నీ అయ్యే వచ్చాను.

సుంద:—అయితే సరి! యీ ఫ్లాస్కోలో కాఫీ పోసి ఆయనకి సిద్ధంగా వుంచి మనం సావకాశంగా కూచుందాం.

కమ:—అలాగే కానియ్యి.

[సుందరం ఫ్లాస్కోలో కాఫీ పోసి సావిట్లో వుంచి, ఆకులూ, వక్కపొడీ పట్టుకుని వస్తుంది. వసారాలో తివాసీమీద యిద్దరూ కూర్చుని తాంబూలం వేసుకుంటారు.]

సుంద:—కమలం! నిన్న నీతో చెప్పిన సంగతి మీ ఆయన్ని కనుక్కున్నావా?

కమ:—కనుక్కున్నా నక్కయ్యా! వారెంతో సంబరపడ్డారు. వచ్చీ నెల తప్పకుండా అక్కడికి వెళిపోదామన్నారు. మేమున్నది ఒక అరవాయన యిల్లట! యింటో కాలు పెట్టడం తడవుగా నెలద్దె ముందే వసూలు చేశాడటాయన. అద్దె వృథాగా వాడికి ఎందుకు వదులుకోవడం? అని అన్నారు వారు. వచ్చేనెల తప్పకుండా వచ్చేస్తాము.

సుంద:—బాగా ఆలోచించుకునే రాండి! నిర్బంధం లేదులే! అద్దెకోసం నేను చెప్తున్నానని తలపక. మీ సౌఖ్యం కోసమే చెప్తున్నానుగాని.

కమ:—ఎవరక్కయ్యా యీకాలంలో యింత అభిమానించేవాళ్లూ? మీకు యీ అద్దె ఒక లక్ష్యంటే? మా కుటుంబాల లాంటి పది కటుంబాల్ని పోషించగల డబ్బుంది మీకు! మాకు బాగుపడీ యోగ్యతుంటే రావాలిక్కడికి. అంచేతే భగవంతుడుకూడా నీకు ఆ బుద్ధి పుట్టించేడు.

[యింతట్లో పంకాకుర్రాడు వస్తాడు. సుందరం ఫ్లాస్కు వాడికి చూపెడుతుంది. తీసుకుని వాడు పోతాడు.]

సుంద:—కమలం! నాకు కొంచెం పని వుంది. యీ కుర్రాడికోసమే యింతసేపూ కూర్చున్నాను.

యెదురింటావిడదగ్గర రుక్మిణీకల్యాణం అదీ చెప్పిం
చుకుంటున్నాను. రెండు రోజులై వెళ్లలేదు.
యీవాళ కవురంపించింది కూడాను. వెళ్లకపోతే
యేమనుకుంటుందో యేమిటో? నేను వెళ్ళాలి. నువ్వు
కూడా రా. వచ్చిందికి అభ్యంతరం లేకపోతేనూ.

కమ:—ఎందు కక్కయ్యా! మీ పకి భంగం?
నే కొత్తమనిషిని. ఆ కవుర్లూ యీ కవుర్లూ జరిగితే
మీ చదువు సాగేది సున్న. నేనూ వెడతా.

సుంద:—మళ్ళీ తీరుబడి వుంటే వస్తావు కదూ!

కమ:—తప్పకుండా.

[సుందరం యింటికి తాళం వేసి వెడుతుంది. కమలం
యింటికి జేరుకుంటుంది.]

## ౩

### ఒకనాటి సాయంత్రం

[సుందరం వంటింటో వంట చేస్తూ వుంటుంది.
దాసీది యిల్లూ, వాకిలీ, ఊడుస్తూ వుంటుంది. వీధితలుపు
బార్లా తీసి వుంటుంది. సావిట్లో గడియారం అప్పుడే
టంగుటంగుని ఐదు కొడుతుంది. కమలం తొందరగా
వంటింటోకి వెళుతుంది.]

సుంద:—[చూసి] అబ్బా! ఏం తొందరే! ఉలు
క్కుపడ్డాను యెవరో ననుకుని. భయంకూడా వేసింది.
కొంచెం మెల్లిగా రాకూడదూ కమలం!

కమ:—చనువుకొద్దిన్నీ, తొందరమీదా వచ్చానే.
అక్కయ్యా! తప్పు క్షమించే.

సుంద:—క్షమాపణలకేమి లెద్దూ! ఏమంత
తొందర?

కమ:—రేపేగదూ ఐదో తారీకూ! మేం యీవూ
రొచ్చి యీరోజుకి నెలౌతుంది. మా బరువు తీరిపో
తుంది. రేప్పొద్దున్నే యిక్కడికి సామాన్లు పెరుక్కో
వాలి. మీ ఆయన రాకముందే నీకీసంగతి చెప్పాలని
తొందరగా వచ్చాను.

సుంద:—అంత తొందరపడితే యెలాగే మరి?
యేగదులు మేము ంచుకోవాలో యే గదులు మీ
కివ్వాలో ముందు మేం ఆలోచించుకోవద్దూ?

కమ:—యీరాత్రి ఆలోచించుకోండి. రేపు తెచ్చే
సామాను మీరు ఉంచమన్న గదుల్లో నే వుంచుతాము.
గదులు ఖాళీ అయ్యేదాకా సామాన్లు బయటే వుండ
నిస్తాం ఏం పోయిందీ?

సుంద:—కాదేమరీ! మేం యిచ్చే గదులూ, చెప్పే
అద్దె మీకు నచ్చుతాయో నచ్చవో? మొదట వొప్పు
కొని తర్వాత మొహం ముణుచుకోవలసి వస్తుందో
యేమిటో ఆలోచించుకోవద్దూ మీరు? ఇంతకీ నువ్వే
అంటున్నావుగాని, మొగాళ్లూ మొగాళ్లూ మాట్లా
డుకోవద్దూ?

కమ:—మనలో మనకి మాటలేమి టక్కయ్యా?
యిలాంటివాట్లో వారు జోక్యం పెట్టుకోరు. నా
యిష్టమే వారిష్టం. యింతకీ యింటి విషయాల్లో ఆడ
దానిపెత్తనంగాని మొగాడికి పెత్తనం లేదు. చూడూ!
నీ యిష్టమొచ్చిన గదు లియ్యి. నువ్వెంత చెప్తే అంత
అద్దె యిస్తాము. నమ్ము నన్ను.

సుంద:—అయితే వీటన్నిటికీ నీమొగుడు వొప్పు
కుంటాడంటావా?

కమ:—తప్పకుండా! దానికి నాదీ పూచీ.

సుంద:—సరేలే. మావారితో ఆలోచించి రేప్పొ
ద్దున్నే దాసీదానిచేత కబురుపంపుతా నేసంగతిన్నీ.

కమ:—సరేలే. వెళ్తా.

[కమలం యింటికి పోతుంది. సుందరం వంట
పూర్తిచేసి వంటింటితలుపు గొళ్లెంపెట్టి వసారాలోకి
వస్తుంది.]

## ౪

### మరోనాడు - సాయంత్రం.

[సుందరం వసారాలో తివాసీమీద కూర్చుని తల
దువ్వుకుని జడ వేసుకుంటూ వుంటుంది. ఎదురుగా

పెద్ద అద్దం వుంచుకుంటుంది. ఆ నాలుగిళ్ల వాకట్లో మదుమదగ్గిర కమలం చెయ్యికడుక్కుని వెళిపోతూ వుంటుంది. సుందరం అద్దంలో చూసింది అది.]

సుంద:—ఆ అంటచెయ్యి యిక్కడ కాకపోతే పెరట్లో కడుక్కోకూడదూ కమలం! యిక్కడే వెంగిగిన్నెలూ అవీ పడేస్తూ వుంటాంగదా!

కమ:—అంటచెయ్యి కాదక్కయ్యా! కడుగుడు బియ్యంబుట్ట పిల్లితన్నేసింది. కొంచెం బియ్యం వొలికి పోయేయి. అవి యెత్తిపారేసి మురికిచెయ్యి కడుక్కుంటున్నాను.

సుంద:—కాదులే! మెతుగుల్లా కనబడితేనూ అడిగేను. దానీపీనుగ రోజూ సుబ్బరం చేస్తూంటే మనం యేం చేసినా బాధలేదు. వారంరోజుల కొకమాటు అధమం బాగుచెయ్యదు. ఏమే! అని అడిగితే "మీ జాగా కాదు; అద్దెవాళ్ళది, మీరూరుకోండి!" అని నన్ను గద్దిస్తుంది.

కమ:—అవునమ్మా! అది కోరినంతజీతం యిస్తూనే వున్నాం. కొత్తలో వారంరోజులు ఏం బాగా చేసేదో! యిప్పుడు బొత్తిగా నామాటంటే యేమీ లక్ష్యపెట్టదు; ఏం మూడిందో గాని!

సుంద:—నేనే దానిచేత పని చెయ్యనివ్వలేదని అనుకొంటున్నావుకామోసు నువ్వు!

కమ:—బాగుందే నువ్వూ నీ మాటలూను. ఎవరేనా అలా చెప్తారుటే? యీ స్వల్పానికి మొగాళ్ళతో చెబితే బాగుండదని వూరుకుంటున్నాను.

సుంద:—దానీముండచేత పని చేయించుకోవాలిగాని మొగాళ్ళతో యెందుకూ చెప్పడం? చెపితే వాళ్ళకి మరింత కళ్లు నెత్తికెక్కి మనల్ని నానాగడ్డీ తినిపిస్తారు. నే నేం చేస్తున్నాను చూడు! కోప్పడేటప్పుడు కోప్పడుతూ, బతిమాలేటప్పుడు బతిమాలుతూ, ఆయనకి తెలీకుండా అప్పుడప్పుడు వేరే డబ్బు యిస్తూ అన్నిపనులూ చేయించుకోలేదూ?

కమ:—దానీదానికి చిల్లరడబ్బు లివ్వడం మప్పితే చాలా చిక్కుకాదూ? డబ్బు లిచ్చేరోజునే వాళ్లు కుక్కలా పనిచేస్తారు. ఇవ్వనిరోజున మనం యెంత అరిచినా కుక్కకింద కట్టేస్తారు.

సుంద:—వాళ్ళ అవుసరం వుంటే యేంచెయ్యనూ? యిచ్చి తీరాల్సిందే. నేను అది అడిగినప్పుడల్లా యివ్వబట్టే గిన్నెలూ, చెంబులూ తళతళా మెరిసేటట్టు ఎంచక్కా తోముతున్నాది? మీ వంత బాగా తోమటం లే. నేనేమో మీవి బాగా తోమవద్దని దాంతో చెప్పినట్టు మీరు అనుమానం పడొచ్చు. ఉన్న రహస్యం యిదీ.

కమ:—నా కే అనుమానాలూ లే వక్కయ్యా! నాగురించి నీకు యిలాంటి సందేహాలు ఎందుకు కలుగుతున్నాయో తెలీలేదు. మా గిన్నెలూ, అవీ బాగా తోమకపోవడానికి కారణం కనిపిస్తూనే వుంది కదూ!

సుంద:—(దిగులుతో) ఏమిటది?

కమ:—జీతంకాక వేరే చిల్లరడబ్బులు యివ్వకపోవటం!

సుంద:—తెలిసిందా నీకు యిప్పటికి. వాళ్లని సంతోషపెట్టక వాళ్ళనోట్లో నోరుపెట్టి గెలవగలమే మనం? తరవాత నీ యిష్టం!

కమ:—అలాగే నక్కయ్యా! మరేంచేస్తాం?

[సుందరం జడవేసుకోడం పూర్తి అవుతుంది. అద్దం అవీ గదిలో పెట్టేసి సబ్బుపట్టుకుని పెరట్లోకి వెళుతుంది. కమలం వంటింటోకి వెళిపోతుంది.]

మరోనాడు - సాయంత్రం.

[సుందరం వసారాలో తివాసీమీద కూచుంటుంది. వసారాకి యెదురుగా ఎడమపక్కకి వక గది. దానికి వసారావేపు ఒకద్వారం, అవతలపక్కకి ఒకద్వారం వుంటాయి. అది బయటఉన్న ఆడవాళ్లు కూచో

డానికి. అందులో కమలం కూచుని వుంటుంది. కాని ఆమె దొడ్డోకి వెళ్లిందని సుందరం తలపు. ఎదురింటి వెంకమ్మ వస్తుంది. సుందరం ఆవిడని తివాసీమీద కూచోపెడుతుంది. యిద్దరూ సావకాశంగా కూచున్నాక]

వెంక:—ఏమే సుందరం! మీయింటో అద్దెకున్న అమ్మాయి యెన్నిమాట్లొచ్చినా కనబడే కనబడదేమే? ఘోషా వా యేమిటీ?

సుంద:—(విసుగులో) అదేం ఘోషో నాకేం తెలుస్తుందమ్మా? యిప్పుడు బయటుంది. ఆ గదిలో వుంటుందేమో. కావలిస్తే చూడండి!

వెంక:—నాకేం పనమ్మా? ఒట్టి అమాయికురాలు లాగూ; మంచిపిల్లలాగూ వుంటుంది, పాపం! యోగక్షేమానికి అడిగేనమ్మా!

సుంద:—అందరూ మంచివాళ్లే పైకి చూడడానికి. కొంచెం దిగితే నేగాని లోతు తెలీదు.

వెంక:—అలాగుటే? యింకా యేమో ననుకున్నాం.

సుంద:—నాకెందుకమ్మా! చెప్తే కిట్టదనుకుంటారు! ఒకళ్ళ యిరస్తా పరస్తా కిట్టదు. తన కారోగ్యం. యితరులవాళ్ళకి రోగం. అద్దె తమరిస్తున్నా కొంప మాదే కదూ? ఇది తుడవడమన్నా అక్కర్లేదు. యెక్కడచెత్త అక్కడే! నీళ్ళకాలువ మురిగిపోవలసిందే! దానీనుండ ఊరికే తన పనులన్నీ చేస్తుందా? కొనుక్కుని తెచ్చుకున్నామమ్మా తద్దినం! కొంప తెగులడిపోతున్నాదీ.

వెంక:—ఆహా! అలాగుటే?

సుంద:—యెందుకోగాని యెప్పుడూ ఆ మోహం ధుమధుమలాడుతూ పుట్టె దాముదాలు పుడుకుతూ వుంటుంది. నాతో మాట్లాడనన్నా మాట్లాడదు. పీడ విడిచిపోయింది లెండి! మాటాడకపోతే నాకేం తక్కువా?

వెంక:—నీకేం తక్కువే? బంగారు తల్లివి! మంచిగా వుంటే నువ్వే యాభై మందిని పోషిస్తావు!

సుంద:—యింకేం చూసేరత్తా! సామాన్లన్నీ పోతున్నాయనీ, అంట్లమురుండ చేత నేను అన్నీ దాపిం చేస్తున్నాననీ, బాగా దాన్ని పనిచెయ్యనివ్వననీ, యీ అద్దెకొంపల్లో వుండడం యమయాతనగా వుందనీ నలుగురితోనూ చెప్పుకోవటం——

వెంక:—యెంత టక్కరిపిల్లే అమ్మా!

సుంద:—అది యిలా చేస్తున్నా కూడా యెవరితోటీ యేమీ చెప్పుకోకూడదు. సిగ్గు! యింకా "అది పసిపిల్ల! దానికేం తెలుస్తుంది. నువ్వు పెద్దదానివి! సర్దుకోకపోతే యెట్టా!" అని నన్నే కూకలేస్తారు! చూసేరా యీ చిత్రం!

వెంక—:పాపం! చిన్నపిల్ల! పుడితే యిప్పటికి ఆరుగురి పిల్లలతల్లి కావలసింది! చి—న్న...పిల్ల!

సుంద:—అదిలా చేస్తూన్నా మళ్ళీ అన్నిటికీ నేనే కావాలి! ముట్టు మూడురోజులూ దీనబ్బ యెవడు వండిపెడతాడు? వొక పూటేనా గడవకుండా తెల్లారే సరికి కూచుంటుంది. ప్రతీనెలా యిదే వాలకం! యేం తంత్రమోగానీ! రెండు పూటలా కాఫీలూ, పిండాలూ, అవతల కీడవడం చాలా కష్టంగా వుంది. నాకుమాత్రం యిందరికి చెయ్యడానికి శక్తి యెక్కడ యేడిసిందత్తయ్యా!

వెంక:—అవునమ్మా! పాపం! సుకుమారివి. దాని మొగుడుకూడా నువ్వే పెట్టాలా యీ మూడురోజులూను?

సుంద:—అక్కర్లేకపోతే మాత్రం? అతను హోటేలుకి వెళ్లిపోతాడుకాని యింటో ఆడది యెలా చస్తూ వున్నా అతడికి అక్కర్లేదు. చూస్తూ చూస్తూ యెలా వూరుకుని దాన్ని పస్తు పడుకోక్కపెట్టేది?

వెంక:—అదికూడా హోటేల్నుంచి తిండి తెప్పించుకోరాదూ?

సుంద:—సొక్కదట అమ్మగారికి! మా కంపరికే సొక్కుతుందిగాని! ఇన్నాళ్లూ నే నేం చేశేదాన్ని? మాటవరసకి నేను పెడతానంటే మొగుడితో అన్నం తెప్పించవద్దంటుంది.

వెంక:—కొంప తీసి అది మన మాటలన్నీ వింటు న్నాదో యేమిటో! యిా గదిలో నే వుందన్నావు!

సుంద:—నొడ్డోకి వెళ్లడం యిప్పుడే నేను చూశాను. యింకా కొంచెంనేపుదాకా రాదు. అంచేతే నా కష్టసుఖాలన్నీ మీతో చెప్పుకుంటానికి వేళ దొరికింది.

వెంక:—పోయి వస్తానే సుందరం, పనుంది!

సుంద:—వెళ్లండత్తా! నేనూ మరి మడికట్టుకో వద్దూ యెసర్లు దించడానికీ! [యిద్దరూ పోతారు.]

కమలం:—[గదిలో, యిదంతా విని, తనలో] అమ్మా! ఎంతకేనా తగుదు రీ ఆడవాళ్లు!

౬

ఇంకోనాడు—మధ్యాన్నం

[కమలం యింటో కాఫీ అనీ తయారుచేస్తూ వుంటుంది. సుందరం నుట్టుగదిలో ప్రవేశిస్తుంది. అప్పుడే గడియారం రొండు కొడుతుంది.]

సుంద:—[ఆ యింటోంచే] కమలం! కమలం! యిలా వొకమాటు వస్తావుటే?

కమ:—[వచ్చి] యే మక్కయ్యా! ఏం కావాలీ!

సుంద:—పాపం! ప్రతీమాటూ నిన్నే శ్రమపెట్ట వలసివస్తున్నాది. తప్పుఃసరి! కాఫీ చెయ్యడం అయింది కాబోలు!

కమ:—యిప్పుడే నీళ్లు పెట్టాను. మరోరెండు గళాసులనీళ్లు పోస్తానులే! బావ బయటికి వెళిపో కుండా చూడు!

సుంద:—మాడూ! వంటింటో పెద్ద అలమారులో మీది బల్లమీద వున్నాయి పంచదారా, కాఫీపొడ రున్నూ. పాలు వుట్టిమీద వెండిగిన్నెలో వున్నాయి. పెరుక్కి కాస్త అట్టేపెట్టి తక్కినవి కాఫీలో పొయ్యి.

కమ:—అక్కర్లేదక్కయ్యా! మాయింటో అన్నీ వున్నాయి. ఆ మాత్రం కాఫీయేనా యివ్వకూడదుటే నేనూ?

సుంద:—యివ్వకూడ కేం? యివ్వడంలేదూ యిది వరకూ? సరేగాని అలమారా రొండో అరలో గ్లాసోసి డబ్బాలో గోధుమనూక వుంటుంది. నేతిగిన్నె దాని పక్క నే వుంది. కావలసినవన్నీ తీసి అనులో వుంచేను. నీకు వీలయితే కాస్త వుప్మా చేసిపెట్టుదూ, పాపం! ఆయిన పొద్దున్న సరిగ్గా భోంచెయ్యలేదు.

కమ:—నేను అప్పుడే చేసే నక్కయ్యా! అది మనందరికీ చాల్ను. [యింటోకి వెళ్లిపోతుంది]

సుంద:—యింకొక్కపని చేసిపెట్టగలవూ?

కమ:—ఏమిటి?

సుంద:—మాడూ! రాత్తిరికి తవ్విడుబియ్యం అత్తి సరు పడేస్తావుకదూ!

కమ:—నాకు సిగ్గేస్తోందే. యిలాంటివన్నీ వేరే చెప్పాలిటే నాకు? బావని వేరేప్రయత్నం చెయ్యొద్దని చెప్పు.

సుంద:—పనిమనిషికి వంట్లో బాగాలేదట! కుర్ర ముండచేత కబురంపింది. యింటో యే కూరా లేదు. బజార్నుంచి తెచ్చే దిక్కు లేదు. రాత్రికి......

కమ:—మా యింటో అన్నీ వున్నాయి. కేబేజీ, గోబీ, అలూ, టమాటా, గోలకొండచిక్కుడు, వంకా యలూను; నీ కే దిష్టమో చెబితే అదే చేస్తాను.

సుంద:—"పుణ్యానికి పోయినమ్మా! నీ మొగు డితో సమంగా పెట్టవే?" అన్నాడట వెనకటి కో యిల్లాలు! మీ కిష్టమయింది చేసుకోండి. కాస్త పారె య్యండి మాకు.

కమ:—చెప్పకపోతే వొప్పుకోను. మా కన్నీ యిష్టమే. నీ కేది కావలిస్తే అదే చేస్తాను.

సుంద:—అయితే చూడూ! ఆలూదుంపలూ, చిక్కుడుగింజలూ వేచి, టమాటాలు పులుసు చెయ్యి. మాయింటో కొబ్బరిచిప్పలు వుండిపోయాయి. అవి పారేడ మెందుకూ? యింతకోరు పెరుగులో కలుపు. యేదో కాలక్షేపం చేద్దాం యీ పూటకి.

కమ:—సరే. [యింటోకి వెళ్లబోతుంది.]

సుంద:—ఒక్కపని: చెప్పడానికి సిగ్గువేస్తున్నాదే! అన్నీ యెంతకని చెప్పడం?

కమ:—మనలో మన కేమిటే? చెప్పక్కయ్యా!

సుంద:—భోంచేశాక బధ్ధకం వేశి యిల్లుకడగడం మరిచిపోయేనే!

కమ:—యింతేగదూ! ఇప్పుడేం పోయింది? కడిగేస్తానులే వంట అయాక. [యింటోకి వెళుతుంది.]

సుంద:—చెల్లీ!

కమ:—[వచ్చి] ఏ మక్కయ్యా!

సుంద:—పోనీలే! ...యేమీ లేదు. యెంతకని నిన్ను హింసపెట్టడం! నీ కిష్టమున్నా మాచేవాళ్లు ఏమి టనుకుంటారు? 'అత్తగారిలా చేయించుకుంటున్నాదే అన్ని పనులూను' అని నా నోట్లో గడ్డి పెట్టరూ?

కమ:—యెవ రనుకుంటారే? వాళ్లెవళ్లనీ మనం చెయ్యమన్నామా యేమిటి? మనింటో మన యిష్టం!

సుంద:—అయితే చూడూ! పనిమనిషికి వంట్లో బాగులేదట! మొక్కుపిల్లని పంపించింది. అది సమంగా గిన్నెలు తోమిందో లేదో! ఓమాటు రానేస్తావని! యెక్కడేనా మెతుకులు వుంచేసిందో యేమిటో. తీరా పాపం! నువ్వు అంట్లమైల పడిపోతావు!

కమ:—యీ కాఫీలు అయిపోయాక చూస్తాను. స్నానం తగలనీ! ఒకనాటికి పడిశం పట్టదులే! అంత సుకుమారమైతే యెలా? వేసంకాలం కూడాను.

సుంద:—అయ్యో! యెన్నిపనులు చెప్పేనే? నా కళ్లుకాలా?

కమ:—వూరుకో అక్కయ్యా? అలాంటిమాటలనక! యివన్నీ రోజూ నేను చేసుకునేవేగదూ! మీకోసం వేరే ప్రయత్నం చెయ్యాలా యేమిటి?

[కమలం వంటింటోకి వెడుతుంది. సుందరం పడుక్కుని పుస్తకం చదువుకుంటూ వుంటుంది.]

౭

మరోనాడు—మధ్యాన్నం

[వసారాలో తివాసీమీద కూచుని సుందరం తాంబూలచర్వణం చేస్తూ వుంటుంది. కమలం వంటింటోంచి సామానుగదివేపు వెస్తూవుండగా పనిమనిషి ఎదురుగా వచ్చి రాసుకుపోతుంది.]

సుంద:—వొనే కమలం! అలా రాసుకుని వెళ్లకపోతే కాస్త ఓసరిల్లగూడదూ? మాచేవాళ్లు 'యింత అనాచార మేమిటమ్మా!' అని అనరూ! నేనున్నా అలాగే చేస్తున్నట్టనుకోరులే?

కమ:—అదే యెదురుగుండా వచ్చి రాసుకుపోయింది. బట్ట తడుపుకొని స్నానం చేస్తానులే! ఏం జెయ్యనూ?

సుంద:—నీ యిష్టమమ్మా! స్నానం చెయ్యి. మానూ. చూనేనుగనక అన్నాను. ఎవరేనా మొగాళ్లు యెదురుగా వచ్చినా అంతేగదూ? కాస్త చూసుకు నడుస్తే మంచిదని చెప్పానమ్మా!

కమ:—(పౌరుషంలో) యెంత సిగ్గూ బిడియమూ వొదులుకున్నా మొగాళ్లని యిలా రాసుకుని యే ఆడది వెడుతుం దక్కయ్యా!

సుంద:—యెంతకోపం వచ్చిందే! అప్పుడేనూ. నీ మంచికోసం చెప్పినా కోపమే?

కమ:—కాదే మరీ! నువ్వు యేమన్నా పడతాను గాని యిల్లాంటిమాట లంటే కష్టంగా వుంటుందిసుమా!

సుంద:—నిన్ను యెప్పుడూ నే నేదో అంటున్నట్టూ, నువ్వు సహించి వూరుకుంటున్నట్టూ తేల్చేవు

గదూ చివరకీ? ఉన్నమాటంటే నే కోపం యీ కాలంలో!

కమ:—నేను మొహాళ్ళని రాసుకుని పోతూ వుండడం చూసేవుటే ఎప్పుడన్నా? యిదున్నమాటేనా? చెప్పూ.



కమలం కాఫీ, అదీ...గదిలోకి తీసికొస్తున్నాది.

సుంద:—ఏదైతే నేం? అలాంటిదే వోహటీ. మొన్న నేను బయట వున్నప్పుడు రొండోనాడు నువ్వూ మా ఆయన పడకగదిలో చదువుకుంటూ వుండగా కాఫీ, టిఫినూ టేబిలుమీద వుంచలేదూ? మొహాళ్లున్నప్పుడు పడకగదిలోకి వెళ్తే యేం అనుకుంటూ రంటవూ? అప్పుడు నాతో మట్లాడుతున్న యెదురింటి వెంకమ్మత్త ఆహాళంగా ముక్కుమీద వేలేసుకుంది.

కమ:—[రిచ్చపోయి] ఆయన గదిలో వున్నారని నాకు తెలీదు. అక్కడ వుంచేస్తే ఆయన వొచ్చి తీసుకుంటారని వుంచడానికి వెళ్లేను. ఆయన్ని చూసేక నాకే వొళ్లు చచ్చిపోయింది.

సుంద:—దాంతో తీరిపోయిందీ? ఆవిడ వూరల్లా చాటింది. అందరూ నన్నడగటం మొదలెట్టారు. సిగ్గుగా వుంది నాకు!

కమ:—[ఆతురతగా] ఏమిటంటున్నా రేమిటి?

సుం:—ఏదో ఒహటీ. ఎందుకులెస్తూ?

కమ:—[భయంతో] చెప్పవే అక్కయ్యా! నాకు అదేమో భయంగా వుంది.

సుంద:—...............

కమ:—వొట్టేసరీ చెప్పకపోతే.

సుంద:—ఏముంది ఉద్ధరి చెప్పడానికి! నువ్వూ నేనూ అక్కా చెల్లెళ్ల వరసని పిలుచుకోవడం బాగు లేదట!

కమ:—సరే. అదీ తప్పేనా?

సుంద:—[చికాకుతో] వాళ్లేమనుకుంటున్నారో గ్రహించలేదు నువ్వు! "కమలం నీకు సవితిటే?" అని అంటున్నా రందరున్నూ. యిక అర్థమైందా?

కమ:—[నిలువునా నీరై పోతుంది. అక్కడే కూలబడి యేడుస్తుంది.]

సుంద:—యేడుపెందుకూ? అంటే వళ్లదా నేరం? మనం అలా పిలుచుకోవడం మానేస్తేసరి!

కమ:—(కళ్లు తుడుచుకుని) యేంన్యాయంగావుందీ లోకం!



అప్పుడు సుందరం, యెదురింటి వెంకమ్మా చూస్తారు.

## ౮

### యింకోనాడు—మధ్యాహ్నం

[వసారాలో తివాసీమీద సుందరం, ఎదురింటి వెంకమ్మ కూచుని వుంటారు. ఆ పక్క సామాను గదిలో కమలం చీరకొంగు వేసుకుని పడుకుని వుంటుంది. నిద్రమాత్రం లేదు. తలుపు దగ్గిరా వేసుంటుంది. కమలం లేదని సుందరం అనుకుంటుంది.]

... ... ... ...

వెంక:—అలాగుటే?

సుంద:—యిం కేం చూశేరు? మొన్న అంట దాన్ని డీకొట్టి ఆ గుడ్డలతోటే వండింది. శూద్రకొంప నయమండీ అత్తా!

వెంక:—మొగాడికీ అక్కర్లేదూ ఆచారం?

సుంద:—ఎక్కడో మీరు కృతయుగంలో వున్నారు. అతగాడు పచ్చితురక. మాలా మీలా యేకమయిన గుడ్డలు యింటో కలుపుకుంటాడు. ఆచారమేమిటి చెప్పండీ అలాంటివాడికి? దొందు దొందే! మాకు మాచెడ్డ యెమయాతనగా వుందండీ యీ అనాచారం పడలేకా.

వెంక:—ఏమో అనుకున్నానే నేను!

సుంద:—వాళ్లిలా అఘోరిస్తే మాకేం గానండీ ఆ అంటూ, యెంగిలీ, తొక్కూ, తోలూ అంతా మావేపుకి కుప్పపెడుతుంది. ఏమీ అనాయిత్తి గాదు. మాటాడితే 'మేం అద్దె యిస్తున్నాం. మాయిష్టం' అని సమాధానం. అది ఎత్తి పారబోసుకుని రోజూ స్నానాలు చెయ్యలేక చచ్చిపోతున్నాను. మాకు యెప్పుడు యీ బంధాల్నించి విముక్తి కలుగుతుందో గాని.

వెంక:—యేం కష్టపడుతున్నావే అమ్మా!

సుంద:—సిగ్గూ బిడియమూ లేవుగదా! మానాభిమానాలు ఏ కోశాన్నీ లేవుగదా! ఏది మంచికి చెప్పినా వింటుందా? ఊఁహూఁ! ఔల్లంకొట్టిన రాయి!

వెంక:—మన మాటలు వింటుందో యేమిటో కొంపతీసి! కింద యెక్కడా లేదుగదా?

సుంద:—గంటైంది మేడమీదికి వెంచేసి అమ్మగారు! భోంచేసి మొగుడు వెళిపోతే సరీ అమ్మగారికి స్వేచ్ఛ. తాంబూలం సేవించి, మేడ వుద్ధరిస్తుంది.

వెంక:—కింద వుండదేమో?

సుంద:—మేడ ఎక్కే దారిలో వచ్చీపోయీ వాళ్లందరినీ ఆదరించొద్దూ! చెప్పుకుంటే సిగ్గు!

వెంక:—అలాంటిగుణాలు కూడానా?

సుంద:—ఏ భోగంది పనుకొస్తుందమ్మా దాని ముందర? ఆపోకలూ, అదీనీ. మొన్నకళ్లారా చూసిన్నీ అడుగుతారేం అత్తా?

వెంక:—మరిచిపోయేను. మొన్న నువ్వు ముట్టుతో వుంటే ఫలహారాలు పట్టుకుని వొయ్యారంతో మీ ఆయన వున్న గదిలో ప్రవేశించిందికదూ అన్నట్టు! గట్టిదే నే!

సుంద:—ఎందుకూ? కొన్నాళ్లు యీవిడ యిక్కడుంటే నేను నా మనువుకి నీళ్లు వదులుకోవలసివస్తుంది.

వెంక:—మెల్లిగా యీ గయ్యాళిని వదుల్చుకోవే నువ్వు! లేకపోతే ఎన్ననా చిక్కులు వున్నాయి.

సుంద:—యింకా ఆ రోండో గుణం కూడానూ. మాయింటో వెండిసామాన్లు ఒహటొహటే మాయమవుతున్నాయి, రోజురోజుకీని. అందుకోసమే యీ శని యెప్పుడు వదులుతుందా! అని వెయ్యిదేవుళ్లకి మొక్కుతున్నాను. మా ఆయనతో చెబితే "నువ్వే కోరి తెచ్చిపెట్టుకున్నావు; అనుభవించు" అని అంటారు. ఏం చెయ్యడానికీ పాలుపోవటం లేదు.

[కమలం అంతా విని చటుక్కన తలుపుతీసుకుని వస్తుంది. యిద్దరూ నిశ్చేష్టు లయిపోతారు.]

కమ:—పాలుపోడానికి ఏముంది అక్కయ్యా! పొమ్మంటే పోమూ? మానించి మీరు యమబాధలెందుకు పడాలీ? మావల్ల మీకు యిన్ని యిబ్బందులు కలుగుతున్నాయని యీమధ్యే కొంచెం అర్థమయింది నాకు. మరోయిల్లు చూసుకున్నాం కూడాను. రేపొద్దున్నే పోతాము. దీనికిన్ని కల్పనలన్నీ యెందుకూ? యీ పిశాచిబాధలు పడడమెందుకూ? సొంతయిల్లు పెట్టుకునీ, పాపం! మీరు.

[సుందరం వేలుకరుచుకుని ఊరుకుంటుంది.]

వెంక:—వెళ్లిపోక యేం చేస్తావమ్మా! పాపం! నువ్వు? యిక్కడ బస సదుపాయం లేకపోతేనూ?

[ తెర ]




### సౌందర్యమునకు పది శత్రువులు

నీ ముఖసౌందర్యమునకు శరీర సౌకుమార్యమునకు లోపము లొదవించు సామాన్యవిషయము లెన్నియో ప్రతిదినమును అనాలోచితముగ నీవే చేయుచున్నావని తెలియునా? అట్టి వానిలో పది ముఖ్యమైన విషయములందు ప్రతియువతియు జాగ్రత్తగా నుండవలెను.

మొట్టమొదటిది అనుచితమైన ఆహారము. పిండి, క్రొవ్వు, చక్కెర మొదలగు పదార్థము లన్నియు సరిగా కలిసి యుండక, విటమినులు శరీరమునకు కావలసినవన్నియు నుండక, యోచనలేకయే తయారుచేయబడు వస్తువులను భుజించుటవలన శరీరావయవములు సమముగా పెరుగవు. తిను పదార్థములందు పండ్లుతక్కువగా నున్నను ఆకుకూరలు చాలకున్నను, ఆరోగ్యభంగమే కాక సహజ స్వరూపమునకు గూడ హానికలుగును.

రెండవది చాలినంత సరియైన నిద్రలేకుండుట. సౌందర్యమును కాపాడుకొనుటకు హిందూదేశములో 24 గంటలలోను 9 గంటలు బాగుగా నిద్రపోవుట అవసరము. వేసవి కాలములో నిదురరాక అలసటగా నున్నపుడు యువతులు వేదాంతమునకు లోనై యూరకుండక, అవసరమైన జాగ్రత్త తీసికొనవలెను. నారింజరసము, వేడినీరు, పంచదార కలిపి భోజనానంతరము పుచ్చుకొనినచో కొంత ఉపయోగ ముండును.

చాలినంత దేహపరిశ్రమ లేకుండుటయు ఒక హేతువు. చల్లనిప్రదేశములందు నిత్యము కొన్ని నిమిషములు వడిగా నడచుచుండుట అభ్యాసము చేసికొనవలెను.

ముఖభావములందు చాల దురభ్యాసము లుండుటయు సౌందర్య భంగమున కొక కారణము. నవ్వునప్పుడు కన్నులను చిన్నవిగా కుంచించుట, ఆశ్చర్యపడునప్పుడు కనుబొమలు సప్రయత్నముగా కదల్చుట, ఊరక కన్నులు నులుముకొనుట మొదలగునవి వీలైనంతవరకు యువతులు వదలుకొనవలెను.

దృష్టిని జాగ్రత్తగా కాపాడుకొనవలెను. కన్నులకు మిక్కుటమైన పరిశ్రమ యీయరాదు. సంధ్యావేళలందును సన్నని దీపముల ముందు చదువుటవలన దృష్టి చెడిపోయి స్త్రీముఖమునందు వృద్ధాప్యపు సూచన లుదయించును.

దేహము నెల్లప్పుడు పరిశుభ్రముగా నుంచుకొనుట మరచిపోరాదు. ఎక్కువ సారులు స్నానము చేసినంతనే సరిపోవునని యూరకుండక, సరిగా ఒడలు తోముకొనుట, వీధిని పోవునపుడు శరీరమును సంపూర్ణముగా కప్పుకొనుట, వట్టినేలపై కూర్చుండకుండుట అలవరచుకొనవలెను.

స్నానము చేసినంతనే శరీరమును బాగుగా ఆరనీయక, తొందరగా ఏదో ఒక గుడ్డతో తుడుచుకొని యూరకుండుట చాల హానికరము. తడి ఆరని దేహము శీఘ్రముగా ముడుతలుపడ నారంభించును. ఎండలో బాగుగా తిరుగుచుండుటకంటె, ఎల్లప్పుడు తిరుగుచుండుటయే ఎక్కువ అపాయకరము. శరీరమును సన్నని గుడ్డతో చాలసేపు సున్నితముగా అద్దుకొనుచు తడి ఆర్చుకొనవలెను.

ముఖమునందు నేటి యువతులు వేసికొను పౌడరులు మొదలగువానిని జాగ్రత్తగా సరియైన వేళలందు కడుగుకొనవలయును. తలకు పెట్టుకొను సూదులు మొదలగువానివలన కేశములు సహజముగా విరివిగా పెరుగుట కాటంకము కలుగును. ఈ లోపములు ఆకస్మికముగా కాన్పించకపోవుటచే యువతులు గ్రహింప జాలరుగాని, కాలక్రమమున వీని అపాయ మంతయు బయలుపడుచుండును.

పదనైన మొనలతోడి దువ్వెనలుగాని, గరుకుగానుండు పౌడరు గాని, తక్కువ జాతి సబ్బులుగాని యెన్నడును వాడరాదు.

ఇక కాఫీ, టీ మొదలగువానివలన శరీరాభివృద్ధికి కలుగు నాటంక మెట్టిదో స్త్రీలకు సరిగా గోచరింపదు. స్త్రీల పరిశ్రమకు, వారి జీవిత విధానమునకు, అందును కుటుంబములందే కదలకయుండు యువతులకు, అట్టి పానీయములు అపాయమే కలిగించును. నాగరకతామోహము వదలి అవి మానుకొనవలెను.

### నాగరకుల దుస్తులపై పురపాలకుల ఆగ్రహము

కరాచీవద్ద నున్న షికార్‌పూర్ నగరపు పంచాయితీవా రొక క్రొత్త తీర్మానము కావించిరి.

ఆ నగరమునందు నవీన నాగరకత ననుసరించి దుస్తులు ధరించిన యువతుల నందరిని అనేక విధముల బహిష్కరింపవలయునని వారి నిర్ణయము.

పాఠశాలలముందును, దేవాలయముల ముందును పంచాయితీసభ్యులు నిల్చుని బాలిక లెవ్వరైన చేతులులేని జాకెట్లు ధరించి వచ్చినను, స్లిప్పరులు, బాడీలు, పిన్నులు వేసికొని వచ్చినను లోనికి పోకుండ పికెటింగు చేయుదురు.

పేరుపడిన 'ఖత్ దర్బార్' దేవాలయము అన్ని జాతులవారికిని ఎట్టి నియమమును లేకయే ప్రవేశింప వీలైనది. అట్టిదాని యందుగూడ 'నవీన నాగరకత' ననుసరించి వేషము వేసికొను బాలిక లెవ్వరును ప్రవేశింపరాదని ద్వారముచెంత నోటీసు వేసిరి.



# ప్రసవానంతర వ్యాధులు

డాక్టరు. జి. శ్రీరాములుగారు, L. C. P. & S. (Bom.)

ప్రసవానంతర రక్త స్రావము (Post partum Haemorrhage):—ప్రసవానంతరము కలుగు వ్యాధులన్నిటిలోను ఇదే చాల సాధారణముగ కలుగునదియును, త్వరలో మరణమును కలిగించునది యును, చికిత్సకు వెంటనే లొంగునదియునై యున్నది. ప్రారంభముననే కనిపెట్టి చికిత్స చేసినట్లైన దీనినుండి యపాయము లేదు.

దీనిలో రెండు విధములు :—ప్రసవము పూర్తియైన తోడనే కలుగుట యొకటి. ప్రసవమైన యొక రోజున కావల కలుగుట మరొకటి. మొదటి విధమే హానికరమైనది. రెండవవిధము ప్రసవానంతర రక్త విషజ్వరముతో కలసి తటస్థించును. మొదటి విధమునకు ముఖ్యకారణములు రెండు. (1) గర్భకోశము నందు ముడుచుకొనునట్టి (అనగా ప్రసవమైన వెనుక గట్టియై చిన్నదిగా అగునట్టి శక్తి) శక్తి లేకపోవుటచేత. (2) ప్రసవపు కాలువయందు ఏదైన ఒకచోట గాయము తగులుటచేత అందుండి రక్తము వెలువడుట.

ఈ గర్భకోశాశక్తిత్వ కారణముననే సాధారణముగా స్రావము కలుగుచున్నది. ప్రసవము పూర్తి కాగానే గర్భకోశము చిన్నదగును. దానియందుండు మాంసము క్రమేణ తగ్గి గట్టిపడి సాధారణ స్థితిని జెందును. రక్తనాళములందును ఈ శక్తి యుండ బట్టి తమంతట తామే మూతబడి మరి రక్తమును వెలుపలకు రానీక చేయును. మరియు మాంసము వీటిని అదిమి యుంచును. రక్తనాళములందును కొంత రక్తము గడ్డకట్టుటచేతను రక్తము స్రవించుట జరుగును.

ప్రసవకాలమునందును ఈ గర్భకోశముయొక్క అశక్తిచేత ప్రసవము పూర్తియగుటకు చాల ఆలస్యమో లేక నొప్పులు పూర్తిగా నాగిపోవుటయో సంభవించును. అట్టి అశక్తియే ప్రసవానంతరము కలిగినట్లైన వ్రణముగా నుండు గర్భకోశమునుండి రక్తము ఆగక స్రవించుచుండును.

కారణములు :—(1) అనేక ప్రసవములు కొద్ది కాలముననే ఒకదాని వెనుక నొకటి యైనట్టి స్త్రీలందు గర్భకోశమున మాంసపు వంతు తక్కువై కాపు కాచిన స్థలములు ఎక్కువగును. అట్టి కోశము నుండి రక్తస్రావము సులభముగ కలుగుటయె గాక ఆపుటయు కష్టమగును.

(2) గర్భిణి యనారోగ్యవతియైనను లేక యితర వ్యాధులేవైన ప్రసవకాలమున దాపరించినను;

(3) ఎక్కువ నీటిచేత (Hydramnios) గాని లేక అమడబిడ్డలుచేతగాని గర్భకోశము చాల పెద్దదిగ నుండినను;

(4) గర్భకాలమునందు రక్తస్రావమైనను;

(5) శిశువునందైనను లేక తల్లి నడుము ఎముకల గూటియందైనను లోపముండినను;

(6) ప్రసవము పూర్తియగుటకు చాల కాలమైనను శస్త్ర చికిత్సచే ప్రసవమైనను;

(7) ప్రసవకాలమున నొప్పులు బొత్తిగా నిలిచి యుండి యావల ప్రారంభమై ప్రసవమైనను;

(8) మత్తునకై మందు లిచ్చియుండినను;

(9) రక్తమునందు గట్టిపఱచు పదార్థములు లేకుండినను (Haemophilia) ప్రసవానంతరము రక్తస్రావము కలుగును.

ఈ కారణములకు తోడ్పడుటకు 3 అంశములు ముఖ్యములైనవి :—

(1) ప్రసవపు రెండవకాలమునందు గర్భకోశమున శక్తిచే నొప్పులు తగ్గియుండినప్పుడు శస్త్రచికిత్సచే ప్రసవమును పూర్తిచేయించినట్లైన రక్తస్రావము తప్పక కలుగును.

(2) ప్రసవపు మూడవ కాలమునందు గర్భకోశము ముఖ్యముగా గమనించకుండుటచేత—అనగా శిశువు నంటియుండు రక్తనాళములు వెలువడునప్పుడును వెలువడిన వెనుకను గర్భకోశమును అరచేతితో నదిమి యుంచిన రక్తము నిండునప్పుడు గర్భకోశము పెద్దదగుట చేతికి తగులక పోదు.

(3) శిశువునకు రక్తపోషణ నిచ్చిన రక్తపుతిత్తి (Placenta) మొత్తముగా వెలువడక దానినుండి కొన్ని ముక్కలేవేని గర్భకోశమున నతికి యుండుట చేత.

చిహ్నలు :—రక్తము విశేషముగా వెలువడుటయే ముఖ్యమైనది. అయినను కొన్ని సమయములందు దీనినిబట్టి నిర్ణయించులోగా తదితరచిహ్నలు కనుబడి మరణము కలుగవచ్చును. సాధారణముగా 10 ఔన్సుల నుండి 20 ఔన్సులవఱకు రక్తము ప్రసవానంతరములోగా వెలువడును. ఇంతకు ఎక్కువైన సందేహింపవలసినదే. దీనిని కొలిచి నిర్ణయించుటకు వీలు లేదు. ఎల్లరకు సహజ మింతయనియును నిర్ధారణ లేదు. ఇంతకు మించినట్లైన స్రావమనియు తగ్గిన కాదనియు యితర చిహ్నలచేతనే యెఱుగవలెను. కొందఱి యందు స్రావము విస్తారముగా కలుగుచుండినను ఇతర చిహ్నలేవియు నుండకపోవచ్చును. అయినను అట్టివారికిగూడ చికిత్స యావశ్యకమే. ప్రసవానంతరము ప్రసూతిచేతనో లేక బట్టలచేతనో మర్మస్థలము కట్టబడియుండిన రక్తము వీటినన్నిటిని నానబెట్టి వెలికి కనుబడిననే గాని స్రావమని తెలియకపోవచ్చును. అందుకనే ప్రసవానంతరము తల్లిని 2 గంటల కాలముదాక కనిపెట్టి యుండవలెను. మర్మస్థలము నుండి రక్తము ధారగా వెలువడుచుండినను, కడుపు క్రిందిభాగమునుండి గర్భకోశమును అదిమినపుడు రక్తమో లేక రక్తగడ్డలో వెలువడినను స్రావమగుచున్నదని తెలియనగును. రక్తము ధారగా వెలువడిన చాల అపాయకరము. తగినచికిత్సను పొందులోగానే ప్రాణాపాయము కలుగును.

ఇతర చిహ్నలు:—రక్తము వెలువడి వృథా యగుటచే ముందు చేతులును కాళ్లును ఆ వెనుక దేహమంతయును చల్లనగును. శరీరమున నేదో కలవరపాటుచెందున ట్లుండి అటు యిటు పొరలుట కలుగును. మఱి కొంతసేపటికి చల్లనిచెమటలు కాలువలుగా కాఱును. దేహము తెల్లపారును. దప్పి యధికము, తల చుట్టుట, కండ్లకు చూపు తగ్గుట, కడుపున భారమెక్కువ యగుట, శరీర ఉష్ణము (temperature) తగ్గుట మొదలైనవి క్రమముగా కాన్పించి స్పృహ తప్పియుండి మరణము కలుగును. ఈ కాలమునందంతయు రక్తము ప్రవహించుచునే యుండును. శ్వాసము నిమిషమునకు 30-సార్లకు ఎక్కువగును. నాడి (Pulse) నిమిషమునకు 100-కి ఎక్కువ గాను, త్వరితము గాను, వ్రేలికి అందక ప్రాకుచుండి త్వరలో బొత్తిగా ఆగును. ఇన్ని చిహ్నలకు బాధ కొంచెమైనను యుండదు.

చికిత్స:—పై చిహ్నలచే తల్లివద్దనుండువారు సహితము స్రావమును పోల్చుకొని వెంటనే తగిన చికిత్సకై వైద్యుని రప్పింప వలెను. ప్రసవమునకు వచ్చిన వైద్యుడుగాని నర్సుగాని ప్రసవానంతరము 1, లేక 2 గంటల కాలము తల్లివద్దనే యుండవలసినది

ముఖ్యమని యిప్పటికి బోధపడగలదు. ప్రసవాంత మున రక్తపుతిత్తిని (Placenta) పరీక్షచేయుట అత్యావశ్యకమని ముందు చెప్పియున్నాము. అందు తునుకలేవేనియు కనుబడకుండిన నవి గర్భములోననే యున్నవని తెలియుటచే రాబోవు స్రావమునకు తగిన చికిత్సను ముందుగనే పొందవచ్చును.

వైద్యుడు వచ్చునంతలో చేయవలసినవి:—తల్లి యొక్క తలభాగమును మిగత శరీరభాగముసకన్న క్రిందికి వాల్చి యుంచవలెను. నేలమీద పరుండి యుండిన వీపునకును నడుమునకును దిండ్లుంచి తలకు దిండులేకుండ చేయవలెను. కాళ్లను కూడ శరీరమున కన్న ఎత్తుగా నుంచవలెను. ఇట్లు చేయుటచే శరీర మున, వెలువడినది పోగా మిగిలిన రక్తము మెదడుకు ముఖ్యముగా విస్తరించి స్మృహ తప్పకుండ చేయుట యేగాక గర్భకోశము ఎత్తుగా నుంచుటచేత దానికి రక్తము విశేషముగా ప్రవహించదు. తల్లి బల్లమీద పరుండి యుండిన తల్లికాలివైపునుండు బల్లకాళ్లను మాత్రము 6 అంగుళములు మాత్రమైనను ఎత్తుగానుంచిన తలవైపు తగ్గును. వేడి కాఫీనీటి (strong coffee) ను త్రాగించవలెను. మంచి నీటిని అధికముగా నివ్వ వలెను. అట్లు చేయుటచే (స్మృహయుండిననే) మొత్తమున తగ్గియుండు రక్తమునందు నీరు చేరిన నాడి దార్ఢ్యమును పొందును. కాళ్లకుచేతులకు (turpentine) తైలమురాచి రుద్దవలెను. శరీరమును కంబళ్లచే కప్పి యుంచవలెను; వేడినీటిని పెద్ద సీసాలలో-బోసి మూతయుంచి ఒక్కపొరగుడ్డ చుట్టి శరీరమున చుట్టు ప్రక్కల నుంచవలెను. అందుచే తగ్గినవేడి యధిక మగును. గుడ్డచుట్టక యుంచినట్లైన కొంతకాలము తగిలినచోట బొబ్బలగును. కడుపుననుండి గర్భ కోశ మును అదిమియుంచవలెను. విశేషముగా నొక్క రాదు.

ఇంతలో వైద్యుడు వచ్చి గర్భకోశమునకు శక్తి నిచ్చుటకును, అందు నిలిచి యుండు తిత్తి తునుకల వెలి పరచుటకును, అందు శక్తికలుగునందాక రక్తమును వేరు విధముల నాపుటకును ప్రయత్నించును. మందు సూది గ్రుచ్చుట, (Ergot or Pituitrin) ఒక చేతితో గర్భకోశమును కడుపుక్రిందిభాగమునుం డియు, మరియొకచేతితో మర్మస్థానము మూలముగా లోనుండియు గట్టిగా అదుముట, వేడి నీటిని మర్మ స్థలమునుండి గర్భకోశములోనికి పోనిచ్చుట (Douche) ఉప్పునీటిని కాచి చర్మములోనికైనను రక్త నాళములోని కైనను సూదిమూలమున ఎక్కించుట, (Saline) గర్భకోశమును గుడ్డలచే (Gauze) నింపుట. గర్భకోశమునకు రక్తముకడుపున ప్రవహించు పెద్దనాళము(Abdominal aorta)నుండియేచేరును గనుక ఈపెద్ద రక్తనాళమునే కడుపున అదుముట, తిత్తితునుకలు గర్భమున నంటియుండినవాటిని చేతితో బలవంతముగ లాగివేయుట మున్నగునవి వైద్యుడు చేయవలసినవి. ఈ చికిత్సకు లొంగనివ్యాధిలేదు. అయినను చాలరక్తము వెలువడిన వెనుకను నీరసము ప్రాప్తించినను, స్మృహ తప్పియుండిన వెనుకను ఈ చికిత్సలు ప్రారంభించిన స్వస్థత కలుగుట కొంత సంశ యము. ఈ వ్యాధి నిమ్మళించినను ఇంత విశేషముగా గర్భకోశమును తాకినందున రక్త విషజ్వరము తప్పక కలుగును.

## గాయమునుండి కలుగు స్రావము:—

ప్రసవపుకాలువయం దేచోటనైనను వ్రణముకలిగిన దానినుండి రక్తము విశేషముగా శరీరమునం దితరచోట్ల యందలి గాయములవలెనే వెలువడును. గాయము లో నున్న కొలది స్రావము అధికముగను, వెలుపలనే యున్న తక్కువగ నుండును. వెలుపలి స్రావమును సులభము గానే ఆపవచ్చును. అయినను వైద్య సహాయమున నే చికిత్సను పొందవలెను. ఈ గాయములనుండి విష పదా ర్థములు రక్తమున చేరుటచే పిదప రక్త విషమ జ్వరము (Puerperal sepsis) కలుగును. శరీర మున రక్తము తగ్గినప్పుడు ఎట్టి లేశమైన వ్యాధియు తీవ్రతను జెందును.

"Prevention is better than cure."

# ముద్రాక్షరి

శ్రీమత్పరదేవతాయై నమః.

"శ్లో॥ ఘృతమివ పయసి నిగూఢం। భూతే భూతేచ వసతి విజ్ఞానమ్। సతతం మన్థయితవ్యం। మనసా మన్థానభూతేన।" (దేవీభాగవతము) క్షీరమునందు నేయి యిమిడి యున్నట్లు ప్రతిభూతము నందును జ్ఞాన మిమిడి యున్నది. మనస్సనెడి కవ్వముచేత మథించి నచోనది బయల్పడునని దాని యాశయము. ఆ యీ భూతముల యెడల ఉచ్చనీచాది భేదములతోఁ గూడ విచక్షణుల కవసరము లేదని బుద్ధుఁడు చెప్పుచున్నాఁడు. ఉ॥ నీచులనుండియుం దగిన నీతులు కొన్ని గ్రహింపవచ్చు (బుద్ధచరిత్ర) ఈ విషయమున గురు శుశ్రూషకన్నను స్వప్రయత్నమే ముఖ్యమని పై సందర్భమువలన మనము గ్రహింపనగును. మనుష్యజన్మముకన్న జ్ఞానార్జనమునకుఁ దగినది లేదు. సంసారమును తరించుటకు ఇది యొక నౌకవంటిది. ఇది నా స్వకపోలకల్పన గాదు. శ్లో॥ "బహునా పుణ్యపణ్యేన క్రీతేయం కాయనౌస్త్వయా" అని యభియుక్తులు వక్కాణించి యున్నారు. మంచినౌక సంపాదించుకొని యది చెడిపోకుండఁగనే సముద్రతరణ మొనర్పక యేమఱిన సోమరింబలెనే మనుష్యజన్మమును సంపాదించు కొని జ్ఞానార్జనముచేసికొనక వ్యర్థుండగువాఁడు శోచ్యుఁడని మన పెద్దల తాత్పర్యము. "జ్ఞానముకన్న నుత్తమపదార్థము లేదు. జ్ఞానికి నిహమునసేకాదు పరమునసేకాదు సర్వదా పూజ్యత కలదనుట నిర్వివాదాంశము. ఆ జ్ఞానమనఁగా నెట్టిదో నిర్వచించుటకు కొలఁదిమాటలలోఁ దేలునదికాదు గాన విస్తరింపను. అందులకు పురాణములు లోనైన పలుసాధనములు గలవు. అభిజ్ఞులగు పెద్దలు పలువురు కలరు. తద్ద్వారమున జ్ఞానార్జన మొనర్చుకొనుటకన్న మనుజమాత్రుల కితర కర్తవ్యము లేదని నా విజ్ఞప్తి.

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి, శతావధాని.

కడియము, తూర్పుగోదావరి, డి. 20-6-35.

# విద్యా విజ్ఞానము

## పాఠశాలలు - తెనుగు

హైస్కూళ్లయందు తెనుగును రెండవభాషగా జెప్పుచుండుట యెల్లరకు దెలిసినదే కాని యచట జెప్పుచుండు తెలుగునుగూర్చి యాంధ్రు లాకించుక తెలిసికొనవలసి యున్నది.

హైయరుఫారములయందు నిర్బంధపాఠ్యములు సామాన్యముగ పూర్వకవుల గ్రంథములనుండి సంగ్రహించిన గ్రంథభాగము లుండుటచేత (సెలక్షనులు) నుచితములని తోచినవానిని తరగతినిబట్టి నిర్ణయించుకొనవచ్చును. కాని క్రింది ఫారములలో, తరగతులలో నియమించు పుస్తకములు, పద్యములు విచారింపదగ్గవి. చిన్న తరగతులయందు సరళమగు తెనుగును బాలురు తమ మనస్సున కందెడి, వాడుకకు దూరము గాకుండెడి భాషను చదువుటకు మాఱుగ సంస్కృత సమాస బహుళమగు భాషను, తాము కనివిని యెఱుగని భాషను నేర్చుకొనవలసివచ్చుట విచారకరము. ఆ వయస్సున నీభాషను నేర్పుట పెద్దయక్షరముల వ్రాత కుదురకముందే గొలుసుకత్తును నేర్పుటకు బ్రయత్నించుటయే. వారిట్టి భాషతో తేనెవంటి తమ తెలుగునకు తిలాంజలి యొసగవలసి వచ్చుచున్నది.

ఇక పద్యములు చిన్న తరగతుల- పసిబాలురు చదువుట కనువగునవికాక యే మహాభారతమునందలి పద్యములనో ప్రచురింతురు. భారతమునందలి భాష వారి కిప్పటినుండియు నోడలికి బట్టింపవలయునని కాబోలు ! అన్వయము కుదురక పెద్దలే తల బ్రద్దలు కొట్టుకొనుచుండ మహాభారత పద్యము లా ముక్కుపచ్చలారని పసిబాలురు నేర్వదగినవి ? అంతకంటె వారి యీడునకు దగిన మనోహర పద్యములు తెనుగునందు కఱవయ్యెనా ? సకలజనులు నౌరా యనగా ధారాళమైన నీతులు నోరూరగ చవులుపుట్ట నుడివిన సుమతిశతక మేమైనది? తెనుగుదనమునకు జీవగఱ్ఱయై తెనుగు నాటికి గర్వకారణమై, తెనుగుభాషకు మచ్చుముక్కలై యలరారెడు వేమనపద్యము లేమైనవి ? ఈ భాష పసిబాలురకు నేర్పరాదనియా; లేక ఆ బాలురకు చాలదనియా? చిన్న తరగతుల పుస్తకములందు పూర్వకవుల పద్యములను, పెద్దతరగతులయందు సొంత పద్యములను సరళములగువానిని ప్రచురించుటకంటె పెద్దతరగతులందే పూర్వకవికృత పద్యములను ప్రచురించుట మేలుగాదా ? మఱియును ఒకే పద్యములను రెండు మూడు తరగతుల పుస్తకములయందు వేయుటలో సామంజస్య మేమి ?

"చెలులు వగతురు నెవ్వని చెవితనంబు, కవితనంబుఁ గీర్తింతురు కడఁగి యెపుడు, నట్టి పుత్రునిచే సుగుణాఢ్యులార, పుత్రవంతుఁడు నాఁ బెంపుఁ బొందుఁదండ్రి." ఇది నాలుగవ తరగతి బాలుర బుఱ్ఱకెక్కఁగలదియా ? ఇంతకంటె "పుత్రోత్సాహము తండ్రికి పుత్రుఁడు జన్మించినపుడె పుట్టదు మఱి యా, పుత్రుని జనములు పొగడఁగఁ, బుత్రోత్సాహంబు నాఁడు పొందుర సుమతీ" యను పద్యమును నేర్చుకొనుట భాషా దృష్టిలో వారికి మేలు గాదా !

ఉపవాచకములనుగూర్చి యొక్కమాట.

ప్రతి తరగతియందును ఉపవాచకములను జదివించుట యాచారము. బాలురకు స్వతంత్రముగ పుస్తకములు చదువుకొను శక్తిని, అభ్యాసమును గలిగించుటకును, చక్కనిశైలి యలవడుటకును ఇవి ప్రధానముగ

నుద్దిష్టములు. కాని సామాన్యముగ నిప్పుడు గ్రంథకర్త లకును, ప్రకాశకులకును సహాయము చేయుటకే యుప యోగపడుచున్నవి. 'సత్యము పలుకవలయును' అని హారిశ్చంద్రకథ నొకరు వ్రాసినచో 'నసత్యము పలుకరాదు, అని యాకథనే మఱియొకరు వ్రాయు చుందురు. దానినే "నిజము చెప్పవలయును" అని మఱియొక గ్రంథము ప్రకటించును. ఇట్లివి యన్నియు దరిదాపుగ కవలపిల్లలవలె బుట్టుచుండును. సరే! దానికేమి?

ఇందులో కొన్నింటి భావ మఱియు విపరీతముగ నుండును.

చూడుడు—కొన్ని మాటల నుదహరింతును. బాల కథాసరిత్సాగరమునుండి—దీనిని గుంటూరులోని... వారు ప్రకటించినారు. కర్త......M. A. L. T మా పాఠశాలలలో, II ఫారమునకు ఉపవాచకమిది.

"ఆ ధనము నెచ్చటికి చేర్చమని సెలవు... అవసర మైనపుడు వచ్చి తీసుకొనిపోదును. 3-వ పుట.

"లోహితాస్యుని క్రమయము చేసుకొనెను. అంతం బోక నక్షత్రకుఁడు యిన్ని నాళ్లు కూడ వచ్చినందులకుఁ దనకు భత్యము రావలెనని పట్టుపట్టెను"7-వ పుట.

'కాశిలోని వల్లకాటికేడు కొనెను.' 7-వ పుట.

"నాకు వసిష్ఠుల వారికి బన్నమువచ్చి నీ కీకష్టములు వెంటఁబడినవి" 10-వ పుట.

"మా కూపిరాడడము లేదు". 13-వ పుట.

"మఱల దగ్గిరివాటిని ముక్కలుచేయుచుండెను" 15-వ పుట.

"ఆకసమున నొక విమానముపై రావణాసురుఁడు నొక కాంత కనుఁబడిరి." 18-వ పుట.

"లక్ష్మణుఁడు దానినివిప్పి చూడ వదినెగారి నగలని గుర్తించెను." 19-వ పుట.

"హనుమంతుఁడు వచ్చినవాఁడను రానే వచ్చితిని; నా శక్తినగుపించి పోవలెనని కుతూహలము తోచెను" 22-వ పుట.

కర్ణునకు దానుక్షత్రియుఁడనని యెరుఁగడు." 26-వ పుట.

"లేచినిల్చుని చేతనున్న పుడకలో బ్రహ్మశిరాస్త్రిం నరిబోసి అపాండవం బగుగాక యని విడిచిపెట్టెను" 56-వ పుట.

"బ్రహ్మశిరాస్త్రిము నేల భగభగమండుచు బయలు దేరనుండె" 56-వ పుట.

"దుష్టబుద్ధీ! అశ్వత్థామ! బ్రాహ్మణుఁడవని మిట్ట పడుచుంటివి. ఇంతకచ్చ, యిట్టి శౌర్యము బ్రాహ్మణ లక్షణములు గావు." 58-వ పుట.

ఆ కన్యకలు ఈ జడదారి కూతుళ్లని (4-వ పుట.) బాలులారా (6-వ పుట.) స్మశానమనియే (8-వపుట) రుసుము నివ్వవలసి యుండెను. (8), భర్తకుతప్ప యిత రులకు (9-వ పుట) రాయి చేసుకొని, (9-వ పుట) బాలులారా (10-వ పుట) ఎంతనిద్ర బోతివని (10-వ పుట) సుగ్రీవుఁడు యెందున్నది (20-వ పుట) వెనుకఁ బోయిరి (20-వ పుట) ఊపిరిబిగియఁబట్టి చేతులంకాచి ...బంతివలె యాకసముపై లేచె (20-వ పుట) అది సందు చేసికుని 21-వ పుట) తీసుకు వచ్చిన 21-వ పుట) నిన్నొకతృటిలో. (21-వ పుట.)

మఱియొక పుస్తకమునుండి. ఇది 5-వ ఫారమున నియమింపబడ్డది. పేరు రూపవతి. బెజవాడనుండి ప్రకటితమయినది. కర్త్రి... గారు.

"ధైర్యద్యోతకంబులగు నుత్తర ద్వయంబును... వివిధదేశాగమనులై వచ్చిన...మఱేకారణమునసో నటనుండి తన కుటీరమెత్తివేసెను" 125 వ పుట.

"ప్రమాణబడలికఁ దీరునంతస..." 125 వ పుట.

'ఫాలభాగంబువాని, యాకర్ణాంత నేత్ర యుగ్మం బువాని...శార్దవీర కరుణారసంబులు వెల్లివిరియు వాని...వీరలక్ష్మియుత్తంబగు యాజానుబాహువులుఁ గగ్గి సాము కసరత్తులచే దండలుఁదిరిగిన భుజంబుల వాని, నిమ్మపండువంటి పసిమిచ్ఛాయఁ గలవానిఁ

గాంచి...(123, 124 పుటలు) ఆమె దీని కేమియుఁ బ్రత్యుత్తరం బివ్వక. (55 వ పుట,)

విశాలమై సుస్నిగ్ధ పాలగచ్చుచేఁ బ్రతిఫలించు... అత్యద్భుత శిల్పకళాశోభ సౌభాగ్యవంతమై...వివిధ వర్ణ పాదరసంపుబుడ్లతోడను...అధోభాగంబున నేలపై నానా రకంబుల రత్నకంబళులచే (55-56 పుటలు)

ఏ పురీరత్నం బనేకమారులు తురుష్కులచే ముట్టడింపఁబడియు...స్వతంత్ర్యేచ్ఛ జనింపఁజేసెనో. (43వ పుట)

"అన్నగరంబు...శిల్పకళా కౌశలులగు శిల్పకారులచే...అతి యున్నతముగా నిర్మింపఁబడిన సౌధరాజములచేతను, యుత్తమ మందిరములచేతను...అతిదుర్భేద్యంబై...ఒప్పారుచుండు." 43-వపుట.)

మాప్రభువరులు సాయంసమయ సంధ్యానుష్ఠానమాచరించుచు సమాధినిష్ఠులై యుండ నెవ్వరో యిరువురిచే ఘోరముగ వధింపఁబడిరఁట. (65-వ పుట.)

మార్వార్ రాజ్యము...విపక్షులకు దుస్సాధ్యంబై యుండె...రాజదుర్గమును బహునేర్పుతో నిర్మింపఁజేసి...మఱెంత దుర్భేద్యమై. (64-వ పుట.)

మచ్చునకివి చాలు ననుకొందును. పుస్తకమునకంతటికి నీ పుటలయందే యీ మాటలు, ప్రయోగములు గలవనికాని, ఈ పుటలయందైన నివియే కలవని గాని పాఠకులు భ్రమియింపకుందురుగాక?

ఈ పుస్తకములు టెక్స్టుబుక్కుకమిటీవా రంగీకరించి తమముద్రవైచి విడిచినవే. వారు వీనిని పాఠ్యములుగ నెట్లు ఒప్పుకొన్నారో తెలియదు. వారికి భాష యడ్డంకి కాదు గాబోలు! వారికి కావలసినది రూపరేఖావిలాసములుమాత్రమేనా?

పాఠశాలా పుస్తకములను తెలుగువానిని నిర్ణయించునపుడైనను ఆంధ్రోపాధ్యాయులకు సంబంధము లేదు. ప్రధానోపాధ్యాయులుమాత్రము చేరి తమకిష్టమువచ్చిన పుస్తకములను తాము సూచింతురు. తాము బోధింపవలసిన యింగ్లీషుపుస్తకములనుమాత్రము జాగ్రత్తగ చూచుకొందురు. మఱి తెలుగో! ఇంగ్లీషు కాదుగా! బానిసభావులకు గౌరవమునకు దూరము దాటరానిది గాదా! కనుకనే ఏదియో యొకటివ్రాసి వేయుడందురు. సరి! దానితో తెనుగుభాషాపాఠ్యగ్రంథనిర్ణయ మైనట్లే.

ప్రస్తుత పరిస్థితులలో ఒక్క భాషాపాఠ పుస్తకములు ఒక్కనిభాషలోనున్నను అట్టేలాభ మగపడదు. ఏమందురా! హిస్టరీ, జాగ్రఫీ. సైన్సు మున్నగుపాఠముల భాష భాషావృష్టిలో జూచినచో నెటులుండునో చెప్ప నక్కరలేదు. కనుక దినమున కే కొంచెమునేపో మంచితెలుగు చదివినను తక్కినకాలమున చాల భాగము బాలురు చేయు చారిత్రికాది భాషా పరిశ్రమ వృథాపోదుగదా! కనుక భాష బాగుపడవలయునన్న నా విషయ పుస్తకముల భాషయును మనోహరముగ నుండవలయును. అవి విషయప్రధానములే గాని భాషాప్రధానములు గావందురా! భాషకు గూడ ప్రాధాన్యము నిండనియే మా ప్రార్థన. ఆంగ్లమున చరిత్రాదులు బోధించుపట్టున నా పుస్తకము లెట్టి భాషలో నున్న నేమి యని తప్పుడు భాషా పుస్తకముల నైన నెన్నుకొందురా!

ఈ పుస్తకములను నిర్ణయించు నంత్యాధికారము ఇప్పుడు కొన్ని జిల్లాలలో జిల్లాబోర్డు అధ్యక్షులు కైకొని యున్నారు. వారికో విషయముతోడను, భాషతోడను పనిలేదు. కంపెనీలు, ఏజంట్లు, సిఫారసులు, మొగమోటమి వీనితోడనే పని. వా రెంత విద్యావంతు లయినను పాఠ్యపుస్తక నిర్ణయాధికారము తద్విషయ పారిశ్రామికులగు నుపాధ్యాయుల కొసగుట సమంజసము గాదా? (బాలుర తరగతిని పుస్తక

భాషను చూచుటకు మాఱుగా పుస్తక ప్రకాశకులను గుర్తులను తమ యభిమానకారణమును జూచి ఎక్కువ యమ్ముఁడుపోవలసిన పుస్తకములను చిన్నతరగతుల కును, తక్కువ యమ్ముఁడుపోవలయు ననుకొనువానిని పెద్ద తరగతులకును గూడ కొన్ని చోటుల నిర్ణయింప బడు చున్నది.)

సిఫారసులయందు, ఆశ్రయింపులయందు చేయి తిరిగిన కొందఱు ప్రకాశకులు గ్రంథకర్తలు ఎక్కువ వెలలు వేసి తమతమ పుస్తకములను కొందఱకు లంచము లిచ్చియైనను పెట్టించి లాభము పొందుచుందురు. వారి లాభము వారిది. కాని నష్టమో...?

ఈ కాలమున భావప్రకటనమే ప్రధానముగ జూడ వలయునుగాని వ్యాకరణమునకు, భాషకు ప్రధానత యీయరా దందురా? సరియే. అప్పుడన్ని పుస్తకములును, ఆమూలాగ్రముగ నటులే యుండుటమేలు. అప్పుడైనను భాషలో నంద ముండవలయునా? అదియు నక్కఱలేదా! మఱి యిప్పుడు కర్తలు గ్రాంథికము వలె భావ నుంప బ్రయత్నింప నేల? లేక యిట్లు పుల గమువలె నుండుట లాభదాయక మందురా? అది రెంటికి నష్టమేమో—? అదియును గాక స్కూలు ఫైనను పబ్లికు పరీక్షలయందు కనబడిన విద్యార్థుల భాషా దోషములను ప్రతి సంవత్సరము పరీక్షకులు సూచించుచుందురే. ఆవి మార్కులతో పైయట్టివానిని గూడ సూచించి, సంస్కరింపవలయునని హెచ్చరించుచుందురే! అట్టి స్థితిలో మఱి యట్టి భాష పబ్లికు పరీక్షలో విద్యార్థుల గొంతుక పట్టుకొనదా? పట్టుకొన్నచో మనకేమి యందురా? ఆఁ! ఫర్వా లేదులే! పట్టు కోదులే, పరీక్షలో జాగ్రత్తగా వ్రాసినచో చిక్కు లేదులే యందురా? ఆంధ్రుల యభిమతమేమో!

'ఒక యాంధ్రోపాధ్యాయుడు'

---

# స్వీ కా ర ము

### సుజనత్రయము

(మంచివారి జీవితకథలు.) శ్రీ వాఙ్మయ వినోదినీ గ్రంథమాల 3 వ కుసుమము. గ్రంథకర్త శ్రీ కవిభూషణ-శతావధాని, విద్వాన్ దోమా వేంకటస్వామిగుప్త గారు క్రౌను ౧౨౦ పుటలు. వెల ౧౨ అ. ప్రకాశకులు, "స పాదకులు, శ్రీ వాఙ్మయ వినోదినీ గ్రంథ మాల, ౩౫, ౩౭-తంబుసెట్టివీధి, జి. టి. మదరాసు.

### ఆంధ్ర రమణీమణులు

(మొదటి భాగము.) ఆంధ్రకీర్తి గ్రంథమాల ప్రథమ కుసుమము. రచయిత ఆంధ్ర శేషగిరిరావుగారు బి. ఏ. "ఆంధ్రభూమి" సంపాదకులు. క్రౌను ౯౭ పుటలు. ఈ పుస్తకము మూల్యము అ. ౯. వలయు వారు గ్రంథకర్తకు, (వేపేరి, మదరాసు.) వ్రాసి కొనవలెను.

### ఆదర్శ సుఖజీవనము

(చేసి మఱి చింతింపకుము)

ఖుషీరామ్ ఆంగ్లమున రచించిన "An ideal Happy life" or "Do but never mind" అను గ్రంథమున కనువాదము. కర్త - కూచి నరసింహముగారు. సైజు డెమ్మీ, ౧౨ పుటలు. వెల: రూ. ౧. దొఱకు చోటు: "కె. వి. గౌరాంగమూర్తి గారు, c/o గ్రంథకర్త, పిఠాపురము. తూర్పు గోదావరిజిల్లా" లేక "ముద్దా విశ్వనాథముగారు, వ్యాస కుటీరము, మేలుపాక-ఎలమంచిలి తాలూకా, విశాఖపట్నము జిల్లా."

### శాకాహార ప్రయోజనము

గద్యరచనము. Superiority of Vegetarian Diet from the Scientific and Hygienic stand point" అను నాంగ్ల గ్రంథము నుండి యనువదితము. డెమ్మీ ౫౭ పుటలు. అనువాదకుడు. మండా వేంకట నరసింహారావుగారు. వెల 8 అణాలు. దొఱకుచోటు "రావు సాహేబు యం. వి. అప్పారావు పంతులుగారు, వెంకటేశ్వర స్వామి దేవాలయము వీధి. బరంపురము. గంజాముజిల్లా."




### తెలుఁగు ముద్రణవిషయాభివృద్ధి

బెంగుళూరుసిటీ నేషనల్ టైపుఫౌండ్రీ వారు తెలుఁగు ప్రింటు అక్షరములు తగ్గించు నుద్దేశముతోను, దినదినమును ఇప్పుడు కంపాజిటర్లు కూర్చు పుటల సంఖ్యకన్న నెక్కువ పుటలు కూర్పఁగల యానుకూల్యము గల్గవలయునను నుద్దేశముతోను ఆంధ్రముద్రణాక్షరములను సంస్కరించి ఆ రకము అక్షరములను పేటెంటుచేసి సదరు అక్షరములతో తమ ప్రణాళికా సంగ్రహమును, ఆ యక్షరములవలనఁ గల్గు లాభములను వివరించి యున్నారు. ఈ పద్ధతియొక్క బాగోగులను గూర్చి "త్రిలింగ" మొదలయిన పత్త్రికలింతవఱకే చర్చించి యున్నవి. ఈ ముద్రణాక్షర సంస్కరణమునుగూర్చి యింతకు ముందు 'భారతి' మొదలయిన పత్త్రికలలో చర్చోపచర్చలు జరగినవికాని అవి "ఆఫలోదయకర్మణామ్" అను బుధోక్తి సార్థకపఱచి ఆంధ్రదేశములోనే యాంధ్రాక్షర సంస్కారము జరగిన దనమాట ననిపింపలేకపోయినవి. ఇతరులు మనకు చేసిన దుపకారము కాదన వీలులేదు గాని యెంత సే పున్నను మొదటి యభిప్రాయ మీ దేశమునఁ బుట్టుట - దాని నాచరణకుఁ బెట్టు కార్యదీక్ష యీ దేశములో లేకపోవుట, ఏ కొద్దిగానో యభిమానమున ప్రాకులాడువా రెవరో యున్న విమర్శోపవిమర్శములతో వారి ప్రయత్నమును వారిని నామావశిష్టులఁ జేయుట మనవారి కలవాటైపోయినవి. అన్ని చర్చలా? ఆ చర్చలు చూడఁగా ఇదుగో! రెండేడ్లలో కుదిరించి వ్రాయలేక మనమును జిలుగు చేదువలేక లేఖాగ్రాహులును శ్రమపడకుండ టైపురైటరుత్పత్తి యగునని యనేకులు మురిసిరి.

కడపట ఆంధ్రదేశమునకు నూతనాక్షర ప్రసాదనావకాశము కర్ణాటకులకుఁ దక్కినది. ఈ యక్షరముల పద్ధతినిగూర్చి యెన్నియో మెప్పులు మన దేశమునుండి ఫార్మాలిటీ ప్రకారముగా అక్కడికి వెడలును. ఆ మెచ్చు ననుసరించి "క్రొత్తవింత" వారగు మనవా రా టైపుల నవ్వారిగా తెప్పించుటయు - ఈ దేశము డబ్బును ఈ దేశము యొక్క కృతజ్ఞతయును బెంగుళూరును జేరుటయును దప్పదుగదా? తత్తథాస్తు.

అయినను మాయభిప్రాయముగఁ గొన్ని సంగతులు మనవి చేయుచున్నాము. నేషనల్ టైపుఫౌండ్రీవారు గావించిన ప్రకటనయందలి యక్కరముల రూపు కన్నడమును బోలియున్నదికాని తెలుఁగు అక్షరముల కాసన్నముగా లేదని ఆవ్రట్టువలు, శవణాము, గీతల యొంపులలోనిలావు తనములును మొదలయినవి తెల్పుచున్నవి. ఈ అక్షర రూపభిన్నత్వము ఆ ఫౌండ్రీవా రాయక్కరముల రూపములను ఒక తెలుఁగు ఫౌండ్రీ యెక్స్పర్టుచేఁ దయారుచేయించుకొని యుండినచో అవి యాంధ్రాకృతినే బోలియుండెడివిగదా? ఈ యక్కరముల రూపములలోను ఎన్నియో లోపము లున్నవనియును వానిని చాలతగ్గింప వీలుండుననియును త్రిలింగ పత్రికలోఁ బ్రకటింపఁబడి యున్నది.

అట్టి యుపపత్తిగలవా రుండియు - 1/2 1/4 శతాబ్దపు టనుభవములుగల ముద్రాలయము లీ చెన్ననగరాన నుండినను చెన్ననగర మాంధ్రులదను భానముండియును ఇక్కడ ఈ మాత్రపు టైపులసంస్కరణమేల జగరురాదో? ఈ విషయమున దేశోద్ధారకులు మొదలయినవారు "Charity begins at home" అను నీతిని గమనించి అన్యదేశోద్ధార ప్రయత్నముగాక స్వదేశమగు తెనుఁగుభూమికిఈగౌరవమును ఈలాభమును ఒనఁగూర్చియుండినచో బాగుగా నుండెడిది గదా!

ఈ టైపుల విషయమున విశేషానుభవము గల్గిన వావిళ్ల - ఆంధ్రపత్రిక - ఆనంద మొదలయిన గొప్ప గొప్ప చెన్నపుర ముద్రణాలయముల యధిపతులు ఈ విషయమునఁగూర్చి సంప్రతించినచోఁ గర్తవ్యోపాయము తోఁచునని మా యొక్క యాశయము.

### ఆంధ్రులు - హిందీభాష

ఇపు డాంధ్రదేశము హిందీవ్యామోహమున మునిఁగి తేలుచున్నది. హిందీప్రచారకులు తమప్రచారముపట్టుల నవలంబించెడి మార్గములు న్యాయ్యదూరములు. విద్యాధికులు దేశహితైషులు నగు కొందఱు నాయకులుకూడ అట్టిప్రచారమును ప్రశంసించుట విచారకరము. హిందీప్రచారకులు తెలుఁగు బిడ్డలకు ఉగ్గు పాలతోడనే హిందీని నేర్పుచు, అక్షరాభ్యాసము దేవనాగరలిపియందే యొనరించుచు మాతృదేశమునకు, మాతృభాషకును తీరనిద్రోహము నొనర్చుట తప్పు.

హిందీ భారతదేశసామాన్యభాష కావచ్చును. అది యట్లు కాకూడదనికాని, దానిని అభ్యసించుట తప్పనికాని నాగరకజనుఁడు తలఁపఁడు. కాని హిందీని ఎట్టివా రభ్యసింపవలెను? ఎంతవఱకభ్యసింపవలెను? అను విషయముమాత్ర మాలోచనీయము. ప్రథమవాచకపుస్తకము చదువనేరని పసిబాలురకును, గృహకృత్యములందు మునిఁగి తేలు ముదితలకును, మూడుకాళ్ల ముదుసలులకును హిందీ

భాష నిర్బంధాభ్యసనీయముగ ఏరుపడుటకు కారణము కానరాదు. ప్రపంచము నంతను అల్లుకొనియున్న ఆంగ్లభాషకును దొరకని స్థాన మాంధ్రమండలములందు హిందీ అలవరచు కొన్నది! ఆశ్చర్యము !!

హిందీప్రచారకులు దేశభాషలను అణచి వేయు దురభిప్రాయమున నొనరించు ప్రచారములను నిరసించుచు, ఆంధ్రులను ప్రబోధించుచు చాలకాలమునుండి "ప్రబుద్ధాంధ్ర" పాటుపడుచున్నది. తొలుత ఆ పత్రికను తిట్టిన హిందీప్రచారకులే తదాశయములను బాగుగ గుర్తించి ప్రశంసించుచు వ్రాసినయుత్తరములు రెండీనడుమనే 'ప్రబుద్ధాంధ్ర' (మే. సంచిక) ప్రకటించినది. ప్రచారకులే తమ తప్పు నెఱిగినను ఆంధ్రులింకను ఎఱుగకయుండుట విషాదకరము. మఱియొక సంగతి. దక్షిణ భారత హిందీ ప్రచారకసమితివారు హైస్కూళ్లన్నింటి యందును మాతృభాషలకొసగు స్థానమును హిందీ కీయవలెనని ప్రతిపాఠశాలకును నివేదికలను పంపుకొనుచున్నారు. దీనినిపట్టి ప్రచారకులకు దేశభాషలయెడ గలది మాతృప్రేమయో, మారటతల్లిప్రేమయో యెఱుగ రాకున్నది. ఇంకనైనను ఆంధ్రులు తమ మాతృభాషకు జరుగుచున్న అన్యాయమును గుర్తించి తెలుగుతల్లివంతను తొలగించుట అవశ్యకర్తవ్యము.

## రాష్ట్రేతరాంధ్రుల కర్తవ్యము

ఆంధ్రదేశమునుండి దేశాంతరములకు వలసపోయిన యాంధ్రులు కొన్నిలక్షలమంది యున్నారు. అందాంధ్ర దేశ, భాషా, వాఙ్మయాభిమానులును ఉన్నారు. కాని యాంధ్రదేశమున హిందీప్రచారమువలన గలిగిన యలజడినివారించుటకయినను ఎఱిగినట్లు లేదు. ఇతర రాష్ట్రములందు నివసించు తెలుగువారు, స్థానికభాషను ఎఱిగి తీరవలె ననుట నిర్వివాదము. కాని ఆంధ్రమండలములందలి హిందీభాషాభిమానులవలె వీరు తమ పసిబిడ్డలకు సయితము హిందీభాష నభ్యసింపజేయుటయు, తెలుగుమాటల - తెలుగక్షరముల పొలితియే వారికి తెలియకుండజేయుటయు మిగుల శోచనీయము. రాష్ట్రేతరాంధ్రులు మాతృభాషయెడ జూపుననాదరమును ఆంధ్రమండలములందు హిందీప్రచారకుల స్వేచ్ఛాప్రవృత్తి కవలంబన మయినది.

ఇతరరాష్ట్రములలో ఆంధ్రులు నివసించు కేంద్రస్థానము లన్నింటియందును ఆంధ్ర జన సంఘము లున్నవి. సభ్యులుకూడ ఎక్కువగనే ఉన్నారు. వారెల్లరు నుత్సాహము కలిగి యుండవచ్చును. కాని యాంధ్రులకు అసహజములగు ఐకకంఠ్యము, పట్టుదల వారియందును కొఱవడియుండుటనో మరేకారణముననో గాని వారియాశయములు ఫలించుచున్నట్లు తోచదు.

హిందీప్రచారకులు ఆంధ్రదేశమున ప్రచారము నొనరించినట్లు రాష్ట్రేతరాంధ్రులు తమ నివాసస్థానములందు ఆంధ్రభాషా ప్రచారము నొనరించినచో భాషకును, దేశమునకును కొంతసేవ నొనర్చినవా రగుదురు. మఱియు వారు తమరు వసించు కేంద్రస్థానములందలి పాఠశాలలో ఆంధ్రభాషకును తగిన స్థానమును సంపాదించుటకు స్థానికప్రజలతోను, స్థానికసంస్థల అధికారులతోను సంప్రతించి తత్ప్రయత్నమున కృతకృత్యులు కావలెను. ఆంధ్రుల కట్టి యుత్సాహము కలిగి ప్రయత్నించినచో సంస్థల యజమానులు వారి పసికూనలకు మాతృభాషను నేర్పింపని పాపమున కొడిగట్టరని అనుభవజ్ఞుల విశ్వాసము.*
రాష్ట్రేతరాంధ్రు లిట్లొనరించినచో హిందీ ప్రచారకులకు ఆంధ్రదేశప్రచారమున కొంత జంకయినను కలుగును. కాన ఇతరరాష్ట్రములందలి ఆంధ్రసోదరు లెల్లరును తమ భాషాభిమానమును, దేశాభిమానమును కార్యరూపమున వెల్లడించి,తమ జాతీయతను,వ్యక్తిత్వమును స్థిరపడునట్లు చేసికొందురుగాక!

## తేయాకు—ఒక బౌద్ధర్షి బయల్పడుట

అనేక శతాబ్దములక్రింద బోధిధర్మ డను నొక హైందవ మునీశ్వరుఁడు మోక్షము కొఱకు తొమ్మిది సంవత్సరములు నిద్రారహితముగా నుండెను. ఎనిమిదవ వత్సరమున నతని కావులింత వచ్చినది. అతని కేమి చేయవలయునో తోఁచ లేదు. అతఁ డేండ్లుగా ఘోరతపము గావించినది అతఁడు వాంఛాతీతుఁడు గావలయుననియే. అట్లావులింత వచ్చినప్పు డెట్లయినను కన్నులు తెఱచుకొని యుండుటకుఁ బ్రయత్నించుటకై యతఁడు తనచుట్టును జూడఁగా సమీపమునం దొకపొద కానఁబడినది. అతఁడా పొదలోని యాకులను ద్రెంచి నోటవేసికొని నమలనారంభించెను. తక్షణమే యతనికి నిదురమత్తుఁ దొలఁగి మెలఁకువ గల్గినది. ఆపయిని స్వర్గమర్త్యమధ్యగమయిన యతని యాలోచన నిల్చిపోయినది. ఆ యాకుల భక్షణముతో నతఁడు తన సాధనమును నిల్పెను.

---

* కొన్నియేండ్లక్రిందట ఖరగపురమునుండి ప్రకటితమగుచుండిన "రాష్ట్రేతరాంధ్ర" పత్రిక వంగవిద్యాశాఖాధికారులు ఆంధ్రులు కోరినచో ఆంధ్రమునకును స్వీయదేశభాషవలెనే మెట్రిక్యులేషను పరీక్షలో ప్రాముఖ్యమిచ్చునట్లొనరించిన వాగ్దానము ప్రకటించినది. అది అమలులోనికి రాకుండుటకు కారణము మా యాంధ్రులయలసతకాక వేరేమగును ?

అతనికి తపస్సిద్ధి యయినతరువాత అతఁడు యాత్రకై చీనాదేశమునకు వెడలెను. అప్పు డతఁ డీయద్భుతమయిన చెట్టుక్రియను తన వెంటఁ గైకొని పోయియుండెను. బౌద్ధలోకములో ఈ పత్రములు వ్యాపించుటకు బోధిధర్ముఁడు కారుణమని కీర్తింపఁబడుచున్నాఁడు. చీనాదేశములో దక్షిణ జేతరగతికిఁ జేరిన బౌద్ధసన్యాసు లిప్పటికిని బోధిధర్ముని విగ్రహము నెదురను సమావేశమై ప్రతిదినమును జరగు తేయాకునైవేద్యములోఁ భాల్గొం దురు. ఆ తేయాకునివేదనమందు వైభవముతో జరగింతురు. వచ్చినవారు తేయాకు నీటిని ఒక పాత్రనుండియే త్రాగుదురు. జపానులో టీపార్టీ పద్ధతు లీ ప్రాఁతీయాచారము ననుసరించియే జరగుచున్నవి. ఇటీవల నాగరికతవల్ల తేయాకు పానీయమింకను పరిశుద్ధిని నాజూకుఁ దనమును చెందినవి. హిందూదేశములోని యన్ని భాగములలోను తేయాకు విశేషముగా నున్నది. దానినుండి దేశమునకొక గౌరవ మని చెప్పకతప్పదుగదా!

---

# విమర్శనములు

## నీటి బుగ్గ

ఇది ఒకవిధమైన భావకావ్యము. గ్రంథకర్త కాజ-రాధాకృష్ణశాస్త్రి గారు. నివాసస్థలము చమ్మనగిరిపేట, మచిలీపట్టణము. దీనివెల అ. ౮.

గ్రంథకర్తగారు తన పుస్తకమును భావకావ్యముగా వ్రాయఁదలంచుకొని గ్రంథోద్యమమునకుఁ దలపెట్టిరి. వీరికి మొట్టమొదట లక్షణములను పాటింపవలయు ననియెడు నూహ వొడమెనే కాని కొంత కొంతవఱకుఁ గవనము సాఁగిన తరువాత సామాన్యమైన లక్షణములు గూడ వదలిపెట్టవలసి వచ్చినది. అది యెందులకో?

బండి తాలు నరసున్నలు మందునకైనఁ గానరావు. ఇందు రసమా నీరసమే. అక్కడక్కడ విసంధులు, కుసంధులు, గ్రామ్యపదములు తత్‌స్థానమునకుఁ దగనియేవో కొండగుర్తు పదములు మెండుగ నున్నవి.

మచ్చునకుఁ గొన్ని:—రేడు-రేడు-రాజేంద్రుడు. శరచ్చంద్రుడు.

రాణీని-సౌభాగ్యవతివి గమ్మటనిరి. కేసరి, ఆర్త రక్షణ యొక్కరుండుట బూని పలికె. లేద దయ తయంబకుకా, భయము కుదింపలేక విప్పితిని నాధమవవిని - ఖడ్గము యాడగా-పృచ్ఛించి పలికె, ఇత్యాదులును, యతిభంగములును గూడఁ దెలియఁబడుచున్నవి.

"పలికితివా యె...మాసము—

"మాతృదేశారాధనా ధురంధరుఁడు—

"అంములకర్థమేవంటివి అగ్నిని పెట్టన నేల బూడ్వనా?

గ్రామ్యమునకు మఱొక్కటి:—

"అందులకర్థ మేమిటివి అగ్నిని పెట్టన నేల బూడ్వనా!

ఇటువంటివింకను నెన్నియేని యీ గ్రంథరాజంబునఁ గననగును. పయి సామాన్య దోషంబు లటుండ

నిచ్చి కథను జూడనదియు నంత రసవంతమైనది కాదు. నీటి బుగ్గకు సరియైన ద్వంద్వార్థ ప్రతిపాదకత్వ మించెచ్చటను గానరాదు. రచయిత యీ కావ్యంబును కుశాగ్రబుద్ధితోఁ బరికించి రెండవ ముద్రణమునకైన సవరించుకొందురు గాక!

కె. వి. సుబ్బరాఘవకవి.

---

## తానాజీ

వాణీ గ్రంథమాల ౫-వ పుష్పము గ్రంథకర్త శ్రీ కొవ్వలి లక్ష్మీనరసింహారావుగారు. క్రౌను ౧౮౫ పుటలు. వెల-అ-౮. ప్రకాశకులు "వాణీ గ్రంథమాల, రాజమండ్రి" అని వ్రాయుచున్నారు.

ఇది మహారాష్ట్రరాజుల పరిపాలనకాలమునాటి చరిత్రంగూర్చిన యొకనవల. తానాజీ యను యోధుడు "సింహఘడ" దుర్గమును స్వాధీనము చేసికొనుటకు తన్ను యుద్ధమున బలియిచ్చుట ఇందు వర్ణితము. ఇందుపయోగింపఁబడిన భాష గ్రాంథికము. కాని వ్యావహారికములు, అసాధువులు అగు పదములు లెక్కలేనన్ని యిందుఁ గలవు. కథా చమత్కృతి కానరాదు. స్వభావ నిరూపణమునను, పాత్ర పరిపోషణమునను కవికి జయము కలిగినదని చెప్ప వీలులేదు.

---

## నిర్వచన భారతగర్భ రామాయణము

ఏకాశ్వాస పద్యకావ్యము. గ్రంథకర్త-రావిపాటి-లక్ష్మీనారాయణగారు, గురజాల, గుంటూరుజిల్లా. డెమ్మీ ౭౭ పుటలు. పీఠికాగీతము - వెల అ. ౮. వెలయువారు గ్రంథకర్తగారికి వ్రాసికొనవలెను.

తెలుఁగులో నిదివఱకు కొన్ని నిర్వచన పద్యకావ్యములును, కొలఁదిగ ద్వ్యర్థి త్ర్యర్థి కావ్యములును కలవు. గర్భకవిత్వము అరుదు. గర్భ కవిత్వమున అర్థద్వయము కల గ్రంథములు లేవనియే చెప్పవలెను. ఈ గ్రంథమున కథాద్వయము పద్యములలోనే గర్భకవిత్వమున ఇమిడినది. సంపూర్ణ పద్యము రామాయణార్థమును, గర్భపద్యము భారతార్థమును ఇచ్చుచున్నది. శ్లేషకావ్యములం దనివార్యములగు వ్యర్థ పద ప్రయోగములు, కథా సంకోచ పరిణతులును ఇందును తప్పినవి కావు. "పురము అచ్చటి మేడలు వ్యోమమంటి" (౧౭-వ. పద్యము.) మొదలగు ప్రయోగము లచ్చటచ్చట కలవు. ఇట్టి చిత్రకవిత్వమును చెప్పుట చాల కష్ట సాధ్యము. కవిగారి పరిశ్రమ ప్రశంసింపఁ దగినది. అర్థద్వయము తెలుఁగుట కనువుగ సంగ్రహ టీకయు కలదు.

దీనిని మద్రాసు విశ్వవిద్యాలయమువారు విద్వత్పరీక్షకు-నవ్యకవిత్వ విభాగమున (Modern Poetry) కైనలు పరీక్షకు పఠనీయముగ కూడ నిర్ణయించియున్నారు.

---

## రంగభూమి

కళోపాసన గావించు సచిత్రాంధ్ర మాసపత్రిక. ఒకటవ సంపుటము ఒకటవవ సంచిక ఏప్రిలు నెలలో ప్రకటితము. ఎస్. ఎస్. సోమయాజిగారు సంపాదకులు. డబుల్ క్రౌను 3౨ పుటలు. సంవత్సర చందా. రూ. ౧-౮-౦. విడి ప్రతిక అ. ౨. కార్యస్థానము: ౮౮, పెరుమాళ్ మొదలివీధి, రాయపేట, మదరాసు.

కళలనీ, అందులోనూ, నాట్యకళనీ, దానికి సంబంధించినవాటినీ మరమ్మత్తు చెయ్యడానికి పూనుకున్నదీ పత్రిక, సినీమాల వార్తలూ, తెలుగుపెద్దలు రాసిన వ్యాసాలూ ప్రకటింపబడ్డాయి. ముఖచిత్రాన్ని గురించి వ్రాస్తూ కొన్ని సంగతులు సంపాదకీయములో వున్నాయి. కాని ఆ భావం చిత్రంలో ఎంతవరకూ వ్యక్తమవుతున్నాదో పాఠకులే పూహించుకోవాలి.

యీ పత్రిక నాట్యకళని ఉద్ధరించడానికి శాయశక్తులా కష్టపడితే కొంత ఉపయోగం కలక్కపోదు.

మే, జూను, జూలయి సంచికలలో ఒకటీకూడా యిఁతవరకూ చూఁచేభాగ్యం కలగలేదు మాకు.

---

## జ్యోతి

మాసపత్రిక. ప్రతినెల మొదటివారంలో ప్రకటన. ౧౯౩౫ జూనులో ప్రారంభము. సంపాదకులు వి. కె. విశ్వనాథంగారు; డబుల్ క్రౌను - ౪౮ పుటలు. సంవత్సరచందా—రూ. ౧-౮-౦. విడి పత్రిక రెండణాలు. వలయువారు—"జ్యోతి ఆఫీస్, బందరు" అని వ్రాయవలెను.

"సరదాగా ఓ గంట చదువుకోడానికి—చదువుకున్నాక, ఆలోచించడానికీ—మెదడుకు ఏ మాత్రమైనా పని ఇవ్వడానికీ" ఈ పత్రిక. "సరదాగా చదువుకోడానికి సుప్రసిద్ధులు నాలుగుకథలూ, చదివి ఆలోచించడానికి నాలుగైదు మంచివ్యాసాలూ, ఒక ప్రసిద్ధ పురుషుని జీవితచరిత్రా" యీ సంచికలో 'ప్రచురిం' చబడ్డాయి.

పత్రిక ఉద్దేశాలు బాగున్నాయి. ఈ తొలి సంచికలోని వ్యాసాలూ పత్రికయొక్క పురోభివృద్ధికి సూచకావటంలో సందేహం లేదు.

---

## త్రివేణి

మద్రాసు - ఆర్మేనియను వీధినుండి మ॥ కె॥ రామకోటీశ్వరరావుగారి సంపాదకత్వమున బయల్వెడలు చక్కని ఆంగ్లద్వైమాసికపత్రిక. ఈసం॥ మార్చి, యేప్రిల్ నెలల సంచికయును దత్పూర్వ సంచికయును మా కార్యస్థానము నలంకరించినవి. ఇది (మార్చి యేప్రియల్ సంచిక.) 1+2+193 పుటలు గలది. దీని యుద్దేశము భారతదేశముయొక్క కళా - సారస్వత - చారిత్రకౌన్నత్యమును ప్రచారము చేయుటయని సంపాదకులు నుడివియున్నారు. ఏతన్మూలమున పరదేశస్థుల యాశయములలో భారతదేశమునందుఁ గల గౌరవమును హెచ్చింపవచ్చునని సంపాదకుల యూహయయినట్లు గోచరించెడిని. నాట్యాభినయ నృత్యకళా ప్రాధాన్యమున్నట్లు ముఖపత్రముపయినిగల ప్రతిమ తెలుపుచున్నది. Veena player (వైణికురాలు) అను లోపల మొదటిపుటను గల శ్రీ నందలాల్ బోసుగారి రేఖా ప్రతిమ మిక్కిలి బాగుగా నున్నదని సంపాదకులొసంగిన యభిప్రాయము రసజ్ఞుల కేకీభావార్హము. నికోలాస్ రోరిచ్ అను కళాభిజ్ఞుని చరిత్రమును మార్చి "యిఁటు ది నైట్" అను విషయమును "శెండర్‌ను, అతినికవిత్వమును" అనువ్యాసములు హృదయంగమములు. "చాఁకలి గాడిదకు" అను పద్యములు పయికి పారిహాసికముగా నున్నను కరుణరస ప్రధానముగా నున్నవి. 'రవీంద్రనాథుని యిటీవలి నవలలు' అను విషయము మొదలయినవి గమనార్హములు. ఇన్ని యున్నను ఆంధ్రుల జాతీయత్వము. ఆంధ్రకళాప్రాశస్త్యాభిమానము, మొదలయిన స్వకీయాభ్యుదయ గౌరవదాయక వస్తువులకన్న బంగాళీలు మొదలయిన యితర దేశస్థుల విషయమున సంపాదకులకు మమత యున్నట్లు తోఁచెడిని. సంపాదకు లీవిషయమును గమనింతురని తలంచెదము.

